షార్లెట్ సాహితీ మైత్రీ బంధం

# SHARLET SAAHITI MAITRI BANDHAM

by

## Gabbita Durga Prasad

First Edition: **11, March 2018**

Copies: 500



Price. Rs.**300/-**

Cover Design: **Kalasagar**

For Copies: **Gabbita Durga Prasad**
President, "Sarasabharathi"
H.No.2-405, Sivalayam Street,
Near Raja gari kota, Vuyyuru- 521 165
Krishna Dist. Phone:08676- 232797
Cell: 9989066375
e-mail: gabbita.prasad@gmail.com
sarasabharati.vuyyuru@gmail.com
http/sarasabharati.wordpress.com
http/suvarchalanjaneyaswamy.wordpress.com

Type Setting: **"Ramya Bharathi"** vja

Printed : **Rainbow Graphics,** vijayawada-2

# షార్లెట్ సాహితీ మైత్రీ బంధం

# శ్రీ విళంబి ఉగాది కానుక

**2**012 లోను, మళ్ళీ అయిదేళ్ళ తర్వాత 2017లో నేనూ, మా శ్రీమతి ప్రభావతి అమెరికాలోని నార్త్ కారోలీనా రాష్ట్రం షార్లెట్‌కు మా అమ్మాయి శ్రీమతి కోమలి విజయలక్ష్మి, అల్లుడు శ్రీ సాంబావధాని దంపతుల స్వగృహానికి వెళ్లాం. రెండుసార్లూ అక్కడ ఉన్న తెలుగువారు, మిగిలిన వారు మమ్మల్ని ఎంతో ఆత్మీయంగా తమలో వారిగా చూసుకున్నారు. మొదటి పర్యటనలో ఏర్పడిన బంధం రెండవ పర్యటనలో చాలా దృఢమైంది. అక్కడివారు చూపిన ఆప్యాయత, ప్రేమ ఆదరణ, మన్నన, గౌరవం, అభిమానం మరచి పోలేనివిగా చేశాయి. ఇక్కడున్నా, అక్కడున్నా డైరీ రాయటం నాకు అలవాటే. మొదటిసారి పర్యటన విశేషాలను "అమెరికా డైరీ"గా, రెండవ సారి "వీక్లీ అమెరికా"గా ఎప్పటికప్పుడు అంతర్జాలంలో రాశాను. మొదటి పర్యటన సాంస్కృతిక పరమైనది. అయితే రెండవది సాహితీపరమై అందరిని అలరించింది. సరసభారతి తరఫున నాలుగు సమావేశాలు షార్లెట్‌లో నిర్వహించాం. సరసభారతి శాఖను షార్లెట్‌లో అందరి సహకారంతో ఏర్పాటు చేశాం. 1-10-17 ఆదివారం "దసరా సరదా సాహితీ కదంబం" కార్యక్రమాన్ని అయిదుగంటల పాటు నిర్వహించి, అందరితోపాటు మేమూ ఆశ్చర్య పోయాం. సంగీత సాహిత్య నృత్య హాస్య రస వాహిని ప్రవహించి అందరిని తన్మయులను చేసింది. దీని విజయానికి మా అమ్మాయి శ్రీమతి విజయలక్ష్మి, అల్లుడు శ్రీ సాంబావధాని, శ్రీ వేలూరి పవన్, శ్రీ రాంకీ, శ్రీ సాయి పవన్, శ్రీమతి రాధ, శ్రీమతి ఉష, శ్రీమతి పద్మశ్రీ, శ్రీమతి లావణ్య, శ్రీ నాగరాజు మొదలైన వారి అసమాన కృషియే కారణం. దీనితో బంధం మరింత బలపడింది. షార్లెట్ సాహితీ బంధువులు హార్దిక సౌజన్యంతోపాటు సరసభారతికి ఆర్థిక పరిపుష్టినీ కలిగించి యెనలేని ఉత్సాహం నింపారు. బంధం మరింత పెంచారు. షార్లెట్ వారి అభిమానానికి ప్రతి ఫలంగా ఏదో ఒకటి చేయాలనిపించి అమెరికా డైరీ, వీక్లీ అమెరికాలను కలిపి "షార్లెట్ సాహితీ మైత్రీ బంధం"గా రూపొందించి సరసభారతి 30వ ప్రచురణగా వెలువరించి మా అమ్మాయి శ్రీమతి కోమలి విజయలక్ష్మి, అల్లుడు శ్రీ సాంబావధాని, మనవళ్ళు చి.శ్రీకేత్, ఆశుతోష్, పీయూష్‌ల కుటుంబంతోపాటు, షార్లెట్ సరసభారతి సాహితీ బంధువులందరికి శ్రీ విళంబి ఉగాది కానుకగా అందజేస్తున్నాము.

## షార్లెట్ సాహితీ మైత్రి బంధం

ఉయ్యూరులో ఉగాదికి వారం ముందు 11-3-18 ఆదివారం మధ్యాహ్నం సరసభారతి 119వ కార్యక్రమగా నిర్వహించే శ్రీవిళంబి నామ సంవత్సర ఉగాది వేడుకలలో ఈ పుస్తకాన్ని శాసనమండలి సభ్యులు శ్రీ వై వి బి రాజేంద్ర ప్రసాద్, ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక శాఖ ప్రధాన కార్య నిర్వహణాధికారి డా. ఈమని శివనాగి రెడ్డి గార్లు ఆవిష్కరిస్తున్నారు. ఇదే పుస్తకాన్ని అమెరికాలోని షార్లెట్‌లో "షార్లెట్ సరసభారతి" అయిదవ కార్యక్రమంగా సాహితీ బంధువులు 18-3-18 ఆదివారం నిర్వహించే శ్రీ విళంబి నామ సంవత్సర ఉగాది వేడుకలలో ఆవిష్కరణ జరుపుతారు. ఇలా జరపటం సరసభారతి తొమ్మిది సంవత్సరాల కృషికి, సాహిత్య సాంస్కృతిక సేవకు నిదర్శనం. సాహిత్యాభిమానుల, వితరణశీలుర, సరసభారతి కార్యవర్గ సభ్యుల సౌజన్యమే సరసభారతి విజయం. అందరికి హృదయ పూర్వక ధన్యవాదాలు.

ఈ పుస్తకాన్ని దోషరహితంగా డిటిపి చేసి, అందంగా ముద్రించి మా శ్రమ తమ శ్రమగా భావించి అందజేసిన శ్రీ చలపాక ప్రకాష్ గారికీ, కోరిన విధంగా అందమైన, అర్థవంతమైన కవర్ పేజీలు డిజైన్ చేసిన శ్రీ కళాసాగర్ గారికి ఏమిచ్చినా ఋణం తీరదు. అందుకే ఒక అభినందనతో ఋణం తీర్చుకుంటున్నాను.

**- గబ్బిట దుర్గా ప్రసాద్**
11-3-2018
సరసభారతి అధ్యక్షులు-ఉయ్యూరు

**సరస భారతి గ్రంథ ప్రచురణకు విరాళాలు అందజేసిన వదాన్యులకు కృతజ్ఞతలు**

1) శ్రీ గణపవరపు రామకృష్ణ, శ్రీమతి పద్మ దంపతులు- హైదరాబాద్ - రూ 20,000/-
2) బ్రహ్మశ్రీ అడుసుమిల్లి లీలా ప్రసాద్, శ్రీమతి పార్వతి దంపతులు- హైదరాబాద్ - రూ. 10,000/-
3) శ్రీ సుంకర కోటేశ్వరరావు, శ్రీమతి సరోజిని దంపతులు- హైదరాబాద్ - రూ 5,000/-




# షార్లెట్ సాహితీ మైత్రీ బంధం

## 2012 మరియు 2017లో మా షార్లెట్ యాత్రా విశేషాలు

- గబ్బిట దుర్గాప్రసాద్

అమెరికా డైరీ

### ఎల్లలు దాటిన శ్రీ ఎల్లా మృదంగ నాదం

నిన్న అంటే బుధవారం 11వ తేది ఇక్కడి షార్లెట్ ఆంధ్రులకు పర్వదినం. మృదంగ వాద్యంలో అనితర సాధ్యం ప్రతిభ కనపరచిన, పద్మశ్రీ ఎల్లా వెంకటేశ్వరరావు గారు ఇక్కడికి విచ్చేసిన సందర్భంగా తెలుగువారు, సంగీత ప్రియులు. సంగీత, సాహిత్యాభిమానులు వారికి ఘన స్వాగతం పలికి తమ అభిమానాన్ని చాటుకున్నారు. ఎల్లా వారు వారి అమ్మాయిని చూడటానికే ఇక్కడికి వచ్చినా, ఇక్కడి వారంతా వారిని దర్శించి, వారితో పరిచయం పొందటానికి మంచి కృషి చేసి, సఫలీకృతులయారు. మధ్యాహ్నం పన్నెండు గంటలకు ఇక్కడి రేడియో ప్రతి బుధవారం నిర్వహించే తెలుగు కార్యక్రమంలో వారిని ఇంటర్వ్యూ చేశారు. శ్రీమతి నాగమణి ఆ కార్యక్రమాన్ని నిర్వహించారు స్టూడియోలో. కాని ఇంటర్వ్యూ మాత్రం అంతా మా అమ్మాయి వాళ్ళ ఇంటినుంచే జరిగింది ఫోన్ పైన. సరీగ్గా పావు తక్కువ పన్నెండుకు వారు మా ఇంటికి విచ్చేశారు. పట్టు పంచను లుంగిగా కట్టి, పట్టు లాల్చీతో నుదుట యెర్రని నిలువు బొట్టుతో, మెడలో రుద్రాక్ష మాల, స్ఫటిక మాలతో ముఖంపై చెరగని చిరునవ్వుతో, మూర్తీ భవించిన మృదంగ దేవతలా. వెలిగిపోతున్న ముఖ వర్చస్సుతో శ్రీ ఎల్లా వెంకటేశ్వరరావు గారు మా ఇంట్లోకి ఆడుగుపెట్టారు. నేను, ఆ అమ్మాయి విజయలక్ష్మి

సాదరంగా స్వాగతం చెప్పి మేడ మీదకు వారిని తీసుకొని వెళ్లి కూర్చోబెట్టాం. సరిగ్గా పన్నెండు గంటలకు ఇంటర్వ్యూను నాగమణి ప్రారంభించారు .నన్ను పరిచయం చేసి ,నా ద్వారా ఎల్లా వారిని శ్రోతలకు పరిచయం చేయమని కోరారు.సంతోషం తో అంగీకరించిన నేను ఇలా ఎల్లా వారిని పరిచయం చేశాను. వారి ప్రక్కనే కూర్చొని ఫోన్ ద్వారా వారిని గురించి నేను చెప్పిన మాటలు వినండి–

"గానానికి సహకార వాద్యంగా మాత్రమే ఉన్న మృదంగాన్ని, ఎన్నో ప్రయోగాలు చేసి, ఎంతో పెంపొందించి, సంగీత వాద్యాలలో ఒక స్థితిని, స్థాయిని మృదంగానికి కల్పించిన ఘనత పద్మశ్రీ ఎల్లా వెంకటేశ్వరరావు గారిదే. మృదంగంపై ఆయన వేళ్ళు అలా అలవోకగా నాట్యమాడుతూ, ఎల్లా పలికిస్తారో తెలీకుండా, అలా ఎలా వాయించ గలరబ్బా అని ఆశ్చర్యంలో మునిగే టట్లు చేసే ప్రతిభ ఎల్లా వారిది. మృదంగం భారత దేశానికి మాత్రమే పరిమితమైంది అన్న అపప్రదను తొలగించి, భారత దేశపు ఎల్లలు దాటించిన మార్దంగిక సార్వ భౌములు ఎల్లా వారు. ఎన్ని ప్రయోగాలు, ఎన్నెన్ని ప్రదర్శనలో తలచుకుంటే ఆశ్చర్యమేస్తుంది. ఇది సాధ్యమా అనిపిస్తుంది. ఒక్కొక్క మెట్టు ఎక్కుతూ, తనతోబాటు, తన మృదంగ విద్యనూ, శిఖరారోహణం చేయించిన మహా మార్దంగికులు శ్రీ వెంకటేశ్వరరావు గారు.

"మృదంగంతో మార్దవ స్వరాలను పలికించి, అతి లలిత ధ్వనులను వినిపించి, మధ్యమంలో కదను తొక్కి, తారాస్తా స్థాయిలోను, హృదయాలపై నాద స్వరాలను నాట్య మాడిస్తారు. నాదామృతాన్ని ఒలికిస్తారు. రస గంగలో స్నానం చేయిస్తారు. నవ మృదంగ ప్రయోగంలో అనితర సాధ్యంగా నిలిచి, నాద బ్రహ్మయై, నవ నాద బ్రహ్మగా సాక్షాత్కరిస్తారు. ఎల్లా వారి ప్రతిభను, ఎల్లా వర్ణించగలం? ఎందరో ప్రసిద్ధ కర్ణాటక గాయకులకు మృదంగ సహకారం అందించి, ఆ కచేరీలకు వన్నె, వాసి కల్పించిన కళా తపస్వి ఎల్లా వారు.

"ముఖ్యంగా ప్రముఖ వాగ్గేయకారులైన పద్మవిభూషణ్ శ్రీ మంగళంపల్లి బాల మురళీకృష్ణ గారి గాత్రం, ఎల్లా వారి మృదంగ సహకారం, అన్నవరపు రామస్వామిగారి వయోలిన్ తోడూ వింటే, చూస్తే అదొక రస త్రివేణీ సంగమమే అనిపిస్తుంది. రస గంగా ప్రవాహమే అనిపించేది. మనసులను పరవశింప జేయటమే కాదు పవిత్రతను సంతరించిన మహద్భాగ్యం. ఈ సంగీత విద్వాంసత్రయం కొన్ని దశాబ్దాలపాటు ఆంధ్ర సంగీత లోకాన్ని ఏలారు. సుస్వర సంగీత ఝురులను ప్రవహింప జేసి తన్మయులను చేశారు. ప్రస్తుతం ఎల్లా వారు ఆంధ్ర దేశపు సరిహద్దు దాటి. అమెరికాకు వచ్చిన శుభ సందర్భంగా ఇక్కడి సంగీత ప్రియులంతా, ఎల్లలు లేని ఆనంద ఉత్సాహాలతో వారికి స్వాగతం చెప్పి వారి ముఖతా వారి జీవిత విశేషాలను, వారు పొందిన సత్కారాలను, చేసిన ప్రయోగాలను, సాధించిన విజయాలను, ఇంకా

సాధించాలను కొన్న విషయాలను, భవిష్యత్‌లో వారు చేబట్టే కార్యక్రమాలను వివరంగా తెలుసుకోవాలని ఉవ్విళ్ళూరు తున్నారు. ఇదంతా ఎల్లా వారి ఇక్కడి సంగీత ప్రియుల విశాల హృదయానికి దర్పణం. ఎల్లా వారి మృదంగ విన్యాసాలకు ఎల్లలు లేనట్లే వారు పొందిన బిరుదులకు, అందుకొన్న సత్కారాలకు ఎల్లలు లేవు. ఎల్లా వెంకటేశ్వరరావు గారు భారతదేశానికి ముఖ్యంగా ఆంధ్రదేశ సాంస్కృతిక రాయబారిగా నేను భావిస్తున్నాను. ఇప్పుడు వారు తమను తాము ఆవిష్కరించుకొని విశేషాలను అందజేయ వలసినదిగా కోరుతున్నాను" అని చెప్పాను. ఆయన చాలా సంబర పడ్డారు. నాగమణి గారు ఆన్‌లైన్‌లో వారు చెప్పిన వాటిని శ్రోతలకు అందించారు. చివరికి నేను మళ్ళీ లైన్‌లోకి వచ్చి వారు సాధించిన విషయాలపై సంతృప్తి పొందారా? భవిష్యత్ ప్రణాళిక లేమిటి? మీ కుటుంబం నుంచి మీ వారసులేవరైనా ఈ విద్యలో రాణిస్తున్నారా?అని ప్రశ్నించాను. అన్నిటికి చక్కని సమాధానాలను తెలిపి గంటకు పైగా నడిచిన కార్యక్రమాన్ని రక్తి కట్టించారు. అలవోకగా వారు మాట్లాడిన తీరు శ్రోతలను బాగా ఆకట్టుకొంది. నాగమణి గారి బృందం అభినందనీయులు. ఇప్పుడు ఎల్లా వారు చెప్పిన విషయాలను మీకు వివరిస్తాను. వారు "ముందుగా దుర్గా ప్రసాద్ గారు పరిచయం చేసిన తీరు చాలా బాగుందని, తానేమి చెప్పాలో దిశా నిర్దేశం చేసి ప్రేరణ కల్గించారని, చెప్పిన తీరు ఆకట్టు కోనేట్లుందని" అని చెప్పారు. ఎల్లా వారిది పశ్చిమ గోదావరి జిల్లా భీమవరం దగ్గర పాల కోడేరు. పెదతండ్రి ఎల్లా సోమయ్య గారే వీరి గురువు. ఆ కుటుంబం అప్పటికే నాలుగు తరాలుగా సంగీతంలో ప్రాముఖ్యం సంతరించుకున్నది. వీరు అయిదవ తరం వారు. నాయనమ్మ గారి ద్వారా ఆధ్యాత్మ రామాయణ కీర్తనలు, పాటలు వింటూ సంగీతంపై మక్కువ పెంచుకొన్నారు. తల్లి గారు మహాలక్ష్మ గారు వీరిని కడుపుతో ఉన్నప్పుడే ఆమె పాడుకొనే భక్తీ గీతాలన్నీ విని, ప్రహ్లాదుడు తల్లి గర్భంలో వుండగా నారద మహర్షి చెప్పిన హరి భక్తి విషయాలన్నీ విని మహా భక్తు డైనట్లు. ఎల్లా వారు కూడా సంగీతాన్ని తల్లి గర్భంలో ఉండగానే ఒంట బట్టించు కొన్నారు. ఒక వినాయక చవితి నాడు పందిళ్ళలో జరిగే కచేరీకి మృదంగం వాయించే ఆయన రాకపోతే ఎల్లా వారిని వాయించమన్నారట. అప్పటికి ఆయన వయస్సు ఏడు మాత్రమే. ధైర్యంగా వాయించి అందరి ప్రశంసలు పొందారు. అప్పటి నుంచి నాన్ స్టాప్‌గా మృదంగం వాయిస్తూనే వున్నారు. దాదాపు అర్ధ శతాబ్దిగా మృదంగ లోకంలో విహరిస్తున్నారు. వాయించినందుకు మెచ్చి బహుమతులు అంద జేశే వారట. అది గొప్ప ప్రోత్సాహంగా ఉండేది. ఎందరో ప్రసిద్ధులైన గాయకులకు మృదంగ సహకారం అందించారు. క్రోవి సత్య నారాయణ గారు, ద్వారం వెంకట స్వామి నాయుడు గారు, బాల మురళి కృష్ణ వంటి దిగ్గంతుల సభల్లో వీరి మృదంగ విన్యాసం పలు పోకడలు పోయింది. ఏడవ ఏట ప్రారంభమైన కచేరీ యాభై తొమ్మిదవ ఏటి దాకా అవిచ్చిన్నంగా

కొనసాగుతోంది. అంతకు ముందు ఎవరూ మృదంగంతో సోలో కచేరి చేసిన వారు లేరు. ఎల్లాతోనే అది ప్రారంభమైనది. అదీ వారి ఘనత. రోజుకు 16 గంటలు కఠోర సాధన చేసే వారు. ఆ విద్య అంతు చూడాలనీ ఆరాటం వారిని అంతపని చేయించింది. ఇంకో ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే వారు అసలు స్కూల్‌కు వెళ్లి చదువు కొనలేదు. ఆ తర్వాత ఎప్పుడో మృదంగ విద్యలో ఎం.ఏ, పీ.హెచ్.డి.చేశారు.

మొదటిసారిగా భారత రాష్ట్రపతి శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణన్ చేతుల మీదుగా ప్రథమ బహుమతిగా బంగారు వీణను పొందారట. ఆరుగురు రాష్ట్రపతుల నుంచి పురస్కారాలను పొందిన ఘనత వారిది. అందరు ప్రధాన మంత్రుల నుండి బహుమతులను స్వీకరించారు. 1984లో అమెరికాలోని నార్త్ కరోలినలో ఉన్న షార్లెట్‌కు వచ్చి కచేరి చేశారట. మళ్ళీ ఇదే రావటం. శ్రీ లలితా త్రిపుర సుందరి దేవి భక్తులు ఎల్లా వారు. తన బలం అంతా ఆ అమ్మదేనంటారు. ప్రభుత్వం తో సంప్రదించి ఎం.ఏ.మృదంగ కోర్సును ఏర్పాటు చేయించారట. అప్పటికి సిలబస్ అనేది లేదు. వీరే సిలబస్‌ను తయారు చేసి అందించారు. ఆ ఘనత ఎల్లా వారిదే. ఎన్నో విశ్వ విద్యాలయాలలో మృదంగ విద్యను ప్రవేశ పెట్టించారు. కోర్సులను ఏర్పాటు చేసి పర్య వేక్షిస్తున్నారు. నిరంతరం అదొక తపస్సుగా కొన సాగిస్తున్నారు. వీరి పరిశోధనకు మొదటిస్థాయి జాతీయ బహుమతి పొందారు. ఘన సత్కారం జరిగింది. తానొక బాల మేధావిని అని ఆయన చెప్పుకొన్నారు. లేకుంటే ఇంత విద్య తనకు సాధ్యమయేది కాదంటారు.

ఇప్పుడు వారు చేసిన ప్రయోగాల గురించి తెలుసుకొందాం– మొదటిసారిగా 30 వాద్యాలతో “శివ తాండవం” చేశారు. దీనికి అంతర్జాతీయ బహుమతి పొందారు. ఆది శంకరాచార్యుల వారి స్తోత్రాలకు సంగీతాన్ని సమకూర్చి మంచి ప్రచారం చేశారు. వారికి కీర్తి లభించింది. 150 మందితో “త్రివేణి సంగమం” అనే సంగీత నాట్య, వాద్య సంగీతంతో అద్భుత కళారూపాన్ని రూపొందించి పలు ప్రశంసలందు కొన్నారు. ఇది ప్రత్యక్ష ప్రసారమై అందరిని ఆకట్టుకొన్నది. హైదరాబాద్‌లోని కలిత కళా తోరణంలో మూడు గంటలపాటు సాగిన ఎల్లా వారి కళా సృష్టి ఇది. తనకు దేశ విదేశాలలో రెండు వేల మంది శిష్యులున్నారని గర్వంగా చెప్పుకొన్నారు. అందులో పది మంది ఏ వన్ మృదంగ వాద్యకారులున్నారని, ఇంతమంది ఇంకే కళాకారునికి లేరని చెప్పారు. 1972 నుంచి తన విదేశీ పర్యటన ప్రారంభమైందని ఇప్పటికి 70 దేశాలు పర్యటించానని తెలియజేశారు. అమెరికాకు పన్నెండుసార్లు వచ్చానన్నారు.

సంగీతం వినటం ఒక కళ అని, ప్రదర్శన ఇంకో కళ అనీ ఆ రెండిటి మీద ఇప్పుడు దృష్టిపెట్టి యువకులకు నేర్పు తున్నానని చెప్పారు. వీణా, వేణువు మృదంగం

మాత్రమే భారతీయ వాద్యాలని సామవేదంలో నుంచి సంగీతం జన్మించిందని యజుర్వేదం నుంచి మృదంగా విర్భావం జరిగిందని వివరించారు. ఎన్.టి.రామారావు ముఖ్యమంత్రిగా ఉన్న కాలంలో విద్యాలయాలలో సంగీతం నాట్యం నేర్పే ఏర్పాటు చేయించానని అన్నారు.

## అమెరికా డైరి-**2** మూడవ రోజు

మంగళవారం రాత్రి అమెరికా చేరాం. బుధవారం అంతా శ్రీ ఎల్లా వారి రేడియో ప్రోగ్రాం, సాయంత్రం పరిచయ వేదికతో సరిపోయింది. నిన్న గురువారం మూడవ రోజూ. ఉదయం ఎల్లా వారు ఫోన్ చేసి- బుధవారం కార్యక్రమం బాగా జరిగిందని, సంతృప్తి చెందానని నేనిచ్చిన పుస్తకాలు చదివానని చాలా బాగా ఉన్నాయని. తనను రేడియోకు చాలా గొప్పగా పరిచయం చేసినందుకు కృతజ్ఞతలని చెప్పారు. నిన్న మధ్యాహ్నం ఫ్లైట్‌లో వారు ఇండియ వెళ్ళారు. ఈ రేడియో ప్రోగ్రాం టి.వి. ద్వారా అన్ని దేశాలకు ప్రసార మవుతుందట. మొదటిసారిగా అంతర్జాతీయ వేదికపై నేను మాట్లాడటం మహదానందంగా వుంది. మధ్యాహ్నం మంచి నిద్ర పోయాం. రాత్రి ఏడున్నరకు మా అమ్మాయి విజ్జి, దగ్గరలో వున్న మంజులత, రమేష్ వాళ్ళింటికి తీసుకొని వెళ్ళింది. అక్కడ శ్రీ సత్యసాయి బాబా భజన కార్యక్రమం గంటకుపైగా జరిగింది. అంతా యువకులే, సాఫ్ట్‌వేర్ ఇంజినీర్లే. దాదాపు ఇరవై మంది యువతీయువకులు, ఇద్దరు పెద్దవాళ్ళు పాల్గొన్నారు. అందరు సామూహిక భజన చేశారు. అంతా బాగా భక్తితో పాడారు. అందరు గొంతు కలిపి పాడటం విశేషం. డోలక్ తప్పెటలతో ఇద్దరు పాటలకు అనుగుణంగా వాయించి ఆనందానుభూతిని కలిగించారు.

కంప్యూటరే దైవంగా భావించి జీవించే యువత, దానికి మించి ఒక అపూర్వశక్తి ఈ విశ్వాన్ని నడిపిస్తోందని నమ్మి, ఆ శక్తిని సాయిబాబాలో దర్శించి ప్రేరణ పొందటం ఆశ్చర్యమేసింది. వారి మనో భావనకు అభినందించాను.

నాలుగైదు ప్రసాదాలను నైవేద్యం పెట్టి అందరికి అందజేశారు. ఇద్దరు చిన్న పిల్లలు కమ్మగా భజన గీతాలను పాడి ఆకట్టు కోవటం విశేషం. ఇది చూస్తే నా మనసు దాదాపు అరవై ఏళ్ళు వెనక్కి వెళ్ళింది. మా చిన్నప్పుడు ఉయ్యూరులో మా గురువు గారు మహంకాళి సుబ్బరామయ్య గారు, నరసింహారావు గారు ముళ్ళపూడి వెంకటేశ్వరరావు గారు, ఇత్తడి కొట్టు చంద్రయ్య గారు మా గుడి దగ్గర ఉండే వెంకటేశ్వరరావు జగన్నాథ దాసు గారు, నా మిత్రుడు ఆదినారాయణ ప్రతి గురువారం చేసే భజనలు జ్ఞాపకం వచ్చాయి. ప్రసాదాలు తిన్నంత పెట్టేవారు. మధ్య మధ్యలో

కాఫీ టీలు ఇచ్చే వారు. అప్పుడు ఆది నారాయణ మమ్మల్ని తీసుకొని వెళ్ళేవాడు. మాకు భజన మీద కన్నా ప్రసాదాల మీదే భక్తి ఎక్కువగా ఉండేది. భజన ఎప్పుడవుతుందా? ప్రసాదాలు ఎప్పుడు పెడతారా అని ఎదురు చూసేవాళ్ళం. ఇన్నేళ్ళకు మళ్ళీ భజన కార్యక్రమంలో అదీ ఒకరింట్లో పాల్గొనటం ఇదే. మా ఆంజనేయస్వామి దేవాలయంలో భజనలలో పాల్గొనటం మామూలే. ఒక్కసారి ఇవన్నీ జ్ఞాపకం వచ్చాయి. ఇక్కడ భజనకు ఆహ్వానించిన మంజులత, రమేష్ దంపతులు యువకులే. వారి భక్తి భావానికి ఆనందంగా వుంది.

ఈ నెల ఇరవై ఆరవ తేది శ్రీ సత్య సాయి 86వ జయంతి అట. అందుకని ఈలోపు 86 చోట్ల భజనలు నిర్వహించాలనే తలంపుతో ఉత్సాహంగా వీరంతా రోజుకొకరింట్లో చేస్తుండటం విశేషం. రాత్రి ఇంటికి వచ్చేసరికి తొమ్మిదిన్నర అయింది. ఇలా గురువారం గడిచింది.

## అమెరికా డైరి-3

13-04-12- శుక్రవారం

నిన్న అంటే పన్నెండో తారీకు నుంచి ఉదయం స్నానం చేసిన తరువాత సంధ్యా వందనం, పూజా ప్రారంభించాను. మొన్న బుధవారం రాత్రి షార్లెట్‌లో "ఎల్లా" వారి స్టార్ నైట్ గురించి రాశాను. షార్లెట్‌లోని భారతీయులంతా షార్ప్‌గా ఉన్నారన్న భావం కనిపించింది. ఎల్లా వారు ఆ రోజూ స్టార్ ఆఫ్ attraactionగా నిలిచారు.

ఇవాళ ఉదయం పూజా కార్యక్రమం పూర్తిఅయిన తరువాత ఇక్కడ విజ్జి స్నేహితురాలు శ్రీ మతి ప్రియా అనే అమ్మాయి ఇంటికి వచ్చింది. ఆమెది గుంటూరు అని భర్త వెంకట్‌ది నెల్లూరు అని, వారిద్దరూ ఒక ఇల్లు ఇక్కడే కట్టిస్తున్నామని మే నెలలో దాన్ని బిల్డర్ స్వాధీనం చేస్తాడని, గృహప్రవేశానికి ముహూర్తం చూడమని కోరింది. ఇద్దరి నక్షత్రాలనుబట్టి ఈ నెల 16 సోమ వారం, 25 బుధవారం రెండు ముహూర్తాలు బాగా ఉన్నాయని చెప్పాను. మళ్ళీ జూన్ పదిహేను తర్వాత కాని ముహూర్తాలు లేవని తెలియజేశాను. ఈ రెంటిలో ఏది వీలయితే ఆ రోజూ పాలు పొంగించమని సలహా చెప్పాను. సంతోషంగా ఆమె వెళ్ళింది. చక్కని సంస్కారం ఉన్న అమ్మాయిలాగా కనిపించింది.

నేను ఉయ్యూరు నుంచి ఇక్కడికి బయల్దేరే ముందు వారం తెలుగు విద్యార్ధి మాస పత్రిక సంపాదకులు, నాకు ఆప్తులు స్నేహితులు శ్రీ కొల్లూరి కోటేశ్వరరావు గారు ఫోన్ చేసి, కొన్ని ఇంగ్లీష్ ఆర్టికల్స్ పంపిస్తున్నానని వాటిని తెలుగులోకి అనువాదం చేసి పంపమని కోరారు. దానికి సమాధానంగా నేను అమెరికా వెళ్తున్నానని వీలుని

బట్టి అక్కడికి తీసుకొని వెళ్లి చేసి మెయిల్ చేస్తానని చెప్పాను. "టేక్ యువర్ వోన్ టైం" అన్నారాయన. అంతకు ముందే విజయవాడ ఆకాశవాణి డైరెక్టర్ శ్రీ మంగళగిరి ఆదిత్య ప్రసాద్ గారు నేను రాసిన "దర్శనీయ దేవాలయాలు" పుస్తకం చదివి వెంటనే ఫోన్ చేసి అందులో కృష్ణాజిల్లా దేవాలయాల గురించి అర్జెంట్‌గా అయిదారు రోజుల్లోపు రాసి పంపమని కోరారు. వెంటనే మొదలుపెట్టి మూడు రోజుల్లో 25 పేజీలు రాసి పంపించాను.

దాన్ని మార్చి 31 శుక్రవారం ఉదయం 07-15 నిమిషాలకు ఏప్రిల్ 06 శుక్రవారం, ఏప్రిల్ 13 శుక్రవారం ప్రసారం చేశారు. అలాగే ఏప్రిల్ ఒకటి శ్రీ రామ నవమి నాడు శ్రీ సువర్చలాంజనేయా దేవాలయంలో సీతా రామ కళ్యాణ మహోత్సవం సమయంలో నేను రాసిన "శ్రీ హనుమత్ కథా నిధి" పుస్తకాన్ని ఆవిష్కరించిన సంగతి మీకు ఇది వరకే తెలియజేశాను. ఆ పుస్తకం చదివిన శ్రీ ఆదిత్య ప్రసాద్ గారు వెంటనే ఫోన్ చేసి "హనుమజ్జయంతి -విశేషాలు" అనే వ్యాసం నేను అమెరికా వెళ్ళేలోపు రాసి పంపించమని ఆదేశించారు. అంతే ఏప్రిల్ మూడు మంగళవారం తెల్లవారుజామున మూడున్నరకు లేచి రాయటం మొదలుపెట్టి అయిదు గంటలకు పూర్తిచేసి నాల్గవ తేది ఉయ్యూరు నుంచి హైదరాబాద్ బయల్దేరే రోజు కొరియర్‌లో పంపాను. అందుకని అసలేమీ సమయం చాలక కొల్లూరి వారి అనువాదం జోలికి వెళ్ళలేక పోయాను. ఈ రోజూ సాయంత్రం కూర్చుని ఆయన పంపిన 16 పేజీలలో రెండు పేజీలు అనువదించి మెయిల్ చేశాను. ఇదీ ఈనాటి కార్యక్రమం.

విజ్జి వాళ్ళింటికి ఎదురుగా స్విమ్మింగ్‌పూల్ ఏర్పాటు జరుగుతోంది. ఎదురుగా రెండు ఇళ్ళు శరవేగంగా తయారవుతున్నాయి. అంతా చెక్కలతో నేగా! చాలా తేలిక. ఇక్కడి పనివాళ్ళు మెక్సికో వాళ్ళు. ఇల్లు చూడటానికి వెడితే ఒకతను "నమస్తే" అన్నాడు. ఏ దేశం అని అడిగితే మెక్సికో అని చెప్పి వాళ్ళు నేపాల్ దేశం నుంచి వలస వచ్చినట్లు చెప్పాడు. పనిలో ఎక్కడా అలసత్వసం కని పించలేదు. ఎవరి పని వాళ్ళు చేసుకొని పోతున్నారు.

## అమెరికా డైరి-**4**

14-04-12 శనివారం

ఉదయం ఆరు గంటలకే లేచి పూజాదికాలు పూర్తిచేసి టిఫిన్ తిని అందరం కార్‌లో ఎనిమిదింటికి ఇక్కడికి రెండు గంటల ప్రయాణ దూరంలో barligtan రోడ్లో ఉన్న "గ్రీన్ బరో"కు బయల్దేరాం. ఒక గంట ప్రయాణం తరువాత బందరుకు చెందిన అడుసుమిల్లి రామకృష్ణ, ఉషా కుటుంబంతో కలిసి ఐ హోప్ హోటల్ దగ్గర ఆగి కాఫీ

తాగి విజ్జి తెచ్చిన ఇడ్లీలు వాళ్లకు పెట్టాం. గ్రీన్స్ బరో అనే చోట దేవాలయం ఉంది. అక్కడ రాధాకృష్ణ, రామ పరివారం ఆంజనేయస్వామి బాలాజీ అందరు దేవుళ్ళు ఉన్నారు. ఇవాళ తమిళ ఉగాది సందర్భంగా అక్కడ షార్లెట్ సాయి భజన సమాజంలోని అయిదు కుటుంబాల వారిని ఆహ్వానించారు. అందులో మేము ఉన్నాం. పదిన్నరకు స్వామి రాజేంద్రన్ కార్యక్రమ వివరాలను తెలియజేశారు. అందరు కలిసి తామిలా నూతన సంవత్సరాదిని జరుపుకోవాలని ఈ ఏర్పాటు చేసినట్లు తెలిపారు. నాద ప్రియుడు భజనప్రియుడు భగవంతుడని నాదో పాసనకు మించింది లేదని, త్యాగయ్య అన్నమయ్య, పురందర దాసు మీరా మొదలైన వారంతా దీనితోనే తరించారని చెప్పారు. షార్లెట్‌లోని సుబ్బు అధ్యక్షతలో ఉన్న భక్త బృందాన్ని ఆహ్వానించామని వారు నామ సంకీర్తనతో మనల్ని తన్మయులను చేస్తారని అన్నారు. సరిగ్గా పదకొండు గంటలకు భజన ప్రారంభమైంది. అంతా యువకులే. ముప్పై మంది మహిళలు నలభై మంది పురుషులు పది మంది పిల్లలు హాజరైనారు. డోలక్ మద్దెల హార్మని తప్పెటలతో భజన చాలా హాయిగా సాగింది. మా అమ్మాయి విజ్జి, ఉషా, సౌమ్య, చిన్న పిల్లలు సాయి సహానా, అనుషా వగైరా అందరు అద్భుతమైన గానంతో మై మరపించేట్లు భజన చేశారు. అన్ని భాషల పాటలు పాడారు. పిబరే రామ రసం, భక్త జన వత్సల శంకరాచార్య స్తోత్రాలు అన్నీ కమ్మగా పాడారు. వాయిద్యాల వాళ్ళు శ్రుతి మధురంగా వాయించి వన్నె తెచ్చారు. సుబ్బు షార్లెట్ సాయి భజన మండలి అధ్యక్షుడు ఏ.రవి, బి రవి.సత్యనారాయణ, సత్య గోపాల్, సుబ్బు భక్తి రసాన్ని ప్రవహింప జేశారు. భజనతో అందరు తన్మయులయారు. అందరు సాఫ్ట్‌వేర్ ఉద్యోగులే. అందరు సాయి భక్తులే. నాకు అనిపించింది అమెరికాలోని భారతీయులందరి హృదయాల్లో సత్యసాయి, షిర్డీ సాయి నెలకొని నడిపిస్తున్నారేమో నని. సంస్కృతీ ప్రవాహం అవిచ్చిన్నంగా ఇక్కడ ప్రవహిస్తున్నందుకు పరమానందంగా ఉంది. వారసత్వాన్ని తరువాతి తరాలకు అందజేస్తున్నారు. రెండు గంటల పాటు నాదో పాసన సాగింది. ఇక్కడికి వచ్చిన వాళ్ళల్లో అన్ని వయసుల వారు ఉండటం విశేషం. ఇండియా నుంచి ఒక పూజారిని సెలెక్ట్ చేసి ఈ రోజే ఆయనకు బాధ్యతలు అప్పగించారు. ముప్పై అయిదేళ్ళు ఉండవచ్చు. హైదరాబాద్‌కు చెందినవాడు భువనగిరి మురళీకృష్ణశర్మ. ప్రస్తుతం ఒక్కడే వచ్చాడు. తరువాత భార్య పిల్లలు వస్తారట. పద మూడు మంది అప్లై చేస్తే అన్ని స్క్రీనింగులు అయి ఇతన్ని సెలెక్ట్ చేసింది కమిటీ. అంటే నియామకం అంత పకడ్బందీగా జరిగిందన్న మాట. అతను కుర్తాళం పీఠాధిపతి పూర్వాశ్రమంలో ప్రసాదరాయ కులపతి గారి శిష్యుడు. వేదం చదివి అధ్యాపనం చెప్పగల సమర్థుడు. అన్ని వైదిక కార్యక్రమాలు నిర్వహించ గలడు. విగ్రహ ప్రతిష్ఠ కలశ ప్రతిష్ఠ హోమాలు యజ్ఞాలు యాగాలు నిర్వహించగలడు. నాలుగైదు భాషల్లో

ప్రావీణ్యం ఉంది. భక్తి చానెల్‌లో "నోములు –వ్రతాలు" శీర్షిక ను నిర్వహించి, నంది బహు మతి పొందాడట. అలంకార బ్రహ్మ, మహోదాచార్య బిరుదులు పొందినవాడు. ఉపనయనం వివాహాది కార్యక్రమాలను నిర్వ హించగలడు అంటే సర్వ సమర్థుడినే పూజారిగా నియమించారన్న మాట. పూజారిని అందరికి పరిచయం చేశారు. అందరం హర్షధ్వానాలతో స్వాగాతించాం.

ఆ తర్వాత హారతి ప్రసాద వినియోగం. అందరికి పులిహోర చక్రపొంగలి, రవ్వ కేసరి, పెరుగు వడ, చెర్రి పండ్ల ముక్కలు, ఆపిల్స్, ఆరంజ్, చపాతి, కూర, మజ్జిగ, పానకం ప్రసాదంగా తిన్నంత పెట్టారు. అందరు తృప్తిగా తిన్నారు. అక్కడే ఉయ్యూరులో కోట శ్రీ రామమూర్తి గారి కుమారుడు ప్రభాకర్ అన్న భార్యకు మేనల్లుడు, భార్య పరిచయ మయారు వాళ్ళ ఇంటి పేరు భాగవతుల వారు. కూచిపూడి నివాసులు ఇలా యాదృచ్ఛికంగా కలవటం భలే తమాషాగా ఉంది.

స్వామి రాజేంద్రన్ గారు ఉగాది సందర్భంగా షార్లెట్ నుంచి వచ్చిన కుటుంబాలను వారింటికి ఆహ్వానించారు. దంపతులు చాలా మంచివారు. ఆయన అక్కడ సాయి సమాజానికి అధ్యక్షులే కాదు, ఆలయ నిర్వాహకులు కూడా. వారింట్లో నిలువెత్తు సత్య సాయి ఫోటో ఉంది. సుబ్బు బృందం కొంత సేపు మళ్ళీ భజన చేశారు. మా మనుమడు శ్రీ కేత్ కూడా ఒక భజన గీతం పాడాడు. అందరికి కాఫీ టీ బిస్కట్లు ఇచ్చారు. అక్కడి నుంచి మధ్యాహ్నం మూడు గంటలకు బయల్దేరి సాయంత్రం అయిదు గంటలకు ఇంటికి చేరాం.

ఇంటికి రాగానే మొబైల్ వాన్‌లో ఫర్నిచర్ అమ్మటానికి వచ్చారు మంచం వగైరా. ఐదింటిని 1500 డాలర్లు పెట్టి కొన్నారు. ఇలా ఈ రోజు గడిచింది. పిల్లలు బానే ఎంజాయ్ చేశారు. వెళ్ళేటప్పుడు దారిలో ఒక పెద్ద వాన్ మీద "UNITED HOUSE OF PRAYER FOR ALL PEOPLE" అని రాసి ఉన్న దాన్ని చూశాం. వారి విశాల దృక్పధానికి జోహార్ అనిపించింది. అదేమిటో నాకు తేలీ లేదు కాని వారి భావన నచ్చింది.

## అమెరికా డైరి **-5**

15-04-12 ఆదివారం

ఉదయం ఆరు గంటలకే మెలకువ వచ్చి లేచి ప్రముఖ కథకులు, విమర్శకులు, పద చిత్ర రామాయణ కర్త అయిన శ్రీ విహారి గారి "అయోధ్యా కాండం" పుస్తకం చదవటం మొదలు పెట్టాను. దీనికో ఫ్లాష్ బాక్ ఉంది. సుమారు నాలుగైదేళ్ళ కిందట ఉయ్యూరులో సాహితీ మండలి ఆధ్వర్యంలో శ్రీ విహారి రాసిన పద చిత్ర రామాయణంలోని

సుందర కాండను పరిచయం చేసే కార్యక్రమం జరిపాం. దాని స్పాన్సర్ శ్రీ గుత్తికొండ సుబ్బారావు గారు. శ్రీ మాదిరాజు రామలింగేశ్వర రావు గారు పుస్తకాన్ని పరిచయం చేసి అందులోని విశేషాలను వివరించారు. పూర్ణచంద్, శ్రీ మంగళగిరి ఆదిత్య ప్రసాద్ వంటి ప్రముఖులు హాజ రైనారు. అప్పుడు నేను కూడా అందులోని సొగసుల్ని గురించి చెప్పాను. ఆ తర్వాత హైదరాబాద్ నుండి విహారి గారు ఫోన్ చేసి నేను చెప్పిన విషయాలు ఎవరు చెప్పనివని, దాన్ని ఒక వ్యాసంలాగా రాసి పంపమని కోరారు. అలానే రాసి పంపాను. దాన్ని "బాల కాండ"లో ప్రచురించారు. ఆ పుస్తకం నాకు పంపారు. దాన్ని చదివి నేను "బాల కాండ పద చిత్రాలలో–పలు విచిత్రాలు" అన్న శీర్షికతో నా స్పందన రాసి ఆయనకు పంపాను. ఆ తర్వాత ఎప్పుడో విజయవాడలో ఒక సభలో కలిసి నేను రాసినది చాలా అద్భుతంగా ఉందని దాన్నంతటిని ఒక్క అక్షరం కూడా వదిలి పెట్టకుండా "అయోధ్య కాండ"లో ప్రచురిస్తున్నానని చెప్పి ఆ పుస్తకం ఆవిష్కరణ తర్వాత నాకు నాలుగు నెలల కిందట పంపారు. చదవటం కుదర లేదు నిజంగానే నేను రాసింది అక్షరం కూడా వదల కుండా అందులో వేసి, అన్న మాట నిలుపుకొన్నారు విహారి. దాన్ని ఇక్కడికి తెచ్చుకొన్నాను చదువుకోవటానికి. అదే ఇవాళ మొదలుపెట్టాను. కథ అందరికి తెలిసిందే అయినా విహారి చెప్పిన తీరు ప్రయోగించిన జాతీయాలు ఆవిష్కరించిన భావాలు మనసును పట్టేస్తాయి. భిన్న ఛందస్సులను వాడి అర్ధపుష్టి కల్గిస్తారు. సుమారు ఇరవై పేజీలు ఇవాళ ఉదయం చదివి ఉంటాను.

ఉదయం స్నానం సంధ్య, పూజ తర్వాత ప్రభావతి తప్ప మేమందరం ఒక పావు గంట ప్రయాణ దూరంలో ఉన్న సాయి సెంటర్‌కు వెళ్లాం. ప్రతి ఆది వారం ఇక్కడ సాయి భక్తులు ఉదయం పది నుండి పన్నెండు వరకు కలిసి సత్సంగ్ భజన నిర్వహిస్తారు. ఇరవై మంది ఆడవారు, పదిహేను మంది మగవారు, పది మంది పిల్లలు వచ్చారు. పిల్లలకు నీతి బోధ క్లాస్ ఉంటుంది ఒక గంటసేపు. పది నుండి పద కొండు గంటల వరకు సత్సంగ్ జరిగింది. పిల్లల్ని పెంచటంలో ఇబ్బందులు వాటిని అదిగమించే మార్గాలు సత్య సాయి ఈ విషయంలో చేసిన మార్గనిర్దేశకాల గురించి అందరు తమ మనసులోని మాటలను తెలుపుకొన్నారు. సుబ్బు మానిటరింగ్ చేశాడు. నిలువెత్తు సత్యసాయి ఫోటో, దాని ప్రక్కన కుర్చీలో సత్య సాయి ధరించే కాషాయ చొక్కా ఒక కుర్చీలో ఏర్పాటు చేశారు. ఫోటోకు ఎదురుగా ఒక రెడ్ కార్పెట్, దానిపై గులాబి పూలు ఆయన రాక కోసం అన్నట్లుగా ఏర్పాటు చేశారు. ఒక పెద్ద స్క్రీన్ మీద సాయి సూక్తులు, ఫోటోను కంప్యూటర్ ద్వారా చూపించారు.

పద కొండు నుంచి పన్నెండు వరకు సుబ్బు బృందం భజన కార్యక్రమం

నిర్వహించారు. అందరు తలో గీతం పాడి భజన అన్ని భాషల్లోను చేశారు. ఆ తర్వాత హారతి. విభూతి ప్రసాదం. పుష్ప అనే ఒకావిడ తన ఇంటిలో కింది భాగాన్ని సత్సంగానికి ఇచ్చింది. ఇక్కడే ప్రతివారం సమావేశాలు జరుగుతాయి. ఇక్కడే ఉయ్యూరులో నా గురువు గారు వేమూరి శివరామ కృష్ణయ్య గారి రెండవ కుమారుడు, నా క్లాస్‌మేట్ దుర్గయ్య అన్నగారు అయిన కామేశ్వరశర్మ గారి కూతురు, అల్లుడు కలిశారు. తమాషా పరిచయాలు ఏర్పడుతున్నాయి. నిన్న, కోట వారి బంధువుల పరిచయం ఇవాళ ఇది. కామేశ్వరశర్మ మాకు సీనియర్. ఏదో పెద్ద ఉద్యోగం చేసి రిటైర్ అయి సాయి సేవలో ఉంటున్నాడట.

తరువాత బెల్లంకొండ ఉషా రవి వాళ్ల అమ్మాయి పుట్టిన రోజూ పండుగకు అందరం అంటే భక్త బృందంలో ఒక పాతిక మందిమి వెళ్లాం. వెళ్ళేటప్పటికే ఒంటి గంట దాటింది. కమ్మటి భోజనం తయారు చేసింది ఉష. పూరి కూర చాలా బాగున్నాయి. మినప సున్ని ఉండలు, కిచిడీ అన్నం, పెరుగన్నం, మినీ ఆవడ, కోకా ఐస్ క్రీం, కర్బూజా, పుచ్చకాయ ముక్కలు. అన్ని కడుపు నిండా తిన్నాం. ఆ తర్వాత బర్త్ డే కేక్ కట్ చేశారు. అందరికి కేక్ పెట్టారు. పిల్లలందరికి తలో అయిదు డాలర్ల గిఫ్ట్ కార్డు లిచ్చారు రవి ఉషా దంపతులు. పవన్ భార్య రాధ పిల్లలు కూడా వచ్చారు. అడుసుమిల్లి అతను "అంకుల్ ఎలా కాలక్షేపం చేస్తున్నారు?" అని అడిగితే, వివరంగా చెబితే నోరు వెళ్ళ బెట్టాడు. ఇంటికి వచ్చేసరికి నాలుగున్నర అయింది రవి వాళ్ళున్న ఏరియాను కాన్కార్డ్ అంటారట. అమెరికాలో ఏ ఊరు అయినా, ఏ ప్రదేశం అయినా ఒక్కటే. అన్నీ ఒకటిలానే దాదాపుగా ఉంటాయి. ఇళ్ళు అన్నీ ఒకటిగా ఉన్నట్లే. మొత్తం మీద అందరం తరచుగా కలుస్తున్నందుకు, పరిచయాలు పెరుగుతున్నందుకు హాయిగా ఉంది. సాయంత్రం శ్రీకేత్‌కు తెలుగు tution పవన్ వాళ్ల ఇంటి దగ్గర ఉంటే విజ్జి వాళ్ళమ్మను కూడా తీసుకొని వెళ్ళింది. వీళ్ళింటికి నడిచివెళ్ళేంత దగ్గిరే. అరవై మంది పిల్లలకు తెలుగు నేర్పుతున్నారు రాధా, ఇంకో అమ్మాయి కలిసి. మంచి పని చేస్తున్నందుకు అభినందనలు.

మాధవికి, మైనేని గారికి మెయిల్ రాశాను. విజ్జి, వేదవల్లి కొడుకు హరికి ఫోన్ చేసి మాట్లాడింది. వాడికి ఉన్నచోటు నుండి traansfer అయిందట. కొత్తచోటులో త్వరలో చేరుతాడట. అక్కడికి వెళ్ళేలోపు వాళ్ల అమ్మ మాతో పంపిన వాటిని తీసుకొని వెళ్ళమని విజ్జి చెప్పింది. ఎప్పుడో వస్తాడు. ఇవీ ఈరోజు విశేషాలు.

అమెరికా డైరి-**6**

## ఇక్కడి మన వాళ్ళు

ఇక్కడి మనవాళ్ళు అంటే నా ఉద్దేశ్యంలో "అమెరికాలో నాకు తెలిసిన మన

వాళ్ళు" అని భావం. నేను నా శ్రీమతి మొదటిసారిగా అమెరికాకు మా అమ్మాయి, అల్లుడు ఇంటికి టెక్సాస్‌లోని హూస్టన్‌కు 2002లో వచ్చాము. అప్పుడు మాకు మొదట ఇక్కడ పరిచయమైనవారు శ్రీ మతి వావిలాల లక్ష్మి, శ్రీ వావిలాల కృష్ణ దంపతులు. మా అమ్మాయి వారిద్దరిని అమ్మక్కయ్య, పెద నాన్న అని పిలిచేది. వాళ్ళూ హూస్టన్‌లోనే ఉండేవారు. దాదాపు ప్రతి వారం కలుసుకొనే వారం. లక్ష్మి గారు నాకు బంధువే. మా ఉయ్యూరులో మా అమ్మ గారి బాబాయి గుండు అంతర్వేది గారి మనుమరాలు. అంటే ఆయన కుమారుడు మేమందరం "అప్పన్న కొండ మామయ్య" అని పిలిచే గుండు వరాహ లక్ష్మీ నరసింహమూర్తి (డాక్టర్ జి.వి.ఎల్.ఎన్.మూర్తి) గారి అమ్మాయే. ఆయన జంషె డ్పూర్ టాటా ఐరన్ అండ్ స్టీల్ ఫాక్టరీలో చీఫ్ కెమిస్ట్. అంతర్వేది గారు పోలిస్ సర్కిల్ ఇన్స్పెక్టర్‌గా రాజ మండ్రిలో చేసి ఉయ్యూరులో స్థిరపడ్డారు. అప్పన్న కొండ మామయ్య సంవత్సరానికి కనీసం రెండు మూడుసార్లు ఉయ్యూరు వచ్చే వాడు. వచ్చినప్పుడల్లా మా ఇంటికీ, మా మేనమామ గంగయ్య గారింటికి తప్పక వచ్చి కనిపించి వెళ్ళే వాడు. ఆ కాలంలోనే ఆయన విజయవాడ హోటల్‌లో దిగి ఉయ్యూరుకు కార్‌లో వచ్చేవాడు. మమ్మలనందరినీ ఆప్యాయంగా పలకరించేవాడు. ఒళ్లో కూర్చోపెట్టుకొని కబుర్లు చెప్పేవాడు. తెల్లని బెంగాలి పంచె, లాల్చీతో వుండేవాడు. చాలా ఎత్తు దానికి తగ్గ శరీరం. బాగా అందంగా వుండేవాడు. నుదుటి మీద కాల్చిన మచ్చ ఉండేది. సత్య సాయిబాబా భక్తుడు. అమ్మను అక్కయ్యా అని మామయ్యను అన్నయ్యా అని ఆప్యాయంగా పిలిచేవాడు. నేను బి.ఎస్.సి పాసై తరువాత చదువు కోసం ఆలోచిస్తుంటే వేసవి సెలవుల్లో ఆయన వచ్చి అంధ్రా యూనివర్సిటి రిజిస్ట్రార్ మహా దేవన్ తనకు బాగా తెలుసని రికమండేషన్ లెటర్ ఇచ్చి నన్ను విశాఖ పంపించాడు. ఆయన కూడా ఎంతో ఆదరంగా మాట్లాడి ఫిజిక్స్‌లో సీట్లు అయి పోయాయని మెరైన్ ఫిజిక్స్‌లో ఇస్తానని చెప్పారు. లేను చేర లేదు. అంతటి సహాయకారి అప్పన కొండ మామయ్య.

ఆయన కూతురే లక్ష్మి గారు. ఆవిడ భర్త గారే వావిలాల కృష్ణ గారు. రాజమండ్రి నివాసి. అక్కడే పుట్టారు. అనసూయమ్మ గారి మనవడు. వావిలాల వాసు దేవ శాస్త్రి గారు అంటే సాహిత్యంలో పరిచయం ఉన్నవారికి బానే తెలుస్తుంది. శాస్త్రి గారు షేక్స్ పియర్ నాటకాలను మొట్టమొదట తెలుగులోకి అనువదించిన వారు. అంతే కాదు "నందక రాజ్యం" అనే తొలి స్వతంత్ర నాటకాన్ని, తొలి సాంఘిక నాటకాన్ని రాసిన కవి పండితులు. వీరేశలింగం గారు, వడ్డాది సుబ్బారాయ కవి గారు, వావిలాల వాసు దేవశాస్త్రి గారు ఆనాడు సమకాలికులు. వీరు ముగ్గురిని "ఆధునిక కవిత్రయం" అని పిలిచేవారు. అలాంటి శాస్త్రి గారి మనుమడే కృష్ణ గారు. శాస్త్రి గారి రచనలను నాకు ఇచ్చారు ఇక్కడ. అంతే కాదు కృష్ణ గారు హూస్టన్‌లో "తెలుగు సంఘం"ను మొట్ట

మొదటగా ఏర్పరచి, తెలుగు వారందరినీ కలిపిన వ్యక్తి కూడా. అప్పుడు వీరికి సహకరించిన వారిలో చిట్టెన్ రాజు గారు ప్రముఖులు. వీరంతా తెలుగు భాష, సంస్కృతీలకు వ్యాప్తికి నిలబెట్టటానికి అహర్నిశలు పని చేసిన తొలి తరం వ్యక్తులు.

లక్ష్మి గారు మమ్మల్ని మీనాక్షి దేవాలయం, దుర్గాలయం, ఇస్కాన్ దేవాలయాలకు వెంటపెట్టుకొని తీసుకొని వెళ్లి చూపించారు. రైస్ యూనివర్సిటిలో ఒక తెలుగు అమ్మాయి కూచిపూడి నాట్యాన్ని తొలిసారిగా రంగం మీద ప్రదర్శిస్తుంటే తీసుకొని వెళ్లి చూపించారు. దంపతులిద్దరూ ఎంతో అప్యాయంగా పలకరించి సంభాషించేవారు. ఇండియా వచ్చినా తప్పక మాకు ఫోన్ చేస్తారు. ఈ మార్చ్‌లో అప్పన్న కొండ మామయ్య శత జయంతి కోసం రాజమండ్రి వచ్చి, ఆయన చదివిన కాలేజిలో ఆ కార్యక్రమాన్ని ఘనంగా నిర్వహింప జేసి మాకు తెలియజేశారు.

హ్యూస్టన్‌లో ఉండగానే ప్రఖ్యాత నాట్యాచారిని వింజమూరి రత్న పాప పరిచయం అయారు. ఆమె సుమారు పాతిక ఏళ్ళ క్రితం అమెరికా వచ్చి ఇక్కడ నాట్య కళాశాల స్థాపించి వేలాది మందికి భరతనాట్యం, కూచిపూడి నేర్పించారు, నేర్పిస్తున్నారు. రైస్ యూనివర్సిటిలో పరిచయం అయ్యారు. హోస్టన్‌లోనే ఉంటారు. ఆ రోజే ఆమె తల్లి గారు వింజమూరి అనసూయ గారు కూడా పరిచయమయ్యారు. ఆమె పేరు మా చిన్నప్పటి నుంచి వింటూనే ఉన్నాం. సీతా అనసూయలుగా ప్రసిద్ధులు ఆ అక్కా చెల్లెళ్ళు. జానపద సాహిత్యాన్ని అద్భుతంగా ప్రచారం చేసిన విదుషీమణులు. దేవులపల్లి కృష్ణ శాస్త్రి గారి మేన కోడళ్ళు. ఆయన పాటలను ఊరూరా సంగీత మేనాలో ఊరేగించినవారు. కృష్ణ శాస్త్రి గారు మా పెద్దక్కయ్య గాడేపల్లి లోపాముద్ర, బావ కృపానిధి గార్లకు దగ్గర బంధువు. శాస్త్రి గారు మద్రాస్‌లో టి.నగర్‌లో ఉండేవారు. మద్రాస్‌కు నేను వెళ్లినప్పుడల్లా కృష్ణశాస్త్రి గారింటికి మా అక్కయ్య తీసుకొని వెళ్ళేది. ఆయన ఎంతో ప్రేమతో పలకరించేవారు. స్క్రిబ్లింగ్ పాడ్‌పై సంభాషణ జరిపేవారు. ఒకటి రెండు సార్లు ఆయన కారులో నన్ను, నా మేన కోడలు సత్యకళను తీసుకొని వెళ్లి తిప్పారు. ఆయన ఇంకో ఇరవై రోజులకు చని పోతారనగా నేను చివరిసారిగా వారిని వారింట్లో దర్శించాను. అప్పటికి ఆరోగ్యం బానే ఉంది. ఎన్నెన్నో విషయాలు అడిగి తెలుసు కొనేవారు. ఇలా రత్న పాప, సీతా అనసూయలకు మా ఉయ్యూరు సంబంధం వుంది.

అయిదు లేక ఆరేళ్ళ క్రితం చిట్టెన్ రాజు గారు హైదరాబాద్‌లో తొలి ప్రపంచ తెలుగు సభలు నిర్వహిస్తూ శ్రీ బాపు, రమణల స్నేహ షష్టి పూర్తి జరిపారు. దానికి నేను హాజరైనాను. అనసూయ గారు అప్పుడు హైదరాబాద్ వచ్చి తన పుస్తకాన్ని ఆవిష్కరించారు. బాపు రమణలకు అద్భుత సన్మానం జరిపారు రాజు గారు.

చిరస్మరణీయం అది. అనసూయ గారిని పలకరించాను. ఆవిడ బంధుత్వాన్ని అంతా ఏకరువు పెట్టారు.

మూడేళ్ళ క్రితం కూచిపూడిలో వెంపటి చినసత్యం గారి ఆధ్వర్యంలో మూడు రోజుల సిద్ధేంద్ర ఉత్సవాలు జరిగితే రత్న పాప వచ్చారు. ఆమె సత్యం గారి శిష్యురాలే. నేను మా హూస్టన్ పరిచయాన్ని జ్ఞాపకం చేశాను. చాలా ఆనందించారు. నేను శ్రీ నాథుడు రాసిన శివుడు పార్వతీ మీద పద్యాన్ని ఎందుకో స్టేజి మీద చదివితే ఆమె తనకు ఆ పద్యం కావాలని అంటే రాసి ఇచ్చాను. దాన్ని తాను నేర్పే నాట్యంలో చేరుస్తానని అంత బాగా ఉందని అన్నారు. ఆ పద్యం "చంద్ర బింబానన, చంద్ర రేఖా మౌళి, నీల కుంతల ఫాల నీల గళుడుః"

మేమిద్దరం, మా అమ్మాయి మనవడు శ్రీ కేత్ నవంబర్‌లో కాలి ఫోర్నియా వెళ్లి మా మేనల్లుడు వేలూరి మృత్యుంజయ శాస్త్రి (jay veluri) ఇంట్లో ఫ్రీమాంట్‌లో పదిహేను రోజులున్నాం. వాడి భార్య విజయలక్ష్మి మమ్మల్ని బాబాయి గారు, పిన్ని గారు అంటు ఎంతో ఆదరంగా చూశారు. చుట్టూ ఉన్న ప్రదేశాలన్నీ చూపించారు. అక్కడే మన ఉయ్యూరులో చోడవరపు చంద్రశేఖర రావు గారి మనవడు ఉయ్యూరు హైస్కూల్‌లో శిష్యుడు, మృత్యుంజయ మూర్తి కనిపించాడు. అతన్ని నేను "పొట్టి" అని పిలిచే వాడిని. మంచి ఇంటలిజెంట్ . బాంక్ ఆఫ్ అమెరికాలో పెద్ద ఉద్యోగి. ఇక్కడికి రాక ముందు ఇండియాలో స్టేట్ బాంక్‌లో కూడా పెద్ద ఉద్యోగం చేశాడు. మా వాళ్ళింటికి వచ్చి మమ్మల్ని అందరిని వాళ్ళింటికి భోజనానికి ఆహ్వానించి పిల్లలకు పరిచయం చేసి ఎంతో గౌరవం చూపించాడు మూర్తి అతని భార్యా. అక్కడే మావాడి ఇంటికి ఎదురుగా పింగళి వారి కుటుంబం పరిచయం అయింది. వృద్ధ దంపతులు. చాలా నియమ నిష్టలతో ఉంటారు. కార్తీక మాసంలో వచ్చాం కనుక సత్యనారాయణ వ్రతం చేసి మమ్మల్నందర్నీ భోజనానికి పిలిచారు. సాయంత్రం మేమందరం స్కూల్ గ్రౌండ్‌కు నడకకు వెళ్ళే వాళ్ళం. ఆ పదిహేను రోజులు ఇట్టే గడిచిపోయాయి. శాస్త్రి కొడుకు కృష్ణ, కూతురు వీణా బాగా మమ్మల్ని ఆకట్టుకున్నారు.

నేను రోజూ అభిషేకం చేసి పౌర్ణమి నాడు సత్య నారాయణ వ్రతం కూడా చేశాను. మా మేనల్లుడు శాస్త్రి దాదాపు ఇరవై ఏళ్ళ క్రితమే మిచిగాన్ చదువు కోవటానికి వచ్చి, పూర్తిచేసి క్రమంగా ఉద్యోగం సంపాదించి, భార్యకు కూడా ఉద్యోగం చూపించాడు. మా అక్కా బావలను కనీసం ఎనిమిది సార్లైనా ఇక్కడికి తీసుకొని వచ్చి ఉంటాడు. అతను అతని పెద నాన్న ముకుందం గారి అబ్బాయిని పవన్‌ను కూడా ఇక్కడికి తెచ్చి నిలబడేట్లు చేశాడు. బావ మరిదిని భార్యను, మా తమ్ముడు కొడుకును తీసుకొచ్చి ఆవ కాశాలు కలిగించాడు. పవన్ ఇప్పుడు మా అమ్మాయి వాళ్ల ఇళ్ళ దగ్గరే

షార్లెట్‌లో ఉన్నాడు. ఈ విధంగా మా "జాయ్ వేలూరి" వేలూరి సామ్రాజ్యాన్ని ఇక్కడ చక్కగా స్థిర పరిచి అందరికి అండగా నిలిచాడు. అతను మొదటిసారిగా ఇక్కడికి రావటానికి అతని స్నేహితుడు కొడాలి శ్రీనివాస్, ఇతర మిత్రులే నిలబడి నిలబెట్టారు. కొడాలి బందర్లో మా వాడి క్లాస్‌మేట్. స్నేహితం అంతే ఇదీ అని రుజువు చేసిన వాళ్ళు వీరంతా.

అమెరికా డైరీ-**7**

## సంకీర్తన షవర్లతో పులకిస్తున్న షార్లెట్

మేము ఇక్కడికి వచ్చి పది రోజులు దాటింది. రోజూ ఎక్కడో ఒకరింట్లో సాయి భజన, ఆహ్వానం అందుకొంటున్నాం. వెళ్లి వస్తున్నాం. రాత్రి ఏడున్నర నుంచి ఎనిమిది గంటల వరకు. భక్తి శ్రద్ధలతో ఇక్కడి భక్తులు నిర్వహించటం ఆసక్తికరంగా ఉంది. చిన్న పిల్లలతో సహా యువకులు, వృద్ధులు పాల్గొనటమే కాదు, పాడుతూ తమ భక్తీ వైదుష్యాన్ని చాటుకొంటున్నారు.

నిన్న అంటే 21వ తేదీ శనివారం మా ఇంటికి దగ్గరలో పది నిమిషాల ప్రయాణ దూరంలో ఉన్న "ఆక్రా కమ్యూనిటి సెంటర్"లో షార్లెట్ సాయి సేవా సంఘం వారు గ్రీన్ బరో మొదలైన ప్రాంతాలలో ఉన్న మిగిలిన సాయి సెంటర్ వాళ్ళను అందర్నీ ఆహ్వానించి ఉదయం పది గంటల నుండి రాత్రి ఏడు వరకు ఒక కార్యక్రమాన్ని నిర్వహించారు. దాదాపు నూట యాభై మంది హాజరైన పెద్ద సమావేశం. ఉదయం అందరికి టిఫిన్, కాఫీ ఇచ్చారు. పది గంటలకు సభ ప్రారంభమైంది. "టెడ్ హెన్రి" ఫ్లోరిడాకు చెందిన అమెరికన్ సాయి భక్తుడు. సత్యసాయితో తనకున్న పరిచయం, అనుభవాలను గురించి సుమారు ముప్పావు గంట మాట్లాడారు. ఆయన మొన్న సత్యా వాళ్ళింట్లో పరిచయం అయారు. సుమారు అరవై ఏళ్ళుంటాయి. మంచి పర్సనాలిటి. ఆ తర్వాత కాలిఫోర్నియకు చెందిన శ్రీమతి సీమామిల్లర్. ఆ తరువాత శ్రీ సునీల్ కస్తూరి తమ అనుభవాలను వర్ణించారు. వీరందరూ సాయితో ప్రత్యక్ష పరిచయం ఉండి ఆయన అభిమానాన్ని పొందినవారే. కార్యక్రమం మధ్యాహ్నం ఒంటి గంటకు అయింది. అప్పుడు లంచ్ ఏర్పాటు చేశారు. పొంగల్‌తో లంచ్.

మధ్యాహ్నం రెండు గంటలకు మళ్ళీ సమావేశం ప్రారంభం. చిన్న పిల్లలు సత్యసాయి, మదర్ తెరెసా, కబీర్, మార్టిన్ లూథర్ కింగ్, మీరా, కృష్ణా, గాంధి మొదలైన వేషధారణలతో వారి సందేశాలను వినిపించారు. అయితే ఎవరు వచ్చి ఏ పాత్ర పోషిస్తున్నారో వాళ్ళిచ్చే సందేశం ఏమిటో ఒకరిద్దరు పిల్లలతో చెప్పిస్తే ఇంకా నిండుగా ఉండేది. పిల్లలకు ప్రోత్సాహంగా ఉండేదని పించింది. ఇక్కడ అవగాహనా లోపం

కనిపించింది.

మూడు గంటల నుంచి మళ్ళీ మిల్లర్, కస్తూరిల అనుభవ సందేశాలు. ఆ తర్వాత టీ బ్రేక్. అయిదింటి నుంచి వివిధ ప్రదేశాల నుంచి వచ్చిన సాయి కేంద్రాల వారు ఆలాపించిన భజనలతో ఆధ్యాత్మిక వాతావరణాన్ని కల్గించారు.

దీనికి ముందు అతిదులైన టెడ్, మిల్లర్. కస్తూరిలకు జ్ఞాపికలు అందించారు. రేవతీ రామ చంద్రన్ గారి అమ్మాయికి, ఇంకొక అతను సైన్సులో అవార్డ్ పొందినందుకు సత్యా వాళ్ళిద్దరిని పరిచయం చేసి జ్ఞాపికలను అందజేశారు. వారిద్దరూ తమ కృషిని క్లుప్తంగా వివరించారు.

రాత్రి ఏడు గంటలకు డిన్నర్. చపాతి, రెండు కూరలు, వెజిటబుల్ బిర్యాని, పెరుగన్నం, సేమ్యా పాయసంతో విందు సుష్టుగా ఉంది. మా అమ్మాయి విజ్జి, రాధ, సీతా, ఉషా మొదలైన వారంతా ఇంతమందికీ ఇన్ని రకాల అయిటంస్ ఇంటి దగ్గర తయారు చేసి తీసుకొని వచ్చి ఆప్యాయంగా వడ్డించి అతిధి మర్యాదలు చేశారు. నాన్‌స్టాప్‌గా కాఫీ, తేనీరు అందిస్తూనే ఉన్నారు. పిల్లలకు బిస్కట్లు, పీజా బర్గర్లు పెడుతూనే ఉన్నారు. భజన బృందంలో సత్య గొప్ప హార్మని విద్వాంసుడు. ఇంకో సత్యమంచి తబలా వాద్యకారుడు. కంజీర రవి బాగా వాయిస్తాడు. డాక్టర్ సదాశివ గారబ్బాయి పియానో కళాకారుడు. వీరందరినీ సమీకరించి నిర్వహణ చేయటంలో సుబ్బరాజ్ కృత కృత్యుడయారు. ఈ భజన బృందం మంచి క్రమశిక్షణ కలిగి అందరి అభి మానాన్ని పొందింది.

నాకు అనిపించిన విషయాలు– ఒక హాలిడే రిసార్ట్‌కు వచ్చిన భావం కలిగించేట్లుంది. కాని ఒక ఆధ్యాత్మిక కేంద్రానికి వచ్చిన అనుభూతి కల్గించ లేకపోయారు. ఏ సమయంలో పడితే ఆసమయంలో కాఫీ టిఫిన్ తింటు ఉండటం సమావేశానికి ఇబ్బంది కరం అనిపించింది. బహుశా ఇక్కడి పద్ధతి ఇంతేనేమో? కాని ఇళ్ళ దగ్గర ఎవరు ఇలా చేయటం నాకు ఈ పది రోజుల్లోనూ కని పించలేదు. నిర్ణీత సమయంలోనే వాటిని అందజేయాలి. లేకపోతే అనుకున్న ఫలం రాదు. పిల్లలను ప్రభావితం చేసే అంశాలతో వారిని ఆకర్షించే, వారి జీవితాలను ప్రభావితం చేసే విధానంగా కార్యక్రమాలు ఉండాలి. మంచి కథలను మానిటర్ ద్వారా తెలియ జేయాలి. వాళ్ళు నేర్చుకోన్నని ప్రదర్శించే వీలు కల్పించాలి. అలాగే అవధాని రావణ భుజంగ స్తోత్రం, నమక చమకాలు, ఉప నిషత్తులు స్వయంగా నేర్చుకొంటున్నాడు. ప్రోత్సాహకరంగా వారిని సభకు పరిచయం చేయాలి. ఇంకేదైనా విద్యలో ప్రావీణ్యం ఉన్నవారిని పరిచయం చేయాలి. ఉపన్యాసాలు సుదీర్ఘం అనిపించకుండా జాగ్రత్త పడుతూ మధ్య మధ్యలో బాగా పాడే వారితో మంచి పాటలను పాడిస్తే ఇంకా బాగా కార్యక్రమం రక్తి కట్టేది. వారికీ గొప్ప ప్రోత్సాహం

లభించేది. మూస ప్రోగ్రామ్స్ వల్ల ఆశించిన ఫలితం రాదు. సృజనకు ఎక్కువ ఆదరణ నివ్వాలి.

సత్య సాయి ఉన్న కాలమ్ "బంగారు యుగం" అనే భావనతో నిర్వహించిన కార్యక్రమం ఇది. ఆయన అందర్నీ "బంగారు" అని పిలవటం అందరికి తెలిసిన విషయమే. ఆ స్ఫూర్తిని కల్గించటంలో ఇంకా ఎక్కువ శ్రద్ధ తీసుకొంటే బాగుండేదని పించింది. కార్యకర్తలు బాగా శ్రమించారు. ఖర్చు పెట్టారు. ఆడవాళ్ళు శ్రమపడి కమ్మని వంటలు వండి వడ్డించారు. దీనికి తగ్గ ప్రతిఫలం రావాలి. అందరు స్వచ్ఛందంగా సేవ చేయటం బాగా ఉంది. విరాళాల జోలికి పోకుండా ఎవరికి అప్పగించిన పని వాళ్ళు చేసుకు పోతున్నారు. మెడికల్ కాంప్‌లను, పేద జనులకు ఆహార సరఫరాను నిర్వహించటం షార్లెట్ కేంద్రం సాధించిన విజయాలు. సమష్టి బాధ్యతతో అంతా నిర్వహిస్తూ అందరి అభిమానాన్ని పొంద గలుగుతున్నందుకు అభినందనీయులు. సేవా భావం, అంకిత భావంలతో నిర్వహిస్తున్న కార్యక్రమాలివి. అందుకే "సాయి సంకీర్తన షవర్లతో పునీతమైంది షార్లెట్" అనిపించింది.

(22 -04 -12)

అమెరికా డైరీ-**8**

## ఆశోపహతుల పాలిటి హరి విల్లు -- carrington cares

అమెరికా వచ్చి మూడు వారాలైంది. ఇప్పటి వరకు వారానికి మూడు భోజనాలు, ఆరు భజనలతో తీరికే లేకపోయింది. అయితే నిన్న అంటే 29వ తేదీ శనివారం ఒక దివ్యక్షేత్రాన్ని సందర్శించి అద్భుత అనుభూతిని పొందాం. అదే "caarrington cares" అనే వృద్ధాశ్రమం. అక్కడ సుమారు యాభై మంది అతి వృద్ధులున్నారు. వారందరూ వీల్‌చైర్‌కు పరిమిత మైనవారే. నడవ లేని, కోర్చోలేని, గట్టిగా చూడలేని, వినికిడిలేని వారు అందులో చాలా మంది. వారెవరికీ నా అనే వాళ్ళు ఉండి ఉండరు. పని చేసే శక్తి లేని వారు. ఎవరైనా సాయం చేస్తేనే వారు ఏదైనా తినగలరు. కంప్యూటర్ పని కూడా ఎవరో సాయం చేస్తే చూడ గలరు. కళ్ళు ఉన్నా కనిపించని వారు, చెవులున్నా వినిపించని వారు కాళ్ళు ఉన్నా నడవ లేని శక్తి హీనులు. దాదాపు అందరి పరిస్థితీ అదే. ఒకామె అచ్చంగా ప్రఖ్యాత శాస్త్రజ్ఞుడు "స్టీఫెన్ హాక్"లాగా అన్నీ చైర్‌లోనే. పాపం మెడ మాత్రం ఆమెకు తెలీకుండా అటూ ఇటు తిరుగుతూ వుంటుంది. ఇలాంటి ఆశోపహతులు దైవోపహతుల కోసం caarrington అనే చోట చుట్టూ ప్రక్కల ఉన్న ప్రజా సహకారంతో నిర్వహిస్తున్న

శరణాలయం ఇది. స్థానిక వాలంటీర్‌ల సాయంతో వృద్ధుల సేవ చేస్తున్నారు. వారికి ఏ కొరతా లేకుండా అన్నీ తామే అయి బాధ్యతగా నిర్వహిస్తున్నారు. నాకు యేమనిపించిందంటే మానవత్వం కొలువై ఉన్న దేవాలయం అనిపించింది .

"cares" అనే దానికి పూర్తి వివరణ caring and remembering every one special. నిజంగా అంత విధి నిర్వహణతో వారందరికి అన్నీ తామే అయి వాలంటీర్లు సేవ చేస్తున్నారు. చుట్టూ పచ్చని ప్రకృతి మధ్య వుంది ఈ ఆశ్రమం. కళ్ళకు ఆనందాన్నిచ్చే రక రకాల రంగుల పూలు. లోపల సకల ఆధునిక సదుపాయాలతో గదులు. ఆధునిక సౌకర్యాలన్నీ అందుబాటులో ఉంచారు. మంచి పుస్తకాలున్న గ్రంథాలయం. ఒక పది మంది కూచుని హాయిగా చూసే అవకాశంతో టి.వి, రేడియో. పరి శుభ్రమైన పరిసరాలు. అర్జెంట్‌గా ఏ బాధ వచ్చినా చూసే డాక్టర్లు. అందుబాటులో అన్ని మందులు. వంట గది. అందులో పని చేసే వంట వాళ్ళు. ప్రత్యేక లాండ్రీ. అపరిశుభ్రతకు తావే లేని ప్రదేశం. కాళ్ళకు కట్లతో, చేతికి పుళ్ళతో, అన్ని రకాల అవకరాలతో మనకు మొదట చూడంగానే "అయ్యో" అనిపించే సన్నివేశం. కాని వారందరి ముఖంలో చిరునవ్వు, కళ్ళల్లో ఆశా జ్యోతి, గుండె దిటవు, మనో ధైర్యం, జీవించ గలుగుతున్నామనే ధైర్యం, సమాజం తమకు చేస్తున్న సేవల పట్ల కృతజ్ఞతాభావం వారందరిలో ప్రస్ఫుటంగా కనపడింది. మరణించే దాకా ఆరోగ్యంగా జీవింప జేయాలన్న సత్సంకల్పం నిర్వాహకుల్లో ఉంది. అంకిత భావంతో సేవాభావంతో మానవ సేవే మాధవ సేవ అనే పవిత్ర ఆశయంతో, ఇది మనం చేయాలన్న కనీస విధి అన్న ధ్యేయంతో అక్కడి వాలంటీర్లు ఆ వృద్ధ నారాయణులకు చేస్తున్న సేవ చూస్తుంటే వారికి చేతులెత్తి నమస్కరించ బుద్ధేస్తుంది. ఒక పవిత్ర దేవాలయంలో ఉన్నట్లనిపిస్తుంది. అలాంటి గొప్ప అనుభూతిని కల్పించిన దాని నిర్వాహకుల్లో ఒక రైన వాలంటీర్ ప్రెసిడెంట్ steve linden man, రెండవ వారైన activitydirector --robin diekerకు ఎన్ని ప్రశంసా వాక్యాలు చెప్పినా తక్కువే. అందర్నీ కంటికి రెప్పలాగా చూసుకొంటున్న వారి దైవీ కృత మానవ సేవకు ధన్యవాదాలు, కృతజ్ఞతలు. వారంలో వారికి రోజు వారీ ఇచ్చే మెను అంటే భోజన వివరాలు బోర్డ్ మీద కనిపిస్తుంది.

ఈ సంస్థను లాభ నష్టాలుతో సంబంధం లేకుండా నిర్వహించటం ఒక విశేషం. వాలంటీర్‌లను దగ్గరలో ఉన్న కమ్యూనిటీ నుంచే తీసుకోవటం మరో ముందడుగు. వాలంటీర్స్ అందరు కుర్ర వాళ్ళే. యువతీ యువకులే. వారందరి ధ్యేయం ఈ వృద్ధ దేవతలకు అన్ని రకాల సేవలు అందించటమే. ఈ సంస్థను 1994లో ప్రారంభించి అందరి మన్ననలను అందుకొంటూ సక్రమంగా నిర్వహిస్తున్నారు. అక్కడ బోర్డ్ మీద వాలంటీర్ అంటే ఏమిటో, రెసిడెంట్ అంటే ఏమిటో సేవ అంటే ఏమిటో ఖచ్చితమైన

వివరాలున్నాయి. సేవకు లెవ్వరు ఆ ఆవరణలో పొగతాగటం నిషేధం. అవసరానికంటే ఎక్కువ పదార్థాలు అందజేస్తే ఇంక వద్దు. సమృద్ధిగా ఉన్నాయని బోర్డ్ పెట్టటం ఇక్కడ ప్రత్యేకంగా కన్పించింది. ఇలాంటి సేవా కేంద్రాలు ఇక్కడ ఎన్నో ఉండవచ్చు. అయితే ఇంత సమగ్రంగా ఉన్న సేవా కేంద్రాన్ని, ఇంతటి సంతృప్తితో ఆశ్రమవాసులు ఉండటాన్ని చూడటం ఇదే మొదలు నాకు. అందుకే ఈ స్పందన.

అలాంటి పవిత్ర దివ్య క్షేత్రంలో నిన్న మధ్యాహ్నం కాలు పెట్టాం. ఇక్కడి సత్య సాయి సెంటర్ వారు చిన్న పిల్లలతో ఒక ఆంగ్ల నాటికను తయారు చేసి ఆ వృద్ధుల ముందు ప్రదర్శించే అవకాశం తీసుకొన్నారు. పిల్లలు దాదాపు నెల రోజుల నుండి బాగా ప్రాక్టిస్ చేసి తయారై వచ్చారు. వారి వెంట తలిదండ్రులు కూడా. గీత అనే అమ్మాయి దీనికి దర్శకత్వం వహించింది. మధ్యాహ్నం రెండున్నరకు ప్రార్ధనతో ప్రారంభమైంది. వృద్ధుల్ని, ఆసక్తి. ఓపికా ఉన్నవారిని ఒక ముప్ఫై మందిని ముందే వీల్ చైర్‌లలో వాలంటీర్లు తీసుకొని వచ్చి కూర్చో బెట్టారు. వారందరిలో ఏదో వింత ఆశ గోచరించింది. పిల్లలు బాగానే నటించారు. ఆ నాటిక సారాంశం మాటలు చెప్పటం కాదు చేతల్లో మంచి చేయాలి సాయపడాలి అన్న నీతి. మా మనవడు శ్రీ కేత్ క్రిస్టియన్ ఫాదర్ వేషం వేశాడు. పిల్లలందరూ మన సాంప్రదాయ దుస్తులే ధరించారు. అన్ని భాషల పిల్లలు ఉన్నారు. కొందరు భక్తీ గీతాలు పాడారు. దాదాపు ఒక గంట వారందరికి వినోదం కలిగించారు. ఆ వృద్ధుల కళ్ళల్లో ఆనందం తాండవించింది. మాటలతో చెప్ప లేని వారు పిల్లల్ని దగ్గరకు తీసుకొని ముద్దు పెట్టుకొన్నారు. కొందరు షేక్ హాండ్ ఇచ్చారు. కృతజ్ఞతలను కొందరు చక్కగా వ్యక్తీక రించారు. ఇంత మంది పువ్వుల్లాంటి, నవ్వుల్లాంటి, దేవుడి ప్రతి రూపాల్లాంటి, పవిత్ర హృదయాల్లాంటి చిన్నారులను చూసి వారందరూ చలించి పోయారు. ఆనంద బాష్పాలు రాల్చారు. మాట పెగలని వాళ్ళు పెదిమలు కదిలించి భావ వ్యక్తీకరణ చేశారు. ఇందరు పిల్ల దేవతల మధ్య హాయిగా, ఆనందంగా మనస్సు పరవశం చెందేట్లు గడిపాము అన్న భావం వారందరిలో స్పష్టంగా దర్శించ గలిగాం. వారికి ఎంత సంతృప్తి కలిగిందో, మాకూ అంతే తృప్తి కల్గింది. వారందరికీ మనో రంజనం కలుగ జేసినందుకు. మాలాంటి వారితో ఆ వృద్ధ నారాయణులు కర స్పర్శ చేసి అభినందించారు. మేమందరం వారి మధ్య గడిపినందుకు ధన్య వాదాలు చెప్పారు. మాతో ఫోటోలు తీయించుకొన్నారు. మరుగున పడిన భావాలన్నీ ఒక్కసారి బహిర్గతమైనాయి మాకూ, వారికీ. మనసు నిండా నవ్వారు, కళ్ళ నిండా చూశారు, మాలా చేయ లేని వారు గుండె నిండా సంతోషాన్ని నింపుకొన్నారు. వారెవరికి మృత్యు భయం లేనట్లనిపించింది. ప్రశాంతంగా దైవ సన్నిధికి చేరుతాము అన్న ధీమా వ్యక్తమయింది. నిరుడు కూడా ఇలానే సాయి సెంటర్

వారు వచ్చి వినోదాన్ని పంచి వెళ్లారట. దాన్ని జ్ఞాపకం చేసుకొన్నారు ఒకరిద్దరు. దీన్ని సక్రమంగా నిర్వహించటంలో సాయి సెంటర్ నిర్వాహకులు సుబ్బరాజ్, సత్య, పవన్, డాక్టర్ సర్వేష్ వగైరాల కృషి ప్రశంసనీయం. ఈ విధంగా వారానికి ఒకసారో రెండుసార్లో వివిధ సంస్థల వాళ్ళు ఇక్కడికి వచ్చి వారికి మనోల్లాసం కల్గిస్తారట.

ఆశ్రమ నిర్వహణ అంటే ఇలా సేవా, అంకిత భావాలతో నిర్వహించాలని ఆదర్శంగా చూపిన caarrington cares వారికి మరోమాటు ధన్య వాదాలు అందజేస్తున్నాను.

(29-04-12, క్యాంపు-అమెరికా)

అమెరికా డైరీ-**9**

## అమెరికాలో అహోబిలం

నిన్న శనివారం, ఈ రోజు ఆదివారం అంటే అయిదు ఆరు తేదీలులు సరదాగా గడిచి పోయాయి. నిన్న అంటే మే అయిదవ తేది శనివారం సాయంత్రం అందరం సౌత్ కెరొలినాలో ట్రూహోమ్స్‌లో ఉంటున్న రాంకీ ఉషా దంపతుల ఇంటికి అందరం కలిసి వెళ్ళాం. ఇక్కడి నుంచి పావు గంట ప్రయాణం. రాంకీ ఉషా ఇద్దరు ఉద్యోగులే. ఇక్కడికి వచ్చినప్పటి నుండి బాగా పరిచయం అయినవాళ్ళు. మంచి వాళ్ళు. అంకుల్, అంటి అని మా ఇద్దర్ని ఆప్యాయంగా పిలుస్తుంటారు. ఏరి కోరి వాస్తు బాగా ఉందని వీళ్ళందరికీ దూరమైనా అక్కడ ఇల్లు కట్టించుకొన్నాడు. మూడంతస్తుల ఇల్లు. మూడు గరాజు. విశేషం ఏమిటంటే వాళ్ళింట్లో ఈ శనివారం భజన నిర్వహించారు. మామూలుగా వచ్చే సుబ్బు సత్యాలు, రాహుల్, మేము డాక్టర్ సర్వేష్ కుటుంబాలు పవన్ కుటుంబం ఇంకా వాళ్ళకు తెలిసిన వారందరూ వచ్చారు. సాయంత్రం ఆరున్నర నుండి ఎనిమిది వరకు భజన బాగా జరిగింది విజ్జి రెండు, శ్రీ కేత్ రెండు భజనలు బాగా పాడారు. డాక్టర్ గారి భార్య, కొడుకు, సౌమ్య, సుబ్బు కూతురు, ఉషా రాంకీ భార్య ఉషా, పిల్లలు అందరు పాడారు. ఆ తరువాత అందరికి మంచి డిన్నర్. పూరీ, రెండు కూరలు, ఆవకాయ, గులాబ్ జాం పులిహోర, పరవాన్నం మామిడి పండ్ల ముక్కలు, పుచ్చ కాయ ముక్కలు, సాంబారు పెరుగు వగైరాలతో విందు భోజనం. నేను దాన్ని "భరద్వాజ విందు" అన్నాను. అందరు మెచ్చారు. దంపతులిద్దరూ చాలా మర్యాదగా అందర్ని కనుక్కొంటు కొసరి వడ్డించి తినిపించారు. మంచి స్నేహ, మర్యాద పూర్వక ఆతిథ్యం.

నిన్న వైశాఖ శుద్ధ చతుర్దశి "శ్రీ నృసింహ జయంతి". అనుకోకుండా నృసింహ జయంతి భోజనం చేశాం. నిన్న చంద్రుడు భూమికి చాలా దగ్గరగా రావటం వల్ల

చంద్ర ప్రకాశం మామూలు కంటే సుమారు పదిహేను శాతం ఎక్కువగా ఉంది. ఇంటికి వచ్చేటప్పుడు ఆ వైభవం చూశాం. "వేయి పడగలు" నవలలో విశ్వనాథ వెన్నెల రేయిని సుమారు నాలుగు పేజీల్లో అత్యద్భుతంగా వర్ణించాడు. దాన్ని పూర్తిగా బట్టీ పట్టాను. కాని ఇప్పుడేమీ జ్ఞాపకం లేదు. అంత గొప్పగా వర్ణించాడు మహాను భావుడు. అది జ్ఞాపకం వచ్చింది. దానితోపాటు ఉయ్యూరులో నరసింహ జయంతి చేసే విధానం ఒకసారి స్మృతిపథంలోకి వచ్చింది. మా మేనమామ గంగయ్య గారింట్లో నరసింహ జయంతినాడు ఇంటిల్లిపాదీ కటిక ఉపవాసం చేసేవారు. ఉదయం నుండి సాయంత్రం వరకు అభిషేకం, నృసింహ స్వామికి సహస్ర నామ పూజ. మామయ్య అతి శ్రద్ధగా చేసేవాడు. మా తాతయ్య నరసింహం గారు కూడా అలానే చేసేవాడు. అంతా మడితో ఉండేవాళ్ళు. పూజ అయిన తర్వాత అంతకు ముందు రోజున ఆహ్వానించిన వారందరికి పానకం, వడపప్పు మామిడి పండు, తాటాకు విసన కఱ్ఱ, తాంబూలంలో పెట్టి ఇచ్చేవారు. వేసవి కాలం కనుక దాహానికి పానకం, విసన కఱ్ఱ తాపోప శమనం. అప్పుడు అందరు వెళ్ళిన తరువాత వండుకొన్న పిండిని అందరు భోజనం చేసేవారు. దానిలోకి వంకాయ పులుసు పచ్చడి, లేక కంది పచ్చడి నంజుకొని, పెరుగు పోసుకొని తినేవారు. అదే భోజనం. మర్నాడు ఊరిలో కొందరిని పిలిచి భోజనం పెట్టేవారు. మేము ఎలాగూ తప్పదుకదా. ఉదయం పద కొండు గంటలకే భోజనాలు. వాళ్ళందరూ నరసింహస్వామి ఉపాసకులు. మంగళగిరి తరచు వెళ్లి వస్తుండేవాడు మామయ్య. అలాగే ఉయ్యూరు పుల్లేరు కాలువ చివర ఉన్న చెరుకుపల్లి శాస్త్రులు గారు అసలు పేరు లక్ష్మీ నరసింహ శాస్త్రులు గారు ముందు రోజే అందరి ఇళ్లకు వెళ్లి నరసింహ జయంతి ప్రసాదం తీసుకోవటానికి రమ్మని పిలిచేవారు. వారు వృద్ధులైతే వారబ్బాయి శ్రీ రామమూర్తి, భార్యా వచ్చి పిలిచేవారు. వారింటిలోను సాయంత్రం దాకా ఉపవాసం, పూజా అభిషేకం జరిగేవి. తర్వాతా అందరికి పానకం వడపప్పు మామిడి పండు విసన కఱ్ఱ, తాంబూలం ఇచ్చేవారు. మర్నాడు దాదాపు ఊరిలోని బ్రాహ్మణులందరికి భోజనం. షడ్రసోపేతంగా పెట్టేవారు. మరీ మరీ వడ్డించేవారు. నృసింహ జయంతి అంటే ఆ రెండు రోజులు, ఆ రెండిళ్ళు మనసులో మెదలక తప్పవు. ఆ అనుభవం ఇక్కడ రాంకీ వాళ్ళ ఇంట్లో దక్కిందని ఆనందించాం. అమెరికాలోని మెక్సికన్లు మే 5ను గొప్ప పండుగగా చేసు కుంటారట. చాలా వైభవంగా నిర్వహించుకొంటారు. బంధు మిత్రులను ఆహ్వానించుకొని విందు చేసుకొంటారట. ఈ విషయం రాంకీ భార్య ఉష తెలియజేసింది. రాంకీ కుటుంబానికి సరస భారతి ప్రచురించిన "శ్రీ హనుమ కథా నిధి", "మా అక్కయ్య కవితా సంపుటి", శృంగేరి వారి పంచాంగం ఇచ్చాం. మేమిద్దరు వచ్చినందుకు చాలా సంబరపడ్డారు.

## షార్లెట్ సాహితీ మైత్రీ బంధం

ఈ రోజు వైశాఖ పూర్ణిమ ఆదివారం. బుద్ధ పౌర్ణమిగా అన్నమాచార్య జయంతిగా జరుపుకొంటాము. ఇవాళ ఉదయం జగదీశ్, లక్ష్మి దంపతుల ఆహ్వానంపై మేము వాళ్ళింటికి వెళ్ళాం. శ్రీ హనుమ కథా సంపుటి వారికి ఇచ్చాను. ఈ రోజు వారింట్లో "అహోబిలమఠంస్వాములు", "తిరు మంజనం" జరిపారు. ఆ పీఠానికి చెందిన ఇక్కడి స్వాములు రాత్రే వాళ్ళింటికి వచ్చి నిద్రించి మూర్తులను తెచ్చి ఉదయం స్నానం, సంధ్యలను మడితో నిర్వహించి శ్రీ కృష్ణుడికి అభిషేకం చేశారు. నలుగురు స్వాములు వచ్చారు. వారంతా ఇక్కడ పెద్ద ఉద్యోగాల్లో ఉన్నవారే. జహోబిల జియ్యర్ మతావలంబులు. అంటే విశిష్టాద్వైత మతావలంబులు. భగవద్రామానుజుల శిష్య పరంపర వారు. అసలు విషయం ఒకటి ఉంది. శ్రీ శంకర జయంతి నాడే శ్రీ రామానుజ జయంతి కూడా. పంచెలను గోచీ పోసుకొని కట్టుకొని ఊర్ధ్వ పుండ్రాలు ధరించి శుచి, శుభ్రంలతో వారే వంట చేసి. ప్రసాదాలనూ చేశారు. ఇంత పద్ధతితో అమెరికాలో అహోబిల స్వాములు అంత నియమనిష్టలతో ఈ కార్యక్రమాన్ని జరిపించటం చాలా ఆశ్చర్యంగా ఉంది. జగదీశ్ కూడా గోచీ పోసిపట్టు బట్టకట్టి నడుముకు అంగోస్త్రం బిగించారు. భార్య లక్ష్మి కూడా తమిళ దేశంలో పెద్ద ముత్తైదువులు కట్టినట్లుగా పట్టుబట్ట కట్టింది. పిల్లలు సాంప్రదాయ వేషధారణలో ఉన్నారు. వచ్చిన పాతిక కుటుంబాలలో ఇరవై కుటుంబాలు తెలుగువారే. అందరు చక్క గా తెలుగు మాట్లాడుతున్నారు. ఆనందం వేసింది ఆడపిల్లలు కూడా కీర్తనలను శ్రావ్యంగా పాడి ముగ్ధుల్ని చేశారు. విష్ణు సహస్ర నామ పారాయణం సామూహికంగా స్త్రీలు చేశారు. స్వాములు లోపల పూజ చేశారు. తెర అడ్డంగా ఉంచారు. ఆ తర్వాత శ్రీకృష్ణ అష్టోత్తర పూజ చేశారు. తిరుప్పావై చదివారు. హారతి ఇచ్చి "పల్లాండు పల్లాండు పలు వావిరి" అన్నది చదివారు. అందరికి తీర్థ ప్రసాదాలు ఇచ్చారు. వెన్నను నైవేద్యం పెట్టి ప్రసాదంగా అందజేశారు. వారు మళ్ళీ తమ దేవుళ్ళను జాగ్రత్తగా వెండిభరిణలలో దాచుకొని అన్నీ సర్దుకొన్న తరవాత అందరికి భోజనాలు వడ్డించారు. దేవుళ్ళను తాకకుండా దగ్గరగా చూసే వీలు, ఫోటోలు తీసే సౌకర్యం కల్పించారు. అందరికి పంక్తిలో వడ్డన చేశారు. అంటే అందరం కిందే కూర్చుని భోజనం చేశాం. అలా సాంప్రదాయాన్ని తు.చ.తప్పకుండా పాటిస్తూ చేసింది అహోబిల మఠానికి సంబంధించిన స్వాములు. అంటే ఆహోబిలాన్ని, అక్కడి వారికి అర్చా, కైంకర్య, అభిషేక పూజా వైభవాన్ని ఇక్కడ నార్త్ కరోలినాలో సంప్రదాయ బద్ధంగా కన్నుల పండువుగా చేసి తరింపజేశారు. జగదీశ్ దంపతులు చాలా భక్తిశ్రద్ధలతో నిర్వహించారు. ఆడవాళ్ళు అందరికి వడ్డించారు. చక్ర పొంగలి, పులిహోర రెండు రకాలు కూరలు, బీన్స్ కూర, దోస కాయ పచ్చడి అన్ని రకాల పండ్ల ముక్కలు, అన్నం, కీరుపాయసం సాంబారు, పెరుగన్నం, వడియాలు పొంగలిలతో

మంచి భోజనం పెట్టారు. అందరు అది మహా ప్రసాదంగా భావించి కళ్ళకద్దుకొని తిన్నారు. అందరిలోను ఒక పవిత్ర లోకంలో విహరించిన అనుభూతి పొందారు. దాదాపు నలభై మంది విందులో పాల్గొన్నారు. అందరికి మర్యాద పూర్వకంగా, గౌరవ పురస్సరంగా లక్ష్మి దంపతులు ఆదరించారు. వీరిద్దరిని మేము వచ్చినప్పటి నుంచి తరచూ కలుస్తూనే ఉన్నాం. నేను కూడా పంచెను గోచీ పోసికట్టి తెల్ల చొక్కా వేసుకొని వెళ్లాను. చాలా మంది కొత్త వాళ్ళు ఇక్కడ పరిచయం అయారు. అందరు ఇంత కలుపుగోలు తనంగా ఆప్యాయంగా కలిసి మాట్లాడుకోవటం భోజనాలు చేయటం గొప్ప అనుభూతినిచ్చింది. దేశం కాని దేశంలో భాషా భేదాలను విడిచి సోదర భావంతో అందరు చేరటం అభిలషనీయ విషయం. పీఠం వారు నెలాఖరుకు ఇంకోచోట ఇంకో రాష్ట్రంలో కార్యక్రమం నిర్వహిస్తారాట. ఇలా అమెరికా అంతా పర్యటించి ప్రజల వద్దకు తమ ఇష్టదైవాన్ని తీసుకొని వచ్చి తరింపజేసే కార్యక్రమాన్ని చేస్తున్నారు. అందుకే అహోబిలం వారు చేస్తున్న ఈ కార్యక్రమం “అహో! ఓహో!” అన్నట్లుంది. వచ్చిన ముత్తైదువులందరికి జాకెట్ పళ్ళు చేతినిండా ఇచ్చి పంపారు. మా ఇద్దరికీ నమస్కారం చేయాలని భావించి కుర్చీల్లో కూర్చోబెట్టి లక్ష్మి, జగదీశ్ దంపతులు నమస్కరించి అక్షింతలు వేయించుకొన్నారు. పిల్లలతో కూడా చేయించి మాతో గ్రూప్ ఫోటో తీయించుకొన్నారు మమ్మల్ని అమ్మా నాన్నల్లాగా గౌరవించటం వారి సంస్కారం.

ఇంటికి వస్తుంటే దారిలో ఒక పొలంలో “పిక్ యువర్ స్ట్రా బెర్రీస్” అనే బోర్డు ఉంది. మేమందరం ఆ పొలంలో దిగి ఆ తాజా పండిన పళ్ళను కోసుకొని డబ్బు ఇచ్చి తెచ్చుకొన్నాం. పిల్లలు ముఖ్యంగా పీయుష్ పండిన పండ్లను కోయటంలో దిట్ట అని పించాడు. నాకు చెప్పి, పండిన వాటినీ కోయించాడు. మొత్తం మీద వీకెండ్ బాగా గడిచింది. రాంకీ ఇంట్లోను, జగదీశ్ వాళ్ళ ఇంట్లో విందులతో అహోబిల సందర్శనతోనూ.

(6-5-12)

అమెరికా డైరీ- **10**

## వేడుకల వారం

అమెరికా వచ్చి మండలం రోజులు అంటే నలభై రోజులయింది. కిందటి వారంకన్నా ఈ వారం సందడిగా గడిచింది. వేడుకలతో నిండింది. పదమూడవ తేదీ ఆదివారం ఉయ్యూరులో శ్రీ హనుమజ్జయంతి మూడు రోజుల కార్యక్రమం మా శ్రీ సువర్చలాన్జనేయ స్వామి (హనుమజ్జయంతి 13,14,15 జరిగిన విశేషాలు) ఆలయంలో ఉదయం అభిషేకంతో ప్రారంభమైంది. గంధ సిందూరం పూజ. మధ్యాహ్నం పన్నెండుకు

సరసభారతి ఆధ్వర్యంలో "ఆదిత్య హృదయం" పుస్తకావిష్కరణ జరిగింది (ఆదిత్య హృదయం– ఆవిష్కరణ). రాత్రి చిన్న పిల్లలు నృత్య ప్రదర్శన చేశారు. మర్నాడు సోమవారం ఉదయం మామిడి పండ్లతో (హనుమజ్జయంతి –మామిడి ఫల –పూజ దర్శనం) పూజ. చాలా ఖరీదుగా ఉన్నా, ప్రతి సంవత్సరంలానే జరిగింది. రాత్రి మళ్ళీ నృత్య ప్రదర్శన. పదిహేనవ తేదీ మంగళ వారం శ్రీ హనుమజ్జయంతి. ఉదయం ఆరు నుండి తమల పాకులతో పూజ నాన్ స్టాప్‌గా పదింటి వరకు. పదిన్నరకు శ్రీ సువర్చలాన్జనేయ స్వాముల శాంతి కళ్యాణం. మేము అక్కడ లేకపోయినా మా అబ్బాయి రమణ దగ్గర ఉండి అన్ని కార్యక్రమాలు చేసి, వాళ్ళిద్దరూ దంపతులు పీటల మీద కూర్చుని కళ్యాణం జరిపించారు. ఆ రాత్రి కే.సి.పి.కాలనీ మహిళా మండలి వారు శ్రీ హనుమాన్ చాలీసా నలభైసార్లు చేశారు. న్యూస్ పేపర్ కవరేజ్ బాగానే వచ్చింది. **దినపత్రికలలో వచ్చిన హనుమత్జయంతి వార్తలు**

ఇక్కడ హనుమజ్జయంతి నాడు నేను సహస్ర నామ పూజ చేశాను. నేను వెంట తెచ్చుకొన్న "కళ్యాణం చేయించే పుస్తకం"తో యదావిధిగా అన్ని మంత్రాలతో తంత్రం లేకుండా కళ్యాణం చేశాను. మా దేవాలయంలోని సువర్చలాన్జనేయ స్వాముల ఫోటోలు ఇక్కడ మా అమ్మాయి వాళ్ళింట్లో ఉన్నాయి. విష్వక్సేన పూజ, పుణ్యాః వాచనం, నవగ్రహ, అష్ట దిక్పాలక పూజ కన్యావరణం, మధు పర్కం, ప్రవర, మహా సంకల్పం, చూర్నికా, లగ్నాష్టకాలు అన్నీ యధావిధిగా చదివి కళ్యాణ అక్షింతలు అందరికి వేశాను. కొబ్బరికాయ కొట్టాం. పంపర పనస, మామిడి పళ్ళు ఆపిల్స్ నైవేద్యం. విజ్జి ఉదయమే స్నానం చేసి అప్పాలు, పులిహోర చేసింది. వాటినీ నైవేద్యం పెట్టాను. ఇలా అమెరికాలోను చక్కగా కళ్యాణం జరిపినట్లే.

మా అమ్మాయి విజ్జి, మా మనవడు చదివే స్కూల్‌లో వాడి వార్షిక పరీక్షలకు అయిదు రోజులు ఉదయమే ఏడింటికే వెళ్ళింది సోమ నుంచి శుక్ర వరకు. పేరెంట్స్‌ను ఇక్కడ వాలంటరీగా ఇన్విజిలేషన్ చేస్తారు. పరిక్షలు చాలా స్ట్రిక్ట్‌గా జరుగు తాయట. ఒకే పుస్తకంలో మూడు రోజుల ప్రశ్నాపత్రాలు ఉన్నా ఎవరూ రేపటి పరీక్ష ఆపేర్‌లో ఏమి ఉన్నాయో చూడక పోవటం ఇక్కడి విశేషం అని చెప్పింది. అన్నీ ఆబ్జెక్టివ్ ప్రశ్నలే. ముందు రాసేసినా, చివరివాడు రాసే వరకు ఎవ్వరు కదల రాదట. వాడు రాయ లేకపొతే మళ్ళీ టైం పెంచుతారట. అందరు రాయటం అయిపోతేనే బయటికి వెళ్లటం వాలంటరీకి రెండు రోజులు ట్రైనింగ్ ఇస్తారు. వార్షిక పరీక్షలను "ఎండ్ ఆఫ్ గ్రేడ్" అంటారు.

బుధవారం ఒక బీహారీ వాళ్ళ ఇంట్లో భజనకు వెళ్ళాం. ఇరవై మంది ఉన్నారు. స్వీటు అరటి పండు అందరికి ఇచ్చారు. విజ్జి, మా మనవడు శ్రీకేత్ కూడా పాడారు.

మర్నాడు గురువారం పవన్ అనే మా బంధువుల అబ్బాయి ఇంటి దగ్గర సునీత అనే వాళ్ళ ఇంట్లో భజన. ముప్పై మంది హాజరు. రెండు స్వీట్లు, పులిహోర ప్రసాదం. శనివారం లైబ్రరికి నేను మనవడు పీయూష్ వెళ్లి పుస్తాలు ఇచ్చి నేను ఇరవై ఒక్క పుస్తకాలు తెచ్చుకొన్నాను. కిందటి వారంలో చివర చదివిన ముస్సోలిని–సామ్రాజ్యం చాలా బాగుంది. ఇన్స్పైరింగ్. దాని మీద పన్నెండు పేజీల నోట్స్ రాసుకొన్నాను. అలానే హౌస్ ఆఫ్ లింకన్ కూడా బాగున్నాయి. మిగిలినవి బొమ్మల పుస్తకాలే. తెచ్చిన వాటిలో నిన్నా, ఇవాళ షార్ప్, అనేది అలాన్ టూనర్ పుస్తకాలు చదివేశాను.

## షష్టిపూర్తి –శ్రీ వెంకటేశ్వర కళ్యాణం

నిన్న అంటే పందొమ్మిదవ తేది శనివారం సాయంత్రం ఇండెపెండెన్స్ రోడ్‌లో ఉన్న "హిందూ సెంటర్" అనే శ్రీ వెంకటేశ్వర దేవాలయానికి అనీతా, కిరణ్ అనే వారు పిలువగా వెళ్ళాం. ఇదే మొదలు దేవాలయ దర్శనం చేయటం ఇక్కడ. అనీతా వాళ్ళ నాన్న గారికి షష్ఠి పూర్తి జరిపారు ఆ దేవాలయంలో. అందుకని వాళ్ల అమ్మా, నాన్న పీటల మీద కూర్చుని శ్రీ వెంకటేశ్వర కళ్యాణం చేశారు. సాయంత్రం అయిదున్నరకు ప్రారంభమై, రాత్రి ఏడున్నరకు పూర్తయ్యింది. వాళ్ళు పిలుచుకొన్నవారందరూ వచ్చారు. అనీతా వాళ్ళు హైదరాబాద్‌కు చెందిన తెలుగువాళ్ళు. పూజారులు కల్యాణాన్ని బానే చేయించారు. అన్నీ యధావిధిగా. కాని తలంబ్రాలు పోయించలేదు ఎందుకనో. పరవాన్నం రవ్వ కేసరి, పులిహోర ప్రసాదాలు. అక్కడ అందరు దేవుళ్ళు ఉన్నారు. అంటే కాంప్లెక్స్. మాతోను కన్యాదానం ఇప్పించారు. వెంకటేశ్వర కళ్యాణంలో కన్యాదానం చెయ్యటం ఇదే మొదలు. ఆ తర్వాత ప్రక్కనున్న విశాలమైన హాల్‌లో డిన్నర్ ఏర్పాటు చేశారు అనీత కిరణ్‌లు. రసగుల్లా, మిరపకాయ బజ్జి, వడ, పప్పు, చపాతి రెండు కూరలు వంకాయ కూర అప్పడాలు చట్నీ, సాంబారు పెరుగుతో భోజనం బాగా ఉంది. అంతా వాళ్ళే తయారు చేసి తెచ్చారు. హాలు చాలా అందంగా ఉంది అందులోని డోమ్ లైట్లు అద్భుతం. షష్టిపూర్తి దంపతులు కళ్యాణం అవగానే మా ఇద్దరికీ సాష్టాంగ నమస్కారం చేసి ఆశీస్సులు పొంది అక్షంతలు వేయించుకొన్నారు. ఆ తర్వాతా అనీతా వాళ్ళ నాన్న గారితో కేక్ కట్ చేయించి అందరికి పంచారు. అంతా అయ్యేసరికి రాత్రి పది అయింది. అప్పుడు బయల్దేరి ఇంటికి పదిన్నరకు చేరాం.

## వైశాఖ వన భోజనం

ఇవాళ ఆదివారం నాడు విజ్జి అవధాని గార్లు మూడు కుటుంబాలను మధ్యాహ్నం భోజనానికి పిలిచారు. ఒకటి రాంకీ ఉషా కుటుంబం, రెండు బెల్లంకొండ రవి ఉషా కుటుంబం, మూడోది పవన్ వాళ్ళ కుటుంబం. పిల్లా జెల్ల కలిపి ఇరవై మంది. పవన్

అత్తగారు మామగారూ కూడా వచ్చారు. బి.రవికి, పవన్‌కు మన శ్రీ హనుమ కథానిది పుస్తకాలు ఇచ్చాను. టమేట పప్పు, కాబేజీ కూర, బంగాళా దుంప కూర, వడియాలు ఆవకాయ, చారు, పెరుగు, పుచ్చకాయ ముక్కలు పనస తొనలు అందరు కమ్మగా తిన్నారు. అందరు బయట చెట్ల కింద పట్టాల మీద ప్రకృతిలో కూర్చుని హాయిగా భోజనం చేశారు. ఉసిరి గింజలు మొలిచి మొక్కలు వస్తున్నాయి. కనుక దీన్ని వైశాఖ వన భోజనం అన్నాం. అన్నీ విజ్జే చేసింది. ఈ కుటుంబాలన్నీ చాలా మంచి కుటుంబాలు. సంస్కారం ఉన్నవి. స్నేహ పాత్రమైనవి.

ముత్తేవి రవీంద్రనాద గారు వారానికోసారి ఫోన్ చేసి మాట్లాడుతున్నారు. మధుసూదనరావు గారు రెండుసార్లు మాట్లాడారు ఆయనే ఫోన్ చేసి. మెయిల్ పెడితే మొన్న ఫోన్ చేశారు గోపాలకృష్ణ గారు. ఇలా ఈ వారం అంతా వేడుకల వారంగా గడిచింది. ఇవాళ మధ్యాహ్నం పాత "లవ కుశ" సినిమా జెమినిలో చూశాం. కళ్ళకు, మనసుకు ఎంతో రిలీఫ్ ఇచ్చింది. రామరాజ్యం చూసిన దోషం పోయిందని ఊరట కలిగింది. అందులో కుశుడు వేసిన నాగరాజు రామోజీ స్టుడియోలో రెండేళ్ళ క్రితం "వరుడు" సినీ షూటింగ్‌లో కలిశాడు. అరవై ఏళ్ళు వచ్చాయి. పలకరిస్తే చక్కగా మాట్లాడాడు. ఒకటి రెండుసార్లు ఫోన్ చేసి మాట్లాడాడు. అప్పుడప్పుడు ఉయ్యూరు వస్తూ ఉంటానని చెప్పాడు. ఊరగాయ కావాలంటే మా అమ్మాయి మాగాయ ఇచ్చింది. చాలా బాగుందని హైదరాబాద్‌లో షూటింగ్‌లో ఉండగా ఫోన్ చేశాడు. మా మనవడు హర్షవరుడులో అల్లు అర్జున్‌కు తోడి పెళ్లి కొడుకుగా నటించాడు. మేమందరం కూడా అందులో పాల్గొన్నాం. ఎక్కడో వెతుక్కుంటే కనిపించవచ్చు. సినిమా అటకెక్కింది పాపం. ఇప్పుడే మేనల్లుడు శాస్త్రి కాలి ఫోర్నియా నుంచి ఫోన్ చేసి మాట్లాడాడు. తప్పకుండా వారానికి రెండుసార్లైనా మాట్లాడుతుంటాడు. ఆంధ్రలో ఎండలు మండుతున్నాయట. "సూర్య భగ భగవానుడు"గా ఉన్నాడని ఈనాడు రాసింది. ప్రకాశం జిల్లాలో యాభైకి వచ్చి జనం అల్లల్లాడి పోతున్నారట. ఇవాళ కాలిఫోర్నియాలో సంపూర్ణ చంద్ర గ్రహణం అనీ ఇప్పుడే మొదలైందని మేనల్లుడు చెప్పాడు. ఇవీ ఈ వారం విశేషాలు. ఫోటోలు తర్వాత పెడతాము.

(20-5-12-కాంప్-అమెరికా)

అమెరికా డైరీ- **11**

## సంస్కృతి అంటే?

సంస్కృతి అనేది మానవ జీవితాలకు మాత్రమే సంబంధించింది. అది ఉండబట్టే మనల్ని మానవులు అంటున్నారు. లేకుంటే జంతువులతో సమానమే. సంస్కృతి

అంటే సభ్యతా, సంస్కారం అని అనుకొంటాం. ఇతరుల పట్ల మర్యాదా, మన్ననా, గౌరవం చూపటమే ఈ రెండు పదాలకు అర్థం. అవి లేకపోయినా, చూపకపోయినా, సంస్కృతీ విహీనులుగా భావింపబడటం లోక రివాజు. సంస్కృతిపై మంచి అవగాహన కలిగి ఉండాలి. సామాజికంగా ఐక్యతా ఉండాలి. ఈ రెండు ఉంటే దేశ ఐక్యత సాధ్యం. సమాజంలో ఉన్న వ్యక్తుల మధ్య సంబంధాల వల్ల కలిగేది సంస్కృతి. దీనికోసం నిరంతరం చర్చలు జరుగుతూనే ఉంటాయి. ఈ చర్చల మొత్తం సారాంశమే సంస్కృతి. నాగరకత నుంచి వచ్చేది విద్య. ప్రతి జాతికి, దేశానికి సంబంధించిన సంస్కృతి ఉంటుంది.

సంస్కృతిని అనేకులు అనేక రకాలుగా నిర్వచించటానికి ప్రయత్నించారు. అంత తేలికగా నిర్వచింపబడని పదం. "ఎవరైతే తన ప్రవర్తనలో నాగరకత చూపిస్తారో, వారు సంస్కతి ఉన్న వ్యక్తులు అంటారు. ఇంకొంచెం ఆలోచిస్తే "ఒక నియమిత సమాజంలో ప్రజల జీవన విధానాన్ని సంస్కృతి" అనవచ్చు. రాతి కాలం నుండి నేటివరకు మనిషి సుఖంగా, ఆనందంగా ఉండటానికి, సంతృప్తి గల జీవనాన్ని ఇచ్చేదీ సంస్కృతి.. చట్టానికి లోబడి, మానవ ప్రశాంత జీవనానికి, సామాజిక ప్రవర్తనకు, పొందిన జ్ఞానంతో, పెరిగే విలువలు, ప్రమాణాలతో జీవనం సాగించటమే సంస్కృతి. సంస్కృతితో పాటు, నాగరకత పదమూ అవినాభావ సంబంధం కలిగి ఉంది. ఒక్కోసారి ఒకదాని కొకటి కలిపి వాడుతూ ఉంటాం. నాగరకత అనేది సంస్కృతికి ఉన్న బాహ్యా రూపం. అంటే-మనం ఉపయోగించే వస్తువులు, యంత్రాలు వగైరా. ఆంతరికమైనది సంస్కృతీ. నాగరకత శరీరం అయితే, సంస్కృతి ఆత్మ. నాగరకత అనేది సంస్కృతిలోని భౌతిక పార్శ్వం..లేదా భౌతిక సంస్కృతి. సామాజిక జీవన వ్యవస్థలు, కట్టుబాట్లు, ఆచారాలు, విలువలు, కళలు, సాహిత్యం, సంగీతం, సమాజంలోని వ్యక్తుల పరస్పర చర్యలు, సంబంధాలలో పొందే అభివృద్ధి వీటన్నిటిని కలిపి "అభౌతిక సంస్కృతి" అంటారు. ఈ పార్శ్వాన్నే విస్తృతార్థంలో సంస్కృతి అంటాం. అంటే సంస్కృతికి, భౌతిక, అభౌతిక పార్శ్వాలున్నట్లుగా తెలుస్తోంది. మనుష్యులు దేన్నీ కలిగి ఉన్నారో అది నాగరకత అని, మనుష్యులు అంటే ఏమిటో చెప్పేది సంస్కృతి అని "మకైవార్" అనే విశ్లేషకుడు సూక్ష్మంగా చెప్పాడు. భౌతిక సంస్కృతి తేలికగా మారిపోతుంది. అభౌతికం అంత తేలిగ్గా మారదు.

## సంస్కృతి లక్షణాలేమిటి?

ఏయే లక్షణాలు ఉంటే సంస్కృతి అనాలి? సమాజంలోని వ్యక్తుల ప్రవర్తనా ఫలితంగా ఏర్పడిందే సంస్కృతి. అంటే సంస్కృతి సమాజ ఫలితంగా ఏర్పడుతుంది. సంస్కృతి మానవ నిర్మితమైనదే. అందుకే మనిషి, అతను చేసే పనులే సంస్కృతి

అన్నారు. కొత్తతరం వారికి అవసరమైనవన్నీ అందించేది సంస్కృతి. సంస్కృతి పరిణామశీలం కలిగి ఉంటుంది. సమాజ అవసరాలను బట్టి మారుతుంది. సంస్కృతి అభ్యాసనం వల్ల అంటే నేర్చుకోవటం వల్ల ఏర్పడుతుంది. భాషా, కళలు మొదలైనవి నేర్చుకొంటేనే వస్తాయి. తనకు అవసరమైన హోదా, గౌరవం, తిండి,బట్టలు పొంది సంతృప్తినిస్తుంది. అందుకే సంతృప్తిదాయక మైనదిగా సంస్కృతిని భావిస్తారు. భిన్న సంస్కృతుల మధ్య ఆదాన ప్రదానాలుంటాయి. అనుకరణ అనేది ఆదరణలకు నిలయమై పంచుకొబడేదిగా ఉంటుంది. నిరంతరం మారుతూ ఉండటం దాని లక్షణం. ఆలోచన, భావం అనేవి దాని లక్షణాలే కనుక సంస్కృతి మారుతూ, గతిశీలంగా ఉంటుంది. సంస్కృతి విస్తృతంగా పెరిగిపోతే, విడి పోవటమూ జరుగుతుంది. ఒకే విధమైన సంస్కృతి ఉన్న వేర్వేరు వ్యక్తుల మధ్య పరస్పర సంబంధాన్ని సంస్కృతి ఏర్పరుస్తుంది. అందుకని సంస్కృతి భిన్నమైనా, సమగ్రంగా ఉంటుంది. సంస్కృతి సమాజంలోని పరివార్తన, సామాజిక ప్రమాణాలను, నియంత్రిస్తుంది. కనుక వ్యక్తులు విలువలను ఆచరణలో పెట్టాలి.

సంస్కృతికి పునాది కుటుంబం. ఆర్థికస్థితి, ప్రభుత్వం, విద్య, మతం అనే సంస్థలే. ప్రతి వ్యక్తిపైనా అధికారం, అనుమతుల ప్రభావం ఎక్కువగా ఉంటుంది. ఎవరి సంస్కృతి వాళ్లకు గొప్పే. ఇతర సంస్కృతుల్ని కూడా ఆదరించే ఉదారభావం అలవడాలి. "సంస్కృతీ బహుళత్వం" అనే భావన ఈ రోజు విశ్వ వ్యాపితంగా ఉంది. తరాల మధ్య వ్యత్యాసం ఏర్పడుతుంది. కొన్ని అంశాలలో అభివృద్ధి బానే ఉంటే, కొన్నిటి విషయాలలో నెమ్మదిగా ఉంటుంది. దీన్నే "సంస్కృతిక విలంబన" (కల్చరల్ లాగ్) అన్నారు విశ్లేషకులు. భిన్న సంస్కృతులున్న సమాజాలు కాని, వ్యక్తులు కాని తారసపడ్డప్పుడు కలిగే ఫలితం, ప్రభావం "సాంస్కృతిక విఘాతం" అంటారు. ఒత్తిడి వల్ల ఒకరి భావాలపై వేరొకరి భావం పడి ఘర్షణ కలుగుతుంది.

హెర్బర్ట్ స్పెన్సర్ "సంస్కృతి భౌతికము కాదు, అభౌతికము కాదు. ఈ రెంటికీ భిన్నమైన అర్థాన్నిస్తుంది" అన్నాడు. కనుక సంస్కృతి "సూపర్ ఆర్గానిక్" లక్షణం కలదని భావిస్తున్నారు. సంస్కృతి ఆదర్శ ప్రాయమైనదే. "విసరణ (డిఫ్యూజన్) ద్వారా అది చొచ్చుకొని పోతుంది. అందుకే ఈ బాధ భరించలేక "అనుభవాల ప్రోగు" అని సంస్కృతిని నిర్వచించారు. ప్రస్తుతం ఉన్న విజ్ఞానాన్ని, భవిష్యత్తుకు ఉపయోగ పడటాన్ని "కల్పన" అన్నారు. కల్పన పెరిగితే, విజ్ఞానం పెరుగుతుంది. ఆధునీకరణ, సమాజ అవసరాల్లో ఒకటి. ఉన్న విషయాలను కనుక్కోవటం ఆవిష్కరణ. ఖండాలు కనుక్కోవటం మొదలైనవి ఆవిష్కరణలు (డిస్కవరి) అన్నారు. సర్దుబాటు కూడా ఒక భాగమే. రెండు సంస్కృతుల మధ్య ఫలదీకరణం జరిగి సంస్కృతి శక్తిని, జీవనాన్ని నిలబెట్టు కొంటుంది.

ఒక సమూహం నుంచి వేరొక దానికి సాంస్కృతిక అంశాలు వ్యాప్తి చెందటమే సంస్కృతీకరణ. ఒక్కోసారి భిన్న సంస్కృతులు చాలా కాలం కలిసి ఉండటం వల్ల భేదాలు అంతరించి విలీనీ కరణం జరుగుతుంది అని దీనిపై ఆలోచించిన జ్ఞానులు పరిశోధనా పూర్వకంగా తెలియజేశారు.

"ఒక సమాజపు సాంస్కృతిక సాంప్రదాయాలను, అది సంపాదించే ప్రక్రియను సంస్కృతి స్వీకరణంగా వీరు నిర్వచించారు. సంస్కృతిని సక్రమింప జేయటాన్ని , స్వీకరణ లేక "en culturation" అంటారని దీని మీద సాధికారం గల "mary godman" అనే ఆయన చెప్పాడు. ఈ విధానమే భారతీయ సంస్కృతి భిన్నదేశాలకు వ్యాపించటానికి కారణం అయింది అని ఆయన సూటిగా నిష్కర్షగా చెప్పాడు.

(24-5-12-కాంప్-అమెరికా)

## అమెరికా డైరీ- **12**

## మేము ఉంటున్న నార్త్ కెరొలిన

క్రీ.శ.200లో ఇక్కడ ఇటుకలు మట్టిబొమ్మలు తయారు చేసేవారు. వాటిని ఉత్సవాలకు వాడేవారు. క్రీ.శ. 1000లో పురాతన మిసిసిపి సంస్కృతి ఇక్కడికి వచ్చింది. పెద్ద నగరాల నిర్మాణం జరిగింది. వ్యాపారవాణిజ్యాలు బాగా ఉండేవి. ఇక్కడి ఆదిమ జాతులు carolino.angloquian, భాషలు మాట్లాడే చౌనోక్, రోనోక్ మొదలైన జాతులవాళ్ళు. వీరిని మొదటిసారిగా బ్రిటిషర్లు ఎదిరించారు. ఇక్కడికి వచ్చిన మొదటి యురోపియన్లలో ఇంగ్లీష్‌వారే ప్రధములు. 1580లో సర వాల్టర్ రాలీ ఇక్కడ రెండు సెటిల్మెంట్లు ఏర్పాటు చేశాడు. తరువాత వాళ్ల కాలనీలు ఏమయ్యాయో మిస్టరీ. 1640లో వర్జీనియా నుంచి ఆంగ్లేయులు ఇక్కడికి వలస వచ్చారు. 1663 బ్రిటన్ రాజు ఇక్కడ కారోలీనా కాలనీ ఏర్పాటుకు అంగీకరించాడు.

పద్దెనిమిదవ శతాబ్దానికి ప్రాతినిధ్య ప్రభుత్వాలు ఏర్పడ్డాయి. 1765లో బ్రిటిష్‌వాళ్ల అధిక పన్నులకు, పార్లమెంట్‌లో ప్రాతినిధ్యం లేక పోవటానికి నిరసన ప్రారంభమైంది. అమెరికా విప్లవంలో ఇది దేశభక్తి ప్రాంతం అయింది. దీని ఫలితంగా బ్రిటన్ నుంచి స్వాతంత్రం పొందే అవకాశం ఇక్కడి డెలిగేట్లకు లభించింది. కాని బ్రిటీషు వారి భక్తులు కొందరు దాన్ని అమలు కాకుండా అడ్డుపుల్ల వేశారు.

19వ శతాబ్దం ప్రారంభంలో ఇది రూరల్ స్టేట్‌గా ఉంది. సిటీలు లేవు. కొన్ని పల్లెలు మాత్రమే ఉన్నాయి. బానిసల సాయంతో పత్తి బాగా పండించే వారు. పత్తికి అనువైన భూమి ఎక్కువ ఉంది. ప్రజాస్వామ్య భావాలు మొదటి నుంచి ఎక్కువగా ఉన్న రాష్ట్రం. బానిసలపై కూడా దయాదాక్షిణ్యం చూపించేవారు. దక్షణాది వారు

యునియన్ నుంచి విడిపోదామని ప్రయత్నిస్తే వీళ్ళు అంతగా సహకరించలేదు. ఇక్కడి ఎన్నికల్లో తూర్పు ప్రాంతం డెమోక్రాట్లకు, పడమటి ప్రాంతం విగ్గులకు తీవ్ర పోటీ ఉండేది. 1861 ఏప్రిల్‌లో ఫోర్ట్ సెంటర్‌లో కాల్పులు జరిగాయి. యూనియన్ నుంచి నార్త్ కెరొలిన విడిపోయింది. కాన్ఫెడరేషన్‌లో చేరింది. అమెరికన్ సివిల్ వార్‌లో వేర్పాటు వాదులకు మద్దతు నిచ్చిందీ రాష్ట్రం. రి కన్స్ట్రక్షన్ కాలంలో బానిస విమోచన జరిగింది. 1950–60 మధ్య జరిగిన సివిల్ రైట్స్ ఉద్యమంలో ఈ రాష్ట్రానికి పెద్ద పాత్ర ఉంది. "సిట్ ఇన్ ప్రొటెస్ట్"ను గ్రీన్ బరో సిటీలో నిర్వహించాడు మార్టిన్ లూథర్ కింగ్. ఇది ఉద్యమ కేంద్రమే అయింది. "student non violent co-ordination committee" ఇక్కడే అంటే రాలీలో "sha university"లో ఏర్పడింది. 1973లో రాలీ మేయర్‌గా క్లారంస్ లైటనేర్ అనే ఆఫ్రికన్ అమెరికన్ ఎన్నికైనాడు. నార్త్ కరోలీన రాజధాని రాలీ. పెద్ద నగరం మాత్రం షార్లేట్. ఇక్కడ అపలేచియన్ పర్వతాలున్నాయి. తీరప్రాంతాలు, పంట భూములు ఉన్నాయి. పొగాకు పంటలో అమెరికాలో మొదటి స్థానం. అలాగే చిలగడ దుంప కూడా అత్యధికంగా పండుతు నంబర్ వన్ స్థానం పొందింది. క్రిస్మస్ ట్రీలు అంటే ఫైన్ చెట్లకు రెండో స్థానం. కుకుంబర్ అంటే దోస పంటకు మూడో స్థానం. స్ట్రా బెర్రి, ప్రత్తి పంటకు నాలుగో స్థానం. సోయా బీన్స్, మొక్క జొన్న, గోధుమ, వేరుసెనగ, బ్లూ బెర్రిస్, బంగాళా దుంప, టమేటో మొదలైన పంటలు పండే రాష్ట్రం.

కోళ్ళు, టర్కీలు, పందుల పెంపకం ఎక్కువ. బ్రాయిలర్ కోళ్ళకు మొదటి స్థానం. అలాగే ఆపిల్స్‌కు కూడా. పీచులు, పశు పెంపకం హాగ్ పెంపకము ఎక్కువే.

వస్త్ర పరిశ్రమ, సిగరెట్లు, టొబాకోలకు నంబర్ వన్. పందుల పెంపకంలో రెండో స్థానం. సింథటిక్ ఫైబర్, ఫార్మస్యూటి కల్స్‌కు ఇది కేంద్రం. కంప్యుటర్, ఎలక్ట్రానిక్ వస్తువులు, కమ్యునికేషన్ సామగ్రి ఉత్పత్తికి జాతీయంగా మూడో స్థానంలో నార్త్ కెరొలినా ఉంది.

నార్త్ కెరొలినాలో గ్రానైట్ గనులు అపారంగా ఉన్నాయి. సున్నపు రాయి నిక్షేపాలు అధికమే. ఫాస్ఫాల్టిక్ రాక్, లిథియం గనులున్నాయి. మైకో, మార్బుల్‌లకు కేంద్రమైంది.

బ్లుక్రాబ్స్, ష్రిమ్ప్ చేపలకు ప్రసిద్ధి, ఆక్వా కల్చర్ ఉంది. కాట్ ఫిష్ ఇక్కడి ప్రత్యేకత." నార్త్ కెరొలినాకు "the tar hill stat", "turpentine state" అని మారు పేర్లున్నాయి.

### charlotte (షార్లేట్)

అమెరికాలో ఛ ను షా గా పలకటం ఫాషన్. చికాగోను షికాగో అంటారు.

చార్లేట్‌ను షార్లేట్ అంటారు. ఇది ఈ రాష్ట్రంలో పెద్ద సిటి. మెక్లీన్ బర్గ్ కౌంటి దీని దగ్గరే ఉంది. పదిహేడవ పెద్ద నగరం. న్యూయార్క్ తర్వాత ఇక్కడే బాంకింగ్ ఎక్కువగా జరుపుతుంది. మూడు ప్రధాన బ్యాంకులకు కేంద్రం షార్లేట్. charles macklien burgh అనే బ్రిటీష రాజు మూడవ జార్జి భార్య పేరు మీద ఈ సిటి ఎర్పడింది. అమెరికన్ రివల్యుషనరి వార్‌కు కేంద్రంగా నిలిచింది. జనరల్ కారన్ వాలీస్‌ను తరిమి కొట్టిన ప్రాంతం. hornest nest అని దీనికి నిక్ నేం. తూర్పున catawba, ఆగ్నేయంలో లేక్ నార్మన్ సరస్సు ఉన్నాయి. ఇది మానవ నిర్మిత అతి పెద్ద మంచినీటి సరస్సు.

షార్లేట్ డెమొక్రాటిక్ పార్టీకి మెజారిటీ అభిమానం ఉన్న సిటి. ఇంతవరకు యే ప్రెసిడెంట్ ఎన్నికలకు అభ్యర్ధిని నిర్ణయించే సమావేశం ఇక్కడ జరగలేదు. ఈ సంవత్సరం సెప్టెంబర్‌లో డెమొక్రాటిక్ అభ్యర్ధిని ప్రకటించే పెద్ద సదస్సు షార్లేట్‌లో జరుగ బోతోంది. చరిత్రను సృష్టిస్తుంది.

(24-5-12.కాంప్-అమెరికా)

## అమెరికా డైరీ-**13**

## విహార యాత్రా వారం

కిందటి వారం మొదట్లో అంతా కొంచెం నీరసంగా గడిచినా, చివర్లో ఊపు అందుకోంది. లైబ్రరిలో తెచ్చిన వాటిలో పదకొండు పుస్తకాలు చదివాను. దాదాపు అన్నీ బాగున్నాయి. వాటిలో కొన్నిటిపై ఆర్టికల్స్ రాశాను కూడా. అమెరికాలోని రీజియన్ మూడులో ఉన్న సాయి సర్వీస్ సెంటర్లు అన్నీ కలిసి ఇక్కడికి సుమారు నూట ఇరవై మైళ్ళ దూరంలో ఉన్న అప్పలేచియాన్ పర్వతాల సమీపంలో బ్లూ రిడ్జ్ మౌంటైన్ అనే చోట y.m.c.a.హాల్‌లో ఈ నెల 26, 28 మద్య మూడు రోజులు “retreat” కార్య క్రమాన్ని ఏర్పాటు చేశారు. దానిలో విహారయాత్ర లాగా మేమందరం పాల్గొన్నాం. ఆ విశేషాలు-

### ఏర్పాట్లు

మూడు రోజులు ఉండాలి కనుక, వాళ్ళు పెట్టేది అమెరికన్ బ్రేక్ ఫాస్ట్, లంచ్, డిన్నర్ కనుక మేము తిన గలమో లేమోనని మా అమ్మాయి విజ్జి ముందు జాగ్రత్తపడి మా కోసం మూడు కూరలు, రెండు పచ్చళ్ళు, పెరుగు ముందే రెడీ చేసింది. అక్కడికి సుమారు మూడు వందల మంది వస్తారని అంచనా. వీరికి అక్కడ శనివారం, ఆదివారం, సోమవారం ఉదయం టిఫిన్ మాత్రమే అక్కడవాళ్ళు పేడతారట.. అందుకని షార్లేట్‌లోని సాయి సెంటర్ వాళ్ళు వాలంటరీగా కొన్ని కుటుంబాలను కొంత తినటానికి ఏదైనా

తయారు చేయమని చెప్పారు. మా అమ్మాయి అంతమందికి రెండు పచ్చళ్ళు తయారు చేసింది. ఒకటి టమేటా పచ్చడి, రెండోది దోస ఆవకాయ. పెరుగు పులిహోర, పెరుగన్నం కూడా తీసుకొని వెళ్ళింది. శుక్రవారం రాత్రికే అంటే ఇరవై అయిదు రాత్రికే చేరేవారికి, సోమవారం లంచ్ చేసేవారికి ఈ ఏర్పాట్లు. మా కుటుంబానికి వేరే అన్నం వగైరా. ఇవన్నీ మూడు రోజుల నుంచి తయారుచేసి రెడి చేసింది. ఇంకో ఆవిడ చపాతీలు ఇందరికి. కొందరు పళ్ళు, కొందరు పేపర్ ప్లేట్లు కప్పులు, కాఫీ పొడి టీ పొడి ఇలా ఎవరికి వీలైంది వాళ్ళు స్వచ్ఛందంగా తీసుకొని వెళ్లారు. ఇక్కడ డబ్బు వసూలు చేయరు. ఇలానే యే కార్యక్రమం అయినా నిర్వహించటం వీరి ప్రత్యేకత. పిల్లలకు బిస్కట్లు, పాలు యోగట్లు జ్యూసులు కాన్డీలు షరా మామూలే.

## అపలేశియన్ పర్వత పాదాల చెంత

అపలేచియన్ పర్వతాలు 480 మిలియన్ల సంవత్సరాల నాడు ఏర్పడినట్లు భావిస్తారు. అమెరికా తూర్పు. పడమర భాగాలను ఇవి వేరు చేస్తాయి. సుమారు నాలుగు వందల కిలోమీటర్లు వ్యాపించాయి. కెనడా వరకు ఉన్నాయి. నార్త్ కేరోలీనాలోని మౌంట్ మిచెల్ శిఖరం వీటిలో పెద్దది. దీని ఎత్తు 6,684 అడుగులు. దీనిపై ఫైన్, హార్డ్ వుడ్ అడవులు దట్టంగా ఉన్నాయి. 1528లో నార్వేజ్ అనే అతని నాయకటంలో ఒక బృందం పరిశోధనకు వచ్చింది. వీరికి ఇప్పటి ఫ్లోరిడాలోని తల్లా హాస్సీ అనే చోట ఒక నేటివ్ అమెరికన్ గ్రామం కనిపించింది. వాళ్ళు తమ రికార్డులో దాన్ని "అపలేచియన్" గ్రామం అని రాసుకొన్నారు. అప్పటి నుంచి ఆ పేరుతో ఈ పర్వతాలు పిలువ బడుతున్నాయి. స్పానిష్ వాళ్ళు దీన్ని "అపలేచి" అన్నారు. "అలిఘని పర్వతాలనీ" వీటిని పిలుస్తారు.

మేము శుక్రవారం సాయంత్రం నాలుగింటికి కార్‌లో బయల్దేరాం. వీకెండ్ కనుక బాగా ట్రాఫిక్ ఉంది. బాల్ రిడ్జ్ చేరే సరికి రాత్రి ఏడున్నర అయింది. మాకు మంచి రూమే ఇచ్చారు. రెండు మంచాలున్నది. వెంటనే డిన్నర్ మన వాళ్ళు తయారు చేసింది. పులిహోర, పెరుగన్నం అరటి ఆపిల్ పళ్ళు పెట్టారు. కడుపు నిండా తిన్నాం. అప్పటికే సగంపైగా జనం వచ్చారు. రాత్రి పన్నెండు వరకు వస్తూనే ఉన్నారు. వీరందరికీ బాడ్జీలు ఒక్కో రూంకు నాలుగు తాళం చెవులు, జరిగే కార్యక్రమాల వివరాల కాగితం కవర్‌లో పెట్టి ఇచ్చారు. ఆ రాత్రి పనేమీ లేదు. కొత్తచోటు కనుక నిద్ర పట్టలేదు. మర్నాడు ఉదయం నుంచి కార్య క్రమాలు మొదలు.

26 శనివారం ఉదయం అయిదున్నర గంటల నుంచి, సోమవారం ఉదయం పది గంటల వరకు వివిధ కార్యక్రమాలు. మూడు రోజులు ఉదయమే ప్రభాత భేరి. అందరు లేచి కార్యక్రమాలకు తయారవటం. అయిదున్నర నుండి వేద పనసలు

చదువుతూ నగర సంకీర్తన. ఆరున్నరకు భజన. ఏడు గంటలకు బ్రేక్ ఫాస్ట్. ఎనిమిదిన్నర నుండి ఉపన్యాసాలు మధ్యాహ్నం పన్నెండు వరకు. ఆ తర్వాత గంట లంచ్ బ్రేక్. మధ్యలో కాఫీలు. మధ్యాహ్నం రెండు నుంచి అయిదు వరకు వివిధ వర్క్ షాపులు. ఐదున్నరకు భజన సాయంత్రం ఆరునుంచి ఏడు వరకు డిన్నర్. ఏడున్నరకు ప్రత్యేక కార్యక్రమం. ఇదీ షెడ్యూలు.

శనివారం బ్రేక్ ఫాస్ట్‌కు వెళ్ళాం. ఆకులు అలమలు కోడిగుడ్డు అట్టు వగైరాలున్నాయి. మేము యోగట్, సీరియల్స్ తిని కాఫీ కలుపుకొని త్రాగాం. ప్రభావతి సభలకు రాలేనంది. మేము వెళ్ళాం. ఈ సమావేశం ముఖ్య ఉద్దేశ్యం "సామరస్యం". ఇది వ్యక్తిలో, కుటుంబంలో సమాజంలో ఎలా సాధించాలి అన్నదానిపై ప్రసంగాలు వ్యక్తిలో సామరస్యం విషయంపై ఫ్లోరిడాలో ఉండే "జ్ఞాన భాస్కర్ తెనాలి" ప్రసంగించారు. పోతన పద్యాలు, వేదం భగవద్గీతల నుండి ఉదాహరిస్తూ మాట్లాడారు. తర్వాత రీట మరియు భర్త రాబర్ట్ బ్రూస్ గార్లు కుటుంబంలో హార్మని గురించి ప్రసంగించారు. వీరిద్దరూ సాయిబాబా శిష్యులై ప్రపంచ దేశాలన్నీ తిరిగి ప్రచారం చేస్తున్నారట. ఆ తర్వాత ట్రినిడాడ్‌కు చెందినా ఫైజ్ మొహమ్మద్ చక్కని ఉపన్యాసం సమాజంలో సామరస్యంపై చేశారు. నాకు ఆయన ప్రసంగం బాగా నచ్చింది.

మధ్యాహ్న భోజనాల తరువాత మూడు చోట్ల వర్క్‌షాప్‌లు జరిగాయి. ఎవరికి వీలున్నచోట వారు పాల్గొనవచ్చు. నేను సుందర అయ్యర్ మాట్లాడిన యోగా క్లాసుకి, గమేజ్ అనే ఆయన మాట్లాడిన కోపం జయించటం ఎలా అనేదానికి వెళ్లాను. తెనాలి గారు "రుద్రం" పాడి అందరితో అనిపించి అర్థం చెప్పారు. భజనను ఇతర ప్రాంతాల నుండి వచ్చినవాళ్ళు చేశారు. డిన్నర్ తర్వాత ఆరుబయట చెట్లకింద కొయ్య బెంచీలు ఏర్పాటు ఉన్నచోట "bon fire" అంటే భోగి లేక చలిమంట ఏర్పాటు చేశారు. దానికి ముందు సుందరయ్యర్ పుట్టపర్తిలో తన అనుభవాలను చెప్పారు. "శంకరాచార్యవారు రచించిన "శివోహం శివోహం" ఆ శ్లోకాలను చాలా బాగా పాడి అర్థం చెప్పారు. దీనికి హార్మని మృదంగ సహకారం కూడా ఉంది. ఒక గంట ప్రసంగం తర్వాత కట్టెలు కాల్చి భోగిమంట వేశారు. అందరు పిల్లా జెల్లా సరదాగా చూశారు. రాత్రి తొమ్మిదింటికి రూంకు చేరాం. రావటానికి, పోవటానికి నడవలేని వారికి కారులు ఏర్పాటు చేశారు. రాత్రి మా భోజనం రూంలోనే మేము వండుకొన్న పదార్థాలతోనే తృప్తిగా తిన్నాం. మధ్యాహ్నం లంచ్ కూడా మేము తినేట్లు లేదు. మధ్యాహ్న భోజనమూ మాదే. ఇలా మొదటిరోజు జరిగింది.

రెండోరోజు ఆదివారం సభలలో "inter faith" మీద ప్రసంగాలు. క్రిస్టియానిటి కి పాస్టర్ స్టీల్ ట్రినిడా నుంచి, హిందూ మతానికి తెనాలిగారు ముస్లిం మతానికి

ఫైజ్ గారు ప్రతినిధులుగా మాట్లాడారు. ఫైజ్ గారి ప్రసంగమే అన్నిటా బాగుంది. అంతకుముందు రీటా దంపతులు సత్యసాయి సేవా కార్యక్రమాల గురించి ప్రసంగించారు. రీటా గారు చీర కట్టుకొని వచ్చారు. మతాల మీద మాట్లాడినప్పుడు కన్వీనర్ అక్షిత్ వారిని కొన్ని ప్రశ్నలు అడిగి వాటికి సమాధానాలు రాబట్టారు. అవి ఒకటి రెండు వాక్యాలలో మీ మతం ఏమి చెప్పింది చెప్పమని, మతాన్ని మీరేవిధంగా పాటిస్తారు. మీ మతంలో ఉన్న దోషాలేమిటి. జననం, మరణం, పునర్జననంల విషయంలో మీ మతంలో ఉన్న గొప్ప దోషం లేక ఇతరులకు కనిపించే దోషం ఏమిటి మొదలైన ప్రశ్నలకు ముగ్గురు సమాధానాలు బానే చెప్పారు. అందరికంటే ఫైజ్ గారి వివరణలు చాలా సూటిగా, సూక్ష్మంగా ఉన్నాయి మనసుకు పట్టాయి. ఆయన జీహాద్ గురించి చక్కగా నిర్వచించారు. జీహాద్ అంటే అంతశ్శత్రువులను అంతం చెయ్యమని తప్ప బయటి వారిని హతమార్చమని కాదని ఒకాయన పుర్రెకు పుట్టిన బుద్ధితో తమ మతం అప్రతిష్ట పాలైందని చెప్పారు. అందరు చప్పట్లు చరిచారు. అందుకనే అది అవగానే ఆయన దగ్గరకు వెళ్లి "ఇవాల్టి ముగ్గురిలో మీరే హీరో" అని చెప్పి అభినందించి, ఫోటో తీయించుకున్నాను. పాస్టర్ గారు హిందూ మతంలో కులాల సమస్యను ఎత్తితే ఒక ప్రేక్షకుడు దానిపై సమాధానం చెప్పమని తెనాలి గారిని కోరితే ఆయన మంచి వివరణే చేశారు. నయనారులు తక్కువ జాతి వారైనా వారిని అందరు గౌరవిస్తున్నారని పూజ చేస్తున్నారు అనీ చెప్పారు. వారేమి చెప్పారు అని ముఖ్యం కాని వారి కులానికి ప్రాధాన్యత లేదని వివరించారు. అప్పుడు నేను లేచి తెనాలిని సమర్థిస్తూ "ఉపనిషత్తులను రాసింది ఎక్కువ భాగం బ్రాహ్మణేతరులేనని అవి మనకు శిరోదార్యాలని" చెప్పాను. ఔనని తెనాలి తల పంకించారు.

మధ్యాహ్న భోజనం కూడా రూంలోనే మా భోజనమే చేశాం. మధ్యాహ్నం రీజినల్ ప్రెసిడెంట్ల సమావేశం, వచ్చే సంవత్సరానికి ప్రణాళిక మాట్లాడుకొన్నారు. ఫైజ్ గారి వర్క షాప్. అయ్యర్ గారి దానికి వెళ్లి కాసేపు కూర్చున్నాం. సాయంత్రం ఐదున్నరకు పవన్ మమల్నిద్దర్ని కార్ట్ మీద చుట్టు పక్కల అంతా తిప్పాడు. ఆరింటికి డిన్నర్ మా రూంలోనే మేము తెచ్చుకొన్నది విజ్జి వండిన రైస్ కుక్కర్ భోజనం చేశాం. రాత్రి ఏడున్నరకు షార్లేట్ సాయి సెంటర్‌కు చెందిన చిన్న పిల్లలు ఒక నాటిక వేశారు. మా మనవళ్ళు శ్రీకేత్ అశుతోష్, పీయూష్‌లు కూడా వేషాలు కట్టారు. అందులో సారాంశం సాయిబాబా తెలిపిన విశ్వప్రేమ. పిల్లలు బానే నటించారు. ఇదే హైలైట్ అని అందరు అన్నారు. అ తర్వాత గ్రీన్స్ బోరోలోని యువకులు సాయిబాబా ప్రేరణ విశ్వజనీనతపై మంచి నాటకం వేశారు. దీన్ని రికార్డు చేసి నటించారు. బాగుంది. ఇది అయేసరికి దాదాపు తొమ్మిదిన్నర అయింది. పదింటికి మా అల్లుడు షార్లేట్

నుంచి మమ్మల్ని తీసుకొని వెళ్ళటానికి వచ్చాడు. పదిన్నరకు రాత్రి బయల్దేరి అర్ధరాత్రి పన్నెండున్నరకు రెండు గంటల్లో ఇంటికి చేరి పడుకొన్నాం. మర్నాడు కార్యక్రమానికి డుమ్మా.

పది రాష్ట్రాల నుంచి ఇరవై సెంటర్ల నుంచి మూడు వందల యాభై మంది రిట్రీట్ కార్యక్రమంలో పాల్గొన్నారు. అందరు ఉత్సాహంగా వున్నారు. అన్ని మతాల, భాషల వాళ్ళు వచ్చారు. సాయిబాబా మీద అంతటి విశ్వాసం వాళ్లకు ఉండటం చాలా ఆశ్చర్యం వేస్తుంది. సర్వీస్, ప్రేమ అనేవే వీరందరికీ ప్రేరణ. ఈ కార్యక్రమాన్ని తన భుజస్కందాల మీద వేసుకొని సమయపాలనతో చాలా అద్భుతంగా నిర్వహించినవారు మన తెలుగువారే అయిన సత్తి రాజు సర్వేష్ అనే ప్రముఖ వైద్యుడు. ఈ విధంగా ఈ వారం విహార యాత్రావారంగా తమాషాగా గడిచిపోయింది.

మే ఇరవై ఎనిమిది అమెరికాలో మృతవీరుల సంస్మరణ దినోత్సవం. దీన్ని కూడా రిట్రీట్‌లో ప్రసంగించిన వారంతా ఈ దేశ, ఇతర దేశ మృతవీరులకు నివాళులు అర్పించి సంప్రదాయాన్ని కాపాడారు. దీన్ని ఇక్కడ "మెమోరియల్ డే" అంటారు. ప్రభుత్వ సెలవు దినం కూడా. దీంతో కలుపుకొని శని ఆదివారాలతో మూడు సెలవులు. కనుక వీళ్ళు లాంగ్ వీకెండ్ అంటారు. ఇక్కడ కూర్చుని చూస్తే పర్వత సౌందర్యం నాయనానందకరంగా కనిపించింది. విశాలమైన మోదళ్ళు కల వృక్షాలు చాలా ఎత్తులో ఉన్నవి కనిపించాయి. చాల కొత్త మిషన్లు ఇక్కడ ఉన్నాయి. ఇళ్లకు పనికి వచ్చే కలప అంతా ఈ ప్రాంతం నుండే వస్తుందేమో. ఇక్కడ వందేళ్ళ క్రితం కట్టిన y.m.c.a. భవనం చెక్కు చెదరకుండా అందంగా ఉంది. దీన్ని ప్రభుత్వం నేషనల్ మాన్యుమెంట్‌గా రక్షిస్తోంది. ఇక్కడ ఉన్న వరండాలో కుర్చీలలో కూర్చుని అపలేశియన్ పర్వత సౌందర్యాన్ని అందరు దర్శిస్తారు.

ఈవారంలో చదివిన పదకొండు పుస్తకాలు chinook nation, destruction of books, mightier thaan svord, the lost world of troy, naat turner, the spark, funny things in the white house, tolkeen, alaan turing, man is not alone, and re --readings

(28 -5-12.-కాంప్ అమెరికా)

అమెరికా డైరీ-**14**

## విజిల్ విజార్డ్ వీక్

ఈ వారం మొదట్లో కొంత నీరసంగానే గడిచింది. కాని ఆదివారం మాత్రం

## షార్లెట్ సాహితీ మైత్రీ బంధం

సంగీత పుష్కరిణీ స్నానం చేసి పవిత్రులమయ్యాం. ఆ విశేషాలు తర్వాత రాస్తాను. ఈ వారంలో లైబ్రరి నుండి తెచ్చిన వాటిల్లో కిందటి వారం చదవగా మిగిలినవి చదివేశాను. అందులో కన్ఫ్యూషియస్, బీఉల్ఫ్, యేన్సేంట్ గ్రీక్స్, ది కమింగ్ అనార్థి పుస్తకాలు అద్భుతం. మిగిలినవి తిరగేశానంతే. మంగళ వారం రాత్రి సుబ్బు ఇంట్లో భజనకు వెళ్ళాం. అంతే. శనివారం నేను, నా మనవడు పీయుష్ లైబ్రరికి వెళ్లి 21 పుస్తకాలు తిరిగి ఇచ్చేసి 22 పుస్తకాలు తెచ్చుకొన్నాను. అందులో వెంటనే జిం బౌయీ, జానే ఎయిర్ పుస్తకాలు రెండు చదివేశాను. మా పక్క ఇంటి ఆవిడ గాయత్రి "ఆంధ్ర యోగులు" అనే బిరుదరాజు రామరాజు గారు రాసిన పుస్తకం ఒకటి, మూడో భాగాలు ఇచ్చింది. మొదటి భాగం చదివేశాను. అందులో ముగ్గురు మహానుభావుల గురించి "సిద్ధ యోగి పుంగవులు" శీర్షికతో సరసభారతికి నెట్‌లో రాశాను. నేను "విహంగ" అనే నెట్ మాగజైన్‌కు రాసిన "ఆడదై పుట్టటమే ఆమె నేరం" అన్న వ్యాసాన్ని రాసిన వారంలోనే జూన్ సంచికలో ప్రచురించారు. మద్య యుగ గ్రీకు మహిళ, బీ ఉల్ఫ్, అలెక్షాండ్రియా లైబ్రరి, కన్ఫుషియాస్, సిల్వియాపాత్. కాతేరిన్ మాన్స్ ఫీల్డ్ అనే రచయిత్రులపై నోట్స్ రాసుకోన్నాను. వాటిని వ్యాస రూపంలో తరువాత రాయాలి. ఇలా శనివారం వరకు గడిచిపోయిది. ఆదివారం మాత్రం "ఫోర్ ఇన్ వన్"గా మహదానందంగా గడిచిపోయింది. ఆ విశేషాలే "విజిల్ విజార్డ్ వీక్".

### గళ మురళి-శివ ప్రసాద్

మూడవ తేది ఆదివారం ఉదయం పది గంటలకు ఇక్కడి సత్యసాయి సెంటర్ వాళ్ళు సెంటర్‌లో ఈల పాట శివప్రసాద్ గారిని ఆహ్వానించి కచ్చేరి చేయించారు. దానికి అందరం వెళ్ళాం. ఆయన దాదాపు 11000 ఈల పాట కచేరీలు చేసి రికార్డు సృష్టించిన మహా సంగీత విద్వాంసుడు. కృష్ణాజిల్లా పామర్రు దగ్గర గుడివాడ రోడ్డులో ఉన్న కొమరవోలు వారి అసలు ఊరు. అక్కడ గాంధీ ఆశ్రమం కూడా ఉండేది. సెకండరి గ్రేడ్ ట్రైనింగ్ స్కూల్ కూడా ఉండేది. నేను హెడ్ మాస్టర్‌గా పని చేసిన అడ్డాడ ప్రక్క గ్రామమే అది. అక్కడి నుంచి వీరి పూర్వీకులు బాపట్ల చేరి అక్కడే నివాసం ఉన్నారు. కనుక కొమరవోలుతో ఈయన కేమీ సంబంధం లేదు. హైదరాబాద్ రవీంద్ర భారతిలో దాదాపు ఇరవై ఆరు ఏళ్లు ఉద్యోగం చేసి స్వచ్ఛందంగా పదవీ విరమణ చేసి సంగీతానికే జీవితాన్ని అంకితం చేస్తున్నారు. గొప్ప సంస్కారం ఉన్నవారు. సత్య సాయిబాబా సమక్షంలో ఈల కచ్చేరి చేసి ఆయనకు దగ్గరై, ఆయన ఆశీర్వచనం, ఆదేశంపై ప్రపంచ దేశాలన్నీ పర్యటిస్తున్నారు. సేవ, ప్రేమలను ప్రచారం చేస్తూ సాయి సెంటర్లను దర్శించి భజనలను ఈల పాటతో చేసి ఆనందం కలిగిస్తున్నారు. సత్యసాయి వీరికి రెండుసార్లు బంగారు గొలుసు బహుమతిగా ఇచ్చారు. దాదాపు

రెండు గంటల సేపు భజన సంగీతాన్ని వినిపించి ముగ్ధులను చేశారు. అమెరికా రావటం ఇది అయిదవసారి. సత్యసాయితో తన పరిచయాన్ని వివరించారు. కంచి, శృంగేరి జియ్యర్ దత్తస్వామి సమక్షంలో కచేరీలు చేశారు. బాల మురళికృష్ణ ఆయన్ను శిష్యునిగా స్వీకరించి పెద్దలకు పరిచయం చేసి ఆయన ఉన్నతికి తోడ్పడినారని ఎంతో కృతజ్ఞతా భావంగా చెప్పారు. సత్యసాయితో పరిచయం తర్వాతే తనకు పేరు ప్రఖ్యాతి ఆర్థిక వెసులుబాటు బాగా కలిగాయని చెప్పారు. బాబా మీద 123 దేశాలలోని భక్తులకు అచంచల విశ్వాసం ఉండటం తాను ప్రత్యక్షంగా చూసి ఆశ్చర్యపోతునానని అన్నారు. రష్యా దేశంలో రెండు వందల మంది రష్యన్లు భజనలో పాల్గొనటం వింత అన్నారు. దీనికి కారణం ఆయన ప్రవచించిన సేవా, ప్రేమ అనిపిస్తున్నాయని అన్నారు. సెంటర్ వారు నన్ను ఆహ్వానించి నాతో శివప్రసాద్ గారికి సత్కారం చేయించి శాలువా కప్పించారు. అ గౌరవం నాకు ఇవ్వటం నాకు ఎంతో త్రిల్ అనిపించింది. ఇప్పటికి మూడు ఆల్బమ్స్ సత్యసాయి భజనల్ మీద ఇచ్చానని చెప్పారు. నాలుగో దానికి స్పాన్సర్ చేస్తామని ఇక్కడి జగదీశ్ లక్ష్మి దంపతులు వాగ్దానం చేశారు. దానికి మూడు వేల డాలర్లు అవుతుందట. అంటే సుమారు రెండు లక్షల రూపాయలు. వారికి సాయి మీద ఎంత నమ్మకమో అర్ధమయింది. మా అమ్మాయి పనస తొనలు, రాంకీ ఉషల పులిహోర అందరికి పెట్టారు.

## తెలుగు అసోసియేషన్ ఆఫ్ గ్రేటర్ షార్లేట్ యేరియా

ఈ రోజున షార్లేట్‌లోని తెలుగువారంతా ఒక పార్క్‌లో పిక్నిక్ ఏర్పాటు చేసుకొన్నారు. దానికి మేమూ వెళ్ళాం. పిల్లలు ఆడుకోవటానికి చిన్న గేమ్స్, పెద్దలు వాలీబాల్ ఆడారు. మేము సెంటర్ నుంచి సరాసరి ఇక్కడికి వచ్చాం. అప్పటికే దాదాపు అందరి భోజనాలు అయిపోయాయి. నాగమణి, గాయత్రి సహాయం చేస్తున్నారు. మేమందరం భోజనాలు చేశాం. పులిహోర, పెరుగన్నం, అన్నం సాంబారు, చట్నీ వెజిటబుల్ బిర్యాని, పుచ్చ ముక్కలు, ఐస్క్రీం, కోలా పెట్టారు. ఒక అరగంట అక్కడ ఉన్నాము. వాళ్ల జెనరల్ బాడీ మీటింగ్ జరుగుతోంది. వాళ్ల కార్యవర్గంలో ఉన్న జ్యోతి అనే అమ్మాయి సరసభారతి వ్యాసాలూ చదువుతుండటం వల్ల నా ఫోటో చూసి నన్ను గుర్తు పట్టింది. ఆమె, పవన్ భార్య రాధా పిల్లలకు ఆదివారాల్లో తెలుగు నేర్పుతున్నారిక్కడ. అక్కడి నుంచి బయల్దేరి మూడింటికి ఇంటికి చేరాం.

## ఈల లీలా లోల – గళ వంశీ – విజిల్ వజీర్ సుల్తాన్

ఇక్కడి హిందూ సెంటర్ వాళ్ళు, సాయి సెంటర్ వాళ్ల ఆధ్వర్యంలో వెంకటేశ్వర ఆలయంకు అనుసంధానంగా ఉన్న "గాంధీ భవన"లో శివప్రసాద్ గారి కచేరి ఏర్పాటు చేశారు. మేము నాలుగున్నరకు అక్కడికి చేరుకొన్నాం. ఐదున్నరకు కచేరి ప్రారంభమైంది.

చుట్టు ప్రక్కల ఉన్న కళాకారులు ప్రక్క వాయిద్యాలు వాయించారు. మంజునాద అనే ఇక్కడి ఆయన మృదంగం, ఒకామె హార్మని, ఒకాయన తబల, ఒకాయన ఫిడేల్ లతో సహకరించారు. శివప్రసాద్ "వాతాపి గణపతిం భజేతో ప్రారంభించి, త్యాగరాజు గారి ఎందరో మహానుభావులు ఆ తర్వాత పురందర దాస, అన్నమాచార్య కీర్తనలలు మొదలైనవే కాక, రాగ ప్రస్తారమూ చేసి ఆనంద పారవశత్వం కల్గించారు. ఎంతో అలవోకగా పాడటం అద్భుతం అనిపించింది. నాన్‌స్టాప్‌గా పాడటం మరీ అబ్బుర పరచింది. గమకాలు చమక్కులు వివిధ స్థాయీభేదాలు స్పష్టత, వేగం అంకితభావంతో అసలు జనాలకు బాహ్య స్పృహే లేకుండా చేశారు. గంధర్వ లోకాలలో విహరింప జేశారు. వాద్య సహకారమూ వన్నె తెచ్చింది. రస గంగా ప్రవాహంలో తడిసి ముద్ద అయ్యాం అందరం. చివరికి రెండు భజనలు పాడారు. గాంధీ భవనంలో జరుగుతున్నందున గాంధిగారికి ఇష్టమైన "వైష్ణవ జనతో" పాడి రక్తి కట్టించారు. శివప్రసాద్‌ను హిందూ సెంటర్ వారు శాలువతో జ్ఞాపికతో సత్కరించారు. ఆయన కృతజ్ఞత చెప్పారు. కచేరి ప్రారంభానికి ముందు నేను "సత్య"తో శివప్రసాద్‌కు ఒక బిరుదు ఇద్దాం అని సూచన చేశాను. "మీరు ఏది సూచిస్తే అది ఇద్దాం" అన్నాడు సత్య. సరే నన్ను వేదిక మీదికి సత్య ఆహ్వానించాడు.

నేను ముందు తెలుగులో, ఆ తర్వాత దాన్నే ఇంగ్లీషలో చెప్పాను "శివప్రసాద్ గారికి ముందే ఆంధ్రదేశంలో ఈల పాటకు గొప్ప ప్రచారం తెచ్చి లిజేండ్‌గా నిలిచిన మహానుభావుడన్నాడు. ఆయనే కె.రఘు రామయ్య. పౌరాణిక నాటకాలలో నారద, శ్రీ కృష్ణ, బిల్వమంగలుడు వంటి వేషాలు వేసి సినిమాలలోను నారద, శ్రీ కృష్ణ పాత్రలను పోషించిన నటుడాయన. ఆ కంఠ స్వర గంగా ఝరీ ప్రవాహం. ఆయన ఈల పాట బాగా పాడేవాడు. ఆయన్ను "ఈల పాట రఘు రామయ్య" అనేవారు. ఈల పాటకు స్టేజి మీద పాడే అర్హత తెచ్చి, దానికి ఒక హోదా, గౌరవం తెచ్చిన మహాగాయకుడు రఘు రామయ్య. ముందు ఆయన్ను స్మరించాలి. ఈతరం వారికి తెలియని గాయకుడు. ఆ తర్వాత ఎవరు దాని జోలికి పోయింది లేదు. మళ్ళీ శివప్రసాద్ గారు దాన్ని సాధన చేసి ఈల పాటకు ఉన్న గౌరవాన్ని అంతర్జాతీయ స్థాయికి తీసుకువెళ్లి తెలుగువాడి కీర్తిని అంతర్జాతీయంగా ప్రతిష్ఠించి లెజెండ్ అయ్యారు మళ్ళీ. ఆయన రఘు రాముడు–ఈయన శివుడు. ఇద్దరికీ అభేదమే. వీరు మరింత ఉన్నతి సాధించాలని కోరుకుంటున్నాను. ఇక్కడి షార్లేట్ ప్రజల తరఫున శివప్రసాద్ గారికి తెలుగులో "ఈల లీలా లోల" అనే బిరుదు నిస్తున్నాం. అంతేకాదు, అందరికి అర్థం కావాలని మరో బిరుదు "గళ వంశీ" కూడా ఇస్తున్నాం. వంశీ అంటే మురళి, వేణువు. కృష్ణుడు వంశీ లోలుడు. ఆయనది మోహన వంశీ. శివప్రసాద్ ఈలలో అనేక లీలలు

చూపిస్తూ తన్మయుయులై మనల్ని కూడా తన్మయులను చేస్తున్నారు. అందుకే "ఈలలీలా లోల". మురళీలోల అంటాం కృష్ణుడిని" అని నేను అనగానే జనం చప్పట్లు విపరీతంగా చరిచారు. చాలా బాగా మాట్లాడానని అందరు నన్ను మెచ్చారు. శివప్రసాద్ గారు స్టేజి మీద అభివందనం చేసి, నత మస్తకులైనారు. చాలా ఆనందం వేసింది. ప్రక్కనే ఉన్న బాలాజీ దేవాలయాన్ని దర్శించి ఇంటికి వచ్చే సరికి రాత్రి తొమ్మిదయింది.

## శివప్రసాద్ పరిచయం

రాత్రి మా అమ్మాయి వాళ్ళింటికి శివ ప్రసాద్ గారు భోజనానికి వచ్చారు. వచ్చేసరికే పది అయింది. మా అమ్మాయి విజ్జి, నాగమణి సుబ్బు భార్య సీత కలిసి చపాతీలు, వంకాయ కూరా చేశారు. సాంబారు, టమేటా చట్నీ, ఆవకాయ, పెరుగుతో భోజనం పెట్టారు. ఆయన నేను కలిసి తిన్నాం. నాగమణి భర్త గారు కూడా ఇక్కడే హోజనం చేశారు. ఆ తర్వాత సుబ్బు వాళ్ళు వచ్చి భోజనం చేశారు. భోజనం అయిన తర్వాత మేడ పైకి తీసుకొనివెళ్లి కాసేపు ఆయనతో మాట్లాడాను. చాలా విషయాలు చెప్పారు. అవన్నీ తెలియజేస్తున్నాను.

సత్యప్రసాద్ గారు వారి బాబాయి నుండి ప్రేరణ పొందారు. చిన్నప్పటి నుంచి ఈల వేయటం అలవాటు. గంటల తరబడి పాడేవారు. అందరు ఆనందించే వారు. తర్వాత కర్నాటక, హిందుస్తాని శాస్త్రీయ సంగీతాలలో ప్రావీణ్యం సంపాదించారు. అమెరికా, ఆస్ట్రేలియా, జపాన్, బ్రిటన్, మారిషస్, సింగపూర్, మలేషియా, బాంకాక్, బెహ్రాన్, ఖతార్ మొదలైనచోట్ల పర్యటించి ఈల కచేరీలు ఇచ్చారు.

విజిల్ విజార్డ్ అంటే "ఈల మహేంద్రజాల", మానవ మురళి, గళ మురళి, ఆంధ్రా నైటింగేల్, కళా సరస్వతి, ముఖ మురళి, శ్వాస మురళి, ప్రకృతి మురళి, సంగీత కళాసాగర్ వంటి ఎన్నో బిరుదులూ పొందారు. విజిల్ వజీర్ సుల్తాన్ అంటే ఇంకా బాగుంటుందేమో.

త్యాగరాజు, దీక్షితార్, అన్నమయ్యలపై కేసెట్లు సి.డి.లు తెచ్చారు. గత ముప్ఫై ఏళ్లుగా ఈల పాటకు అంకితమై ఉన్నారు. ఇప్పటికి 11000 ప్రదర్శనలిచ్చారు.

2002, 2004 ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఉగాది పురస్కారాలన్నిచ్చింది. అమెరికాలోని కాన్సాస్‌లో జీవన సాఫల్య పురస్కారం పొందారు. 2010లో నట సామ్రాట్ అక్కినేని నాగేశ్వరరావు వీరికి లైఫ్ అచీవ్మెంట్ పురస్కారాన్ని, స్వర్ణ కంకణాన్ని అందించారు. మహతి అవార్డు, రసమయి పురస్కారం అందుకున్నారు. రఘురామయ్య గారు భారత మొదటి ప్రధాని జవహర్లాల్ సమక్షంలో ఈల కచేరి చేస్తే, శివప్రసాద్ ఆయన కుమార్తె ఇందిరా గాంధి ప్రధానిగా ఉన్నప్పుడు ఆమె ఎదుట కచేరి చేశారు. ప్రపంచం మొత్తం మీద ఈ ఈల అనే కళ మన ఆంధ్ర దేశానికి దక్కిన కళ. అవధానం

## షార్లెట్ సాహితీ మైత్రి బంధం

తెలుగు వారికే స్వంతం అయినట్లు, అంతర్జాతీయంగా ఇప్పుడున్న ఈల కళాకారుడు శివ ప్రసాద్ ఒక్కరే. 1988లో పి.వి.నరసింహారావు గారితో మాస్కో ఫెస్టివల్‌కు వెళ్లారు. ఈల మీద మొదటి ఎల్.పి. రికార్డ్ ఇచ్చినందుకు 1991లో లిమ్కా బుక్ ఆఫ్ రికార్డ్స్‌లో స్థానం సంపాదించారు. మారిషస్ దేశంలో వారి 150వ స్వాతంత్ర దినోత్సవంలో పాల్గొనటానికి చంద్రబాబు నాయుడు ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తరపున స్పెషల్ ఆర్టిస్ట్‌గా పంపబడిన అరుదైన కళాకారుడు శివప్రసాద్. అమెరికాలోని బ్రిడ్జి వాటర్‌లోని బాలాజీ దేవాలయ మహా కుంభాభిషేకానికి ఆహ్వానింపబడి కచేరి చేశారు.

ఇప్పటికి పది క్లాసికల్ విజిల్ మ్యూజిక్ ఆడియో సిడిలను ఇచ్చిన ఏకైక వ్యక్తి ఈల కళాకారుడు శివప్రసాద్. శంకరాభరణం, మోహన రాగాలను ఫూజన్ చేసి ఈలలో వినిపించారు. జి.వి.అయ్యర్ దర్శకత్వం చేసి సంస్కృతంలో నిర్మించిన "ఆది శంకరా చార్య" చిత్రానికి బాల మురళీకృష్ణ సంగీత దర్శకత్వం వహించగా, ఆయన శిష్యుడైన శివప్రసాద్ ఈల పాటతో బాక్ గ్రౌండ్ మ్యూజిక్‌నిచ్చి నిండుదనం తెచ్చారు. ఇరవై ఏళ్ళ క్రితం వాగ్గేయకారుడు బాల మురళికృష్ణతో ఏర్పడిన గురు శిష్య సంబంధం అవిచ్చిన్నంగా కొనసాగుతోంది. తనను తీర్చిదిద్దింది బాల మురళేనని గళ మురళి అనే బిరుదు ఆయన ఇచ్చిందేనని పొంగిపోతు చెప్పారు శివప్రసాద్. రేపు శివప్రసాద్ గారికి మా ఇంట్లో విందు. రేపు వారితో లైవ్ రేడియో ప్రోగ్రాం కూడా నిర్వహిస్తున్నాం.

ఇలా ఈ ఆదివారం "ఫోర్ ఇన్ వన్"గా గడిచింది. నాలుగుసార్లు అమెరికా వచ్చినా తెలుగు సంఘంతో కలవటం ఇదే మొదటిసారి.. "ఇదో తుత్తి".

(4-6-12 -కాంప్-అమెరికా)

అమెరికా డైరీ-**15**

## ఈల లీలామృత వర్షిణి వారం

ఈల లీలాలోలుడు, ముఖ వంశీ, గళ మురళి శ్రీ కొమరవోలు శివప్రసాద్ గారు కిందటి వారంలో మొదటి రెండు రోజులు అంటే నాలుగు, అయిదు తేదీలు- సోమ, మంగళ వారాలు షార్లేట్ నగరంలో ఉండి రసజ్ఞులకు ఈలా వినోదాన్ని పంచారు. సోమవారం సాయంత్రం శ్రీ చక్రవర్తి, అనిలా దేవి దంపతుల ఇంట్లో సాయి భజనలో పాల్గొన్నారు. సాయి బృందంలోని సభ్యులు బెల్లంకొండ రవి, ఉషా దమతులు ఇండియా వెళ్లిపోతున్న సందర్భంగా ఆత్మీయ సమావేశం జరిగింది. వారిద్దరికి హృదయభారంతో

వీడ్కోలు చెప్పాము. కేక్ కూడా కట్ చేయించారు. దాదాపు గంటసేపు శివప్రసాద్ తమ ఈల లీలను అన్ని రకాలుగా ప్రదర్శించి, అన్ని రకాల భజన కీర్తనలను పాడి, జనంతో పాడించి భక్తిని రాశీ భూతం చేశారు. ఆయన మిషన్ చాలా అద్భుతంగా పండింది. ఆ తర్వాత విందు ఏర్పరిచారు. నలభై మందికి పైగా హాజరై, ఆసాంతం విని తరించారు. చపాతి కూర, బిర్యాని, సాంబారు, పెరుగన్నం, మామిడి పళ్ళ ముక్కలు, పుచ్చముక్కలు, పరవాన్నంతో విందు అందించారు. ఒక రకంగా రెండు విందులందు కొన్నాం. ఒకటి ఈల విందు, రెండు భోజన విందు. ఆ దంపతుల ఆత్మీయత చాలా బాగా ఆకర్షించింది. అందరు ఒక కుటుంబ సభ్యుల్లా కలిసిపోయారు. రవి వాళ్లకు మన వాళ్ళందరూ గిఫ్ట్ అందజేసి, గ్రూప్ ఫోటో తీయించుకొన్నారు.

మర్నాడు మంగళ వారం మధ్యాహ్నం శివ ప్రసాద్ గారు భోజనానికి మా ఇంటికి వచ్చారు. కారట్ హల్వా, మామిడికాయ పప్పు, వంకాయ కూర, కొబ్బరి చట్నీ, అన్నం, సాంబారు, పెరుగు, ఒడియాలు, ఆవకాయతో విజ్జి భోజనం వడ్డించింది. మేమిద్దరం కలిసి భోజనం చేశాం. ఆయన ఈ వంటా, వాతావరణం చాలా బాగా ఉన్నాయని మెచ్చుకొన్నారు. నాకు వారి సిడిలు రెండు కానుకగా ఇచ్చారు, మా అమ్మాయికి ఒకటి ఇచ్చారు. మధ్యాహ్నం ఒంటి గంట నుండి మూడు గంటల వరకు "టోరి" లైవ్ రేడియో ప్రోగ్రాం చేశారు ఇక్కడే ఉండి. శ్రీమతి నాగమణి గారు చాలా హుందాగా, విశ్వాసంగా నిర్వహించారు. చాలా నిదానంగా తన జీవితాన్ని, చదువు, దీనిలోకి ప్రవేశించిన విధానం, ఎదిగిన పద్ధతి తనకు వెన్నెముకగా నిలిచిన వ్యక్తులు గురించి రెండు గంటలు అనర్గళంగా వివరించి శ్రోతలను ఆకట్టు కొన్నారు. నేను ప్రక్కనే ఉండి, కొన్ని ప్రశ్నలడిగి సమాధానం రాబట్టాను. ఆ రాత్రి మా ఇంట్లో భజన జరిగింది. శివప్రసాద్ గారు "ఆంజనేయ వీర, హను మంత శూరా" అనే కీర్తనతోపాటు ఇంకా కొన్ని పాడి మంచి అనుభూతి కల్గించారు. హిందీలో "చౌదవీకా చాంద్ హో" తెలుగులో "నా హృదయంలో నిదురించే చెలీ", "లాహిరి లాహిరి లాహిరిలో" పాడి వినిపించి ఎక్కడికో తీసుకొని వెళ్లారు. ప్రతి పాటకు చప్పట్లు చరచి అభిమానాన్ని చాటాం. నేను "సరసభారతి" తరఫున "శ్రీ హనుమత్కథా సుధ"ను వారికి అందరి సమక్షంలో కానుకగా ఇచ్చాను. ఇండియా వెళ్లినప్పుడు విజయ వాడ వైపుకు వస్తే తప్పక ఉయ్యూరు రమ్మని కోరాం. తప్పకుండా వస్తామని హామీ ఇచ్చారు. నలభై మంది హాజరైన డిన్నర్‌లో మా అమ్మాయి అల్లుడు మంచి పదార్థాలు వడ్డించారు. నాగమణి, గాయత్రి గార్లు సహాయం చేశారు. హల్వా ఇడ్లి సాంబారు ఉప్మా, ఆవకాయ, అన్నం పెరుగు, పుచ్చముక్కలుతో పసందుగా విందు. అందరు ఆత్మీయంగా వచ్చి ఆనందంగా విని ఆనందించారు. ప్రక్కనున్న అమెరికన్స్ కూడా వచ్చి ఎంజ్జాయ్

చేయటం చాలా గొప్ప విషయం. ఇప్పుడు రేడియోలో శివ ప్రసాద్ గారు చెప్పిన సారాంశం తెలియ జేస్తాను.

## శివ ప్రసాదీయం

తెలుగు వారికే ప్రత్యేకమైన రెండు ప్రక్రియలు ఉన్నాయి. అవి కవిత్వంలో అవధానం చేయటం. రెండు ఈలతో సంగీతాన్ని వినిపించటం. ఈల పాటకు ఆద్యులు స్వర్గీయ కె.రఘురామయ్య గారు. ఆయన పాడిన దానికి శివప్రసాద్ పాడిన దానికి తేడా ఉండి. ఆయన చూపుడు వ్రేలును మడిచి నోటిలో ఉంచి, గాలి పీల్చి వదులుతూ, ఈల వేస్తారు, పద్యం పాడుతారు. ఆ గాలి అయిపోగానే మళ్ళీ పీలుస్తారు. కనుక మధ్యలో విరామం ఉంటుంది. ఆయన ఎక్కువగా పద్యాలే ఈలతో పాడేవారు. అది ఆయన ధోరణి. ఆయన పౌరాణిక నాటకాలు, సిని మాలలో నారదుడు శ్రీ కృష్ణ పాత్రలు ధరించి బాగా ప్రఖ్యాతి పొందారు. ఆయనకు ఈల పాట ఒక హాబీ. కాని శివ ప్రసాద్ గారికి అది జీవన వేదం. ఉచ్వాస, నిస్వాసాలలో రెండిటిలోను వీరు ఈలను పలికిస్తారు. కనుక గాప్ అనేది ఉండదు. ఒక మహా ప్రవాహంగా సాగిపోతుంది. ఆయన ఈల పాట పాడటానికి కొంచెం కష్ట పడి నట్లున్నుంది. వీరి పాట అలవోకగా, సెలయేరులా సాగిపోతుంది. కూర్చుంటే ఎన్ని గంటలైనా అలా పాడేస్తూనే ఉంటారు. విశ్రాంతి అక్కర్లేదు. ఈల వీరికి "శ్వాసావధానం" అనిపిస్తుంది. ఆయన మొదట దాన్ని స్టేజి గౌరవం కల్పిస్తే, ప్రసాద్ గారు అంతర్జాతీయ వేదికను ఈలకు నిర్మించి, అదొక గొప్ప కళగా "ఆర్ట్ ఫాం"గా ప్రచారం చేసి, ఎనలేని కీర్తి తాను పొంది, ఈల కూ సంపాదించారు.

ఈలలో అన్ని స్థాయిల్లోను పాడగల సత్తా శివప్రసాద్ గారిది. యే స్థాయిలోను ఎక్కడా పలకటంలో తేడా రాదు. అన్ని రకాలైన పాటలు, అన్ని భాషల్లో పాడుతున్నారు. ఎవరికి వారు శివప్రసాద్ తమ వాడే అనిపిస్తుంది. అంత బాగా మనస్సుల్ని రంజింప జేస్తారు. బయటకు వెడితే ఎప్పుడు పడితే అప్పుడు పాడటానికి వీలుగా "ట్రాక్" తయారు చేసుకొన్నారు. అది లక్ష రూపాయలకు పైనే ఖర్చు అయింది. అది ఉండటం చాలా హాపీగా పాడటానికి వీలవుతోంది. ఇంత అంతర్జాతీయ కళాకారుడు మామూలు ఇళ్ళల్లో కూర్చుని పాడటం అంటే, ఆయన ఎంత ఉదార హృదయం గలవారో అర్ధం అవుతుంది. ఆయన అతి సాధారణంగా ఉంటారు. వేడి నీరే తాగుతారు. పెరుగు వేసుకోరు. ఆరోగ్య సూత్రాలను బాగా పాటిస్తారు. కళాకారులు వ్యసనాలకు బలై పోవటం తనకు బాధ కలిగిస్తుందని, అలాంటి వారి జీవితాలు తనకు గుణపాఠం అని చెప్పారు.

## బాలమురళి ప్రభావం

తనను బాగా ప్రోత్సహించిన వారు ముగ్గురు సంగీత కళాకారులు అన్నారు. ఒకరు వాగ్గేయకారులు, పద్మవిభూషణ్ శ్రీ మంగళంపల్లి బాల మురళీకృష్ణ గారు. ఈల ఏమిటి? వదిలెయ్యి. అది దేనికీ పనికి రాదు అని నిరుత్సాహపరిచారు మహా మహా విద్వాంసులు. అప్పుడు బాలమురళి ఆదరించి మద్రాస్‌లో తన ఇంట్లో ఉంచుకొని, తన కుమారుడిగా చూసి శాస్త్రీయ సంగీతపు మెళకువలు నేర్పారు. తాను పాడి, ఈయనను అలాగే ఈలతో పలక మని, దగ్గరుండి అమిత వాత్సల్యంతో నేర్పి ఈలకు శాస్త్రీయత కలగటానికి, తన అభివృద్ధికి ఎంతో తోడ్పద్దారని శివప్రసాద్ మురిసిపోతారు. బాలమురళి గారి భార్య అన్నపూర్ణ గారు నిజంగానే అన్నపూర్ణ. రోజు వారింట్లో ఎంతమంది వచ్చి ఆతిధ్యం తీసుకొంటారో లెక్కలేదు. అందరికి వండి వడ్డించే ఇల్లాలు ఆమె అని రెండు చేతులు ఎత్తి నమస్కరించారు. పేరు సార్ధకం చేసుకున్నారామే. మను చరిత్రలో పెద్దన గారు ప్రవరాఖ్యుని ఇల్లాలిని "వండ నలయదు వేవురు వచ్చి రేని, నడికి రేయైన" అన్న పద్యం జ్ఞాపకం వస్తుంది. అంతే కాదు బాల మురళి కుమారులు తనను ఒక సోదరునిగా కుమార్తెలు తమ్మునిగా చూశారని అంటారు. అల్లుళ్ళు, కోడళ్ళు బాలమురళి గారిని "నాన్న గారు" అనే పిలుస్తారట. "మామ గారు" అనరట. అంతటి సంస్కారం వారిది. మామ గార్ని తండ్రిలా భావించటం బాల మురళికి అరుదైన గౌరవం. అంతే కాదు రాత్రి బాలమురళి నిద్రించటానికి ముందు అల్లుళ్ళు ఆయన కాళ్ళను, పాదాలను ఒత్తి భక్తిని ప్రదర్శించటం తనకు ఆశ్చర్యమేసింది అంటారు శివప్రసాద్.

ఎందరెందరో సంగీత విద్వాంసులకు పరిచయం చేసి వారి ద్వారా నేర్చుకో దగింది నేర్పించారట బాలమురళి. తనకు తెలీకుండానే తనతో ఈల పాటల కేసట్టు రికార్డ్ చేయించే పని చేబట్టి ఒక్క రోజుముందు మాత్రమే చెప్పి చేయించారట. అంత ముందు చూపు, ప్లాన్ బాలమురళికి ఉండేదట. తనకు తెలీకుండా రికార్డింగ్ సమయంలో బాలమురళి, తన పాటలకు కంజీర వాయించి మరీ ఆశ్చర్యపరిచారట. మిగిలిన కళాకారుల్లా తాను కింద కూర్చుని, శివప్రసాద్‌ను కుర్చీలో కూచోబెట్టి ఫోటో తీయించుకున్నారట పద్మవిభూషణుడు. అదీ ఆయన గొప్పతనం అన్నారు. బాలమురళి దగ్గరే సంగీతం నేర్చిన అపర బాల మురళి అనిపించుకొన్న డి.వి.మోహనకృష్ణ శివప్రసాద్ గారికి సహాధ్యాయి. తనే సీనియర్ అంటారు ప్రసాద్. మోహన కృష్ణ వివాహం చేయించింది, ఉద్యోగం ఇప్పించిందీ గురువు గారే.

## బిస్మిల్లా ఖాన్, శ్రీనివాసన్ గార్ల ప్రేరణ

ప్రముఖ షహనాయ్ విద్వాంసులు, భారత రత్న బిస్మిల్లా ఖాన్ గారు శివ

ప్రసాద్ గారి ఈల పాట విని ఎంతో మెచ్చుకొని ,ప్రోత్సహించారట. తన శాహనాయినీ ముందుగా ఎవరు ఆదరించలేదని, ఆ తర్వాత దానికి తాను స్టేజి గౌరవాన్ని తెచ్చిన తర్వాతే గుర్తింపు లభించిందని, ఇది మామూలేనని, నిరాశ చెందవద్దని బోధించారు. అలాగే శ్రీనివాసన్ గారు వయోలిన్ వాయిస్తూ శాస్త్రీయ విషయాలను దగ్గర కూర్చోబెట్టుకొని నేర్పి తన ఉత్సాహానికి ఉద్దీపన కల్గించారు. ఈ ముగ్గురు ప్రోత్సహించకపోతే తనకు శాస్త్రీయ సంగీతంలో అవగాహన వచ్చేది కాదని, అది అలవడినందు వల్లే తాను రాణిస్తున్నానని వినయంగా చెప్పారు.

## కోన ప్రభాకర రావు ప్రభావం

తానూ రఘురామయ్య గారు గుంటూరుజిల్లా నుంచి వచ్చిన ఈల కళాకారులం అని గర్వంగా చెప్తారు శివప్రసాద్. తన "మెంటార్" కోన ప్రభాకరరావు గారని చెప్పారు. ఇద్దరిది బాపట్ల. తన తండ్రి, తాత గార్ల దగ్గర ఆయనకు బాగా పరిచయం వారంటే విపరీత మైన గౌరవం కోన గారికి ఉండేవని అందుకే తనను వీలైనచోట్ల కల్లా తీసుకొనివెళ్లి పరిచయం చేసి తనతో ఈల పాట పాడించే వారని. అంతగా ప్రోత్సహించేవారు అరుదు అని ప్రభాకరరావు గారు ఆంధ్రప్రదేశ్ స్పీకర్గా, మహారాష్ట్ర గవర్నర్గా పని చేయటం తనకు మంచి అవకాశాలు రావటానికి తోడ్పడ్డాయని బిస్మిల్లా ఖాన్ గారి వద్ద పాడే అదృష్టం బాల మురళి గారి ముందు పాడే అవకాశం అలానే కల్గాయని అన్నారు. ఆనాటి ప్రధాని ఇందిరా గాంధి గారికి పది నిమిషాలు ఈల పాట వినిపించే పర్మిషన్ కోన గారు పొంది, తనను తోటి సహవాద్యకారులను తీసుకొని వెళ్లారట. ఈల మొదలైంది. ఆమె అన్ని కార్యక్రమాలను వాయిదా వేసుకొంటూ గంటసేపు అలానే కూర్చుండి పోయారట. అది మరపు రాని సంఘటన అన్నారు. ఘన సన్మానం చేసి పంపారట.

ఒకసారి బాపట్లలో ప్రముఖ హరికథకులు, శాస్రీయ సంగీత విద్వాంసులు ములుకుట్ల సదాశివ శాస్త్రి గారి హరికథను రామ నవమి పందిరిలో ఏర్పాటు చేశారట. ఆయన తెనాలి నుండి రావాలి. ట్రైన్ ఒక గంట లేటు. అందుకని తనను ఆయన వచ్చే దాకా ఈల పాట పాడ మన్నారట. అలా "అరంగేట్రం చేశాను" అంటారు శివప్రసాద్. తన కుమారుడు ఫ్లూట్ వాయిస్తాడని మాండలిన్ ఈల కూడా బాగా చేస్తాడని, కుమార్తె సంగీతం బానే నేర్చిందని, తన భార్య సాధారణ గృహిణి అని తెలియజేశారు.

మీరు ఏమి సాధించారు? ఇంకా ఏమైనా సాధించాలని అనుకొంటున్నారా? అని నేను అడిగిన ప్రశ్నలకు సమాధానంగా, ఈలకు శాస్త్రీయ స్థాయి కల్పించే తపన ఉందని, ఈలకు విద్యా కోర్సును ఏర్పరచి యూనివర్సిటి స్థాయిలో ఒక సబ్జెక్ట్గా చేయాలని

ప్రభుత్వంపై ఒత్తిడి తేవాలని అనుకొంటున్నానని చెప్పారు. తనకు సంతృప్తిగా ఉందని, సత్యసాయి బాబా అనుగ్రహం తనను ఎంతో ముందుకు తీసుకొనివెళ్తోందని అందరికి ఈల ద్వారా ఆనందం పంచటం సేవ, ప్రేమలను ప్రపంచం అంతటా చాటి చెప్పటం తన బాధ్యతగా భావించి పని చేస్తున్నానని తెలియజేశారు. నేను శివ ప్రసాద్ గారి కోరిక తీరాలని చెబుతూ వారి ఈల కళను ప్రభుత్వం గుర్తించి అత్యంత ప్రతిష్టాకరమైన "పద్మ పురస్కారం" వారికి లభించాలని అందరి తరపునా కోరాను. శివప్రసాద్ పాడటానికి కూర్చుంటే, తాళం వేయటం ఊగిపోవటం, తల అష్టవంకర్లు తిప్పటం వంటి ఆర్భాటాలేమీ ఉండవు. ఒక మహర్షి ధ్యాన సమాధిలో ఉండి అనాయాసంగా, అసంకల్పితంగా సంగీత శ్రోతస్విని జాలువారుస్తున్నట్లు ఉంటుంది. అది మాత్రం శివ ప్రసాద్ గారి ప్రత్యేకత. తాను తన్మయం అయి మనల్ని తన్మయులను చేస్తారాయన. కారణ జన్ములు. ఆయన నోట్లో మురళి ఉందా అన్నంత ఆశ్చర్యం వేస్తుంది. పదాలు తెలుస్తాయి. దాటివేయటం లేదు. ప్రతి పదం మనకు వినపడుతుంది. అక్షరం తెలీదు కాని అక్షర ధ్వని స్పర్శ ఫీల్ అవుతాం. ఆయనకు అన్ని వేళలా విజయ పరంపర లభించాలని కోరుకుంటున్నాం. శార్లెట్ నిజంగా ఈలామృత వర్షిణిలో పునీతమైంది.

## యాభై వసంతాల వివాహ వేడుక

పదవ తేది శనివారం రేణు అనే విజ్జికి తెలిసిన అమ్మాయి వాళ్ల నాన్న గారి, అమ్మగారి "యాభై వసంతాల వివాహ వేడుక"కు ఆహ్వానిస్తే వెళ్ళాం. తండ్రి గారు ప్రముఖ నాటక, సినీ నటుడు వల్లం నరసింహారావు గారి అన్న కుమారుడు. ఈయన పేరు నరసింహారావు. భార్య సత్యవతి. కమ్యునిటి హాల్ హో, రేణు కుమారుడు రిషభ్ పుట్టిన రోజు ఆమె మేనల్లుడి గ్రాడ్యుయేషన్, ఇదీ మూడు కలిపి చేశారు. మంచి కుటుంబం. ఆయనది కృష్ణాజిల్లా తిరువూరు. హిందుస్తాన్ ఏరో నాటిక్స్‌లో పని చేసి రిటైర్ అయారు. హైదరాబాద్‌లో ఉంటున్నారు. అనుకోకుండా ఆయనతో పని చేసిన వడ్లమన్నాటి టి శర్మ గారు వచ్చారు. శర్మ గారు మా తమ్ముడు కృష్ణమోహన్‌కు బి.డి.ఎల్.లో సహ ఉద్యోగి. అంతేకాక విజ్జి ఆడపడుచు బుల్లి మామ గారు బాగా తెలిసినవాడు. అనుకోకుండా తమాషా పరిచయాలు ఇలా జరుగుతుంటాయి. విందు ఇచ్చారు. పదిపైగా ఐటమ్స్ వున్నా తిన్నది పెరుగన్నమే. ఈ విధంగా ఈ వారం అంతా ఈలా వినోదంతో విందులతో సరదాగా గడిచింది.

(12-6-12. కాంప్-అమెరికా)

అమెరికా డైరీ-**16**

## అమెరికన్ ఆదివాసీలు - చేరోకీలు

1492లో కొలంబాస్ రాకకు ముందు ఇక్కడి స్థానిక అమెరికన్ల సంఖ్య 25

మిలియన్లు ఉండేదట. వారికి మూడొందలకు పైగా భాషలు ఉండేవి. క్రమంగా ఆ జనాభా అంతా వ్యాధులు, ప్రకృతి వైపరీత్యాలు, యుద్ధాలు, ఆకలి, చావులతో ఇప్పుడు 567 తెగలతో రెండు మిలియన్లు మాత్రమే మిగిలి ఉన్నారు. వీరిని అమెరికా రాజ్యాంగం గుర్తించి హక్కుల్ని కల్పించింది. ప్రభుత్వంతో వాళ్ళు కొన్ని ఒప్పందాలను చేసుకొన్నారు. అందువల్ల వీరు తమ స్వాధీనంలో ఉన్న మిలియన్ల కొద్దీ ఎకరాల భూభాగాన్ని ప్రభుత్వానికి స్వాధీనం చేశారు. ప్రభుత్వం వారి ఆరోగ్యం, చదువు మత స్వేచ్ఛలను కాపాడుతోంది. వారితో ప్రభుత్వం 377 ఒడంబడికలు చేసుకొన్నా దాదాపు అన్నిటినీ తుంగలో తొక్కేసింది. అయితే అవి ఒప్పందాలు చట్టాలేనని సుప్రీం తీర్పు. వందేళ్ళ క్రితం చేసుకొన్నా ఒడంబడికలకు చట్ట భద్రత కల్పించాలని స్పష్టం..వనవాసుల సార్వభౌమత్వాన్ని ధ్రువీకరించింది.. ప్రభుత్వాల మధ్య సంబంధాలను దృఢం చేసుకొన్నారు. గిరిజన తెగలను "స్థానిక ఆధార రాజ్యాలు"గా గుర్తింపునిచ్చారు. తమ హక్కుల్ని కాపాడు కోవాటానికి అటార్నీలను నియమించుకొన్నారు. పిల్లల చదువు, వనవాసీ బడులు, కాలేజీలు ఏర్పాటు చేసుకొనే హక్కు సంపాదించారు. వారి మతాలను, నియమాలను పాటించుకొనే వెసులుబాటు పొందారు. వారి పూర్వీకుల "అస్తులన (ఎముకలు) పొంది జాగ్రత్త చేసుకొన్నారు. వారి జీవన ప్రమాణాన్ని వృద్ధి చేసుకొంటున్నారు. అమెరికా ప్రజల్లో తామూ భాగా స్వాములమనే ధీమా వారికి వచ్చిందిప్పుడు.

## చేరోకీల సంస్కృతి - సంప్రదాయాలు

చేరోకీలు అని పిలువబడే వీరంతా ఎత్తైన పర్వత ప్రాంత వాసులు. తామే ముఖ్యమైన పౌరులం అని, నిజమైన జనం అని అంటారు వాళ్ళు. వారి భాషలో దాన్నే "ani-yun-wiya" అంటారు. వీరంతా ఎత్తైన పర్వత ప్రాంత జనులే. వారి భూభాగమే ప్రపంచానికి నాభి లేక మధ్యభాగం అని వీరి నమ్మకం. వారి దృష్టిలో భూమి నాలుగు త్రాళ్ళతో ఆకాశం నుండి వేలాడుతోంది. ఈ భూమి ఏర్పడటానికి ముందు అందరు ఆకాశంలో పెద్ద శిల మీద ఉండే వాళ్ళు. జనాభాతో కిక్కిరిసిపోతే నీరు భూమి కిందకు చేరింది. ఆ తర్వాత మట్టి అడుసుతో భూమి ఏర్పడి క్రమంగా గట్టి పడింది. తర్వాత నీరు మళ్ళీ ఆకాశం చేరింది. భూమి మీద క్రమంగా జీవరాశి ఆవిర్భావం చెందింది.

వారి జాతిలో మొదటి మానవుని పేరు కనాతి, మొదటి స్త్రీ సేలు. వారికి ఒకే ఒక మొగ సంతానం. అతన్ని "వైల్డ్ బాయ్" అంటారు. వీరి సంతానం క్రమంగా పెరిగిందని అభిప్రాయం. చేరోకీలు నార్త్ కరోలినా, కాన్సాస్ పర్వత ప్రాంతాలలో, అపలేశియన్ పర్వత ప్రాంతాలలో దట్టంగా ఉన్నారు. వీరు చిన్న గ్రామాల్లో ఉంటారు. అక్కడ ఒక సమావేశ మందిరం ఉంటుంది. అక్కడ ప్రార్థన, ఆరాధనా చేసుకొంటారు.

దానికి చుట్టూ వారి ఇల్లుంటాయి. ఒక్కో ఇంట్లో అనేక తరాల వారు ఉంటారు. అందరు కలిసి జీవించటం వీరి ప్రత్యేకత. చలి కాలంలో "అసి" అనే వెచ్చని ఇళ్ళల్లో నివశిస్తారు. వేసవి ఇల్లు విశాలమైన దీర్ఘ చతురస్రకార క్లాప్ బోర్డ్‌తో చేసిన ఇళ్ళల్లో ఉంటారు. సీతాకాలపు ఇల్లు చిన్నవి, ఒకే దర్వాజా ఉంది, మధ్యలో నిత్యం మండే పొయ్యి ఉంది వెచ్చదనాన్నిస్తుంది. నిలవ చేసుకొనే గదులుంటాయి.

వ్యవసాయం, వేట, చేపలు పట్టటం వృత్తి. ఎక్కువగా జలాధారం ఉన్న నదీ తీర ప్రాంతాలే వారి ఆవాస భూములు. సారవంతమైన నేలలను చూసుకొని మొక్కజొన్న పండిస్తారు. దానితోపాటు బీన్స్ కూడా పండిస్తారు. బీన్స్ మొక్కల వేళ్ళల్లో నత్రజని స్థాపక సూక్ష్మ జీవులున్డటం వల్ల మొక్క జోన్నకు బలం చేకూరుతుంది. ఆడవారు కాయగూరలు పండిస్తారు. ముసలి స్త్రీలు పొలాల్లో వడిసెల రాళ్ళతో పక్షులను పారద్రోలుతూ పంట చేలను కాపాడుతూ ఉంటారు. చిరోకీలు పిల్లలను అతి చనువుగా చూస్తారు. దండించాల్సి వస్తే చిన్న ముళ్ళుతో గిచ్చటం తప్ప పెద్దగా శిక్షించరు. ఆడవారు అడవుల్లోకి వెళ్లి వంట చెరుకు తెస్తారు. నీరు మోసుకొని వస్తారు. అందరికి వంట చేయటం వారి విధి. వెన్న వాడకం తెలీదు. ఇళ్లను అందంగా అలంకరించటం ఆడవాళ్ళ పని. వెదురుతో లేక నదీ తీరంలో దొరికే ఒక రకమైన చెట్టు భాగాలతో బుట్టలు అల్లుతారు. దాన్ని "రివర్ కేన్" అంటారు. మన పేము లాంటిది. స్థానికంగా దొరికే మట్టితో కుండలు చేస్తారు. వాటిని ఆరబెట్టటం, కాల్చటం నగిషీలు చెక్కటం చేస్తారు. జింక చర్మంతో మగవాళ్ల బట్టలు కుడతారు. ఎముకలతో చేసిన సూదులను కుట్టటానికి ఉపయోగిస్తారు. సాధారణంగా వారికి చాలా తక్కువ బట్టలే ఉంటాయి. చలికాలంలో వింటర్ హౌస్‌లోనే అందరు గడుపుతారు. పిల్లలు బట్టలు వేసుకోరు. ఆడ వాళ్ళు మగవారి లానే డ్రెస్ వేసుకొంటారు.

మగవారు వేటాడి ఆహారం తెస్తారు. ఆడవారు దానితో వండి వడ్డిస్తారు. జింక , ఎలుగు బంటి లను ఎక్కువగా వేటాడి తెస్తారు. వేటకోసం మిస్సి సిపి నదిని కూడా దాటి చాలా దూరం పోతారు. వారికి జింక చాలా ఇష్టమైన జంతవు. కల్ప వృక్షంలా అది వారిపాలిటి కల్ప ధేనువు. దాని శరీరంలో అన్ని భాగాలను ఉపయోగించుకొంటారు. వాటి ఎముకలతో పనిముట్లు అలంకరణ సామాను, చర్మాన్ని ధరించటానికి, వాటి నరాలను దారాలుగా, వాటి మెదడును ఔషధాలు తయారు చేయటానికి ఉపయోగిస్తారు. వాటి మాంసంతో స్నాయువులతో జిగురు తయారు చేసుకొంటారు. దాని శరీరంలో ప్రతిది వారికి ఉపకరించేదే. అలాగే ఎలుగు బంటీ అంతే. వాటి చర్మం ఫర్ కోట్లకు, వాటి కొవ్వును గ్రీజు తయారు చేయటానికి వాడుతారు. టర్కీ కోడి వారికి బాగా ఇష్టం. ఎలుగు గోళ్ళతో, దంతాలతో ఆభరణాలు

చేస్తారు. పక్షుల ఈకలతో అలంకరించు కొంటారు. మాటు పెట్టి వేటాడి బొరియలు పెట్టి జంతువులను చంపుతారు. చేపలు పట్టటానికి గాలం, వల, వెదురు ముక్కల "మావు"లు ఉపయోగిస్తారు. నీటి ప్రవాహం ఉన్నచోట చిన్న డాం కడతారు అడ్డంగా. అక్కడ చెస్ట్నట్ నుంచి తీసిన విషాన్ని ప్రవాహపు నీటిలో కలుపుతారు. అది చేపల నరాలపై దెబ్బతీస్తుంది. ఆ చేపలను తింటే మనుష్యులకు ప్రమాదం ఉండదు. కాని చేపలను అచేతనంగా మారుస్తుంది. చేపల్ని పట్టిన తర్వాతా అడ్డు తీసేస్తారు. విషం ప్రభావం తగ్గి మళ్ళీ మామూలవుతుంది.

వారి ఆటలు సరదాగా ఉంటాయి. ఆరోగ్యానికి ఆటలు ముఖ్యం అని భావిస్తారు. బాణాల ఆట, రాయిని బంతిగా చేసి ఆట ఆడటం వారికి ఇష్టం. దీన్ని రోలింగ్ రాక్ అంటారు.

## మాతృస్వామ్య వ్యవస్థ

వారి కుటుంబ వ్యవస్థ అంతా తల్లి మీద ఆధారంగా ఉంటుంది. సంతానాని తల్లిని బట్టే తప్ప తండ్రిని బట్టి గుర్తించరు. తల్లి సంతానంగానే పిల్లల్ని భావిస్తారు. వీరికి ప్రాచీన తర స్త్రీల నుండి ఇది వచ్చింది. తల్లి తరపు వారే అసలైన బంధువులు. తల్లి, అమ్మమ్మ, అక్క చెల్లెళ్ళు, వాళ్ల సంతానం, బంధువులుగా భావిస్తారు. అమ్మ సోదరులు వాళ్ల పిల్లలకు బంధుత్వం లేదు. తండ్రి, నాయనమ్మ ఆయన, అక్కచెల్లెళ్ళు, సోదరుల రక్తాన్నిబట్టి కాక తల్లి తరపున రక్తాన్నిబట్టి మాత్రమే నిర్ణయిస్తారు. కుటుంబం తల్లి దగ్గరే ఉంటుంది. భర్త కూడా ఆమెతో ఉంటాడు. ఆ కుటుంబం అంటే భార్యా, భర్తా, పిల్లలు భార్య తల్లి, భార్య అక్కచెల్లెళ్ళు, వాళ్ల సంతానం, వాళ్ల భర్తలు, ఆమె కున్న పెళ్లి కాని సోదరులు. భార్యా భర్తా విడిపోతే భర్త భార్యను వదిలి వేరే వెళ్లి పోవాలిసిందే. సాధారణంగా విడాకులు ఉండవు. అప్పుడు భర్త తన తల్లి చెల్లీ అక్కల దగ్గరకు చేరాలి. పిల్లలు మాత్రం తల్లితోనే ఉంటారు. కారణం వాళ్ళు తండ్రి వంశం వారుగా పరిగణింప బడరు కనుక, అయితే పిల్లలకు తండ్రి ఎవరో తెలుస్తుంది. వేటకు తండ్రి శిక్షణ నివ్వడు. మేనమామ శిక్షణనిస్తాడు. అతన్నే గురువుగా భావిస్తాడు. మొత్తం మీద తేలేది ఏమిటంటే తల్లి తరం వారే సంతానం మీద పెత్తనం కలిగి ఉంటారు. తగాదాలు గ్రామ సభల్లో పరిష్కరించు కొంటారు.

## హత్య– నేరం

చిరోకీలలో హత్యను తీవ్ర నేరంగా భావిస్తారు. శత్రువు కాని, లేక వేరొక తెగ వారు కాని ఒక చెరోకీని చంపితే వారి పై పగ తీర్చుకొని వాడిని చంపేస్తారు. వీటినే "వార్ పార్టీలు" అంటారు. ఇందులో వందమంది వరకు సభ్యులుంటారు. హత్య చేసిన వాడిని చంపకపోతే హత్యగావింప బడ్డవాడు ఉన్నత లోకాలకు వెళ్ళలేడు

అని వీరి సిద్ధాంతం. లెక్కలు బాలన్సు తప్పుతాయట. కనుక బద్లా తప్పదు. అప్పుడే సామరస్యం, సమతూకం ఉంటుందని నమ్మకం.

వీరు ప్రకృతిని ఆరాధిస్తారు. ఒక జింకను చంపాలనుకొంటే ఒక ప్రత్యేక విధి చేసి, తనకు తన కుటుంబానికి ఆహారం అవసరమవటం వల్ల చంపవలసి వస్తోందని దాని జీవుడిని వేడుకొని వేటాడి చంపుతారు. విలాసం కోసం వేట ఆడరు. పవిత్రమైన భావనలను అతిక్రమిస్తే ఉపద్రవాలు కలుగుతాయని నమ్మకం వారిది. జంతు వధ వల్ల మారణ వ్యాధులు కల్గుతాయని నమ్ముతారు. దీనితో జీవావరణం సమతుల్యత దెబ్బ తింటుంది అనే గొప్ప సిద్ధాంతం ఉంది.

చిరోకీల మతం కూడా సామరస్య జీవనాన్నే బోధిస్తుంది. "గ్రీన్ ఆర్డర్ సిరిమని" అనే కొత్త సంవత్సరం పండుగ జరుపుతారు. ఆ రోజున పాత తప్పిదాల నన్నిటిని మన్నించి కొత్త జీవితంలోకి అడుగుపెట్టటానికి అవకాశం కల్గిస్తారు. వివాహాలు విచ్ఛిన్నం అయితే వాటినీ క్షమించి మళ్ళీ దగ్గరవటానికి దారి ఏర్పరుస్తారు. హంతకుడిని మాత్రం క్షమించరు. అతిధులను గౌరవించి మంచి ఆతిధ్యం ఇచ్చే సాంప్రదాయం వారిది వీరిలో ఏడు తెగలున్నాయి. తమ జాతి మూల పురుషుడు స్త్రీ అయిన "కనాతి", "సేలు"ల పవిత్ర వారసులం అని గర్వంగా చెప్పుకొంటారు. వారి జీవితాలను పరికిస్తే ఎంత నిబద్ధతగా వారు జీవనం సాగిస్తున్నారో మనకు తెలుస్తోంది. ఆధునికులం, నాగరకులం అని మిడిసి పడుతున్న మనం అనాగరికులు అని వారిని భావించటం మన అనాగారకతను తెలియజేస్తోంది. సామరస్యం, సహజీవనం, ప్రకృతి ఆరాధనం, హింసను విడనాడటం వారి నుంచి మనం నేర్చుకోవాలి.

(6-6-12-కాంప్-అమెరికా)

అమెరికా డైరీ-**17**

## స్వాతంత్ర పోరాటంలో నార్త్ కరోలినా

బ్రిటీష వారి కబంధ హస్తాల నుంచి బయట పదాలని మొదట తీర్మానం చేసి, మిగిలిన వారికి ఆదర్శంగా నిలిచినమొట్ట మొదటి కాలని నార్త్ కరోలిన. ఆ వివరాలే ఇప్పుడు మనం తెలుసుకోబోతున్నాం.

1771 ప్రాంతంలో అమెరికాలో 13 బ్రిటీష కాలనీలు ఉండేవి. అందులో నార్త్ కరోలిన ఒకటి. బ్రిటీష రాజు ఇక్కడ ఫ్రెంచ్ వారితోను, అక్కడ మిగిలిన వారితో పోరాటానికి కావలసిన డబ్బును అమెరికాలోని కాలనీల నుండి పిండుకొందామను కొన్నాడు. పార్లమెంట్‌లో కొన్ని పన్నులు విధించే చట్టాన్ని చేశాడు. నార్త్ కరోలిన అసెంబ్లి దాన్ని తిరస్కరించింది. పార్లమెంట్‌లో ప్రాతినిధ్యంలేని తమపై పన్నులు వేయటం

సరికాదని చెప్పింది. మిగిలిన కాలనీలు అలానే పోరాడితే వెనక్కు తీసుకొన్నారు. అప్పుడు దొడ్డి దారిన స్టాంప్ చట్టం చేసింది. అమ్మకం, కొనుబడులకు స్టాంప్‌లు కొని అంటించాలని దీని భావం. దీన్నీ వ్యతి రేకించారు. స్టాంపులను బయటికి రాకుండా కాపలా కాశారు. ఆ నావలన్నిటిని వెనక్కి పంపించేటట్లు తీవ్రంగా అన్ని కాలనీలు పోరాటం చేశాయి. దిగి వచ్చింది బ్రిటీష ప్రభుత్వం. ఆ తర్వాత ఎత్తుగడగా కొత్త పన్నులు వేసే పద్ధతి తెచ్చింది. మళ్ళీ తిరుగు బాటు బావుటా ఎగరేశారు. "no taxation without representation" అని నినదించారు. ఇక్కడి కాలనీ వాసులెవరికీ బ్రిటీష పార్లమెంట్‌లో సభ్యత్వం లేదు. బ్రిటీష వస్తువులను కొనడం, అమ్మడం కూడా కాలనీలు బహిష్కరించాయి. మళ్ళీ దిగి వచ్చి తేయాకు తప్ప అన్నిటి మీదా పన్ను తీసేసింది ప్రభుత్వం.

సమష్టి పోరాటం చేయాలని కాలనీలన్ని ఒక నిర్ణయానికి వచ్చాయి. తమలో తాము సంప్రదించు కోవటం ప్రారంభించాయి. committees of correspondence ఏర్పడ్డాయి. అప్పటికి అమెరికాలో కేంద్రీయ ప్రభుత్వం అనేది లేదు. అక్కడ బ్రిటన్‌లో తేయాకు విపరీతంగా పండి, మార్కెట్ లేక అమెరికా తెచ్చి అమ్మాలనుకొంది. షిప్పు నిండా తేయాకు వచ్చింది మాసాచుసేట్స్‌లోని బోస్టన్ రేవుకు. 1773లో బోస్టన్ పౌరులు, mohawk ఇండియన్లు కలిసి నావను రాత్రి పూట రహస్యంగా ఎక్కి 342 పెట్టెల తేయాకును సముద్రంలో విసిరేశారు. దీన్నే "బోస్టన్ టీ పార్టి" అన్నారు. ఇలాగే మిగిలిన కాలనీలలోను చేసి బ్రిటీష వారికి శ్రుంగ భంగం కల్గించారు. దీనితో ప్రభుత్వం ప్రతీకార చర్యలు చేబట్టి బోస్టన్ రేవు నుంచి వ్యాపారం చేయటాన్ని నిషేధించింది.

కాలనీ వాసులలో ఏకాభిప్రాయం సాధించి సంయుక్తంగా బ్రిటీష వారిపై పోరాడాలని సంకల్పించారు. దీని కోసం conti nental congressను ఏర్పరచుకొన్నారు. అప్పుడు నార్త్ కరోలినలో బ్రిటీష గవర్నర్ మార్టిన్ అనే వాడున్నాడు. నార్త్ కరోలిన ఆసెంబ్లీని సమావేశ పరచమని వాడిని కోరితే తిరస్కరించాడు. నార్త్ కరోలిన అసెంబ్లికి మాత్రమే పన్ను విధించే హక్కు ఉంది కాని, పార్లమెంట్‌కు లేదు అని నిర్ద్వందంగా తెలిపారు వాడికి. ప్రతి కాలనీకి ప్రతినిధులను ఎన్నుకొన్నారు. విలియం హూపర్, కస్వేల్, జోసెఫ్ హ్యూస్‌లు నార్త కరోలినా ప్రతినిధులు. ఇక్కడి విషయాలను ఎప్పటి కప్పుడు రాజుకు గవర్నర్ తెలియ జేస్తున్నాడు. ప్రోవిన్సియల్ కాంగ్రెస్ వాళ్ళు అప్పటికే రెండుసార్లు సమావేశమైనారు. సమావేశం జరుపుకొనే హక్కు తమకు ఉందని తెలియజేశారు. రాజుకు విధేయులమే కాని, అధికారము తమకివాలని స్వాతంత్రమే తమ లక్ష్యమని చెప్పారు. నార్త్ కరోలిన అసెంబ్లీని సమావేశ

పరచుకొని తమ కోరికను బలంగా చాటారు. వీళ్ళను దారిలోకి తెద్దాం అన్న అతని ప్రయత్నాలు ఫలించలేదు. మసాచుసెట్స్‌లో ప్రజలు రహస్యంగా ఆయుధాలు, మందుగుండు సామాను సేకరించి భద్రపరచారు. దీన్ని స్వాధీనం చేసుకోవటానికి ప్రభుత్వం సిద్ధపడింది. కాపాడుకోవటానికి ప్రజలు సమాయత్తమైనారు. 1775 april 18న ఇరు వైపులా మోహరింపు జరిగింది. జనాన్ని చూసి పోలీసులు వారిపై కాల్పులు జరిపారు. ఇదిగో ఇప్పుడే బ్రిటీష వారితో యుద్ధం ప్రారంభమయింది. ముందు కాలు దువ్వింది బ్రిటీష సైన్యమే. దీన్నే ఎమర్సన్ మహాకవి “the shot heard --round the world” అని కవిత్వీకరించాడు. ఈ వార్త నార్త్ కరోలినాకు ఆలస్యంగా చేరింది.

1775 మేలో షార్లేట్, మేకేన్స్ బర్గ్ వాసులు వీధుల్లోకి వచ్చి బ్రిటీష రాజుకు ఇంకా ఏమాత్రము అధికారం లేదని, తమ దేశానికి బ్రిటన్ శత్రువు అని నినాదాలు చేశారు. అప్పుడు కాలనీలలో మూడు వర్గాలుండేవి. రాజుకు వ్యతి రేకుల్ని whigs అనీ, అనుకూలుర్ని torees అనీ ఎటు తేల్చుకోలేని వారిని neautrals అన్నారు. ఇక్కడి గవర్నర్ మార్టిన్‌కు థారు పుట్టి పెళ్ళాం, పిల్లల్ని న్యూయార్క్‌కు తోలేశాడు. న్యు బెరిన్‌లో కొన్ని ఫిరంగులు కాల్చటానికి ఉంచాడు. జనం వచ్చి పడుతున్నారని తెలిసి వాటిని నిర్వీర్యం చేశాడు. ప్రజలను రక్షించుకోవాలని నాయకులు భావించి “committee of safety”లను ఏర్పాటు చేసుకొన్నారు. పోరాడటానికి సైన్యాన్ని సమకూర్చుకొన్నారు. హిల్స్ బరోలో సమావేశమై శామ్యూల్ జాన్సన్‌ను ప్రిసైడింగ్ ఆఫీసర్‌ను చేసి అందరు శపదథాలు చేశారు. విభేదాలున్నా ఇంకా రాజుకు విధేయులమేనని ప్రకటించారు యుద్ధ సామాగ్రి కొనటానికి డబ్బును సమకూర్చుకొనే ప్రయత్నాలు చేశారు.

ఫిలడెల్ఫియాలో రెండో కాంటినెంటల్ కాంగ్రెస్ సభ జరిగింది. జార్జి వాషింగ్టన్‌ను కమాండర్ చీఫ్‌గా ఎన్నుకొన్నారు. కాంటినెంటల్ ఆర్మీ ఏర్పడింది. నార్త్ కరోలినలో రెండు రిజిమెంట్లు జేమ్స్ మూర్, రోబర్ట్ హోవే నాయకత్వంలో ఏర్పడ్డాయి. సౌత్ కరోలినలో ఉన్న చార్లెస్టన్ గొప్ప ఓడ రేవు. దాన్ని స్వాధీనం చేసుకోవటానికి సైన్యాన్ని పంపమని గవర్నర్ మార్టిన్ రాజుకు రాశాడు. కారణ వాలీస్‌తో ఒక దళాన్ని, హెన్రీ క్లింటన్‌తో ఒక దళాన్ని రాజు పంపాడు. వారిద్దరూ వచ్చి నార్త్ కరోలినానే చాల సమస్య అని నిర్ణయించారు. ఇక్కడ హాలిఫాక్స్‌లో తాత్కాలిక ప్రభుత్వాన్ని ప్రజలు ఏర్పరచుకొన్నారు. తమకు తాము స్వాతంత్రం పొందినట్లుగా ప్రకటించుకొన్నారు. ఇలా నార్త్ కరోలిన మిగిలిన కాలనీలకు మార్గదర్శకమై ముందు నిలిచింది. హాలి ఫాక్స్‌లో కాంగ్రెస్ మళ్ళీ 1776 ఏప్రిల్ పన్నెండున సమావేశమై స్వాతంత్రాన్ని

ప్రకటించింది. తర్వాత వర్జీనియా, ఆ తర్వాత మిగతా కాలనీలు ఆ పని చేసి తామంతా విముక్తులం అని ప్రకటించేశాయి. ఇక రాజుకు తమపై పెత్తనం లేదని చెప్పేశాయి. అందరికి కలిసి ఒక రాజ్యాంగాన్ని తయారు చేసుకొన్నారు. declaration of inde pendenceను 1776 july 4న ప్రకటించారు. ఆ తేదీయే ఇప్పటి ఫార్మేషన్ డే.

న్యూయార్క్‌లో జార్జి వాషింగ్టన్ బ్రిటీష రాజు విగ్రహం తలను కిందికి లాగి పడేశాడు. బుల్లెట్లతో మసి చేశాడు. ఈ డిక్ల రేషన్ నార్త్ కరోలినా చేరటానికి రెండు వారాలు పట్టింది. హాలిఫాక్స్‌లో సమావేశమై1776 august 1న ఆ డిక్లరేషన్‌ను ప్రజలందరికి చదివి వినిపించారు. అలానే మిగిలిన చోట్లా చదివారు. అన్ని కాలనీలు ఆ పని చేసి స్వాతంత్ర్యాన్ని ప్రకటించు కొన్నాయి. దీనికి ముందు దారి చూపింది మాత్రం నార్త్ కరోలినా అని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఆ తర్వాత బ్రిటీష ప్రభుత్వం యుద్ధం చేసి లొంగదీసుకొనే ప్రయత్నాలు చేయటం కారన్ వాలీస్ అన్ని యుద్ధాల్లో పరాజితుడవటం చివరికి జార్జి వాషింగ్టన్ అనే కమాండర్ ఇన్ చీఫ్‌కు లొంగిపోవటం వరుసగా జరిగిపోయాయి. ఈ యుద్ధాలలో అనేక యువకులు సమర్ధులైన నాయకులు బలై పోయారు. “north carolina and most of the colanies won inde pendence by fighting a war against Briton with practically with an empty treasury” అంటే చేతిలో చిల్లి గవ్వ లేకుండా నార్త్ కరోలినాతోబాటు అనేక కాలనీలు బ్రిటీష వారితో యుద్ధం చేసి తమ స్వాతంత్ర్యాన్ని సంపాదించుకొన్నాయి. నార్త్ కరోలినా ప్రజలకు, వారి త్యాగాలకు, పోరాట పటిమకు స్వాతంత్ర కాంక్షకు బలిదానానికి జోహార్.

(17-6-12-కాంప్-అమెరికా)

## అమెరికా డైరీ-**18**

## టోరీ ఖేరీ వారం

ఈ వారం అంతా సందడిగా, సరదాగా గడిచింది. మంచి పుస్తకాలూ చదివాను. రెండు పుట్టిన రోజు పండుగలు, ఒక రేడియో ప్రోగ్రాం, ఒక భజన, ఫాదర్'స్ డే లతో ఈ వారం సాగింది. సోమవారం సందడేమీ లేదు. ట్విన్స్‌ను జిమ్నాస్టిక్స్‌లో సాయంత్రం చేర్చటానికి వెళ్ళాం. ఆశుతోష్ బాగా చేశాడు. పీయుష్ చేతి నెప్పితో ఉన్నా వాడు చేసిన వన్నీ బయటే చేశాడు. వచ్చే వారం వాడూ ఇందులో చేరతాడు. శ్రీకేత్ క్లాస్ వీళ్ళ క్లాస్ అయిన తర్వాత. జి మార్ట్‌కు వెళ్ళి కూరలు కొన్నాం. పనస పండు కూడా. ఆ రోజు రాత్రి “ఇదే మంటే ప్రేమంటా” సినిమాకు రాత్రి తొమ్మిదిన్నర

ఆటకు వెళ్ళాం. కాని ఫిలిం "కీ" రాలేదని ఆట వెయ్యలేదు. మర్నాడు మంగళవారం రాత్రికి వెళ్ళాం. సినిమాలో దమ్ములేదు. అయితే సరదాగా కూర్చోబెట్టాడు డైరెక్టర్. మా కుటుంబం కాక ఇద్దరే హాల్‌లో ఉన్నారు. డబ్బా లేపేసేటట్లుంది. శుక్రవారం జగదీశ్, లక్ష్మి దంపతుల అబ్బాయి ఆదిత్య పుట్టిన రోజు. ఇంటి దగ్గరే చేశారు. అందరం వెళ్ళాం. మంచి దంపతులు. నలభై మందికిపైగా వచ్చారు. రాత్రి ఏడున్నర నుండి ఒక గంట భజన, ఆ తర్వాత బర్త్ డే పార్టీ. గులాబ్జాం పులిహోర, మరి రెండు స్వీట్లు, చపాతీ కూర అప్పడం అన్నం, పెరుగు, ఐస్క్రీం కేకు వగైరా. అన్నీ బాగున్నాయి. లక్ష్మి మా మేనకోడలు పద్మలాగా ఉంటుంది. ప్రభావతిని పొదివి పట్టుకొంటుంది. అంత అభిమానం. మేము రావటం అదృష్టంగా భావించే దంపతులు జగదీశ్, లక్ష్మి. ఆదిత్యను మాకు నమస్కరింపజేసి ఆశీస్సులు పొందేటట్లు చేశారు. అందుకే వాళ్ళింటికి వెళ్లటం ఇష్టంగా ఉంటుంది. సుమారు నెల క్రితం అహోబిల స్వాములు వీరింట్లో చేసిన పూజకు వెళ్ళాం. మర్నాడు శనివారం మా ఇంటికి దగ్గర్లో పిల్లల స్కూల్‌కు వెళ్ళే దారిలో ఉన్న వై.ఎం.సీ.ఏ.భవనంలో విజ్జివాళ్ళకు తెలిసిన కన్నడ కుటుంబం వాళ్ల అబ్బాయి బర్త్ డే. వెళ్ళాం. ప్రభావతి రాలేదు. ఒక క్లౌన్ వేషంలో అమ్మాయి పిల్లలకు సరదాగా బెలూన్లు చేసి సరదా చేసింది. ఐటమ్స్ చాలా పెట్టారు కాని తిన్నది చపాతి, పెరుగు వడ మాత్రమే. అక్కడి నుంచి లైబ్రరీకి వెళ్లి ఇరవై రెండు పుస్తకాలు ఇచ్చేసి, పద కొండు తెచ్చుకొన్నాను. బుధవారం రాహుల్ ఇంట్లో భజనకు వెళ్ళాం అందరం.

## టోరీ ఖేరీ

శార్లేట్‌లో విజ్జి ఫ్రెండ్ నాగమణి గత నాలుగేళ్ళుగా టోరీ రేడియో ప్రోగ్రాంను ప్రతి బుధవారం చేస్తోంది. మధ్యాహ్నం పన్నెండు నుంచి రెండు గంటల వరకు. ఈ ప్రోగ్రాంలోనే మార్దంగిక విద్వాంసులు ఎల్లా వెంకటేశ్వరరావు గారిని, ఈల లీలా వినోదులు కొమరవోలు శ్రీ శివప్రసాద్‌ను మా ఇంట్లో నుంచే ఇంటర్వ్యూ చేశాం. ఆవిడ వాళ్ళింట్లో ఉండి ఫోన్‌లో ప్రశ్నలడిగితే ఇక్కడ ఫోన్‌లో సమాధానం చెప్పటం. దీని లింక్ అంతా హైదరాబాద్‌లో జరుగుతుంది. లైవ్ ప్రోగ్రాం. మధ్యలో పాటలు శ్రోతల ప్రశ్నలు వాటికి సమాధానాలు ఉంటాయి. టోరీ అంటే "టెలివిజన్ ఆన్ లైన్ రేడియో ఇంటర్ నేషనల్" అని అర్థం. ప్రపంచ దేశాలన్నిటికీ చేరుతుంది లైవ్‌లో. ఆ విద్వాంసులను నేనే మనింటి నుంచి పరిచయం చేసి, ప్రశ్నలడిగి సమాచారం చెప్పించాను. నాగమణి నేను వచ్చిన దగ్గర నుంచి నన్ను ప్రోగ్రాం చేయమని అడుగుతూనే ఉంది. నేను వాయిదా వేస్తూనే ఉన్నాను. అది మొన్న బుధవారం కుదిరింది. ప్రోగ్రాం నాగమణి గారింటి వద్దే చేశాం. విజ్జి నన్ను అక్కడ దింపింది. లింక్ కుదరక ఒక

అరగంట ఆలస్యంగా అంటే పన్నెండున్నరకు ప్రారంభమైంది. గంటన్నర అంటే మధ్యాహ్నం రెండుకు పూర్తి అయింది. "ఊసుల్లో ఉయ్యూరు" గురించి మాట్లాడాను. రేడియోలో పూర్తి ప్రసంగం–

## ఊసుల్లో ఉయ్యూరు

నేను ముందుగా నా పరిచయం చేసుకొన్నాను. ఉయ్యూరు ప్రాముఖ్యాన్ని, అది బందరు, బెజవాడ మధ్య ఉందని చెరకు, వరి, కంద తమలపాకు, పసుపు మొదలైన పంటలకు కేంద్రమని, ఆసియాలోనే అతి పెద్ద షుగర్ ఫాక్టరి ఇక్కడ ఉందని, ఇక్కడి పంచదార చాలా నాణ్యమైనదిగా భావిస్తారని మొదలు పెట్టాను. గత యాభై ఏళ్లుగా సాహితీ రంగంలో ఉన్నానని, నా చదువు ఉయ్యూరు విజయవాడలలో సాగిందని రాజమండ్రిలో బి.ఎడ్.పూర్తి చేశానని, కృష్ణాజిల్లా పరిషద్‌లో ఇరవై రెండేళ్లు ఫిజికల్ సైన్స్ టీచర్‌గా పనిచేసి ఆ తర్వాతా పదకొండేళ్ళు ప్రధానో పాధ్యాయుడిగా చేసి 1998 జూన్‌లో పదవీ విరమణ చేశానని చెప్పాను. "విశ్వంలో ఉన్న తెలుగు వారి గుండె చప్పుళ్ళు వినిపిస్తున్న టోరీకి వందనం, అభివందనం అని, శ్రోతలకు అభినందనం అన్నాను. "టోరిలో టి అనేది టెలివిజన్ అని మీరు భావిస్తే "తెలుగు" అని నేను భావిస్తానని, కనుక తెలుగుకు చేస్తున్న సేవగా టోరిని అభినందిస్తున్నానని అన్నాను.

ఉయ్యూరు ఊసులు ఎలా మొదలైనాయో చెప్పాను. మా ఊళ్ళో అన్నీ తెలిసిన వారు చాలా మంది ఉన్నారని వారిని గుర్తుంచుకోవటం కోసం మా తమ్ముడు కృష్ణమోహన్‌తో ముందు రాయించానని, ఆ తర్వాత వాటిని పుస్తక రూపంలో తెచ్చి మా అబ్బాయి రమణ వివాహ రిసెప్షన్‌లో ఎం.ఎల్.సి రాజేంద్రప్రసాద్‌తో ఆవిష్కరింపజేశామని చెప్పాను. "సరసభారతి" అనే సాహిత్య సాంస్కృతిక సంస్థను ఉయ్యూరులో సుమారు మూడు ఏళ్ళ క్రితం ప్రారంభించి ప్రతి నెలా ఒక కార్యక్రమం చేస్తూ, ప్రతి ఏడూ ఉగాదికి కవి సమ్మేళనాలు నిర్వహిస్తున్నామని, వాటిని పుస్తక రూపంలో తెచ్చి అందజేస్తున్నామని, ఇప్పటికి సరసభారతి తొమ్మిది ప్రచురణలను తెచ్చిందని అందులో నేను నాలుగు పుస్తకాలు – ఆంధ్ర వేద శాస్త్ర విద్యాలన్కారులు, జన వేమన, దర్శనీయ దేవాలయాలు, శ్రీ హనుమత్ కథానిది రాశానని చెప్పాను. ఉగాది పురస్కారాలను మా తలిదండ్రులు గబ్బిట భవానమ్మ, మృత్యుంజయ శాస్త్రి గార్ల పేరిట అందజేస్తున్నామని తెలియజేశాను. మా ఊరివాడు కొలచల సీతారామయ్యగారు రష్యాలో పేరు మోసిన శాస్త్రవేత్త అని, సూరి భగవంతంగారు నెహ్రూ గారికి సైంటిఫిక్ అడ్వైజర్ అని గుర్తు చేశాను. అలాగే ఆరికపూడి ప్రేమచంద్ ఎన్నో దేశాలకు ఆర్థిక సలహాదారులని చెప్పాను.

మాకు రెండు బ్లాగులున్నాయని వాటి వివరాలు చెప్పాను. అవి బాగా

ప్రాచుర్యం పొందాయని వివరించాను. నేను నాకు జ్ఞాపకం ఉన్న మా ఉయ్యూరు విషయాలను "ఊసుల్లో ఉయ్యూరు" అనే పేర "నెట్లో" రాస్తున్నానని ఇప్పటికి ముప్పై రెండు ఎపిసోడులు రాశానని అన్నాను. ఇటీవల అందరికి తాము పుట్టి పెరిగిన గ్రామాలను గుర్తుకు చేసుకోవటం, వాటికి సేవ చేయటం జరుగుతోందని ఆంధ్రజ్యోతి దిన పత్రికలో "మా ఊరు" అనే శీర్షికలో ప్రముఖుల గ్రామాల విశేషాలను రాస్తున్నారని, అలాగే "ఉయ్యూరు ఊసులు" శీర్షికతో ఈనాడు దిన పత్రిక కృష్ణాజిల్లా ఎడిషన్‌లో ఉయ్యూరు వార్తలను ప్రచురించటం గమనింపదగిన విషయమని, దాని ప్రభావం అంతగా ఉందని చెప్పాను.

ఊసులు అంటే కబుర్లు, లేక జ్ఞాపకాల దొంతరలు అని వాటికీ సాహిత్య గౌరవం కల్పించామని, అందరు గొప్పవారే కానవసరం లేదని సంఘటనలు, ప్రభావాలు ఆత్మీయతలు గుర్తు చేసుకోవటమేనని అన్నాను. మా ఊసుల్ని చదివి ప్రముఖ కథకులు కాటూరి రవీంద్ర త్రివిక్రమ్, విహారి అమెరికాలోని ప్రేమ్చంద్, గోపాలకృష్ణ గార్లు (వీరిద్దరూ ఉయ్యూరు వారే) మెచ్చారని మొదటి ఇద్దరూ ఇలాంటి ప్రయత్నం తామూ చేద్దామని ఆలోచిస్తున్నామని చెప్పారని చెప్పాను. ఆ తర్వాత నా మొదటి ఎపిసోడ్ "అమ్మ బోణీ –నాన్న కాణీ"తో ప్రారంభించాను. అమ్మ బోణీ చేస్తే కూరగాయలన్నీ అమ్ముడు అవుతాయని ముందు మా ఇంటికి వచ్చేవారని కొన్నా కొనకపోయిన బుట్ట మీద చేయి వేయించే వారని, అలానే నాన్న కానీ డబ్బు ఇచ్చినా ఊరంతా బాగా డబ్బులు లభిస్తాయని వేద పండితులు, కూచిపూడి భాగవతులు మొదటిగా మా ఇంటికి వచ్చి నాన్న దగ్గర డబ్బులు తీసుకొనే వారని చెప్పాను. ఆ తర్వాత రవీంద్రుడు రాసిన "కాబూలి వాలా" ఆకారంలో ఉండే అత్తరు సాహేబు గారు ఉండేవాడని ఆయన అత్తర్లు సెంటు మందార నూనె సురమా అగరువత్తులు అమ్ముతూ మా ఇంటికి వచ్చేవాడని చూడటానికి భయంకరంగా ఉండే వాడని మనిషి మంచివాడని ఆయన్ను "మహాత్తర్ సాహెబ్" పేరుతో రాశానని చెప్పాను. నాకు రోజుకు కనీసం పదిసార్లైనా "అవు–పులి" కథ చెప్పి నిద్రపోయే ముందు మళ్ళీ చెప్పి నన్ను నిద్రపుచ్చిన చిన్నమూతి ఉండే మా పాపాయి పిన్ని గురించి "పాపాయి పిన్ని అనే బుల్లిమూతి పిన్ని" రాశానని చెప్పాను. మా ఇళ్లకు ఇంజినీర్‌గా సలహాలకు చాణక్యుడిగా ఉండే "కొలచల శ్రీ రామమూర్తి మామయ్యను కొలతల మామయ్యగా రాశానని చెప్పాను. మా మామయ్యా గారింట్లో వేసవి కాలంలో వచ్చే తద్దినాలను "మామిడి పళ్ళ తద్దినాలు" అనే వాళ్లమని, తిన్నన్ని మామిడి పళ్ళు వేసేవారని విస్తళ్ళ పక్క అవి చిన్న గుట్టలుగా ఉండేవని ఆ రోజుల్లో పెళ్ళిళ్ళు అయిదు రోజులు, ఒడుగులు నాలుగు రోజులు జరిగేవని ఊరిలో బంధువులందరికి రెండుపూటలా భోజనాలని వంట పూర్తి కాగానే ఇంటింటికీ వెళ్లి "భోజనాలు– సిద్ధం రండి" అని వెళ్లి

చెప్పే ఆచారం ఉండేది. ఎవరి మంచినీళ్ళ చెంబు వాళ్ళు తీసుకొని వెళ్ళే వారని గుర్తు చేశాను. లక్ష్మి అనే ఆమె ఫోన్ చేసి "చాలా మంచి జ్ఞాపకాలు" అని అభినందించారు. ఉయ్యూరు వీరమ్మ తల్లి తిరునాళ్ళు గురించి, అంతరించిపోయిన చేతివృత్తుల గురించి, వర్షం పడుతున్నా, తుఫాను వచ్చినా రోజు రాత్రి ఎనిమిది గంటలకు శివాలయానికి వెళ్లి దేవుని దర్శనం చేసుకొనే చంద్రమౌళి, సర్వేశ్వరరావు గార్ల గురించి ఉయ్యూర్లో యే మంచి పనికైనా ముందుండే మా నాన్న, మామయ్యా, చంద్రశేఖరరావు, సదాశివరావు గార్ల గురించి, మా గృహవైద్య నారాయణులు అని మా డాక్టర్ల గురించి, దసరాల్లో ఇంటింటికీ తిరిగి "అయ్యవారలకు చాలు అయిదు వరహాలు" అంటూ పిల్లలతో వచ్చే మేష్టర్ల గురించి, ఆప్యాయతలు, ఆదరాభిమానాలు గురించి, గరికపర్తి కోటయ్య దేవర అనే ప్రముఖ సంగీత విద్వాంసుడు హైదరాబాద్ నవాబును సంగీతంతో మెప్పించి ఆస్థాన విద్వాంసుడై ఆ తర్వాత బందరు వచ్చి సంగీత విద్యాలయం నెలకొల్పి ఎందరికో ఉచితంగా సంగీతం నేర్పించి భోజనాలు కూడా ఏర్పరచిన విషయం చెప్పాను. ఆయన కుమార్తె ఉయ్యూరులో ఇంటింటికీ వెళ్లి సంగీతం నేర్పేదని మా అక్కయ్యలిద్దరు ఆమె వద్ద నేర్చుకున్నారని జ్ఞాపకాల దొంతరను దిన్చేశాను. "అమెరికా ఊసులు" అని కూడా మొదలుపెట్టి రాస్తున్నానని అందులో నుంచి కూడా రెండు ఎపిసోడులను అమెరికా ప్రెసిడెంట్ పియర్స్ గురించి చెప్పాను, ఆనాటి అమెరికా జాతీయ కవి వాల్ట్ విట్మన్ రాసిన "లీవ్స్ ఆఫ్ గ్రాస్" కవితను ఎమర్సన్ మెచ్చిన విధానాన్ని, థోరోగారు గాంధీ గారికి గురువైన తీరు, శ్రీ శ్రీ కి "అగ్గి పుల్లా, సబ్బు బిల్లా కాదేదీ కవిత కనర్హం" అని నేర్పింది విట్మన్ అని ఫ్రాంక్లిన్ గారు లింకన్ కొడుకు చనిపోతే రాసిన ఉత్తరం మెమోరబుల్ లెటర్గా ఉందని చెప్పాను. టోరీ యువకులకు పిల్లలకు తగిన ప్రాతి నిధ్యం కల్పించాలని నాకు ఇంతటి మహత్తర అవకాశం ఇచ్చినందుకు కృతజ్ఞతలు తెలియ జేశాను. ఇదీ టోరీ భేరీ కథా, కమామీషు.

నిన్న అంటే పదిహేడవ తేదీ "ఫాదర్స్ డే". మా అమ్మాయి విజ్జి "హాపీలు" చెప్పి హల్వా చేసి అందరికి పెట్టి దేని మరింత మదురం చేసింది.

ఈ వారంలో చదివిన ముఖ్య పుస్తకాలు –'jim bowie ,brante' 'jane eyre, laura ignal wilder, sylvia erlie, franklin pierse, the greatest minda and ideas of all times, a view of the ocean, wyatt earp, malcomx, ruben blades, the cherokees, roger williams, the conquest of alexander the great, tortured noble tolstoi.

(18-6-12 –కాంప్–అమెరికా)

అమెరికా డైరీ-**19**

## raliegh **బంధువుల** rally

జూన్ నెల 18 సోమవారం నుంచి 24 ఆదివారం వరకు గడిచిన వారం అంతా మా అమ్మాయివాళ్ల పెళ్లి రోజు, విందులు, బంధువుల రాకతో గడిచింది. సోమవారం సాయంత్రం చక్రవర్తి అనిలా దంపతుల గారింట్లో భజనకు వెళ్ళాం. వాళ్ల అప్ స్టెయిర్స్‌లో భజన మందిరంలో అన్ని రకాల దేవుళ్ళు విగ్రహాల రూపంలో ఉంటారు. వాటికి చక్కని అలంకరణ దుస్తులు ఆయన భార్య శ్రద్ధగా చేస్తుంది. చూడ ముచ్చటగా ఉంటుంది మామిడి పనస ముక్కలతో ప్రసాదం పెట్టారు.

సోమవారం పద్దెనిమిదో తేది మా అమ్మాయి విజయలక్ష్మి, అల్లుడు అవధానిల పెళ్లి రోజు. ఉదయమే పులిహోర చేసింది. సాయంత్రం మినప సున్ని ఉండలు చేసి అందరికి పెట్టింది మా అమ్మాయి. మంగళవారం లైబ్రరీకి తీసుకొని వెళ్లి "సమ్మర్ రీడింగ్"లో నన్ను, పిల్లల్ని సభ్యులనుగా చేసింది. దీనివల్ల ఎక్కువ గంటలు చదివినవారికి బహుమతి, ఏదైనా పుస్తకం ఆలస్యంగా తిరిగిస్తే ఉండే ఫైన్ ఉండవు. నాపేరు మీద కార్డ్ ఇచ్చారు. దానిపై నాలుగు పుస్తకాలు తెచ్చుకొన్నాను.

### రాలీ బంధువుల రాలీ

అవధాని మేనత్త లక్ష్మి గారు, భర్త చీమలపాటి దుర్గా ప్రసాదరావుగార్లు నార్త్ కరోలినాలోని రాలీలో సుమారు పదహారేళ్ళ నుంచి ఉంటున్నారు. అంతకుముందు చికాగో, న్యుజెర్సి న్యూయార్క్ వగైరాలలో గత నలభై ఏళ్లుగా ఉంటున్నారు. విజ్జి వాళ్ల పెళ్ళికి వచ్చారు. నార్త్ కరోలినాకు రాజధాని రాలీ. కాని పెద్ద సిటి షార్లెట్. అమెరికా రాష్ట్రాలకు ముఖ్య పట్నాలు చిన్న ఊళ్లల్లోనే ఉంటాయి. అది ఇక్కడి వింత. రాలీ నుంచి వాళ్ళిద్దరూ, వాళ్ల రెండో అమ్మాయి బుచ్చితో మన ఇంటికి శుక్రవారం మధ్యాహ్నం వచ్చారు. అందరికి దోసెలు వేసి పెట్టింది విజ్జి. ఆ సాయంత్రం వాళ్ళు పవన్ వాళ్ళింటికి వెళ్లి రాత్రికి ఇక్కడికి వచ్చారు. వాళ్ల అమ్మాయి స్నేహితురాలింటికి వెళ్ళింది. రాత్రి ఇక్కడే వాళ్ళిద్దరూ భోజనం చేసి పడుకొన్నారు.

శనివారం ఉదయం ఇడ్లి టిఫిన్ చేసింది. నేను ఆయనకు మన హనుమత్ కథానిది, అక్కయ్య పుస్తకాలు ఇచ్చాను. చాలా సంతోషించారిద్దరూ. మధ్యాహ్న భోజనం ఇక్కడే. మామిడి కాయ పప్పు తోటకూర పులుసు, దోసకాయ పచ్చడి, వంకాయ కూర కేరట్ హల్వాతో భోజనం చేశాం. సాయంత్రం వాళ్ళిద్దరూ మేమందరం కలిసి "ikea" అనే పెద్ద షాపింగ్ కాంప్లెక్స్‌కు అరగంట ప్రయాణం చేసి కార్‌లో వెళ్ళాం. ముసలి వాళ్ళిద్దరూ నడవలేరు కనుక చెరో కార్ట్ తీసుకొని చెరో దాల్లో కూర్చోపెట్టి ఎవరి భార్యల్ని వాళ్ళం తోసుకుంటూ షాపింగ్ మాల్ అంతా తిరిగాం.

పైన కూడా ఉంది కాని అప్పటికే అలిసిపోయి పైకి వెళ్ళ లేదు. ఇంటికి కావలసిన వంట పరికరాలు పరుపులు దుప్పట్లు దిండ్లు కొవ్వొత్తులు ఫర్నిచర్ అన్నీ ఉన్నాయి. లేనిది లేదు. వెరైటీ బాగా ఉంటుంది. ప్రభావతి మూడు గిన్నెలున్న సెట్టు పది డాలర్లకు కొన్నది. వాల్లెవో స్టాండ్స్, విజ్జి ఐస్ కప్పులు కొన్నది. ఇక్కడ రిజిస్టర్ చేసుకొన్నా వారందరికి కాఫీ ఫ్రీ. ఇది చూస్తే ఉయ్యూర్లో "సుధీర్ టింబర్ డిపో" జ్ఞాపకం వచ్చింది. అక్కడ ఉదయం పది గంటలకు ఉన్న వారందరికి ఇడ్లి కాఫీ ఫ్రీగా పెడతారు. ఎన్ని ఇడ్లీలు తింటే అన్ని. సాయంత్రం ఆరుగంటలకు కూడా అంతే పునుగులు టీ ఫ్రీ. కొనేవారు ఉండాల్సి వస్తే భోజనం ఫ్రీ. అన్నీ చూసి బేవార్సు కాఫీ అందరం తాగాం. చాలా బాగుంది. ఇంటికి రాత్రి ఏడు గంటలకు వచ్చాం.

శనివారం రాత్రి పవన్ వాళ్ళింట్లో డిన్నర్. రాలీ వాళ్ల ఇద్దరమ్మాయిలు మాకంటే ముందే వాళ్ల ఫ్రెండ్‌తో పవన్ ఇంటికి చేరారు. మేము ఎనిమిదింటికి వెళ్ళాం. కాకరకాయ సెనగపిండి పెట్టి కూర విజ్జి చేసి తీసుకొచ్చింది. తోటకూర పులుసు దోస పచ్చడి కేరట్ హల్వా కూడా చేసి తీసుకొచ్చింది. వాళ్ళు వేడి వేడి గారెలు అల్లం చట్నీ, పుట్నాల చెట్నీతో పెట్టారు. చాలా తిన్నాం. చాలా బాగున్నాయి గారెలు చట్నీలు కూడా. వంకాయ కూర ఆవకాయ, కారత్ కూర కందిపొడి అప్పడాలు, పొట్టు ఒడియాలు, అన్నం పెరుగులతో మృష్టాన్న భోజనం. అన్నీ బానే ఉన్నాయి. గారెలు ఎక్కువ తిన్నాను కనుక మిగిలినవి వాసన చూసినట్లుగా అతికొద్దిగా తిన్నాను. ఆతిధ్యం అదిరింది. వాళ్ల ఆడపిల్లలు బుల్లి బుచ్చి భోజనం చేసి స్నేహితురాలితో వెళ్లిపోయారు. వాళ్ళిద్దరూ పాపం వచ్చీ రాని తెలుగుతో సతమతమవుతున్నా మాట్లాడాలనే తపన ఉన్నవాళ్ళు. మాట్లాడింది కరెక్టేనా అని అడిగి సరి చేయించుకోవటం మెచ్చదగింది. రాత్రికి రాలీ దంపతులు పవన్ వాళ్ళింట్లోనే పడకసీను. మేము ఇంటికి పదిన్నరకు తిరిగి వచ్చాం.

ఆదివారం విజ్జి వాళ్ల ప్రక్క ఇంట్లో ఉండే హైదరాబాద్ వాళ్ళు రవి, గాయత్రి దంపతులు రాలీలను మమ్మల్ని ముందే ఉదయం బ్రేక్‌ఫాస్ట్‌కు ఆహ్వానించారు. అందరం తొమ్మిదిన్నరకు వెళ్ళాం. మళ్ళీ గారెలు రెండు చట్నీలు సంబారు, తమిళుల పొంగల్ చేశారు. అన్నీ బాగా ఉన్నాయి. జున్ను కూడా చేసి పెట్టారు. బాగా రుచిగా ఉంది. కాఫీ కూడా బాగుంది. రవి గారి అమ్మా, నాన్న హైదరాబాద్ నుండి కిందటి వారం వచ్చారు. వారితో పరిచయం అయింది. ఆయన గవర్నమెంట్ ఆఫీసర్‌గా చేసి రిటైర్ అయి విజయనగర కాలనిలో స్వంత ఇంట్లో ఉన్నారు. మన కృష్ణ యాజికి వాళ్ళిద్దరూ petients. అతన్ని గురించి చాలా సదభిప్రాయాన్ని వెలిబుచ్చారు మాలాగానే. ఆడవాళ్ళు ముగ్గురికి జాకెట్టు పండ్లు వెండి పువ్వుబొట్టు పెట్టి ఇచ్చింది గాయత్రి. రాలీ దంపతులు

ఇక్కడున్న రోజులు సరదాగా గడిపారు. విజ్జి కూడా ఆవిడకు తగిన సత్కారం చేసింది. ఆవిడ మనవాళ్ళకు ముగ్గురికి చేతుల్లో డాలర్లు పెట్టింది. వాళ్ళు కూడా అమ్మమ్మా తాతయ్యా అంటూ బానే ఉన్నారు. వాళ్ళిద్దరూ మధ్యాహ్నం పదకొండు గంటలకు కార్‌లో బయల్దేరారు రాలీకి. దారిలో తినటానికి పులిహోర చేసి పాక్ చేసి ఇచ్చింది విజ్జి. ఇలా ఈ వారం సరదాగా, బంధుజన సందోహంగా గడిచిపోయింది. రాలీ ఇక్కడికి మూడు గంటల ప్రయాణం. సుమారు నూట ఎనభై మైళ్ళు. ఆయన ఆవిడా రాలీలో దేవాలయాలలో స్వచ్ఛంద సేవ చేస్తుంటారు. భగవత్ సేవలో జీవితాలను పండించుకొంటున్నారు "దొరకునా ఇటువంటి సేవా".

ఈ వారంలో చదివిన పుస్తకాలు "carolina in american revolution, the battles of lexington and concord, german indians the treaty of paris, to wake the dead, the invention of air the navjos, edgae allan poe"

(26-6-12-కాంప్-అమెరికా)

## గోపాలకృష్ణ గారి - ఆతిధ్యం

Posted on జూలై 3, 2012 by gdurgaprasad

నమస్తే - గోపాలకృష్ణ గారు - "రేడియేషన్ పోయెమ్స్" అనే కవితా సంకలం గురించి నేను రాసిన ఆర్టికల్ ఈ నెల విహంగ వెబ్ మాగజైన్‌లో పడింది. దానిని మీకు పంపాను. మీరు దాన్ని బాపు గారికి పంపుతామన్నారు కదా -పంపండి. కాకాని ప్రసాద్, రామమోహనరావు గార్లకు ఫోటోలు పంపాను. ప్రసాద్ గారికి వెళ్లినట్లు లేదు. మీరు ఫార్వార్డ్ చేయండి . మీ ఊళ్ళో నాకు అత్యంత ఆదరమైన స్వాగతాన్ని, ఆతిధ్యాన్ని మీ "మంచి కుటుంబం" అందరు అందజేసినందుకు కృతజ్ఞతలు. నేను వచ్చి ఇబ్బంది పెట్టానేమోనని మనసులో ఉన్నా, మిమ్మల్ని చూడాలన్న తపన అంతపని చేయించింది. మీ సాహితీ, సాంఘిక మిత్రుల్నీ పరిచయం చేసినందుకు మీ "నార్త్ అలబామా తెలుగు అసోసియేషన్" (నాటా) తరపున మీ సంఘ అధ్యక్షులు రామ మోహనరావు గారితో సన్మానం చేయించి, జ్ఞాపికను అందజేసి నందుకు మీ అందరికి కృతజ్ఞతలు. బహుశా ఈమాట సరిపోదు -చిన్న మాట అవుతుంది. హన్ట్స్ విల్ నేను "వేటపాలెం లేక వేటపల్లి" అనచ్చు అని మీతో చెప్పాను. అది వేటపాలెం అయితే మీరు దాని లైబ్రేరియన్. అంతే కాదు హన్ట్స్ విల్ "రుషి పుంగవులు" మీరు అని నా అభిప్రాయం. మీ ఆలోచనా, సాంఘిక సేవ, సహనం, సమాజంపై అణు కంప స్నేహశీలత, సచ్ఛీలత, ఉదారహృదయం, మిత్రత్వం, బంధు హితం అన్నీ ఒక రుషికి

ఉండే లక్షణాలు. అవి మీలో మూర్తీభావించాయి. అందుకే "హస్ట్ విల్ రుషి" అన్నాను. మీ సహధర్మ చారిణి గారు "స్వయం సిద్ధ". మీకు అనుక్షణ అనుగామిని. సౌశీల్యం కుటుంబ భావనమూర్తీ భావించిన మాతృమూర్తి. మీ పిల్లలు రత్నమాణిక్యాలు. ఇంత కంటే తల్లిదండ్రులకు ఇంకేం కావాలి? మీ అందరి మధ్య రెండు రోజులు క్షణం తీరిక లేకుండా గడిపినందుకు అమితానందంగా ఉంది. నన్ను షార్లెట్ నుంచి మీ ఊరికి రావటానికి నన్ను కార్‌లో ఇక్కడి నుండి మౌంట్ గోమరికి, మళ్ళీ అక్కడి నుండి ఇక్కడికి తీసుకొని వచ్చి, అనుక్షణం "అంకుల్ "అంకుల్" అంటూ నాకే లోటు రాకుండా చేసిన మా అమ్మాయి వాళ్ల ప్రక్కింటి పసుపుల రవికి నేనేమిచ్చి ఋణం తీర్చుకోగలను? మీరు నాకు మౌంట్ గోమరి నుండి హన్ప్ విల్‌కు, ఆక్కడి నుండి మౌంట్ గోమరికి మీ "గ్రే హౌండ్స్ (వేట కుక్కల)" బస్‌లో రిజర్వేషన్ చేయించి, నా ప్రయాణానికి వీలు కల్పించిన మీకు ఎన్ని కృతజ్ఞతలు చెప్పినా తక్కువే.

సరసభారతికి మీరు భారీగా అండగా నిలిచిన విషయం జీవితంలో మరువలేనిది. మీరు చేసిన సత్కారం నాకు కాదు "సరస భారతి"కి అనిమనస్పూర్తిగా భావిస్తూ, అట్లాంటాలో నాటా సభలు జరిగుతున్న సందర్భంలో మీ హస్ట్ విల్‌లో సత్కరించటం నాకు తానా ఆటా, నాటా అలలో సన్మానం అందుకొన్న మహదానందంగా ఉంది. అందరిలోని మంచినీ ఒక్కసారి చూసే అరుదైన అవకాశం కల్పించారు. రెండు రోజుల ముందు మాత్రమే అనుకొన్న ప్రయాణం అత్యంత ఆనందంగా ఫలవంతంగా జరిగింది. ఊహించని ప్రయాణం ఇది. "అలబామాకు అలవోకగా" రావటం జరిగినా, మనసంతా మధుర భావన నిండింది.

అమెరికా డైరీ-**20**

## మైనేని వారి వారం-1

**ప్రయాణానికి నేపథ్యం**

కిందటి వారం అంటే 25-6-12 సోమవారం నుండి 1-7-12 ఆదివారం వరకు జరిగిన విషయాలు అమిత ఆశ్చర్యాన్ని, అమిత ఆనందాన్ని కల్గించాయి. మంగళ వారం సాయంత్రం మా అమ్మాయి విజ్జి పక్క ఇంటి రవి గారు స్వంత పని మీద అలబామాలోని మౌంట్ గోమరికి కార్‌లో వెళ్తున్నారని, మైనేని వారుండే హస్ట్ విల్ దానికి దగ్గర్లోనే ఉంటుందని, ఆయన ఊర్లో ఉంటే ఆరోగ్యంగా ఉండి ఇబ్బంది లేకపోతే అక్కడికి వెళ్ళచ్చు అని చెప్పింది. వెంటనే గోపాలకృష్ణ గారికి ఫోన్ చేశాను. ఆయన ఇంట్లో లేరు. కాసేపటి తర్వాత ఆయనే ఫోన్ చేశారు. విషయం చెప్పాను. అంతకంటే ఆనంద కారకమైంది లేదని మౌంట్ గొమరికి వస్తే హస్ట్ విల్‌కు తీసుకొచ్చే బాధ్యత

తనదేనని చెప్పారు. అప్పుడు రవి గారితో చెప్పాను. అలానే వేళదామన్నారు. గురువారం సాయంత్రం అయిదు గంటలకు బయల్దేరి, రాత్రి పదకొండు గంటలకు మౌంట్ గొమరి వెళ్లామని, మర్నాడు ఉదయం మైనేని వారు నన్ను అక్కడికి తీసుకొనివెళ్ళే ఏర్పాటుచేసి, మళ్ళీ ఆదివారం ఉదయానికి లేక శనివారం రాత్రికి నన్ను మౌంట్ గొమరికి చేరిస్తే చాలని, ఆ మధ్యాహ్నం బయల్దేరి శార్లేట్‌కు రాత్రికి రావచ్చు అని చెప్పారు. ఈ సంగతి గోపాలకృష్ణ గారికి ఫోన్ చేసి చెప్పాను. ఆయన వెంటనే బస్ డిపో వారితో మాట్లాడి శుక్రవారం తెల్ల వారుజామున అయిదింటి బస్‌కు మాంట్ గోమారి నుంచి హస్ట్ విల్‌కు, శనివారం రాత్రి ఆరున్నరకు హస్ట్ విల్ నుండి మౌంట్ గొమరికి టికెట్స్ రిసేర్వ్ చేసినట్లు ఫోన్ చేసి చెప్పారు. రెండే రెండు రోజులలో నిర్ణయమైన ప్రయాణం ఇది. ఎందుకో ఆయన్ను చూడాలని మనసులో అనిపించినా అంత దూరం వెల్లలేని విషయమే నాకు. ఆ కోరిక ఇలా తీరింది. ప్రభావతి, మా అమ్మాయి చాలా సంతోషించారు. ఇదీ ఈ ప్రయాణానికి నేపద్యం. ఇదంతా మా అమ్మాయి విజ్జి ఆలోచనే. ఫలించింది.

## ప్రయాణం – గోపాలకృష్ణ గారితో – ఫొటోస్

**అలవోకగా అలబామా**

నేను రాస్తున్న "సిద్ధ యోగి పుంగవులు" ఇరవై ఎపి సోడ్లతో పూర్తి చేయాలనిపించింది. అందుకే రోజుకు మూడు చొప్పున రాసి బుధవారానికే ఇరవై పూర్తిచేసి ఈ వ్యాస పరంపరను మైనేని గోపాలకృష్ణగారికి అంకితమిచ్చాను. మూడు రోజులు ఊర్లో ఉండను కనుక అంతా పూర్తి చేయాలనే సంకల్పంతో నిద్ర కూడా పట్టలేదు. అయిన తర్వాత "హమ్మయ్య" ఆ కొన్నాను. గురు వారం సామాను సర్దుకొని రెడిగా ఉన్నాను. సాయంత్రం అయిదుకే భోజనం చేసి సిద్ధమయ్యాను. దారిలో తినటానికి తాగటానికి విజ్జి బిస్కట్లు, మంచి నీళ్ళు, జ్యూసులు ఇచ్చింది. భక్తికి సంబంధించిన కొన్ని సి.డి.లు, శ్రీ ఆంజనేయస్వామి చిన్న ఫోటో తీసుకొన్నాను. ఐదున్నరకు రవి గారి కారులో బయల్దేరాం. పటేల్ బ్రదర్స్‌లో కూరలు కొన్నారు రవి. మళ్ళీ ఆరున్నరకు అక్కడి నుండి బయలుదేరాం. చాలా ఎక్స్పర్ట్ డ్రైవర్ రవి. చాలా హాయిగా స్పీడ్‌గా నడిపిస్తూ రెండు గంటల తర్వాత సౌత్ కరోలినాలో ప్రవేశించాం. అక్కడ ఒక పెద్ద "సవన్నా నది" ఉంది. అక్కడ నాకు కాఫీని మాక్డోనాల్డ్‌లో ఇప్పించారు. స్ప్రైట్ కూడా తాగించారు. రెస్ట్ రూమ్స్‌కు వెళ్లి మళ్ళీ బయల్దేరాం. ఒక గంట తర్వాత జార్జియా రాష్ట్ర ప్రవేశం చేశాం. దీని రాజధాని అట్లాంటా. ఇక్కడ కొన్నేళ్ళ క్రితం ఒలింపిక్స్ జరిగాయి. అప్పుడు నగరాన్ని సర్వాంగ సుందరంగా తయారు చేశారు.

పదహారు లైన్ల ఎక్స్ప్రెస్ రోడ్ నిర్మించారు. జిమ్మీ కార్టర్ ఇక్కడి వాడే. అట్లాంటా నగరమే వంద మైళ్ళ పొడవుంటుంది అంటే 150 కి.మీ. దాటటానికి గంటన్నర పడుతుంది. ఎక్స్ప్రెస్ లైన్‌లో గంటకు వంద మైళ్ళ స్పీడ్‌తో కారు నడపాలి అంటే నూట యాభై కిలో మీటర్ల వేగం. మిగతాచోట్ల ఎనభై మైళ్లకు అంటే నూట ఇరవై కి.మీ.తగ్గకుండా ప్రయాణం చేయాలి. అలానే రవి కార్ నడిపారు. అట్లాంటాలో విమానాల రన్వే రోడ్ల మీదకే ఉంటుంది. బ్రిడ్జిల కింద కార్లు ప్రయాణిస్తుంటే పైన రన్‌వే మీద విమానాలు ఎగరటం దిగటం ఆశ్చర్యంగా ఉంటుంది. అంత వెడల్పైన బ్రిడ్జిలు రెండున్నాయి.

అట్లాంటా దాటితే అలబామా రాష్ట్రంలో ప్రవేశిస్తాం. ఇక్కడ ఆబర్న్ యునివేర్సిటికి మంచి పేరు. ఇక్కడే కియా అనే మోటారు కార్లు తయారు చేసే సంస్థ ఉంది. హ్యుండై వారి కర్మాగారము ఉంది. ఇంకో కార్ల ఫాక్టరీ కూడా ఉంది. ఇవి చూసుకుంటూ, రాత్రి పదకొండు గంటలు అంటే అలబామా కాల ప్రకారం మాంట్ మాంట్ గొమరి చేరాం. షార్లెట్ కాలమానం ప్రకారం రాత్రి పన్నెండున్నర. ఇక్కడికంటే అక్కడి టీం ఒక గంట వెనక. రవి స్నేహితుడు సత్యవాళ్ళ ఇంటికి తీసుకొని వెళ్లాడు. అక్కడ రాత్రి బస. మంచి నీళ్ళు తాగి పడుకొన్నాను.

శుక్రవారం ఉదయం నాలుగు గంటలకే సిద్ధం అయి రవి నన్ను బస్ స్టేషన్‌కు తీసుకొని వెళ్లి "గ్రే హౌండ్స్" అనే బస్ సర్వీస్ నడిపే బస్ ఎక్కించారు. పాస్‌పోర్ట్ ఉండాలి. అది అరగంట లేటుగా బయల్దేరి, ఏడు గంటలకు బర్మింగ్ హాం చేరింది. అక్కడ సామానుతో దిగి మళ్ళీ బస్ ఎక్కాలి. అలానే ఎక్కి కూర్చున్నాను. గ్రే హౌండ్స్ అంటే సన్నగా ఉండే "వేట కుక్క జాతి". బాగా వేగంగా పరుగెడుతుంది. అందుకని ఆ పేరు. బస్ మీద దాని బొమ్మ కూడా ముద్రించి ఉంటుంది. దీన్ని ప్రభుత్వం దాదాపు డెబ్బై ఏళ్ళుగా నడుపుతోంది. మన ఆర్.టి.సి.లాంటిది సౌకర్యంగా ఉంటుంది. ఎనిమిదిన్నరకు బస్ బయల్దేరింది. డౌన్ టౌన్ మీదుగా ప్రయాణం చేసి ఉదయం తొమ్మిదిన్నరకు హస్ట్స్ విల్ చేరింది. దారిలో "తెన్నిసి నది" కనించింది. ప్రముఖ నాటక కర్త తెన్నిసి విలియమ్స్ గుర్తుకొచ్చాడు. ఇది చాలా సారవంతమైన రాష్ట్రం. జార్జియా, అలబామాలు తెల్ల బంగారం అనబడే "ప్రత్తి పంట"కు కేంద్రం. మన బొంబాయిని బర్మింగ్ హాం ఆఫ్ డి ఈస్ట్" అనటం గుర్తుకొచ్చింది. మైనేని వారు నన్ను రిసీవ్ చేసుకొని కార్‌లో ఇంటికి తీసుకొని వెళ్లారు. ఎంతో ఆప్యాయత చూపించారు దంపతులు గోపాలకృష్ణ, సత్యవతి గార్లు.

## మంచి కుటుంబం

గోపాలకృష్ణ గారు ఆరడుగుల అంద"గారు". పచ్చని శరీరం. కోటేరు

తీరిన ముక్కు. సంస్కారం శరీరం అంతా నిండిన వారు. ఆప్యాయతకు, ఆత్మీయతకు పెట్టు. స్నేహానికి అర్రులు చాచే స్వభావం. నిరంతర అధ్యయన శీలి. ప్రపంచ సాహిత్యాన్ని పుడిసిలి పట్టారు. భారతీయ సాహిత్యం అంటే యైన లేని మక్కువ. ఇక్కడి లైబ్రరిలో అత్యున్నత హోదాలో పని చేసి రిటైర్ అయారు. ఇంకా చాలా సంవత్సరాలు చేయచ్చు. కాని సంతృప్తితో విరమణ చేశారు. భార్య సత్యవతి గారు సాధ్వి. ఆయనకు నిజమైన అర్ధాంగి. అంతా తానే అయి ఇల్లు దిద్దుకొంటారు. ఆయన వ్యాసంగానికి అడ్డు పడరు చాలా సాధారణ చీర జాకెట్‌తో సామాన్య గృహిణిలా ఉంటారు. న్యాయంగా అలా ఉండాల్సిన ఆవసరం లేదు. కాని ఆవిడకు అదే ఇష్టం. "స్వయం సిద్ధ" అని పిస్తారు. వాళ్ళున్న ఇంటిని "రాంచ్ హౌస్" అంటారు. వెనక విశాలమైన దొడ్డి వుంటుంది. దానిలో అన్ని రకాల కూరగాయల్ని స్వయంగా పెంచి పండిస్తారు. అందరికి ఉచితంగా అందిస్తారు. నాలుగేళ్ళ క్రితం మాకు డెట్రాయట్ కూడా పంపారు. ఆమెకు గోపాలకృష్ణ గారే సర్వస్వం. వీరి పెద్దబ్బాయి కృష్ణ ఇక్కడి స్పేస్ సెంటర్‌లో ఫిసిక్స్‌లో రిసెర్చ్ పెర్సన్. ఎన్నో కొత్త విషయాలను కని పెట్టారు. ఒకసారి ఉయ్యూరు వచ్చినప్పుడు కంప్యుటర్‌ను లైబ్రరికి అందించిన ఉదారుడు. తండ్రికి తగ్గ కుమారుడు. ఇండియా వచ్చినప్పుడు నేను చూశా. అతని భార్య రమ. ఫార్మసిలో ఉద్యోగం. వీరి కుటుంబం ఇక్కడే అయిదు మైళ్ళ దూరంలో ఉంటుంది. ఇతని ఆడపిల్లలు శ్రేయ, సనారా. పెద్దబ్బాయి రవి. "బన్యన్ ట్రీ" అనే ఫైనాన్స్ సంస్థకు అధినేత. స్వయంకృషితో వ్యాపార, వాణిజ్య రంగాలలో ఎదిగిన వాడు. భార్య కవిత డాక్టర్. వీరికి ఒక అబ్బాయి, ఇద్దరమ్మాయిలు. పిల్లలకు తలిదండ్రుల ఆత్మీయతను పంచటంలో ఎంతో సమయాన్ని వెచ్చిస్తారు. తండ్రి మాట జవదాటని కొడుకులు. వారి దారికి అడ్డం రాని తండ్రి. వారి అభివృద్ధే ధ్యేయంగా జీవిస్తున్న సంతృప్తి ఉన్న కుటుంబం. అందుకే "మంచి కుటుంబం" అన్నాను.

నేను స్నానం చేసిన తర్వాత ఇడ్లి, దోసె చట్నీ సాంబారులతో టిఫిన్ పెట్టారు. తిన్నాను గోపాల కృష్ణ గారితో. కాఫీ బాగా ఉంది. గోపాలకృష్ణ గారి కార్‌లో బయల్దేరి ఊరంతా కొంత చూపించారు.

## అమెరికాలో ఆకునూరు

ఉక్కు కాకాని అని పిలువబడే స్వర్గీయ కాకాని వెంకటరత్నం గారిది ఉయ్యూరు దగ్గర ఆకునూరు గ్రామం. అక్కడి కాకాని బ్రహ్మేశ్వరరావు గారి కుమారులు ప్రసాద్, బాబూరావులు దాదాపు ముప్ఫై ఏళ్ళపై నుండి ఇక్కడ స్థిర పడ్డారు. బ్రహ్మేశ్వరరావు గారితో నాకు మంచి పరిచయం ఉంది. ఆయన ఆజాను బాహువు. తెల్లని ఖద్దరు అంచు పంచలు లాల్చీతో ఉండే వారు. దబ్బ పండుమై ఛాయ. చాలా ఆప్యాయంగా

పలకరించే వారు. ఒకసారి ప్రసాద్ గారు ఆకునూరు వచ్చి నప్పుడు అతన్ని నాకు పరిచయం చేశారు అప్పుడు భార్య, ఇద్దరు పిల్లల్ని చూసిన జ్ఞాపకం. ఆ తర్వాత ప్రసాద్ ఇండియా వచ్చినప్పుడు నేను కనిపిస్తే పలకరించే వారు. అది జ్ఞాపకం. బ్రహ్మేశ్వరరావు గారు ఈ మధ్యనే 98 ఏళ్ళ వయసులో పరమ పదించారు. వెంకటరత్నం గారికి కజిన్ అని గుర్తు. ప్రసాద్ తండ్రి కార్యక్రమాలకు ఇండియా వెళ్లి వచ్చారు. వాళ్ళిద్దర్నీ కలుద్దామని మైనేని వారి ఆరాటం. కాకాని బాబూరావు గారు బిజినెస్ మాగ్నెట్. ఎంతో సంపాదించారు. ఎన్నో సంస్థలకు అధినేత. "ఇండియా హౌస్" అనే విశాలమైన స్థలంలో బిల్డింగ్ కట్టి ఎన్నో చెట్లు పెంచి కూరలు పండిస్తున్నారు పెద్ద ఆశ్రమంలా ఉంది. దాన్ని చూశాం. అక్కడి నుండి బాబూరావు గారి ఇంటికి వెళ్ళాం. ఆయన చాలా ఆప్యాయంగా మాట్లాడారు. ఆయన భార్య కృష్ణకుమారి గారు గొప్ప డాక్టర్. ఇక్కడ ఎంతో మందికి పురుళ్ళు పోసిన పుణ్యమూర్తిగా గోపాలకృష్ణ గారు చెప్పారు. ఎన్నో సంఘాలకు ఆమె ప్రతినిధి, వైద్యంలో మంచి పేరు ఆమెకు. మేము వెళ్లినప్పుడు ఇంట్లో లేరు.

## సామాజిక సేవలో ధన్యమైన వనిత

కాకాని ప్రసాద్ పేరు మోసిన వైద్యులు. చాలా కాలం వైద్య రంగంలో ఉంది ఇంకా డబ్బు చాలు అని అనిపించి స్వచ్ఛందంగా విశ్రాంతి తీసుకొంటున్నారు. భార్య శ్రీమతి భవాని గారు ప్రసాద్ గారు మమ్మల్ని ఆదరంగా ఆహ్వానించారు. ఆమె గొప్ప సాంఘిక సేవాకర్త. ఎన్నో మంచి పనులు చేస్తూ హన్ట్స్ విల్‌కు గుండె కాయగా నిలిచి మన్నన పొందుతున్నారు. మన సరసభారతి అన్నదమ్ములిద్దరికి మైనేని వారి వల్ల బాగా తెలుసు. ఉయ్యూరు ఊసులు చదివి ఆనందించారు. తమ చిన్నతనం అంతా జ్ఞాపకం వచ్చిందన్నారు. నా రాక వారికి ఆనందం కల్గిందని చెప్పారు. భవాని గారు చాలా ఆప్యాయంగా పలకరించారు. భారతీయ ధర్మమైన సేవను ఆచరించి చూపిస్తున్నారు. ఒకరకంగా కాకాని వెంకటరత్నం సేవా నిరతి ఇక్కడ ప్రతిఫలించిందని పించింది. అందుకే "అమెరికాలో ఆకునూరు" అన్నాను.

## హెలెన్ కెల్లర్ జన్మ స్థల సందర్శనం

ఇంటికి వచ్చేసరికి రెండు అయింది. భోజనంలో పప్పు చిక్కుడు కాయ కూర, వంకాయ కూర స్క్వాష్ పచ్చడి ఆవకాయ, సాంబారు జిలేబి పులిహోర పాయసంతో సత్యవతి గారు భోజనం వడ్డించారు, కూరలన్నీ దొడ్లో పండినవే. చాలా రుచికరంగా చేశారు. కాసేపు విశ్రమించిన తర్వాత ద్రోణవల్లి రామమోహన రావు గారు వచ్చారు. ఆయన ఇక్కడి "నార్త్ అలబామా తెలుగు అసోసియేషన్" అధ్యక్షులు. చాలా బోళాగా నిర్మోహమాటంగా మాట్లాడుతారు. అన్నీ తెలిసినవారు. రాజకీయాలను కాచి వడ

బోశారు. "దేశ భాషలందు తెలుగు లెస్స" అనే పుస్తకాన్ని సంకలీకరించారు. తెలుగును గురించి ఎవరు ఏయే భావాలు పద్యాల్లో వచన కవితల్లో చెప్పారో అవన్నీ క్రోడీకరించి పుస్తకంగా తయారు చేశారు. కాసేపు మాట్లాడి వెళ్లారు. ఆయన సమక్షంలో బాల మురళిపాడిన "శివానంద లహరి" మొదలైన సి.డి.లు అందజేశాను గోపాలకృష్ణ దంపతులకు.

ఆ తర్వాత గోపాలకృష్ణ గారి పెద్దబ్బాయి కృష్ణ పిల్లలతో వచ్చారు. గోపాలకృష్ణ గారు నేను అతని కార్‌లో బయల్దేరి గంటన్నర ప్రయాణం చేసి మస్కామ్బియా అనే ప్రదేశం చేరాం. అదే హెలెన్ కెల్లర్ పుట్టిన ఊరు. ఆమె జన్మించిన భవనాన్ని ప్రభుత్వం స్మృతి చిహ్నంగా చేసింది. ఆమె పెరిగిన వాతావరణం అంతా చూశాము. దీనికి టికెట్ ఉంది. ఆ తర్వాతా హెలెన్ జీవిత చరిత్రను "గిబ్బన్" రాసిన నాటకం ఆధారంగా ఒక నాటకాన్ని ప్రదర్శించారు. చాలా బాగా అందరు చేశారు. ఆరు బయట గాలరీ ముందు ప్రదర్శన. నూట ఆరు డిగ్రీల ఫారన్ హీట్ ఉష్ణోగ్రత. చెమటలు కక్కుతూ విసురు కొంటూ జనం చూశారు. నిండి పోయారు. ఆమెపై అంతటి అభిమానం. మేము ముందుగా పులిహోర, ద్రాక్ష పళ్ళు డ్రింక్స్ లాన్‌లో కూర్చొని తిన్నాం. ఎనిమిది నుంచి పది గంటల దాకా నాటకం. మధ్యలో పావు గంట విరామం. హెలెన్ జీవితంపై "పాకెట్ ఎడిషన్" కొని నాకు ఇచ్చారు గోపాలకృష్ణ గారు. ఒక గొప్ప ప్రదేశాన్ని గొప్ప ఆవిడ చరిత్రను కనులారా చూసే మహా భాగ్యం కలిగింది అని మహా సంతృప్తి చెందాం. బయల్దేరి ఇంటికి వచ్చే సరికి రాత్రి పదకొండున్నర. మేము వచ్చేసరికి సత్యవతి గారు మజ్జిగ చేసి అందులో కరివే పాకు అల్లం కలిపి రెడి చేశారు. చెరో రెండు గ్లాసులు తాగి పడుకోన్నాం. ఆ రోజు రాత్రి మంచి నిద్ర పట్టి బడలిక పోయింది. ఇంత ప్రయాణంలో నిద్రలేమి లోను నేను చాలా ఫ్రెష్‌గా కనిపిస్తున్నానని మైనేని వారు చాలాసార్లు అనడం వారి విశాల దృక్పధానికి తార్కాణం.

షార్లేట్ నుంచి హంట్స్ విల్‌కు 600 మైళ్ళు. అంటే 900 కి.మీ. మాంట్గోమారి నుండి హన్ట్స విల్‌కు రాను, పోను బస్ చార్జి 250 డాలర్లు. మాంట్ గొమరిలోనే బానిసల తిరుగుబాటు ఉద్యమం ఊపందుకొంది. ఇతర చోట్లకు పాకింది. అక్కడే "మార్టిన్ లూథర్ కింగ్ ఎక్స్ప్రెస్ వే" ఉంది. ప్రత్తి పంట, గోధుమ జొన్న పంటలకు అలబామా ప్రసిద్ధి. పరిశ్రమలు కూడా. హన్ట్స విల్ రాకెట్ కేంద్రం. రాకెట్లను స్పేష్ షిప్‌లను ఇక్కడే తయారు చేసి ఫ్లొరిడాలోని మియామి అనే అట్లాంటిక్ సముద్రతీరం నుండి ప్రయోగిస్తారు.

(2-7-12-కాంప్-అమెరికా)

అమెరికా డైరీ-**21**

## సరస భారతికి నాటా సన్మానం

అమెరికా డైరీ మైనేని వారి వారం-1

జూన్ ముప్పైవ తేది శనివారం -ఉదయమే నిద్రలేచి, పనులు పూర్తి చేసుకొని కాఫీ త్రాగి, కార్‌లో నన్ను మైనేని గారు వారి అబ్బాయి కృష్ణ ఇంటికి తీసుకొని వెళ్ళారు. అప్పటికే అక్కడికి ద్రోణవల్లి రామమోహనరావు గారు వచ్చి ఉన్నారు. కాసేపు మాట్లాడుకొన్న తర్వాత మైనేనిగారు రామమోహన రావు గారితో నాకు శాలువా కప్పించి, వారితో జ్ఞాపికను అందజేశారు. వారు ప్రచురించిన "దేశ భాషలందు తెలుగు లెస్స" పుస్తకాన్ని, వారి అమ్మాయి అనుపమ స్పాన్సర్ చేసి, వెలువరించిన సి.డి.లను అంద జేశారు. ఇది నేను ఉయ్యూరులో చేస్తున్న సరసభారతి సేవలకు అభినందన అని అన్నారు. నేను కృతజ్ఞతలు చెప్పి ఈ సత్కారం "సరసభారతి"కి అమెరికాలో జరిగిన విలువైన సన్మానం అన్నాను. వారి సంస్థ నార్త్ అలబామా తెలుగు అసోసియేషన్ (నాటా)కు కృతజ్ఞత తెలియజేశాను. ఎప్పుడో ఎనిమిది నెలల క్రితం ఫోన్‌లో గోపాలకృష్ణ గారు మాట్లాడుతూ "మీరు ఈసారి అమెరికా వస్తే మీకు సన్మానం చేయాలని మేమందరం అనుకుంటున్నాము" అన్నమాట ఈ రోజూ అనుకోకుండా ఇలా నెరవేరినందుకు ఇక్కడి సభ్యులందరికి కృతజ్ఞతలు అంద జేశాను. ఇది నాకు తానా, ఆటా, నాటాలు చేసినంత ఘన సన్మానంగా భావిస్తున్నానని, సరస భారతికి ఇంతటి ఆదరణ లభించటం, అందులోను "అట్లాంటాలో నాటా సభలు" జరుగుతున్న సమయంలో ఈ సత్కారం అతి విలువైనదిగా భావిస్తున్నానని తెలియజేశాను. ఊహించని రాక, ఊహించని గౌరవం అని విన్నవించాను. కృష్ణ భార్య బ్రేక్ ఫాస్ట్‌గా ఇడ్లీ చట్నీలు, దోసె కాఫీ అందరికి అందించారు. కబుర్లు చెప్పుకుంటు అందరం హాయిగా లాగించేశాం. రామమోహన రావు గారి అమ్మాయి ఇక్కడ డాక్టర్. ఆమే ఇక్కడి లైబ్రరిలో "తెలుగు విభాగం" ఏర్పరచి పుస్తకాలను అందించి భాషా సేవ చేస్తున్నారు. ఇందరు తెలుగు భాషా, సంస్కృతులకు చేస్తున్న సేవ ఎంతో ఆనందాన్ని కల్గించింది.

## తొలి ఏకాదశిన విష్ణు దర్శనం

అక్కడి నుండి నన్ను గోపాలకృష్ణ గారు కార్‌లో ఒక అరగంట ప్రయాణం చేసి "శ్రీ విష్ణు దేవాలయం"కు తీసుకొని వెళ్ళారు. అది ఒక దేవాలయ సమూహం. అందరు దేవుళ్ళు కొలువైన విలువైన ఆలయం. ఆ రోజూ తొలి ఏకాదశి కూడా. స్వామి దర్శనం దివ్య దర్శనంగా ఉంది. ఎక్కడో పుణ్యం మూట కట్టుకోన్నామేమో, ఈ అదృష్టం దక్కింది- కాదు దక్కించారు మిత్రులు గోపాలకృష్ణ గారు. గుడిలో ఉండగానే ఆయనకు మా హస్ట్ విల్ మహర్షి మైనేని వారి స్నేహితులెందరో ఉత్తములున్నారు.

అందులో ఒకరు జిం అబార్ క్రోమ్బి అనే అమెరికన్. ఆయనకు సువిశాల వ్యవసాయ క్షేత్రం ఉంది. ట్రాక్టర్ మెకానిక్. స్టోర్స్ ఉంది. అక్కడికి తీసుకొని వెళ్లి నన్ను ఆయనకు పరిచయం చేశారు. ఆయన ఎంతో ఆత్మీయంగా కౌగలించుకొని స్వాగతం చెప్పారు. ఆయనకు భారతీయ భావనలు, ఆధ్యాత్మిక జీవనం చాలా అభిమానం అని చెప్పారు. యుద్ధంలో పని చేసి ఇప్పుడీ స్వంత కార్యక్రమంలో ఉన్నారు. ఎవరు ఏ సమయంలో ఫోన్ చేసినా, అక్కడ వాలి ట్రాక్టర్ రిపేర్ చేసి వచ్చే సౌమ్యుడాయన. ఫోటోలు తీసుకొన్నాం. వారి కూరగాయల తోట చూశాం. ఇక్కడ ఇంగ్లీష్ వాళ్ళందరూ ఒక కాలనీ ఏర్పాటు చేసుకొని "ఇంగ్లీష్ విలేజ్" అని పేరు పెట్టు కొన్నారు. అక్కడికి నన్ను తీసుకొని వెళ్ళారు గోపాల్ గారు. అక్కడి వీధుల పేర్లు కూడా ఇంగ్లాండ్‌కు సంబంధించినవే. అందులో ఒక పేరు ఇంగ్లాండ్ రాజ్యాంగం హక్కుల చట్టం అనబడే "మాగ్న కార్టా" ఆయన్ని ఇక్కడ అందరు "పాల్ అని గోపాల్" అని అంటారు. అక్కడ "లారీ" అనే ఆయనను నాకు పరిచయం చేశారు. వ్యాపారి. స్కేటింగ్ దియేటర్ ఉంది. ఇంకా వ్యాపారాలు చాలా ఉన్నాయి. ప్రేమగా పలకరించి ఫోటోలు తీసుకొన్నారు. ఏదైనా ఫంక్షన్‌లు వస్తే ఆయనకు ఫోన్ చేస్తే చాలట. నిమిషాలలో అన్నీ ఏర్పాటు చేస్తారట. కృష్ణకు మంచి స్నేహితుడు కూడా లారీ. వీరి "కౌన్సెలింగ్" సంఘానికి లారీ ముఖ్య బాధ్యతలో ఉన్నారు. మా అబ్బాయి రమణ ఉయ్యూరు నుండి ఫోన్ చేశాడు.

గోపాలకృష్ణ గారు చాలా ఉదారులు, సౌమ్యులు, స్నేహశీలి, ఆపద్బాన్ధవులు. వ్యసనాలకు బానిసలైన వారినెందరికో కౌన్సెలింగ్ ఇచ్చి వాటిని మాన్పించే ప్రయత్నం చేస్తున్నారు. వారందరూ వాటిని వదిలి మళ్ళీ జన జీవన స్రవంతిలో కలిసి జీవితాలను బాగుచేసుకొని మళ్ళీ కుటుంబాలకు దగ్గరవుతున్నారు. వారంతా మైనేని వారిని ఒక "మహర్షి"గా భావించటం ఆయనకు లభించిన అరుదైన గౌరవం. ఆప్యాయత, ఆదరణీయత, ప్రేమ, సమాజం మంచిగా ఉండాలనే తపన దానికి తాను చేయ వలసిన కృషిని నిత్యకృత్యంగా భావించి చేయటం ఆయనకు ఒక విధి విధానం, వ్యక్తి సంస్కరణ కోసం ఆరాట పడతారు. అలానే చేస్తున్నారు. ఆయనకు ఇలాంటి పనిలోనే విశ్రాంతి. నేను వారింటికి వచ్చిన శుక్రవారం రాత్రి ఒక సమావేశంలో గోపాల కృష్ణ గారు వ్యసనాల నుండి బయటపడి ఇరవై ఏళ్ళకు పైగా హాయిగా జీవిస్తున్న "ప్రాడిగల్ సన్" లాంటి ఆయనకు సన్మానం చేసి, మెడల్ బహూకరించారు. నిజంగా ఆ కార్యక్రమం గోపాలకృష్ణ గారి చేతుల మీదుగా జరగాలి. కాని నా కోసం దాన్ని "లారీ" గారికి ఆ బాధ్యతను అప్పగించి మాతో కలిసి హెలెన్ కెల్లర్ జన్మస్థలానికి వచ్చారు. అదీ గోపాల్ గారి స్నేహం. అందుకే అందరు ఆయన కోసం అశ్రులు చాస్తారు. చిన్న వాళ్ళల్లో

## షార్లెట్ సాహితీ మైత్రి బంధం

చిన్నవారుగా, పెద్దల్లో పెద్దగా సమాజ సేవలో ముందుగా, వితరణలో గుప్తంగా, జ్ఞాన వృద్ధులలో అగ్రేసరులుగా, సాహితీ ప్రియులకు మార్గదర్శిగా, ఆధ్యాత్మిక జీవులకు ఆదర్శంగా ఉంటారు. ఎన్ని గుప్త దానాలు చేస్తారో తెలియదు. ఎవరికి చెప్పరు. తన పేరు కోసం ప్రాకులాడరు. మంచి జరగాలనే ఆరాటమే ఎప్పుడు. జీవితంలో దెబ్బ తిన్నా వారెందరికో వెన్నెముకగా నిలిచి ధైర్యం చెప్పి, హార్దికంగా, ఆర్ధికంగా సాయం చేసి వాళ్ల జీవితాలలో వెలుగులు నింపుతున్న పుణ్య పురుషులు మైనేని గోపాలకృష్ణ గారు. లేకపోతే జన్మభూమి మీద అభిమానంతో నలభై ఏళ్ళ క్రితం వది లేసిన స్వగ్రామం ఉయ్యూరును గుర్తు పెట్టుకొని అక్కడ లైబ్రరికి భూరి విరాళాన్ని అందజేసి దాన్నిదక్షిణ భారాత దేశంలోనే మొదటి ఏ.సి.లైబ్రరిగా తీర్చిదిద్ది, విలువైన పుస్తకాలను పంపించి, ఆవిష్కరణ రోజున అమెరికా నుండి వచ్చి దగ్గరుండి చూసుకొని ఆనందాన్ని అనుభవించారు. ఆ నిర్మాణంలో నన్నూ కన్వీనర్‌ను చేసి బాధ్యత అప్పగించారు. ఆనాటి జడ్పిటిసి, ఈనాటి ఎంఎల్సి రాజేంద్ర ప్రసాద్. అప్పుడే అంటే ఎనిమిదేళ్ళ క్రితం వారిని ఉయ్యుర్లో మొదటిసారి చూడటం. అప్పటి నుండి కొద్దో గొప్పో ఫోన్‌లో పలకరించు కొంటున్నా, 2008లో మూడవసారి అమెరికాకు వచ్చినప్పుడు బంధం బాగా పెరిగింది. ఫోన్లు మెయిల్‌లో పలకరింపులే అయినా చాలా దగ్గరయ్యారు మా కుటుంబానికి. మా ఇంట్లో అందరికి ఆయన తెలుసు. అంత ఫామిలీ ఫ్రెండ్‌గా ఆదర్శంగా ఉన్నారు. ఇన్ని సుగుణాలుండటం వల్లే వారు నాకు "హన్ట్స్ విల్ మహర్షి" అనిపించారుప

### నాసా స్పేస్ సెంటర్

హన్ట్స్ విల్‌ను "రాకెట్ నగరం" అంటారు. ఇక్కడే మొదట అమెరికా రాకెట్లు తయారు చేశారు. దీనికి ముఖ్యుడు జర్మనికి చెందిన హిట్లర్‌కు నమ్మిన బంటు అయిన "వాన్ బ్రూన్" అనే శాస్త్రవేత్త. అతన్ని అమెరికాకు పిలిపించి అన్ని సౌకర్యాలు కలిపించి రాకెట్‌లను తయారు చేయించారు. ఎక్స్ప్లెలర్ వంటిని ఇక్కడే తయారు చేశారు. ఎన్నో అంతరిక్ష నౌకలకు రూపకల్పన జరి గింది ఇక్కడే. వాన్ మేధో జనితమే ఈ కేంద్రం. అతను "అమెరికా రాకెట్ పితామహుడు". స్నేహితులను చూసిన తరువాత గోపాలకృష్ణ గారు నన్ను ఇక్కడికి తీసుకొని వచ్చారు. ఎక్సిబిషన్ చూశాం. గ్రావిటీ ఫోర్స్ మెషీన్ మీద పైకివెళ్లి కిందికి దింపే దానిలో కూర్చుని అనుభవం పొందాం. అలాగే సెంట్రి ఫూగల్ మెషీన్ ఎక్కి బి.పీ..బరువు పెరిగే దాన్ని అనుభూతి పొందాం. అన్ని వివరంగా నాకు తెలియజెప్పారు. అక్కడే పూర్వకాలం ఏనుగులకు ముందు "మామధ్"లనే భారీ శరీరం ఉన్న ఏనుగుల వంటివి ఉండేవి. వాటి మ్యూజియం చూశాం. అవి ఎప్పుడో అంతరించి పోయాయి. ఏదైనా చాలా భారీగా ఉంటే "మామధ్

సైజ్" అంటాం. అక్కడ స్టార్ బక్స్‌లో "వన్ బై టు" కాఫీ త్రాగాం. మా మనవళ్ళు ముగ్గురికి ఆరోనాట్ బొమ్మ ఉన్న షర్ట్స్ టోపీలు గిఫ్ట్‌గా కొన్నారు గోపాల్ గారు. ఇంటికి చేరేసరికి రెండు అయింది. భోజనం చేశాం. స్వీటు బెండకాయ కూర, పప్పు, దోస చట్నీ, కాకర కూర, సాంబారు, అన్నం, పెరుగులతో మంచి భోజనం చేశాం. కాసేపు విశ్రాంతి తీసుకొన్నాం.

మధ్యాహ్నం మూడున్నరకు లేచి దంపతులతో వారి ఇంటి వెనక పెరటితోట చూశాను. అన్ని రకాల కూరగాయలు, ఆకు కూరలు కుండీలలో పెంచుతున్నారు. సారవంతమైన నేల కనుక బాగా కాస్తున్నాయి. సత్యవతి గారి పెంపకమే ఇది. ఎరువులు వెయ్యరు. అన్నీ నాచురల్‌గా ఉండాలని వారి ఆరాటం వాషింగ్ మెషీన్ ఉన్నా బట్టలు స్వయంగా ఉతికి దొడ్లో దణ్ణాల మీద ఆరేస్తారు. కుట్టు పని, అల్లకం వచ్చు లాన్‌ను స్వంతంగా మెషిన్‌తో కట్ చేస్తారు. వర్షపు నీటిని వృధా పోకుండా పెద్ద కుండీలో నిల్వచేసి మొక్కలకు ఉపయోగిస్తారు. తాను ఊరికి వెడితే గోపాల్ గారు కష్టపడకుండా పదార్ధాలు చేసి ఫ్రీజ్ చేసి దాస్తారు ఫ్రిజ్‌లో. ఆయన కష్టపడటం ఆవిడకు ఇష్టం ఉండదు. వారిద్దరూ "జీవికా జీవులు"గా ఉంటారు. అదీ వారి ప్రత్యేకత. నాకు ఆయాన ఆరు విలువైన పుస్తకాలు బహూకరించారు. కరివేపాకు మొక్క ఇచ్చారు మా అమ్మాయికి. బూంది ఫలహారం చేసి కాఫీ తాగి ప్రయాణానికి సిద్ధమయాం. కృష్ణ కుటుంబం కూడా వచ్చింది. అందరం గ్రూప్ ఫోటోలు తీసుకొన్నాం. సాయంత్రం అయిదింటికి బయల్దేరి నన్ను బస్‌స్టేషన్‌లో దింపారు. బస్ ముప్పావు గంట లేటు. అప్పటి దాకా ఉండి, వీడ్కోలు చెప్పి ఇంటికి వెళ్ళారు.

నిన్నటి నుంచి మండు వేసవిలో 105 డిగ్రీల వేడిలో నన్ను వెంటేసుకొని క్షణం తీరిక లేకుండా తిప్పారు. నిన్న నేను బస్ దిగగానే చూస్తే "పచ్చగా దబ్బపండు ఛాయాతో ముఖం వెలిగిపోయింది "కాని ఇవాళ చూస్తే" నల్లబడి కమిలి పోయింది. 78 ఏళ్ళ ఈ వయసులో స్నేహితులంటే అంత తాపత్రయం. నేను వారింట్లో నుంచి బయల్దేరేటప్పుడు వారి భార్య గారితో "గోపాల కృష్ణ గారి ఆరోగ్యం నేను వెళ్ళిన తర్వాత దెబ్బ తింటే అది నా తప్పు. మెరుగ్గా ఉంటే అది ఆయన గొప్పతనం" అని అన్నాను. ఇద్దరు నవ్వారు. ఆయన లెక్క ప్రకారం నేను రావటం వల్ల ఆయన ఎనర్జీ లెవెల్ బాగా పెరిగిందని చెప్పారు. పెరక్క పోయినా ఫర్లేదు కాని తరక్కుండా ఉంటే చాలు. బస్ బయల్దేరే ముందు నేను ఊహించని భారీ కానుకను నా చేతులో పెట్టి సరస భారతికి దాన్ని ఉపయోగించమని మంచి మనసుతో చెప్పిన త్యాగమూర్తి గోపాల కృష్ణ గారు. సరస భారతి అంత గొప్పగా ప్రాచుర్యం పొంది జన హృదయాలను కదిలిస్తున్నందుకు ఆనందంగా ఉంది.

ఇవన్నీ నేమరేసుకొంటు బస్ ఎక్కాను. అది రాత్రి తొమ్మిదింటికి బర్మింగ్ హాం చేరింది. అక్కడ తొమ్మిదిన్నరకు బయల్దేరి రాత్రి పదకొండుకు మాంట్ గొమరి చేరింది. రవి గారు వచ్చి నన్ను సత్యా వాళ్ల ఇంటికి తీసుకొని వెళ్ళారు. అక్కడ భోజనం ఏర్పాటు చేసారు. నేను ద్రాక్ష పళ్ళు తిని పడుకొన్నాను నిద్ర పట్టలేదు.

## తిరుగు ప్రయాణం

జూలై ఒకటి ఆదివారం– ఉదయాన్నే లేచాం. సత్య భార్య జయంతి దోసెలు చేసింది. తిని కాఫీ తాగాం. వాళ్ల దొడ్లో అరటి మొక్కలున్నాయి. కూరలు మల్లెలు బాగా ఉన్నాయి. ఆమె ఉయ్యూరులో కోట శ్రీ రామమూర్తి గారింట్లో పుట్టిందట. అనుకోకుండా అలబామాలో ఉయ్యూరు వాళ్ళు ఇంకొరు దొరికారు. వాళ్ల నాన్న ఎక్సైజ్ ఇన్స్పెక్టర్. కోట వారింట్లో అద్దెకున్నారట. అసలు గుడి వాడ. పుట్టింటి వారి ఇంటి పేరు గూటాల.

రవిగారి కార్‌లో పదిన్నరకు హన్ట్స్ విల్‌లో ఉన్న ఆయన గ్యాస్ స్టేషన్, గ్రోసరీ షాప్‌కు చేరాం. దీన్ని జీవన్, రమేష్ అనే ఇద్దరు చూస్తుంటారు. ఇద్దరు కుర్రాళ్ళే. రమేష్ వంట చేశాడు. బెండకాయ కూర, కాకర కాయ పులుసు, దొండకాయ కూర. అన్నంలో పసుపు జాపత్రి వంటివి వేసి కిచిడి చేశాడు, పెరుగుతో తిన్నాం. జీవన్ పదేళ్ళ నుంచి రవి దగ్గర పనిచేస్తున్న నమ్మ కస్తుడు. ఇద్దరు షాప్‌లోనే నివాసం. వంటా, పడక అంతా అక్కడే. ఏడాదికో రెండేళ్ళకో ఇండియా వెళ్లి వస్తారు. జీతాలు బానే ఇస్తారు రవి. నిజామాబాద్‌కు చెందిన రెడ్ల కుర్రాళ్ళు. మధ్యాహ్నం ఒంటి గంటన్నరకు కార్‌లో బయల్దేరాం ఇంటికి. రెండు గంటల్లో అట్లాంటా టైం ప్రకారం సాయంత్రం అయిదుకు చేరాం. అక్కడ "శరవణ భవన్"లో మషాలా దోష తిని కాఫీ త్రాగాం. బానే ఉన్నాయి. అక్కడి నుండి బంగారు నగల షాప్‌కు వెళ్లాం. రవి భార్య గాయత్రి కోసం బంగారు గొలుసు కొన్నారు. ఆరవ తేది ఆమె పుట్టిన రోజూ కానుకగా. ఆయనతో పాటు నాకూ గిఫ్ట్‌గా వినాయకుని విగ్రహాన్ని ఇచ్చారు షాప్ వాళ్ళు. అక్కడి నుంచి "చెరియన్" అనే భారీ గ్రోసరీలో కూరలు సరుకులు రవి కొనుక్కొన్నారు. చెరుకు రసం త్రాగాం. ఫ్లారిడాలో చెరుకు పండుతుంది. కూరలు కూడా అక్కడి నుంచే వస్తాయి. చాలా చవక. పెద్ద గ్లాసుల్లో ఇంటికి పిల్లలకు తీసుకొన్నాం. రాత్రి ఏడున్నరకు బయల్దేరి పదకొండు గంటలకు షార్లెట్‌లో ఇంటికి చేరాం. దారిలో వర్షం పడింది. మజ్జిగ తాగి పడుకొన్నాను.

## ప్రయాణంలో పదనిసలు–

బర్మింగ్ హాం అలబామా రాష్ట్రంలో పెద్ద నగరం. ఇనుము, ఉక్కు పరిశ్రమకు పెద్ద పేరు. బొగ్గు విస్తారంగా లభించే ప్రాంతం. వాణిజ్య కేంద్రం. అలబామా రాష్ట్ర

రాజధాని మాంట్ గొమరి. సముద్రం దగ్గరే. నాలుగైదు బీచెస్ ఉన్నాయి. మార్టిన్ లూథర్ కింగ్ ఇక్కడ చర్చి బోధకుడుగా ఉండేవాడు. అతను జన్మించింది జార్జియా రాష్ట్రంలోని అట్లాంటానే. అలబామాకు “కాటన్ స్టేట్” అని పేరు. పత్తి బాగా పండే రాష్ట్రం. దాని కోసమే బానిసలను తెచ్చి తెల్లవాళ్ళు వాళ్లతో వ్యవసాయం చేయించే వారు. బానిసల తిరుగుబాటు కూడా ఇక్కడే ప్రారంభమైంది. దక్షిణ రాష్ట్రం అలబామా. సివిల్ వార్‌కూ కేంద్రమే. ఈ రాష్ట్ర పక్షి “ఎల్లో hammer బర్డ్ ఆ పేరుతోను రాష్ట్రాన్ని పిలుస్తారు సౌత్ ఈస్ట్‌లో. అంటే అమెరికా ఆగ్నేయ భాగాన అలబామా ఉంది. నార్త్ ఈస్ట్‌లో అంటే ఈశాన్య భాగంలో ఫ్లోరిడా ఉంది. ఈ రెండిటిని చూశాను. ఫ్లోరిడాను మొదటిసారి అమెరికాకు టెక్సాస్‌లోని హూస్టన్‌కు వచ్చినప్పుడు అంటే పదేళ్ళ క్రితం అల్లుడు అవధాని గ్రాడ్యుయేషన్‌కు నోవా యూనివెర్సిటిలో జరిగినప్పుడు అందరం వెళ్లి మయామి బీచ్ వగైరాలు చూశాం. ఇలా మొదలై అలబామా పర్యటన రవిగారు, మైనేని గార్ల సౌజన్యంతో అనుకోకుండా అలవోకగా ఆనందంగా జరిగింది. నిరుడు జూన్‌లో మా బావ మరిది ఆనంద్ కుటుంబంతో కాశీ రామేశ్వరాలు చూస్తే ఈ జూన్‌లో “అలబెమా” చూశాను. ఇక్కడ అలానే పిలుస్తారు. ఇదో ప్రపంచం. ఎక్కువ ఆఫ్రికన్ ఇండియన్స్ ఉన్న దక్షిణ రాష్ట్రాలివి. భాషలో యాస ఎక్కువ. ప్రభుత్వం వీరికోసం చాలా సహాయం చేస్తోంది. ఇప్పుడే నాగరక జీవితం సాగిస్తూ అభ్యుదయం చెందుతూ అన్ని పదవులను నిర్వహిస్తూ వారి జాతికి గర్వ కారణంగా నిలుస్తున్నారు.

(3-07-12 -కాంప్-అమెరికా)

అమెరికా డైరీ-**22**

## అమెరికా దీపావళి వారం-1

గడచిన వారం అంటే జూలై రెండు సోమవారం నుండి ఎనిమిది ఆదివారం వరకు విశేషాలు- గురుపౌర్ణమి, అమెరికా స్వాతంత్ర దినోత్సవం, మా అట్లాంటా ప్రయాణం. మేము అమెరికా వచ్చి మూడు నెలలయింది.

### గురు పూర్ణిమ

జూలై మూడవ తేది మంగళ వారం పౌర్ణమి రోజును వ్యాస పౌర్ణమిగా, గురు పూర్ణిమగా జరుపుకోవటం ఆనవాయితీ. ఆ రోజే షిర్డీలో కూడా సాయి బాబా జయంతిని వైభవంగా చేస్తారు. ఇక్కడి డాక్టర్ మహేష్ డాక్టర్ గౌరీ దంపతులు వాళ్ళ స్వంత ఇంట్లో గురు పూర్ణిమ మహోత్సవానికి ఆహ్వానించారు. దాదాపు యాభై మంది హాజరైనారు. రాత్రి ఏడు గంటల నుండి ఏడున్నర వరకు స్తోత్రాలు, గణేశ ఉపనిషత్తు, నమక చమకాలు పఠనం చేశారు. మా అల్లుడు అవధాని నమక చమకాలు చదివాడు.

ఆ తర్వాత గంటసేపు అంటే ఎనిమిదిన్నర వరకు భజన కార్యక్రమం నిర్వహించారు. మా అమ్మాయి విజ్జి రెండు భజనలు, మా పెద్ద మనవడు శ్రీకేత్ రెండు భజనలు గానం చేశారు. ఆ తర్వాత అందరికి విందు. ఇడ్లీ, గారే, గులాబ్ జాం, రెండు చట్నీలు చపాతీ, రెండు కూరలు, సాంబారు, పులి హోర, సాంబార్, పెరుగన్నంతో రుచికరమైన భోజనం ఏర్పాటు చేశారు. డాక్టర్ గౌరీ ఆడవాళ్ళ ందరికి బొట్టుపెట్టి జాకెట్, పసుపు కుంకుమ, వెండి పూత పూసిన పళ్ళెం, పళ్ళు ఇచ్చారు. మేమిద్దరం మొదటిసారిగా వాళ్ళింటికి వచ్చినందుకు డాక్టర్ సర్వేష్ సంతోషం ప్రకటించారు. ఆయన ఈ రీజియన్ సాయి సంఘానికి ప్రెసిడెంట్. ఎన్నో వైద్య కార్య క్రమాలను భార్యా భర్తా నిర్వహిస్తూ సమాజ సేవ చేస్తున్నారు. మేము వచ్చినదగ్గర్నుంచి పరిచయం. వాళ్ళ ఇంటి పేరు "సత్తి రాజు", బాపూ గారి ఇంటి పేరే. అయితే బాపుతో పరిచయం లేదని నాకు మొదటిసరి పరిచయమైనప్పుడే చెప్పారు.

## అమెరికా స్వాతంత్ర దినోత్సవం

మనం నరకాసుర సంహారం జరిగిన మర్నాడు దీపావళిని వైభవంగా దీపాలంకరణతో, టపాకాయలు కాల్చి జరుపు కొంటాం. అమెరికాలో బ్రిటీష పాలనతో విసిగిపోయిన పద మూడు కాలనీ వాసులు, అనేక హెచ్చరికలు బ్రిటీష ప్రభుత్వానికి చేసినా పెడచెవిన పెడితే, తిరగబడి, అందరు ఏకమై 1776 జూలై 4న తాము బ్రిటీష ప్రభుత్వాన్ని గుర్తించమని, తాము స్వాతంత్రాన్ని పొందుతున్నామని సంయుక్తంగా ఒక డిక్లరేషన్ ప్రకటించి స్వాతన్త్ర్యాన్ని ప్రకటించుకొన్నారు. అప్పటి నుండి జూలై నాలుగును అమెరికా స్వాతంత్ర దినోత్సవంగా మహోత్సాహంగా జరుపుకొంటున్నారు. ఇప్పటికి 236 ఏళ్ళు. ఆ రోజు రాత్రి తొమ్మిదిన్నర నుండి పదిన్నర వరకు ప్రభుత్వాధ్వర్యంలో అనేక రకాలైన టపాకాయలు కాల్చి సంబరాన్ని అంబరం అంత ఎత్తుకు తీసుకొని వెళ్తారు. ఆ గంటా ఆకాశం అంతా వెలుగుల పున్నమే. రవ్వల జలతారు. ధమ ధమ ధమ ధ్వనులే. ఆకాశం అంతా ఎన్నో హరివిల్లులతో కనుల విందు చేస్తుంది. నాన్ స్టాప్‌గా గంటసేపు కన్నులకు పండువే. దీన్ని చూడటానికి ఎంతో దూరం వెళ్లి టికెట్ కొని చూసి ఆనందిస్తారు. అక్కడ దొరికే బాణాసంచా కొని జనం కూడా కాలుస్తారు. అపార్ట్‌మెంటల్ దగ్గర కాల్చ రాదు. కౌంటీ లలో, ఇండిపెండెంట్ హౌస్‌లలో కాల్చుకోవచ్చు. మిగిలిన రోజుల్లో ఎప్పుడూ ఈ సందడి కనిపించదు. మా అమ్మాయి, అల్లుడు, మనవళ్ళు వెళ్లి అమెరికా దీపావళి చూశారు. మేము పదేళ్ళ క్రితం మొదటిసారి వచ్చినప్పుడు హూస్టన్ నగరంలో ఆ వేడుక చూశాం. నాలుగేళ్ల క్రితం షికాగోలో సరస్సులో స్టీమర్ మీద ఉండి ఫైర్ వర్క్స్ చూసి ఆనందించాం. ఏమైనా చూడముచ్చటైన పండుగే. ఎన్నో రకాలు, ఎన్నో రంగులు, ఎన్నెన్నో మోడల్స్ కనువిందు చేస్తాయి.

స్వాతంత్రంలో ఉన్న హాయిని అనుభవవిస్తు అమెరికా వారు జరిపే సంబరం ఇది. మా అమ్మాయి, అల్లుడు, మనవలు వరుసగా మూడు రోజులు ఇంటి దగ్గరే టపాకాయలు కాల్చి వేడుక చేసుకొన్నారు.

## అట్లాంటా ప్రయాణం

క్రిందటి వారమే నేను అట్లాంటా మీదుగా, అలబామా వెళ్లి హన్ట్స్‌విల్‌లోని మా స్నేహితులు మైనేని గోపాలకృష్ణ గారింటికి వెళ్లి వచ్చాను. మా అమ్మాయి వాళ్ళు ఎప్పుడూ అట్లాంటాను చూడలేదట. అందుకని అందరం కారులో బయల్దేరి మూడు రోజుల పర్యటన చేయాలని నిర్ణయించారు. షార్లేట్‌కు అట్లాంటా సుమారు 260 మైళ్ళ దూరం. అంటే సుమారు నాలుగు వందల కిలో మీటర్ల దూరంలో ఉంది. మూడున్నర గంటల డ్రైవ్. మధ్యలో విశ్రాంతి ఒక గంట. అంటే అయిదు గంటల సమయం. అది జార్జియా రాష్ట్రంలో ఉంది. జార్జియాకు రాజధాని అట్లాంటా. ఒక పెద్ద పట్నం రాజధాని అవటం ఇక్కడే చూస్తాం. నార్త్ కెరొలినా దాటగానే సౌత్ కెరొలినా దాని తర్వాత జార్జియా రాష్ట్రాలు వస్తాయి. బ్రిటన్ రాజు జార్జి రెండు పేరు మీదుగా జార్జియా రాష్ట్రం పేరు వచ్చింది. అమెరికాలో జనాభాలో తొమ్మిదవ స్థానంలో ఉంది. టెక్సాస్ రాష్ట్రం తర్వాతా బాగా వేగవంతంగా అభివృద్ధి చెందుతున్న రాష్ట్రం. 1829లో జార్జియా మౌంటేన్‌ల వద్ద బంగారు నిక్షేపాలు లభించాయి. అందువల్ల గోల్డ్ రష్ పెరిగింది. ఇక్కడ రెడ్ సెడార్ వృక్షాలు ప్రసిద్ధి చెందాయి. అనేక రకాల పైన్ చెట్లున్నాయి. ఓక్, మాపిల్ చెట్లూ ఎక్కువే. ఈ రాష్ట్రం డెమొక్రాటిక్ పార్టీకి వెన్నుదన్నుగా నిలిచింది. 1976లో ఈ రాష్ట్రానికి చెందినా జిమ్మీ కార్టర్ ప్రెసిడెంట్ అయాడు. ఇక్కడ పట్టి, జీగిలి,పెకాన్స్, పీచులు బాగా పండుతాయి. ఇక్కడి "చారోకీ రోస్" చాల ముచ్చటగా ఉండే పుష్పం. దీన్ని "పీచ్ స్టేట్" అంటారు. గ్రానైట్ రాయికి కేంద్రం. లైవ్ ఓకే వృక్షం వీరి జాతీయ వృక్షం. వీరి రాష్ట్ర పక్షి- బ్రౌన్ త్రాషర్. జార్జియా దగ్గరే సవాన్నా నది ప్రవహిస్తుంది.

అట్లాంటాలో 1996లో జూలై 19–ఆగస్ట్ నాలుగు మధ్య సమ్మర్ ఒలింపిక్స్ జరిగాయి. centinnial ఒలింపిక్స్‌గా దాన్ని పిలిచారు. 197 దేశాలు, 10, 318 క్రీడాకారులు పాల్గొన్నారు. ఒలింపిక్స్ నిర్వహించిన అయిదవ అమెరికా సిటి అట్లాంటా. సమ్మర్ ఒలింపిక్స్ జరిపిన అమెరికాలోని మూడవ సిటి. అప్పుడు దేశానికి ప్రెసిడెంట్ బిల్ క్లింటన్. ఇప్పుదు అట్లాంటాలో జూలై ఆరు నుండి ఎనిమిది వరకు "ఆటా" తెలుగు సంబరాలు జరుగుతున్నాయి.

మేము ఆరవ తేది శుక్రవారం ఉదయం ఎనిమిదిన్నరకు కార్‌లో బయల్దేరాం. దారిలో వెంట తెచ్చుకొన్న పులిహోర తిన్నాం. యోగాత్ అనే పెరుగు తిన్నాం. ఆరగా

ఆరగా జ్యూసులు తాగుతూ చల్లని మంచి నీళ్ళు జుర్రుతు, మధ్యాహ్నం పన్నెండు న్నరకు "హాలిడే ఇన్" అనే చోట రెండు రూములు తీసుకొని బస చేశాం. కాసేపు విశ్రాంతి తీసుకొన్నాం.

## కోకా కోలా ప్లాంట్

కోకా కోలా మోడల్ ప్లాంట్కు మూడు గంటలకు చేరాం. ఇది డౌన్ టౌన్లో ఉంది. ఇక్కడే సి.యెన్.యెన్.కేంద్రం, జార్జియా ఆక్వేరియం కూడా ఉన్నాయి. ఒక గొప్ప రద్దీ కేంద్రంలో ఇవన్నీ ఉండటం అరుదు. అన్నీ దగ్గర దగ్గరలోనే ఉన్నాయి. ఈ మూడు దీనితోపాటు దూరంగా ఉన్న జూ చూడటానికి మా అందరికి కలిసి టికెట్ల ఖరీదు 500 డాలర్లు. దాదాపు ఒక్కొక్కరికి 25 డాలర్లు ఉంటుంది. "ముసలి ముతా"కి కన్సెషన్ రెండు డాలర్లు మాత్రమే ఒక్కో టికెట్ మీద. ప్రభావతికి వీల్ చైర్ తీసుకుంది విజ్జి. దానికోసం ఐడెంటిటి కార్డ్ అప్పగించాలి. తిరిగి ఇచ్చినప్పుడు కార్డ్ తీసుకోవాలి. దీనికి డబ్బు లేదు. అన్ని భాగాలను చక్కగా చూపించారు. బాటిల్స్లో నింపటం సీల్ చేయటం పిల్లలకు సరదాగా ఉంటుంది. దాదాపు రెండు గంటల కార్యక్రమం. ఇక్కడే కోకా కోలా గురించి 4d థియేటర్లో డాక్యుమెంటరి చూపించారు. వస్తువులు మన ముందుకు వచ్చిన అనుభూతి కలుగు తుంది. నీళ్ళు మీద పడ్డట్లున్నట్టుంది. కుర్చీలు కదిలిపోతున్న ఫీలింగ్ వస్తుంది. పూలు చేతికి అందినట్లు కన్పిస్తాయి. అందరు అందుకోవటానికి చేతులు జాస్తారు. ఇదంతా ఎఫెక్ట్ మాత్రమే. ఆ తర్వాత 60 రకాల కోకా కోలాలు ఉన్న ఒక హాల్లోకి తీసుకొని వెళ్తారు. అక్కడ పెద్ద డ్రమ్ములలో వివిధ ఖండాలకు చెందిన కోకా కోలాలు ఉంటాయి. వాటిలోంచి మనకు కావలసిన దాన్ని ప్రక్కనే ఉన్న గ్లాస్లో పైప్ల ద్వారా పట్టుకొని ఎన్నిసార్లైనా తాగవచ్చు. పిల్లలు మస్తుగా ఎంజాయ్ చేస్తారు. నేనూ అన్ని రకాలను టేస్ట్ చేశాను. అమెరికన్, ఆశియన్ వరైటీలు తాగటానికి బాగా ఉన్నాయి. అక్కడంతా సందడే సందడి. అందరికి తలా ఒక నిండు కోకా కోలా బాటిల్ ఉచితంగా ఇస్తారు. అందరం నోక్కేశాం. "ఫ్రీగా వస్తే ఫినాయిల్ అయినా రెడీ" అన్న సామెత రుజువు చేశాం. బయటకు వచ్చి ఉడిపి కృష్ణా భవన్కు వెళ్లి టిఫిన్ తిన్నాం. పూరీ చపాతి అట్టు, చాట్ మసాలా అన్ని రకాలు ఉన్నాయి. రుచిగానే ఉన్నాయి. తెలుగు వాళ్ళు ఆటా సంబరాలకు సాంప్రదాయ వస్త్రధారణతో చాలా మంది కనిపించారు. ముఖ్యంగా స్త్రీలు చీర సిన్గారించే కనిపించారు. హోటల్ బాగా రద్దీగా ఉంది. అదొక పెద్ద మాల్లో ఉన్నది. హాలిడే ఇన్కు రాత్రి పదింటికి చేరాం. హాయిగా నిద్రపోయాం. ఇక్కడ గదులకు తాళం చెవులు క్రెడిట్ కార్డుల్లా ఉంటాయి. దాన్ని తాళం దగ్గర స్పేస్లో పెడితే తాళం తెరుచు కుంటుంది. బయటికి వెళ్ళేటప్పుడు కార్డ్ జేబులో పెట్టుకొని వెళ్ళాలి. ఇదీ మొదటి రోజు సమాచారం.

(10-7-12- కాంప్-అమెరికా)

అమెరికా డైరీ-**23**

అమెరికా దీపావళి వారం-2

## సి.యెన్.యెన్.సెంటర్

రెండో రోజు- జూలై ఏడవ తేది- శనివారం- ఉదయమే హాలిడే ఇన్‌లో వాళ్ళు ఏర్పాటు చేసిన కాఫీ కలుపుకొని తాగి కారు ఎక్కి, డౌన్ టౌన్‌లోని సి.యెన్.యెన్.సెంటర్‌కు చేరాం. అక్కడున్న హోటల్‌లో బ్రెడ్ తిని కాఫీ తాగి లైన్‌లో చేరాం. ముందుగా పైఅంతస్తులోకి తీసుకొని వెళ్లారు. అక్కడ వార్తలను ప్రసారం చేసే విధానం చూపించారు. వాతావరణ వివరాలు ఎలా ప్రసారం చేస్తారో వెదర్ చార్ట్ ఎలా ఉంటుందో బ్రేక్ న్యూస్ ఎలా ప్రసారం చేస్తారో, రంగులు ఎలా మారతాయో ఒక అమ్మాయి బాగా వివరించి చెప్పింది. అక్కడ ఉన్న సీట్‌లో ఎవరైనా కూర్చుని వార్తలను చదవమంది. మా మనవడు శ్రీకేత్ వెంటనే వెళ్లి కూర్చుని ఎదురు ఉన్న స్క్రీన్ చూస్తూ వార్తలు చదివాడు. అందరం చప్పట్లు కొట్టాం. అక్కడి నుండి మెట్ల మీదుగా కిందికి దిగి అసలు వార్తా ప్రసారం లైవ్‌గా ఎలా జరుగుతుందో చూపించారు. అనుమానాలుంటే అడగమన్నారు. అడిగినవాళ్ళ డౌట్స్ క్లియర్ చేశారు. ఆ అమ్మాయి చాలా చలాకీగా ఉండి అందర్నీ ఉత్సాహ పరిచింది. అక్కడి నుండి, ఇంకా కిందికి దిగి ఇంకో చేంబర్‌లో జరిగే ప్రసారాలను చూశాం. ఇట్లా ఎనిమిది స్టెప్పులు దిగి చూడాలి. మాకు ఫరవాలేదు కాని ప్రభావతి ఇంకా మెట్లు దిగలేనంది. వీల్ చైర్ సౌకర్యం మధ్యాహ్నం మాత్రమే ఉందని చెప్పింది. ఈ విషయం ముందే చెప్పాలి అని కసిరాం. చెప్పాం మీరు విని పించుకోలేదేమో అన్నారు సెక్యూరిటి వాళ్ళు. లిఫ్ట్ మీదుగా కిందికి దింపితే వచ్చేశాం. పిల్లలకు పెద్దగా హుషారుగా లేదు.

## ఆక్వేరియం

దగ్గరలోని జార్జియా ఆక్వేరియంలోకి వెళ్ళాం. ఇక్కడ వీల్‌చైర్ స్సౌకర్యం ఉంది. ఉపయోగించు కొన్నాం. ఫ్రీ. విజ్జే వీల్ చైర్ తేవటం ఇవ్వటం, వాళ్ళమ్మను తోయ్యటం అంతా తానే చేసింది. నేను విగ్రహం పుష్టిగా పక్కన ఉన్నానంతే. నదుల్లోని చేపలు, కాలిఫోర్నియాలోని కోల్డ్ ఫిష్, నక్షత్ర చేపలు అనేక రకాలు చూశాం. ఆ తర్వాత ఒక ఆడిటోరియంలో "డాల్ఫిన్" ప్రదర్శన ఏర్పాటు చేశారు. అరగంటకు పైగా కార్యక్రమం. మధ్యాహ్నం ఒకటిన్నర నుండి రెండు వరకు. తెర ముందు చిన్న సరస్సు. దానిలో డాల్ఫిన్లు. వాటిని ఆడించే ఆడ, మగా కుర్రాళ్ళు. పైన కామెంట్ చెప్పేవాడు. డాల్ఫిన్లు ఆకాశంలో నక్షత్రాల నుంచి వచ్చాయని నమ్మకం. నక్షత్ర సముదాయం డాల్ఫిన్ ఆకారంగా ఉండటం తెరమీద చూపించారు. అనేక రకాలైన ఫీట్స్‌ను డాల్ఫిన్లతో చేయించారు. వాటి మీద స్వారి చేశారు. వాటితో ముందుకు

తోయిస్చుకొన్నారు. సౌండ్‌ను బట్టి వాటిని డాన్స్ చేయించారు. ఒక్కసారిగా అవి నీటిలోంచి ఆరడుగుల ఎత్తు యెగిరి నీటిలోకి దూకటం బలే సరదాగా ఉంటుంది. బాక్ స్విమ్మింగ్ చేశారు, చేయిస్తారు. పాముల్లా మెలికలు తిరిగి ఆడుతాయి. ఎంతో తర్ఫీదునిచ్చి ఇలా చేయించటం అబ్బురంగా ఉంది. నుంచొని నడిచి వింత అనిపిస్తాయి. మళ్ళీ డాల్ఫిన్లు నక్షత్ర మండలానికి వెళ్ళే కోరిక ఉందని తెలియజెప్పుతూ షో ముగిస్తారు. చప్పట్లే చప్పట్లు. హాలంతా అదిరి పోతుంది. సౌండ్ ఎఫెక్ట్ బాగా ఉంటుంది. పిల్లలంతా మహా వేడుకగా ఎంజాయ్ చేశారు. తర్వాత అక్కడే ఉన్న రెస్టారెంట్‌లో పీజా కొద్దిగా తిని కాఫీ తాగాం. ఇక్కడ వాటర్ బాటిల్ ఖరీదు మూడు డాలర్లు. అదే బయట మూడు డాలర్లు పెడితే ఇరవై బాటిల్స్ ఉన్న కేసు వస్తుంది. అంత రేట్లు. అయినా జనం తండోప తండాలుగా వచ్చి పడుతున్నారు నిర్విరామంగా. ఆ తర్వాత 4d థియేటర్‌లో ఒక షో చూశాం. ఇది మూడున్నరకు మొదలై నాలుగు వరకు ఉంటుంది. కళ్ళకు వేరే రకమైన కళ్ళజోడు ఇస్తారు. వాటితోనే చూడాలి. అప్పుడే ఎఫెక్ట్ బాగా ఉంటుంది. లేకపోతే కళ్ళకు ప్రమాదం. ఏదో చిన్న డాక్యుమెంటరిలాంటి యాని మేషన్ సినిమా అది. నీళ్ళు మీద పడ్డాయి సౌండ్‌కు టపాకాయలు పేలినట్లు అందులో కాలి మిగిలినవి మన మీద పడ్డట్లు చేస్తారు. పిల్లలకు అతి ఇష్టంగా ఉంటుంది.

## జంతు ప్రదర్శన శాల (జూ)

నెమ్మదిగా బయట పడి డ్రై చేసుకొంటూ జూకు చేరేసరికి అయిదుమ్బావు. ఆరున్నరకు మూసేస్తారు. వీల్ చైర్ పది డాలర్లకు తీసుకొని వాళ్ళ అమ్మను కూర్చో పెట్టుకొని మా అమ్మాయి తోసుకుంటూ తీసుకొని వెళ్ళింది. నేను పక్కన ఉత్స విగ్రహమే. పిల్లలు వాళ్ళ నాన్నతో వెళ్లారు లోపలి. ముందుగా ఏనుగులు రెండు కనిపించాయి. బాగా నీరసంగా, తోస్తే పడి పోతుట్లున్నాయి. తర్వాత చిరుత పులులు హుషారుగా కనిపించాయి. రంగుల పిచ్చుకల లాంటివి ఉన్నాయి. పెద్ద తాబేళ్ళు మందు కొట్టిన వాటి లాగా పడుకొని ఉన్నాయి. ఎలుగు బంట్ల వంటివి ఉన్నాయి. వెదురు గడ తింటూ అందులో ఒకటి ముచ్చటగా ఉంది. సహజారణ్యంలా ఉంచారు. భద్రత బానే ఉంది. ఫ్లెమింగో పక్షులు నీటి దొరువుల వద్ద మందలు మందలుగా ఉన్నాయి. మన కొంగల్లా ఉంటాయి. ఎరుపు రంగు శరీరం. పిల్లలు ఎక్కి తిరిగే చిన్న రైలు ఉంది. అది పదినిమిషాల్లో సారి అంతటిని తిప్పి చూపిస్తుంది. అందరం ఎక్కి తిరిగాం. మధ్యలో గుహల గుండా రైలు పోతుంది. ఇదో అనుభూతి. దీని దగ్గరే "ఉయ్యూరు వీరమ్మ తిరునాళ్ళ"లో ఉన్నట్లు రంగుల రాట్నం ఉంది. అన్నీ జంతువులూ, పక్షుల ఆకారాలతో. అందరం ఎక్కి సరదాగా తిరిగాం. వేగం లేదు. నెమ్మదిగానే

తిరిగింది. ముసలి వాళ్లకు సోఫాలాగా కూర్చునే సీటు ఉంది. ప్రభ దానిలో కూర్చుంది. అంతా అయిన తర్వాతా పిల్లలు, పెద్దలు ఎంజాయ్ చేయటానికి "రాక్ క్లైమ్బింగ్" ఉంది. సీటు బెల్టులతో కట్టి, పైన ఉన్న తాడును పట్టుకొని, ప్రక్కల ఉండే ఆధారాలతో పైకి ఎక్కాలి. ఒక ఇరవై అడుగుల ఎత్తు ఉంటుంది. ఒకేసారి ఇద్దరు రెండు వేరు వేరు సీట్లలో కూర్చుని ఎక్కవచ్చు. మా మనవళ్ళు ఆశుతోష్, పీయూష్‌లు దానితో ప్రయత్నం చేశారు. ఆఖరి వాడైన పీయూష్ సగం దాకా ఎక్కి కిందికి దిగాడు. వాడి పైవాడు ఆశుతోష్ మాత్రం పైదాకా వెళ్లి అందర్నీ ఆశ్చర్యపడేట్లు చేశాడు. చీర్స్ చెప్పాం మేమందరం. నేను వంద రూపాయలు గిఫ్ట్‌గా ఇస్తానని వాడికి చెప్పాను. "తాత గారూ వంద" అంటూ హోటల్‌కు చేరే దాకా అంటూనే ఉన్నాడు. సరాసరి ఇండియన్ మాల్స్ ఉన్న చోటికి వెళ్ళాం. అక్కడ చెరియన్ అనే షాప్‌లో బియ్యం సరుకులు మావాళ్ళు కొనుక్కున్నారు. షార్లేట్ కంటే చాలా చవక. కూరలు కూడా తాజాగా చౌకగా ఉంటాయి. అక్కడి నుంచి "వుడ్ లాండ్స్ మైసూరు విలాస్"కు వెళ్ళి, మేమిద్దరం మషాల అట్టు, తిని మాంగో లస్సీ త్రాగాం. బానే ఉన్నాయి. పిల్లలు, వాళ్ళు వాళ్ళకిష్టమైనవి తిన్నారు. రూంకు చేరే సరికి రాత్రి పది అయింది. హాయిగా నిద్ర పోయాం.

## శ్రీ స్వామి నారాయణ దేవాలయం

జూలై ఎనిమది ఆదివారం– మూడో రోజు– హాలిడే ఇన్ ఖాళీ చేసి కార్‌లో బయల్దేరి మధ్యలో స్టార్ బక్స్‌లో డోనట్ తిని కాఫీ త్రాగాం. అక్కడి నుండి సుమారు ముప్పావు గంటల ప్రయాణం చేసి శ్రీ స్వామి నారాయణ దేవాలయానికి చేరాం. ఫ్రీగా ఇచ్చిన వీల్ చైర్‌లో ప్రభావతిని కూర్చోపెట్టి నేను పక్కనన ఉండగా విజ్జి తోస్తూ లిఫ్ట్ ఎక్కి దేవాలయానికి చేరాం. చాలా విశాల మైన ప్రాంగణంలో చాలా ఎత్తులో ఉన్న దేవాలయం స్వామి నారాయణ టెంపుల్. అంతా పాలరాతితో చేసిందే. విగ్రహాలు చాలా అందంగా ముచ్చటగా, అలంకారాలతో ఆకర్షణీయంగా ఉంటాయి. రాధాకృష్ణుల విగ్రహం స్వామి నారాయణ విగ్రహం ఆయన పరంపరకు చెందిన అయిదుగురు శిష్యుల విగ్రహాలు అబ్బుర పరుస్తాయి. ఆలయం లోపలి డోమ్ మీద లతలు పూలు దశావతారాలు, అతి సూక్ష్మమైన నగిషీ పనితో మానసాహ్లాదాన్ని, ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి. గుజరాత్ నుండి రాజస్తాన్ నుండి మార్బుల్ తెప్పించి, ఇక్కడే చెక్కించి నిర్మించారట. 2007లో ఆలయం పూర్తి అయి దర్శనార్ధం వదిలారు. శివుడు పార్వతి, శ్రీ రామ మారుతి విగ్రహాలు కూడా ఉన్నాయి. ఇక్కడి శిల్ప విన్యాసం చూసి ఆనందించాల్సిందే కాని మాటలతో చెప్పలేము. లోపల ఫోటోలు తీయటం నిషేధం. వారి బ్రోచర్ తీసుకొని అందులోని వాటిని ఫోటోలు తీశాను. అవి మేము పెట్టినప్పుడు చూసి

ఆనందించండి. ఇక్కడ నిశ్శబ్దం రాజ్యమేలుతుంది.

కింద ఫోటోలు పుస్తకాలు అమ్మే షాప్ ఉంది. అక్కడ కైలాసంలో శివ పార్వతులున్నట్లు శివుని జటా జూటం మీద నుండి గంగా జలం పడుతూ ఆవు ముఖం నుండి బయటకు వస్తు శివలింగానికి అభిషేకం చేస్తున్నట్లు ఉన్న బొమ్మ ముచ్చటగా ఉంటే మా అమ్మాయి యాభై అయిదు డాలర్లు పెట్టి కొన్నది. ఆ నీరు నిరంతరం అలా పడుతూనే వుంటుంది. రిసైకిల్ చెందుతుంటాయి, మొదట్లో నాలుగు గ్లాసుల నీరు పోస్తే చాలు. పదకొండేళ్ళ క్రితం మా రెండో అబ్బాయి శర్మ ఫామిలి గుజరాత్‌లోని అహ్మదాబాద్‌లో ఉన్నప్పుడు అక్కడికి వెళ్ళి అహ్మదాబాద్‌లోని స్వామి నారాయణ దేవాలయం, అక్షరధాంలను చూశాం. అది మూడు గంటల కార్య క్రమం. ఆయన తపస్సు చేసిన ప్రదేశాలన్నీ సహజ వాతావరణంలో గుహలుగా నిర్మించి చూపించారు. తర్వాత ఆయన జీవితంపై సినిమా, మ్యూజిక్ ఫౌంటెన్ అన్నీ ఆశ్చర్య పరుస్తాయి. ఇక్కడ అంత ఎర్పాటు ఏమీ లేదు. తరువాత ఉంటాయేమో తెలీదు. అప్పుడే మేము ద్వారకకు, సోమనాథ దేవాలయానికి వెళ్లి వచ్చాము. అది దసరా కనుక దండీ నృత్యాలను, ఆరుబయటి సినిమా థియేటర్లో "లగాన్" సినిమాను చూశాం.

దేవాలయ సందర్శనం తర్వాత దానికి సంబంధించిన హోటల్‌లో డబ్బులిచ్చి భోజనం చేశాం. పెద్దగా సహించ లేదు. మధ్యాహ్నం మూడింటికి బయల్దేరి మధ్య మధ్య ఆగుతూ రాత్రి ఏడున్నరకు షార్లేట్ చేరి మన అన్నం తిని హాయిగా నిద్ర పోయాం. ఇప్పుడు ఈ దేవాలయానికి సంబంధించిన ముఖ్య విషయాలు- 1781లో స్వామి నారాయణ ఉత్తర భారత దేశంలో జన్మించారు. దీన జనుల విముక్తి కోసం సాంఘిక, ఆధ్యాత్మిక తిరుగుబాటు చేశారు. స్వామి నారాయణ సంప్రదాయం ఏర్పాటు చేశారు. మూఢాచారాలను తిరస్కరించారు. అహింసా మార్గమే ఆయన ఆదర్శం. 3000 మంది సాధకులను తయారు చేసి ప్రచారాన్ని ఉధృతం చేశారు. అందుకని ఆయననే "భగవాన్" అని పిలుస్తారు. నైతిక ఆధ్యాత్మిక ఉన్నతికి ఆయన మార్గదర్శనం చేశారు. ఆయన మరణించినా, సాధకులకు ఆయన ఎప్పుడు అందుబాటులోనే ఉంటారని నమ్మకం.

వీరి మొదటి శిష్యులు, వీరి తర్వాత ఆశ్రమ నిర్వాహకులు శ్రీ గుణాతీతానంద స్వామి. "అక్షర పరబ్రహ్మ"గా సాధక నామం. ఈయనే ఘనశ్యాం మహారాజ్. స్వామి నారాయణ అవతారమే ఈయన. పద కొండు ఏళ్లకే సన్యసించి ఏడేళ్ళు దేశం లోని సర్వ క్షేత్ర సందర్శాన్ని కాలి నడకన చెప్పులు లేకుండా ఒంటరిగా తిరిగి గుజరాత్‌లో యాత్రను విరమించారు. అక్కడే "అక్షర ధామం" నెల కోల్పారు. అనేక మందిరాలను దేశమంతా నెలకొల్పిన మహానుభావులాయన.

రెండవ శిష్యుడు, ఉత్తరాదికారి భగవతి మహారాజ. మూడవ శిష్యులు అధికారి

శాస్త్రీజీ మహారాజ్. మంచి వక్త. "అక్షర పురుషోత్తమ భావవ్యాప్తి" చేశారు. 1907లో "Bachasanvasi sree akshara purushottama svaami naaraayana samstha" (B.A.P.S)ను ఏర్పరచారు.

నాల్గవ శిష్యుడు అధికారి యోగీజి మహా రాజ. ఇంగ్లాండ్, అమెరికా ఆఫ్రికాలను సందర్శించి స్వామి నారాయణ బోధలను వ్యాప్తి చేశారు.

అయిదవ వారు ఉత్తరాధికారి ప్రముఖ స్వామి మహారాజ్. 2007 ఆగస్ట్ ఇరవై ఆరున ఆశ్రమ నిర్వహణ బాధ్యతలను స్వీకరించారు. వీరి ఆధ్వర్యంలో ప్రపంచమంతా 3,300 కేంద్రాలు ఏర్పడ్డాయి. మతం కులం భాషా జాతి, వయసులకు అతీతంగా సంస్థలను తీర్చిదిద్దారు. వీరినే హరికృష్ణ మహారాజ అంటారు. ఇది వారి చిన్నప్పటి నామదేయం.

దేవాలయంలో రాధాకృష్ణ విగ్రహాల ప్రక్కన స్వామి నారాయణుల పంచలోహ విగ్రహం ఉంది.

ఏమైనా మానసిక ప్రశాంతినిచ్చింది ఈ మూడు రోజుల్లో స్వామి నారాయణ సందర్శనమే. అట్లాంటాకు గర్వకారణం ఈ అక్షర ధామం.

(10-7-12.-కాంప్-అమెరికా)

అమెరికా డైరీ-**24**

**అమెరికాలో ఆంధ్ర తేజం**

## కూచిపూడి "నృత్యరత్న" పాప

దేవులపల్లి కృష్ణశాస్త్రి గారి మేనకోడళ్ళు సీతా, అనసూయల గురించి తెలియని ఆంధ్రులుండరు. జానపద సంగీతాన్ని బంగారు పల్లకిలో దేశ విదేశాల్లో ఊరేగించిన సోదరీమణులు. దేవులపల్లి వారి గీతాలను దేశమంతా పాడి తెలుగు జన హృదయాలను రస ప్లావితం చేసినవారు. అలాంటి ఇద్దరిలో అనసూయ గారు వివాహం చేసుకొని అవసరాల అనసూయ అయారు. ఆమె పుత్రికా రత్నమే రత్న పాప. రత్న పాప ప్రసిద్ధ కూచిపూడి నృత్య దర్శకులు, పద్మశ్రీ డాక్టర్ వెంపటి చిన సత్యం గారి శిష్యురాలు. గురువు గారి వద్ద గొప్ప శిక్షణ పొంది, ఆయనతోను, ఆమె ఇతర కళాకార సహాధ్యాయినులతోను ఆంధ్ర దేశమంతా పర్యటించి, వందలాది ప్రదర్శనలిచ్చి పేరు తెచ్చుకొన్నారు. కుమార్ అనే వారిని వివాహం చేసుకొని ఇప్పుడు "రత్న కుమార్"గా వ్యవహింప బడుతున్నారు. సుమారు 25 ఏళ్ళుగా అమెరికాలో టెక్సాస్ రాష్ట్రంలోని హూస్టన్ నగరంలో "అంజలి" అనే నాట్య సంస్థను స్థాపించి నృత్య సేవ చేస్తున్నారు. అందులో కూచిపూడితోబాటు భరత నాట్యం మొదలైన భారతీయ నృత్యరీతులను అన్నిటిని

నేర్పు తున్నారు. వందలాది విద్యార్థులకు ఆమె శిక్షణనిచ్చి రంగ ప్రవేశం చేయించి, వారి నాట్యాభి రుచికి దోహదం చేస్తున్న మహా కళా కారిణి రత్న పాప. ఆమె సంస్థ anjali -center for indian performance arts.

2002లో మేము అమెరికాకు మొదటిసారిగా మా అమ్మాయి వాళ్ళు ఉన్న హూస్టన్‌కు వచ్చాం. అక్కడ మా బంధువు వావిలాల లక్ష్మి గారు ఒక రోజున మమ్మల్ని రైస్ యూనివర్సిటీలో ఒక అమ్మాయి కూచిపూడి నేర్చి, రంగ ప్రవేశం చేసే కార్య క్రమానికి తీసుకు వెళ్లారు. అప్పుడు రత్న పాప గారి దగ్గరకు నేను, నా శ్రీ మతి వెళ్లి పలకరించాం. చాలా చక్కగా మాట్లాడారు. అక్కడే ఉన్న వారి తల్లి గారు అనసూయ గారిని పరిచయం చేశారు. ఆమె మా చిన్నప్పటి నుండి తెలిసిన ఆవిడే. కృష్ణశాస్త్రి గారితో మా పరిచయం గుర్తుకు తెచ్చుకున్నాం. ఆమె మేమెవరో తెలిసి ఆశ్చర్యపోయారు. దేవులపల్లి వారిని ఆమె "మామయ్యా" అనే సంబోధిస్తారు. మద్రాస్‌లో ఉన్న మా పెద్దక్కయ్య లోపాముద్ర, బావ కృపానిధి గార్లు అనసూయ గారికి బంధువులే. బాగా తెలుసు, అవన్నీ గుర్తు చేసుకొన్నారు. శాస్త్రి గారి భార్య అంటే ఆమె అత్తయ్య చని పోయిందనీ చెప్పారు. వాళ్ళింటికి రమ్మన్నారు కాని ఎందుకో కుదర లేదు. ఆ తర్వాత మూడేళ్ళ క్రితం వెంపటి చిన సత్యం గారు కూచిపూడిలో జరిపిన సిద్ధేంద్ర ఆరాధనోత్స వాలకు రత్న పాప ఆయన ఆహ్వానంపై అమెరికా నుండి గురువు గారి మీది భక్తితో కూచిపూడి వచ్చి రెండు రోజుల కార్యక్రమంలో పాల్గొని వెళ్లారు. నేను ఒక రోజు కార్యక్రమంలో ఆమెను చూసి హూస్టన్ పరిచయాన్ని జ్ఞాపకం చేశాను. ఆమె ఆనందించింది. ఆ వేదిక మీద lecture cum demonstration చేసింది రత్న పాప. నేను స్పందిస్తూ శ్రీ నాద మహాకవి భీమ ఖండంలో రాసిన పద్యం– వ్యాసునికి కాశిలో విశ్వనాధుడు విశాలాక్షీ కన్పించిన తీరును ఒకే పద్యంలో వర్ణించిన దాన్ని "చంద్ర బింబానన, చంద్ర రేఖా మౌళి –నీల కుంతల ఫాల, నీల గలుదు–ధవలాయ తెక్షణ, ధవలాఖి లాంగుండు మదన సంజీవని మదన హరుదు –నాగేంద్ర నిభ యాన, నాగ కుండల దారి, భువన మోహన గాత్ర భువన కర్త" చదివాను. ఆమె చిన్న పాపలాగా నా దగ్గరకు పరిగెత్తుకొని వచ్చి "మేష్టారు మాస్టారు ఆ పద్యం చాలా అద్భుతంగా ఉంది. ఇదే నేను మొదటిసారి వినటం. అది నాకు కాగితం మీద రాసివ్వరా నేను నా శిష్యులకు దాన్ని నృత్య రూపంలో పెట్టి నేర్పిస్తాను' 'అని కోరింది. ఆనందంగా అంగీకరించి రాసిచ్చాను. ఈమధ్య హూస్టన్‌లో జరిగిన "నాటా" తెలుగు సభల వారు ప్రచురించిన సావనీర్‌లో ఆమె తన గురువు గారిని గుర్తుకు తెచ్చు కుంటూ, తన నృత్య ప్రస్థానాన్ని గొప్పగా ఆవిష్కరించారు. అందులోని కొన్ని ముఖ్య విషయాలు, ఆ విదుషీమణి సాధనను మీకు అందజేస్తున్నాను.

రత్నపాప తన తల్లి అనసూయ గారి వల్ల కూచిపూడి నాట్య ప్రాభవాన్ని తెలుసుకొన్నారు. అందులో ప్రవేశించే సంకల్పం కలిగి దాన్ని అభ్యసించి ప్రపంచానికి కూచిపూడిని పరిచయం చేసే గొప్ప అదృష్టాన్ని పొందింది. అప్పుడే ఆమెకు నటరాజ రామ కృష్ణ, కోరాడ నరసింహారావు, బందా కనకలింగేశ్వరరావు లాంటి మహానుభావాలతో పరిచయం కలిగింది. ఇదంతా ఆమె మద్రాస్‌లో తల్లి గారింట ఉన్నప్పటి సంగతులు. అలానే నరసింహాచారి గారి బంధువు రామాచారిగారి తోను పరిచయం. కూచి పూడి నాట్య గురువులు వేదాంతం లక్ష్మీ నారాయణ శాస్త్రి గారిని "తాతయ్య గారూ" అనిపిలిచేది. ఆయనే తనను మూడేళ్ళ వయసులో ఒడిలో కూర్చోబెట్టుకొని హస్తముద్రలను నేర్పించారట. ఆయన గానం చేసే "వసంత స్వర వల్లరి"ని ఇప్పటికి మరిచి పోలేనంటారు. అనుభూతితో పాడి కాళ్ళ వెంట ఆనంద భాష్పాలు కార్చేవారట. అందరికి అదే అనుభూతి కలిగేది. అప్పటి నుంచే తనకు కూచిపూడి మీద అభిరుచి కలిగిందని చెప్పింది రత్న పాప.

తల్లి అనసూయాదేవి వెంపటి చినసత్యం గారిని రత్నపాప రంగ ప్రవేశానికి నాట్యాన్ని సమకూర్చమని కోరారట. అలానే ఆయన ఆనందంగా అంగీకరించి కోరియాగ్రఫీ చేశారు. ఈనాటి వరకు ఆ పాటను పూర్తిగా సాహిత్యంతో తాను తప్ప ఇంకెవరూ రంగం మీద నటించలేదని ఆనందంగా గర్వంగా తెలియజేశారు. దీనికి తన నాట్యగురువు సత్యం గారికి జీవితాంతం కృతజ్ఞురాలిని అంటారు వినమ్రంగా.

1961లో హై స్కూల్ చదువు పూర్తి అయింది. కాలేజిలో చేరటానికి కొన్ని నెలల వ్యవధి ఉంది. అందుకని ఈలోగా నాట్యం నేర్చుకోవాలని కోరిక కలిగింది. తల్లి గారు వెంపటి చినసత్యం గారి వద్ద చేర్చారు. అప్పటికే సత్యంగారు నాట్య విద్యాలయం స్థాపించి కూచిపూడి నాట్యాన్ని మద్రాస్ నుండి వ్యాప్తి చేస్తున్నారు. ఆంధ్ర మహిళా సభ స్థాపించిన దుర్గాబాయ్ దేశముఖ్, వగైరాలు సత్యం గారి కౌశలానికి ముగ్ధులయారు. లజ్ చర్చి రోడ్‌లో నాగేశ్వరరావు పార్క్ దగ్గర వెంపటి వారి విద్యాలయం ఉండేది. ఆంధ్ర మహిళా సభ రజతోత్సవాలకు సత్యం గారిని తెలుగులో ఒక నృత్య ప్రదర్శన ఏర్పాటు చేయించమని అనసూయ గారికి చెప్పారు. అనసూయ గారు వెంటనే భుజంగ రాయ శర్మ గారు రాసిన "శ్రీ కృష్ణ పారిజాతం" నృత్య రూపకంను ప్రదర్శిస్తే బాగుంటుందని చెప్పారు. రత్న పాప సత్యభామగా, రమా రమణ రుక్మిణిగా, కుచల కుమారి కృష్ణుడిగా సుకుమారి నారదుగా పాత్రలతో సత్యం గారి ఆధ్వర్యంలో ప్రదర్శన జరిగి బ్రహ్మాండమైన విజయం సాధించింది. దానితో రత్న పాపకు కూచి పూడి మీద ఆసక్తి విపరీతంగా పెరిగింది.

సత్యం గారు ఇంటికి వచ్చి నాట్య శిక్షణనిచ్చే వారు. దేవులపల్లి కృష్ణశాస్త్రి

గారి గొప్ప రచన "కొలువైతివా రంగసామి"కి సత్యం గారు నృత్యరీతులు నేర్పారు. అ తరువాత "విప్రనారాయణ" నాటకం మొత్తం నేర్పారు. అందులో రత్న పాప దేవ దేవిగా, ఈనాటి సినీ నటుడు చంద్రమోహన్ ఆల్వార్‌గా, పద్మవిభూషణ్ డాక్టర్ మంగళంపల్లి బాల మురళీకృష్ణ మొత్తం అందులోని పాటలన్నీ స్టేజిమీద పాడిన గాయకుడిగా దాన్ని నిర్వహించారు. ఇది రత్న పాప జీవితంలో మరపురాని ఘట్టంగా అభివర్ణించారు.

రత్న పాప సోదరి సీతారత్న కుమార్, మద్రాస్ దూరదర్శన్ కేంద్రానికి అసిస్టెంట్ డైరెక్టర్. ఆమె ఈమెకన్న ముందే కూచిపూడి నృత్య అకాడెమిలో చేరింది. తనకంటే ముందే చాలా నృత్యాలు అభ్యసించింది. 1967లో ఆమెతో కలిసి కూచిపూడి రంగ ప్రవేశం చేశారు. 1968లో రత్న పాపకు కూచిపూడి నృత్యానికి సంగీత నాటక అకాడెమి నుండి మొదటి స్కాలర్‌షిప్ వచ్చింది. దీన్ని పొందిన తొలి విద్యార్థి రత్న పాపే. ఇదంతా మాస్టరు గారి కృపా కటాక్ష వీక్షణమే అని సంబర పడుతుంది.

మద్రాస్‌లో ప్రముఖ సంగీత దర్శకుడు మాస్టర్ వేణు గారింటికి దగ్గరలో చిన్న గదిలో ఉన్న ఆకాడేమి తర్వాత పానగల్ పార్క్ దగ్గర పెద్ద ప్రాంగణంలోకి మారింది. క్రమంగా నేర్చే వారి సంఖ్య కూడా పెరిగింది. మంచి పేరు ప్రఖ్యాతులు వచ్చాయి. మాస్టర్ సత్యం గారి వద్ద వైజయంతి మాల, రేఖా, హేమామాలిని, చంద్ర కళా, చంద్ర మోహన్, లక్ష్మీ విశ్వనాధన్, రాధా, జ్యోతి రాఘవన్, క్షేమావతి, రేఖ కజిన్స్ ప్రతిభ సుధా (వేదాంతం రాఘవయ్య గారి కూతుళ్ళు) మొదలైన హేమా హేమీలంతా నృత్యం నేర్చారు. సాయంత్రం పూట శిక్షణా తరగతులు జరిగేవి. అందరికి శ్రద్ధతో విద్య నేర్పేవారు సత్యం గారు. అలసట అంటే ఏమిటో వారికి తెలీదట. కూచిపూడి గ్రామాన్ని గురించి అక్కడ నేర్పే విధానాన్ని గురించి తమతో ముచ్చటించే వారట. కూచిపూడిడి "విశ్వ వేదిక"కు పరిచయం చెయ్యాలి అనేదే సత్యం గారి కల అని రత్న పాప అంటారు. దేశమంతా తన సోదరితో కలిసి ప్రదర్శన లిచ్చింది రత్న పాప. వెంపటి చిన సత్యం గారి ట్రూప్‌లో తానూ మిగిలిన కళాకారినులు కలిసి ట్రైన్‌లో వివిధ పట్టణాలకు, నగరాలకు వెళ్లి ప్రదర్శించిన అనుభవాలు మరచిపోలేనివి అంటుందామె. మజ్జిగ రసం తాగుతూ, పులిహోర తింటూ గడిపిన రోజులు మధురాలని అన్నది. శోభానాయుడు కృష్ణుడిగా, పద్మిని రుక్మిణిగా, తాన సత్యభామగా శ్రీ కృష్ణ పారిజాతాన్ని సింహాచలంలో ప్రదర్శిస్తు ఉంటే వేదిక ఒరిగిపోయినా దాన్ని అలానే కొనసాగించి అదీ దానిలో భాగమేననే అనుభూతిని ప్రేక్షకులకు కల్గించిన సంఘటన చిరస్మరణీయం అన్నారు. అంతా అయిన తర్వాత మాస్టర్ గారు నవ్వుతు దాన్ని జ్ఞాపకం చేసుకోవటం భలేగా ఉందట.

చాలా కాలం తర్వాత గురువు గారి కల సాకారమైంది. గ్రీన్వే రోడ్డులో కొత్త అకాడెమి సర్వాంగ సుందరంగా రూపు దాల్చింది. అన్ని సౌకర్యాలలతో అలరారింది. అందరి దృష్టిలో పడి దేశ విదేశీయులు వచ్చి శిక్షణ పొందటం మొదలెట్టారు. అందులో మాస్టారు రాజసంగా మహారాజు లాగా ఠీవిగా కూర్చుని తమ కందరికీ కన్నుల పండువ చేశారని సంబరపడి పోయారు రత్న పాప. అన్ని క్లాసులను సత్యం గారే నిర్వహించే వారట. విద్యార్థులతో సంస్కృతం, నాట్యం గురించి అధ్యయనం చేయించే వారట. సంపూర్ణ కళా స్వరూపంగా నృత్యాన్ని ప్రదర్శించాలని మాస్టారు గారి ఆకాంక్ష. ఆయనకు అభినయ దర్పణం, నాట్య శాస్త్రం కరతలా మలకం. ఆయన లేచి నిలబడి ఒక భంగిమను అభినయించి చూపుతుంటే సాక్షాత్తు ఆ శివుడే దిగి వచ్చి ప్రదర్శిస్తున్నాడు అనే భావం తామందరికీ కలిగేదని ఆమె మురిసి పోయారు. అంత నిర్దుష్టంగా ఆయన శిక్షణ ఉండేది.

రత్న పాప ఒకసారి దేవులపల్లి వారి "క్షీర సాగర మధనం" నృత్య రూపకంలో మోహినిగా మాస్టర్ గారు శివునిగా వేశామని అది తాను జీవితాంతం గుర్తుంచుకో దగిన మహాద్ఘటన అని అన్నారు. ఆహార్యంతోనే సత్యం గారు నట్టువాంగం చేస్తూ అభినయిస్తూ ద్విపాత్రాభినయం చేయటం చిరస్మరణీయం అంటారు. గురువు గారితో కలిసి నటించే మహాభాగ్యం తనకు కల్గి నందుకు ఆమె పొంగిపోతున్నారు. అది ఎవరికీ లభించని మహదవకాశం.

వింజమూరి రత్న పాప అనే రత్నకుమార్ తన నాట్య విద్యానుభావానికి, కూచిపూడి నృత్య వ్యాప్తికి భారత ప్రభుత్వం నుండి సంగీత నాటక అకాడెమి అవార్డును పొందిన ఏకైక N.R.I. ఇంకేవరికి అలాంటి పురస్కారం ఇంతవరకు దక్కలేదు. ఆంధ్రులుగా ఇది మనందరికి గర్వకారణం.

(12-7-12-కాంప్-అమెరికా)

అమెరికా డైరీ-**25**

## సర్ప్రైజ్ వెల్కం వీక్

జూలై తొమ్మిది సోమవారం నుండి పదిహేను ఆదివారం వరకు డైరీ- పిల్లల సమ్మర్ కాంప్-సర్ప్రైజ్ వెల్కం -భజన భోజనం-పుస్తకాల చదువు -నిన్న రాత్రి సూర్యుడు కర్కాటక రాసిలో ప్రవేశించటం వల్ల ఉత్తరాయణం వెళ్లి దక్షిణాయనం వచ్చింది.
పిల్లల సమ్మర్ కాంప్ ఇక్కడ శ్రీ వెంకటేశ్వర స్వామి ఆలయంలో హిందూ సెంటర్ వాళ్ళు వేసవి శిక్షణా తరగతులను పిల్లలకు ఏర్పాటు చేశారు. ఒక నెల రోజుల కార్యక్రమం. పిల్లల్ని ఉదయం పదింటికల్లా సెంటర్లో దింపాలి. సాయంత్రం నాలుగు

వరకు క్లాసులు. సంగీతం డ్రాయిగ్ పెయింటింగ్, నాటకం పాటలు సంభాషణా, క్రికెట్ వంటి ఆటలు అన్నీ నేర్పుతారు. దానికి ఫీజు ఉంది. మధ్యాహ్న భోజనం వాళ్ళదే. పిల్లలు వేసవిలో వృధాగా తిరిగి టి.వి.లతో కాలక్షేపం చేయకుండా ఇదో మంచి కార్య క్రమం. మా ముగ్గురు మనవళ్ళను ఉదయం అరగంట ప్రయాణంలో ఉన్న అక్కడికి తీసుకొని వెళ్లి దింపి వస్తోంది మా అమ్మాయి. మళ్ళీ సాయంత్రం నాలుగింటికి వెళ్లి పిల్లలను తీసుకొని రావాలి. మా వాళ్ళు మంచి ఉత్సాహంగానే వెళ్తున్నారు. ఉదయం ఇంటి దగ్గర టిఫిన్ చేసి వెళ్తారు. ఉపయుక్తమైన కార్యక్రమం. మధ్యలో కొన్ని రోజులు ఆ క్లాసుల తర్వాత స్విమ్మింగ్, పెయింటింగ్, జిమ్నాస్టిక్స్ క్లాసులకు కూడా వెళ్ళొస్తున్నారు. మంచి టైంపాస్. ఇంట్లో అల్లరి కొంత తగ్గుతుంది.

## భజన–భోజనం

ఇక్కడి సాయి సెంటర్‌లో ముఖ్యురాలు శ్రీమతి కపిలా లీడ్ బీటర్ అనే వారింట్లో శనివారం సాయంత్రం భజన కార్యక్రమానికి ఆహ్వానిస్తే వెళ్ళాం. యాభై మంది వచ్చారు. సాయంత్రం అయిదున్నర నుండి రెండు గంటలు అంటే రాత్రి ఏడున్నర వరకు భజన. చాలా కొత్త భజనలు. ముఖ్యంగా ఎక్కువ హిందీ ఇంగ్లీష్ భజనలను అత్యంత భక్తీ శ్రద్ధలతో గానం చేశారు. తబలా హార్మని, కంజీరల తోడ్పాటు కూడా ఉంది. ముఖ్యంగా కపిల గారు చాలా భావగర్భితంగా మనోహరంగా శ్రావ్యంగా పాడారు. ఆవిడ పాడటం ఇదే మొదటిసారి నేను చూడటం. ఈ మధ్యవరకు షార్లేట్ సాయి సెంటర్‌కు ఆమె అధ్యక్షురాలు. ఇప్పుడు సత్య అనే అతను. సత్య మంచి తబలా విద్వాంసుడు. మంచి కార్యకర్త. సాయి బాబా సమక్షంలోచదువుకున్నవాడు. అతని భార్య సౌమ్య చక్కని గాయని. హార్మని గొప్పగా వాయిస్తుంది. వాయిస్తూనే బాగా శ్రావ్యంగా పాడుతుంది. తాదాత్మ్యం కల్గిస్తుంది. మేము వచ్చిన దగ్గర్నుంచి ఆ దంపతులతో మంచి పరిచయం. సౌమ్య ఆ రోజు అత్యంత భక్తి భావంతో తార స్థాయిలో పాడి జనాలను పరవశులను చేసింది. ఆమె వాయిస్ చాలా పీక్‌గా ఉందని భజన అయిన తర్వాత ఆమెతో చెప్పాను. మిగిలిన వాళ్ళు కూడా బానే పాడారు. ఆ తర్వాత అందరికి సాయిబాబా అభిషేక క్షీరం తాగటానికి ఇచ్చారు. ఆ తర్వాత నిమ్మరసం ఇచ్చారు. దాని తర్వాత విందు. విందులో– చపాతి పూరీ, కూరలు, పెరుగు, పచ్చడి, కారట్ హల్వా, పందు మిరప కారం, మూడు రకాల స్వీట్లు మూడు రకాల పెరుగు ఆవడ వంటి హాట్లు మొత్తం సుమారు పదిహేను వెరైటీలు. ఇష్టమైనవి యేవో కొద్దిగా తిన్నాం. అక్కడ సుజన్ అనే వరంగల్లు కుర్రాడు పరిచయమై తెలుగులో మాట్లాడాడు. అతను మేము కూడా మాట్లాడటం విని "చాలా రోజు లైంది తెలుగు విని" అన్నాడు. సత్య అతనికి మన "సరస భారతి" గురించి "బ్లాగు" గురించి వివరించి చెప్పాడు. అతను ఆశ్చర్య పోయాడు.

సత్య ఎక్కడ వీలైతే అక్కడ సరస భారతి గురించి మంచి ప్రచారం చేస్తున్నాడు. మంచి గౌరవంగా ఉంటాడు. సుజన్‌తో "అంకుల్ –ఈ మధ్య ఈల శివ ప్రసాద్ వచ్చినప్పుడు రెండు మంచి బిరుదులు "ఈల లీలా లోల" – "గళ వంశీ" అనేవి సజెస్ట్ చేసి వేదిక మీద ప్రకటించారు" అని జ్ఞాపకం చేసుకొన్నాడు.

## సర్ప్రైజ్ వెల్‌కం–గాయత్రీ సత్యనారాయణీయం

షార్లేట్ సాయి సెంటర్‌లో ముఖ్య గాయకుడు హార్మని విద్వాంసుడు కుర్రాడు మంచి కలుపుకోలు వ్యక్తీ అయిన సత్య నారాయణ ఈ నెలలో ఇండియా వెళ్లి అక్కడ పెద్దలు కుదిర్చిన గాయత్రి అనే అమ్మాయిని వివాహం ఆడి మళ్ళీ ఇక్కడికి భార్యతో సహా వచ్చాడు. అతను వస్తున్నట్లు తెలిసి సాయి సెంటర్ వాళ్ళు సుబ్బు అనే కన్వీనర్ ఆధ్వర్యంలో నూతన దంపతులకు సర్ప్రైజ్ వెల్కంను శుక్రవారం రాత్రి దగ్గరలోని కమ్యూనిటి హాల్‌లో ఏర్పాటు చేశారు. అందరం వెళ్ళాం. సుమారు యాభై మంది ఆహ్వానితులు వచ్చారు. ముందుగా ఒక గంట భజన ఏర్పాటు. సత్యతో సహా అందరు పాడారు. ఆ తర్వాత విందు–విజ్జి చేసిన
పెరుగు ఆవడలు, ఇంకెవరో చేసిన చపాతి, కూరలు, బిర్యాని, పెరుగు పచ్చడి, చట్నీ, అన్నం, సాంబారు, రెండు రకాల స్వీట్లు, కీర పాయసం కోకా కోలా వగైరాలతో విందు అదిరింది. నవ దంపతులు ఉత్సాహంగా పాల్గొన్నారు. అందరు తలో ఐటం చేసుకొని వచ్చి నిండుదనం తెచ్చారు. తర్వాత– హాజరైన దంపతులతో చీటీలు తీయించి అందులో వచ్చిన దాని ప్రకారం ప్రశ్నలకు సమాధానాలు, పాటలు పాడించటం వగైరా కార్యక్రమాన్ని రాంకీ భార్య ఉషా సరదాగా నిర్వహించింది. ఒక గంట అందరూ ఒకటే అనే మంచి భావం ఇదంతా కలివిడి గల ఫామిలి అనే అభిప్రాయం కొత్త దంపతులకు కలిగించటమే ఇందులోని ముఖ్య ఉద్దేశం. నూత్న దంపతులను కూడా ప్రశ్నల పరం పరతో సరదా చేసి వారి సమాధానాలతో అందరు మళ్ళీ తన పెళ్లి రోజులను ఒక్కసారి జ్ఞాపకం చేసుకోనేట్లు చేశారు. కొత్త పెళ్లి కూతురుకి అందరితో పరిచయం కలగటం ఆమెలో ముభావం ఉంటే పోగొట్టటం దీని ఉద్దేశ్యం. అది బాగా నెర వేరింది. అందరు గొప్ప సహకారం అందించారు. మా ఇద్దర్నీ కూడా ఆ ఆటలో పాల్గొనమని ఉషా బలవంత పెడితే నేను "మేము r.i.లం, మీరు n.r.i.లు మేము పాల్గోవటం బాగుండదు అన్నా. అయితే "ఆంటీ –మీరిద్దరిలో ఎవరి మాట ఎవరు వింటారో చెప్పండి" అని ప్రభావతిని అడిగింది". ఆయన మాటే నేను వింటాను" అంది దానికి నేను "once up on a time" అది – నేను రిటైర్ అయ్యే దాకా ఆవిడ నామాట వింది –రిటైర్ అయిన తర్వాత నేను ఆవిడ మాటే వింటున్నాను "అనేసరికి అందరూ గొల్లున నవ్వారు. మొత్తం మీద సరదా సరదా కార్యక్రమం. చివరికి నూతన దంపతులతో కేక్ కట్చేయించి

అందరికి పంచారు. ఇలా సర్ప్రైజ్‌గా వారిద్దరికి స్వాగతం పలికి ఆనందం చేకూర్చి ఈ కుటుంబంలో వారినీ ఆహ్వానించి అంతా మంచి కుటుంబం అనిపించారు. ఇదే "గాయత్రీ సత్యనారాయణీయం". ఇంటికి వచ్చేసరికి రాత్రి పదకొండున్నర.

### ఈ వారంలో చదివిన పుస్తకాలు - మైనేని గోపాలకృష్ణ గారు

హూస్టన్‌లో జరిగిన నాటా సభల సావనీర్‌ను, world demogrphic trends అనే పుస్తకం పోస్ట్‌లో పంపారు. రెండు చదివేసి వారికి తెలియ జేశాను. వారు నాకు హన్ట్స్ విల్‌లో ఇచ్చిన జస్టిస్ హిదయతుల్లా పుస్తకం my own boswell చదివి "హిదయ తుల్లా" అనే ఆర్టికల్ ఇదివరకే రాశా. ఆయనే ఇచ్చిన the idea of india, the emotional life of your brain ,there is a spiritual solution కొంతవరకు చదివా. లైబ్రరిలో తెచ్చిన వాటిలో albert eistein, maya angelo ,benjamin franklin, keynes, jefersan, my prison life, mary magdolina"లలో కొన్ని పూర్తిగా చదివా. కొన్ని తిరగేశా.

(17-7-12-కాంప్-అమెరికా)

అమెరికా డైరీ-**26**

### భాష -ఘోష

భావ వ్యక్తీకరణకు భాష అవసరం అని మనకు తెలిసిన విషయమే. కొన్ని భాషలకు లిపి ఉండదు. మాట్లాడటానికే అవి ఉపయోగ పడతాయి. ఇరవై అయిదు రకాల రచనా విధానాలున్నాయి. అక్షర మాలను ఉపయోగించి సాధారణంగా భాషను రాస్తారు కాని చానా జపానీస్ భాషలను ఇడియోగ్రాంలలో రాస్తారు. అవి గుర్తులుగా ఉంటాయి. సుమేరియన్ భాష అత్యంత ప్రాచీన భాషగా అంటే 5000 ఏళ్ళనాటి భాషగా భావిస్తారు. సంస్కృతానికి సుమారు నాలుగు వేల ఏళ్ళు అని వీరి నమ్మకం. ప్రపంచం మొత్తం మీద 6,912 భాషలున్నాయి. వీటికి మాండలికాలు ఉన్నాయి. ప్రపంచ జనాభాలో సగం మంది ఇరవై భాషలే మాట్లాడుతున్నారు. బ్రిటన్ సూపర్ పవర్ కాకపోయినా వారి భాష ఇంగ్లీష ఆదిపత్యం వహిస్తోంది. అందుకే "రూల్ ఆఫ్ బ్రిటన్ పోయింది కాని రోల్ ఆఫ్ ఇంగ్లీష్" అని చేణుకుతుంటారు. ఇండియాలో 350మిలియన్ల జనం ఇంగ్లీషలోనే మాట్లాడుతున్నారు. వీరు బ్రిటన్, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, అమెరికాలలో ఇంగ్లీష మాట్లాడే వారికి సరి సమానం. మాట్లాడే వారు లేక భాషలు అంత రించి పోతున్నాయి. ఈ విషయాన్ని u.n.o.హెచ్చరించి చాలా కాలమైంది. గౌతమ బుద్ధుడు బౌద్ధమత ప్రచారాన్ని "పాళీ భాష"లో చేశాడు. దానికి లిపి లేదు. ఇప్పుడీ భాష మాట్లాడే వారి సంఖ్య అతి పరిమితం. ఇది శ్రీలంక,

తాయిలాండ్, మయన్మార్ దేశాలలో పూజా విధానాలకు మాత్రమే పరిమితమైంది. అతి నాగరక భాష అని మనం గౌరవించే సంస్కృత భాష మాట్లాడేవారు లేక గ్రంథాలకే ఎక్కువగా పరిమితమైంది. ఐరిష్ భాషను గాలిక్ అంటారు. ఐర్లాండ్ దేశీయుల అధికార భాష. ఆ దేశం స్వాతంత్ర్యాన్ని1922లో పొందినప్పుడు ఆ భాషను రెండు లక్షల యాభై వేల మంది మాట్లాడే వారట. ఇప్పుడు కేవలం 30,000 మంది మాత్రమే మాట్లాడుతున్నారట. ఇవాల్టి ప్రపంచంలో 199 భాషలను కేవలం డజను మంది మాత్రమే ఆయా భాషలలో మాట్లాడుతున్నారని తెలిసి భాషావేత్తలు ఆందోళన పడుతున్నారు. ఇందులోకి దిగితే చాలా ఆశ్చర్యకర విషయాలను తెలుసుకొని గుండె బాదుకొంటాం. ఇయాక్ అనే భాష మాట్లాడే ఏకైక వ్యక్తి అలస్కాలో 2008లో మరణించటంతో ఆభాష అదృశ్యమైంది. ఐరిష్ భాష లాంటి "మాక్స్" భాష మాట్లాడే చివరి ఆయన 1974లో మరణించటంతో అదీ తీసివేతకు గుర్రైంది. అండమాన్ దీవుల్లో "బో" భాష మాట్లాడే 85 ఏళ్ళ మహిళ 2010 ఫిబ్రవరిలో చనిపోవటంతో 65,000 సంవత్స రాల నుండి అవిచ్ఛిన్నంగా ఉన్న లంకే తెగిపోయింది. లాటియాయాలో "లివోనియన్" భాష మాట్లాడే ఒకే ఒకరు ఇంకా ఉన్నారు. ఇప్పటి వరకు ఎనభై భాషలు, ఆ భాషలు మాట్లాడే జనంలేక కాల గర్భంలో కలిసి పోయాయి. ఇది చాలా ఆందోళనకర విషయం. కొన్ని భాషలు భాషా సాన్కర్యం వల్ల అంతరిస్తాయి. పాత ఇంగ్లీష అనే ఆంగ్లో సాక్సన్ భాష మోడరన్ ఇంగ్లీష వ్యాప్తి వల్ల కనుమరుగైంది. భాషా శాస్త్రజ్ఞుల లెక్క ప్రకారం 516 భాషలు కోన ఊపిరితో మినుకు మినుకుమంటూ చావా లేక బ్రతకా లేక ఉన్నాయంటున్నారు. ఆఫ్రికాలో 46, అమెరికాలో 170, ఆసియాలో 12, పసిఫిక్‌లో 210 భాషలు కనుమరుగు ఆయె స్థితిలో ఉన్నాయి. ఈ శతాబ్దం అంతానికి మాట్లాడే భాషల్లో సగం అంతరిస్తాయని హెచ్చరిక. మన దేశ విషయానికి వస్తే- 428 భాషలున్న మనకు అధికార భాషలు 22 ఉన్నాయి. 196 భాషలు ప్రమాదం అంచున ఉన్నాయి. అందులో 84 భాషలకు తీవ్ర గడ్డు స్థితి. మరీ ముఖ్యంగా 62 తులసి తీర్ధానికి రెడీగా ఉన్నాయి. ఒకసారి వాటి వివరాలను చూద్దాం- అస్సాంలో అహోం, తురంగ్ భాషలు, అండమాన్, పాళీలలో ఒకో-జువాయ్, టిబెటన్ బర్మాలో అకాబీ, అకాబో, అకా కారి, అకా కేడీ, అకాకోరా, అకా బాలేలు అంతరించి పోయి నాగరకతకు సంస్కృతికీ వికాసానికి దోహదం చేసినవి నిష్క్రమించి ఆందోళనకు గురి చేస్తున్నాయి. అతి కొద్దిమంది జనం మాట్లాడే భాషల గురించి వింటే గుండె తరుక్కు పోతుంది. అండమాన్‌లోని జేరు భాషనూ కేవలం ఏడుగురు మాట్లాడుతున్నారు. అక్కడిదే అయిన మరోభాష జార్వాను మాట్లాడే వారు 250 మంది మాత్రమే. అక్కడివే అయిన ఒంగేను వందమంది, ఆ పూకిక్వార్ భాషను 24 మంది అస్సాంలోని ఖామ్యంగ్

భాషను కేవలం యాభై మంది, ఒరిస్సాలోని పరాంగ్ భాషను 76 మంది, ఉత్తరాఖండ్‌లోని జాద్భాష మాట్లాడేవారు మూడొందలు మాత్రమే ఉన్నారు అంటే భాషలు ఎంత తీవ్ర వేగంతో కాల గర్భానకలిసి పోతున్నాయో తెలుస్తోంది. ఇలా ఆందోళన పది నిశ్చేష్టులై చైతన్య రహితంగా ఉండటమేనా? లేక భాషా పునరుద్ధరణ కార్యక్రమాలు ఏమైనా జరుగుతున్నాయా అని మనకు అనుమానం రావటం సహజం. ప్రయత్నాలు జరుగుతూనే ఉన్నాయి. భాషలను బతికించుకొనే
ప్రయత్నాలను తీవ్రంగానే చేస్తున్నారు. దీనికి కొన్ని ఉదాహరణలు– బ్రిటన్‌లోని యూనివర్సేల్ భాష అని పిలువబడ్డ "కార్న్ వాల్లోని కార్నిష్"భాష మాట్లాడే వారు 1990లో దాదాపు అంతరించిపోతే పటిష్టమైన చర్యలను తీసుకోవటం వల్ల ఇప్పుడు 300 మంది ఆ భాషను నేర్చుకొని సజీవంగా ఉంచారు. హాట్స్ ఆఫ్. అలాగే ఐస్ లాండ్‌లో ఇంగ్లీష భాష టో సంకరం కాకుండా వాళ్ళ
భాషలో పదాలను సృష్టించుకొని చక్కగా వాడుకొంటూ భాషను బతికించుకొంటున్నారు. ఆంధ్రప్రదేశ్‌లో భాషలను పునరుజ్జీవింప జేయటానికి భాషోద్యమ ఉద్యమాలను చేబట్టారు. "తెలుగులో మాట్లాడటం జన్మహక్కు" అనే నినాదం పెరిగింది. ఆంగ్ల మాధ్యమాన్ని తగ్గించామనే ఆందోళన చేబట్టుతున్నారు. తెలుగు భాషా సంఘాలు తెలుగు భాషా సంస్కృతికి అనేక పథకాలను ప్రభుత్వానికి సూచించి అమలు చేయటానికి ఒత్తిడి తెస్తున్నాయి. ఇప్పుడు తెలుగు అధికార భాషగా ఉన్నా ఆ సంఘానికి అధ్యక్షుడు లేడు. తెలుగు అకాడెమీ లేదు. తెలుగు భాషకు మంత్రి లేడు. ఎంతో ఒత్తిడి మీద నాలుగేళ్ల క్రితం తెలుగుకు ప్రాచీనహోదా లభించినా ఇంకా అధ్యయన కేంద్రం కేంద్ర గ్రాంటు రాలేదు. అసలు మంత్రులు, శాసన, లోకసభ సభ్యులు ఈ దిశాగా చేయాల్సిన ప్రయత్నం చేసింది తక్కువే.

కృష్ణా జిల్లా రచయితల సంఘం ఈ విషయాలలో అనేక చైతన్యయాత్రలను జరిపి ప్రజలకు విషయాలను తెలియజేసింది. తెలుగును కోర్టులలో అమలు జేసే విషయంలో సెమినార్ నిర్వహించింది. "తెలుగు రచయితల ప్రపంచ మహా సభలు" రెండింటిని విజయవాడలో అతి ఉత్సాహంగా నిర్వహించి అందరి దృష్టిని ఆకర్షించింది. రెండవ సభల అనంతరం ఆధునిక సాంకేతికతను జోడించి తెలుగును విశ్వవ్యాపితం చేసే ఆలోచన చేసి కొత్త ఫాంటులను ఆవిష్కరింపజేసి అంతర్జాలంలో తెలుగు వ్యాప్తికి కృషి చేసింది. ఈ సంఘానికి అధ్యక్ష కార్యదర్శులు శ్రీ గుత్తికొండ సుబ్బారావు, డా.జి వి.పూర్ణచంద్‌ల సేవలు నిరుపమానం. వీరికి మార్గ దర్శనం చేస్తున్న వారు శ్రీ మండలి బుద్ధ ప్రసాద్, యార్లగడ్డ లక్ష్మీ ప్రసాద్ గార్లు. అలానే తెలుగు భాషోద్యమాన్ని తమ భుజ స్కంధాలపై మోస్తు, వయస్సును కూడా లెక్క జేయకుండా అవిశ్రాంతంగా కృషి

చేస్తున్న మాన్యులు శ్రీ సి.ధర్మారావు, శ్రీ సామల రమేష్ బాబు గార్ల సేవలు మాటలతో చెప్ప లేనంతటి ఉత్కృష్టమైనవి. భాషను రక్షిస్తే అది మనల్ని రక్షిస్తుంది అని అందరు గుర్తించాలి. మాతృ భాష ఔన్నత్యాన్ని తెలుసుకోవాలి. ఇంటి భాషగా తెలుగులో మాట్లాడాలి. మన పిల్లలతో తెలుగులో మాట్లడించాలి. ఈ "భాషా ఘోష" అంతటా నినదించాలి. "భాష ఆలోచనకు ఆహార్యం", "నా మెదడులోని ఆలోచనలను నీ మెదడులోనికి శస్త్ర చికిత్స లేకుండా ప్రవేశ పెట్టేదే భాష" అన్నారు మహానుభావులు. ఈ వ్యాసానికి ఎక్కువ ఆధారం శ్రీ ఎం.యెన్.శాస్త్రి (ముంబాయ్) గారు రాసిన "world demographic trends" అనే పుస్తకంలోని languages అనే వ్యాసం. ఈ పుస్తకాన్ని నాకు పంపి నన్ను చదివించిన నా మిత్రులు శ్రీ మైనేని గోపాలకృష్ణ గారి సాహిత్య ఋణం తీర్చుకోలేనిది.

(21-7-12.-కాంప్-అమెరికా)

అమెరికా డైరీ-**27**

## శత దినోత్సవ వారం

జులై పదిహేను సోమవారం నుండి ఇరవై రెండు ఆదివారం వరకు విశేషాలు-వాన ప(పు)లకరింపు-దక్షిణాయనం-శ్రావణ మాసం విశేషాలు కిందటి వారం అంతా టన్చన్‌గా రోజు సాయంత్రం అయిదు గంటల నుంచి ఆరు గంటల వరకు వర్షం పలకరించి, పులకరించి పోతోంది. ఉష్ణోగ్రత 96 f పైనే ఉండటం ఈ జల్లులు వర్షంతో హర్షాన్ని కలిగించాయి. సమయ పాలనను వాన దేవుడు బానే పాటించాడు. సోమవారం, ఆదివారం మైనేని గోపాలకృష్ణ గారు ఫోన్ చేసి మాట్లాడారు. పదహారో తేది రాత్రి సూర్యుడు మకర రాశి నుండి కర్కాటక రాశిలోకి ప్రవేశించాడు. ఉత్తరాయణ పుణ్య కాలం వెళ్లి దక్షిణాయణం వచ్చింది. ఈ శుక్రవారం నుండి శ్రావణ మాసం ప్రవేశించింది.

## శ్రావణ శుక్ర వారాల హడావిడి

ఈ శుక్రవారం నుండి వరుసగా వచ్చే అయిదు శుక్రవారాలు మా అమ్మాయి విజ్జి వాళ్ళింట్లో రాత్రి పూట, అమ్మ వారి స్తోత్రాలు భజన కార్యక్రమాన్ని ఏర్పాటు చేసింది. మొదటి శుక్రవారం రాత్రి ఎనిమిది గంటలకు భజన మొదలైంది సుమారు ముప్ఫై మంది వచ్చారు గంట సేపు అమ్మ వారి స్తోత్రాలతో భజన బాగా జరిగింది. విజ్జి, శ్రీకేత్‌లతో పాటు మిగిలిన వారందరూ భజన గీతాలు పాడారు. ఆ తర్వాత అందరికి విందు -అన్నం, బెండకాయ కూర, దోసావ కాయ, గోంగూర పచ్చడి,

చపాతీ, చోలీ కూర, సాంబారు, సేమ్యా పాయసం, పులిహోర, అప్పడాలు, పెరుగుతో రుచి, శుచికరమైన భోజనం. అందరు తృప్తిగా తిని అభి నందించారు. మిగిలిన నాలుగు వారాలు ఇలానే రావాలని అందరికి చెప్పటమే కాదు–అందరికి మెయిల్ రాసింది ఇది వరకే. అంతా ఆయేసరికి రాత్రి పదిన్నర అయింది. వచ్చే శుక్రవారం వరలక్ష్మీ వ్రతం. ఉదయం ఎవరింట్లో వారు పూజ చేసుకొని రాత్రికి ఇక్కడికి వస్తారు. వాయనాలు ఇక్కడే ఇచ్చుకొంటారు. చాలా మంది మహిళలు వస్తారు కనుక అదొక వీలు.

ఈ ఆదివారం సాయి సెంటర్‌లో ఉదయం పదింటి నుండి జరిగే కార్యక్రమానికి చాలా రోజుల తర్వాత వెళ్లాను. మధ్యాహ్నం పన్నెండున్నర దాకా ఉండి ఇంటికి వచ్చాము. ఇక్కడి సాయి సెంటర్ గురించి కొన్ని విషయాలు తెలియజేస్తాను. వీరిలో ఎక్కువ మంది మద్రాస్, హైదరాబాద్ వగైరా సత్యసాయి సెంటర్లు అయిన "సత్యం, శివం, సుందరం"లలో ప్రత్యక్షంగా సంబంధం ఉన్నవాళ్ళు. వారందరూ మంచి క్రమశిక్షణతో, సాయి సేవా కార్యక్రమాలను, భజనలను అత్యంత శ్రద్ధా, ఆసక్తులతో నిర్వహిస్తారు. డబ్బులు వసూలు చేయరు. అంతా వాలంటరీ సేవే. ఇందులో తెలుగు తమిళం మలయాళం, హిందీ గుజరాతి, రాజస్తానీ మొదలైన వారందరూ ఉన్నారు. భాషలు వేరైనా భావాలు ఒక్కటే. సేవ ప్రేమ. అంకిత భావంతో పని చేస్తారు. పిల్లలకు ప్రత్యేక క్లాసులు నిర్వహించి వారిని ఆదర్శమార్గం వైపుకు మళ్లిస్తారు. పిల్లలందరూ చక్కగా కలిసి మెలసి ఉంటారు. ఎవరో ఒకరింటి వద్ద సాయం కాలాలలో భజన ఏర్పాటు చేసుకొంటారు. మిగిలినవారు హాజరై కార్యక్రమాన్ని నిండుగా నిర్వహిస్తారు. వీలైతే రాత్రి ఏదో టిఫిన్, లేక భోజనం ఏర్పాటు చేస్తారు గృహస్తులు. చెయ్యాలి అనే నియమం లేదు. వారి ఉత్సాహం. డోలక్, హార్మని, తబలా వాయించే కళాకారులు మంచి గాత్రంతో శ్రావ్యంగా పాడే వారు వీరిలో ఉన్నారు. వీరందరూ ఆడా మగా దాదాపు ఐ.టి.ఉద్యోగులే. తీరిక సమయాలలోనే ఈ సేవ. మధ్య మధ్య మెడికల్ కాంప్‌లను నిర్వహిస్తారు. మందులు ఉచితంగా ఇప్పిస్తారు. పూర్ ఫీడింగ్‌ను చర్చి వారి సహకారంతో నిర్వహిస్తారు.

ముఖ్యమైన విషయం సాయి సెంటర్‌లోని వారంతాయే ప్రాంతం వారైనా "శాకా హారమే" భుజిస్తారు. మద్యం సిగరెట్ల జోలికి వెళ్లరు. ఇవి నాలాంటి వాళ్ళందరికీ ఆనందదాయకంగా ఉంది. మంచి కుటుంబంలా కలిసి మెలిసి ఉంటారు. ఇంతకంటే అమెరికాలో మంచి సమాజం ఉండదనిపిస్తారు. మా ఇద్దర్ని "అంకుల్ అని ఆంటీ" అని ఆప్యాయంగా పలకరిస్తారు. అన్నిటి కంటే ఒకరినొకరు కలిసినప్పుడు, విడి పోయేటప్పుడు "సాయి రాం" అని పలకరించు కొంటారు. భజన ముందు, తర్వాతా

"సర్వే జనా స్సుఖినో భవంతు. సమస్త లోకాస్సుఖినో భవంతు" అని ప్రపంచ, విశ్వశాంతి మంత్రం చదువుతారు. ఇన్ని వేల గొంతులు ప్రపంచ వ్యాప్తంగా ఈ మంత్రాన్ని చదువుతుంటే సామూహిక వాక్కు ఫలితం ఉంటుందని మనకు తెలుసు. భోజనం చేసే ముందు భగవద్గీత శ్లోకాలు చదువుతూ అన్నాన్ని పరబ్రహ్మ స్వరూపంగా భావిస్తూ స్తోత్రం చేస్తారు.

సత్యసాయి భజనలు ఏ దేశంలోనైనా ఒకే రకంగా చేస్తారు. అవి చక్కగా బాణీలు కట్టి ఒకే రకంగా పాడుకొనే తట్లు ఉంటాయి. అన్ని గ్రంథస్తం అయి ఉంటాయి. ఎవరైనా అలానే పాడతారు. ముందు మామూలు స్తాయి, తర్వాత వేగవంతం, తర్వాత తారా స్తాయి, మళ్ళీ మామూలుకు వస్తారు. భజనలు అన్ని చాల మంచి భావంతో శ్రీ రామ, శ్రీ కృష్ణ శివ, షిర్డీ ఆయీ బాబా జొరాస్టర్, క్రీస్తు మహమ్మద్, అల్లా పార్వతి లక్ష్మీదేవి, సరస్వతి కాళికల పేర భజనలుంటాయి. ఎ దేవుణ్ణి, మత ప్రవక్తను వదలరు. గణపతి, సుబ్రహ్మణ్యం బుద్ధ, జైనులనూ స్మరించే భజనలుండటం విశేషం. సర్వ మత సహనం ఇక్కడ స్పష్టంగా కనీ పిస్తుంది. చివర్లో ప్రతి భజనలో షిర్డీసాయి, సత్యసాయి పేర్లు వుంటాయి. అదే ప్రత్యేకం. ప్రపంచం అంతా ఒకే పద్ధతిలో భజన చేయటం గొప్ప విషయం. ఆదర్శం. సత్యసాయి మీద నమ్మకం ఉన్నా లేకపోయినా ఈ విధానం నాకు నచ్చింది.

సరే, అసలు విషయానికి వస్తే– మేము అమెరికా వచ్చి మూడు నెలలు దాటి పది రోజులపైనే అయింది. అంటే వంద రోజులు అయింది అన్న మాట. అంటే "శత దినోత్సవ వారం" అయింది. ఈ వారం మాకు ......ఈ వారంలో ఒకే ఒక పుస్తకం paul brunton రాసిన "in search of secret india"ను చాలా ఆసక్తి గా చదివాను. దీన్ని నాకు కానుకగా ఇచ్చారు మిత్రులు శ్రీ మైనేని గోపాలకృష్ణ గారు. దానిని ఆధారంగా ఇప్పటికి మూడు ఆర్టికల్స్ –పరమాచార్య సందర్శనంతో పులకింత, మేహేర్బాబి, పరమాచార్య పథం రాశాను. ఇంకా భగవాన్ శ్రీ రమణ మహర్షి గారి గురించి, ఇంకా మరో రెండు ఆర్టికల్స్ రాయాలి. ఇది గాక లైబ్రరి నుండి తెచ్చిన "Albert Eistein" క్షుణ్ణంగా చదివి నోట్సు రాసుకోన్నాను. అవీ ఎప్పుడో వరుసగా రాయాలి. అంతకుమించి ఏమీ చదవలేక పోయాను.

(23-7-12-కాంప్-అమెరికా)

అమెరికా డైరీ-**28**

## శ్రీ వరలక్ష్మీ వ్రత వారం

జూలై ఇరవై మూడు సోమవారం నుండి, ఇరవయ్ తొమ్మిది ఆదివారం వరకు

## షార్లెట్ సాహితీ మైత్రీ బంధం

విశేషాలు–

కోసూరు ఆదినారాయణ, అంగలూరు రాజేంద్రప్రసాద్ గార్లు సోమవారం ఫోన్ చేసి మాట్లాడారు. వాళ్ళ కోరికపై సరస భారతి సమాచారాలు పంపుతున్నాను. వారిద్దరిని "సాహితీ బంధు గ్రూప్"లో చేర్చాము. అప్పటి నుండి మన కార్యక్రమ విశేషాలు ఫోటోలు, వ్యాసాలూ అన్నీ వారికి చేరుతాయి. మేనల్లుడు శాస్త్రితో చాట్ చేశాను. వర్డ్ ప్రెస్ లో సరసభారతికి స్పేస్ కోసం స్పాన్సర్ చేస్తానని ఇది వరకే అన్నాడు. ఇప్పుడు ఆ అవకాశం వచ్చింది. దాన్ని గుర్తు చేశాను. వెంటనే 99 డాలర్లు వర్డ్ ప్రెస్‌కు ఆన్‌లైన్‌లో చెల్లించి, స్పేస్‌ను ఇప్పించాడు. వెంటనే అభినందనలు తెలిపాను.

### శ్రావణ మంగళ వారం

ఈ రోజు మొదటి మంగళవారం. ఇంట్లో పూజ చేసుకొన్నారు తల్లీ కూతుళ్ళు. ఉయ్యూరు దగ్గర కనకవల్లిలోని వెంపటి సోమయాజులు గారి కూతురు కుమారుడు ఇక్కడే ఉంటున్నారు. అతని భార్య విజ్జికి బాగా పరిచయం. వాళ్ళ ఇంటి పేరు ప్రక్కి. ఆయనది బందరు. ఆ అమ్మాయి మన వాళ్ళిద్దర్నీ మంగళవారం వాయనానికి భోజనానికి పిలిచింది. వెళ్లి వచ్చారు. అతను కోసూరు ఆదినారాయణ బావమరది, అల్లుడు టెక్సాస్‌లోని ఆస్టిన్‌లో ఉంటున్న ప్రసాద్‌కు స్నేహితుడు.

### పితృ స్మరణ

మా అమ్మాయి వాళ్ళ ఇంటి ప్రక్కన ఉన్న పసుపుల రవి గారి భార్య గాయత్రి "అంకుల్ అంటి" అంటూ బాగా పలకరించి మాట్లాడుతుంది. ఆమె మంగళవారం మధ్యాహ్నం వచ్చి ఆమె తండ్రి గారు మారెళ్ళ పార్ధసారధి గారు చనిపోయి పది ఏళ్ళు అయిందని, ఆయన చనిపోయిన రోజు ఈ రోజేనని చెప్పి, ఆయన్ను తలుచుకుంటూ నాకు తాంబూలం ఇవ్వాలను కొంటున్నానని చెప్పి వాళ్ళ ఇంటికి ఆహ్వానించింది. సరేనని ఆమెతో వాళ్ళింటికి వెళ్లాను. పరవాన్నం పెట్టింది. కుర్చీలో కూర్చోపెట్టి నాకు ఒక లుంగీ తువ్వాలు పెట్టి, తాంబూలం ఇచ్చింది. అందులో వంద డాలర్ల నోట్ ఉంది. ఇదేమిటి తాంబూలం అంటే వచ్చాను ఈ డబ్బు వద్దు అన్నాను. ఆమె అప్పుడు "అంకులే! మా నాన్న గారు మంచి సాహిత్యాభి లాషి. ఎప్పుడూ ఏదో రాస్తూ పుస్తకాలు ప్రచురిస్తూండే వారు. చనిపోయి పదేళ్లు అయింది. ఆయన జ్ఞాపకర్ధంగా ఇస్తున్నాను. ఈ డబ్బును సరసభారతి కోసం ఉప యోగించండి ప్లీజ్" అని బ్రతి మాలింది. సరే సరసభారతికి ఇంతటి ప్రోత్సాహం లభిస్తుంటే కాదన లేక తీసుకొన్నాను. వాళ్ళ నాన్న గారు రాసిన "గీతా సందేశం" పుస్తకాన్ని కూడా ఇచ్చింది. సరసభారతి తరపున ఆమెకు కృతజ్ఞతలు చెప్పి ఇంటికి వచ్చాను. గీతా సారం చదివాను. ఆయన

మహాజ్ఞాని అని ఎన్నో విషయాలు ఆయనకు బాగా తెలుసునని అర్ధమయింది. మంచి పనికి సహకరించినందుకు ఆమెను అభినందించాను. ఉదయం హిందూ సెంటర్‌లో మా మనవళ్ళు సమ్మర్ క్లాస్‌కు వాళ్ళను తీసుకొని వెళ్లి అక్కడి బాలాజీ దేవాలయంలో శివునికి జరిగే అభిషేకంలో నేనూ పాల్గొన్నాను. ఇక్కడ ఇంకో విషయం– కిందటి నెలలో నేను అలబామా వెళ్లి హన్ట్స్ విల్‌లో శ్రీ మైనేని గోపాలకృష్ణ గారింటికి వెళ్లినప్పుడు వారు ఎంతో ఆదరం చూపించి నాకు అన్నీ చూపించి, అక్కడి ఆయన స్నేహితులకు పరిచయం చేశారని లోగడే రాశాను. నేను వారివద్ద సెలవు తీసుకొని వస్తూండగా బస్ ఎక్కబోయే ముందు రహస్యంగా ఆయన నా జేబులో ఒక కాగితం పెట్టారు. ఏమిటోనని తీసి చూస్తే అది అయిదు వందల డాలర్ల చెక్కు. ఇదేమి పని? అన్నాను. దానికి ఆయన “ఇది మన సరసభారతికి నేనిచ్చే కానుక. దీన్ని మీ ఇష్టం వచ్చినట్లు ఉపయోగించండి ఆంజనేయ స్వామికి వాడినా, సరసభారతికి వాడినా, పుస్తక ముద్రణకు వాడినా మీ ఇష్టం” అని నన్ను మాట్లాడనివ్వ లేదు. అయితే “దీన్ని ఎవరికి చెప్పి ప్రచారం చెయ్యద్దు'' అన్నారు. అది నాకు వదిలేయండి అన్నాను. అంతటి ఉదారులాయన. అందుకని ఈ సందర్భంలో గుర్తు చేశాను.

## శ్రీ వరలక్ష్మీ వ్రతం – పౌరోహిత్యం

ఈ రోజు రెండవ శ్రావణ శుక్రవారం. శ్రీ వరలక్ష్మీ వ్రతం పొద్దున్నే లేచి విజ్జి నాదస్వరం పెట్టింది. ఆ తర్వాత తల్లీ కూతుళ్ళు ఇద్దరు, పిల్లలను సమ్మర్ కాంప్‌కు పంపిన తర్వాత వంట చేశారు. తర్వాత అమ్మ వారిని కలశంలో పెట్టి మంచి అలంకరణ చేసి పూజకు కూర్చున్నారు. నేనే పూజ చేయించాను విధి విధానంగా. ఆ తర్వాత ఒకళ్ళకొకళ్ళు వాయనాలిచ్చుకొన్నారు. తల్లికి కూతురు చీర జాకెట్టు పెట్టింది. భోజనాలలోకి పూర్ణ బ్బూరెలు, ఉండ్రాళ్ళు, పాయసం, గోంగూర పప్పు, వంకాయ కూర, కొత్తిమీర ఖారం చేశారు. అన్నీ కమ్మగా ఉన్నాయి.

సాయంత్రం విజ్జి స్నేహితురాలు సౌమ్య అనే అమ్మాయి వచ్చింది ఇక్కడ పూజ చేసుకోవాటానికి. ఆమె ఉద్యోగం చేస్తున్నందున పొద్దున్న పూజ చేసుకోలేక పోయిందట. మా వాళ్ళు పేరంటానికి వెళ్లారు. నాగమణి, కూతురు కూడా వచ్చారు వాయనానికి. సౌమ్య పుస్తకం అడిగింది ఇచ్చాను. ఏదో పూజ చేస్తోంది. తీరా చూస్తే మంగళవార పూజ చేస్తోంది. అదికాదని “నేను పూజ చేయిన్చనా అమ్మా?”అని అడిగాను. చాలా సంతోషించింది. అప్పుడు విఘ్నేశ్వర పూజ, తులసి, వరలక్ష్మి, లలితా త్రిపుర సుందరి పూజలు, తోర పూజ, తోరాన్ని కట్టే మంత్రం చదివి కట్టించాను. ఆమె చాలా ఆనందించింది. తాంబూలం తీసుకో మని అందులో పది డాలర్లు పెట్టింది. దాన్నీ సరసభారతికే వినియోగిద్దామని అనుకొన్నాను.

## భజన

రాత్రి ఎనిమిది గంటలకు భజన కార్యక్రమం. యాభై మంది వచ్చారు ఆడామగా, పిల్లలు అందరు కలిసి. గంట సేపు. భజన జరిగింది. అమ్మ వారి మీద గీతాలతో అందరు పాడి భజన చేశారు. మహిళలందరూ శ్రావణ లక్ష్మీ స్వరూపులుగా పట్టు చీరలు కట్టుకొని నగలు అలంకరించుకొని వచ్చారు. మా ఇంటికి ఇంత మంది లక్ష్మీ దేవులు వచ్చారని సంబర పడ్డాను. ఆడ పిల్లలు కూడా సాంప్రదాయ దుస్తులు ధరించి అమెరికాలో భారత దేశాన్ని చూపించారు. తొమ్మిది గంటలకు విందు. పూర్ణపు బూరెలు, ఉండ్రాళ్ళు, పాయసం, పులిహోర, అన్నం, వంకాయ కూర, కొత్తిమిర చట్నీ, సాంబారు, అన్నం పెరుగు, పుచ్చముక్కలు, పనస తొనలుతో విందు పసందుగా ఉంది. కొందరు పాయసం చేసుకొని వచ్చారు. కొందరు వడ, ఆవడ తెచ్చారు. ఇంకో ఆమె రవ్వ కేసరి తెచ్చింది. ఇల్లంతా లక్ష్మీ కళతో కళ కళలాడింది. అన్ని వయసుల వాళ్ళు వచ్చారు. ఆడవాళ్ళు తమతో తెచ్చుకొన్న వాయనాలను ఒకరికొకరు ఇచ్చుకొన్నారు. మొత్తం మీద సందడి సందడిగా శుక్రవారం గడిచింది. రాంకీ ఉషా మామ గారు అత్త గారు, పవన్ కుటుంబం, రవి కుటుంబం నాగమణి ఫామిలి, కనకవల్లి అమ్మాయి భర్త, జగదీశ్ కుటుంబం, యోగిని, భర్తశని వారం గృహప్రవేశం చేసుకొనే మా ఇంటి దగ్గరున్న గుజరాతీ కుటుంబం వగైరాలందరూ వచ్చి నిండుదనం తెచ్చారు. అందరు వెళ్ళేసరికి పావుతక్కువ పదకొండు.

## భజనతో విందు

శనివారం రాంకీ ఉషా వాళ్ళ ఇంట్లో రాత్రి భజనకు ఆహ్వానిస్తే వెళ్ళాం. ఇక్కడికి అరగంట డ్రైవ్. సాయంత్రం ఆరు నుంచి రాత్రి ఏడున్నర వరకు భజన. సుమారు ముప్ఫై అయిదు మంది వచ్చారు. ఏడున్నరకు విందు. పూర్ణాలు, పులిహోర, ఉప్మా పూరీ చెనా మసాలా, అన్నం సాంబారు గుత్తి వంకాయకూర, పుచ్చ ముక్కలు బొప్పాయి ముక్కలు, మామిడి జ్యూసు, పాయసంతో గట్టి విందే ఇచ్చారు రాంకీ దంపతులు. వాళ్ళింటికి విందుకు వెళ్లటం ఇది రెండోసారి. నేను మా అమ్మాయి ఇంటికి తిరిగివచ్చి ప్రక్కనే గృహప్రవేశం చేసుకొన్నా గుజరాతీ కుటుంబం ఆహ్వానం మీద వాళ్ళ ఇంటికి వెళ్ళాం. పది రకాల పదార్ధాలు చేశారు కాని ఒక్కే ఒక బజ్జి తిన్నాను. భోజనం దాదాపు రాంకీ వాళ్ళింట్లోనే లాగిం చేశాం. ఇది ఊరికే కంపెని సేక్. వాళ్లకు ఒక సంప్ర దాయం ఉందట. గృహప్రవేశం అయిన రాత్రి ఇంట్లో వాళ్ళ గుజరాతీ సంప్రదాయ నృత్యం "గాగ్రా దాన్సు' 'చేయాలట తప్పని సరిగా. నేను వచ్చేశాను. మా అమ్మాయి అల్లుడు ఉండి చూసి వచ్చారు.

## పొరిగింట నిద్ర (స్లీప్ ఓవర్)

ఇక్కడ అమెరికాలో ఒక అలవాటు ఉంది. చిన్న పిల్లలు తమ క్లాస్‌మేట్లు లేక తెలిసిన కుటుంబాలలో ఒకరోజు రాత్రి గడిపి వారితో కలిసి మెలసి ఉంటారు. దీన్ని "స్లీప్ ఓవర్" అంటారు. మా మనుమళ్ళు శ్రీకేత్, ఆశుతోష్, పీయూష్‌లు రాంకీ వాళ్ళ ఇంట్లో వాళ్ళ పిల్లలతో స్లీప్ ఓవర్ చేయటానికి శనివారం రాత్రి వాళ్ళింట్లో ఉండిపోయారు. భజనకు వెళ్ళేప్పుడే ఉండటానికి కావలసిన బట్టలు తీసుకొని వెళ్లారు. మేము ఇంటికి వచ్చేశామని ముందే చెప్పానుగా.

## అమెరికాలో చలివేంద్రం (లేమనాడ్ స్టాండ్)

ఇండియాలో వేసవి కాలం చలివేంద్రం పెట్టి చల్లని మంచినీళ్ళు మజ్జిగ ఇవ్వటం మనకందరికీ తెలుసు. ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్‌లో వీటిని బాగా నిర్వహిస్తారు కదా. అట్లాగే మా మనవాళ్ళు రాంకీ కూతురు కొడుకు శనివారం మధ్యాహ్నం రాంకీ వాళ్ళ ఇంటి ఎదురుగా నిమ్మకాయ జ్యూస్‌ను ఒక గాజు పాత్రలో పోసి ఐసు గడ్డలు కలిపి చల్లగా చేసి దాన్ని స్టాండ్స్ మీద ఉంచి వచ్చే పోయే వారికి గ్లాసుల్లో పోసి ఇచ్చారట. కొందరు దీనికి గాను గ్లాసుకు యాభై సెంట్లు ఇచ్చి పిల్లలను ఉత్సాహ పరచారట. మంచి పనికి ప్రేరణ నిచ్చిన రాంకీని అభినందించా. అతనే పిల్లలకు కథలు లెక్కలు చెప్పి ఆటలాడించి బాగా కాలక్షేపం కల్గించాడు.

## పదేళ్ళ తర్వాత ఈత మోత

చిన్నప్పుడు మా ఉయ్యూరులో పుల్లేరులో స్నానం చేసి ఈదులాడే వాళ్ళం. నేను సునాయాసంగా మునిగి తేలుతూ ఈది అవతల ఒడ్డుకు వెళ్లి తిరిగి ఈదుకొంటు వచ్చేవాడిని. నా దగ్గర ట్యూషన్ చదివే పిల్లలను ఉదయమే స్నానాలకు తీసుకొని వెళ్లి చేయించే వాడిని. కాలవ అంతా దుర్గంధంగా మారిపోవటం వల్ల దాదాపు యాభై ఏళ్ళు అయింది పుల్లేట్లో స్నానం చేసి. మొదటిసారి అమెరికాకు పదేళ్ళ క్రితం టెక్సాస్‌లోని హూస్టన్‌కు వచ్చాం. మా అమ్మాయి వాళ్ళ ఇంటికి చాలా దగ్గర్లో స్విమ్మింగ్ పూల్ ఉంది. అక్కడ అయిదారు సార్లు స్నానం చేసి ఈత కొట్టాను. మళ్ళీ ఈ పదేళ్ళలో ఎక్కడా చేయలేదు. ఇవాళ ఆదివారం రాంకీ ఇంటి నుంచి పిల్లలను తీసుకొని వద్దామని నేను మా అమ్మాయి వెళ్ళాం. అక్కడ స్విమ్మింగ్ పూల్‌లో పిల్లలు స్నానం చేయటానికి హుషారుగా ఉన్నారని నన్ను కూడా చేయమని బట్టలు సర్దింది. సరేనని వెళ్ళాం. అందరం అంటే నేను మా అమ్మాయి ముగ్గురు మనవళ్ళు రాంకీ అతని భార్య ఉషావాళ్ళ అమ్మాయి అబ్బాయి స్విమ్మింగ్‌పూల్‌కు వెళ్ళాం. చాలా దగ్గరే వాళ్ళ ఇంటికి. అందరం పూల్ లో దిగి ఒక గంట సేపు స్నానం చేశాం. రాంకీ నేను గంట తరువాత ఇంటికి తిరిగి వచ్చాం. మా వాళ్ళు ఇంకో గంట ఉండి వచ్చారు. ఇంటికి చేరేసరికి రాత్రి

ఏడున్నర. అలా పదేళ్ళ తర్వాత ఈత మోత మోగించాను. బాగానే ఈదానని రాంకీ నన్ను మెచ్చాడు. అతను సాధారణంగా వెళ్ళడట. నా ఉత్సాహం చూసి వచ్చాడు. మా అమ్మాయి వాళ్ళ ఇంటికి ఎదురుగా స్విమ్మింగ్ పూల్ కడుతున్నారు. దాదాపు అయిపోయింది. ఆగస్టు రెండో వారంలో ప్రారంభోత్సవం. అతని మామ గారు అత్తగారు కిందటి వారమే హైదరాబాద్ నుండి వచ్చారు. ఆయన ఒరిస్సాలోని జైపూర్‌లో గవర్నమెంట్ హైస్కూల్ హెడ్ మాస్టర్ చేసి రిటైర్ అయాడు. అక్కడే పుట్టి అక్కడే చదివి ఆ స్కూల్‌లోనే ఉపాధ్యాయుడై హెడ్‌గా అయా స్కూల్‌లోనే పని చేసి పదవీ విరమణ చేశాడు. మా రెండో కోడలు ఇందిరది ఆ ఊరే. వాళ్ళ నాన్న బల్లార్ పూర్ పేపర్ మిల్స్‌లో పని చేసి రిటైర్ అయ్యాడు. మా మనవడు హర్ష బారసాలకు జైపూర్ వెళ్ళాం. కాని మా వాళ్ళెవరూ ఆయనకు తెలియదన్నాడు. ఒకప్పుడు జైపూర్ ఆంధ్ర దేశంలో ఉండేది. జైపూర్ రాజు విక్రమ దేవ వర్మ గొప్ప సాహిత్య పోషకుడు

(29-7-12-కాంప్-అమెరికా)

అమెరికా డైరీ-**29**

## "సినీ సంగీత మణి" శర్మ వారం

జులై ముప్ఫై సోమవారం నుంచి ఆగస్ట్ అయిదు ఆదివారం వరకు విశేషాలు. వారంలో మొదటి అయిదు రోజులు సాదా సీదా గానే గడిచి పోయాయి. మా అమ్మాయి పంటి డాక్టర్ వద్ద ఆరు పళ్ళను తీయించు కొంది బుధవారం. చాలా సునాయాసంగా అరగంటలో తీశేశాడు. ఆ రోజు కొంచెం నెప్పితో బాధ పడింది కాని మర్నాడు నుంచి పిల్లల్ని సమ్మర్ కాంప్‌లకు తీసుకొని వెళ్లటం తీసుకొని రావటం తప్ప లేదు. డ్రైవింగ్ చేయక తప్పని పరిస్థితి. గురువారం లైబ్రరీకి వెళ్లి తొమ్మిది పుస్తకాలిచ్చి కొత్తవి ఆరు తెచ్చు కున్నాను. ఈ వారంలో చదివినవి అన్ని మంచి ఉపయోగమైన పుస్తకాలే. శుక్రవారం సాయంత్రం మా వాళ్ళ ఇంట్లో రాత్రి ఎనిమిది నుండి తొమ్మిది వరకు భజన. ముప్ఫై మంది వచ్చారు. ఇది మూడవ శుక్రవారం భజన. ఆ తర్వాత విందు. మా అమ్మాయి నిమిగిలిన స్నేహితురాళ్ళు ఏమీ ఇంట్లో తయారు చేయద్దని చెప్పినా పులిహోర, అన్నం, సాంబారు కాకరకాయ కారం సెనగ పిండి కూరిన కూర, పెరుగు తయారు చేసింది. మిగిలిన వాళ్ళు సేమ్యా పాయసం, గారెలు, ఉప్మా, చానా మసాలా బీన్సు కూర, దొండ కాయ కూర వండి తెచ్చారు. అందరం సరదాగా కలిసి భోజనం చేశాం. అందరు వెళ్ళేసరికి రాత్రి పది అయింది.

శనివారం మా వాళ్ళ ఇంటికి ఎదురుగా మాకు పది గజాల దూరంలో నిర్మించబడ్డ

స్విమ్మింగ్ పూల్ పూర్తి అయి ఉదయం పది గంటలకు ప్రారంభించారు. పిల్లలు, పెద్దలు అందరు సరదాగా స్విమ్మింగ్ చేశారు. సాయంత్రం విజ్జి స్నేహితురాలు, భర్త వచ్చారు. వాళ్ళు ఈ కాలనీలోనే కొత్త ఇల్లు కొన్నారట. గృహప్రవేశం ఎప్పుడు చేయాలని అడిగారు. వాళ్ళు సెప్టెంబర్‌లో చేరాలని అనుకొంటున్నట్లు చెప్పారు. అది అధిక భాద్రపదం పనికి రాదనీ చెప్పాను. మంచిది చూడమంటే ఆగస్టు ఎనిమిదో తేది బుధవారం ఉదయం యేడు యాభైకి ముహూర్తం పెట్టాను. సంతోషించారు.

## "స్వరమణి" శర్మ సంగీత విభావరి

షార్లెట్‌లోని "తెలుగు అసోసియేషన్ ఆఫ్ గ్రేటర్ షార్లెట్ ఏరియా" అనే సంస్థ– "ఆటా"కు అనుబంధంగా పని చేస్తోంది. వాళ్ళ ఆధ్వర్యంలో సినీ సంగీత దర్శకుడు మణిశర్మ సంగీత విభావరి అయిదవ తేది ఆదివారం సాయంత్రం జరిగింది. మా ఇంటికి నలభై అయిదు నిమిషాల ప్రయాణ దూరంలో, పాతిక మైళ్ళ పైనదూరం ఉన్న కాన్కార్డ్ పార్కు వేలో ఉన్న రిచింగ్ టన్ హై స్కూల్ ఆడిటోరియంలో జరిగింది. మా అల్లుడు సెప్టెంబర్ నుంచి పిల్లల కోసం "వీక్లి రీడింగ్" క్లాసులు ఇంటి దగ్గర నిర్వ హించాలని అనుకొని ప్రోగ్రాంకు స్పాన్సర్ షిప్ మూడు వందల డాలర్లు కట్టాడు. అందులో వంద డాలర్లు మా అందరి టికెట్లకే సరిపోయింది. మిగిలిన రెండొందలు స్టాల్ పెట్టటానికి. దీనితో మాకు ముందు వరుసలో కూర్చునే అవకాశం వచ్చింది. షో రాత్రి ఆరున్నరకు ప్రారంభమైంది. తెలుగు సంస్థకు చెందినజ్యోతి మంచి వాక్యాలను సమ కూర్చుకొని స్వాగతం చెప్పింది. అయితే ఎందుకో మాటలు తడ బడ్డాయి. ఆడిటోరియం బాగా ఉంది. సుమారు నాలుగు వందల మంది జనం వచ్చారు. టికెట్టు ఖరీదు పాతిక డాలర్లు. ఆడవాళ్ళందరూ సాంప్రదాయ దుస్తుల్లో చీర కట్టుకొని రావటం ముచ్చటగా ఉంది. ఇంతమంది తెలుగు వాళ్ళను ఒక్క వేదిక వద్ద చూడటం చాలా ఆనందంగా ఉంది.

ఈ సంగీత విభావరిని వీళ్ళు మ్యూజిక్ ధమాకా అన్నారు. మణిశర్మ ఆధ్వర్యంలో జరిగిన కార్యక్రమం ఇది. కుర్రవాళ్లైన లబ్ధ ప్రతిష్టులు ఎన్నో సంగీత పోటీలలో విజేతలు సుస్వరంతో అందర్నీ అలరించిన హేమచంద్ర, కారుణ్యలు అసలైన నాయకులని పించుకొన్నారు. ఎన్నో పోటీలలో, గెలుపు సాధించిన ఆడ పిల్లలు గీతా మాధురి, శ్రావణ భార్గవి, మాళవికలు తమ సత్తాను చాటారు. మణిశర్మ అంటే బీట్‌కు ప్రాధాన్యం అని అందరికి తెలిసిన విషయమే. మాధుర్యం కంటే హోరెత్తిన సంగీతంతో జనం కిక్కుకు లోనైనారు. అయితే పాడిన పాటన్నిటలో నాకు స్వర్గీయ వేటూరి సుందర రామమూర్తి కలకత్తా నగరంపైన రాసిన "యమహా నగరి కలకత్తా పురి" పాట చాలా నచ్చింది. అందులోని సంగీత స్వరానికి కాకపోయినా పాటలో కలకత్తా గొప్పతనాన్ని

వంగ దేశంలోని మహామహులను జ్ఞప్తికి తెచ్చిన సంగతి నాకు ఎంతో స్ఫూర్తిదాయకంగా ఉందనిపించింది. ఒకరకంగా చెప్పా లంటే కళ్ళు చెమర్చాయి. గుండె ఆనందంలో నిండి పోయింది. మిగిలినవన్నీ "ఆర్టు బీట్" కంటే "హార్ట్ బీట్"ను పెంచాయనే చెప్పవచ్చు. ఆ ఘోష భరించలేక చెవులకు రుమాలు అడ్డం పెట్టుకొన్నాను. గంటన్నర తరువాత విరామం. ఆర్టిస్టులందరూ స్టేజి వెనుక ఉన్నారని తెలిసి అక్కడికి వెళ్లి కలిశాం. మణి గారితో ఫోటోలు దిగాము. మిగిలిన ఆర్టిస్టులతో కూడా కలిసి ఫోటోలు తీసుకొన్నాము. వాళ్ళందరూ చాలా సహకరించి ఎంతో ఓపికతో ఫోటోలకు సిద్ధ పడ్డారు. స్టేజి మీద ఒక్క క్షణం కూడా తీరిక లేకుండా, ఆడి పాడి అభినయించిన వాళ్ళల్లో ఉత్సాహం ఉరకలు వేస్తూనే ఉంది. మణిశర్మతో "మీరు స్వర మణిశర్మ"గా కనిపిస్తున్నారు" అన్నాను. "థాంక్ యు సార్" అని షేక్ హాండ్ ఇచ్చాడు. "వరుడు" సినిమాలో మేమందరం ఉన్నామని సంగీతం బాగుందని అందులోని ఒక పాట పాడమని కోరాను. సరేనని అన్నాడు. విరామ సమయంలో తెలుగు సంస్థవాళ్ళు స్పాన్సర్లకు జ్ఞాపికలు అందజేశారు. అక్కడి స్టాల్‌లో ఉన్న "రెండు గారెలు – సాంబారు" పాకెట్‌ను మూడు డాలర్లు పెట్టి అందరం తలో పాకెట్ తిన్నాం.

మళ్ళీ విరామం తర్వాత సంగీత కార్యక్రమం ప్రారంభమయింది. గంటన్నర జరిగింది. వరుడు సినిమా పాటతో మొదలైంది. ఈ పాటకు కారుణ్యకు ఫిల్మ్ ఫేరు అవార్డు వచ్చిందని చెప్పి చక్కగా పాడాడు. చివరి వరుసలోని జనం బాలకృష్ణ పాటలు పాడమని గోలా, అరుపులు, కేకలు. కొంత ఇబ్బంది కల్గించాయి. ఆయనకు కొంచెం కోపం కూడా తెప్పించాయి. తాను సంగీత దర్శకత్వం చేసిన సినిమాలలోని పాటలే పాడించాడు. జానపద శైలిలో మధుప్రియ, హేమచంద్ర పాడిన పాట చాలా హైలైట్‌గా ఉంది. ఇక్కడొక విషయం చెప్పాలి. మా టి.వి.ప్రోగ్రాంలో "మధు ప్రియ" అనే అమ్మాయి జాన పదగీతాలను బాగా పాడి అందర్ని ఆకట్టుకొన్న విషయం అందరికి తెలిసిందే. ఈ స్టేజి మీద ఆ అమ్మాయి అమ్మ మీద, నాన్న మీద, పల్లెటూరి మీద పాడిన పాటలు అసలైన పాటలని పించి గుండెల్ని తట్టి ఆలోచింపజేశాయి. ఈ మొత్తం కార్యక్రమంలో వీటికే ఎక్కువ విలువ నిచ్చారు. శ్రోతలు చప్పట్లు మారుమోగించి అభినందనలు తెలిపారు. మిగిలిన పాటలకు పూర్తి సపోర్టు మాత్రం ఖచ్చితంగా రాలేదని చెప్పవచ్చు. పాపం గాయనీ గాయకులూ అడిగి చప్పట్లు కొట్టించుకోవాల్సి వచ్చిందంటే ప్రోగ్రాం ఎందుకో అందర్నీ అలరించ లేదేమోనని పించింది. గుండెల్ని పిండే పాటో, దేశ భక్తీ, దైవ భక్తీ ఉన్న పాటలో వుంటే, మనసును కరిగించే స్వరాలుంటే ఇంకా గుండెలు కరిగేవేమో అనిపించింది. అయితే బీటు వాడికానందం.

అయితే కారుణ్య, హేమ చంద్రలే ఈ విభావరికి నిజమైన విజేతలు. వారిలో

ఉన్న ఎనర్జీలన్నిటిని ఒడ్డేశారు. కాదు మణిశర్మ పిండేశాడు. ఆ బాణీలు అలాంటివి ఫాస్ట్ బీట్ ఉన్నవి. వారిద్దరూ పాడుతూ, నటిస్తూ ఎక్కడా సభ్యతకు ఏమాత్రం లోటు రానీయకుండా చేసిన ప్రయత్నానికి "హాట్స్ ఆఫ్". ఆడ పిల్లలు గీతామాధురి, శ్రావణ భార్గవి, మాళవికలు శక్తి యుక్తుల్ని ధార పోసి పాడారు. అడ పిల్లలు కదా షో చివర వాళ్ళను చూస్తే లేత తమల పాకుల్లా వాడిపోయినట్లు కనిపించారు పాపం. లాలిత్యాన్ని మాళవిక పోషిస్తే, గీతా మాధురి లాలిత్యం బీటులను సమం చేసి పాడితే, భార్గవి ఉషా ఊతప్‌లా కొంచెం మగ గొంతుకతో పాడి ఆకట్టుకొంది. అందరు తమలోని ఎనర్జీ లెవెల్స్‌ను ఖాళీ చేసుకొనే దాకా పాడి అందరికి అంటే ఆ బీటును ఆనందించే వారికి వినోదం కలిగించారు.

రాత్రి పదిన్నరకు షోను అకస్మాత్తుగా ముగించారనిపించింది. వెనక నుండి కేకలు, వాళ్ళు కావాలన్న పాటలు పాడక పోవటం ఇబ్బంది కలిగించి అలా చేశాడేమో మణిశర్మ అనుకొన్నారు. జనగణమనతో పూర్తి. మళ్ళీ మేమందరం మణి శర్మ, హేమచంద్ర, కారుణ్య, గీతా, శ్రావణ భార్గవి, మాళవిక, మధు ప్రియలతో ఫోటోలు తీసుకొన్నాము. అలసిపోయినా ఆ భావం కన పడకుండా వారంతా పోజులిచ్చి నవ్వు మొహాలతో అందరితో ఫోటోలు దిగారు. మేము స్పాన్సర్ కోటాలో వాళ్ళం కనుక మమ్మల నెవరు అడ్డగించలేదు. నేను మణిశర్మతో "మీ కుర్రాళ్ళ ఎనర్జీ లెవెల్స్ చాలా గొప్పవి. అంతా ఖర్చు పెట్టించారు మీరు. వారందరూ "మణులు, మీరు శర్మ" అన్నాను. నవ్వి సంతోషం తెలియజేశాడు. హేమచంద్ర స్టేజి రిహార్సల్సు దగ్గర్నుంచి అన్నీ చూశాడు. అతని కాంట్రిబ్యూషన్ విలువ కట్టలేనిది. అతనికి మూడు నాలుగు సినిమాలకు సంగీత దర్శకత్వం వహించిన అనుభవమూ ఉంది. ఈ క్రెడిట్ అంతా గాయకులకే ఎక్కువగా చెందుతుంది. శర్మ దర్శకుడైన, కష్టం, శ్రమా అంతా హేమచంద్ర, కారుణ్యలదే. సందేహం లేదు. అందుకే వారిద్దరికి షేక్ హాండ్ ఇచ్చినా ఆనందాన్ని వ్యక్తం చేసి మనసులో మాటను చెప్పాను. వారిద్దరి ముఖాలు కృతజ్ఞతా భావంతో వెలిగి పోయాయి.

కార్యక్రమం పూర్తి అవటానికి ముందు "చేతక్" అనే చిన్న కుర్రాడు చాలా జోష్‌గా మణిశర్మ స్వరపరచిన రెండు గీతాలను పాడి అందరి అభినందనాలు పొందాడు. ఆ చిరంజీవికి మంచి భవిష్యత్తు ఉందనిపించింది. విభావరిలో డ్రమ్ములు వాయించిన పొట్టి కుర్రాడు మహా విశ్రుంఖలంగా చెవులు చిల్లులు పడేట్లు, గుండెలదిరేట్లుగా క్షణం తీరిక లేకుండా వాయించి శర్మ అనుకొన్నది సాధించటానికి కారకుడయ్యాడు. మిగిలినవారు కూడా తగిన సహకారం ఇచ్చి విజయానికి కారకులైనారు.

సరిగమలు –మణిశర్మ ఎంతసేపు ప్రేక్షకులకు వీపు చూపిస్తూనే దర్శకత్వం

వహించాడని సన్నాయి నొక్కులు నొక్కు కొన్నారు–ఆయన స్వచ్ఛమైన మల్లెపువ్వులాంటి తెల్లబట్టలే వేసుకొన్నాడు కాని ఆ చొక్కాపై ఆ శిలువ గుర్తుల్లాంటిలేమిటి? అని బుగ్గలు కొరుక్కున్నారు కొందరు. అది బాపు తీసిన ఏదో సినిమాలో నూతన ప్రసాద్ "కొత్త దేవుడండీ" అనే పాటను పాడుతూ వేసుకొన్న డ్రెస్‌లా ఉందని, సినిమాలు బాగా చూసి, కాచి వడపోసిన ఒక పెద్దాయన నవ్వుతూనే అన్నాడు. ఎవరి డ్రెస్ వారిష్టం. ఇందులో మనకేమిటి ఇబ్బంది? అన్నాను.

పదనిసలు– బాలకృష్ణ పాటలే పాడాలని ఇబ్బంది పెట్టటమేమిటి అని కొందరు సణుక్కున్నారు. బాలికలు ముగ్గురు పాడిన పాటలు మణిశర్మ సినిమాలలో వారు పాడినవి కావు. అందుకే పాడటానికి ఇబ్బంది పడ్డారు. పాడాల్సినంత గొప్పగా ఆడ వాళ్ళు పాడలేక పోయారని ఒక సంగీతాభిమాని, మణిశర్మ గారి సంగీతాన్ని అధ్యయనం చేసిన ఆయన అన్నాడు. తెలుగు సంస్థ నిర్వహించిన కార్యక్రమం కదా! పాడిన పాటల్లో ఎక్కడా తెలుగు పదాలు కనిపించలేదే –సంగీతం అంతా పాశ్చాత్య పోకడలో ఉంది. శ్రావ్యత ఎక్కడ? మాధుర్యం ఏదీ? తెలుగుదనం ఏదీ? అని తెలుగును అభిమానించే ఒక అమెరికన్ తెలుగు పెద్దాయన గోడు వెళ్ళబోసు కొన్నాడు. ఇది కాల వైపరీత్యం అన్నాడు ఇంకో ఆయన. అందరికి ఒకే అభిప్రాయం ఉండాలని లేదు కదా. అయినా ఇంతమంది తెలుగువాళ్ళను ఒకచోట చేర్చినందుకు మనం అభినందించాలి అని మరో పెద్ద మనిషి పెద్ద మనసుతో సంతోషించాడు. ఇదీ–"మణిశర్మాయణం".

(6-8-12- కాంప్-అమెరిక)

## "ధమాకా– ధమ ధమ ధమ ధమాకా"

**పార్ధ సారథీయం**

అందరికి శ్రీ కృష్ణాష్టమి శుభాకాంక్షలు. పార్ధుడు అంటే అర్జునుడు. అతనికి సారధి శ్రీ కృష్ణుడు కనుక కృష్ణుడు పార్ధ సారధి అని పిలువబడుతున్నాడు. కృష్ణుడు చెప్పింది "పార్ధ సారధీయం" అదే భగవద్గీత. దాని సందేశాన్ని మా అమ్మాయి ఇంటి ప్రక్కన ఉంటున్న మారెళ్ళ గాయత్రి గారి తండ్రి గారు స్వర్గీయ మారెళ్ళ పార్ధ సారధిరావు గారు "గీతా సందేశం" పేర పుస్తకం రాసి ప్రచురించారు. ఆవిడ ఆ పుస్తకాన్ని ఈ మధ్యనే ఇచ్చింది. అందులోని విషయాలను సంక్షిప్తంగా "పార్ధ సారధీయం" అని ఆయన పేరు కూడా వచ్చేటట్లు "కృష్ణాష్టమి" సందర్భంగా అందిస్తున్నాను.

న్యూటన్ శాస్త్రజ్ఞుడు పదార్ధమును సృష్టించలేమని, నశింప జేయలేమని అన్నాడు. అది ఒక రూపం నుండి వేరొక రూపంలోకి మారుతుంది. అలాగే ఈ జన్మ పోయి ఇంకో జన్మ కూడా వస్తుంది ఐన్‌స్టీన్ సిద్ధాంతం ప్రకారం కూడా, విశ్వ పదార్ధ

మూలమైన పరమాణువులు విచ్ఛేదం చెంది, నిరాకారమైన శక్తి తరంగాలుగా మారుతాయి. వీటిని ఊహించటం, వర్ణించటం చేయలేమని అన్నాడు దీనినే ఆయన undefinable unified theory అన్నాడు. బౌద్ధ గురువు లాబ్ సాంగ్ రామ్పా -గ్రుడ్డు రూపంలో నుంచి గొంగళి పురుగుగా మారి సీతాకొక చిలుక ఏర్పడుతుంది. దానికి తాను గొంగళి పురుగు నుండి వచ్చినట్లు తెలియదు. అది ఒక దశ నుండి మరణంలాంటి స్థితినే పొంది, మరొక దశను పొందింది. మనం అది పొందే రూప విక్రియలన్నీ చూడ గలుగుతున్నాం. దీన్నిబట్టి ఆలోచిస్తే మన పునర్జన్మ సిద్ధాతం కూడా అలాంటిదే ననిపిస్తుంది అన్నారు. అందుకే భగవద్గీతలో భగవానుడు "శరీరాన్ని పంచభూతాలు ఏమైనా చేయగలవు. ఆత్మను మాత్రం ఏమీ చేయలేవు. శస్త్రాలు నిప్పు, గాలి శరీరాన్ని నాశనం చేయగలవు. కాని ఆత్మను నాశనం చేయలేవు. ఆత్మ నిత్యం. అంతటా వ్యాపించి ఉంటుంది. అది స్థిరం, అచలం, సనాతనం. బాహ్య భూత వికారాలేవీ దాన్నేమీ చేయలేవు.

ధర్మ పోరాటంలో జయాప జయాలు లాభనష్టాలు బేరీజు వేయరాదు. ధర్మమే లక్ష్యంగా కర్తవ్యాన్ని కొనసాగించాలి. క్షత్రియుడికి యుద్ధం చేయటం స్వధర్మం. కనుక మనకు నిర్దేశింపబడిన కార్యాలను తప్పక చేయాలి. కర్తవ్య దీక్షతో, అంకిత భావంతో చేయాలి. శక్తి యుక్తులన్నీ ధార పోసి చేయాలి అని కృష్ణుని బోధ. కర్మలు చేసేటప్పుడు ఫలితం ఆశించకుండా చేయాలి. భగవంతుని అర్పించే భావంతో చేయాలి అప్పుడు ఆ కర్మలు మనల్ని బంధించవు. అలాగని చెడ్డ పనులు చేసి వాటినీ భగవంతునికి అర్పణం అంటే బెడిసి కొడతాయి. దీనినే "కానందుడు" అంటే వివేకానంద స్వామి "Results will follow in course of time. one can not get results just as one pleases. one can not cancel them. escape from them, or mitigate them. Anxious expectations of results will only lead to restlessness and worry" అని స్పష్ట పరచాడు. పరమాత్మ అంటే సచ్చిదానంద స్వరూపుడు. సత్ అంటే -భూత, భవిష్యత్, వార్త మానాలలో ఎప్పుడు నిలకడగా నిలిచి ఉండేది. చిత్ అనగా -విజ్ఞాన సర్వస్వం (knoweldge). ఆనందం అంటే - అపరి మిత మైన సంతోషం (bliss). వీటి సమ్మేళనమే భగవంతుడు. ఆయన సర్వవ్యాపి, సర్వజ్ఞుడు, సర్వ శక్తిమంతుడు, ఆనంద మయుడు అని వీటి భావం. ఆయన ఒక శక్తి స్వరూపం. జీవుడు ఆ పరమాత్మ తత్వానికి ప్రతిబింబం. ఆత్మ అనేది పరమాత్మ యొక్క వెలుగు. ఆత్మ తత్త్వం, మళ్ళీ ఆ పరమాత్మ తత్వాన్ని పొందటమే. ప్రతి జీవి తన అంతరాంతరాల్లో తాను కోరుకొనేది- ఎల్లప్పుడు ఉండాలని (సత్), తాను అన్నీ తెలుసుకోవాలని (చిత్), తాను ఎప్పుడూ సంతోషంగా ఉండాలని (ఆనందం) కోరుకొంటునే ఉంటాడు. ఈ

సచ్చిదానంద స్వరూపం కావాలని, తిరిగి పరమాత్మలో ఐక్యం అవ్వాలని చేసే ప్రయత్నమే జీవిత గమ్యం. ఈ జీవిత యానంలో చేసే మంచి, చెడు కార్యాలు వాసనలు (tendencies) ఏర్పడి, ఆ పాప పుణ్యాలను అనుభవించటానికి మరో శరీరాన్ని ధరిస్తున్నాడు. ఈ బంధాలన్నీ విడి పోతే, జన్మ రాహిత్యాన్ని పొంది, మోక్షాన్ని పొందుతాడు. ఇక్కడే భారతీయ తత్వవేత్తలు మూడు సిద్ధాంతాలను ప్రతి పాదించారు. ఆది శంకరులది – అద్వైత సిద్ధాంతం–పరమాత్మ యొక్క మాయయే ఈ జగత్తు. మానవులు అజ్ఞానం వల్ల పరమాత్మ తత్వాన్ని కోల్పోయి మానవుడు అని భ్రమలో ఉంటాడు. ఆ అజ్ఞానం తొలగితే, మానవుడే మాధవుడవుతాడని దీని భావం. రామానుజా చార్యుల వారిది విశిష్టాద్వైతం–పరమాత్మ తేజో మయుడు అయితే, ఆయన వెలుగు మానవులు. ఆయన అగ్నిజ్వాల అయితే, మానవులు అగ్ని కణాలు. వైరాగ్యం ద్వారా మానవుడు మళ్ళీ పరమాత్మను చేరుతున్నాడు. ఇదీ వీరి పద్ధతి. మూడోది మధ్వాచార్యుల వారి ద్వైత సిద్ధాంతం – భగవంతుడు వేరు, ఆయనకు అత్యంత ప్రియభక్తుడైన మానవుడు వేరు. మానవుడు భక్తి ద్వారా, భగ వంతుని సన్నిధానానికి చేరి, పరమశాంతిని పొందుతాడని ఈ సిద్ధాంతం ఈ మూడు వేరుగా కనిపిస్తున్నా అది నిజం కాదు. ప్రాథమిక దశలో ద్వైతాన్ని అనుసరించి భక్తుడు అవుతాడు. తర్వాత విశిష్టాద్వైతం ద్వారా ధ్యాన పద్ధతిలో దగ్గరై, అద్వైత విధానంలో జ్ఞానాన్ని పొంది ముక్తుడవుతాడు. ఇలా భావిస్తే ఏమీ విరోధం లేదు. మహానుభావులు మనకోసం సోపాన పంక్తుల్ని నిర్మించారు. ఆ మెట్లు ఎక్కి మనం చేరాల్సిన చోటికి చేరాలి.

పరమాత్మ గంభీర సముద్రం వలే ప్రశాంతికి ప్రతీక. సముద్రంలో పుట్టే, కెరటాలలాగా ఆత్మలు జీవితాన్ని ధరించి ,తిరిగి సముద్రంలో కలిసిపోతు ఉంటాయి. కెరటంపైకి లేస్తే జీవితంగా కనిపిస్తుంది. అది సముద్రంలో కలిసి తన అస్తిత్వాన్ని కోల్పోయి లయం అవుతున్నప్పుడు మరణంగా భావించాలి. కెరటం అసలు స్వరూపం ప్రశాంత గంభీర సముద్రమే. అందుకే మహర్షులందరు తమ మేధస్సులో వేద వాక్యాలను విని రుక్కులుగా సాక్షాత్కరింప జేశారు. వారు చెప్పిందేమిటి? “మీరు అమృత పుత్రులు. ఆనంద స్వరూపులు. అంధకారానికి అవతల ఉన్న భ్రాంతికి అతీతుడైన, సనాతనుడైన, భగవంతుని మేమందరం దర్శించాం. ఆ భగ వంతుని తెలుసుకొంటేనే బాధలు, భ్రమలు అన్నీ తొలగిపోతాయి” అని విస్పష్టంగా మార్గ దర్శనం చేశారు.

యోగ నిష్ఠతో కర్తవ్యాన్ని నిర్వర్తించాలి. కర్మలలో సహజత్వాన్ని లేకుండా ఉండాలి (నాన్ అటాచ్ మెంట్). ఫలితం లభించినా, లభించకయినా సమ బుద్ధి కలిగి ఉండాలి (equanimity) కలిగి ఉండాలి. దీనినే మహేష్ యోగి ఇంకో రకంగా వివరించారు. సమస్యను పరిష్కరించటానికి ఆ సమస్యకు దూరంగా, అతీతంగా ఉండి,

ఆలోచించితే పరిష్కారం తేలిగ్గా లభిస్తుంది. ఒక విల్లుతో బాణాన్ని సంధించినప్పుడు, వింటిని వెనక్కి లాగి బాణం వదులు తాము. అప్పుడది వేగంగా లక్ష్యం వైపుకు దూసుకు వెడుతుంది. ఈ వెనక్కు లాగటం అనేది సమస్యల వలయం నుండి దూరంగా వెళ్లటం లాంటిది (withdrawn from the field of activity). యోగం అంటే కర్మలను ఆచరించేటప్పుడు చూపించే కౌశలం, సంపూర్ణ జ్ఞానమే. అప్పుడే దక్షత (efficiency) వస్తుంది. జడస్తితిలో ఉన్న మనిషికి, యే ఆశయమూలేని వ్యక్తికీ కోరికలు ఉండకపోవచ్చు. ఆత్మానందం పొందిన వాడిలో కోరికలు, దుఖాలు దగ్గరకు చేరవు. ఆ స్థితిలో తన విద్యుక్త ధర్మాన్ని అనాసక్తితో నేరర్చటమే స్తిత ప్రజ్నుని లక్షణం. అతడు ప్రపంచంలోని పాప కార్యాలను ప్రోత్సహించడు. వాటివల్ల చలించడు. ఇదీ "పార్ధ సారధీయం" అనే గీతా సందేశం.

(09-08-12 .కాంప్-అమెరికా)

## ఓపెన్ హీమెర్

అవి రెండవ ప్రపంచ యుద్ధం భీకరంగా జరుగుతున్న రోజులు. జెర్మనీని సమర్ధించే దేశాలొక వైపు, అమెరికా బ్రిటన్లను సమర్ధించే దేశాలొక వైపు మోహరించి భీషణ పోరాటం చేస్తున్నాయి. జర్మని నియంత అడాల్ఫ్ హిట్లర్ జాతి దురహంకారంతో పెచ్చు మీరిపోతున్నాడు. యూదులందర్నీ ఊచకోత కోయిస్తున్నాడు. జ్యూ శాస్త్రవేత్తలను దేశం విడిచి పంపిస్తున్నాడు. మహా మేధావి అయిన్‌స్టీన్ శాస్త్రవేత్త అమెరికా ప్రభుత్వ ఆహ్వానం మేరకు ప్రిన్స్ టన్ యూనివేర్సిటిలో ప్రొఫెసర్‌గా పని చేస్తున్నాడు. ఏమైనా సరే అమెరికాను ఓడించి తన ఆదిపత్యాన్ని నిలుపుకోవటానికి హిట్లర్ శతధా సహస్రధా ప్రయత్నిస్తున్నాడు. సర్వ వినాశం చేసే బాంబును కనిపెట్టమని జర్మని శాస్త్రవేత్త లను ఆదేశించాడు. వారంతా తీవ్ర ప్రయత్నాలలో ఉన్నారు. తాను కనిపెట్టిన ద్రవ్య రాశి శక్తికి సంబంధించిన సూత్రం మంచికి, చెడుకూ కూడా పని చేయవచ్చు అని ఆందోళన చెందుతున్నాడు ఐన్స్టీన్. అప్పటి అమెరికా ప్రెసిడెంట్ రూజ్వేల్టుకు ఉత్తరం రాస్తూ జెర్మని అణుబాంబు తయారుచేసే ఆలోచనలో ఉన్నట్లు తనకు సమాచారం అందినదని, హిట్లర్ చేతిలో ఆ బాంబు ఉంటే సర్వ ప్రపంచ వినాశనం జరుగుతుందని వివరించాడు. అందువల్ల యురేనియంను జర్మనీకి దక్కకుండా చేసే జాగ్రత్తలను తీసుకోమని హెచ్చరించాడు. కాని హిట్లర్ దాన్ని సంపాదించి నిలవ చేసుకొని ఆటం బాంబు కోసం కలలు కంటున్నాడు.

అమెరికాలో ప్రెసిడెంట్ అయిన్ స్టీన్ ఉత్తరాన్ని చదివి వెంటనే కార్యాచరణలోకి దిగాడు. యుద్ధ అధికారులతో సమావేశమై అతి త్వరలో ఆటం బాంబును తయారు చేయమని ఆదేశించాడు. 1942లో కల్నల్ లెస్లీ గ్రోవేస్ దీనికి పూనుకొన్నాడు. కాని

ఆయనకు న్యూక్లియర్ ఫిజిక్స్ పెద్దగా తెలియదు. కాని దాన్ని తయారు చేయాల్సిందే. అదీ అత్యంత రహస్యంగా. దానికోసం యుద్ధ నిపుణులు శాస్త్రవేత్తలు, అందరి సహకారం కావాలి. అప్పుడు ఆయన దృష్టిలోకి ప్రఖ్యాత శాస్త్రవేత్త ఒపెన్ హీమేర్ పడ్డాడు. ఆయన్ను పిలిపించి మాట్లాడాడు. ఈయన కూడా జ్యూ శాస్త్రవేత్తయే. అందరితోబాటు ఈయనకూ జెర్మని కంటే అమెరికా ముందే ఆటం బాంబు తయారు చేయాలి అనే అభిప్రాయం వుంది. సరే నన్నాడు. దానికి సరైన ప్రదేశంగా న్యూ మెక్సికోలోని "లాస్ ఆల్మోస్"ను ఎన్ను కొన్నారు. ఒపెంహీమేర్ తనకు సలహా దారు మాత్రమేనని గ్రోవర్ ప్రకటించాడు. ఈ ఆటం బాంబు ప్రాజెక్టను 1942లో ప్రారంభించి the Man hattan projectగా పేరు పెట్టారు. అప్పటికే ఒపెంహీమేర్ ఫిలిప్స్ అనే మరో శాస్త్రవేత్తతో కలిసి transmutation function of deutrons అనే పేపర్‌ను మూడేళ్ళ క్రితమే ప్రకటించాడు. ఇది న్యూక్లియర్ ఫిజిక్స్‌లో కొత్త ద్వారాలను తెరిచింది. దాంతోపాటు ఒపెంహీమేర్ ఒక్కడే continued gravitational attraction అనే పేపర్‌ను విడిగా సబ్మిట్ చేసి ఇరవయ్యవ శతాబ్దపు గొప్ప పేపర్లలో ఒకటిగా ప్రసిద్ధి చెంది ఉన్నాడు.

ఈ అనుభవం ఒపెంహీమేర్‌కు బాగా కలిసి వచ్చింది. లాస్ ఆల్మోనాస్ చాలా సుదూరంగా ఎవరికి అందుబాటులేని స్థలంగా ఉంది కనుక రహస్య ప్రయోగాలకు అనువైన ప్రదేశం అని భావిచాడు. అతను ప్రయోగాత్మక శాస్త్రవేత్త. కనుక ఆయనకు సహాయంగా వందలాది ప్లంబర్లు శాస్త్రవేత్తలు అవసరం. అందుకని యూరప్‌లోను, ఇతర దేశాలలోను అమెరికాలోను ఉన్న శాస్త్ర వేత్తలందరికి కబురు వెళ్ళింది. అందరు అంగీకరించి వచ్చారు. యుద్ధ నిపుణులు శాస్త్రవేత్తలు, ప్రయోగం నిర్వహించే వారు టెక్నీషియన్లు, ఇజినీర్లు అంతా కలిస్తే 3000 మంది అయారు. వీరినందర్నీ కలిపి ఉంచి అందరి మధ్య సహకారం పొంది బాంబును తయారు చేయాలి. మానవ నాగరకత కోసం పని చేస్తున్నామనే అభిప్రాయాన్ని వారందరిలో కలిగించాడు బర్ట్ ఒపెంహీమేర్ ఆ సంస్థకు డైరెక్టర్ అయాడు. విషయాలనన్నిటిని తన బుర్రలోనే దాచుకొని పని చేయించాలి. ఎక్కడ లీకు అయినా ప్రమాదమే. ఎన్రికో ఫెర్మి శాస్త్రవేత్త కూడా వచ్చి చేరి సహకరించాడు. ఇంత చేస్తున్నా రష్యా గూఢాచారి సంస్థ కొంత ఇబ్బంది కలిగించింది. దాన్ని అదిగమించారు. ఆయనకు సెక్యూరిటి కూడా ఇబ్బందికరమే అయింది.

1944 నీల్స్ బోర్ శాస్త్రవేత్త ఈ ప్రాజెక్టుకు వచ్చి, జరుగుతున్న పరిశోధనా వివరాలను తెలుసుకొని సంతృప్తి చెందాడు. ఆయన ఫిజిక్స్‌లో "క్వాంటం" విప్లవాన్ని తెచ్చిన శాస్త్రవేత్త. అయితే అనవసరంగా న్యూక్లియర్ వెపన్స్‌ను తయారు చేస్తే అది

మళ్ళీ యుద్ధానికి దారి తీస్తుంది అని భావించాడాయన. అందుకని ప్రపంచ దేశాల శాస్త్రవేత్తలందరూ కలిసి ఆలోచించాలి అని తన అభి ప్రాయం చెప్పాడు కూడా. ఈ భావాలకు ఒపెంహీమేర్ కొంత బాధపడ్డాడు. రెండో దశ ప్రారంభమైంది. జర్మని ఆటం బాంబు చేయటంలో విఫలమైందని తెలిసిపోయింది. అది లేకపోతే జర్మని గెలవదు అని అందరు నిశ్చయానికి వచ్చారు. బాంబు తయారు చేయటమా మానటమా అని సందేహం కల్గింది. కాని ఒపెంహీమేర్ పని ఆపటానికి వీలులేదని, కోనసాగించాలని చెప్పాడు. ఎలాగో జర్మని ఓడిపోతుంది కనుక బాంబును జెర్మని మీద ప్రయోగించరు అనే అభిప్రాయానికి కొందరు వచ్చారు. వీరితో ఈయన ఏకీభవించ లేదు ఒపెంహీమేర్. దీనికి కొందరు అంగీకారం తెలుపలేదు. అప్పటికే యుద్ధం ముగిసి జెర్మని ఓడిపోయింది.

1945 juneలో చికాగో వర్సిటికి చెందిన కొందరు శాస్త్రవేత్తలు అమెరికా బాంబు తయారు చేసినా మొదటిసారిగా ఎవరి మీదా ప్రయోగించరాదు అని ఒక యుద్ధం కోసం ఉపయోగిస్తే విశ్వ వినాశనమే జరుగుతుందని, ఇప్పటి దాకా అమెరికాకు ఉన్న ప్రజా బలం క్షీణిస్తుందని, న్యూక్లియర్ ఆయుధాల పోటీ తీవ్ర మావుతుందని, భవిష్యత్తు అంధకారం అవుతుందని హెచ్చరికగా ఒక మెమొరాండం సమర్పించారు. ఒపెంహీమేర్ కూడా ఆలోచనలో పడ్డాడు. అందుకని జెర్మని మీద కాకుండా జపాన్ నగరం మీద ఆటం బాంబు వేయాలి అని సైన్యానికి సలహానిచ్చాడు. వారూ అంగీకరించారు. 1945 july 16న మొదటి ఆటం బాంబును ప్రయోగాత్మకంగా న్యూ మెక్సికోలోని అలమో గారి దగ్గర ప్రయోగించారు. ఒపెంహీమేర్ స్వయంగా అక్కడే ఉండి ప్రత్యక్షంగా చూస్తూ పర్యవేక్షించాడు. అద్భుతంగా పని చేసి అనుకొన్న లక్ష్యం నెర వేరింది. అందరు ఆనందంలో మునిగి పోయారు. దీని ఫలితాన్ని చూసి ఒపెంహీమేర్ "ఇక నుంచి ప్రపంచం ఇప్పటి లాగా ఉండదు. నాకు భగవద్గీతలో "నేను ఇప్పుడు మృత్యువును. ప్రపంచాలను వినాశనం చేస్తాను" అని చెప్పబడిన వాక్యాలు గుర్తుకొస్తున్నాయి" అన్నాడు. మిగిలిన వారంతా నిశ్శబ్దంగా విన్నారట. 1945 August 6న అమెరికన్ మిలిటరి మొదటి ఆటం బాంబును జపాన్‌లోని హీరో షీమా పట్టణంపై ప్రయోగించింది. అక్కడే జపాను దేశపు డిఫెన్సు స్థావరం ఉంది. కాని జపాను లొంగిపోలేదు. రెండో ఆటామిక్ బాంబును జపానులోని నాగసాకి పట్నంపై మూడు రోజుల తర్వాత అమెరికా వేసింది. ఇక్కడే జపానుకు చెందిన యుద్ధసన్నద్ధ స్థావరం ఉంది. మొత్తం మీద రెండు బాంబుల వల్ల రెండున్నర లక్షల మంది చనిపోయారు. ఇంకో యాభై వేల మంది అణు దూళికి బలి అయారు. సెప్టెంబర్ రెండున జపాను లొంగిపోయింది. ఇలా జెర్మని ప్రపంచ వినాశనాన్ని కొని తెచ్చింది.

1945 అక్టోబర్‌లో ఒపెంహీమేర్ 500 మంది శాస్త్రవేత్తలను సమావేశ

పరచి ఈ ప్రాజెక్ట్ డైరెక్టర్‌గా తనకు అదే చివరి రోజు అని చెప్పాడు. శాస్త్రవేత్తలందరూ అంకిత భావంతో కృషి చేసి సహకరించినందుకు కృతజ్ఞతలను చెప్పుకొన్నాడు. వారి పని తీరుకు గర్వపడుతున్నానని చెప్పాడు. కొంత కాలం తర్వాత లాస్ అల్మోనాస్ అ మరియు హిరోషీమాలను మానవ జాతి శపిస్తుంది అన్నాడు. ఈ ప్రాజెక్ట్ పని అవగానే, కాలిఫోర్నియాకు వెళ్లి, మళ్ళీ పాత జీవితం ప్రారంభించాడు. 1947లో institute for advaanced study in pricetonకు డైరెక్టర్ అయాడు. అక్కడే అయిన స్టీన్ శాస్త్రవేత్త 14 సంవత్సరాల నుండి ఉన్నాడు. ఒపెంహీమేర్ ఈ విశ్వవిద్యాలయాన్ని శాస్త్రవేత్తలు, సాంఘిక శాస్త్రజ్ఞులు హూమనిష్టులు అందరు కలిసి పని చేసే కేంద్రంగా తయారు చేయాలని భావించాడు. 1946లో అమెరికా atomic energy commission అనే పౌర సంస్థను దానికి general advisory committeeను ఏర్పరచి ఒపెంహీమేర్‌ను దానికి చైర్మన్‌ను చేసి గౌరవించింది. ఒపెంహీమేర్ సృష్టించిన ఆటం బాంబు "న్యూక్లియర్ ఫిషన్" ఆధారంగా నిర్మించ బడింది. ఆ తర్వాత "సూపర్" అనే బాంబు తయారయింది. అదే హైడ్రోజెన్ బాంబు. దీనిలో "న్యూక్లియర్ ఫ్యూజన్" సూత్రాన్ని ఉపయోగిచారు. దీనిపై ఒపెంహీమేర్ స్పందిస్తూ హైడ్రోజెన్ బాంబు నిర్మించటం తగని పని అన్నాడు. ఇది మానవాళికి మహోపద్రవాన్ని తెస్తున్నన్నాడు. ఆనాటి అమెరికన్ అధ్యక్షుడు హారీ ట్రూమన్ దీన్ని పట్టించు కోకుండా ఆటం బాంబుతో పాటు హైడ్రోజెన్ బాంబునూ A,E.C. తయారు చేయాల్సిందే అని ఈ సంస్థకు విస్పష్టంగా తెలియజేశాడు. రష్యా తయారు చేస్తుందనే భయం కూడా ఉంది. అప్పుడు ప్రపంచం అంతా ద్విధ్రువ దేశాల మధ్య చీలిపోయాయి.

హంగేరి శాస్తవేత్త ఎడ్వార్డ్ టేల్లార్ సూపర్ అనబడే హైడ్రోజెన్ బాంబుకు రూప కల్పన చేశాడు. దాన్ని ఉత్తర ఫసిఫిక్ సముద్రంలో1952 November 1న ప్రయోగించారు. 1952లో అయిసన్ హోవర్ అమెరికా అధ్యక్షుడైనాడు. ఒపెంహీమేర్ మీద కమ్యూనిస్ట్ అభిమాని అని హైడ్రోజెన్ బాంబు అమెరికా తయారు చేయకుండా అడ్డగించాడని ఆరోపణలు వచ్చాయి అప్పుడు మేకార్ధీఅనే రిపబ్లికన్ పార్టీ సెనేటర్ కమ్యూనిస్టులపై విరుచుకు పడేవాడు. అతని విధానాలు క్రూరంగా ఉండేవి. వాటిని మేకార్ధీ చర్యలని సభ్య సమాజం ఈసడించుకొంది. ఆ తర్వాత ఒపెంహీమేర్ మీద అభియోగం రుజువు కాలేదు. చివరికి మేకార్ధీని సెనేట్ అభిశంసించింది. అయితే ఒపెంహీమేర్ ఇంక ఏ ప్రభుత్వ పదవులు నిర్వహించరాదనీ తీర్మానించింది. 1963లో లిండన్ జాన్సన్ ప్రెసిడెంట్ అయినప్పుడు ఒపెంహీమేర్‌కు అటామిక్ ఎనర్జీ యొక్క అత్యున్నత పురస్కారాన్ని తన చేతుల మీదుగా అందజేశాడు. జీవితపు చివరి రోజుల్లో ఒపెంహీమేర్ ప్రపంచశాంతి కోసం కృషి చేశాడు. మళ్ళీ institute of advanced

studyకి దాని పాలక వర్గం ఒపెంహీమేర్‌ను డైరెక్టర్ చేసి గౌరవించింది.

రాబర్ట్ ఒపెంహీమేర్ 1904 april 22న ధనవంతులైన యూదు కుటుంబంలో జన్మించాడు. జెర్మనిలో చదివాడు. హార్వర్డ్ విశ్వ విద్యాలయంలో పై చదువులు పూర్తి చేశాడు. బెర్కిలీలో experimental physicist అయాడు. 1938లో న్యూట్రాన్ స్టార్స్ మీద ప్రయోగాలు చేశాడు. న్యూట్రాన్ స్టార్ అంటే –చాలా సాంద్రత ఉన్ననక్షత్రం సూపర్ నోవాలో కూలి పోయేది. దీనికి కారణం gravitational collapse. మిగిలిన విషయాలన్నీ పైన చెప్పుకోన్నవే. ఒపెంహీమేర్ ముఖ చిత్రంతో time mgazine 1948 november 8 సంచికను ప్రచురించి ఒపెంహీమేర్‌కు అతున్నత స్థానాన్ని, గౌరవాన్ని కల్పించింది. అణు బాంబు పిత ”(ఫాదర్ ఆఫ్ అటామిక్ బాంబ్) అయిన ఒపెంహీమేర్ 1967 ఫిబ్రవరి పద్దెనిమిదిన మరణించాడు. ఆయన ఎప్పుడు ఒక మాట చెబుతూండేవాడు “science is not answer for every thing. But science very beautiful”.

(9-8-12-కాంప్-అమెరికా)

## భగవాన్ శ్రీ కృష్ణఉవాచ

ఇవాళ కూడా అష్టమి తిధి ఉంది–శ్రీ కృష్ణాష్టమిగానే భావిస్తారు. కనుక శ్రీ కృష్ణుడిని తలచుకొంటూ భగవద్గీతలో ఆయన చెప్పిన మాటలను “భగవాన్ శ్రీ కృష్ణ ఉవాచ” ద్వారా తెలుసు కొందాం–

“యద్భావం తద్భవతి” మనం ఎలా కోరుకొంటే అలా జరుగుతుంది. ఇదే positive attitude అంటే. దీన్ని అలవరచుకొని పనులను కౌశల్యంతో నైపుణ్యంగా శక్తివంచన లేకుండా ఫలా పేక్ష రహితంగా చేయాలి. తాను అవతార పురుషుడిని అని ధర్మానికి హాని కల్గినప్పుడు అవతరించి అధర్మాన్ని నాశనం చేసి, ధర్మాన్ని ప్రతిష్టిస్తానని చెప్పాడు. ఈ పనిని నేను చేయటం లేదు. కర్మేంద్రియాలు సహజ సిద్ధంగా వాటి పని అవి చేసుకొని పోతున్నాయి. అందులో నా ప్రమేయం లేదు అనుకోవటమే “కర్మ సన్యాసం”. కర్మయోగం అనుసరించకుండా, కర్మ సన్యాసయోగం ఆచరింప లేరు. మరి కర్మను త్యజించటం అంటే? ఎవడు ఎవరినీ ద్వేషించడో, దేన్నీ కోరుకోడో అలాంటి కర్మయోగి నిత్య సన్యాసిగానే భావింప బడుతాడు. సకల ప్రాణుల్లో ఆత్మ స్వరూపులుగా భగవంతుడే ఉన్నాడని భావించే వాడికి కర్మలు బంధనాలు కావు. సత్కర్మలను నిష్కామ బుద్ధితో చేస్తే లోక కల్యాణం జరుగుతుంది. వ్యక్తి అభ్యున్నతి వల్ల సమాజంలో సచ్ఛీలురైన జనం తయారవుతారు. అప్పుడు సమాజం ధర్మ బద్ధంగా ఉండి, లోక కళ్యాణ కారక మవుతుంది. వ్యక్తి వికాసమే అభ్యుదయానికి మూలం.

కోర్కెలు గుర్రాల వంటివి. అవి యధేచ్ఛగా అటూ ఇటూ పరిగెత్తుతూ ఉంటాయి. వాటిని కళ్ళెం అనే మనసుతో బుద్ధి అనే ఆశ్వారూధుడు బంధించి జాగ్రత్తగా నడపాలి. బుద్ధిచేత మనసును నిగ్రహించుకొని కోర్కెలను అదుపులో ఉంచుకోవాలి. ధ్యానం వల్ల మనో నిగ్రహం లభిస్తుంది. దానిద్వారా ఇంద్రియ నిగ్రహం లభిస్తుంది. అప్పుడు మనస్సు ప్రశాంతి పొంది , ఆత్మోన్నతి కలుగుతుంది. చేసే సాధన ఎప్పుడూ వృధా కాదు. దాని ఫలితం తప్పక లభిస్తుంది. ఈ జగత్తు అంతా దారంతో కూర్చ బడిన మణులులాగా పరమాత్మ ధరించాడు. నీటిలోని రసం, చంద్రునిలోని కాంతి, నాలుగు వేదాలలోని ఓంకారం, ఆకాశంలోని శబ్దం, పురుషులలో పురుషత్వం అన్నీ ఆయనే. భూమిలోని గంధం (substance) జలంలోని రసం (fluid), అగ్నిలోని తేజస్సు (heat and light), వాయువులోని ప్రాణ వాయువు (oxygen), ఆకాశంలోని శబ్దం (sound), పురుషునిలోని పురుషత్వం (manliness), తపోధనులలోని తపశ్శక్తి అంత తానేనని చెప్పాడు. "ప్రయాణకాలే ఆపి చ మం తె విదుర్యుక్త చేతసః"– ఎవరు మరణ కాలంలో కూడా భగవంతుని ధ్యానిస్తారో వారు ఆయన సన్నిదానానికే చేరుతారు. మరణకాలంలో పుట్టే భావాలే మరో జన్మకు కారణ భూతాలవుతాయి. జడ భరతుడు అనే ముని తపోనిష్ఠలో ఉంది కూడా, తాను ప్రేమించి, పెంచిన జింక మీద మరణ సమయంలో కూడా దానినే ఆలోచిస్తూ ప్రాణాలు విడిచాడు. మళ్ళీ జన్మలో జింకగా పుట్టి, జన్మ బంధం నుండి విముక్తి పొంది, ఆ తర్వాత జన్మలో ఉత్తమ గతిని పొందుతాడని చెప్పాయి .

భక్తులు నాలుగు రకాలు. ఆర్తుడు అంటే కష్టాల్లో ఉన్నవాడు. అర్థార్థి అంటే ధనం, సుఖం వంటివి కోరుకొనేవాడు. జిజ్ఞాసి అనగా తత్వ రహస్యాలను తెలుసుకోవాలి అనుకునేవాడు. నాల్గవవాడు– జ్ఞాని అంటే– పరమాత్మ తత్వాన్ని పూర్తిగా తెలుసు కొన్నవాడు. బ్రహ్మం అంటే వినాశ రహితమైనది. ఆధ్యాత్మం అంటే చేతనంకల జీవాత్మ. కర్మ అంటే త్యాగంతో చేసే పని. అధి భూతం అంటే నశించే పదార్థం. అధి దైవం అంటే విరాట్పురుషుడు. అధి యజ్ఞం అంటే –దేహంలోని పరమాత్మ. మరణ కాలంలో స్పృహ ఉంటుందో లేదో, భాగవంతున్ని స్మరించగలమో లేదో –కనుక జీవించినంత కాలం భగవంతున్ని స్మరిస్తూనే ఉండాలి. తన భక్తులెవరూ దుర్గతి చెందరు అని శ్రీ కృష్ణుడు చెప్పాడు. చెడ్డ వారైనా, మనసు పరివర్తనతో తనను శ్రద్ధాసక్తులతో సేవిస్తే తప్పక సద్గతిని పొందుతారని అభయమిచ్చాడు.

ఒకసారి గోపికలతో రాధ యమునా నదీ తీరాన కూర్చుని ఉంది. ఆమె మనసంతా శ్రీ కృష్ణ ధ్యాన మగ్నమై ఉంది. నారద మహర్షి అక్కడికి వచ్చాడు. ఆయన తన వీణ అయిన మహతిపై భగవన్నామం పలికిస్తున్నాడు. రాధను చూసి "అమ్మా!

కృష్ణుడు లేదని బాధ పడుతున్నావా?" అని అడిగాడు. అప్పుడు రాధ "కృష్ణుడు నా హృదయంలోనే ఉన్నాడు కదా ఆయన లేనిది ఎక్కడ? ఆయన లేదని బాధపడితే, నా హృదయంలోని దేవుడికి ఆ బాధ కలిగించినట్లే కదా?" అన్నది. నారదుడు రాధలోని అనన్య భక్తికి పొంగిపోయాడు. రాధ తన హృదయ దేవాలయంలో శ్రీ కృష్ణ పరమాత్మను ప్రతిష్టించి, అనుక్షణం ధ్యానిస్తూ తపోసిద్ధి పొందిన ధన్యురాలు. అదీ నిరంతర ధ్యానం అంటే. కుచేలుడు శ్రీ కృష్ణుని స్నేహితుడు, ఆయన దరిద్రంతో బాధ పడుతూ భార్య మాట మీద ద్వారకకు వెళ్లి పిడికెడు అటుకులు సమర్పిస్తే అష్టైశ్వర్యాలు స్నేహితునికిచ్చిన మహాత్ముడు కృష్ణుడు. అంతే కాదు తన అష్ట భార్యలతో కలిసి కుచేలునికి సపర్యలుచేసి, తాను పడుకొనే మంచం మీద ఆయన్ను పడుకోబెట్టి, కాళ్ళను ఒత్తిన కారుణ్య మూర్తి. స్నేహానికి నిలువెత్తు అద్దంగా భాసించాడు. గురువు సాందీపుని పుత్రుడు మరణిస్తే వెదికి అతన్ని పునర్జీవితున్ని చేసి తీసుకొని గురువుకు అప్పగించి గురుదక్షిణ సమర్పించిన ఉత్తమ శిష్యుడు. తనను నమ్మిన గోప గోపికలకు సమస్తమూ తానే అయి కాచి కాపాడిన రక్షకుడు. చెలికాడు. అధర్మపరుడైన మేనమామ కంసుడిని సంహరించి ధర్మాన్ని రక్షించినవాడు. సంపూర్ణ విశ్వాసంతో ఆయనను ధ్యానించిన వారి యోగక్షేమాలను ఆయనే చూసుకొంటాడు. ఈ విశ్వంలో ఎక్కడెక్కడ గొప్పతనం ఉంటుందో అదంతా ఆయన విభూతియే. అర్జునుడికి తన విశ్వరూపాన్ని చూపించి విభ్రాంతికి గురి చేశాడు. దాన్ని ఉపసంహరించి అతని భ్రాంతిని తొలగించాడు. చరాచర ప్రపంచం అంతా పరమేశ్వరుని లీలావినోదమే నని గ్రహించాలి.

సత్యాన్వేషణతో జీవించటమే, ప్రేమ, కలిగి ఉండటమే భక్తినే ప్రమిద చేసి, ఆర్తిని నెయ్యిగా మనస్సునే వత్తిగా, అజ్ఞానం అనే చీకటిని పోగిడితే, పరా భక్తీ అనే ఉజ్వల దీపాన్ని వెలిగించి భగవంతునికి మన హృదయాన్ని సమర్పణ చేయాలి. ఇదీ భక్తిలోని పరమార్ధం. జీవుడు పరమాత్మ అంశ, పరమాణువు, కాంతి పుంజం. "తత్వమసి" అంటే నువ్వే నేను అనే భావంతో పరమాత్మను చేరాలి. ప్రకృతే తల్లి. పరమాత్మ తండ్రి. త్రిగుణాలను దాటి పరమాత్మను చేరవచ్చు. సంసారం అనే తిరుగబడిన అశ్వత్థ వృక్షానికి మూలము పరమాత్మ. కొమ్మలు కోరికలు. చిగుళ్ళు మొదలైనవి ఫలితాలు. వివేకం, వైరాగ్యం అనే ఖడ్గంతో సంసార బంధనాన్ని చేదించి, కోర్కెల నుండి విముక్తి పొంది ఆత్మతత్వంతో స్థిరపడాలి ఈ వైరాగ్యమే మోక్షం. మంచి గుణాలు కలిగి దైవ చింతన చేసే వారికే ఉన్నతి కలుగుతుంది. పూజ పునస్కారాదులు భగవంతుని చేర్చలేవు. దయా, సానుభూతి, అహింస, సత్యం అన్నిటిలో భగవంతుని చూసే చూపు, సాత్విక గుణాల వల్లే భగవద్దర్శనం సాధ్యం. ఎవరూ చెప్పని గొప్ప సిద్ధాంతాన్ని కృష్ణుడు చెప్పాడు "సర్వ ధర్మాన్ పరిత్యజ్యా" అన్నాడు. అన్నిటిని వదిలేసి తనను

శరణు వేడితే తానే అన్నిటినీ చూసుకొంటాను అన్నాడు. అదే భగవద్గీత పరమార్ధం. ఎక్కడ ధర్మార్ది అయిన అర్జునుడు ఉంటాడో, అంటే ధర్మం చేయాలనుకొనే వారు ఉంటారో అక్కడ సంపద, విజయం ఐశ్వర్యం స్థిరమైన నీతి ఉంటాయి. శ్రీ కృష్ణుడుగొప్ప రాజకీయ దురంధరుడు. గొప్ప డిప్లోమాట్. అందరి కళ్ళకు ఆనందాన్ని, జ్ఞానాన్ని కల్గించేవాడు. విధి విధి నిర్వహణ కోసమేనని చాటినవాడు. "The lord of Autumn moon" శరశ్చంద్ర ప్రభువు శ్రీ కృష్ణ పరమాత్మకు ఈ కృష్ణాష్టమి సందర్భంగా నమస్కరిద్దాం.

(10-8-12-కాంప్-అమెరికా)

అమెరికా డైరీ-**30**

## శ్రీ కృష్ణాష్టమి వారం

ఆగస్టు పదిహేడు శుక్రవారంతో శ్రావణ మాసం పూర్తి. పద్దెనిమిది శనివారం నుండి అధిక భాద్రపద మాసం మొదలై, సెప్టెంబర్ పదహారు ఆదివారం వరకు ఉంటుంది. సెప్టెంబర్ పదిహేడు సోమవారం నుండి నిజ భాద్రపద మాసం ప్రారంభం. వినాయక చవితి సెప్టెంబర్ 19 బుధవారం.

**6-8-12 సోమవారం నుండి 12-8-12, ఆదివారం వరకు విశేషాలు-**

సోమవారం నాగమణి, భర్త వచ్చి గృహ ప్రవేశానికి ముహూర్తం అడిగితే ముహూర్తాలు అయిపోయాయి కావాలంటే ఆది వారం దశమి బాగుంది చేసుకోండి అని చెప్పాను. బుధవారం నాడు ఉదయం యేడు యాభై నిమిషాలకు నేను పెట్టిన ముహూర్తానికే విజ్జి స్నేహితురాలు దంపతులు వీళ్ళ ఇంటికి దగ్గర కొన్న ఇంటి గృహప్రవేశం చేశారు. విజ్జి వెళ్లి వచ్చింది. ఆ అమ్మాయి తల్లి దండ్రి కూడా ఉన్నారు. ఆదివారం సాయంత్రమే వాళ్ళ ఇండియా ప్రయాణం. అందరు ఇంటికి వచ్చి ప్రసాదం స్వీట్లు ఇచ్చి వెళ్లారు. గురువారం శ్రీ కృష్ణాష్టమి. పెద్దగా హడావిడి ఏమీ లేదు. ఇంట్లో పూజ తప్ప. నెట్‌లో "పార్ధ సారధీయం" రాశాను. శుక్రవారం కూడా అష్టమి మిగులు ఉంది. ఆనాడూ కృష్ణ పూజ చేశాను. "భగవాన్ శ్రీ కృష్ణ ఉవాచ" నెట్‌లో రాశాను. నారాయణ తీర్ధుల వారి. శ్రీ కృష్ణ లీలా తరంగిణిని బాల మురళీకృష్ణ గానం చేసిన సి.డి.వింటూ, ఆ రెండు రోజులు కాలక్షేపం చేశాం. బాగా పాడారు బాల మురళి.

### శుక్రవారం భజన

నాల్గవ శుక్రవారం ఇంట్లో భజన. రాత్రి ఎనిమిదింటికి ప్రారంభమై

తొమ్మిదింటికి పూర్తి. రాహుల్, తబలా సత్య, అతని భార్య సౌమ్య మాత్రమే బయటి వాళ్ళు. అందరు వూళ్ళకు వెళ్ళటంతో ఎవరూ రాలేదు. భజన తర్వాతా భోజనం. అన్నం, పాతోళి, కొబ్బరి చట్నీ, సమోసాలు, సేమ్యా పాయసం, రసం, పెరుగు, విందు.

## బాలాజీ అభిషేకం -విందు

independence road దగ్గరలో ఉన్న శ్రీ వెంకటేశ్వర స్వామి (బాలాజీ)కి రమేష్ మంజుల దంపతులు అభిషేకం చేయించి, స్వాముల వారలకు నూతన వస్త్రాలను సమర్పించే కార్యక్రమానికి ఆహ్వానిస్తే, శనివారం ఉదయం పదింటికి అందరం వెళ్ళాం. అక్కడి పూజార్లు అభిషేకం నిర్వహించి వీళ్ళు సమర్పించిన నూత్న వస్త్రాలను స్వాములకు కట్టారు. ఆ తర్వాత పూజ నిర్వహించారు. ప్రక్కనే ఉన్న హాల్‌లో విందు ఏర్పాటు చేశారు. దాదాపు 80 మంది హాజరయ్యారు. అయిదు రకాల స్వీట్లు, మూడు రకాల పులిహోరలు, కొబ్బరన్నం, సాతాళించిన సెనగలు, పెరుగన్నంతో పసందైన విందు. అన్నీ బాగా ఉన్నాయి. రమేష్ దంపతులు మేము వచ్చినందుకు చాలా ఆనందించారు. కావాలని మాతో ఫోటోలు దిగారు. ఇంటికి వచ్చేసరికి మధ్యాహ్నం మూడు అయింది. ఇక్కడికి అరగంటపైనే కారు ప్రయాణం.

## కానుకల "విరిజల్లు"

కాలి ఫోర్నియాలో ఉన్న "విరి జల్లు" రేడియో కిరణ్‌ప్రభ అనే ఆయన, విజయా ఆసూరి అనే ఆమెలతో మంచి రేడియో కార్యక్రమాలను నిర్వహిస్తూ ఉంటారు. ఇద్దరు శ్రోతలను అద్భుతంగా తమ విశేషాలనుభవాలతో రంజింప జేస్తారు. అది లైవ్‌గా ప్రతి శుక్రవారం రాత్రి, శనివారం ఉదయం నిర్వహిస్తారు వారిద్దరూ. దానికి మంచి స్పందన శ్రోతల నుంచి ఉంటుంది. సుమారు నెల క్రిందట సినీ నటుడు, నిర్మాత, దర్శకుడు సూపర్‌స్టార్ కృష్ణ పుట్టినరోజు పండగను "విరిజల్లు"లో నిర్వహించారు. వాళ్ళు అందులో ఒక ప్రశ్న అడిగారు. కృష్ణ నటించిన సినిమాలలో మీకు నచ్చిన మూడు పాటలను ప్రాధాన్యతను బట్టి చెప్పమని అడిగారు. మా అమ్మాయి సహాయంతో నేను ఫోన్‌లో మాట్లాడి నాకు నచ్చిన మూడు పాటలను- మొదటి పాటగా అల్లూరి సీతా రామ రాజు సినిమాలో శ్రీ శ్రీ రాసిన "తెలుగు వీర లేవరా" పాటను, రెండో దానిగా - "తేనె మనసులు" అనే కృష్ణ మొట్టమొదటి సినిమాలోని "దివి నుండి భువికి దిగి వచ్చే దిగి వచ్చే పారిజాతమీ నీవై" అన్న పాటను-మూడవ దానిగా "శ్రీ రాజ రాజేశ్వరి విలాస్ కాఫీ క్లబ్" సినిమాలోని కృష్ణశాస్త్రి గారు రచించిన "రాకోయి అనుకోని అతిధి" పాటను చెప్పాను. నాదే "ఆఖరి కాల్" నా సమాధానం అవగానే విజయా ఆసూరి, కిరణ్ ప్రభ గార్లిద్దరు కలిసి "awsome, awsome" అని నన్ను అభినందించి కార్య క్రమంలో చివర్లో నాకు గిఫ్ట్ (కానుక) ప్రకటించారు. సాధారణంగా కానుక

అంటే కాలిఫోర్నియాలో సినెమా హాళ్ళకు వెళ్ళటానికి సినెమా టికెట్లో, లేక హోటల్ భోజనానికి కూపన్‌లో ఇస్తూంటారట. మేమున్నది నార్త్ కెరొలినాలో షార్లెట్లో. కనుక మాకు అవి ఎందుకు పనికిరావు. ఈ విషయం మా అమ్మాయివాళ్లకు మెయిల్ రాస్తూ ఇంకేదైనా ఉపయోగకరమైనది కానుకగా పంపమని తెలియజేసింది. వాళ్ళిద్దరూ వెంటనే స్పందించి మీ నాన్న గారికి చాలా ఇష్టమైన కానుకలనే పంపుతున్నాం అని తెలియజేశారు. ఈ శనివారం సాయంత్రం పోస్ట్‌లో నా పేర రెండు కానుకలు "విరిజల్లు" నుండి కురిశాయి. ఒకటి "మహా మంత్రి తిమ్మరుసు" సినిమా d.v.d, రెండోది ఆచార్య శ్రీ ముదిగొండ శివప్రసాద్ రచించిన చారిత్రాత్మక నవల "పట్టాభి". మొదటిదాని ఖరీదెంతో నాకు తెలీదు కాని, ఈ నవల ఖరీదు 500 రూపాయలు. (50డాలర్లు) ఈ నవలకొక ప్రత్యేకత ఉంది. కృష్ణా, గుంటూరు సీమలను పరిపాలించిన కమ్మ ప్రభువు శ్రీ రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు పరిపాలన కాలంలోని సాంఘిక ఇతివృత్తంతో కూడిన నవల. ఇంతవరకు కమ్మ ప్రభువుల కాలాన్ని ఇతివృత్తంగా తీసుకొని నవల రాయలేదు. శివప్రసాద్ ఆ కీర్తిని దక్కించు కొన్నారు. ఆయన ఇప్పటికి 70 నవలలు రాశారు. చారిత్రాత్మక నవలలు రాయటంలో నోరి నరసింహ శాస్త్రి విశ్వనాధల తర్వాతి స్థానం వీరిదే. ఆయన్ను చాలా సందర్భాలలో చూశాను. మాట్లాడాను. ఆయన భారతీయ సాహిత్యాన్ని, సంస్కృతిని ఆపోశన పట్టిన మహానుభావుడు. వెంకటాద్రి నాయుడు మన కృష్ణ దేవరాయలంతటి గొప్ప రాజు. ఆయన రాజధాని అమరావతి. రాజ భవనం పేరు చైత్ర రథం. దర్బారు పేరు సుధర్మ. ఆయన ఆస్థాన మంత్రి ములుగు పాపయారాధ్యుల వారుఎన్నో గ్రంథాలను రచించిన పండిత కవులు. అయితే రాజా గారికి దేన్నీ అంకితమివ్వని అభిమాన ధనులు. వీరికి బాలా త్రిపుర సుందరి అమ్మ వారు పిలిస్తే పలికేది. రాజా వారు 108 శివాలయాలు నిర్మించారు. మంగళగిరి నరసింహస్వామి ఆలయానికి 875 అడుగుల ఎత్తైన గాలి గోపురం కట్టించారు. తిరునాళ్ళ రోజుల్లో గోపురం ఎక్కి వెండి నాణాలను భక్తులపై చల్లే వారట. అవి ప్రజల తల పాగాలలో పడేవి. రాజా గారి ఏనుగులు, గుర్రాల మీద తను కాని ఎవరైనా వెళ్తుంటే గురువు పాపయారాధ్యుల వారి ఇల్లే తమ కంటే ఎత్తులో ఉండాలని వారి ఇంటి అరుగులను చాలా ఎత్తుగా కట్టించిన భక్తుడు నాయుడు. ఆయన సాహితీ ప్రియుడు. శత్రువుల పట్ల నిరంకుశుడు. ఎన్నో ప్రాచీన అముద్రిత తాళపత్ర గ్రంథాలను సేకరించి, పరిష్కరింపజేసి మళ్ళీ రాయించాడు. అలాంటి మహనీయుని కాలానికి సంబంధించిన ఎన్నో విలువైన విషయాలను నవలలో పొందుపరచి రాశారు శివ ప్రసాద్.

మహామంత్రి తిమ్మరుసు మనకు తెలిసిన మహనీయుడు. రాయలకు తిమ్మరుసు ఎంతో, నాయుడికి ములుగు వారు అంత. తిమ్మ రుసు సినిమా ఒక "క్లాసిక్".

పెండ్యాల వారి సంగీతం పింగళి రచన కమలాకర వారి దర్శకత్వం రామారావు గుమ్మడిల నటనా వైదుష్యంతో విజయనగర చరిత్రను మన కళ్ళముందు ఉంచుతుంది. ఇలా రెండు చారిత్రాత్మక కానుకలను నేను చెప్పిన "రెండు నిమిషాల" సమాధానానికి రావటం నాకు మహదానందంగా ఉంది. ఈ కానుకలు "సరస భారతి" పొందిన గౌరవంగా భావిస్తున్నాను. ఇంత మంచి కానుకలు పంపినందుకు "విరిజల్లు"కు కృతజ్ఞతలు తెలుపుతూ మెయిల్ రాశాను.

2011 జనవరిలో విజయవాడ సిద్దార్ధ కాలేజిలో కృష్ణాజిల్లా రచయితల సంఘం, అమెరికాలోని "తానా" సంస్థ సంయుక్త ఆధ్వర్యంలో నిర్వహించిన "తెలుగు సంస్కృతి" అనే రెండు రోజుల కార్యక్రమలో నేనూ పాల్గొన్నాను. దానికోసం తెస్తున్న ప్రత్యేక సంచిక కోసం నన్ను "మారుతున్న విలువలు" అనే అంశంపై ఆర్టికల్ రాయమని అడిగితే రాసి ఆ సమావేశంలో ప్రసంగించాను. అమెరికా నుండి విజయ ఆసూరి కూడా వచ్చి రెండు రోజుల సభలో పాల్గొన్నారు. ఆవిడ వస్తున్నట్లు మా అమ్మాయి నాకు చెప్పి పరిచయం చేసుకోమంటే చేసుకొన్నాను. ఆవిడ మా అమ్మాయి విజయలక్ష్మిని "ఝాన్సీ" అని సరదాగా పిలుస్తుందట. ఆ పేరు తోనే నేను పరిచయం చేసుకొన్నాను "ఝాన్సి నాన్న గారిని" అని. ఆమె ఎంతో సంతోషించి, నాతో ఫోటోలు తీసుకోంది. ఆ వ్యాసం ప్రత్యేక సంచికలో ముద్రితమైంది. ఇప్పుడు ఇవి జ్ఞాపకం వచ్చాయి.

## గృహ ప్రవేశ పౌరోహిత్యం

ఇక్కడి మా అమ్మాయి స్నేహితురాలు నాగమణి వాళ్ళ కొత్త ఇంటి గృహప్రవేశం నేనే చేయించాలని కోరారు. ఆదివారం ఉదయం తొమ్మిది గంటలకు నేను పెట్టిన ముహూర్తానికి నేనే పౌరోహిత్యం వహించి చేయించాను. దంపతులు సంతోషించారు. ఆవిడే ఇక్కడి "టోరి" రేడియో ప్రోగ్రాంలో నన్ను ఇంటర్ వ్యూ చేసి "ఊసుల్లో ఉయ్యూరు" చెప్పించింది. ఇవీ ఈవారం కథా, కమా మీషూనూ.

(13-8-12-కాంప్-అమెరికా)

## అరవై అయిదేళ్ళ స్వాతంత్ర ఫలం

అందరికి భారత స్వాతంత్ర దినోత్సవ శుభాకాంక్షలు. అధికారం తెచ్చుకొని అరవై అయిదేళ్ళు దాటింది. కాని స్వతంత్ర ఫలాలు అందరికి దక్కుతున్నాయా అని ఆలోచిస్తే సమాధానం మిశ్రమంగా ఉంటుంది. బాగా ముందుకు వెళ్లామా? అని ప్రశ్నించుకొంటే లేదనే అందరు చెప్పే సమాధానమే. పాపం అబ్దుల్ కలాంగారు దీని మీద స్పందించి ధనాత్మక దృక్పధాన్ని అలవాటు చేసుకోమన్నారు. కడుపు కాలే వాడికి ఋణం తప్ప ధనం ఎక్కడిది? సంపాదన అంతా తిండికే ఖర్చవుతుంటే అభివృద్ధి

ఎక్కడ? అవినీతి ఎక్కడ లేదు? అని ప్రశ్నించేవారికి ఆది టెంటకిల్స్‌లా వ్యాపించి మూలాలను ధ్వంసం చేస్తోందని తెలిసే లోపల, జరగాల్సిన అనర్ధం జరిగిపోతూనే ఉంది. స్వతంత్ర దినోత్సవానికి ఒకరోజు ముందే మన రాష్ట్రమంత్రి రాజీనామా చేయటానికి కారణం అందరికి తెలిసిందే. ఇంకో ఆయన ముందస్తు బెయిల్ కోసం ప్రయత్నాలు. సర్వ సమర్ధుడు అనిపించుకొన్న వాడిని రాష్ట్రపతి పదవి వరించింది అన్న సంతోషమే ఈ రోజు మనకు మిగిలింది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కాళ్ళకింద గడ కర్రలు పెట్టుకొని, ఎత్తుగా ఉన్నట్లు నటిస్తున్నాయి. ఈ ముఖ్య మంత్రి సమర్ధుడు అని అనిపించుకొంటే, ఆయన మీద పాత కేసుల తిరుగ మోత. ఆదర్శంగా పాలిస్తున్న ముఖ్యమంత్రికి దేశం వత్తాసు పలకదు. ఎంత వెనకేస్తే అంత సమర్ధతే కొలమానం అయింది. అటవీ సంపదను దోచే వాడొకడైతే, సముద్రాన్ని మింగేవాడు ఇంకోడు. బందుజనాన్ని అందలం ఎక్కించే వాడొక డైతే, పల్లకీలు మోసేవారు కొందరు. ఉన్న వ్యవస్థ తీరు తెన్నులను సరైన మార్గంలో మళ్లించే వారు కరువైపోతున్నారు. వారెవరైనా ముందుకొస్తే, వారిపై బురద చల్లుడు. ఇన్నేళ్ళ స్వాతంత్రం ఇచ్చిన విషఫలాలు ఇవి. వీటినుంచి యువతను బయట పడెయ్యాలి. వారిని తీర్చి దిద్దకపోతే భవిష్యత్తు శూన్యమే.

గాంధీ, నేతాజీలు చిత్ర పటాలుగా గోడలకు వ్రేలాడుతున్నారు. పాపం వారి స్ఫూర్తిని కొనసాగించే వారు లేకపోవటం మన దురదృష్టం. ఒకసారి విజయనగరం మహారాజా ఆనంద గజపతి గారు మద్రాస్‌లో సైకిళ్ళు అమ్మే దుకాకానికి మారు వేషంలో, మామూలు దుస్తులతో వెళ్లారు. అవేమిటో ఆయనకు తెలీదు. అక్కడి గుమాస్తాను అవేమిటి అని అడిగితే "బైసికిల్" అని చెప్పాడట. "ఖరీదెంత?" అని రాజా ప్రశ్నిస్తే "నువ్వు కొనేది కాదులే ఫో" అన్నాడు. "మీ దగ్గర ఎన్ని సైకిల్లున్నాయి?" రాజా ప్రశ్న. "రెండు వందలు" అని జవాబు. మొత్తం బిల్లు చేసి మా సంస్థానంకు వెంటనే రవాణా చేసి పంపండి" అన్నారు. వాడు బిత్తర పోయాడు. అక్కడున్న మేనేజర్‌కు అప్పుడు అర్ధమయింది. వచ్చింది విజయనగరం మహారాజా వారు అని. వెంటనే సైకిళ్ళు విజయనగరం చేరాయి. రాజావారు పండుగ కానుకగా ఆస్థాన ఉద్యోగులకు వాటిని పంచిపెట్టారు. అయితే మన వాళ్ళూ ఇప్పుడు ఎన్నికల వాగ్దానాలలో టి.వి.లు ఫ్రిజ్‌లు ఇస్తామని మొహమాట పెడుతున్నారు. దానికీ దీనికీ ఎంత తేడానో గమనించండి. వాళ్ళు ధర్మ ప్రభువులు. వీళ్ళు "మన ఖర్మ ప్రభువులు" అదీ తేడా.

శ్రీ కృష్ణదేవరాయలు అష్టదిగ్గజ కవులను పోషించి సాహిత్య సేవ చేశాడు. అమరావతి ప్రభువు రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు గారు దసరాల్లో ఏనుగు అంబారీ మీద "వేదాలు, ఉపనిషత్తులు, దర్శనాలు పురాణాలు ములుగు పాపయా రాధ్యుల వారు రచించిన దేవీ భాగవతాలను" ఊరేగించేవారు. వాటికి అంత గౌరవం

కల్పించారు. మనకు సాహిత్యానికి, భాషకు మంత్రే లేదు. అకాడెమి లేదు. భాషా సంఘం లేదు. "అన్నిటిని ఊరేగించి మంగళం పాడేశాం ఎప్పుడో". ముదిగొండ వారన్నట్లు "స్వాతంత్రానికి ముందు దేశం కోసం మరణించటం త్యాగం ,ఇవాళ్ళ దేశం కోసం జీవించటం త్యాగం" త్యాగం ప్రజలది, భోగం పాలకులది ఇదీ తేడా. మరి మనమేం చేయాలి? తిట్టుకుంటూ కూర్చుంటే సమస్యలు పరిష్కారం కావు. మంచి ఎక్కడ ఉంటే దాన్ని స్వీకరించాలి. అమెరికా బాగుంది సంతోషం. సింగపూర్ శుచికీ శుభ్రతకు నంబర్ వన్. మరీ గొప్ప. బాగుంది. కలాం గారు అన్నట్లు అక్కడ ఉన్నమంచి వాటిని అక్కడున్నప్పుడు ఆచరించటం కాదు. మన దేశంలో నూ ఆ మంచిని ప్రతిబింప జేయాలి. అప్పుడే సార్ధకత. అప్పుడు దేన్నీ మనం తిట్టనక్కర లేదు. దేన్నీ పొగడక్కర లేదు. ఆదర్శం ఆచరణం కావాలి అది ఇక్కడైనా, ఎక్కడైనా. ఈ స్ఫూర్తితో ఈ స్వాతంత్ర దినోత్సవాన్ని జరుపుకుందాం. చీకటిని పాతిపెట్టి, వెలుగులోకి ప్రస్తావన సాగిద్దాం. మన కోసం త్యాగాలు చేసి మన చేతుల్లో ఉంచిన స్వాతంత్ర ఫలానికి విషం ఎక్కకుండా, పుచ్చి పురుగులు కారకుండా, పరిశుభ్రంగా ఉంచి కాపాడి నాణ్యంగా, తాజాగా దాని పోషక విలువలను సహజంగా పెంచి, తర్వాత తరాలకు అందిద్దాం. జైహింద్.

(15-8-12-కాంప్-అమెరికా)

అమెరికా డైరీ-**31**

## భారత స్వాతంత్ర దినోత్సవ వారం

ఆగస్ట్ పదమూడు సోమవారం నుంచి పందొమ్మిది ఆదివారం వరకు విశేషాలు–

దాదాపు యాభై ఏళ్ళుగా సంగీతకారుడు బీథోవెన్ గురించి వింటూనే ఉన్నాను. కాని ఆయన ఏ దేశం వాడో, ఆయన ప్రతిభ ఏమిటో నాకు ఇప్పటిదాకా తెలీదు. మూడుసార్లు అమెరికా వచ్చినా ఆయన మీద నా దృష్టి పడలేదు. ఈ నాలుగోసారి వచ్చిన దగ్గర్నుంచి ఎందుకో తెలుసుకోవాలనే ఆరాటం పెరిగింది. లైబ్రరీలో కొన్ని పుస్తకాలు తెసుకొచ్చి చదివాను. కాని నాకు కావలసిందేదీ కనిపించలేదు. అయితే ఆయన పూర్తి పేరు "లుడ్విగ్ వాన్ బీథోవెన్" అనీ, జర్మనీ దేశస్తుడు అని, చిన్నప్పటి నుండే సంగీతంలో గొప్ప పేరు తెచ్చుకున్నాడని మాత్రం తెలిసింది. అంతకుమించి ఆయన్ను పూర్తిగా ఆవిష్కరించే రచన దొరకలేదు. కిందటి వారం అలాంటి అరుదైన పుస్తకం దొరికి నా ఆరాటం తీర్చింది. దాన్ని పూర్తిగా చదివి నాకు కావలసిన నోట్స్ రాసుకోన్నాను. నా దాహం తీరింది. ఆయన ప్రతిభ తెలిసింది. క్రమంగా ఎప్పుడో

ఆయన గురించి సమగ్రంగా రాస్తాను. ఆయన సామాన్యుడు కాదు మహామాన్యుడు. మనవాళ్ళు అందుకనే ఆయన సంగీతాన్ని, ఆయన సింఫనీని పదే పదే పొగుడుతారు. "సిరి వెన్నెల" సినిమాలో దర్శకుడు విశ్వనాథ్ ఆ అవకాశాన్ని చక్కగా ఉపయోగించాడు. బీథోవెన్ "మూన్ లైట్" సొనాటా"లాగా వెన్నెల్లో బృందావనాన్ని చూపించాడు. మురళి గానంతో కళ్ళులేని అమ్మాయికి. హరి ప్రసాద్ చౌరాసియాతో పలికించాడు. మనకూ ఆ ఆనందాన్ని కల్గించాడు. మా విజయవాడ రేడియో స్టేషన్ డైరెక్టర్ ఆదిత్య ప్రసాద్ గారు బీతోవన్ చూపించిన ఈ అద్భుత దర్శనాన్ని ఎప్పుడు తమ ఉపన్యాసంలో వివరిస్తూ ఉంటారు. ఇన్నాళ్ళకు, ఇన్నేళ్ళకు ఆ నాదబ్రహ్మ బీథోవెన్ సమగ్ర సంగీత దర్శనాన్ని పొందిన ధన్యుడిని అనిపించుకొన్నాను. ఈ వారమంతా బీథోవెన్‌లో మునిగి తేలాను.

## చివరి మంగళవారం-భోజనం

శ్రావణ మాసంలో ఇది చివరి మంగళవారం. "ప్రక్కి" వారి అమ్మాయి శ్రీమతి అరుణ చక్కగా నాలుగు వారాలు నోము నోచుకోని మొదటివారం నాడు మా అమ్మాయిని, వాళ్ళ అమ్మను భోజనానికి పిల్చింది. ఈవారం వాళ్ళతోపాటు "పోతు పేరంటానికి" నన్నూ పిలిచింది. మా ప్రక్కనున్న రాఘవేంద్రరావు గారు, భార్య కూడా వచ్చారు. చక్కగా పట్టుబట్టతో శ్రద్ధగా పూజ చేసుకొని మా వాళ్లకు వాయనం ఇచ్చి, తర్వాత భోజనాలు పెట్టింది. పూర్ణపు బూరెలు పులిహోర, టమేటా పప్పు, బెండకాయ కూర వంకాయ చెట్నీ, సాంబారు అన్నం, పెరుగులతో సంతుష్టికరమైన భోజనం పెట్టి మా పోతు పేరంట గాళ్ళకు కూడా దక్షిణ, తాంబూలాలు ఇచ్చింది. ఇంటికి వచ్చేసరికి మధ్యాహ్నం మూడు అయింది. లైబ్రరీకి వెళ్లి పుస్తకాలు ఇచ్చి కొత్తవి తెచ్చుకొన్నాము. ఆ అమ్మాయి మంచీ మర్యాదా బాగున్నాయి.

## జనాన్ని చెవలాయిలను చేసి, ఆడించిన "జులాయి"

బుధవారం రాత్రి రెండో ఆటకు జులాయి సినిమాకు వెళ్ళాం. మేము ఏడుగురం. మాతోపాటు ఇంకో "తెలుగు బకరా"తో సహా హాలులో ఖచ్చితంగా ఎనిమిది మంది మాత్రమే. సినిమా ఎందుకు తీశారో, ఎలా నడుస్తుందో తెలీదు. ఎప్పుడేవాడు వచ్చి కాలుస్తాడో, ఎవడు చస్తాడో ఎవడు తప్పించుకొంటాడో తెలీదు. పాపం అల్లు అర్జున్‌కు నిరాశే. ఇలియానా అందాల కంటే నీరసాలు బాగా ఒలక బోసింది. దేవిశ్రీ ప్రసాద్ "సంఘీతం" ఘోషా, మోతా తాషా మరబా తప్ప చెవికింపైన దేమీ వినిపించలేదు. త్రివిక్రమ్ దర్శకత్వం పేరుకు తగ్గ త్రివిక్రమంగా ఉంటుందను కొంటే, తిక మకాలుగా ఉంది. షార్ట్ డైలాగుల్లో అల్లు బాగానే చెప్పాడు. లాంగ్ డైలాగుల్లో ఏం చెప్తున్నాడో తెలీలేదు- దొర్లించాడు. పాపం రాజేంద్ర ప్రసాద్ అనే, పోలీసు ఆఫీసరు గారికి తుపాకి పేల్చటం రాదట. చెవిలో కాబేజీలకు మించిన వేవో పెట్టాడు. "వరుడు" తీసి

దానయ్య, చేతికి ఎముక లేదనిపించుకొని డబ్బు పోగొట్టు కున్నాడు. పాపం ఇప్పుడైనా వెనకేసుకొంటాడేమో ననుకొన్నాను. ఆ ఆశ ఏమీ కనిపించలేదు. జనాన్ని చెవలాయలను చేసి ఆడించాడు "జులాయి".

## చివరి శుక్రవారం-భజన

ఇది చివరి శుక్రవారం. ఇప్పటికి నాలుగు వారాల నుంచి మా అమ్మాయి వాళ్ళింట్లో భజనలు జరిగాయి. ఇది చివరి వారం భజన. అంటే దీనితో అయిదు వారాలు చేయాలి అనుకొన్న కోరిక తీరింది. ఇరవై మంది వచ్చారు. రాత్రి ఎనిమిది నుంచి తొమ్మిది వరకు భజన జరిగింది. ఆ తర్వాత విందు. బ్రెడ్ హల్వా, వడ, సొరకాయ కూర, చెట్నీ, సాంబారు, అన్నం, పెరుగు పుచ్చ కాయ ముక్కలు, ఆపిల్ ముక్కలతో విందు బాగానే జరిగింది.

## అమెరికాలో భారత స్వాతంత్ర దినోత్సవం

భారత దేశ 66వ స్వాతంత్ర దినోత్సవాన్ని ఇక్కడి "హిందూ సెంటర్" వారు గాంధీభవనలో ఘనంగా నిర్వహించారు. మన దేశంలో లాగా ఇక్కడ యే రోజు పండగ అయితే ఆ రోజు చేయరు. శనివారం లేక ఆదివారం నాడు జరుపుతారు. ఈ ఆదివారం అంటే నిన్న పందొమ్మిదో తేదీన మధ్యాహ్నం పన్నెండు గంటల నుండి రెండు గంటల పాటు నిర్వహించారు. మేమందరం వెళ్ళాం. ముందుగా భారత జాతీయ పతాకను, అమెరికా జాతీయ పతాకను వేదికపై చెరొక వైపునా ఆవిష్కరించారు. వేదికపై ఆరడుగుల గాంధీ మహాత్ముని కాంశ్య విగ్రహాన్ని ఉంచారు స్పూర్తిదాయకంగా.

రెండు దేశాల జాతీయ గీతాలను చిన్నారులు భక్తిగా ఆలపించారు. ఆ తర్వాత హిందూ సెంటర్ అధ్యక్షులు డాక్టర్ సురేంద్ర పాల్ ముఖ్య అతిధిగా విచ్చేసి స్వాతంత్ర దినోత్సవ సందేశాన్ని ఇచ్చారు. ముఖ్యంగా భారత దేశపు అభివృద్ధికి స్వాతంత్ర పోరాటానికి సిక్కుల పాత్రను గుర్తు చేశారు. వారి త్యాగాలను చక్కగా గణాంకాలతో వివరించారు. అమెరికా వచ్చిన మొదటితరం భారత దేశీయులలో సిక్కులు ఉన్నారని ఇక్కడి వ్యవసాయానికి వారే ఆద్యులని, ఆ తర్వాత అనేక వ్యాపార వాణిజ్యాలలో వారి పాత్ర గణనీయంగా ఉందని హర్షధ్వానాల మధ్య తెలిపారు. ఆ స్పూర్తిని అందరు పొందాలని, ఇక్కడి హిందూ సెంటర్‌కు ఈ బాలాజీ దేవాలయానికి అందరు కృషిచేసి అభివృద్ధిలోకి తెస్తున్నారని, ఇంకా చెయ్యాల్సింది చాలా ఉందని అందరి సహకారంతోనే అభ్యుదయం సాధ్యం అని చాలా ప్రేరణాత్మక ప్రసంగం చేశారు. భారతదేశానికి మచ్చలేని మన్మోహన్‌సింగ్ ప్రధానిగా రెండుసార్లుగా ఉన్నారని కొనియాడారు. బెంగాలీ అయిన ప్రణబ్ ముఖర్జీ అన్ని తెలిసిన పూర్ణ జ్ఞాని, అత్యంత అనుభవం, అన్ని శాఖల్లో పని చేసిన నేర్పు ఉన్న మనీషి అని అలాంటి వారు భారత దేశాధ్యక్షులవటం హర్షదాయకం

అని అభినందించారు. "హేమంత్ అమిన్" సభా సంచాలనం చేశారు. "మేడ్ ఇన్ ఇండియా" అనే సినిమా పాటకు పిల్లలు చక్కని డాన్సు చేశారు. తర్వాత మరో దేశభక్తి గీతం "నన్హా మున్నా, రాహి హూన్" అనే పాటకు మంచి నృత్యం చేశారు పిల్లలు. రాజస్థానీ గీతానికి నలుగురు పిల్లలు ఆ డ్రెస్ వేసుకొని గొప్పగా నృత్యం చేశారు. భారత నాట్యం జతి స్వరాన్ని అందంగా అద్భుతంగా నృత్యం చేసి చూపారు కొంచెం పెద్ద వయసులోని అమ్మాయిలూ. ఇదే అన్నిటి కంటే హైలైట్. ఆ తర్వాత "షహీద్" సినిమాలోని పాట పాడుతుండగా దేశభక్తులంతా వరుసగా కదిలి నడవటం దానికి తగ్గట్టు అభినయించటం అందర్నీ ఆకర్షించింది. ఇందులో మా పెద్ద మనవడు చి.శ్రీకేత్ అందరికంటే తన నాట్య ప్రావీణ్యాన్ని చూపించి మన్ననలు పొందాడు. ఆ తరువాత "యే మేరె వతన్" అనే లతా మంగేష్కర్ దేశభక్తి గీతాన్ని ఒకామె పాడింది. ఇలా రెండు గంటలపాటు జనానికి స్వాతంత్ర స్ఫూర్తి కలిగించారు. అందరు అభినందనీయులే. కార్యక్రమంలో పాల్గొన్న చిన్నారులందరికి బహుమతులు అందజేశారు నిర్వాహకులు. సుమారు యాభైకి పైగా చిన్నారులు పాల్గొనటం, వారికి తలిదండ్రులు డ్రెస్ సమకూర్చటం, వీరందరికీ నేర్పి ప్రదర్శింప జేయటం అంత ఆషామాషీ వ్యవహారం కాదు. కాని తలచుకొంటే ఏదైనా చెయ్యచ్చు అని నిరూపించారు "హిందూ సెంటర్" వారు. వారికి ఇంతటి సహాయ సహకారాలు అందించిన వారందరికి అభినందనాలు. సభలో సుమారు రెండు వందలకు పైనే ప్రేక్షకులు రావటం దేశభక్తికి నిదర్శనం. అందరికీ సిక్కు అల్పాహారం "పావూ భాజీ"ని ప్రక్కనే ఉన్న "వివేకా నంద హాల్"లో ఏర్పాటు చేసి కడుపు నింపారు. బంగాళ దుంప కూరను బాగా మెత్తగా పప్పు లాగా ఉడికించి దానితోపాటు రెండేసి గుండ్రని మెత్తటి రొట్టెలతో ఇచ్చేదాన్నే "పావూ భాజీ" అంటారని మొదటిసారిగా ఇక్కడే తెలిసింది. చాలా రుచికరంగా ఉంది. ఇంటికి వచ్చేసరికి మధ్యాహ్నం మూడు అయింది.

(20-8-12-కాంప్-అమెరికా)

## సరసభారతి 1000 పోస్ట్స్ -మైలురాయి

సరభారతి 1000 పోస్ట్స్- మైలురాయి దాటింది. దీనికి మీ ఆదరాభిమానాలే కారణం.

వీక్షకులు: 68,321

ప్రపంచంలోని తెలుగువారి అందరికి పరిచయమయ్యింది. బ్లాగ్ ప్రారంభం అయ్యిన తరువాత గ్రామీణ ప్రాంతం నుంచి తెలుగులో ఉసూల గూడు (బ్లాగ్స్) కూడా రాస్తారు అని ప్రపంచానికి తెలిసింది. అమెరికా ప్రయాణంలో పరిచయంలేని వాళ్ళు కూడా గుర్తు పట్టి బ్లాగ్ గురించి గొప్పగా చెప్పటం విశేష అనుభూతి. 73 ఏళ్ళ వయసులో

కంప్యూటర్ నేర్చుకొనటం, తెలుగులో టైపు చేయటం, నోట్స్ తయారు చెయ్యటం ఈమెయిలు రాయటం. సమాధానాలు రాయటం నేను నేర్చుకున్నవి. టైపింగ్‌లో కొన్ని తప్పులు దొర్లినా మంచి మనసుతో దానిని అర్థం చేసుకొని బ్లాగ్‌కి సహకరించిన వారి అందరికి ధన్యవాదాలు. పేరు పేరు నా రాయక పోయినా, అందరికి ఇవే నా ధన్యవాదాలు మరొకసారి.

అమెరికా డైరీ-**32**

## స్కూళ్ళ రిఓపెనింగ్ వారం

**ఆగస్ట్ ఇరవై సోమవారం నుండి, ఇరవై ఆరు ఆదివారం దాకా విశేషాలు-**

సోమ, మంగళ వారాలలో విశేషాలేమీ పెద్దగా లేవు. పుస్తకాలు చదవటం, నోట్సు రాసుకోవటమే ఎక్కువగా జరిగింది. మైనేని గారు మెయిల్ రాస్తూ బాపు గారి ఆరోగ్యం బానే ఉందని, రెండు నెలల తర్వాత మళ్ళీ టెస్ట్ చేయించాలని చెప్పారు. అభిమానులు అల్లుడు అవధానికి హడావిడిగా చేసిన పుట్టిన రోజు వేడుక ఆగస్ట్ ఇరవై రెండు బుధవారం మా అల్లుడు అవధాని గారికి తెలుగు తిధుల ప్రకారం పుట్టిన రోజు. దీన్ని పసిగట్టిన ఆయన అభిమానుల కుటుంబం నాగమణి దంపతులు గప్ చిప్‌గా రాత్రి యేడు గంటలకు కేకు తెచ్చి ఆయనతో కోయించి, వాళ్ళ, వీళ్ళ పిల్లలతో సహా హేపీ బర్త్ డే పాటపాడించి హడావిడి చేశారు. అందరు ఇక్కడే భోజనాలు చేశారు. మా అమ్మాయి రసగుల్ల, వెజిటబుల్ బిర్యానీ చేసింది. అంతా బానే లాగించారు.

ఈ ఇరవై మూడో తేది గురువారం నాటికి సరస భారతి "వెయ్యి ఎపిసోడుల" పండుగ పూర్తి చేసుకొని అందరి అభి మానాన్ని పొందింది. ఇరవై నాలుగు శుక్రవారం రాత్రి మా ఇంట్లో భజన జరిగింది. పాతిక మంది వచ్చారు. తొమ్మిది దాకా భజన. ఆ తర్వాత విందు. పాయసం అన్నం, సాంబారు, వెజిటబుల్ బిర్యానీ, పెరుగు, దోసకాయ చెట్నీ చేసింది మా అమ్మాయి. వల్లం నరసింహా రావు గారు, భార్యా, అమ్మాయి రేణుక, మనవడు కూడా రావటం బాగుంది. ఆ జంటే ఇక్కడ రెండు నెలల క్రితం యాభైవ పెళ్లి రోజు వేడుక చేసుకొన్నారు. ఆయన నాటక, సినీ నటుడు స్వర్గీయ వల్లం నరసింహారావు గారికి స్వయానా అన్నగారి కుమారుడే. ఇద్దరి పేర్లు ఒకటే అవటం తమాషాగా ఉంది. ఈ నరసింహారావు గారు గొప్ప పైంటర్. ఆయన వేసిన "అష్ట లక్ష్మీ దేవి" చిత్రాన్ని స్కాన్ చేసి ఫ్రెం కట్టించి, వాళ్ళ పెళ్లి రోజు వేడుకలనాడు అందరికి కానుకగా మా అందరికి ఇచ్చారన్న సంగతి ఇప్పుడే తెలిసింది. శనివారం రాత్రి జగదీశ్, లక్ష్మి దంపతుల ఇంట్లో భజన. ముప్పైమంది పైగా వచ్చారు. అందరికి రెండు స్వీట్లు రెండు హాట్లు ,అన్నం, పులిహోర, చపాతి కూర, పెరుగులతో భోజనం.

ఇంటికి వచ్చేసరికి రాత్రి తొమ్మిది అయింది. మా అమ్మాయి వాళ్ళ ఇంటికి దగ్గరే ఉన్న నీలిమా దంపతుల గృహప్రవేశ పార్టీకి వెళ్లారు. మేమిద్దరం వెళ్ళ లేదు. కాని మా కోసం ఫ్రూట్ సాలిడ్, ఐస్ ఫ్రూట్ పంపారు. ఆ రోజు మధ్యాహ్నం "గోదావరి" సినిమా యు ట్యూబులో ఆసాంతం చూశాం. ఒక రకంగా దృశ్యకావ్యం. దర్శకుడు శేఖర్ కమ్ములకు మెయిల్ రాయాలని అనిపించింది. మెయిల్ అడ్రెస్‌ను మా పెద్దబ్బాయి శాస్త్రి సంపాదించి పంపించాడు. తీరిగ్గా రాయాలి.

## వేసవి సెలవుల అనంతరం బడుల ప్రారంభం

అమెరికాలో పిల్లల వేసవి సెలవులు అయిపోయాయి. ఆగస్టు మధ్య నుంచి విద్యాలయాలు దాదాపు అన్నిచోట్లా ప్రారంభ మైనాయి. మా మనవళ్ళ స్కూళ్ళు ఈనెల ఇరవై యేడు సోమవారం నుండి ప్రారంభం. సుమారు మన లాగానే, రెండు నెలలు వీళ్ళకూ సెలవులు. మనకు బడులు ఏప్రిల్ ఇరవై నాలుగు నుండి మూసేస్తారు. మళ్ళీ మనకు జూన్ పన్నెండున తెరుస్తారు. ఇక్కడ జూన్ పదిన మూసేస్తారు. ఆగస్టు రెండో వారంలో తెరుస్తారు. ఇక్కడ విద్యార్థుల కోసం నోటు పుస్తకాలు, తెల్ల కాగితాలు, పెన్నులు, పెన్సిళ్ళు మొదలైన స్కూల్‌కు అవసరమైన వాటినన్నిటిని చాలా తక్కువ రేట్లకే ఈ నెలంతా అమ్మటం విశేషం. తలి దండ్రులు, పిల్లలతో వాల్ మార్టు, టార్గెట్, శామ్సు, కే.మార్ట్‌లాంటి మాల్సులన్ని కళకళ లాడాయి. చూడ ముచ్చటగా ఉంది. 140 పేజీల రూళ్ళ స్పైరల్ పుస్తకం కేవలం 17 సెంట్లు మాత్రమే. 150 పేజీల రూళ్ళ కాగితాలు దస్తం కేవలం ఎనభై ఎనిమిది సెంట్లు. ఇంత కారు చవకగా దొరికేటట్లు చేయటం ఇక్కడి వారు తీసుకొనే ప్రత్యేక శ్రద్ధ. ఈరేట్లు మనకు నలభై పైసలే, రెండోది రెండు రూపాయల లోపే. అదే మనకు బడులు తెరిచే సమయంలో పుస్తకాల రెక్కలు ఆకాశం అంటుతాయి. దొరకటం కష్టం కూడా. బ్లాక్ మార్కెట్‌లో అవి నల్లగా మెరుస్తుంటాయి. అదీ తేడా. ఇంకో విషయం. ఇక్కడ ప్రభుత్వ బడులలో విద్యార్థులందరికి సెకండరి స్థాయి వరకు ఉచిత విద్య. పుస్తకాలు ఫ్రీ. బస్సు ఫ్రీ. ఇదీ ఇక్కడి వెసులు బాటు. కాలేజిలో చేరినప్పుడే తలిదండ్రులకు ఖర్చు. అప్పుడు దాదాపు పిల్లలు స్వంతకాళ్ళ మీద నిలబడి సంపాదించుకొంటూ, చదువు కోవటం విశేషం.

ఈ వారంలో lydia maria child అనేమహిళా రచయిత, బానిసత్వ నిర్మూలన కోసం ముప్ఫై ఏళ్ళు సుదీర్ఘ పోరాటం చేసి, సాధించిన ఆమె జీవిత చరిత్ర చదివాను. గొప్పగా ఉంది. స్ఫూర్తి దాయకంగానూ ఉంది. Al gore అనే పర్యావరణ ప్రేమికుడు, అమెరికా మాజీ వైస్ ప్రెసిడెంటు గురించి చదివాను. అలాగే "న్యూక్లియర్ ఫిషన్"పై పరిశోధన చేసి తనతో పని చేసిన శాస్త్రజ్ఞుడి మోసం వల్ల నోబెల్ బహుమతిని

కోల్పోయి, ఆమె చేసిన భౌతిక శాస్త్ర పరిశోధనలకు అనేక బహుమతులను పొంది, మొదటి జర్మన్ ఫిజిక్స్ ప్రొఫెసర్ అయి, నాజీ ఉద్యమంలో దేశాన్ని విడిచి వెళ్ళి, పీరియాడిక్ టేబుల్‌లో 109వ మూలకాన్ని ఆమె గౌరవంగా "Meitnerium" అన్న పేరుతో ఆమె సేవలకు ప్రతిఫలంగా కానుకగా పొందిన "Lise Meitner" అనే ఆమె చరిత్ర చదివి ఎంతో ఆనందాన్ని, బాధను పొందాను. Gar field, Madison, Beeethovenలపై పుస్తకాలు ఎంతో అనుభూతినిచ్చాయి. ఇవీ ఈ వారం విశేషాలు.

(27-8-12-కాంప్-అమెరికా)

## అమెరికా డైరీ-**33**

**శ్రీ భ్రమ రాంబా మల్లికార్జున- శ్రీ ఉమా సోమశేఖరస్వామి వారల సందర్శన వారం**

ఆగస్టు ఇరవై యేడు సోమవారం నుంచి, సెప్టెంబర్ రెండు ఆదివారం వరకు విశేషాలు.

ఆగస్టు ఇరవై యేడు సోమవారం నుంచి మా మనవళ్ళకు బడులు ప్రారంభ మయాయి. మళ్ళీ సందడి. నిన్న ఆదివారం నాడు మా అల్లుడి మేనత్త శ్రీ మతి లక్ష్మి గారు, భర్త, రాలీ నుండి వచ్చారు. ఆవిడను ఇక్కడ ఉంచి ఆయన వెంటనే వెళ్లిపోయారు. మంగళవారం మా అమ్మాయి మామగారు కోమలి సూర్యనారాయణ శాస్త్రి గారి అధిక భాద్రపద మాస ఆబ్దికం. ఒక అరవ బ్రాహ్మణుడు వచ్చి మా అల్లుడితో కార్యక్రమం చేయించాడు. మా అమ్మాయి మడి కట్టుకొని యధావిధిగా అన్నీ చేసింది. మూడు పచ్చళ్ళు, మూడు కూరలు, పప్పు, గారెలు, పరవాన్నం చేసింది. పవన్ దంపతులు భోజనానికి వచ్చారు. వీళ్ళ మేనత్తగారు దీనికోసమే వచ్చి ఉన్నారు. కార్యక్రమం యధావిధిగా జరగటం అందరికి నచ్చింది. భోజనం తర్వాత ఆవిడను పవన్ వాళ్ళింటికి తీసుకొని వెళ్లారు.

బుధవారం లైబ్రరీలో పుస్తకాలు ఇచ్చి, ఇరవై పుస్తకాలు తెచ్చుకున్నాను. పిల్లలు జిమ్నాస్టిక్స్ నుండి రావటం ఆలస్య మవుతుందని లైబ్రరిలోనే ఉండి ఒకటిన్నర పుస్తకం చదివేశా. గురువారం ఉదయం శ్రీ మతి రమా రాచకొండ వచ్చింది. ఆవిడను, భర్తను ఇదివరకు రెండుసార్లు అంటే ఎల్లా వెంకటేశ్వరరావు, కొమరవోలు శివప్రసాద్ గార్ల సభల్లో చూశాను. ఆమె ఇక్కడి సాంస్కృతిక కార్యక్రమాలకు సెక్రెటరి. రమ తూర్పు గోదావరి జిల్లా అమలాపురం దగ్గర్లో ఉన్న "ముంగండ" అమ్మాయి. ఆమె మా అల్లుడు మేనత్తకు దగ్గర బంధువు కూడా. వీళ్ళదీ, అంటే మా అమ్మాయి మామగారిదీ ముంగండే. ఆ బంధుత్వంతో వీళ్ళకు రాకపోకలు బానే ఉన్నాయి. మర్నాడు శుక్రవారం వాళ్ళింటికి భోజనానికి పిలవటానికి వచ్చింది రమ.

శుక్రవారం అందరం కలిసి రమా వాళ్ళింటికి భోజనానికి వెళ్ళాం. చాలా పెద్ద భవనం.

ఇంగ్లీష వాళ్ళ భవనాల్లాగా ఉంది. వాళ్ళ ఆయన "శివ" ఆఫీసుకు వెళ్లారు–ఇంట్లో లేరు. మంచి మర్యాద చేసింది. పప్పు, కాబేజీ కూర, దోస చట్నీ, మజ్జిగ పులుసు, అన్నం, చారు, పెరుగుతో భోజనం పెట్టింది రమ. అన్నీ బానే ఉన్నాయి. రమా దంపతులకు "ఆంధ్ర వేదశాస్త్ర విద్యాలన్కారులు "శ్రీ హనుమ కథానిధి", "మా అక్కయ్య" అనే సరసభారతి ప్రచురించిన మూడు పుస్తకాలను అందజేశాను. ఇంటికి తిరిగి వచ్చే సరికి మధ్యాహ్నం మూడు అయింది.

## రాలీకి రాలీ

శుక్రవారం రాత్రి ఏడున్నరకు మేనత్తతో సహా అందరం కారులో వాళ్ళ ఊరు రాలీకి బయల్దేరాం. పులిహార చేసింది మా అమ్మాయి. బయల్దేరే ముందు పెరుగుతో కలిపి కొంత అందరం తిన్నాం. సుమారు రాత్రి తొమ్మిదింటికి ఒకచోట ఆగాం. పిల్లలకు "పీజా" పెట్టించారు. మేము మళ్ళీ "పులి మీద దండ యాత్ర' 'చేసి దాన్ని పూర్తిగా సఫా చేశాం. మళ్ళీ బయల్దేరి రాత్రి పదకొండున్నరకు రాలీకి చేరి దానికి దగ్గర్లో ఉన్న "దర్హాం"లో వాళ్ళ ఇంటికి చేరుకొన్నాం. కాఫీ తాగి పడుకున్నాం.

## శ్రీ భ్రమరాంబా మల్లికార్జున స్వామి దర్శనం

శనివారం ఉదయం స్నానాలు పూర్తిచేసి మేనత్త చేసిన ఉప్మాతిని ఆదంపతులతో కలిసి నేను, మా అల్లుడువాళ్ళ కారులో సుమారు పదిహేను మైళ్ళ దూరంలో ఉన్న దేవాలయాలకు వెళ్ళాము. ముందుగా శ్రీ భ్రమరాంబా సమేత మల్లికార్జున స్వామిని దర్శించాం. అప్పుడే అభిషేకం ప్రారంభించారు. నేను పుస్తకాలు తీసుకొని వెళ్లాను. పూజారితో స్వరం కలిపి నమక, చమకాలు పురుష సూక్తం బిల్వాష్టకం వగైరాలు చదివాను. బాగా చేశారు. తర్వాత అష్టోత్తర నామాలు కూడా పూజారితో గొంతు కలిపాను. మంచి అలంకరణ కూడా చేశారు స్వామి వారలకు. గొప్ప అనుభూతి చెందాము. పూజారి విజయవాడకు చెందిన గణపతి శాస్త్రి. కుర్రాడే. ఉయ్యూరులో మా ఇంట్లో అద్దెకుంటున్న గణేష్‌శర్మ అనే వేద పండితునికి స్నేహితుడే. ఇలా అమెరికాలో ఒక్కోసారి తమాషాగా కలుస్తూ ఉంటాము. తీర్థ ప్రసాదాలను తీసుకొన్నాము.

## బాలాజీ స్వామి దర్శనం

ఈ దేవాలయానికి ప్రక్కనే విశాలమైన స్థలంలో శ్రీ వేంకటేశ్వర దేవాలయం ఉంది. చాలా ఎత్తు మీద కట్టారు. స్వామి విగ్రహం చాలా భారీగా ఉంది. మేము వెళ్ళేసరికి అక్కడ కూడా అభిషేకం పూర్తి అయి, దర్శనం ఇస్తున్నారు. దర్శనం చేసుకొని బయటికి వచ్చాము. స్వామికి అలంకరణ చేసి పదకొండున్నరకు పూజా జరిపారు. గంట పట్టింది. ఈలోపు ఒక కుటుంబం చక్కగా భక్తిగీతాలు పాడుతున్నారు. అందులో ఒక అమ్మాయి చాలా శ్రావ్యమైన గొంతుతో పాడి రసానుభూతి కలిగించింది. బాలాజీ

స్వామికి వైభోగం బాగా ఉంది. కనీసం ఎనిమిదిమంది పూజారులు, ప్రసాదాలు చేసేవారు ఉన్నారు. పెద్ద ఎస్టాబ్లిష్ మెంటే. జూన్ నెల చివర్లో బ్రహ్మోత్సవాలు నిర్వహించారు. ప్రసాదాలు తయారు చేసి పాకెట్లలో విక్రయిస్తారు. మా అల్లుడి మేనత్త భర్త చీమల కొండ దుర్గా ప్రసాద రావు గారు రిటైర్ అయాక స్వామి సేవలో వారానికి నాలుగు రోజులు సోమవారం నుండి శుక్ర వారం వరకు ఉదయం తొమ్మిది నుండి మధ్యాహ్నం ఒంటి గంట వరకు పని చేస్తారు. మేనత్త కూడా వాలంటీర్ చేస్తారు. ఆయనకు సుమారుడెబ్భై రెండు, ఆవిడకు అరవై ఎనిమిది ఏళ్ళు ఉంటాయి. జీవితాన్ని ధన్యవంతం చేసుకొంటున్నారు స్వామి సేవలో. స్వంత ఇల్లు ఉంది. పిల్లలకు రెక్కలొచ్చి వెళ్లారు. ఇద్దరే ఉంటున్నారు. అమెరికా వచ్చి సుమారు యాభై ఏళ్ళు, రాలీ వచ్చి పదహారేళ్ళు. పూజ తర్వాత తీర్ధ ప్రసాద వినియోగం. ఈలోపు మా అమ్మాయి, పిల్లలు ఇంటి నుంచి వచ్చారు. ఇంటికి చేరే సరికి మధ్యాహ్నం ఒకటి దాటింది. మాకు మేడ మీద గదుల్లో వసతి కల్పించారు. సాయంత్రం వేమనపై ఆర్టికల్ వీళ్ళ కంప్యుటర్ నుంచే రాశాను.

రాత్రి వాళ్ళు, మేము అందరం కలిసి "ఉడిపి హోటల్"కు వెళ్ళాం. ఆది అనంతపురానికి చెందిన రెడ్డి గారిది. ఆయనా వచ్చాడు కాసేపు మాట్లాడాం. మేము పూరీ, పిల్లలు మషాలా దోసె, చానా పూరీ ఎవరికి కావాల్సింది వాళ్ళు తిన్నాం. మాంగో లస్సీ తాగాం. ఇంటికి చేరేసరికి రాత్రి పదిన్నర అయింది. హాయిగా నిద్ర పోయాం.

ఇప్పుడు "రాలీ" గురించి కొన్ని విశేషాలు– నార్త్ కేరోలీనా రాష్ట్రానికి రాలీ రాజధాని. రాష్ట్రంలో రెండవ పెద్ద నగరం. మొదటిది మేముంటున్న షార్లెట్. రాలీలో "ఓక్" చెట్లు విపరీతం. అందుకని దీన్ని "సిటీ ఆఫ్ వోక్సు" అని ముద్దుగా పిలుస్తారు. సర్ వాల్టర్ రాలీ అనే అయన పేరు మీదుగా ఈ పట్టణం ఏర్పడింది. ఇది టెక్నికల్ హబ్. రాలీ, దర్హాం, చాపెల్ అనే మూడు పట్టణాలు దగ్గర దగ్గర మూడు త్రిభుజ కోణాల్లా ఉంటాయి. దీనినే "three primary cities of research triangle" అంటారు. 1959లో రిసెర్చ్ ట్రైనింగ్ పార్కు ఏర్పడినప్పటి నుంచి ఈ ట్రయాంగిల్ అనే పేరు వచ్చింది. ఇక్కడ నార్త్ కెరొలినా స్టేట్ వర్సిటి, డ్యూక్ వర్సిటి, యూనివర్సిటి ఆఫ్ నార్త్ కెరొలినా –చాపెల్ హిల్స్ అనే మూడు ప్రసిద్ధ విశ్వ విద్యాలయాలున్నాయి. అమెరికా ఏడవ ప్రెసిడెంటు అయిన "ఆంద్రు జాన్సన్" రాలీలోని "కాస్సో"లో జన్మించాడు. జీవన నాణ్యత విషయంలోను, వ్యాపార దృష్ట్యా అమెరికా నగరాలలో టాప్ టెన్ నగరాలలో రాలీ ఒకటి. ఇక్కడి రాలీ మెమోరియల్ మ్యూజియం చాలా ప్రసిద్ధి చెందింది. ఇది ఈశాన్య ప్రదేశంలో ఉన్న నగరం. ఇక్కడికి అట్లాంటిక్ సముద్రం నూట ఎనభై మైళ్ళ దూరంలో ఉంది. ఇక్కడి కేరోలీనా హరికేన్సు అనే హాకీ జట్టు బాగా ప్రసిద్ధమైంది.

మన తెలుగువాళ్ళు ఎక్కువగా కనిపిస్తారు. దేవాలయాలున్న ప్రాంతాన్ని "కారీ" అంటారు. షార్లెట్‌కు రాలీ రెండు వందలమైళ్ళ దూరం. సుమారు మూడు గంటలు ప్రయాణం.

## ఆష్ విల్

ఆదివారం ఉదయం ఐదింటికే అందరం లేచి స్నాదికాలు పూర్తి చేసుకొని కాఫీలు తాగాం. మా ఇద్దరికీ రాలీ దంపతులు బట్టలు పెట్టారు. ఉదయం ఆరుమ్బావుకు కార్‌లో మేము సోమా మౌంట్‌లో ఉన్న శ్రీ ఉమా సోమశేఖర స్వామి దర్శనానికి బయ ల్దేరాం. రెండు గంటలు ప్రయాణం చేసి ఒకచోట ఆగి మాక్ డో నాల్డ్‌లో రొట్టె తిని కాఫీ త్రాగాం. మళ్ళీ బయల్దేరి రెండుగంటలు ప్రయాణం చేసి "ఆష్ విల్" చేరాం. ఈ పేరు నాకు తమాషాగా ఉంది. "బూడిద పల్లె" అవుతుంది అనువాదం చేస్తే. ఇక్కడే "ఆష్ వర్త్" కూడా ఉండి. దీన్ని తెలుగులోకి మారిస్తే "బూడిద భోగం" అనచ్చు. "శ్వన్న నోవా" అనే నది ఉంది. దీన్ని "సువర్ణ ముఖి" అని సుమారుగా అనచ్చు. పెద్ద పెద్ద కొండలు బ్లూ మౌంటేన్ రిడ్జిలో శ్వన్న నోవా, ఫ్రెంచ్ బ్రాడ్ రివర్‌ల సంగమ స్థానంలో ఈ పట్టణం ఉంది. ఆష్ విల్ పూర్వం "చెరోకీ నేషన్"లో ఉండేది. అమెరికాలో 25 "art desti nations"లో ఆష్ విల్ ఒకటి అదీ ఇక్కడి విశేషం. దీన్ని "happiest city of women" అంటారు. దీనికే "new age mecca" అని కూడా పేరు. అంతేనా "eye of america" అంటే అమెరికా "చక్షువు" (కన్ను) అన్న మాట. "best out side town" అనీ పేరు తెచ్చుకొన్నది ఆష్ విల్. చుట్టూ ప్రకృతి దృశ్యాలు అందాల విందులే చేస్తాయి. ముగ్ధ మనోహర ప్రకృతి మానసికానందాన్ని ఇచ్చి మరో లోకపు అనుభూతినిస్తుంది. అందాల హరివిల్లు ఆష్ విల్. ఇక్కడి "బ్లూ రిడ్జి పార్క్ వే" తరగని సౌందర్యపు గని. ఇవన్నీ చూసుకొంటూ ఇంకోగంట ప్రయాణం చేసి ఉదయం పదకొండున్నరకు మౌంట్ సోమా చేరాం.

## మౌంట్ సోమా-ఉమా సోమశేఖర స్వామి దర్శనం

కొండలు లోయలు దాటుకొంటూ, ఎత్తైన వృక్షాల సౌందర్య దర్శనం చేస్తూ, దాదాపు ఊటీ లాగా, కోడై కెనాల్‌లాగా ఉన్న ప్రకృతి సౌందర్యాన్ని వీక్షిస్తూ ఇరుకు దారిలో జాగ్రత్తగా కారు నడుపు కొంటూ మొత్తం మీద ఎత్తైన మౌంట్ సోమా అంటే సోమా పర్వతం చేరాం. చుట్టూ లోయలు వృక్షాలతో నిండిన ఎత్తు కొండలు, మబ్బులు తాకే అగ్రాలు, లోయల్లో జారి పడుతున్న మబ్బులు భలే అందమైన ప్రకృతి సౌందర్యం మధ్య ఈ పర్వతం ఉంది. ఎత్తు మీద ఉమా సోమశేఖర స్వామి దేవాలయం ఉంది. సుమారు ఇరవై మెట్లు ఎక్కి వెళ్లి దర్శించాలి. లోపల లింగం సోమనాథ్ దేవాలయ

లింగంలా భాసించింది. పూజారి గారు విజయవాడకు చెందిన గార్లపాటి ప్రసాదావధాని గారు. చాలా శాస్త్రోక్తంగా అభిషేకం నిర్వహించటం ప్రారంభించారు. నేనూ వారితో స్వరం కలిపి నమక, చమకాలు, పురుష సూక్తం, శ్రీ సూక్తం, దశ శాంతులు, పట్టాభిషేకం అష్టోత్తరం చివరికి మంత్ర పుష్పం పూర్తి చేశాం. స్వామికి అలంకారం బాగా చేశారు ప్రసాద్ గారు. అపర కైలాసంగా, ఆర సోమనాథ్‌లా మహత్తరంగా ఉంది. నిన్నా ఇవాళ కూడా స్వాముల అభిషేకం సమయంలో రావటం పూర్వజన్మ సుకృతం అనిపించింది. మనస్సు ఎంతో ప్రశాంతమైంది. ఎందుకో నేల రోజులుగా తెలీని చిరాకు మనసును కల్లోల పరుస్తోంది. ఈ శివ దర్శనాలతో కొత్త శాంతి లభించింది. కమ్మగా కన్నుల పండువుగా స్వాముల దివ్య దర్శనానుభవం పొంది ఎంతో సంతృప్తి చెందాం. తీర్థం, ప్రసాదంగా మైసూర్ పాక్ అందరికి పెట్టారు. ఈ ఆలయాన్ని కట్టించిన వారు బ్రహ్మర్షి మహేశానంద అనే అమెరికన్ స్వామి. ఆలయం కట్టి ఏడాది మాత్రమే అయింది. పూజారి వచ్చీ ఏడాదే అయింది. ప్రక్కన యాగశాల ఉంది. పూజారి దంపతులకు ప్రక్కనే ఉన్న మూడంతస్తుల భవనంలో కిందభాగం ఇచ్చారు. స్వామీజీ ఇక్కడే ఉంటారట. ఆయనకు అనేక మంది శిష్యులు. అందరు ఎంతో శ్రద్ధగా ఇక్కడి పనులను చేస్తుంటారు. ఆలయానికి ఇంకా ధ్వజస్తంభం యేర్పడ లేదు. ఇంకా అభివృద్ధిలోకి రావాలి. భక్తులు అత్యంత భక్తీ విశ్వాసాలతో స్వామిని కొలుస్తున్నట్లు కనిపిస్తోంది. ఆలయం చాల చిన్నదే. ఈ రోజు భక్తులతో ఆలయం కిటకిట లాడింది. మెట్లు దిగి కిందకు భోజనశాలకు వచ్చాం. అప్పుడే వర్షం ప్రారంభమైంది. అద్భుతంగా అనిపించింది ఆ వర్షంలో. ఆ అందాల సీమ మరింత అందాలను సంతరించుకొన్నది. లోయల్లో మబ్బులు దోబూచు లాడుతున్నాయి. ఫోటోలు తీసుకొన్నాం. ఆశ్రమం వారే పది డాలర్లకు భోజనం ఏర్పాటు చేశారు. ఆది లేకపోతే ఇక్కడ ఏమీ దొరకదు. భోజనంలో చపాతి, పులిహోర, పప్పు, మజ్జిగ పులుసు, అన్నం ఏర్పాటు చేశారు. అన్నీ బాగానే రుచిగా ఉన్నాయి అందరం కమ్మగా తిన్నాం. శివుడికి ఎదురుగా కొండ మీద పాలరాతి పెద్ద నందీశ్వరుడు చూపులకు అద్భుతం అనిపిస్తాడు. భోజనశాల దగ్గర చిన్న శివలింగం దానిపై అభిషేక పాత్ర వేలడ దీశారు. వర్షపు నీరు పాత్రలో పడి శివునికి అభిషేక చేస్తున్నట్లు ఉంటుంది. ప్రక్కనుంచి కారే నీటిని గోలుసులకు వ్రేలాడే పాత్రలను ఒక దానికింద ఒకటి ఉండేట్లు చేశారు. అందులో పై నుండి కిందకి పాత్రలలో పడుతూ భలేగా కనిపిస్తుంది. శివుడికి ఎదురుగా చిన్న నందీశ్వరుడు వర్షపు నీటితో హర్షాన్ని పొందుతున్నట్లు ఉంటాడు. గొప్ప ఆలోచనా, దాని అమలు చేసిన తీరు బ్రహ్మానందాన్నిస్తుంది. అందరు తప్పక సందర్శించి తరించాల్సిన క్షేత్రం మౌంట్ సోమా. అమెరికాలో అద్భుతం. అపర కేదార నాథ్ అనీ అనిపిస్తుంది. ఇంత

గొప్ప దివ్య ధామాన్ని సందర్శించిన మా జన్మ ధన్యం.

భోజనం తర్వాత మధ్యాహ్నం రెండు గంటలకు కారులో బయల్దేరి మళ్ళీ అందాలన్నీ చూసుకొంటూ, ఆ అందాలను ఆరవేసుకొన్న ప్రకృతి సౌందర్యాన్ని తలచుకొంటూ, అనుభవిస్తు నాన్‌స్టాప్‌గా మూడు గంటలు ప్రయాణం చేసి సాయంత్రం అయిదు గంటలకు ఇంటికి చేరాం. యాత్ర సంపూర్ణం. రాలీ నుంచి సోమా మౌంట్ సుమారు నాలుగు వందల యాభై మైళ్లకు తక్కువ ఉండదు. సోమా నుంచి షార్లెట్ సుమారు మూడు వందల యాభై మైళ్ళు ఉంటుంది. మొత్తం మీద రాను పోను వెయ్యి మైళ్ళు అంటే పది హేను వందల కిలో మీటర్లు. దాదాపు పదకొండు గంటల డ్రైవింగ్.

అమెరికా డైరీ-**34**

## "ఫర్" వ్యాపారం

పది హేడవ శతాబ్దం నుంచి ఇతర దేశస్తులకు అమెరికా మీద వ్యామోహం ఎందుకు కలిగింది అంటే ఇక్కడ ఫర్ చర్మాలు విపరీతంగా లభిస్తాయని, వాటిని వ్యాపారం చేసి కోట్లు సంపాదించవచ్చు అనే ఆశ. ఇంతకీ ఫర్‌అంటే ఏమిటి? అదొక జంతువు చర్మం. ఆ జంతువు పేరు "బీవర్". ఫ్రెంచి, డచ్ వాళ్ళు క్యూబెక్, మాన్ హట్టన్‌లకు కొద్ది సంఖ్యలో1606-1626 కాలంలో వచ్చారు. అప్పటికి వారికీ వాణిజ్య పంటలేమీ కనిపించలేదు. వారి ద్రుష్టి "ఫర్"ల మీద పడింది. దీనితో వ్యాపారం చేసి, లాభాలు గడించవచ్చునను కొన్నారు. డచ్ వాళ్ళు వాటి చర్మాలతో టోపీలు, కోట్లు తయారు చేసి యూరప్‌లో అమ్మితే "డబ్బు టు ది పవర్ ఆఫ్ డబ్బు" అని గ్రహించారు. నెమ్మదిగా అందరు చేరారు. ఫ్రెంచి వారు ఇక్కడి ఉన్నత కుటుంబాల మగవారు ఫర్ కాప్ లను, ఆడవారు ఫర్ కోటును ధరించే సదుపాయం చేశారు. అంటే వారు దీన్ని స్థానికంగా నేవినియోగించాలని భావించారు. 1640లో అధికంగా శిఖరాగ్రానికి ఫర్ వ్యాపారం చేరింది. అప్పుడు ఫ్రెంచ్ ప్రభుత్వం న్యు ఇంగ్లాండ్ అనే అమెరికా నుంచి ఫర్ లను దిగుమతికి అనుమతించింది. దీనితో బీవర్ల సంఖ్య క్రమంగా తగ్గిపోయి వ్యాపారం మందగించింది. ఈ జంతువులూ ఎక్కువగా కెనడియన్ కాలనీల దగ్గర సెయింట్ లూయిస్ నది సమీపంలో ఉండేవి. అక్కడే వాటిని వలపన్ని పట్టుకొనే వారు. ఎప్పుడైతే ఇక్కడ బీవర్‌ల సంఖ్య తగ్గిందో అప్పుడు ఫ్రెంచ్‌వాళ్ళు ఒంటారియా సరస్సు వైపుకు, ఆ తర్వాతా సుపీరియర్ సరస్సు వైపుకు కదిలి వెళ్లారు. డచ్ వాళ్ళు మాత్రం మాన్ హట్టన్, అల్బనిలలో ఉండిపోయారు. మాన్ హట్టన్‌ను వాళ్ళు "న్యూ ఆమ్ స్టర్ డాం" అనీ, ఆల్బని ని "ఫోర్ట్ ఆరంజి" అని పిలిచారు. 1680లో బీవర్ మార్కెట్ దెబ్బతింది. 1700 నాటికి గ్రేట్ లేక్స్ వద్ద ఉన్న బీవర్‌లన్నీ పట్టుబడి, ఖాళీ అయిపోయాయి.

వ్యాపారం మందగించింది. మళ్ళీ ఈ వ్యాపారం 18వ శతాబ్దం వచ్చేసరికి ఊపు అందుకోంది. వీటిని పట్టుకోవటానికి నేటివ్ అమెరికన్లు సాయం చేసేవారు. ఒకప్పుడు 60 మిలియన్లు ఉండే బీవార్లు ఇప్పుడు కేవలం 15 మిలియన్లు మాత్రమే ఉన్నాయి అంటే సిగ్గుపడాలి.

ఉత్తర అమెరికా స్వాతంత్రాన్ని పొంది బ్రిటన్ నుండి వేరు పడిపోయింది. అప్పుడు అమెరికన్లు మళ్ళీ బీవర్ల వేట కోన సాగించారు. రాకీ పర్వతాల దాకా వెళ్లి వీటిని పట్టుకోవటం ప్రారంభించారు. దానితో 1850 నాటికి మళ్ళీ బీవర్ల సంఖ్య తగ్గి వ్యాపారం కుదేలయింది. ఇది శాస్త్రవేత్తల దృష్టిలో పడింది. బీవర్ జంతువులను సంరక్షించుకోవాలనే తలంపు బలీనమైంది. అదృష్టవశాత్తు బీవర్ జంతువులూ ఇరవైవ శతాబ్దం నాటికి గణనీయంగా అభివృద్ధి చెందాయి. కెనడా, అమెరికాలలో వీటి రక్షించే మార్గాలను విస్తృతంగా అమలు చేశారు. దీనితో పదిహేడవ శతాబ్దం నాటికి యూరోపియన్లు అమెరికాకు రాకముందు ఎంత బీవర్ సంతతి ఉందో, ఇప్పుడు కూడా అంతకంటే ఎక్కువ సంఖ్యలో బీవర్లు ఉండటం ప్రకృతిలో ఒక గొప్ప ప్రయోగాత్మక ఫలితం "లాంగ్ లివ్ బీవర్".

## మరిన్ని అమెరికా ఊసులు

రాబర్ట్ డిల సాల్వే అనే అనే అన్వేషకుడు ఫ్రాన్సు నుండి కెనడాకు గ్రేట్ లేక్స్‌ను అన్వేషించాలని వచ్చాడు. ఇక్కడి ఇండియన్ అమెరికన్లతో స్నేహం చేశాడు. వారున్నచోట్ల చాలా ఫ్రెంచి కోటలను నిర్మించాడు. అయితే ఆయన్ను మిసిసిపి నదిని చూసిన వాది గానే భావిస్తారు కాని అతని ఉద్దేశ్యం మిసిసిపి నది ఒడ్డున ఫ్రెంచి కాలని ఎర్పరచాలన్నదే ఆయన ధ్యేయం. ఒంటారియా సరస్సునుకు ఇండియన్లు అందమైన సరస్సు అని వాళ్ళ భాషలో అర్ధం చెబుతారు. ఆ రోజుల్లో ఇక్కడి ఇండియన్ అమెరికన్లకు అయిదు రాజ్యాలున్నాయి. అవి mohawk, oneida, onandaga, cayuga. వీరందరి సంస్కృతి ఒకటే. ఒకే భాష మాట్లాడుతారు. వీరు విపరీతమైన పోరాట పటిమ కలవారు. వీరెప్పుడూ యుద్ధాలలో జయం పొందిన వాళ్ళే. ఈ అయిదు రాజ్యాలు డచ్ వారితో చేతులు కలిపారు. వీరికి ఫ్రెంచ్, కెనడా వారంటే విపరీతమైన ద్వేషం. దీనికి కారణం 1690లో సామ్యుఎల్ డీ చామ్ప్లాన్ తమతో యుద్ధం చేసి "న్యు ఫ్రాన్స్" ఎర్పరచాడని కోపం. 1660 నాటికి ఫ్రెంచి వారికి వీరే దిక్కు అయారు. బ్రిటీష వారిని ఎదిరించటానికి వీరు వారికి తోడ్పడ్డారు.

మిసిసిపి నదిని ఇండియన్లు "ఫాదర్ ఆఫ్ వాటర్స్" అంటారు వారి భాషలో. ఫ్రెంచి వారు మిస్సోరి నదిలోని ఒంఢ్రు నీటిని మొదటిసారిగా చూశారట. అలాగే ఒహాయో నదిలోని నీటిలో ఒంఢ్రుమన్ను ఉండటం గమనించారు. జోలిఎట్ అనే

యాత్రికుడు ఒంటారియా సరస్సును అన్వేషించే పనిలో ఉండగా మాంట్రియల్ మరియు గ్రేట్ లేక్స్ల మధ్య గమ్యానికి ఎనిమిది మైళ్ళ దూరంలో ఓడ తలక్రిందులై అతను అప్పటిదాకా రాసి పెట్టుకొన్న విలువైన సమాచారం అంతా సెయింట్ లారెంసు నది నీటిలో కలిసి పోయింది పాపం. మిసిసిపి నది మీదుగా ప్రయాణించిన మొదటి యాత్రికుడు లా సాల్. అయితే అతని అహంభా వత్వం మోసం చూసి తోటి నావికులు భరించలేక 1687లో ఈనాటి టెక్సాస్లోని నవ సోటా వద్ద హత్య చేసి శరీరాన్ని నక్కల పాలు చేశారు. 1697-99 మధ్య కాలంలో పద్నాలుగవ లూయీ అనే ఫ్రాన్సు రాజు ఫ్రెంచ్ సోల్జర్ "pierre le moyne d' iberville"ని కమాండర్గా చేసి మిసిసిపి నది ముఖ ద్వారంలో ఒక ఫ్రెంచ్ కాలనిని ఏర్పాటు చేయవలసిందిగా ఆదేశించాడు. అతను బిక్సొలి వద్ద లూసియానాలో మొదటి ఫ్రెంచి కాలనిని ఏర్పాటుచేసి రాజు గారి కోరిక తీర్చి ప్రభు భక్తి చాటుకొన్నాడు.

(5-8-12-కాంప్-అమెరికా)

## అమెరికా డైరీ-**35**

### శ్రీ సత్యనారాయణ స్వామి వ్రత వారం

సెప్టెంబర్ మూడు సోమవారం నుండి తొమ్మిది ఆదివారం వరకు విశేషాలు-

సెప్టెంబర్ మూడు అమెరికాలో "లేబర్ హాలిడే". అన్నిటికి సెలవే. అంతకు ముందు శని ఆదివారాలతో కలిసి సోమ వారం కూడా సెలవు అవటంతో దీన్ని "లాంగ్ వీకెండ్" అంటారు. శుక్రవారం మధ్యాహ్నం నుంచే ఎక్కడికో అక్కడికి కుటుంబంతో సెలవులకు వెళ్లి హాయిగా గడిపి వస్తారు. మంగళవారం కోసూరు ఆదినారాయణ గారికి ఫోన్ చేశాను. వాళ్ళ కోడలికి ఒంట్లో బాగా లేదని ఆ కంగారులో ఉన్నామని చెప్పారు. అప్పుడే మైనేని గారికీ ఫోన్ చేశాను. ఆయన అందుబాటులో లేరు. గురువారం రాత్రి ఆదినారాయణ గారికి మళ్ళీ ఫోన్చేసి ఆయన కోడలి ఆరోగ్యం సంగతి వాకబు చేశాను. ఇప్పుడు బానే ఉందని, టెన్షన్ తగ్గిందని, సెప్టెంబర్ ఇరవై మూడున ఇండియా ప్రయాణం అనీ చెప్పారు. సంతోషించాము. శుక్రవారం రాత్రి మా ఇంట్లో భజన. రాత్రి ఎనిమిదింటికి ప్రారంభమై ఒక గంట జరిగింది. సుమారు పదిహేను మందే వచ్చారు. వచ్చిన వారిలో శ్రీ వల్లం నరసింహా రావు దంపతులున్నారు. ఆవిడను చూస్తే ఉయ్యూరులో నా దగ్గర చదువుకొన్న భాగ్యలక్ష్మి గుర్తుకు వస్తుంది. మంచి నవ్వు ముఖం, వర్చస్సు గోచరిస్తుంది. ఆ దంపతులకు సరసభారతి ప్రచురించిన "మా అక్కయ్య" కవితా సంకలనాన్ని కానుకగా ఇచ్చాను. చాలా సంతోషించారు.

గబ్బిట దుర్గాప్రసాద్

## శ్రీ సత్య నారాయణ వ్రతం

అమెరికాకు వచ్చిన కొత్తలోనే మా అమ్మాయి విజ్జి స్నేహితురాలు ప్రియా అనే అమ్మాయి తాము స్వంత ఇల్లు కొనుక్కున్నామని గృహప్రవేశానికి ముహూర్తం పెట్టమని ఇంటికి వచ్చి అడిగింది. అయితే ఇల్లు స్వాధీనం కావటానికి ఇంకా కొంత కాలం పడుతుందని చెప్పింది. నేను వైశాఖ మాసంలో ఒక ముహూర్తం పెట్టి పాలు పొంగించమని చెప్పాను. ఆ ప్రకారమే పొంగించి, ఇల్లు స్వాదీనం అయిన తర్వాత అందులో చేరారు. చేరిన తర్వాత నన్ను సత్య నారాయణ వ్రతం చేయిస్తారా అని అడిగింది. ఎవ్వరూ లేకపోతే చెప్పు చేయిస్తాను అన్నాను. ఒక ఇరవై రోజుల క్రితం వచ్చి సెప్టెంబర్ ఎనిమిది శనివారం వ్రతం చేయించమని కోరింది. ఏమేమి వస్తువులు కావాలో లిస్టు రాయించుకు వెళ్ళింది. ఈ శనివారం ఆమె భర్త వెంకట్ వచ్చి నన్ను, మా శ్రీమతిని కార్‌లో వాళ్ళ ఇంటికి తీసుకొని వెళ్లాడు అతనిది నెల్లూరు దగ్గర కావలి. ఆమెది గుంటూరు దగ్గర రేపల్లె. మంచిగా మర్యాదగా మాట్లాడాడు. ఇంటికి చేరే సరికి తొమ్మిదిన్నర అయింది.

ముఖ్య ద్వారం వద్ద, వంటింట్లో, పైన మేడ మీద దంపతులతో కొబ్బరికాయలు కొట్టించి, నవధాన్యాలను చల్లించాను. సరిగ్గా పది గంటలకు శ్రీ సత్యనారాయణ వ్రతం ప్రారంభించాం. అన్నీ శాస్త్రోక్తంగా యధావిధిగా చేయించా. దంపతులిద్దరూ ఎంతో శ్రద్ధాశక్తులతో భక్తితో కూర్చుని చేశారు. సుమారు రెండున్నర గంటలు పట్టింది. వెంకట్ స్నేహితుడు అతనితో "ఎప్పుడో పెళ్లినాడు చేసుకోన్నావు వ్రతం. మళ్ళీ ఇప్పుడే" అన్నాడు. దానికి వెంకట్ "ఆ వ్రతం కంటే ఈ వ్రతాన్ని అంకుల్ చాలా బాగా చేయిస్తున్నారు" అని ఆనందించాడు. అందరు చిన్నా, పెద్ద చాలా బాగా చేయించానని ఎంతో సంతృప్తిని, ఆనందాన్ని వ్యక్తం చేశారు. వాళ్ళ కళ్ళలో ఎంతో సంతోషం వ్యక్తం అయింది. స్వామి అనుగ్రహం, సరస్వతిమాత కటాక్షమే ఇది. ఇండియా నుంచి ప్రత్యేకమైన చాలా ఖరీదైన పట్టు పంచె, పట్టు చొక్కా గుడ్డ తెప్పించి తాంబూలంలో నాకు నూట పదహారు డాలర్లు పెట్టి తమ సంతోషాన్ని వ్యక్తం చేశారు ప్రియా దంపతులు. ఇంకెవరికి బట్టలు పెట్టలేదు. వారి మనసులో యే మంచి గొప్ప భావం ఉందో తెలీదు. మా శ్రీ తికి తాంబూలంలో వంద డాలర్లు పెట్టి "ఆంటీ పట్టు చీరే కొనుక్కోండి" అని ఎంతో ఆప్యాయంగా ప్రియ చెప్పింది. తమ తల్లిదండ్రుల్ని మాలో చూసుకోన్నారేమో అనిపించింది. లేకపోతే ఇంత అభిమానం చూపించాల్సిన అవసరం లేదు. వాళ్ళేదో ఇస్తారనే ఆశతో వ్రతం చేయించలేదు. మా అమ్మాయి మాట చెల్లించాను అంతే .మా అమ్మాయికి, వాళ్ళ అమ్మకు చిన్న ఖరీదైన వెండి "శ్రీ సత్యనారాయణ స్వామి విగ్రహాలు" బహూక రించింది. ప్రియా వాళ్ళ అన్నా వదినే కుటుంబం లూ విల్ నుండి వచ్చారు.

అన్న ఇండియా వెళ్లినప్పుడు విగ్రహాలు, పట్టు బట్టలు తెప్పించిందట. మొత్తం మీద అందరికి వ్రత విధానం నచ్చి సంతోషం తృప్తి కనపరచారు. ఉదయం టిఫిన్ కాఫీ అందరికి ఇచ్చారు. ఆ తర్వాత పూర్ణాలు, లడ్డు, జిలేబి, చక్రపొంగలి, స్వీట్లు, నాలుగు హాట్లు, పప్పు, కూరలు, చపాతీ, పులిహోర, అన్నం, పెరుగుతో విందు. మేమిద్దరం రెండు స్వీట్లు, పెరుగు అన్నం మాత్రమే తిన్నాం. పొద్దున్న టిఫిన్ కూడా ఇంటి దగ్గరే చేసి వచ్చాం. మా ఇద్దరికీ ఎంతో భక్తిగా నమస్కారం చేసి ప్రియా దంపతులు నిండు ఆశీర్వాదాలు పొందారు. వాళ్లకు ఇద్దరు ఆడ పిల్లలు. వ్రతానికి సుమారు అరవై మంది వచ్చి ఆశీర్వదించి భోజనం చేసి వెళ్లారు.

## పిల్లల పిక్నిక్

ప్రియా వాళ్ళ ఇంటి నుంచి మమ్మల్నిద్దర్ని మా అమ్మాయి పిక్ అప్ చేసుకొని ఇంటికి తీసుకొని వచ్చింది. ఆ తర్వాత నేను మా అమ్మాయి యార్క్ రోడ్‌లో ఉన్న మక్. డోవేల్ వారి "nature preserve" దగ్గర సాయి సెంటర్ వాళ్ళు పిల్లలకు ఏర్పాటు చేసిన పిక్నిక్ స్థలానికి వెళ్ళాం. మా మనవళ్ళను పొద్దున్నే అక్కడ దింపి, ఆ తర్వాత ప్రియా వాళ్ళింటికి వచ్చింది మా అమ్మాయి. మేం వెళ్ళేసరికే పిక్నిక్ దాదాపు అయిపోయింది. పెద్దవాళ్ళ మీటింగ్ జరుగుతోంది. ఒక గంట అక్కడ గడిపాం. ప్రక్కనే "వైలీ లేక్" ఉంది. పిక్నిక్‌కు చాలా మంది వచ్చే ప్రదేశం. దట్టమైన చెట్లు అందమైన సరోవరం అందులో బోటు షికారుకు వీలు ఉండటంతో జనం బాగా వస్తారు. ఈ లేక్ ఒడ్డునే ఎక్కడో చాలా దూరంలో అణుకర్మాగారం ఉందట. ఇంటికి వచ్చేసరికి సాయంత్రం ఆరు అయింది. మా అల్లుడు వారానికి రెండు రోజులు నిర్వహించే "వీక్లీ రీడింగ్" క్లాసులు ప్రారంభించాడు. ఆది వారం కొత్త విషయాలేమీ లేవు.

ఈ వారంలో చాలా మంచి పుస్తకాలే చదివాను. political corruption, global warming, emily bronte, the jungle, pat conroy, climate confusion, humorists, dublin వగైరా పుస్తకాలు చాలా బాగున్నాయి.

(10-9-12-కాంప్-అమెరికా)

## మొదటి విమానం మనమే తయారు చేశాం

### నేపథ్యం

భారద్వాజ మహర్షి విమాన శాస్త్రాన్ని రాశాడు అని అందరు చెప్పిన విషయమే. మనకు ఇద్దరు ముగ్గురు భారద్వా జులున్నారు. సప్తరుషులలో ఒక భరద్వాజుడున్నాడు. అత్రి, వసిష్ఠ, విశ్వామిత్ర, గౌతమ, జమదగ్ని , అగస్త్య భరద్వాజ వారి పేర్లు. ఋగ్వేదం ఆరో మండలం అంతా భారద్వాజునిదే. అందులో 75 మంత్రాలున్నాయి. చక్రవర్తి

భరతుని సమకాలికుడు. రామాయణ కాలంలో ఉన్న భరద్వాజుడు బృహస్పతి మహర్షి కుమారుడు. ఈయనకు ప్రయాగలో ఒక ఆశ్రమం ఉండేది. ఇప్పటికి అక్కడ ఉంది. శ్రీ రాముడికి, భరతుడికి గొప్ప విందు నిచ్చిన వాడు ఈయనే. ఇందులో యే భరద్వాజుడు రాశాడో కాని వైమానిక. శాస్త్రం ఆయన పేర లోకంలో ఉంది. ఇదే ప్రపంచంలోని విమాన యానానికి దారి చూపింది అని అందరి నమ్మకం.

## డాక్టర్ కొలచల సీతా రామయ్య ఉవాచ

కృష్ణాజిల్లా ఉయ్యూరుకు చెందిన కొలచల సీతా రామయ్య గారు చిన్నప్పుడే రష్యా వెళ్లి అక్కడి ఆయిల్ శాస్త్రాన్ని అధ్యయనం చేసి డాక్టరేట్‌ను సంపాదించారు. అక్కడి రష్యా అమ్మాయినే వివాహం చేసుకొని స్థిరపడి పోయారు. ఆయన్ను గురించి మా చిన్నప్పుడు కథలు గాధలుగా చెప్పుకొనేవారు. చాలా కాలానికి ఆయన మాతృదేశం భారత దేశానికి వచ్చారు. అప్పుడు ఉయ్యూరులోని ప్రజలందరూ వారికి బ్రహ్మ రథం పట్టారు. పౌర సన్మానం చేశారు. చాలా సాదా సీదాగా ఉండే వారాయన. మంచి తెలుగులో మాట్లాడారు. ఆయన దగ్గరి బంధువు మా ఇంటికి ఎదురుగా ఉండే వంగల కృష్ణ దత్త శర్మ గారింట్లో ఉన్నారు. అక్కడ వారిని మేమందరం కలిసే వాళ్ళం. ఆయనతో మాట్లాడే వాళ్ళం. భేషజం లేకుండా మాట్లాడే వారు. ఏదైనా ప్రశ్నిస్తే చాలా వివరంగా సమాధానం చెప్పే వారు. ఆయనతో జరిగిన సంభాషణల్లో "విమాన శాస్త్రం" గురించి వచ్చింది. అప్పుడు ఆయన విమాన శాస్త్రాన్ని భరద్వాజ మహర్షి రచించాడని, దాన్ని జెర్మనీ వారు తీసుకొని వెళ్లి, మన సంస్కృత పండితులతో అర్థం చెప్పించుకొని వివరాలన్నీ సేకరించి జర్మన్ భాషలోకి అనువదింప జేసుకోన్నారని చెప్పారు. తాను రష్యాలో ఉన్నాను కనుక పబ్లిక్‌గా ఈ విషయాలు చెప్పరాదనీ ఇది అంత రంగిక సమావేశం కనుక చెప్పానని నవ్వుతూ చెప్పారు. నేను ఆ సమావేశంలో ఉన్నాను, విన్నాను. కానీ మన దేశీయు లెవ్వరు ఆ శాస్త్రాన్ని పట్టించుకోలేదని, దానిపై రిసెర్చ్ చేసే సదుపాయాలూ కూడా మన దేశంలో లేక పోవటం బాధాకరమనీ చెప్పారు. ఇదీ విమాన శాస్త్రానికి నేపథ్యం. అంటే "థీరీ" అంతా మనదే. practicals మాత్రం ఇతర ఆదేశాల వారివి అని తెలుస్తోంది. కానీ ఇదీ నిజం కాదు అని అన్నిటిలోనూ మనమే ముందున్నాము అని ఆ తర్వాత తెలిసింది.

## వైమానిక శాస్త్రం

భారద్వాజ మహర్షి రాసిన "వైమానిక శాస్త్రం" మాత్రమే ఇవాల్టి "airo dyanamics"కు ఆధారం. 1860-1940లో ఉన్న జి.ఆర్.సుబ్బరామ శాస్త్రి వైమానిక శాస్త్రాన్ని సంస్కృతంలో రాశాడని తెలుస్తోంది. ఆయన చెప్పిన దాని ప్రకారం భరద్వాజ మహర్షి ఆయనకు ఆ శాస్త్రాన్ని స్వయంగా చెప్పాడని, దాన్ని ఆయన రాశాడని తెలుస్తోంది.

1918-23 కాలంలో డిక్టేట్ చేస్తే రాసి నట్లు కనబడుతోంది. దీనిలో 3000 శ్లోకాలు, ఎనిమిది అధ్యాయాలు ఉన్నాయి. దీన్ని 1959లో హిందీలోకి అనువాదం చేశారు. 1973లో ఇంగ్లీష్‌లోకి అనువాదం పొందింది. ఇందులో విమానశాస్త్ర రహస్యాలన్నీ ఉన్నాయి. 1974లో బెంగళూర్‌లోని indian Aeronautics సంస్థ ఈ పుస్తకాన్ని సమగ్రంగా అధ్యయనం చేసి అందులో పనికి వచ్చే విలువైన సమాచారం ఏదీ లేదని చెప్పింది. కాని అందులో వర్ణించబడిన "రుక్మ విమానం" గురించి మాత్రం చాలా గొప్ప వివరాలున్నాయని ప్రశంశించింది. దానికి పొడవైన, నిలువైన "ducts with fans on the top" ఉన్నానయనీ, అవి గాలిని పీల్చి కింద ఉన్న ducts కు పంపుతాయని, దానివల్ల విమానంపైకి గాలిలోకి లేస్తుందనీ చెప్పారు.

ఈ పుస్తకాన్ని International Academy of sanskrit researchకు చెందిన వ్యవస్థాపక డైరెక్టర్ అయిన శ్రీ G.R. Joshyer ఇంగ్లీషలోకి అనువాదం చేసి మైసూర్ కారోనేషన్ ప్రెస్‌లో ముద్రించి మహోపకారం చేశారు. ఆయన పెట్టిన పేరు Vaimaanika shaastra by Bhardvaaja Maharshi --yantra sarvasva --ÑÑ science of aeronautics". అదీ దీని పూర్వ గాథాలహరి. మరి దీనిమీద ఏమైనా పరిశోధనలు జరిగాయా అంటే ఎవరు పెదవి విప్పలేదు. ఎందుకంటే "రైట్ సోదరులు" మొదటి విమానాన్ని తయారుచేసి గాలిలోకి ఎగిరారని రూఢి అయిపోయింది కదా. ఇక ఎవరు చెప్పినా నమ్మరు అనే భావన నెలకొని ఉంది. కాని సూర్యరశ్మిని చేతులతో ఆపలేము కదా.

## ప్రపంచంలోనే మొదటి విమానం "మారుత సఖి"

భారత దేశానికి చెందినవారు, పైన అంతా వివరంగా తెలుసుకొన్న శ్రీ టి.సుబ్బరామశాస్త్రి గారే ప్రపంచంలో మొదటి విమాన నిర్మాత. అదీ రైట్ సోదరులు నిర్మించిన కాలం కంటే ఆరేళ్ళకు ముందే నిర్మించారని చెబితే ముక్కుమీద వేలు వేసుకొంటారు పాశ్చాత్యులు. మనమూ అంతేగా. కాని అది యదార్థం. బెంగళూర్ జిల్లాలోని అనేకాల్ తాలూకాకు చెందిన మహర్షి టి.సుబ్బరామశాస్త్రి గారు, బొంబాయికి చెందిన శివకర్ తాల్పడే గారు కలిసి ఈ విమానాన్ని నిర్మించి మొదటిసారి బొంబాయిలో గాలిలోకి యెగిరించి అందర్నీ సంభ్రమాశ్చర్యాలలో ముంచారు. శాస్త్రి గారు వేద విజ్ఞాన నిధి. తాల్పడే గారు ఆధునిక విజ్ఞాన శాస్త్రవేత్త. వీరిద్దరి కలయిక ప్రగతికి మెట్లు అయాయి.

బొంబాయికి చెందినా ప్రముఖ పారిశ్రామికవేత్త పూన్జీలాల్ గిరిధర్ బెంగళూర్ వచ్చి శాస్త్రి గారి వద్ద రెండు వారాలు ఉండి విమాన రహస్యాలను ఎన్నీటినో తెలుసుకొన్నారు. బొంబాయి వెళ్లి అక్కడి విమానశాస్త్ర పరిశోధకుడైన డాక్టర్ తాల్పడే

గారికి శాస్త్రి గారు ప్రత్యేకంగా చెప్పిన విషయాలపై పూర్తి అవగాహన కల్పించాడు. ఆ తర్వాతా తాల్పుడే గారు శాస్త్రి గారిని కలిసి చర్చించారు. తాను తెచ్చిన విమానాల నమూనాలను శాస్త్రి గారికి చూపించారు. ఇద్దరూ వేరు వేరు చోట్ల ఉండి పని చేస్తే ముందడుగు వేయలేమని గ్రహించారు. శాస్త్రి గారు సదాచార సంపన్నులు. ఆయన నియమ నిష్టలకు యే మాత్రం భంగం కలుగ కుండా శాస్త్రి దంపతులను తాల్పడే గారు బొంబాయికి తీసుకొని వచ్చారు. తాల్పుడే గారి భార్య కూడా విజ్ఞాన శాస్త్రవేత్త కావటంతో గొప్ప సహకారం లభించింది. ఈ ప్రయత్నానికి వెనుక ఉండి ఆర్థిక, హార్దిక సహకారాన్ని అందించిన వాడు పూన్జీ లాల్ గారు. ఈ ముగ్గురి మేధా ఫలితంగా ఆవిర్భవించిన తొలి విమానమే "మారుత సఖి".

1895లో బొంబాయి నగరంలో ఉదయాన "చౌపాతి" వద్ద స్వదేశీ విమానం అయిన "మారుత సఖి" ఆకాశంలో విహారం చేయటానికి సర్వం సిద్ధం చేశారు. విమాన యంత్రాన్ని పాదరసం, సూర్యరశ్మి, ఆవిరితో నింపారు. అందరు ఆసక్తిగా విమాన విహారాన్ని వీక్షించటానికి ఆకాశం వంక చూస్తున్నారు. బరోడా మహారాజు సయాజ్ దేవ్ గైక్వాడ్, న్యాయమూర్తి మహాదేవ్ గోవింద రేనడే మొదలైన ప్రముఖులందరూ విచ్చేశారు. శాస్త్రి గారి పాదాలకు నమస్కారాలను అత్యంత భక్తితో చేసి డాక్టర్ తాల్పుడే గారు విమానం వద్దకు వచ్చి సూర్యదేవుడికి నమస్కరిస్తుండగా వేద మంత్రోచ్చాతన విను వీధిని వినిపిస్తుండగా, ముహూర్త సమయానికి ప్రపంచ తొలి విమానం "మారుత సఖి" బొంబాయి చౌపతి నుండి గగనానికి ఎగసింది. అశేష జన సమూహం ఆనందాతి రేకంతో జయ జయ ధ్వానాలు కరతాళ ధ్వనులు చేసిపులకించిన చారిత్రాత్మక ఘట్టానికి శుభం పలికారు. తాల్పుడే దంపతులు ఆనంద బాష్పాలు రాలుస్తుండగా సుబ్బరామశాస్త్రి గారు ధ్యాన నిమగ్నులయారు. మారుత సఖి ఆకాశంలో దేదీప్యమానంగా విహరిస్తోంది. 1500 అడుగుల ఎత్తుకు చేరి, అక్కడా విహరించింది. అక్కడ చేరిన బ్రిటిష్ గూఢాచారులు, అధికారులు ఆశ్చర్యానికిలోనై భయ భ్రాంతులు కూడా అయారు.

భారతీయులందరూ దేశాభిమానం ఉప్పెనగా పొంగి రాగా "భారత మాతాకు జై" అని నినదించారు. వేలాది మంది విమానం కిందికి దిగగానే చూడటానికి తాకి అనుభవించటానికి పరుగులు తీశారు. తొక్కిసలాట జరిగింది పోలీసులు కొద్దిగా లాఠీ చార్జి చేయవలసి వచ్చిందట కూడా. ఇంత దిగ్విజం గాభారతీయులు స్వంత సామగ్రితో విమానాన్ని తయారుచేసి నడపటాన్ని జీర్ణించుకోలేని ఆంగ్ల ప్రభుత్వం, ఈ వార్తను పేపర్లలో రాకుండా నిషేధించింది. అందుకని ఈ విషయం ఎవరికీ తెలియలేదు. ఆ తర్వాత కొంతకాలానికి డాక్టర్ తాల్పుడేగారి భార్య, ఆ తర్వాత తాల్పుడే గారు మరణించారు. కొంతకాలం తర్వాత తాల్పుడే బంధువులు "మారుత సఖి" విమాన

యంత్రాన్ని "రాలీ బ్రదర్స్" అనే విదేశీ సంస్థకు అమ్మి వేశారు.

అనేకల్ టి.సుబ్బరామశాస్త్రి గారు విషాదంతో స్వంత గ్రామానికి చేరుకొన్నారు. ఈ విమాన విజయగాథను యే పత్రికా వెలువరించక పోవటం మన దురదృష్టం. అయితే 1895లో లోకమాన్య బాలగంగాధర తిలక్ గారు తమ "కేసరి"పత్రికలో "మారుత సఖి" విమాన విజయాన్ని ప్రచురించి లోకానికి ఎరుక పరిచారు. ప్రముఖ చారిత్రక పరిశోధకుడైన ivan Kopsatica విమాన యంత్రాన్ని మొట్టమొదట తయారు చేసినవాడు బొంబాయికి చెందిన డాక్టర్ తాల్పుడే అని రాశాడు.

డాక్టర్ తాల్పుడే వద్ద ఎప్పుడూ భారద్వాజ మహర్షి రచించిన విమానశాస్త్ర గ్రంథం ఉండేదట. "Stefen Pyaav" అనే పరిశోధకుని ప్రకటన మేరకు తాల్పడే విమాన యంత్రానికి పాదరసాన్ని ఇంధనంగా ఉపయోగించాడని తెలిసింది. తాల్పడే గారు విమాన శాస్త్రానికి చెందిన సకల విషయాలూ సంస్కృత గ్రంథాల నుండి సేకరించి దాచుకొన్నారు. అంతేకాక సుబ్బరామ శాస్త్రి గారు ఆచార్య నారాయణ ముని రచించిన "విమాన బిందు", మహర్షి దండిరాజ రచించిన "విమాన జ్ఞానార్ధ ప్రకాశికా" మొదలైన గ్రంథాలనుండి విషయాలను తాల్పడే గారికి తెలియజేసి ఆ శాస్త్రంలో ఆయనకు పూర్తి ఆవగాహన కల్పించారు. అనేక గ్రంథాలలో శ్రీ శాస్త్రి, శ్రీ తాల్పుడే గార్ల కృషి గురించిన వివరాలు చాలా కన్పిస్తాయి.

ప్రపంచంలోనే తొలి విమానం "మారుత సఖి"ని తయారు చేసి, గగనంలో విహరింప జేసిన ఘనత భారతీయ శాస్త్ర వేత్తలైన శ్రీ సుబ్బరామ శాస్త్రి, శ్రీ తాల్పుడే గార్లకే దక్కుతుంది అన్నది నిర్వివాదాంశం. జై బోలో భారత్ మాతా కీ జై.

ఈ వ్యాసానికి ఆధారం- కడపలోని బ్రౌన్ లైబ్రరి వ్యవస్థాపకులు, సలహాదారు, నిరంతర రచనాశీలి, పండిన జ్ఞాన, విజ్ఞాన ఫలం అయిన శ్రీ జానుమద్ది హనుమత్శాస్త్రి గారి రచన "ప్రపంచంలోనే తొలి విమానం -మారుత సఖి". శ్రీ హనుమచ్ఛాస్త్రి గారికి కృతజ్ఞతలతో- (13-9-12-కాంప్-అమెరికా)

## సుమనం

సుమన్ పేరు చెబితే ఈ టి.వి.గుర్తొస్తుంది. ఈ టి.వి అనగానే సుమన్ జ్ఞాపకం వస్తాడు. ఆ లోగో చూస్తుంటే, ఆ సీరియళ్ళ ప్రారంభం పాటలు వింటుంటే ఆ సీరియల్ రియల్‌గానే హిట్టవుతుందని నమ్మకం కలుగుతుంది. తీసే ప్రతి సన్నివేశంలో పెర్ఫెక్షన్ కన్పిస్తుంది. మొదట్లో డబ్బింగు సీరియల్లకే ప్రాధాన్యం ఇచ్చినా క్రమ క్రమంగా స్వంత వాణీ బాణీ తెచ్చినవాడు సుమన్. అతను ఒక గొప్ప చిత్రకారుడు అవటం గొప్ప ఎస్సెట్. అతని చిత్రంతో సీరియల్ మొదలవుతుంటే దానికో నిండుదనం కన్పిస్తుంది.

సీరియల్‌కు ఈ.టి.వి.లో గొప్ప స్థానం కల్పించిన వాడు సుమన్. మరీ బజారు పోట్లాటలు, అసహ్య సన్నివేశాలు పిచ్చివేషాలు లేని సీరియళ్ళకు పెట్టింది పేరు అన్నట్లు తీశాదు సుమన్. ఎందరో నటులకు నటీమణులకు అతని ప్రోత్సాహం ఉత్తేజితుల్ని చేసి, వారిలోని ప్రతిభను రాబట్ట గలిగాడు. అచ్యుత్ అందులో మంచి పేరు పొందాడు. అశ్విని, కిన్నెర, యమునా మొదలన స్త్రీ కళా కారులు తమ సత్తా చాటారు. పాటలను దాదాపు ఆయనే రాశాడు. వందలాది పాటలు రాసినా అందులో ఎంతో వైవిధ్యం కన్పిస్తుంది. వాసూరావు, మాధవపెద్ది సురేష్ వంటి సంగీత దర్శకులకు అదొక ఆస్థానం. ఆ స్థానం శాశ్వతంగా ఉండేట్లు వాళ్ళందరూ ఆయన నేతృత్వంలో పని చేశారు. గాయకులూ నీహాల్, మనో కౌసల్యా మొదలైన వారు తమ స్వర సంతర్పణ చేశారు ఈ చానెల్‌లో. ఒక కొత్త ప్రక్రియ "పాడుతా తీయగా"లాంటి వాటికి స్థానం కల్పించి వర్ధమాన గాయకులెందరికో ప్రోత్సాహం కల్పించారు. తండ్రి రామోజీరావు గారు తనపై పెట్టిన బాధ్యతను అతి సమర్ధవంతంగా నెరవేర్చి తండ్రికి ముదాన్ని చానెల్‌కు ప్రజాదరణను ప్రేక్షకులకు వినోదంతోబాటు విజ్ఞానాన్ని పంచి పెట్టాడు. ఈనాడు సినిమాలకు కూడా ప్రత్యేకత ఉంది. మంచి సిని మాలు ఆనాటివి, ఈనాటివి కలిపి ప్రేక్షక హృదయరంజనం చేయటంఈ చానెల్ ప్రత్యేకత. ఒకే వర్గానికో కుటుంబానికో సంబంధించిన సినిమాలు వేసి వేసి బోర కొట్టించక పోవటమూ హర్షణీయం.

పంచ తంత్రం సీరియల్‌తో గొప్ప సంచలనాన్ని సృష్టించారు. పిల్లలకు ఎంతో వినోదాన్ని పంచారు. భాగవతం ప్రారంభించటానికి ఎంత గ్రౌండ్ వరకు చేశారో చూస్తే ఆశ్చర్యమేస్తుంది. చివరికి బాపు రమణలను వదిలేసినా సీరియల్‌ను రక్తి కత్తించటంలో కృత కృత్యులయారు. సుమన్‌లో మంచి మనసు ఉంది అని అతనితో పనిచేసిన కళాకారులందరూ ఆనాడూ చెప్పారు ఈనాడూ చెప్పుతున్నారు. అతనిది "వర్కహాలిక తత్వం" అని అందరు అంటారు. తనకు కావలసినదేదో ఆర్టిస్టుల నుంచి రాబట్టుకొనే దాకా విశ్రాంతి తీసుకోడని అందరి అభిప్రాయం. అంత పెద్ద చానల్‌కు అధినేతగా ఉంటూ తన ఆర్టిస్టులతో భేషజం లేకుండా ప్రవర్తించి వారి మనసుల్ని దోచుకొన్నాడు. నిరంతర కఠోర శ్రమ ఆయన ఆరోగ్యంపై ప్రభావం చూపిందేమోనని పిస్తుంది. లేకపోతే నలభై అయిదేల్లకే అతను అమరుడవటం బాధాకరమే. అతనిలో తపన, ధ్యేయం, సాధన, నిరంతర కృషి ఉండటం అభినందించాల్సిన విషయం. తోటివారిలో ఒకడుగా ఉంటూ తన లక్ష్యాన్ని నెరవేర్చుకొన్న ఘనుడు సుమనుడు.

సుమన్‌లో దైవభక్తి రాశీ భూతమై ఉంది. శ్రీ వేంకటేశ్వరస్వామిపై వేయి అన్ని సందర్భాలకు సంబంధిన పాటలు రాసి సుస్వరంగా స్వర పరిపించి మంచి గాయకులతో పాడించి సహస్ర గేయ స్తోత్రమాలగా ఆ బాలాజీకి సమర్పించిన భక్తి

భావ బందురుడు. ఒక రకంగా తన ఆత్మ సమర్పణే చేశాడు. చిన్న చిన్న మాటలతో గంభీర భావాన్ని పొదగతం సుమన్ ప్రత్యేకత. అతని ప్రతి మాటకు ప్రతి పాటకు ఒక నిర్దుష్ట భావన ఉంటుంది. బయట ఈ సభల్లోనూ కనిపించటం అరుదే. తన చానల్, తన పని, దాని విశిష్టతకై కృషి అదే అతని కార్యక్రమం. మహిళలకు వంటా, వారి సమస్యలకు పరిష్కార మార్గాలు అన్వేషించటం అతను తొక్కిన కొత్తబాట. "మార్గదర్శి" ఈనాడుకు యేన లేని కీర్తిని తెచ్చి పెట్టింది. ఎందరెందరో మహాను భావులను వారి సేవా నిరతిని సమాజానికి వారు చేసిన సేవలను వెలుగులోకి తెచ్చే అద్భుత కార్యక్రమం ఇది. నిజంగానే మిగిలిన చానెళ్లకు కూడా మార్గ దర్శిగా కన్పిస్తుంది. ప్రేరణా స్ఫూర్తి కల్గిస్తుంది. అలాగే డిటెక్టివ్ కథలు తీసి చూపే నేర్పు ముచ్చటగా ఉంది. ఒక వ్యక్తి ఇన్ని కొణాలలో ఆలోచించి దాన్ని ప్రదర్శించి దాంతో ప్రజాహృదయాలను చూరగొనటం ఆషామాషీ కాదు.

2004 ఎన్నికల ముందు తర్వాత వచ్చిన "మాయా బజార్" అనే రాజకీయ సీరియల్ ఒక ఊపు ఊపింది. ఎన్నో ఆలోచనలను తెరపైకి తెచ్చింది. ఎక్కడ ఏమి జరుగుతోందో జనానికి తెలిసింది. ఇలా ఆనాడు తీయటం సాహసమే. ఇలాంటివి ఉండాలి అనే భావం రావటం ఒక గొప్ప విషయం. హాస్యానికి సమ ప్రాధాన్యం ఉంది. అన్నిటికంటే ఈనాడు వార్తలు అంటే "గప్పా గాసిప్పు కాదు" అసలు సిసలైన వార్తలు అనిపించటం ఈ చానల్ ప్రత్యేకత. ఏదో సంఘటన జరిగింది కదా అని కెమెరా అక్కడే పెట్టి తీసి తీసి చూపి చూపి జనం సహనానికి పరీక్ష పెట్టకపోవటం దీని ప్రత్యేకత. న్యూస్ న్యూస్‌గానే ఉంటుంది "వ్యూస్"గా ఉండదు. రామోజీరావు గారికి సుమన్ కూడా ఈ క్రెడిట్ దక్కుతుంది అనుకుంటా. ఇంకో విషయం వార్తలు చదివేవారు తీసుకొనే గొప్ప శ్రద్ధ. స్త్రీలు మాత్రం సాంప్రదాయ వేషధారణలో వార్తలు చదివి తప్పులు లేకుండా రక్తి కట్టించటం ఆ మహిళామణులను చూస్తే చేయెత్తి నమస్కరించాలి అనిపిస్తుంది. ఇది ఈ చానల్ ప్రత్యేకత. దీన్ని అందరు మెచ్చాల్సిన విషయం.

భాష విషయంలో ఎన్నో కబుర్లు చెప్పవచ్చు. కాని ఆచరణలో పెట్టటం గొప్ప సవాల్. ఆ సవాల్‌ను అధిగమించి "తెలుగు వెలుగులు" శీర్షికను ప్రారంభించి అన్ని రకాల ప్రక్రియలకు ప్రాధాన్యం ఇచ్చి తెలుగు భాషలో లబ్ధ ప్రతిష్టులైన వారందరినీ రప్పించి, వారితో భాషా సౌందర్యాన్ని తెలుగు గొప్పదనాన్ని విన్పించి మన చమక్కులు సామెతల ఆమెతలు అంటే విందు భోజనాలు ఏర్పాటుచేసి తెలుగును చానెల్‌లో భక్తిగా ఊరేగించటం అభినందనీయం. దీనికి ఈ టి.వి.ని అభినందించాలి. సుమన్ మరణంతో ఆంధ్ర సాహితీలోకం ఒక సాహితీ బాంధవుడిని కోల్పోయింది. సుమన్ ఉంటే చానెల్ మరిన్ని విషయాలలో ముందంజ వేసేది. పాపం అతని హఠాత్ మరణం తండ్రి

రామోజీరావు గారికే కాదు, ఈనాడు టీ వీ వారికి, దానినభిమానించే లక్షలాది ప్రేక్షకులకు ఆశని పాతమే. "సుమం"తో సమానమైన సున్నిత సుమనస్కుడు అయిన సుమన్ అమరరహే – "సుమనం" అంటే మంచి మనసు అని ఈ పాటికి గ్రహించే ఉంటారు.

(16-9-12-కాంప్-అమెరికా)

## హాస్యపు సుత్తికి పట్టం కట్టిన వేలు

ఈగ ఇల్లలుకుతూ తన పేరు మరిచిపోయినట్లు సుత్తి వేలుగా తన పేరు మారటంతో కురుమద్దాలి లక్ష్మీ నరసింహారావు తన పేరు ఎప్పుడో మరిచిపోయి ఉంటాడు. జంధ్యాల వెతికి పట్టుకొన్న నట ముత్యాలు ఆయన. వీరభద్రరావు కూడా. జంధ్యాల మావటిగా వీరిద్దరూ సుత్తిని హాస్యపు "హత్తి" (ఏనుగు)పై కూర్చుని ఊరేగించారు. వేలు సన్నగా వేలంతటి వాడుగా ఉండి ఆ పేరుకు చిన్నప్పుడు సార్ధకం చేస్తే, స్టేజి నాటకాలతో తన ప్రతిభను నిరూపించుకొని హాస్యబ్రహ్మ దృష్టిలోపడి తెలుగు హాస్యాన్ని పూల రథంలో ఊరేగించిన వారిలో ఒకడయ్యాడు వీరభద్రుడితో. జంట పండించిన అర్ధ శత సినిమాలే దీనికి నిలువెత్తు సాక్షి . గ్రామ్యమైనా, బ్రాహ్మణ్యమైనా ఆ మాటలను వారి హృదయాల నుండి వచ్చినట్లు చెప్పగల మహా గొప్ప నటుడు వేలు. సంఘర్షణలో అతని సీరియస్ నటన కలకాలం గుర్తుపోయేది. సదాచార సంపన్నుడిగా వేసినా, విల విలలాడే తండ్రిగా వేసినా, నాటి రాజరికపు పోజు పోనీ మాజీ రాజుగా చేసినా, చిరు చంటబ్బాయికి చిరు నిక్కర్‌తో పెద్ద పోడుగాటి అసిస్టంట్‌గా వేసినా అతని మార్కు అతనిదే. ముక్కుతో మాట్లాడి హాస్యాన్ని మన ముక్కు పిండి, నవ్వింప జేస్తాడు. అతని డైలాగ్ డెలివరీయే ఒక ప్రత్యేక స్కూల్ అనిపిస్తుంది. పాత్రలో ఒదిగి పోవటం పాత్ర స్వభావాన్ని పూర్తిగా ఆవిష్కరింపజేయటం వేలు ప్రత్యేకత. వేలేడంతటి వాడు అతి వేలమై పోతాడు నటనతో.

జంధ్యాల మార్కు సినిమాలకు వేలు అదనపు ఆకర్షణ. అతను లేకపోతే ఏదో తెలీని వెలితి గోచరిస్తుంది. పరిపక్వమైన నటుడు అలానే మనల్ని ఆకట్టుకొంటాడు. ఆయన పంచె షర్టూ వేసినా గోచిపెట్టి తిరిగినా, కోటూ సూటు వేసినా, లాయరైనా, దళారి అయినా, తండ్రి అయినా, తాత అయినా, పూజారి అయినా, పండితుడైనా ఆ పాత్రకు ఒక స్వంత వ్యక్తిత్వం ఉండేట్లు చేస్తాడు. వేలు చిందించిన నవ్వుల పువ్వులు వేలకు వేలు. అవి సువర్ణ పుష్పాలు. అతను జాలువార్చిన నవ్వులు పొదరిల్లులై ఆహ్లాదం చేకూరుస్తాయి. నిరంతరం హాస్యపు జల్లు వేలు అనచ్చు. సినిమాలలో రాణించి బుల్లి తెరకూ రాణ తెచ్చాడు. డిటెక్టివ్ కథల్లో అతని అడుగడుగు చమత్కారానికి పరవశిస్తాం. పళ్ళు కొంచెం బయటపెట్టి ఆయన నవ్వే నవ్వు చిదానందమే. చెణుకులు

రువ్వటంలో వేలు అందే వేసిన చెయ్యి. వేలు ఉంటే చాలు అన్న సినిమాలు చాలానే ఉన్నాయి. అంత గుర్తింపు పొందిన నవ్వుల పువ్వుల రేడు వేలు.

## భ.రా.గో.కథలకు జీవం వేలు

ఇవన్నీ ఒక ఎత్తు అయితే భమిడిపాటి రామగోపాలం గారి కతలకు వేలు చేసిన పాత్రలు నవ్వే కాక, విషయ పరిజ్ఞానాన్ని, లోక వృత్తినీ, కవితా మర్మాలను, డాంబిక ప్రవృత్తిని, సన్మానాలు అందుకోవాలన్న వారి "తీటను" బయటను బయట పడేయటంలో వేలుచూపిన హావభావాలు చిరస్మరణీయాలు. అతనికతనే సాటి అని చాటి చెప్పే ధారావాహికాలు. భ.రా.గో.రాయటం ఒక ఎత్తు అయితే, వేలు ఆ పాత్రకు అంటే భరాగోకు జీవం పోసి నటించటం ఒక ఎత్తు. రెండూ పోటా పోటీగా సాగి ఎన్నిసార్లు చూసినా మళ్ళీ మళ్ళీ చూడాలని పించేటట్లు ఉంటాయి. నా ఉద్దేశలో ఈ కథలు చాలు వేలును చిరంజీవిని చేయటానికి. అతని నట విశ్వ రూపాన్ని దర్శించటానికి ఇవి హైలైట్లే. హాస్యంలో ఎంత ఎత్తుకు ఎదిగాడో సాత్వికాభినయం లోను వేలు అంతే ఎత్తున నిల బడ్డాడని చెప్పే సీరియల్సు ఇవి. ఇక్కడ దర్శకుని ప్రతిభనూ మనం మెచ్చుకోవాలి. వేలులోని నటనను అన్ని కోణాలలోనుంచి రాబట్టే అద్భుత ప్రయోగం ఈ ధారావాహిక. హాట్స్ ఆఫ్ భరాగో మరియు వేలు. ఇద్దరు స్వర్గస్తులైనారు. కాని తెలుగు హాస్యాన్ని స్వర్గపు సుధర్మలో పంచి పెట్టటానికి వెళ్లారని భావిద్దాం. (17-9-12-కాంప్-అమెరికా)

## వీక్లీ రీడింగ్ వీక్

సెప్టెంబర్ పది సోమవారం నుంచి పదహారు ఆదివారం వరకు విశేషాలు-

మేము అమెరికా వచ్చి ఈ పదవ తేదీకి సరిగ్గా అయిదు నెలలయింది. అంగలూరు రాజేంద్ర ప్రసాద్ గారు ఫోన్ చేశారు. ఆయన కాలి ఫోర్నియా వెళ్లి వచ్చినట్లు చెప్పారు. ఆదినారాయణ గారి కోడలు అనారోగ్యం గురించి చెప్పి, ఇప్పుడు పూర్తిగా తగ్గి కులాసాగా ఉన్నట్లు తెలియ జేశాను. ఆది నారాయణతో మాట్లాడమన్నాను. సాయంత్రం పక్కింటి గాయత్రీ, రవి దంపతులకు శ్రీ హనుమ కథానిది, మా అక్కయ్య పుస్తకాలను ఇచ్చాము. మంగళవారం మైనేని గోపాలకృష్ణ గారికి ఫోన్ చేసి మాట్లాడాను. మా ఇండియా ప్రయాణం అక్టోబర్ మూడు బుధవారం అని చెప్పా. బాపు గారి ఆరోగ్యం బాగా మెరుగ్గా ఉన్నట్లు తెలియ జేశారాయన. బుధవారం హూస్టన్ నుంచి వావిలాల లక్ష్మి గారు ఫోన్ చేశారు. ఇండియా వస్తే ఎవరింటికి వెళ్ళాలో తెలీయటం లేదన్నారు. "ఉయ్యూరులో మేమున్నామని గుర్తుంచుకోండి. మీరు ఎప్పుడు వచ్చినా వెల్కం" అన్నాము. గురువారం రాత్రి ఆదినారాయణ ఫోన్ చేసి "విమానం" గురించిన

ఆర్టికల్ చాలా బాగుందని దాన్ని కాపీలు తీసి మిత్రులకు ఇస్తున్నట్లు సంతోషంగా చెప్పారు. రచనకు అంతకంటే పరమార్ధం ఏముంటుంది? ఆదినారాయణ వాళ్ళ ఇండియా ప్రయాణం ఇరవై రెండు అయితే రాజేంద్ర ప్రసాద్ వాళ్ళది ముప్పైన.

## మహాన్నదాత డొక్కా సీతమ్మ తల్లి

ఆస్టిన్‌లో ఆదినారాయణ వాళ్ళ అమ్మాయి వాళ్ళ ఇంటి ప్రక్కనే ఉంటున్న శ్రీ డొక్కా రామయ్య గారు మహాన్నదాత, భద్రాచలం దగ్గర ఉండే స్వర్గీయ డొక్కా సీతమ్మ గారి ఇని మనుమడు అని చెప్పారు. చాలా ఆనందం వేసింది. దాదాపు వంద సంవత్సరాల క్రితం డొక్కా సీతమ్మ గారి అన్నదానం గురించి ఆంధ్రదేశంలో తెలియని వారు లేరు. ఎవరు ఎప్పుడు ఏ వేళ ఇంటికి వచ్చినా అన్నం వండి, వడ్డించి, సంతృప్తిగా భోజనం పెట్టె మహా ఇల్లాలుగా సీతమ్మ గారిని గురించి చెప్పుకొంటారు. ఆమె వదాన్యతకు, దాతృత్వానికి, అన్న సమరాధనకు చేతులెత్తి నమస్కరించని ఆంధ్రుడు లేడు. యాత్రికుడు తిన్నాడో లేదో అని స్వయంగా విచారించి ఒకవేళ మోహమాటం పడితే "ఒరే నాయనా! అన్నం పర బ్రహ్మ స్వరూపం. దాన్ని తిని జీవుణ్ణి తృప్తి చెందిస్తేనే భగవంతుడు కూడా తృప్తి చెందుతాడు" అని పిలిచి మరీ అన్నం పెట్టె దొడ్డ ఇల్లాలు. భర్త గారు కూడా అంత సహకారాన్నివ్వబట్టే ఆమె అన్న సమారాధన నిరంతరాయంగా సాగింది. ఖాళీ కడుపుతో ఎవరూ వెళ్ళరాదు అని ఆమె నియమం. సీతారాముల సన్నిధానంలో ఉండబట్టేనేమో, ఆయమ్మకు ఆ సీతా సాధ్వి సుగుణాలన్నీ వచ్చి ఉంటాయి. "ఆంధ్రదేశపు మరో కాశీ అన్నపూర్ణ" మన డొక్కా సీతమ్మ తల్లి. అ మహా త్యాగమూర్తికి ఎన్ని నమస్కారాలు, కృతజ్ఞతలు తెలియజేసినా ఆమె ఋణం తీర్చు కోలేము. కలిగి, సిరి ఉండి అన్న దానం చేయటం వేరు పెద్దగా ఏమీ లేకుండానే ఆ గొప్పబుద్ధి కలగటం దాన్ని ఆచరణ సాధ్యం చేయటం ఆమెకే సరిపోయింది. సీతమ్మగారు 1841లో జన్మించి 1909లో మరణించింది. భర్త మరణం తర్వాత ఆమె సాంప్రదాయానికి విరుద్ధంగా అందర్నీ ఇంటికి ఆహ్వానించి భోజనం పెట్టటం ఊళ్ళో బ్రాహ్మలకు అసూయ, కోపం తెప్పించాయి. ఆమెను చాలా అవమానించారు. కానీ కర్తవ్య పరాయణురాలైన ఆమె వాటిని పట్టించుకోకుండా తనపని తాను చేసుకొని పోయింది. ఎవరి బెదిరింపులకు జడవ లేదు. అన్న సమారాధన కోసం ఆమె ఎకరాలన్నీ అమ్మింది. చివరకు ఆమెకు మిగిలింది ఉన్న ఇల్లు, అతి కొద్ది పొలం మాత్రమే. అయినా చలించ లేదామే. నిరతాన్న దానాన్ని కొనసాగించింది. చివరికి ఆమెలో ఓపిక నశించి కాశీ వెళ్లి అక్కడే మరణించాలని అనుకొంది. ఏరోజు కారోజూ ఇదే ఆఖరి రోజూ రేపే కాశీ ప్రయాణం అనుకొంటు నలభై ఏళ్ళు గడిపింది. అతిధి సేవ, అన్నం పెట్టటం అంటే ఆమెకు అంత ఇష్టం. దీనికోసం కాశీ విశ్వేశ్వర దర్శనాన్నే వాయిదా వేసుకొన్న అన్నపూర్ణమ్మ ఆమె.

చివరికి తెగించి ఒక ఎడ్ల బండీ మాట్లాడుకొని, కాశీ ప్రయాణానికి బయల్దేరింది. గతుకుల రోడ్డు మీద ప్రయాణం చేసి అలిసిపోయి ఒక సత్రంలో పడుకొంది . అర్ధరాత్రి ఆ సత్రంలో నుండి, తండ్రీ తల్లి కొడుకుల మాటలేవో వినిపించాయి. పిల్లలు ఆకలికి అలమటిస్తున్నారు. తల్లీ తండ్రీ “ఒరే నాయనలారా కొన్ని గంటలు ఓపిక పట్టండి. మనం డొక్కా సీతమ్మ గారింటికి చేర బోతున్నాం. అక్కడ ఆ మహా ఇల్లాలు వంటచేసి సిద్ధంగా ఉంచుతుంది. మనల్ని పిలిచి అన్నం పెడుతుంది”. ఒక పిల్లాడు “సీతమ్మ గారింటికే ఎందుకు వెళ్ళాలి?” అని ప్రశ్నించాడు. దానికా తలిదండ్రులు “సీతమ్మ గారు మర్యాదగా పిలిచి గౌరవంగా కడుపు నిండా భోజనం పెడుతుంది. అలాంటి ఇల్లాలు ఈ పరగణాలోనే లేదు” అన్న మాటలు విన్నది. అంతే ఆమెకు నిద్ర పట్ట లేదు. వెంటనే బండివాణ్ని నిద్ర లేపి బండీ కట్టించి వెనక్కి తిరిగి ఇంటికి వెళ్లిపోయింది. అర్ధరాత్రి సమయం. సత్రంలోని వాళ్ళు నెమ్మదిగా సీతమ్మ గారింటికి వచ్చారు. తలుపులు తీసి ఉండక పోవటం వల్ల ఆమె లేదను కొన్నారు. రెండు నిమిషాలలో కమ్మని పప్పు కూరా పులుసుల వాసనలు నాసికలకు సోకాయి. ఆమె వీరిని ఆప్యాయంగా లోపలి ఆహ్వానించి అడిగి అడిగి మరీ వడ్డించి భోజనాలు పెట్టి తృప్తి చెందింది. ఇక ఆమెకు కాశీ వెళ్ళే ఆలోచన విరమించుకొంది.

ఆదినారాయణ వల్ల ఆ సాధ్వి సీతమ్మ గారిని ఈ రూపంగా స్మరించే అదృష్టం నాకు దక్కింది. రామయ్య గారు ఆస్టిన్‌లో తెలుగును బోధిస్తూ, చిన్న పిల్లలకు తెలుగులో పద్యాలు మొదలైనవి నేర్పిస్తూ శ్లోకాలను అభ్యాసం చేయిస్తూ పోటీ పరీక్షలు నిర్వహించి బహుమతులంద జేస్తూ “అమెరికాలో ఉన్న ఆంధ్ర తేజం” అనిపిస్తున్నారు. వారిని గురించి సమగ్ర సమాచారాన్ని నాకు అందజేయమని ఆదినారాయణకు మెయిల్ చేశాను. వస్తే వారి గురించి అందరికి తెలిసే ఒక మంచి వ్యాసం రాయాలని ఉంది. అలాగే ఆస్టిన్‌లోనే ఉన్న మరో దేశీయభిమాని శ్రీ ఆచార్యులవారు కూడా చాలా కాలంగా సంస్కృతాన్ని నేర్పుతూ గీర్వాణ భాషా గౌరవాన్ని విద్యార్థులకు తెలియజేస్తూ, అభిరుచి కల్గిస్తూ భాషా సేవ చేస్తున్నట్లు ఆదినారాయణ నాకు ఇది వరకే ఫోన్‌లో చెప్పారు. వీరి గురించి కూడా వివరాలు నాకు పంపమని చెప్పాను.

శుక్రవారం రాత్రి మా అమ్మాయి వాళ్ళింట్లో భజన. ఎనిమిది నుండి తొమ్మిది దాకా జరిగింది. వల్లం దంపతులు సుబ్బు ఫామిలీ, రాహుల్ కుటుంబం వచ్చారు.

## వీక్లీ రీడింగ్ క్లాసులు

మా అల్లుడు ఎప్పటి నుంచో ప్లాన్ చేసిన “వీక్లీ రీడింగ్ క్లాసులు” ఈ శనివారం సాయంత్రం నుండి ప్రారంభించాడు. నాగమణి భర్త సహాయం చేశాడు. పది మంది వచ్చారు. ఆరో క్లాసులోపు వారికే. ఇందులో ముగ్గురు మా మనవళ్ళు. పవన్

కూతురు, ప్రియా ఇద్దరు కూతుళ్ళు, నాగమణి కొడుకు వగైరాలు. ఇంకొందరు తరువాతి వారం నుండి వచ్చే అవకాశం ఉంది. మా మనవళ్ళకు ఇదివరకే ఈ క్లాసులు, ఆ రీడింగ్ మెటీరియల్ చేయటం అలవాటే. ఈ క్లాసుల కోసం కుర్చీలు టేబుల్లు, బోర్డు సిద్ధం.

శనివారం ఉదయం సత్యా సౌమ్యల అమ్మాయి హాపీ బర్త్‌డేని స్కేటింగ్ హాల్‌లో జరిపితే మా అమ్మాయి మనవళ్ళు వెళ్లారు. బాగా ఎంజాయ్ చేశారు. అందరికి గిఫ్టులు ఇచ్చారట.

ఆదివారం మా అల్లుడి ఇండియా ప్రయాణం. పన్నెండు రోజుల trip. మళ్ళీ ఇరవై యేడు బయల్దేరి ఇరవై ఎనిమిదికి ఇక్కడికి వస్తాడు. ఉదయం ఏడున్నర ఫ్లైట్‌కు నేను మా అమ్మాయి ఆయనతో వెళ్లి ఎయిర్ పోర్ట్‌లో దింపి ఇంటికి వచ్చాం. లైబ్రరీ పుస్తకాలన్నీ చదవటం పూర్తి అయింది. కొత్త పుస్తకాలు తెచ్చే ఆలోచన లేదు. ఈసారి పుస్తకాలన్నీ విలువైనవే. వీటిలోని విషయాలను చాలా భాగం ఆర్టికల్సుగా రాసేసి మీకు అందించాను. మిగిలినవాటి విశేషాలను నోట్సు రాసుకొన్నాను. వీలు వెంబడి వాటిని అందజేస్తాను.

అందరికి "శ్రీ వినాయక చవితి శుభాకాంక్షలు". రేపటి నుండి కొత్త ఆధ్యాత్మిక ధారావాహిక ప్రారంభం అని గుర్తు ఉండే ఉంటుంది కదా.

(18-9-12-కాంప్-అమెరికా)

## చవితి చేష్టలు

తెల్లారిందో లేదో మా బామ్మర్ది యోగానందం ఫోన్‌చేసి పెట్టేశాడు. మేం అమెరికాలో ఉన్నాం కదా. ఇక్కడి నుంచి మేం ఫోన్ చేస్తే వాడికి పైసా ఖర్చు లేదు కదా ఆ రహస్యం తెలిసి పొద్దున్నే మేల్కొన్నట్లున్నాడు. ఏదో పండగ కబుర్లు తెలుసు కొందామని వాడి ఆరాటం. అమెరికాలో వినాయక చవితి అంటే యెట్లా ఉంటుందోనని వాడి అనుమానం. వినాయకుడి విగ్రహాలు దొరుకుతాయో లేదో పత్రికి ఏం తంటాలు పడాలోనని భయం వాడికి. భాక్షాలు లేహ్యాలూ చోష్యాలు ఎలా అని మరీ సందేహం..సరే నేనే ఫోన్ చేశా. గోతి కింద కాచుక్కూచుంటాడు కదా ఆలస్యం చేయకుండా ఎత్తాడు. "ఏమిట్రా విశేషాలన్నాను". "బావా నువ్వు కనీసం పండగ శుభాకాంక్షలు చెప్పకపోయినా నాకు తప్పదు కదా. బావా వినాయక చవితి శుభాకాంక్షలు అన్నాడు. "మీ అందరికీ కూడా" అన్నా ముక్త సరిగా. "అక్కడ పండగ యెట్లా చేసుకొంటారు?" అని వాడి తిరుగు టపా ప్రశ్న. "మామూలుగానే పిల్లలు స్కూల్‌కు వెళ్ళేముందు లఘువుగా చేసి ఆ తర్వాతా తీరిగ్గా అసలు పూజ చేస్తాము" అన్నాను. "సరే -పండగ స్పెషల్సేమిటి?"

అని మళ్ళీ లకోటా. "ఏముందిరా' ఉండ్రాళ్ళు పరవాన్నం, పులిహోర మామూలే" అన్నాను. "ఇవి ఇంట్లో చేస్తారా? ఎక్కడ్నించి అయినా పార్సిల్ తెప్పిస్తారా?" వాడి చవట ప్రశ్న. "ఒరే! మన దేశంలో ఎలా చేస్తారో ఇక్కడా అంతకంటే శ్రద్ధగానే చేస్తారు. మీ అక్కయ్యే మడికట్టుకొని అన్నీ చేస్తుంది. నేను మడికట్టుకొని పూజ చేస్తా" అన్నాను. "అబ్బో శానా ఉందే. అక్కడ కూడా ఈ ఆచారాలున్నాయా?" అని మళ్ళీ తిక్క ప్రశ్న. ఇప్పటికే సహనం పోయింది నాకు. "సరే ఇండియా వదిలి మేం నెల అయింది. అక్కడి విశేషాలేమిట్రా" అన్నా టాపిక్ డైవేర్ట్ చేయటానికి.

ఇప్పుడు బల్బు బాగా వెలిగింది. "బోలెడున్నాయి. ఈసారి వినాయక చవితి చాలా ఆశావహంగా అందరు చేశారు బావా" అన్నాడు. "ఆశావహం 'అంటే" అన్నాను నేను. "ఏం లేదు బావా! అందరు ఏదో ఆశించి ఈ చవితిపూజ చేశారు. ఒక్కొక్కడి మనసులో ఒక్కో కోరికా. తప్పక గణపతి దేవుడు తీరుస్తాడని ఆశ" అన్నాడు. "చానళ్ళలో ఆ విశేషాలు చూపిస్తున్నారా?" అన్నాను. "మరీ రెచ్చిపోయి చూపిస్తున్నారు బావోయ్" అన్నాడు. "యే చానెల్‌లో బాగుందో చెప్పు చూస్తాను" అన్నాను. "ఛా.ఛా" అన్నాడు. అదే మిట్రా చేనల్ పేరు చెప్పమంటే ఏదో "ఛీఛీ" అన్నట్లు ఒక్కసారిగా "ఛా.ఛా" అన్నావు?" అని ప్రశ్నించా. "పొరబాటు పడ్డావు బావే, నన్ను అపార్థం చేసుకోన్నావు. నేను చెప్పింది కొత్తగా వస్తున్న 'ఛా ఛా' చానెల్ పేరే నీకు చెప్పింది". "ఆ పేరేమిట్రా అసహ్యంగా" అన్నాను. ఆది సరైన పేరే బావా. దాని అర్థం "ఛానళ్ళకు ఛాలెంజి" ఛానెల్. బలే గా ఉందిలే. జనం విరగబడి చూస్తున్నారు. మీక్కూడా వస్తోందేమో చూడు. మాకిక్కడ అమెరికాలోను విజయయాత్ర చేస్తున్న చానల్ అని తెగ డబ్బా కొడుతున్నారు. నువ్వెప్పుడు పెట్టి చూడలేదా?" అని కసురుకున్నంత పని చేశాడు. "నేను మామూలు చానళ్ళే సరిగ్గా చూడటం లేదు. ఈ తొక్కలో చానళ్ళు ఎక్కడ చూడను? చదువుకోవటానికే నాకు టైం చాలటం లేదు ఈ ప్రయోగాలు నేను చెయ్యలేను. మీ అక్కయ్యకూ విసుగే నని తెలుసుగా నీకు" అన్నాను. "సూక్ష్మంగా అందులో కొత్త విశేషాలేమితో తెలియజేయి బామ్మర్ది" అన్నాను.

"బావా! ఈసారి వినాయక చవితిని బలేగా ఎంజాయ్ చేశాం. మన రాష్ట్ర ముఖ్యమంత్రి గారు వినాయకుడి ముఖాన్ని సోనియా ముఖంగా చేయించి పూజించాడు. కే.సి.ఆర్ గణపతి ముఖానికి తెలంగాణా తల్లి ముఖం పెట్టించాడు. చిరంజీవి అంతూలే ముఖం పెట్టించి పూజించాడు. తనను పార్టీలోకి ఆహ్వానించింది ఆయనే కదా ఆయనే కేంద్రంలో పదవి ఇప్పిస్తాడని ఆశగా. బొత్సా గారు మాత్రం "వోక్సు వాగన్" ముఖం పెట్టించాడు మళ్ళీ వస్తుందనే ఆశ. చంద్రబాబు వినాయకుడికి రెండు ముఖాలు పెట్టించాడు. ఒకటి ఆంధ్రా ముఖం, రెండోది తెలంగాణా ముఖంట. మంత్రి వెంకటేష్

రాయల తెలంగాణా కోరేవాడు కనుక "వినాయకుడి ముఖాన్ని రాయలవారి ఫోజుతో చేయించి పూజించాడు. జై ఆంధ్రా ఉద్యమ నాయకులు తెన్నేటి విశ్వనాదం గారి. ఆకారం పెట్టించారు. మూడు ముక్కలు కావాలనుకొనే వారు మూడు ముఖాలు చేయించి పూజించారు. ఇవన్నీ లైవ్‌లో బలే రంజుగా చూపించారు ఛా ఛా వాళ్ళు" అని ఊపిరి పీల్చుకొన్నాడు యోగి.

"అన్నీ బానే ఉన్నాయి కాని అసలైన పార్టీ కాంగ్రెస్ ఎముఖాన్ని పెట్టి పూజ చేసింది?" అని అడిగాను. దానికి వాడు "ఇదీ తెలీదా బావా! యే ముఖం పెడితే ఏమి కొంప మునుగుతుందో నని తలకాయలేకుండా గణేశుని చేయించి పూజించారని చెవులు కొరుక్కుంటున్నారు బావోయ్" అన్నాడు. "మరి దీన్ని ఛా ఛాలో చూపించాలేదా" అడిగాను. "ఛీ.ఛీ.చూపించలేదు బావా. చూపిస్తే ఏమవుతుందోనని పార్టీ ఆఫీసులోనే తంతు జరిపించేశారని, ముఖ్యులైన వారికే ప్రవేశం కల్పించారని, మీడియా వారికి ప్రవేశం లేదని తెలిసింది బావా". "బానే ఉంది మరి తెలంగాణా ఎప్పుడు వస్తుందని అనుకుంటున్నారు?" అని అడిగా. "అందరి పార్టీల లోపలి గోడలపై "రేపు" అని రాసుకున్నారట బావా. ఆది సీక్రెట్. ఎవరికీ చెప్పట్లేదు ఆ రాత చూపించటం లేదట. "జైపాల్ రెడ్డి సి.ఎం. అవుతాడని ఇక్కడి మిత్రులు అంటున్నారు. అక్కడ ఆ వాసన యేమైనా ఉందా?" అని అడిగా. "అందుకనే నేమో బావా ఈ మధ్య ఆయన్ను చాలా క్లోజప్‌లలో చూపిస్తున్నారు. అక్కడున్నా నువ్వు బలేగా పసి కట్టావే?" అన్నాడు ఆశ్చర్యంగా. "బావా! అక్కయ్య ఎప్పుడూ ఏదో వేరైటీగా గణేష్‌ను చేస్తుంది కదా ఈసారి ఎలా తయారు చేసింది?" అని కుతూహలంగా అడిగాడు "ఈసారి వినాయకుడికి 'పెరట్లో గణపతి' అని పేరు పెట్టింది మీ అక్కయ్య. ఇక్కడి పెరట్లో పండిన సొరకాయ, దోసకాయ, బీరకాయ, టమేటా, చమ్మ కాయలతో వినాయకుడిని చేసింది. ఇక్కడ మట్టి విగ్రహాలు దొరకవు. ఎవరో ఆ మధ్య గిఫ్టుగా మంచి అందమైన గణేష్ విగ్రహాన్నిచ్చారు. ఈ రెండిటితో పూజ చేశాం. చాలా ఆకర్షణీయంగా ఉన్నాయి. బంతి పూలు, చామంతి పూలు, మల్లెపూలు, మందారాలు, మరువం గులాబీలతో పూజ బాగా చేశాం. ఇవీ దొడ్లో పూసినవే. అందుకే ఈసారి పూజ మాకూ సరదాగా ఉందనిపించింది. దేశాలు వేరు అయినా భావన ఒక్కటే. మా 'ఛీమతి' అదే మీ అక్కయ్య పిలుస్తోంది. ఛా ఛా! నీ చానల్ ప్రభావం నా మీదా పడింది శ్రీమతి అనటానికి 'ఛీ మతి' అని వచ్చింది నోటి వెంట ఛీ ఛీ ......" అని ఫోన్ పెట్టేశాను. "బావా బావా" అని అరుస్తూనే ఉన్నాడు యోగానందం బామ్మర్ది.

(19-9-12-కాంప్-అమెరికా)

అమెరికా డైరీ-**36**

## శ్రీ వినాయక చవితి వారం

సెప్టెంబర్ పదిహేడు సోమవారం నుంచి ఇరవై మూడు ఆదివారం వరకు విశేషాలు–

సోమవారం సాయంత్రం లైబ్రరీలో పుస్తకాలన్నీ ఇచ్చేసి గుడ్‌బై చెప్పాను. పద్దెనిమి సెప్టెంబర్ మంగళవారం మా శ్రీమతి పుట్టిన రోజు. మా అమ్మాయి బొబ్బట్లు చేసింది. హోమ్ డిపోలో మంచి చేమంతి పూలకుండీలు రెండు కొన్నాం. సాయంత్రం ప్రక్కనున్న రవి కుటుంబం, నాగమణి కుటుంబంలను పిలిచి మా అమ్మాయివాళ్ళ అమ్మ పుట్టినరోజు వేడుక జరిపింది. బొబ్బట్లనే కేక్‌గా భావించి కట్ చేయించింది. అందరికి బొబ్బట్లు పెట్టింది. బిస్కట్లతో సహా. గాయత్రి కొడుకు క్లారినెట్‌తో "హేపీ బర్త్ డే" పాట వాయించటం విశేషం. అది హేపీ బర్త్ డే పాట అని మా ఆవిడ చెప్పే దాకా నాకు తెలీదు. రవి తలిదండ్రులు రాఘవేంద్ర రావుగారు సుగుణ కామాక్షి గారు రావటం నిండుదనాన్నిచ్చింది. మా అల్లుడు హైదరాబాద్ కులాసాగా చేరాడు. ప్రేమచంద్ గారు ఫోటోలు చూసి ప్రభావతి జన్మదిన శుభాకాంక్షలు పంపారు.

## శ్రీ వినాయక చవితి

పందొమ్మిది బుధవారం శ్రీ వినాయక చతుర్థి. మనకు తొలి పండుగ. ఇండియాలో ఉన్నట్లుగా ఇక్కడ హడావిడి ఉండదు. మా మనవళ్ళు పొద్దున్నే స్కూల్‌కు వెళ్ళే లోపలే నేను లేచి స్నానం చేసి మామూలు పూజ చేసి, వాళ్ళతో దేవుడికి పత్రీ వేయించి ప్రార్ధన చేయించి పంపాను. ఆ తర్వాత ప్రభావతి మా దొడ్లో కాసిన సోరకాయ, దోసకాయ, బీరకాయ, చమ్మ కాయ, టమేటాలతో అద్భుతంగా శ్రీ గణేష్ విగ్రహాన్ని చేసింది మా గార్డెన్ గణేశ (అమెరికాలో దానికి పాలవెల్లి కట్టి, దొడ్లో పూసిన పూలు, పత్రీతో ఉదయం పదింటికి పూజ మొదలుపెట్టి శాస్త్రోక్తంగా చేశాని. మా అమ్మాయి ఉండ్రాళ్ళు, పాల కాయలు, పాయసం వడపప్పు, పానకం తయారు చేసింది. నైవేద్యం పెట్టి కథాక్షిన్తలు అందరికి వేసి పూజ పూర్తి చేశాను. మామిడికాయ పప్పు, వంకాయ కూర, సాంబారు, బొబ్బట్లతో భోజనం. ఈరోజు నుంచే "సౌందర్య లహరి"పై ఆర్తికల్సు ప్రారంభించాను. కొత్త పంచ, లాల్చీ కట్టుకున్నాను. సాయంత్రం పవన్ వాళ్ళింట్లో భజన. సుమారు ఇరవైమంది వచ్చారు. అక్కడ విందు. పవన్ ఇండియా వెళ్లాడు. ఇరవై ఆరున వస్తాడు. వంకాయ కూర, ఆలూ కూర, చట్నీ, ఆవకాయ, పులిహోర, పాయసం, మినప సున్ని, ఉండ్రాళ్ళు సాంబారు అన్నం, పెరుగులతో పవన్ భార్య రాధ మంచి విందే ఇచ్చింది.

శుక్రవారం ఆదినారాయణకు ఫోన్ చేశా. వాళ్ళ ప్రయాణం శనివారం హేపీ జర్నీ చెప్పా. సాయంత్రం మైనేనికి ప్రేమ చంద్ గారికి మా తిరుగు ప్రయాణం గురించి రాశా. మైనేని బెస్ట్ విషెస్ రాశారు. డాక్టర్ యాజికి కూడా తెలియజేశా. అతనూ వెంటనే స్పందించాడు. రాత్రి మా ఇంట్లో భజన. ఇక్కడి సాయి సెంటర్ వాళ్ళందరూ రాలీలో మెడికల్ కాంప్‌కు వాలంటరీ చేయ టానికి వెళ్లటంతో భజనకు ఎవరు రాలేదు. మా అమ్మాయి, మా మనవడు శ్రీకేత్ ఒక పావుగంట భజన గీతాలు పాడి అయిందని పించారు. అంతా అయిన తర్వాత రాధా, పిల్లలు వచ్చారు.

## ఫెస్టివల్ ఆఫ్ ఇండియా

ప్రతి ఏడాది షార్లేట్‌లో బాంక్ ఆఫ్ అమెరికా సౌజన్యంతో ఫెస్టివల్ ఆఫ్ ఇండియను సెప్టెంబర్‌లో నిర్వహిస్తారు. లేబర్ డే లాంగ్ వీకెండ్ రోజుల్లో. ఈసారి అధ్యక్షుడు ఒబామా ఇక్కడ డెమొక్రాటిక్ పార్టీ కన్వెంషన్‌లో ఆ సమయంలో పాల్గొనటం వల్ల వాయిదా పడి, ఈ నెల 22, 23 శని, ఆదివారాలలో నిర్వహించారు. ఇది 18వ ఫెస్టివల్. దీనితో బాటు 'బాలీవుడ్' ఏర్పడి 180 సంవత్సరాలు అయిన సందర్భంగా కూడా దీన్ని ఘనంగా నిర్వహించారు. పాటలు ఆటలు డాన్సులు ప్రదర్శనలతో మోత మోగించారు. భారతీయత ఈ రెండు రోజుల్లో కళ్ళకు కట్టించారు. సౌత్ tryon వీధిలో దీన్ని నిర్వహించారు.

## అమెరికాలో చిత్రకళా "ఆనంద్ మ్"

బాంక్ ఆఫ్ అమెరికా, వేల్స్ ఫార్గో బాంకుల సమీపంలో ఈ కార్యక్రమం జరిగింది. ఔత్సాహికులైన చిత్రకారుల చిత్ర కళాప్రదర్శనను ఏర్పాటు చేశారు. "knight theater" పైన ఉన్న హాలులో ప్రదర్శన జరిగింది. హైదరాబాద్ నుండి మా బావ మరది బ్రహ్మానంద శాస్త్రి ఉరఫ్ ఆనంద్ చిత్రించిన "తెలంగాణా" చిత్రాలను ఆరింటిని శనివారం ఉదయం నేను, మా అమ్మాయి, నాగమణి భర్త తీసుకొనివెళ్లి స్టాండులపై ఏర్పాటు చేసి వచ్చాం. మొత్తం నలభై మంది ఆర్టిస్టులు పాల్గొన్నట్లు, తొంభై యేడు చిత్రాలు ప్రదర్శించినట్లు తెలిసింది.

మర్నాడు ఆదివారం మేమందరం వెళ్లి అక్కడ విశేషాలు చూసి సాయంత్రం అయిదింటికి ముగిసే సమయానికి మా చిత్రాలు మేము ఇంటికి తెచ్చుకున్నాం. మొత్తం ఆరు చిత్రాలకు కలిపి మూడు వేల డాలర్లు అమ్మకానికి పెట్టాం. ఏదీ అమ్ముడు పోలేదు. "బాగా కష్టపడి వేశారు చాలా బాగున్నాయని మెచ్చుకోన్నారట" కాని ఎవరూ కొనే సాహసం చేయలేదు. పాపం మా అల్లుడు వీటిని ఇండియా నుండి షిప్పింగ్‌లో తెప్పించి, అమ్మి పెడదామని ప్రయత్నించాడు. మూడేళ్ళ నుండి ఇక్కడే మూలుగుతున్నాయి. ఈసారి పెట్రోలులు ఖర్చు, పార్కింగ్ చార్జీలు కలిసి ముప్పై

డాలర్లు పైనే అయాయి. నిరాశ మిగిలింది. మొత్తం మీద అయిదు చిత్రాలే అమ్ముడు పోయినట్లు నిర్వాహకురాలిని అడిగితే చెప్పింది. అవీ యాభై, అరవై డాలర్ల మధ్య ఉన్నవే. ఏమైనా ఆర్టిస్టులకు మంచి అవకాశం. తమ ప్రతిభను ప్రదర్శించటానికి మంచి వేదిక లభిస్తోంది. మంచి వైవిధ్యం ఉన్న చిత్రాలు వచ్చాయి, ఊహాత్మకంగానూ ఉన్నాయి. సంప్రదాయబద్ధంగా ఉండి చూపరులను ఆకర్షించాయి. ఆడా, మగా చిత్రకారులు పాల్గొన్నారు. నిర్వాహకులు శ్రద్ధగా నిర్వహించారు. ఫెస్టివల్ అంతా డౌన్‌టౌన్‌లో నిర్వహించారు. ఈ రూపెణా, డౌన్ టౌన్ చూసే వీలు కల్గింది. డ్యూక్ ఎనర్జీ వారి పెద్ద బిల్డింగ్, వేల్సు ఫార్గో వారి బిల్డిగు, బాంక్ ఆఫా అమెరికా వారి బిల్లింగు అన్ని అక్కడే ప్రక్క ప్రక్కన. ఈ ఉత్సవం కోసం రోడ్లు మూసేశారు. శని, ఆది సెలవలె కనుక అందరు పండగకు వచ్చినట్లు వచ్చారు. వస్త్ర ప్రదర్శన నగల, పుస్తకాల బొమ్మల ప్రదర్శన కూడా ఉన్నాయి. వస్త్ర వ్యాపారం బాగానే జరిగినట్లు కనిపించింది.

## పాటలు నృత్యాలు

నైట్ థియేటర్‌లో శని, ఆదివారాలు మధ్యాహ్నం పన్నెండున్నర నుంచి సాయంత్రం ఆరుగంటల వరకు నిర్విరామంగా పాటలు, నృత్యాలు ప్రదర్శించారు. తలిదండ్రులు తమ పిల్లలకు సాంప్రదాయ వస్త్ర ధారణాతో తీసుకొని వచ్చి కూచిపూడి, రవీంద్ర, కేరళ, బాత్రా మొదలైన నృత్యాలను ప్రదర్శించారు. తెలుగు తమిళ బెంగాలీ పంజాబీ మహారాష్ట్ర గుజరాతీ దాన్సులను చేయించారు. షార్లెట్‌లోని సుమారు డజన్ నృత్య విద్యాలయాల విద్యార్థులు తమ అభినయ కౌశలాన్ని చక్కగా ప్రదర్శించారు. కరతాళ ధ్వనులు మారు మ్రోగాయి. అమెరికాలో ఉన్నా, సాంప్రదాయ నృత్యాన్ని వదలకుండా నేర్చుకొని ప్రదర్శించటం చాలా ముచ్చటగా ఉంది. నేర్పిన గురువరేణ్యులు మరీ అభినందనీయులు. ఎప్పుడూ థియేటర్ జనంతో కిట కిట లాడింది. మంచి ప్రోత్సాహం చూపి ప్రేక్షకులు, గొప్ప సహకారం అందించారు. మా ఇంటి దగ్గరున్న ముసునూరు అమ్మాయి నీలిమ కూతురు కూడా డాన్సు చేసింది.

థియేటర్‌లోనే కాకుండా, ఆరు బయట వేదిక నిర్మించి అక్కడ కూడా పాటలు పాడించి చేయించారు. ఇక్కడ పంజాబీ మరాఠీ గుజరాతీ నృత్యాలు చేసి జనం మెప్పు పొందారు. మా ఇంటి దగ్గరున్న గుజరాతీ ఆవిడ, మిగిలిన వాళ్ళతో కలిసి గుజరాతీ నృత్యాన్ని అద్భుతంగా చేసింది. వయసులో ఉన్నవాళ్ళే కాదు, వయసు పైబడిన వారు కూడా ఎక్కడా ఉత్సాహం కోల్పోకుండా నృత్యం చేసి, విజయవంతం చేశారు. చిన్న పిల్లల ప్రదర్శన చూడ ముచ్చటేసింది. థియేటర్‌లోకి వెళ్లి చూడటానికి అయిదు డాలర్ల టికెట్ పెట్టారు. అక్కడే బాంక్ ఆఫ్ అమెరికా వాళ్ళు తిరిగే చక్రాన్ని పెట్టి ఆడించారు. పాయింటర్ ఆగిన చోటును బట్టి బహుమతులిచ్చారు. మా మనవళ్ళు ఆశుతోష్,

పీయూష్‌లు ఎర్రని మంచి శాలువాలు గెలుచుకొన్నారు. చాలా మందికి వచ్చాయి. ఇవి అ బాంక్ ఆఫ్ అమెరికా బహుమతులు.

భారతీయ తినుబండారాల స్టాల్సు జనంతో నిండిపోయాయి. పూరీ, చపాతీ, దోసె, ఇడ్లీ, కాఫీ టీ, మాంగో లస్సీ చోలీ కూర, సాంబారు, పాన్ పూరీ అందర్నీ ఊరించి తినిపించాయి. రెట్లు చాలా తక్కువే. మషాలా దోసె, పాన్ పూరీ, పూరీ, ఇడ్లీలు నాలుగు, కాఫీ, లస్సీ వగైరా రెండు డాలర్లే. ఆదివారం జనం విశేషంగా వచ్చారు.

## అమెరికాలో అగస్త్యరాజు వారి కలయిక

ఉయ్యూరులో మా ఇంటి వద్ద ఉండి కే.సి.పి.లో పనిచేసిన, "లండన్ రాఘవరావు" అని పిలువబడిన అగస్త్య రాజు రాఘవరావు గారు మంటాడలో శ్రీ వెంకటేశ్వర స్వామి దేవాలయాన్ని నిర్మించారు. వారి అబ్బాయి రామమోహనరావు గారు కూడా అందులోనే పని చేసి తండ్రి మరణాంతరం దేవాలయాన్ని నిర్వహించారు. ఆయన భార్య భారతి, ఆయనా మాకు బాగా తెలుసు. క్వార్టర్లలో ఉంటారు. అనుకోకుండా ఈ ఆదివారం నాడు ఫెస్టివల్ ఆఫ్ ఇండియాలో వారు కలిశారు. వారమ్మాయి షార్లెట్‌లోనే ఉందట. అమ్మాయి మనుమరాళ్ళు కూడా కనిపించారు. మా శ్రీమతే ముందుగా వాళ్ళను గుర్తుపట్టింది. కాసేపు మాట్లాడుకున్నాం. ఇలా యాదృచ్ఛికంగా ఉయ్యూరు వాళ్ళు కలవటం తమాషాగా ఉంది. వారు అక్టోబర్ మధ్యలో ఇండియా వెళ్తారు. చిన్నపిల్లలకు కాలక్షేపంగా రబ్బరు, గాలితో నింపిన రెండు ప్లే హౌస్‌లున్నాయి. పిల్లలు అందులో బౌన్సింగ్ ఆడి హడా విడి చేసి కాలక్షేపం చేశారు. తలిదండ్రులు చక్కగా వారిని ఆడించారు.

## అమెరికాలో రైతు బజారు

శనివారం ఇంటికి వస్తు డౌన్ టౌన్‌కు దగ్గరలో ఉన్న "ఫార్మర్ మార్కెట్"కు వెళ్ళాం. ఆంధ్రాలో మార్కెట్ యార్డులున్నట్లే షెడ్లలో రైతు బజారు నిర్వహిస్తున్నారు. చేతి పరిశ్రమలకు కూర గాయాలకు ఒక షెడ్డు, పూలు, చెట్లు ఇంకో షెడ్డు ఉండి చవకగా తాజాగా లభిస్తాయని అందరు ఆరాటపడి వస్తారు. శని, ఆదివారాలే ఉంటుంది ఉదయం పది నుండి రెండు వరకు. జనం వాల్లాడి పోయారు.

## త్రిమూర్తి దేవాలయ ఉత్సవ విగ్రహ ప్రతిష్ట

డౌన్ టౌన్‌లోనే కొద్ది దూరంలో "త్రిమూర్తి దేవాలయం" కడుతున్నారు. యెన్.సి.జగన్నాథం గారు అనే textile వ్యాపారం చేసిన తమిళాయన పదిహేను ఏకరాల స్థలం కొని దేవాలయం నిర్మించే ప్రయత్నం చేస్తున్నారు. మొత్తం ఖర్చు అంతా ఆయనదేనట. గణేశ, బాలాజీ, లక్ష్మి, పద్మావతి దేవుల ఉత్స విగ్రహాలను

చేయించి వాటికి ఆగమ యుక్తంగా హోమాదులతో ప్రాణ ప్రతిష్ట చేస్తున్నారు. భట్టర్ గారు అనే వారి ఆధ్వర్యంలో మూడు రోజుల కార్యక్రమాన్ని నిర్వహించారు ఆరుమందికి పైగా రుత్విక్కులున్నారు. మేము శనివారం సాయంత్రం వెళ్ళాం. అప్పటికి హోమాలు, అధివాసాలు, అయి పూర్ణాహుతి జరిగింది. స్వామివారలకు పవళింపు సేవలో నీలాంబరి రాగంలో "కస్తూరి రంగ రంగా" అనే కీర్తనను ఒకావిడ మహా శ్రావ్యంగా ఆలపించి అందరి అభిమానాని సంపాదించింది. కొందరు పిల్లలు భక్తిగీతాలు పాడారు. ప్రసాదంగా పులిహోర, ఉప్మా, కేసరి, మైసూర్ పాక్, సాంబ్బారన్నం పెరుగన్నం పెట్టారు.

ఆదివారం సాయంత్రం ఫెస్టివల్ ఆఫ్ ఇండియా అయిన తర్వాత మళ్ళీ దేవాలయం దగ్గరకు వచ్చాం. కార్యక్రమాలు పూర్తి అయి యాజ్ఞీకులకు సంభావనలు అందజేస్తున్నారు. మూర్తులను వేదికపైన ఉంచి ప్రసాదం నైవేద్యం పెట్టి మంగళహారతి పాడారు. తిరుమల నుండి వచ్చిన ఆలయ పూజారి భగవద్ రామానుజుల వారు రచించిన "చూర్ణిక"ను శ్రావ్యంగా పాడారు. తిరుమలలో వీరే పాడతారట. ప్రత్యేకంగా పిలిపించారు. ఆ తర్వాతా మూర్తులను అక్కడే ప్రక్కన నిర్మించిన భవనంలోకి మేళ తాళాలతో తీసుకొని వెళ్లి లోపల ఉన్న వేదికపై ఉంచారు. ఈ మూర్తులకే ఇక రోజూ పూజా పునస్కారాలు చేస్తారు. రెండేళ్ళలో ఆలయాన్ని నిర్మించి అసలు విగ్రహాలను చేయించి అప్పుడు ప్రతిష్ట చేస్తారు. అందరికి ప్రసాదంగా చక్ర పొంగలి ఉప్మా, రవ్వ కేసరి, సాంబారు అన్నం, పెరుగన్నం పెట్టారు. అవి స్వీకరించి తిని ఇంటికి వచ్చేసరికి రాత్రి పది అయింది. ఈ విధంగా అమెరికాలో ఒక ప్రతిష్టాపనా కార్యక్రమాన్ని కూడా చూసి ధన్యులమయాం. ఇదే హైలైట్ మా అమెరికా యాత్రకు అనిపించింది.

### శిశిరానికి రెడ్ సిగ్నల్

అక్టోబర్ వస్తే అమెరికాలో చెట్లు ఆకులన్నీ ఎరుపు రంగులోకి మారుతాయి. ఆ తర్వాత ఆకులు రాలి పోతాయి. అప్పుడే దాని ప్రభావం కనిపిస్తోంది. కొన్ని చెట్ల ఆకులు ఎర్రబడి పోతున్నాయి. శిశిరానికి "రావద్దు" అని యెర్ర జెండాలు ఊపుతున్నట్లని పించాయి. ఆ శిశిర వేదన భరించలేక తమ సర్వస్వం అయిన, జీవపూతమైన ఆకులను రాల్చేస్తున్నాయా అనిపిస్తున్నాయి. దీన్నే వీళ్ళు "ఫాల్" అంటారు. "what a fall my dear leaves of the trees!" (25-9-12-కాంప్-అమెరికా)

అమెరికా డైరీ-**37**

### అమెరిక "నిజం"

అమెరికా అంటే భూలోక స్వర్గం అని భావించటం సర్వ సాధారణం. ఇక్కడ వసతులు అంత బాగా ఉంటాయి. ఉద్యోగస్తులకు ఉద్యోగం ఉన్నంత వరకు హేపీ.

ఇద్దరు ఉద్యోగులే అయితే మరీ హాయి. కావలసినంత రాబడి. అన్నీ అమర్చుకో వచ్చు. స్వంత ఇల్లు ఏర్పాటు చేసుకోనూవచ్చు. స్వంత ఇల్లు ఇక్కడ ఏర్పడటం తేలికే. అన్నీ బిల్డర్ చేసి పెడతాడు. ఖర్చులో ఐదో వంతు కాష్‌గా కట్టే సమర్థత ఉండాలి. 'loan' కూడా వాళ్ళే ఏర్పాటు చేయిస్తారు. వాయిదాలు దీర్ఘకాలానికి తీసుకొంటారు కనుక తీర్చటం తేలికే అవుతుంది. అయితే స్వంత ఇంటి చాకిరీ కూడా ఎక్కువే. లాన్ను జాగ్రత్తగా మైన్ టైన్ చేస్తారు. కూరగాయలు పండించు కోవచ్చు. కరెంటు పెట్రోలు చౌక. ఎక్కడికి వెళ్ళినా కారులో వెళ్ళవచ్చు, కారు పొందటమూ తేలికే. సులభ వాయిదాల మీద తీర్చుకోవచ్చు. ఇల్లు బొమ్మరిల్లులాగా మూడు నెలల్లో నిర్మించేస్తారు. కావాల్సిన మోడల్ ఎన్నుకోవటమే. వలసినవన్నీ అమర్చుకోవచ్చు. సేల్సు ఉన్న రోజున కొంటే వస్తువులన్ని చౌకగా వస్తాయి ఫర్నిచర్ తో సహా. ఆఫర్లు చాలా ఉంటాయి. నెట్‌లో వెతుక్కొని ఆర్డర్ చేస్తే తక్కువలోనే ఎలెక్ట్రానిక్స్ పొందొచ్చు. "దెయ్యాల పండగ" (హాలో వెన్) రోజుల్లో కొత్త సంవత్సరం క్రిస్మస్, ఇండెపెండెన్స్ డే వగైరాలలో క్లియరెన్స్ సేల్సులో అతి తక్కువ డబ్బులతో అన్నీ కొని అమర్చుకోవచ్చు. పిల్ల చదువులు హాయి. హైస్కూల్ వరకు చదువు, పుస్తకాలు, బస్సు ఫ్రీ. ఇది ఎంతో ఉపశమనంగా ఉంటుంది. పిల్లలకు ఎప్పటికప్పుడు పరీక్షలు పెట్టి వారి సామర్థ్యాన్ని అంచనావేసి ప్రత్యేక శిక్షణనిస్తారు. బండ చాకిరి పిల్లలకుండదు. తెలివికీ, క్రియేటివిటీకే ప్రాధాన్యం. అందులో బాగా చొచ్చుకుపోవచ్చు. లైబ్రరీలు గొప్ప సేవ చేస్తాయి. వేసవిలో రీడింగుకు ఎక్కువ ప్రాధాన్యతనిస్తారు. స్కూళ్ళు తెరిచే సమయంలో ముందు పైతరగతి పుస్తకాలను తెచ్చుకొని చదువుకోవచ్చు. ముఖ్యంగా ఆర్టుకు ప్రాధాన్యత బాగా ఉంటుంది. శక్తి సామర్థ్యాలను చూపే అవకాశాలుంటాయి. లైబ్రరీలలో కూడా ప్రత్యేక శిక్షణనిస్తారు. అయితే డబ్బులు కట్టుకోవాలి. కరాటే, జిమ్నాస్టిక్స్‌లలో డబ్బిచ్చి చేరి నేర్చుకోవచ్చు. వారికి మంచి ఎంకరేజ్‌మెంట్ ఉంటుంది. భాషా సేవా కేంద్రాలు పోటీలు నిర్వ హించి బహుమతులను అందజేస్తారు. సమ్మర్‌లో y.m.c.a.వాళ్ళు, హిందూ సెంటర్ వాళ్ళు ప్రత్యేక కోర్సులను నిర్వహించి ఆటా, పాటా డాన్సు నాటకం వగైరాలను స్విమ్మింగ్‌ను నేర్పుతారు. దీనికి పిల్లలు బాగా ఉత్సాహం చూపిస్తారు. అపార్టుమెంట్ల వద్దా, కమ్యూనిటీలలో స్విమ్మింగ్పూల్సులలో పిల్లలు వేసవిలో మంచి కాలక్షేపం. సంగీతం నేర్పేవారు డాన్సు నేర్పే వారు లెక్కలు నేర్పే వారు ఉంటారు. మన పిల్లల అభిరుచిని బట్టి ఏర్పాటు చేసుకోవచ్చు. ఇంటికి వచ్చి కూడా చెప్పేవారున్నారు.

ఇక్కడి మనుష్యులు చాలా స్నేహశీలంగా అనిపిస్తారు. ఎవ్వరి జోలికీ ఎవ్వరూ సాధారణంగా రారు. మనుష్యులలో ఆందోళన కనిపించదు. స్థిర చిత్తంతో, ప్రశాంతంగా

ఉండటం గమనార్హం. ముసలివారు కూడా లైబ్రరీలకు కారు నడుపుకొంటూ వచ్చి పుస్తకాలు తీసుకొని వెళ్లి చదువుతారు. షాపింగుకు వస్తారు. వాళ్ళను చూస్తుంటే "అసహాయ శూరులు" అనిపిస్తారు. నవ్వు ముఖంతో పలకరించి "హాయ్" చెబుతారు. నాలాంటి ముసలివారు కానిపిస్తే కారులో వెడుతున్నా నవ్వుతో చేతులతో హాయ్ చెప్పటం వీరి ప్రత్యేకత. మనతో రాసుకు, పూసుకు తిరక్క పోయినా, మర్యాదను చక్క గా పాటించటం ఆనందమేస్తుంది. అది వారి సంస్కారం. ఇదే అమెరికనిజం అనిపిస్తుంది. ఎక్కడైనా ఇలాగే ఉంటారు. హడావిడి హాళ్ళూ, పెళ్ళూలుండవు.

ఇక్కడి రోడ్లను చూస్తే బలే ముచ్చటగా ఉంటాయి. అసలు రోడ్లు ముందుపుట్టి అమెరికా తర్వాత పుట్టిందా అన్నంత ఆశ్చర్యం వేస్తుంది. రోడ్ల మీద ప్రతి మైలుకి గుర్తులు ఊర్లోకి వెళ్ళటానికి, ఊరి బయటకు రావటానికి, ఏ రోడ్డు ఎంత దూరంలో ఉందో తెలియజేసే వివరాలు అన్నీ పకడ్బందీగా ఉంటాయి. దీనికి తోడు ఇప్పుడు జియో పొజిషన్ సిస్టం అంటే జి .పి.ఎస్.కూడా వచ్చింది కనుక ఎక్కడికి వెళ్ళాలన్నా రోడ్డు మాప్‌తో పనిలేదు. హాయిగా డైరెక్షన్లు ఫాలో అవుతూ ఎంత దూరమైనా వెళ్ళవచ్చు. ఇక్కడ గొప్పతనం ఒకటి ఉంది. ఎన్ని గంటలైనా స్వంతకారులో హాయిగా ప్రయాణించి వెళ్తారు కుటుంబం అంతా ఆనందాన్ని అనుభవించే వీలు. శని, ఆదివారాలోస్తే ఎక్కడికో అక్కడికి పిక్నిక్‌కో, సైట్ సీయింగ్‌కో వెళ్లి ఎంజాయ్ చేస్తారు. ఇండియన్ హోటళ్ళు దాదాపు అన్నిచోట్లా ఉన్నాయి. మన తిండి మనం తినచ్చు. ఉడిపి హోటళ్ళు మద్రాస్ హోటళ్ళు పంజాబీ దాబాలు అన్నీ ఉన్నాయి వెతుక్కొని వెళ్ళాలి అంతే. ఎన్నో ఫ్లై ఓవర్లు ఎటు వెళ్తున్నామో, ఎటు వస్తున్నామో తెలీకుండా ఆశ్చర్యాన్ని కల్గిస్తాయి. అమెరికాలో ఎంత దూరం ప్రయాణం చేసినా ఒకటే స్సేనారి కానిపిస్తుంది. అవే ఇల్లు. అవే స్టోర్లు. అన్నీ ఒకే మోడళ్ళు. సామ్స్, వాల్ మార్టు, క్రోజర్, కే మార్టు, జె.సి పెన్నీలలో బట్టలు వస్తువులు చీప్. ఎలెక్ట్రానిక్స్ చవక.

ఎంతదూరం ప్రయాణం చేసినా అలుపూ సొలుపు ఉండదు. రోడ్లు ప్రయాణానికి తగినట్లుంటాయి. రోడ్డుకు ఇరు వైపులా పైన్, కోన్ మొదలైన చెట్లు పచ్చదనంతో పరవశింప జేస్తాయి. కొన్నిచోట్ల మన ఊటీ, కొడైకెనాల్‌లాగా భలేగా ఉంటాయి. ఇండియా వాళ్లకు ఇక్కడ హాయి. సీతా కాలం భరించటం ఓ కొంత ఇబ్బందే. దానికి సరిపడ దేర్మో వస్త్రాలు కోట్లు బూట్లు తప్పవు. కారులోంచి బయటికి వెళ్లినప్పుడే చలి. కారులో హీటు, షాపుల్లో హీటు ఉండనే ఉంటుంది. మిచిగాన్‌లాంటి చోట స్నో బాగాపడి ట్రాఫిక్‌కు ఇబ్బంది కలుగజేస్తుంది. అయినా వెంటనే ఉప్పు చల్లి క్లియర్ చేస్తారు. కార్లు తుడుచుకోవాలి. ఫాల్ చలి ప్రాంతాలలో అద్భుతంగా ఉంటుంది. ఆకులు ఎర్రబడి రాలిపోతు సుందరంగా ఉంటుంది. చెట్ల మొదళ్ళలో చలికి రక్షణ

కోసం చెక్కపొట్టు వేస్తారు. అమెరికాలో ప్రత్యేకం ఒకటేమిటంటే చెట్లు నిటారుగానే పెరుగుతాయి, కాదు కాదు నిటారుగానే ఉండేట్లు పెంచుతారు. మొక్క నాటిన రోజు నుండి దీనిపై శ్రద్ధ తీసుకోవటం ఆశ్చర్యంగా ఉంటుంది. ఎక్కడా దాదాపు వంకర వృక్షాలు కని పించవు. అంతే కాదు చెట్లను నరకటం ఎక్కడా కనిపించదు. రోడ్డువేడల్పు చేయటానికో ఇళ్ళ నిర్మాణం అప్పుడో చెట్లను నరుకు తారు. దారి వెంబడి చెట్లను ముట్టకోరు. కొమ్మ విరిగితే అక్కడి వరకే కోసి మిగతా చెట్టును రక్షిస్తారు. "వృక్షో రక్షతి రక్షిత" అన్నదాన్ని అమెరికన్లు బాగా పాటిస్తారు.

రోడ్డు ప్రక్కల పూల మొక్కలు, అపార్ట్‌మెంట్ల వద్ద పూల మొక్కలు ముచ్చటగా ఉంటాయి. ఏ సీజన్‌కు ఆ సీజన్ పూలు పూసే మొక్కలు, చెట్లను ఎన్నుకొని పెంచుతారు. మొన్నటి దాకా రోడ్ల ప్రక్క చెట్లకు యెర్రని గులాబీ రంగు తలుపు, పింక్, కలరు పూసి నయనానందకరం చేస్తాయి. ఇప్పుడు పొదల్లాగా ఉన్న చెట్లు ముళ్ళ పంది ఆకారంలో సూదుల్లాంటి ఆకులతో భలేగా కని పిస్తున్నాయి. రోడ్ల వెంట వెళ్ళేవారికి మానసిక, నాయనానందాన్నిస్తాయి ఇక్కడి చెట్లు. "ఆనందో బ్రహ్మ" అనిపిస్తుంది. పండ్ల చెట్లు రోడ్ల మీద తక్కువే.

## పూలోయమ్మ పూలు

ఇక్కడ మాల్సులో ముఖ్యంగా హోమ్ డిపో, వాల్ మార్ట్, గార్డెన్ రిడ్జి, మొదలైన చోట్ల ఎన్నో రకాల పూల చెట్లను కుండీలలో సంరక్షించి పెంచి అమ్ముతూ ఉంటారు. చేమంతుల్లో ఎన్నో రంగులు, సైజులు ముచ్చటగా ఉంటాయి. అలాగే బంతి పూలులు తెలుగు దేశానికే ప్రసిద్ధి అనుకొంటాం. ఇక్కడ కూడా విపరీతంగా బంతి పూలున్నాయి ఇళ్ళల్లో దొడ్లలో కూడా పెంచుకొంటారు. హూస్టన్ నగరాన్ని "మాగ్నోలియా" సిటీ అంటారు. అక్కడ చంపక పుష్పాలు ఎక్కువ. భలే అందంగా, తెల్లగా పెద్దగా ఉండే పూలు. మనకు హిమాలయాలలోనే లభిస్తాయి. ఇక్కడ షార్లెట్‌లోను మాగ్నోలియా అంటే చంపకాలు బాగా ఉన్నాయి. మరువం, మల్లె కూడా బాగా ఉన్నాయి కరివేప చెట్టు సోర, బీర, వంగ మిర్చి టమేటా, ఆకుకూరలను మనవాళ్ళు పెరట్లో బాగా పండిస్తున్నారు. అలబామాలోని హన్స్ట్ విల్‌లో మైనేనిగారి భార్య సత్యవతి గారు ఎన్నో రకాల కూరలు పండిస్తూ అందరికి ఉచితంగా అందిస్తున్నారు. ఇక్కడ మా అమ్మాయి, సుబ్బు ఇళ్ళల్లో కూరలు బానే పండిస్తున్నారు. కనుక ఇండియా వాళ్ళు ఇక్కడే అన్నీ పండిస్తున్నారు. ఎక్కడో చలి రాష్ట్రాలలో పంటలుండవేమో కాని మిగిలిన చోట్ల స్టోర్సులలో అన్నీ దొరుకుతాయి. అదే ఊరట. దొరకని కూర ఉండదు. చేసుకొనే ఓపిక లేకపోతే రెడీమేడ్ ఫుడ్ రెడీ. కనుక తిండి సమస్య లేదు.

పెట్రోల్ అంటే వీళ్ళ భాషలో "గాస్". చౌకే. బంకుల దగ్గర నిలబడి గాస్

కొట్టించుకోనక్కరలేదు. ఎవరికి వారు హాయిగా "స్వంతంగా గాస్ కొట్టుకొంటారు". అదీ దక్షిణ రాష్ట్రాలలో, ఆదివాసులుండే ప్రాంతాలలో గాలను పెట్రోలు మిగిలిన చోట్లకంటే నలభై పైసలు తక్కువ. కారణం దీనిపై ఇక్కడి ప్రభుత్వం టాక్సు వెయ్యకపోవటమే. సౌత్ కరోలీనాలో నార్తు కరోలీనా కంటే గాస్ నలభై సెంట్లు తక్కువ. ఇక్కడ ఈ రెండు రాష్ట్రాలు పక్కనే సందు దాటితే వేరుగా ఉంటాయి. అంత కలిసి పోయాయి. బియ్యం పటేల్ బ్రదర్సులో కొంటారు. భారతీయ వస్తువులన్నీ ఇక్కడ లభిస్తాయి. అప్పడాలు వడియాలు ఊరు మిర్చితో సహా. దీపావళికి వీళ్ళు అన్నీ చాలా తక్కువ రేట్లకు అమ్ముతారు. దీపావళి సామాను అమ్మే దుకాణాలూ ఉన్నాయి స్వంత ఇంటివాళ్ళు హాయిగా కొని కాల్చుకోవచ్చు.

ఆంధ్రావాళ్ళు, తమిళవాళ్ళు అందరు కలిసి మేలసే ఉంటారు. బర్త్ డే పార్టీలు పండుగలు షష్టిపూర్తి మారేజ్ డేలు చక్కగా నిర్వహించుకొంటారు. మన దేశ సాంప్రదాయాన్ని అప్పుడు బాగా పాటిస్తారు. శ్రావణ మాసం నోములు ఆడవాళ్ళు నోచి వాయనాలిస్తారు కనుక ఆంధ్రాలో ఉన్న భావన కనిపిస్తుంది. ఇలా అన్నిచోట్లా ఉంటుందని చెప్పలేం. దేవాలయాలు ఎక్కడ పడితే అక్కడ ఉన్నాయి కనుక శని, ఆదివారాలలో అక్కడికి వెళ్ళి దైవదర్శనం చేసుకొంటారు. అక్కడ టిఫిన్ సెంటర్లు ఉంటాయి. తీర్ధ ప్రసాదాలతో కాలక్షేపం చేయవచ్చు. అన్ని రకాల దేవుళ్ళను ఒకే కాంప్లెక్సులో ఉంచుతారు. కనుక టెంపుల్ కాంప్లెక్సు అని పిస్తుంది. పూజారులు కూడా సంప్రదాయ బద్ధంగా పూజలు నిర్వహిస్తారు. కళ్యాణాలు, అభిషేకాలు ధనుర్మాసం, ఏకాదశి, దీపావళి, దసరా, మొదలైన రోజుల్లో ప్రత్యేక పూజలుంటాయి. కనుక ఇబ్బందేమీ లేదు. గుడిలోనే బర్త్ డే లు ఫంక్షన్లు చేసుకొనే వీలు ఉంటుంది.

తలిదండ్రులను వేసవిలో ఇక్కడికి తెచ్చుకొని వారికి ప్రదేశాలు చూపిస్తూ వారితో గడపటానికి ఉత్సాహపడుతుంటారు. సాఫ్టువేర్ ఉద్యోగాల వాళ్ళ వేలాది తలిదండ్రులకు అమెరికా వచ్చి చూసే గొప్ప అవకాశాలొచ్చాయి. ఎవరూ ఎప్పుడూ ఊహించని మార్పు. యువకులకు స్వర్గసీమ అమెరికా ముసలి వారికి కాలక్షేపం ఉండదు. ఏదో వ్యాపకం లేకపోతే ఇబ్బందే. ఇన్ని అవకాశాలు ఉండబట్టే అమెరికా అంటే మోజు పెరిగింది. అమెరికనిజం అంటే ఇదే.

(26-9-12-కాంప్-అమెరికా)

## చైర్మన్ కోటేశ్వరరావు గారు

కృష్ణాజిల్లా అన్నిటితోబాటు రాజకీయానికీ పెద్ద కేంద్రమే. ఆ జిల్లాకు ఒకప్పుడు రాజకీయానికి గొట్టి పాటి బ్రహ్మయ్య, అయ్యదేవర కాళేశ్వరరావు, టి.వి.ఎస్ చలపతిరావు

గార్లు పెద్దదిక్కు. ఆ తర్వాత కాకాని వెంకట రత్నం గారి శకం వచ్చింది ఉక్కు కాకాని అని పేరున్న ఆయన ప్రాజలకు అతి సన్నిహితంగా మెలిగారు. జిల్లా బోర్డు అధ్యక్షునిగా ఆయన ఆ జిల్లాకు విద్యాదానం చేశారు. అడిగినచోట్ల అల్లా ప్రాథమిక, ఉన్నత విద్యాలయాలను ఏర్పాటు చేసి కమిటీలను ఏర్పరచి వారి సహకారముతో వాటిని అభివృద్ధి చేశారు. ఎన్నో వేలమంది ఉపాధ్యాయులను నియమించిన ఘనత కాకానిది. రైతు బాంధవునిగా కూడా పేరొందారు. పాలకేంద్రాల నేర్పరచి ఉద్యోగాలిచ్చారు. ఆయన తర్వాత మాగంటి అంకినీడు జిల్లా పరిషత్ అధ్యక్షులైనారు. ఆయనది అంతా అదో ధోరణిలో నడిచి, ఆ పదవి గౌరవం దెబ్బతింది. కాకాని రాజకీయ దురంధరుడు. చాణక్య నీతితో ప్రతి గ్రామంలోను తన వర్గాన్ని ఏర్పరచుకొన్నారు. శాసన సభ్యునిగా, మంత్రిగా తన దక్షతను నిరూపించుకొన్నారు. విద్యా విప్లవం, శ్వేత విప్లవాన్ని కృష్ణాజిల్లాకు తెచ్చిన ఘనత కాకాని వారిదే. ఆ తర్వాతా అంతా నీరవం, నీరసం ఆవరించింది.

## చైర్మన్ శ్రీ పిన్నమనేని కోటేశ్వరరావు

అలాంటి శూన్యంలో రుద్రపాక కుర్రాడు శ్రీ పిన్నమనేని కోటేశ్వరరావు గారు అందరి దృష్టిని ఆకర్షించారు. సరైన నాయకత్వం కావాలంటే పిన్నమ నేనే అని అందరు భావించారు. నల్లగా వెడల్పు ముఖంతో మల్లెపూల వంటి తెల్ల ఖద్దరు పంచతెల్ల లాల్చీ, ఉత్తరీయంతో ముఖంలో లక్ష్మీ కళతో చూపరులను ఆకర్షించే వారు. ఆయనకు అంకినీడు గారి తర్వాత జిల్లా పరిషత్ అధ్యక్షా పదవి దక్కింది. కాకాని గారి ఆశీస్సులూ పుష్కలంగా ఉండటంతో పని తేలికయినది. ఆ రోజుల్లో సమితి ప్రెసిడెంట్లు అందరు కలిసి ఎన్నుకొనే పద్ధతి ఉన్నట్లు జ్ఞాపకం. అందరు ఏకగ్రీవంగా వీరినే ఎన్నుకొన్నారు. అప్పటి నుంచి మూడుసార్లు ఆయన దాన్ని నిర్వహించి, రెండుసార్లు శాసన సభ్యులైనా "చైర్మన్ కోటేశ్వరరావు" అనిపించుకొన్నారు. క్రమ క్రమంగా తన పని తీరుకు మెరుగులు దిద్దుకొన్నారు. పంచాయతీరాజ్ వ్యవస్థను కూలం కషంగా అధ్యయనం చేశారు. ప్రజలకు చేరువయ్యే మార్గాలను అనుసరించారు. స్కూల్ కమిటీ అధ్యక్షుల మాటకు విలువనిచ్చి ఆ స్కూల్‌లో ఎవరెవరు కావాలో వారి మాటమేరకు నియమించటం, బదిలీ చేయటం చేశారు. కాకాని విద్యాలయాలను శాంక్షన్ చేస్తే వాటి భౌతిక పరిస్థితుల బాగోగు లను పిన్నమనేని చూశారు. కాకాని బ్రహ్మ, పిన్నమనేని విష్ణువు. కృష్ణాజిల్లా విద్యారంగానికి కావలసిన అన్ని సౌకర్యాలు కలగ జేశారు. ప్రధానోపాధ్యాయుని మాటకు విలువనిచ్చారు. కనుక సిబ్బంది ఆయన మాట వినే అవకాశం ఎక్కువైంది. విద్యా లయాలన్ని కళ కళ లాడాయి. మంచి ఫలితాలు వచ్చేవి. కష్టపడి బోధించేవారు. సమర్ధులైన ఉపాధ్యాయులు తమ శక్తి సామర్ధ్యాలను చూపించే వారు. అలాంటి బంగారు కాలం పిన్నమనేని వారిది.

## షార్లెట్ సాహితీ మైత్రి బంధం

నేను 1963లో అంకినీడు గారి పాలనలో సైన్స్ అసిస్టెంట్‌గా మోపిదేవి హైస్కూల్‌లో నియమింప బడ్డాను. అంకినీడు గారే మమ్మల్ని రెగ్యులర్ ఉపాధ్యాయులను చేశారు. అప్పటిదాకా వేసవి శలవల్లో "హూస్టు" చేసేవారు కాని మా అదృష్టం అంకి నీడు గారు మమ్మల్ని సెలవల్లో తీసేయకుండా కొనసాగేట్లు చేశారు. అయితే ఆయనకు బదిలీల విషయంలో అవగాహన ఉండేది కాదు. ఒకే వ్యక్తికీ ఒకేరోజు మూడు పూటలా మూడు ఆర్డర్లు మూడుచోట్లకు వచ్చేవి. అర్ధరాత్రి బదిలీలు. అంతా అస్తవ్యస్తంగా ఉండేది. అప్పుడు పిన్నమనేని అధ్యక్షులయారు. నేను రెండేళ్లు మోపిదేవిలో పనిచేసి ఉయ్యూరుకు బదిలీకి ప్రయత్నిస్తున్నాను. నా స్నేహితుడు గండి వాసు తనకు కపిళేశ్వర పురంలో మాజీ శాసన సభ్యులు శ్రీ కొల్లిపర సూరయ్య గారు బాగా తెలుసునని ఆయన, నా బదిలీకి సాయం చేస్తారని చెప్పి నన్ను వారింటికి తీసుకొని వెళ్లాడు. ఆయన అప్పటికే వయోవృద్ధులు పాత తరం కాంగ్రెస్ నాయకులూ. ఆయన నన్ను "మేష్టారు! కొద్ది రోజుల్లో జిల్లా పరిషత్ చైర్మన్‌గా పిన్నమనేని వస్తున్నాడు. ఆయన కుర్రాడే కాని అన్నీ తెలిసినవాడు. మీ డైరీలో రాసుకోండి. వేసవి సెలవల తర్వాత మీరు మీ ఉయ్యూరులో ఉంటారు. బాధ్యత నాది" అన్నారు. అన్నట్లుగానే నన్ను ఉయ్యూరు ట్రాన్స్‌ఫర్ చేయించారు సూరయ్య గారు. ఆ తర్వాత జిల్లా పరిషత్ అభివృద్ధి కార్యక్రమాలేన్నిటినో చేబట్టారు. రోడ్లు, భవనాలు, ప్రైమరి హెల్త్ సెంటర్లు అన్నీ ఆయన చలవే. ఎక్కడా డాక్టర్ల, మందుల కొరత ఉండేది కాదు. అన్నిటినీ స్వయంగా ఆయన తెలుసుకొని చేసేవారు. ప్రధానోపాధ్యాయుల సమావేశాలలో స్ఫూర్తినిచ్చే ప్రసంగాలు చేసే వారు. మంచిని మెచ్చేవారు. సరిగ్గా పని చేయని వారిని పిలిచి మందలించేవారు. అన్నిటిలో ఆయన క్వాలిటీని నెలకొల్పారు మేష్టర్లందరూ ఆయనకు తెలుసు. ఆఫీసు సిబ్బందీ ఆయనకు తెలుసు. ఒక్క త్రాటిమీద జిల్లాను నడిపించిన నాయకుడైనారు. క్రమంగా కాకాని వర్గం అంతా పిన్నమనేని వర్గంగా మారిపోయారు. ప్రతి గ్రామంలోను పిన్నమనేనికి స్వంత గ్రూపు మనుషులుండేవారు. వారి పేర్లన్నీ ఆయనకు తెలుసు. కనిపించినప్పుడు పేరుపెట్టి పిలిచేవారు. ఒక్కోసారి విషయాలను కుండబద్దలు కొట్టినట్లు చెప్పే వారు. బాగా పని చేసే వారంటే మహా ఇష్టం. బాగా బోధించే ఉపాధ్యాయులేవ్వరో ఆయనకు గుర్తే. అయన కాంగ్రెస్ అభిమానే. శాశన మండలి ఎన్నికలలో కొల్లూరి కోటేశ్వరరావు గారికి పనిచేసి మూడుసార్లు గెలిపించారు. వీరిద్దరి జోడీ గొప్ప గా ఉండేది. కమ్యునిస్టు మాస్టర్లను బదిలీ చేయమని అడిగినా, వారు కొల్లూరికి పని చేయలేదు. పి.శ్రీ రామమూర్తి గారికి చేశారని ఎవరైనా చెప్పినా ఆ సాకుతో వారిని బదిలీ చేయలేదు. వారి సమర్ధత ఆయనకు తెలుసు. నా ఎదురుగుండానే ఒకసారి అలాటి ఫిర్యాదు వస్తే ఆయన వారిని మందలించి ఆ

ఉపాధ్యాయులకు అండగా నిలిచారు.

మాకు మా ఉపాధ్యాయ నియోజకవర్గం నుండి ఎన్నికైన కొల్లూరి గొప్ప అండా దండా. ఆయనా, పిన్నమనేని అన్నా తమ్ముడులాగా పనిచేసి ఉపాధ్యాయుల సమస్యలను జిల్లాలోనే పరిష్కరించే వారు. అవసరమైతే శాసన సభ మండలిలో ప్రస్తావింప జేసి, సాధించే వారు. ఉపాధ్యాయులంటే పిన్నమనేనికి మహా గౌరవం. కనిపించగానే ఆయనే ముందు నమస్కరించేవారు. సంస్కారం ఉన్న మనిషి. జిల్లాలోని నాయకులంతా ఆయన అంటే ఇష్టంగా ఉండేవారు, గౌరవించేవారు. ఒకసారి నేను పామర్రు నుండి ఉయ్యూరుకు ట్రాన్స్‌ఫర్‌కు పెట్టుకొన్నాను. మా గాడ్ ఫాదర్ కొల్లూరి. నేను ఒకసారి కొల్లూరిని కలవటానికి బందరులోని ఆయన తెలుగు విద్యార్థి ఆఫీసుకు వెళ్లాను. అప్పుడే పిన్నమనేనితో మాట్లాడుతున్నారు "కోటేశ్వర రావు గారూ! మీరు దుర్గా ప్రసాద్ గారిని ఉయ్యూరు ట్రాన్స్‌ఫర్ చేయకపోతే అక్కడ మీకు, నాకు మంచినీళ్ళు ఇచ్చేవాళ్ళు కూడా ఉండరు" అని చెప్పుతున్నారు. అంత అభిమానం ఉండేది కొల్లూరికి నా మీద. అంతే! వారంలో బదిలీ ఉత్తరువులు నాకు అందాయి. అలా కృష్ణార్జునులులా వారిద్దరూ కృష్ణాజిల్లాలో పని చేసి, దాని ప్రగతిని తీర్చిదిద్దారు. ఆయన పదవి నుండి దిగిపోయిన ప్రతిసారి ఆయన్ను ప్రతి స్కూలు ఘనంగా ఆహ్వానించి సత్కరించేది. అదొక వేడుకగా అందరు జరిపేవారు. ఖద్దరు వస్త్రాలు శాలువాలు దండలుతో ఘనంగా నిర్వహించే వారు. పార్టీలు భోజనాలు లెక్కే లేవు. సన్మాన పత్రాలు చెప్పనే అక్కరలేదు. నేనే చాలా సభల్లో ఆయనపై కవిత్వం రాసి చదివా. అందరివాడు అనిపించుకొన్నారు పిన్నమనేని. "ఉపాధ్యాయ బంధు"గా ఆయన్ను ఆప్యాయంగా పిలుచుకొనే వారం. కాకాని వారసత్వాన్ని నిలిపి జిల్లాలో గణనీయమైన నాయకత్వాన్ని సాధించారు.

బహుశా మూడోసారి ఎన్నికైనపుడు మేమంతా జిల్లా పరిషత్ కార్యాలయంలో ఉన్నాం. కొల్లూరి కూడా మాతో ఉన్నారు. హైదరాబాద్ నుండి ఫోన్ల మీద ఫోన్లు వస్తున్నాయి. ఆయన్ను రాష్ట్ర మంత్రివర్గంలో చేరమని. ఆయన వాటికి సమాధానంగా "నాకు జిల్లా పరిషత్ చాలు. నాకంటే సీనియర్ చనుమోలు వెంకటరావు గారున్నారు. వారికిస్తే నాకు ఇచ్చినట్లే. నన్నిక బల వంతం చేయద్దు" అని స్పష్టంగా చెప్పారు. అలా వెంకట్రావు గారు మినిస్టర్ అయారు. జిల్లా పరిషత్ అంటే ఆయనకు వీరాభి మానం. మినిస్ట్రీని వద్దనుకొన్న మనీషి పిన్నమనేని. ఆయనకు రైతు కష్టాలు తెలుసు, టీచర్ల బాధలు తెలుసు. అన్నీ తెలుసుకొని ఆయన పనిచేసి అందరికి తృప్తిని కల్గించారు.

1987లో నాకు ప్రధానోపాద్యాయునిగా ప్రమోషన్ వచ్చి "వత్సవాయి" వేశారు. అక్కడి నుండి బయట పడటానికి నా ప్రయత్నాలు నేను చేస్తూనే శని, ఆదివారాల్లో ఉయ్యూరు వెళ్ళేవాడిని. ఒకసారి ఆ స్కూల్లో ఉపాధ్యాయుల కొరతను రుద్ర పాక వెళ్లి

ఆయన దృష్టికి తెచ్చాను. అప్పటికి ఆరు పోస్టులు ఖాళీగా ఉన్నాయి. ఆయన నవ్వుతూ "మేస్టారూ ! అక్కడ పని చేసిన ఏ హెడ్ మాస్టారు నన్ను ఇంతవరకు పోస్టు ఫిలప్ చేయమని అడగలేదు. వాళ్ళు అక్కడి నుండి బయటపడటానికి మాత్రమే నన్ను కలిసి చెప్పేవారు. మీరే మొదటిసారి దీన్ని నాకు దృష్టికి తెచ్చారు. అక్కడి అన్ని పోస్టుల్ని ఒక పదిహేను రోజుల్లో నింపుతాను. థాంక్ యు" అన్న సౌజన్యమూర్తి. అన్నమాట నిలబెట్టుకొని అన్ని పోస్టులను నింపారు, నేను అక్కడి నుంచి బదిలీ అయ్యేసరికి అన్నీ ఫిలప్ అయాయి. "దటీస్ పిన్నమనేని".

కృష్ణాజిల్లా టీచర్సు గిల్డ్ అంటే విపరీతమైన అభిమానం. అది కాకాని వారి చలవ అనేవారు. తాను కూడా ఎంతో శ్రద్ధ తీసుకొని గిల్డు కార్యక్రమాలలో పాల్గొనేవారు. ముఖ్యమంత్రులను, మంత్రులను, శాసన సభ్యులను పిలిపించి, వారి సముఖంలో సమస్యలను చెప్పించి పరిష్కరించటానికి సాయం చేసేవారు. కొల్లూరి కృషీ ఇందులో తక్కువేమీ లేదు. "కాకాని టీచర్సు గిల్డ్ హోమ్"ను బెజవాడలో ఆయన పూనికతోనే కట్టబడింది. ఆ తర్వాత ఉపాధ్యాయులందరూ ఆలోచించి, బందరులో టీచర్స్ గిల్డ్ ను "పిన్నమనేని టీచర్స్ గిల్డ్"గా కట్టించి ఆయన సేవా నిరతికి నీరాజనం పట్టారు. అక్కడే ఆనాటి విదేశంగ మంత్రి పి.వి.నరసింహా రావు గారు వచ్చారు. గిల్డు కార్యక్రమం అంటే పిన్నమనేని, కొల్లూరి లేకుండా జరగలేదు. గిల్డు అధ్యక్షులుగా ఎవరుంటే బాగుంటుందో ఆయన్ను అడిగి తెలుసుకొని చేసేవారు. అంటే ఉపాధ్యాయ ఉద్యమానికి పిన్నమనేని వెన్ను దన్నుగా నిలిచారు. విద్యాలయాలలో ఉత్తమ ఫలితాలను సాధించిన వాటికి బహుమతులు, సబ్జెక్టులో ఎక్కువ శాతం మార్కులు సాధించిన విద్యార్థులకు, ఆ సబ్జక్టులను బోధించిన ఉపాధ్యాయులకు సన్మానం పారితోషికాలను జిల్లాపరిషత్ సమావేశంలోనో, ప్రధానోపాధ్యాయుల సమా వేశంలోనో ఇప్పించే గొప్ప ఒరవడికి పిన్నమనేని శ్రీ కారం చుట్టారు. అదొక పండుగలాగా జరిపించేవారు. విద్యమీద ఆయనకు అంత అభిరుచి, తపనా, ఆసక్తీ ఉండేవి. అందుకే ఆయన తర్వాతా, ముందు ఎందరు చైర్మన్‌గా చేసినా "చైర్మన్ అంటే పిన్నమనేనే" అనిపించుకొన్నారు. అందుకే అందరు చైర్మన్ కోటేశ్వరరావు అనే అంటారు. ఆయన ముద్రను ప్రతిదానిలో చూపించిన మార్గ దర్శి పిన్నమనేని.

పిన్నమనేనికి పంచాయితీరాజ్ మీద పూర్తి అవగాహన ఉంది. అందుకే దేశంలో పంచాయితీరాజ్ సమావేశం ఎక్కడ జరిగినా పిన్నమనేనిని సంప్రదించి సలహాలను తీసుకొనేవారు. దాని అభివృద్ధికి ఆయన పడినంత తపనా, చేసినంత శ్రమ ఎవ్వరూ చేయలేదు. జిల్లాలో ఒక పెద్ద మనిషిగా ఆయన దాదాపు అరవై సంవత్సరాలు నిలిచి అందరికి తలలోని నాలుకలాగా పని చేశారు. అందర్నీ

కలుపుకొనిపోయే మనస్తత్వం పిన్నమనేనిది. నా విషయంలో నన్ను చాలాసార్లు బదిలీ చేశారు. నేను మళ్ళీ ప్రయత్నించి రెండు మూడు నెలల్లో నాకు కావలసిన చోటుకు వచ్చే వాడిని. చెప్పింది సంపూర్ణంగా విని ఏ పనైనా చేసేవారాయన. ముఖంలో మంచి వర్చస్సు ఉండేది. బొట్టు పెట్టుకొంటే మరీ కళగా ఉండేవారు. సమయపాలన బాగా పాటించేవారు. అలాంటి దిగ్గజం శ్రీ పిన్నమనేని కోటేశ్వరరావు గారు అంటే చైర్మన్ కోటేశ్వరరావు గారు 84వ ఏట నిన్న స్వర్గస్తులయారని తెలిసి ఉపాధ్యాయ లోకం విషాద గ్రస్తమైంది. వారికి ఆత్మశాంతి కలగాలని కోరుకొంటున్నాను.

(27-9-12-కాంప్-అమెరికా)

అమెరికా డైరీ-**38**

## ఇండియన్ అమెరికన్‌లకు కుటుంబమే ముఖ్యం

అమెరికాలో ఉండే ఇండియన్ అమెరికన్‌లకు అన్నిటికంటే కుటుంబమే ముఖ్యం అని సర్వేల వల్ల తేలింది. ఆసియా అమెరికన్లపై విస్తృత అధ్యాయంనం చేసింది "pew research center" అనే సంస్థ. 67% ఆసియా అమెరికన్లు, 50%సామాన్య ప్రజలు కుటుంబం ముఖ్యం అని భావిస్తే 78% ఇండియన్లు కుటుంబానికే మార్కులు ఎక్కువ వేశారట. అంతేకాదు మంచి తల్లి దండ్రులు అనిపించుకోవటం వారందరికీ మరీ ఇష్టంగా ఉన్నట్లు తెలియజేశారట. అంతేకాదు వివాహ వ్యవస్థను చాలా చక్కగా 64% మంది ఇండియన్లు పాటిస్తున్నారట. ఈ విషయంలో ఆసియా అమెరికన్లు 54%లో ఉంటే, అమెరికాలోని వయోజనులు 34% మాత్రమే ఉన్నారట. వివాహం చేసుకున్న ఇండియన్లు 71 శాతం ఉంటే ఆసియా అమెరికన్లు 59 శాతం మాత్రమే. మిగిలిన వారిలో వివాహితుల శాతం 51% మాత్రమేనట.

ఒక ఎనిమిది శాతం ఇండియన్ అమెరికన్లు అమెరికాలో వివాహ బంధం దృఢంగా ఉందని చెప్పారట. అదే ఇండియాలో 69 శాతంగా ఉందని మెచ్చారట. పన్నెండు శాతం ఇండియన్లు మాత్రమే ఆసియేతరులను వివాహం చేసుకోన్తున్నారట. 86 శాతం మాత్రం తమ జాతీయులనే వివాహం చేసుకోవాలని అభిప్రాయ పడుతున్నారట. ఒక్క రెండు శాతం మాత్రమే మిగిలిన ఆసియా వారిని చేసుకోవాలను కొంటారట. వివాహ దంపతులతో ఉండే పిల్లలు ఇండియన్‌లలో 92 శాతం, చైనా వారిలో 83 శాతం, ఆసియన్లు 80 శాతం మిగిలిన వారిలో 63 శాతం ఉన్నారట. 69 శాతం మంది ఇండియన్‌లు ఇండియాలోని కుటుంబాలతో మంచి సంబంధాలు కలిగి ఉన్నారట.

ఇండియన్లు రెండు దేశాలలోని విలువలు సమానంగానే ఉన్నాయని 42 శాతం

భావిస్తున్నారట. 57 శాతం ఇండియన్లు అమెరికాలో పిల్లలను పెంచటం హాయి అని భావిస్తున్నారట. 83 శాతం భారతీయులు ప్రవాస భారతీయులు అమెరికాను శక్తి వంతంగా చేస్తున్నట్లు భావిస్తున్నారట. దీన్ని 48 శాతం సాధారణ ప్రజలు ఆమోదిస్తున్నారట. పిల్లల కెరీర్‌ను తీర్చిదిద్దటానికి తలి దండ్రుల పర్యవేక్షణ అవసరం అని 68 శాతం మంది ఇండియన్లు భావిస్తే, కొరియన్లు మాత్రం 75 శాతం దీన్ని మనకంటే ఎక్కువగా సమర్ధిస్తున్నారట. ఇదీ సర్వేలలో తేలిన నిజాలు. ఏమైనా కుటుంబ వ్యవస్థ మీద అత్యంత గౌరవాన్ని ఇప్పటికీ భార తీయులు కలిగి ఉండటం ఆనందించదగిన విషయం. ఇలాగే ఇది వర్ధిల్లాలని అందరు కోరుకొంటున్నారు.

(28-09-12-కాంప్-అమెరికా)

అమెరికా డైరీ-**39**

## వీడ్కోలు వారం

సెప్టెంబర్ ఇరవై నాలుగు సోమవారం నుండి, ముప్పై ఆదివారం వరకు విశేషాలు-

ఇరవై నాలుగు సోమవారం మేసీస్‌లో ఆపిల్ స్టోర్సులో ఐ పాడ్ చూశాం. వాళ్లవీ ఫ్రీ బుక్స్ డౌన్‌లోడ్ చేసుకొనే వీలు, మాక్లిన్ బెర్గ్ లైబ్రరిలో పుస్తకాలను ఆన్‌లైన్‌లో చదువుకొనే వీలూ కల్పించారు. లైబ్రరిపై అంతస్తు నుంచి మెట్లు దిగుతుంటే కుడి మోకాలు కొద్దిగా పట్టు తప్పింది. తూలి పడబోయాను. వెంటనే సర్దుకుంది. మంగళవారం సాయంత్రం పిల్లల్ని జిమ్నాస్టిక్సు క్లాస్‌లో దింపి, మేం ముగ్గురం "ఓల్డ్ టైం పాటరి" (పాత కాలపు పెంకులు)కి వెళ్లి ఒకసారి అన్నీ తిరిగి చూశాం. ఫోటోలు తీసుకొన్నాము. ఇంటికి వచ్చిన తర్వాత ఉషా ఫోన్ చేసింది. శనివారం శ్రీ సత్యనారాయణ వ్రతం చేయించు కొందామను కొంటున్నామని, లిస్టు చెప్పమని అడిగితే చెప్పా. బుధవారం హైదరాబాద్‌కు ఫోన్ చేసి మా అక్కయ్యా, బావగార్ల తో మాట్లాడాము. మేము మాట్లాడటం ఆయనకెంతో బలంగా ఉందనిపించిందన్నారు బావ. గురువారం ఈనాడు నెట్‌లో చదువుతుంటే, పిన్నమనేని కోటేశ్వరరావు గారు 84 ఏళ్ల వయసులో కేన్సర్‌తో బాధపడుతూ మరణించారని తెలిసింది. ఆయన కృష్ణాజిల్లా పరిషద్ చైర్మన్‌గా మూడుసార్లు, ముదినేపల్లి శాసన సభ్యులుగా రెండుసార్లు పనిచేసి విద్యారంగానికి ఎంతోసేవ చేశారు. ఎన్ని పదవుల్లో ఉన్న ఆయన్ను అందరు "చైర్మన్ పిన్నమనేని" అనే ఆప్యాయంగా పిలుస్తారు. అదీ ఆయన సాధించిన విజయం. దీనిపై "చైర్మన్ కోటేశ్వరరావు గారు" అనే ఆర్టికల్ రాశాను.

గురువారం మధ్యాహ్నం నాగమణి ఇంట్లో భోజనం. రాత్రికి రవి గాయత్రి దంపతుల ఇంట్లో విందు. మేము, శీతల్, ప్రశాంత్ దంపతులు, ముక్కామల దుర్గ

గారు అతిథులం. చపాతీ బంగాల దుంప కూర, మామిడికాయ పప్పు, బీన్సు కూర, ఉల్లి చట్నీ, అన్నం సాంబారు, పెరుగులతో మంచి భోజనం. అదనంగా "జున్ను" అన్నీ బాగున్నాయి. ఇదివరకోసారి రాలీ దంపతులు వచ్చినప్పుడు ఉదయం టిఫిన్‌కు పిలిచి అన్నిటితోబాటు "జున్ను" కూడా పెట్టారు. సరదాగా కబుర్లు చెప్పుకొంటూ భోజనం చేశాం. వాళ్ళు ఏర్పాటు చేసుకొన్న హోమ్ థియేటర్ చూపించాడు రవి. వాళ్ల తలిదండ్రులు రాఘవేంద్రరావు, కామాక్షి గార్లు సరదా, మర్యాదా ఉన్న మనుసులు. నాకు ఆయనతో, మా ఆవిడకు వాళ్ళావిడతో రోజూ కబుర్లు బానే ఉంటాయి.

శుక్రవారం మధ్యాహ్నం ఎల్లా వెంకటేశ్వరరావు గారి అమ్మాయి, గాయిత్రి ఆన్‌లైన్‌లో కూచిపూడి నాట్యాచార్యులు పసు మార్తి గురువు గారి వద్ద మా ఇంట్లో ప్రాక్టీసు చేశారు. ఎల్లా అక్టోబర్ చివర్లో ఇక్కడికి వస్తారు. అప్పుడు ఒక నృత్య రూపకానికి ఇది రిహార్సిల్. గురువు గారికి లైన్‌లోనే నమస్కారాలు చెప్పాము. "మేము వచ్చే దాకా మీరు షార్లెట్‌లో ఉండరా?" అని మేం ఇండియా వెళ్తున్నామని తెలిసి అన్నారు పసుమర్తి వారు. సాయంత్రం పిల్లలను ఆర్టు క్లాస్‌లో దించి రాంకీ ఇంటికి వెళ్లి బంతి పూలు ఇచ్చి వచ్చాం. క్లాస్ అవగానే అటునుంచే ఎయిర్ పోర్టుకు వెళ్ళాం. అల్లుడు ఆవదాని ఇండియా నుండి దుబాయ్ న్యూయార్కుల మీదుగా వచ్చారు. ఇంటికి వచ్చేసరికి ఎనిమిదింప్పావు అయింది. ఈ రోజు మా ఇంట్లో భజన. మా మనవడు శ్రీకేత్ ఏర్పాట్లు చూశాడు. వర కుటుంబం, జగదీశ్– లక్ష్మి కుటుంబం, పవన్ దంపతులు వచ్చారు. గంటసేపు భజన జరిగింది. చివర్లో నేను "శార్లేట్‌లోని సాయి సెంటర్ వారితో ఈ ఆరు నెలలు చక్కగా గడిచిపోయాయి. మా ఇద్దర్నీ మీ కుటుంబ సభ్యులుగా భావించి ఎంతో పెద్దరికం ఇచ్చారు. వచ్చే బుధవారం సాయంత్రం మా ఇండియా ప్రయాణం. అందరికి వీడ్కోలు" అని కృతజ్ఞతలు తెలిపాను. అందరు చాలా బాధపడ్డారు మేం వెళ్లిపోతున్నందుకు. అది వారి సౌజన్యానికి గుర్తు. అంతే!

## మళ్ళీ శ్రీ సత్యనారాయణ స్వామి వ్రతం

ఇరవై రోజుల కిందట నేను ప్రియా దంపతుల ఇంట్లో శ్రీ సత్యనారాయణ వ్రతం చేయించానని తెలిసినప్పటి నుంచి రాంకీ ఉషా దంపతులు వాళ్ళు కూడా వ్రతం చేసుకోవాలనే సంకల్పానికి వచ్చారు. ఈ శనివారమే దాన్ని చేయించుకోవాలను కొన్నారు. మేమిద్దరం ఉదయం అయిదు గంటలకే లేచి నిత్యకృత్యాలు, సంధ్యా, పూజ అయి, రెడీగా ఉన్నాం. రాంకీ తొమ్మిదింటికి వచ్చి కారులో మా ఇద్దర్నీ తమ ఇంటికి తీసుకొని వెళ్లాడు. అక్కడ ఏర్పాట్లు దాదాపు నేను చెప్పినట్లే చేశారు. ఉషా వాళ్ల అమ్మా నాన్న, రాంకీ ఉషా దంపతులు కూర్చుని చేసుకొన్నారు. మొదలు పెట్టెసరికి పదిన్నర అయింది. వ్రతం, శ్రీ వెంకటేశ్వర దీపారాదనను శాస్త్రోక్తంగా చేయించాను. అంతా అయేసరికి

ఒంటి గంట అయింది. దాదాపు యాభై మందికిపైగా అతిథులు వచ్చారు. అందరు సాయి సెంటర్‌లో పరిచయం ఉన్నవాళ్ళే. పూజా విధానం చూసి అందరు ఎంతో ఆనందాన్ని, సంతృప్తిని పొందారు. ఇంతవరకు ఎవరు ఇంత నిర్దుష్టంగా చేయించలేదని అందరు అన్నారు. అది స్వామి కృపా, సరస్వతీదేవి కటాక్షం. అంతే. ఆ తర్వాత విందు. రెండు ఆకు కూరలు, ఆలూ కూర, బెండకాయ కూర, చట్నీ, పాయసం, పులిహోర అప్పడం సాంబారు, పెరుగు, మాంగో లస్సీలతో, మంచి విందు ఏర్పాటయింది. అందరు హాయిగా కమ్మగా భోజనం చేశారు. నేను ఎందుకో తినలేక పోయా. నాకు షర్టు, మా శ్రీమతికి శాలువ, ఫోటో ఫ్రేం, దక్షిణగా నలభై డాలర్లు తాంబూలం ఇచ్చారు. జగదీశ్ ఎప్పుడు కుటుంబంతో మాకు నమస్కరించి ఆశీర్వాదాలు తీసుకోవటం అలవాటు. వారంతా మా ఇద్దరికీ నమస్కరించి, తాంబూలంలో యాభై ఒక్క డాలర్లు పెట్టి అందజేశారు. ఆ తర్వాత ఆడవాళ్ళు శ్రీ విష్ణు సహస్రనామ పారాయణ చేశారు. రాంకీ ఉషాల ఆనందానికి అంతు లేదు. "మీరు చేయిస్తారని తెలిస్తే చాలామంది మీతో వ్రతం చేయించుకొనే వారు. ఈసారి ట్రిప్‌లో దీనికి సిద్ధం చేస్తాం" అన్నారు సంతోషంగా ఉషా రామ్కీలు. నవ్వి "మేము దీని నిమిత్తం రాలేదు. మా ఇంట్లో మేము ఎప్పుడూ చేసుకోన్నట్లే మీకూ చేయించాం. అంతే" అన్నాను. ఇంటికి వచ్చేసరికి సాయంత్రం అయిదున్నర దాటింది.

## ఒకే రోజు మూడు భోజనాలు

శనివారం రాత్రి మా ఇంటికి దగ్గర్లో ఇల్లు కొనుక్కున్న శీతల్ –ప్రశాంత్ దంపతులు సరదాగా భోజనాలు ఏర్పాటు చేసి మిత్రుల్ని మమ్మల్నీ ఆహ్వానించారు. వీళ్ళ గృహప్రవేశ ముహూర్తం నేనే పెట్టాను. చాలా పదార్థాలు చేయించి హోటల్ నుండి తెప్పించారు. మేమిద్దరం రెండేసి సమోసాలు మాత్రమే తిన్నాం. కడుపు నిండింది. మిగతా వాటి జోలికి వెళ్ళలేదు. వాళ్లకు బై చెప్పి వచ్చాం. అక్కడ నుండి వల్లం నరసింహారావు దంపతుల కుమార్తె రేణు దంపతుల నూతన గృహప్రవేశ సందర్భంగా విందు ఏర్పరచారు. వల్లం దంపతుల వివాహ యాభై వసంతాల పండుగ కూడా రేణు ఇదివరకు నిర్వహిస్తే వెళ్ళాం. అప్పటినుంచి వారితో పరిచయం. వీళ్ళు బాగా హడావిడి చేశారు. వందమందికి పైగా అతిథులొచ్చారు. ఎన్నో పదార్థాలు చేయించారు. కాని మేమేమీ తినలేదు. మంచినీళ్ళు తాగి కొద్దిగా కేరట్ హల్వా తిన్నాం. అంతా ఆయ్యేసరికి రాత్రి పది అయింది.

ఈ విధంగా ఈ శనివారం ఉదయం రాంకీ ఇంట్లో, రాత్రికి శీతల్, రేణు ఇళ్ళల్లో మూడు విందు భోజనాలు చేసినట్లు. ఇంతకు ముందు గురువారం నాగలక్ష్మి, గాయత్రి ఇళ్లలో విందులు. ఇవన్నీ మా మీద ఉన్న ఆప్యాయతకు నిదర్శనంగా

వాళ్ళందరూ ఏర్పాటు చేసిన వీడ్కోలు విందులు. మంచి మిత్ర బృందం ఇక్కడ ఉండటం ఆనందదాయకం.
ఆదివారం రాత్రికి పవన్ రాధా దంపతుల ఇంట్లో భోజనం. పప్పు, వంకాయ కూర, ఆవకాయ, పచ్చడి, సాంబారు అన్నం పెరుగు లతో విందు. మేము వెళ్ళగానే అందరికి వేడి వేడి పకోడీలు వేసి పెట్టింది రాధ. అవి పూటుగా లాగించాం. ఇంకా అన్నం ఏమి లోపలికి వెళ్తుంది? ఏదో కతికామనిపించాం. నాకు షర్టు, తల్లీ కూతుళ్ళకు చీర, జాకెట్‌లు పెట్టి పవన్ దంపతులు తమ సంతోషాన్ని వ్యక్త పరచారు. ఈ వారం అంతా ఇలా సందడి సందడిగా గడిచిపోయింది. మూడవ తేదీ బుధవారం రాత్రి ఫ్లైట్‌కు అ ఇండియాకు తిరుగు ప్రయాణం. సరిగ్గా వారం తక్కువ ఆరు నెలలు అమెరికాలో ఉన్నట్లు. చాలా వేగంగా కాలం గడిచి పోయింది. మా ఈ నాల్గవ అమెరికా పర్యటన సాంస్కృతిక పర్యటన అనిపించి, మిగిలిన వాటికి భిన్నంగా జరిగింది. వచ్చిన దగ్గర నుండి ఎల్లా వారితో, ఈల శివప్రసాద్ గారితో పరిచయాలు. ఆ తర్వాతా అలబామాలో మైనేని వారింట్లో కొలువు. అక్కడి ద్రోణవల్లి వారు, కాకాని సోదరులతో పరిచయం, హెలెన్ కెల్లర్ ఇంటి సందర్శన, ఆ పిమ్మట అట్లాంటా పర్యటన, అక్కడ దేవాలయ సందర్శనం, రాలీ పర్యటన. అక్కడ బాలాజీ దేవాలయం, శివాలయ సందర్శనం. మౌంట్ సోమా సందర్శనానుభూతి ఎంతో తృప్తినిచ్చాయి. ఇక్కడి హిందూ సెంటర్ కార్యక్రమాలు, సాయి సెంటర్ భజనలు,త్రిమూర్తి దేవాలయంలో ఉత్సవ విగ్రహ ప్రతిష్ట, ఫెస్టివల్ ఆఫ్ ఇండియా, అన్నీ అన్నే. ముహూర్తాలు పెట్టడం రెండు అ సత్యనారాయణ వ్రతాలు గృహప్రవేశం ఎంతో మానసిక ఆనందాన్నిచ్చాయి. కలకాలం గుర్తుంచుకోదగిన పర్యటనగా ఉంది. దీనిలో మాకు హార్దికంగా సౌజన్యాన్ని చూపిన వారందరి పేరు పేరునా కృతజ్ఞతలు.

అక్టోబర్ రెండు మంగళవారం గాంధీ జయంతి సందర్భంగా అందరికి శుభాకాంక్షలు. (1-10-12-కాంప్-అమెరికా)

అమెరికా డైరీ-**40**

## డైలీ అమెరికా

డైలీ అమెరికా అంటే అమెరికాలో మేమున్న ఆరు నెలలు మా నిత్యకృత్యం ఎలా జరిగిందని తెలియజేయటమే. ఉయ్యూరులో రోజు ఉదయం అయిదున్నర ఆరు మధ్యలో లేచే వాళ్ళం. ఇక్కడ రోజు యేడు, ఏడున్నర మధ్యలో లేచాము. లేవగానే పళ్ళు తోముకొని వాళ్ళం. నేను ఒక చెంచాడు మెంతి పిండి ఒక చిన్న గ్లాసు నీళ్ళలో కలుపుకొని తాగేవాడిని. ఆవిడ ఆపాటికి కార్య క్రమాలైన తర్వాత మార్నింగ్ మీల్సు

అంటే మందులు వేసుకోనేది. ఇద్దరం కాఫీలు తాగేవాళ్ళం. ఆ తర్వాత నేను స్నానం చేసే వాడిని. తర్వాత పట్టుబట్ట కట్టుకొని సంధ్యా వందనం, పూజా చేసుకొనే వాడిని సుమారు ముప్పావు గంట. అప్పుడు శ్రీ రామ కోటి రాసి, భగవద్గీత కొద్దిగా పారాయణం చేసేవాడిని. అప్పుడు టిఫిన్ రెడీ చేసి ఉంచేది మా అమ్మాయి విజ్జి. ఇడ్లీ, దోసె ఉప్మా, గారే లేకపోతే సీరియల్స్ తినే వాల్లం. మళ్ళీ రెండో రౌండు కాఫీ కొద్దిగా తాగేవాడిని. ప్రతి మంగళ, శనివారాలలో శ్రీ ఆంజనేయ స్వామి సహస్రనామాలతో పూజ చేసేవాడిని. గురువారం రాఘవేంద్ర సాయిబాబా అస్తోత్తరాలు స్పెషల్. ఆవిడ కూడా స్నానం చేసి టిఫిన్ చేసేది. నేను అప్పుడు మందులు వేసుకొనే వాడిని. ఇదంతా అయేసరికి ఉదయం తొమ్మిదిన్నర, పది అయ్యేది.

అప్పుడు "కంప్యూటర్ ఎక్కేవాడిని". నాకోసం ఒక డెస్కుటాపు సిద్ధంగా ఉంచారు. పిల్లలకు స్కూళ్ళు కనుక పోటీ లేదు. అయినా వాళ్లకు ఐ పాడ్ ఉంది. అందుకని పెద్దగా నా జోలికి వచ్చేవారు కాదు. నేను ఉదయం పదింటి నుంచి పన్నెండున్నర వరకు కనీసం రెండు ఆర్టికల్సు రాసే వాడిని. ఆ తర్వాత భోజనం. లైబ్రరీ నుండి తెచ్చిన పుస్తకాలు చదువు కొనేవాడిని. మధ్యాహ్నం నిద్రకు ప్రయత్నించినా వచ్చేది కాదు. మూడింటి దాకా మంచం మీద దోర్లుడే. అప్పుడు చదివిన పుస్తకాలలో నోట్సు రాసుకో వలసినవి ఉంటే రాసుకొనే వాడిని. లైబ్రరి పుస్తకాలకు గడువు ఇరవై ఒక్క రోజులు. నేను వెళ్లినపుడల్లా ఇరవైకి పైగా పుస్తకాలు తెచ్చుకొనే వాడిని. వాటిని పది రోజుల్లో పూర్తి చేసేవాడిని. సాయంత్రం మా మనవళ్ళు శ్రీకేత్, ఆశుతోష్, పీయూష్లు నాలుగుమ్బావుకు స్కూలు నుండి బస్‌లో వచ్చేవారు. ఇంటి దగ్గరే స్టాపు. వీలైతే వెళ్లి తీసుకొచ్చేవాడిని. వాళ్ళు తిఫినో, తిండో తిని కంప్యూటర్ కోసం ఎగబడే వారు. నేను అప్పుడు ఏదైనా రాసుకొనేవాడిని. మా పెద్ద మనవడు శ్రీకేత్ "తాత్ గారు ఎప్పురూ కంప్యూటర్ ఎప్పురూ ఎప్పురూ" అని వచ్చీరాని తెలుగులో అనేవాడు. మా ఇద్దరికే కంప్యూటర్ విషయంలో తగాదా. వాళ్లకు ఇచ్చి మళ్ళీ నేను పుస్తకం చదువుకొనే వాడిని. పిల్లలు బడి నుంచి వచ్చేలోపు మా అమ్మాయి మమ్మల్ని ఎక్కడికైనా షాపింగులకు తీసుకు వెళ్ళేది. పిల్లలొచ్చే సమయానికి ఇంటి దగ్గర ఉండే వాళ్ళం. సాయంత్రం అయిదింటికి టీ తాగే వాళ్ళం. నేను కాసేపు బయట నడక సాగించి వచ్చేవాడిని. సాయంత్రాలు వాళ్ళు జిమ్నాస్టిక్స్‌కో ఆర్టు క్లాస్‌కో లైబ్రరీ క్లాసులకో వెళ్తే నేనూ వాళ్ళతో వెళ్ళేవాడిని.

మా ఆవిడ సాయంత్రం ఆరుగంటల నుండి మా టి.వీ.చూసేది. అందులో వసంత కోకిల, చిన్నారి పెళ్లికూతురు బాగా ఇష్టపడి చూసేది, నేను చిన్నారి పెళ్లి కూతురు చూసేవాడిని. మిగతా చానెళ్లు ఎప్పుడు చూడాలనిపించేది కాదు. రాత్రి తొమ్మిదింటికి

ఈ టి.వి.లో వార్తలు చూడటం అలవాటు. రాత్రి ఎనిమిదింటికి భోజనం చేసేవాళ్ళం. మళ్ళీ చదువు. నా చదువు అంతా మంచం మీద పడుకొనే. రాత్రి పదిన్నర దాటితే మా ఆవిడ ఇక చాలనేది. అయినా పదకొండున్నర వరకు చదువుకొనే వాడిని . పుస్తకాలే నాకిక్కడ నేస్తాలు. మా అమ్మాయి పనులన్నీ పూర్తి చేసుకొని పదిన్నరకో పదకొండింటికో మా దగ్గర కూర్చుని కబుర్లు చెప్పేది. అప్పుడే ఇండియాకు ఫోన్లు చేయటానికి వీలుండేది. మా అల్లుడు రోజంతా ఇంట్లోనే ఉండి పని చేయటం, ఎప్పుడూ ఫోన్లలో కాన్ఫరెన్స్‌లలో బిజీగా ఉండటం వల్ల వీలయ్యేది కాదు.

ఉయ్యూరు నుండి మా మనవడు చరణ్ స్కైప్‌లో మధ్యాహ్నం పన్నెండుకు చక్కగా పదిహేను రోజులకోసారి మాట్లాడే వాడు. అక్కడ రాత్రి తొమ్మిదిన్నర అయ్యేది. పాపం కళ్ళు వాలిపోతున్నా కూర్చుని మాట్లాడేవాడు. మిగతా వాళ్ళంతా మేము చేస్తేనే. వచ్చిన మొదటి నెలలో సాయి సెంటరు వాళ్ళ భజనలకు బాగానే వెళ్ళాము. అవి రాత్రి పూట ఉండేవి. ఆ తర్వాత తగ్గించాం. ప్రక్క ఇంటి గాయత్రి వచ్చి పలకరించి పోతుంటుంది. ఆమె అత్తగారు, మామగారు వచ్చిన తర్వాత వారితో పరిచయం బానే ఉంది. నాగమణి తన పని ఉంటే వచ్చి వెడుతుంది. ఇక్కడి కుటుంబాలలో పవన్, రాంకీ జగదీశ్ కుటుంబాలతో చాలా సన్నిహితంగా ఉండే వాళ్ళం. వాళ్ళకూ మా మీద గౌరవం బానే ఉంది. మా పెద్ద మనవడు శ్రీ కేత్ భజనలు ఐ పాడ్ నుండి నేర్చుకొని పాడేవాడు. మా చిన్న మనవళ్ళు తెలుగులో మాట్లాడటం తక్కువే. అమ్మా అని అంటారు, తండ్రిని డాడీ అంటారు. కాలికి దెబ్బ తగిలితే “కాల్నోప్” అంటారు. “ఐ డిడ్ స్నానం” అంటారు కలగా పులగంగా. పప్పు, కూరా చట్నీ అంటారు”. బుజ్జి ముండలు” అల్లరి చేయకుండా ముగ్గురు హాయిగా ఆడుకొంటారు. అందులో పీయూష్ నా పోలికే. నేను పిలిస్తే దగ్గరకు వెంటనే వస్తాడు. వాళ్ల అమ్మమ్మ పిలిస్తే రాడు. నేను ముద్దు పెట్టుకొంటే, వాడూ పెట్టుకొంటాడు. లేకపోతే “యు దూ” అంటాడు. ఆశుతోష్ మాత్రం వాళ్ళ అమ్మమ్మ దగ్గరకు బానే వస్తాడు, ముద్దులిస్తాడు. రాత్రి తొమ్మిదిన్నరకు ఆశుతోష్ మా దగ్గరకు వచ్చి పడుకొంటాడు. ఒకోసారి ఇక్కడే. పీయూష్ మాత్రం రాడు. కాని వాడు మా దగ్గర పడుకొంటే వీడు సహించలేడు. ఎలాగైనా వాడిని అప్‌స్టయిర్‌కు తీసుకుపోతాడు పోట్లాడయినా. ఆటలు లేకపోతే కంప్యూటర్, లేకపోతే, టివి.తప్ప ఇంకే ధ్యాసా లేదు. వాళ్లతో గడపటం మహాదానందంగా ఉంది. అప్పుడే ఆరు నెలలు అయిందా అనిపిస్తోంది.

ఇక్కడికి వచ్చిన దగ్గరనుండి సరసభారతి 30,000 మందిని ఈ ఆరు నెలల్లో పలకరించింది. అంటే నెలకు అయిదు వేల మందిని స్పర్శించింది. అంటే రోజుకు సరస భారతిని నూట ఏభై మంది చూశారు. నేను ఈ ఆరు నెలల్లో 370 ఆర్టికల్సు

రాశాను. అంటే నేలకు అరవై. అంటే రోజుకు సరాసరి రెండు. ఒక సాహిత్య సంస్థకు ఇంతకంటే గొప్ప ప్రచారం ఏమి ఉంటుంది. అందరు చదివి, ఆనందిస్తున్నారు ఆదరిస్తున్నారు. సాహితీ సేవ విదేశీ గడ్డ మీద ఇలా జరగటం సరస భారతికి ముందడుగే. అందరికి అభినందనాలు. అమెరికాలో ఎన్నో కార్యక్రమాలలో పాల్గొన్నాం. ఎల్లా వారు, ఈల శివ ప్రసాద్, మణి శర్మ. మైనేని వారి హన్ట్స్ విల్, అట్లాంటా, దేవాలయాల సందర్శనం, ఫెస్టివల్ ఆఫ్ ఇండియా వగైరా. అన్నీ ఆనందాన్ని తృప్తినీ ఇచ్చాయి. అమెరికాలోని భారతీయ మిత్రులకు వీడ్కోలు పలుకుతున్నాము. మాది ఈసారి నిజంగా సాంస్కృతిక యాత్రే. ఎవరైనా నన్ను ఇక్కడి వాళ్ళు మీరు ఎలా కాలం గడుపుతున్నారు? అని అడిగితే నేను నవ్వుతూ "కంచం ఖాళీ -మంచం భర్తీ" అనే వాడిని. కాని అలా చేయలేదని మీరు గ్రహించే ఉంటారు. గుడ్ బై అమెరికా.

(3-10-12-కాంప్-అమెరికా)

అమెరికా డైరీ-**41**

## అయిదవసారి అమెరికా ప్రయాణంలో పదనిసలు

సుమారు నెలన్నర కిందట మా అమ్మాయి విజయలక్ష్మి మా ఇద్దరికి అమెరికా ప్రయాణం టికెట్లు కొని ఆశ్చర్యపరచింది. అప్పటి నుంచే ప్రయాణం ఏర్పాట్లు మొదలు. అయితే వారం ముందుదాకా ఎవరికీ చెప్పలేదు. శ్రీ హేవలంబి ఉగాది వేడుకలనాడు సరసభారతి సమావేశంలో 26-3-17 న అందరికి తెలియజేశాం.

ఏప్రిల్ 1 శనివారం మేమిద్దరం మా మనవడు చరణ్‌తో కలిసి కారులో బయల్దేరి హైదరాబాద్‌కు మధ్యాహ్నం మా పెద్దబ్బాయి శాస్త్రి ఇంటికి చేరాం. మర్నాడు నేను మా అబ్బాయి శాస్త్రి మనవడు కాబ్‌లో బయల్దేరి ఓల్డ్ బోయిన్‌పల్లిలో మా అక్కా బావ వాళ్ళ ఇంటికి వెళ్ళి ఆశీర్వాదాలు తీసుకొని బాచుపల్లిలో మా రెండో అబ్బాయి శర్మ వాళ్ళ ఇంటికి వెళ్ళి అక్కడే ఉన్న మల్లంపేట శ్రీ ఆంజనేయ స్వామి పక్కనే ఉన్న శివాలయం దర్శించి మియాపూర్ వెళ్ళి మా అమ్మాయి వాళ్ళ ఫ్లాట్ చూసి శర్మా వాళ్ళ ఇంట్లో భోజనం చేసి కాసేపు రెస్ట్ తీసుకొని సాయంత్రం నాలుగుకు బయల్దేరి మల్లాపూర్ చేరాం.

5వ తేదీ బుధవారం శ్రీ రామ నవమి రాత్రి 12 గం.లకు శాస్త్రి బాస్ బామ్మర్ది గారి కారులో అందరం షంషాబాద్ ఎయిర్ పోర్ట్ చేరి, బాగేజ్ అప్పగించి వీల్ ఛైర్ సహాయంతో హాయిగా తెల్లవారుజామున (6) ఎమిరేట్స్ ఫ్లైట్‌లో బయల్దేరి దుబాయ్ ఉదయం చేరాం. రెండు గంటల తర్వాత న్యూయార్క్ ఫ్లైట్‌లో 14 గంటలు ప్రయాణించి 6వ తేదీ మధ్యాహ్నం రెండున్నరకు న్యూ యార్క్ చేరాం. అప్పటికే విపరీతంగా వర్షం

పడి ఆగింది. సాయంత్రం 5 గం.ల షార్లెట్ ఫ్లయిట్ కేన్సిల్ అయింది. ఆదివారం దాకా లేవన్నారు. ఎవరిదో ఫోన్ సహాయంతో మా అమ్మాయికి ఫోన్ చేసి విషయం చెప్పాం. అప్పటికప్పుడు ఎమిరేట్స్ వాళ్ళతో మాట్లాడి వాషింగ్టన్ డిసీకి టికెట్లు మార్పిస్తే ఆ విమానం రాత్రి 10 గం.లకు బయల్దేరాల్సింది. నాలుగు గంటలు లేట్ అయి రాత్రి 3 గంటలకు బయల్దేరి నాలుగున్నరకు చేరింది. మా అమ్మాయి మా మనవడు సంకల్ప్‌ను తీసుకొని రాత్రి 9కి బయల్దేరి 600 మైళ్ళు డ్రైవ్ చేసి డీసీకి తెల్లవారు జామున 3కు చేరింది. సామాను కలెక్ట్ చేసుకొని అందరం అయిదున్నరకు బయల్దేరాం. మళ్లీ 600 మైళ్ళు డ్రైవ్ చేసి అంటే రాను పోను 1200 మైళ్ళు అంటే 1800 కిలో మీటర్లు డ్రైవ్ చేసింది మా అమ్మాయి .దారిలో మనవడిని యూనివర్సిటీలో దింపి ఇంటికి చేరే సరికి మధ్యాహ్నం రెండు. స్నానాదికాలు పూర్తి చేసి భోజనం చేసే సరికి 3. కాసేపు రెస్ట్ తీసుకొని తెచ్చిన సామాను అంతా సర్ది రాత్రి భోజనం చేసేసరికి 10 అయింది. అంటే న్యూయార్క్ ఎయిర్ పోర్ట్‌లో దాదాపు 12 గంటలు పడి ఉన్నాం. హైదరాబాద్ నుంచి తెచ్చుకున్నవి తిన్నాం కనుక సరిపోయింది. లేకపోతే మా పని ఖాళీ. 24 గంటల్లో అమెరికా రావాల్సిన వాళ్ళం 36 గంటలకు చేరాం. ఇదొక కొత్త అనుభవం. అయితేనేం రెండు మహానగరాలు న్యూయార్క్ వాషింగ్టన్ లను విహంగ వీక్షణం చేసే వీలు కలిగింది రాత్రి వెలుగుల్లో. అందుకే ఇది రెండు మహానగరాల కథ" అన్నాను.

(కాంప్-షార్లెట్-అమెరికా-10-4-17)

## వీక్లి అమెరికా-1

అమెరికాలో నార్త్ కరోలినాలో ఉన్న షార్లెట్‌కు 6 రాత్రికి రావలసిన వారం 7 మధ్యాహ్నానికి చేరాం. ఆ ప్రహసనం అంతా ముందే రాశా. ఇక నుంచి ప్రతి సోమవారం ఆ వారంలో జరిగిన విషయాలను "వీక్లీ అమెరికా" శీర్షికలో రాయాలనుకొని మొదటి వారం విషయాలు సంక్షిప్తంగా రాస్తున్నా.

న్యూయార్క్‌లో వాషింగ్టన్‌కు వెళ్లే జెట్ బ్లూ ఫ్లయిట్ 4 గంటలు లేట్ అయినందున ప్రయాణీకులకు ఒక్కో టికెట్‌కు 16 డాలర్ల ఫుడ్ ఐటమ్స్ ఫ్రీగా కొనుక్కోమని కూపన్లు ఇచ్చారు. మాకిచ్చిన 32 డాలర్లకు మంచినీళ్లు స్ప్రేట్, కోలా, లే మింట్ వగైరా కొన్నా. ఎమిరేట్ ఫ్లయిట్స్‌లో ఫుడ్ బాగానే పెట్టారు జైన్ వెజిటేరియన్ అడిగాం. నానబెట్టినవి ఉడకబెట్టినవి సెనగలు బఠాణీలు పెట్టారు. బ్రేడ్ బటర్ మామూలే. కాఫీ పైనాపిల్ బాగానే ఇచ్చారు. న్యూయార్క్ నుంచి డి సి విమానంలో వాటర్ బాటిల్, చిప్స్ పాకెట్ ఇచ్చారు. కస్టమ్స్ క్లియరెన్స్ కూడా వేగంగానే జరిగింది. 6 నెలలు ఉండటానికి వీసా ఇచ్చారు. తోపుడు బండి -వీల్ చైర్ వలన చకచకా పనులు జరిగాయి. లేకపోతే

ఎటు బయల్దేరి ఎటు వెళ్ళాలో తెలుసుకోవటం అగమ్యంగా ఉంటుంది. వాళ్ళూ మంచివాళ్ళే దొరికారు. అయితే కొంతచేయి తడపాల్సి వచ్చింది అంతే తప్పదు. డిసిలో కారులో బయల్దేరి ఒకచోట కాఫీ తెచ్చుకొని తాగాం. ఆ తర్వాత నాన్ స్టాప్ ప్రయాణం.

షార్లెట్ రాగానే మా అమ్మాయి కాఫీ కాచి ఇచ్చింది. తాగి కొంత సామాను సర్దామ్. దారిలో మైనేనిగారికి రెండుసార్లు ఫోన్ చేసాం లిఫ్ట్ చేయలేదు. భోజనం చేసి విశ్రాంతి తర్వాత మిగిలిన బాగేజ్ విప్పి సర్దేశామ్. వరద పుస్తకం చదివా 5 పేజీలు. రాత్రి నిద్రపోదామని ప్రయత్నిస్తే కాళ్ళు కొంకర్లు పోయాయి. భయమేసింది. నెమ్మదిగా మంచం దిగి కాసేపు నడిచి, హాలులో సోఫాలో పడుకుంటే కొంత తగ్గి నిద్ర బాగా పట్టింది. తరువాత నిద్రకు ఇబ్బంది కలగలేదు. పిలిస్తే పలుకుతోంది.

శనివారం మైనేని గారు ఫోన్ చేశారు. సంధ్య పూజ డ్రైగా అంటే నీళ్లు లేకుండా పూలు లేకుండా చేశా. విజ్జి ద్యూటీకి వెళ్ళింది సాయంత్రం అల్లుడు అవధాని నన్నూ మా మనవళ్ళు ఆశుతోష్ పీయూష్‌లను లక్ష్మి రవి ఇంటికి అరగంట డ్రైవ్ చేసి తీసుకు వెళ్ళాడు. అక్కడ మహాన్యాస పూర్వక ఏకాదశ రుద్రాభిషేకం జరుగుతోంది. లక్ష్మి దంపతులను అయిదేళ్ల తర్వాత ఇదే మళ్ళీ చూడటం చాలా మర్యాదగా ఆహ్వానించారు. ఇక్కడ హిందూ సెంటర్‌లో 16 ఏళ్ళు చీఫ్ ప్రీస్ట్‌గా ఉన్న ఆరవాయన గ్రీన్ కార్డు రాగానే మానేసి వైదికం చేస్తున్నాడు. ఆయన ఆధ్వర్యంలో అభిషేకం జరుగుతోంది. ఉత్సాహవంతులైన యువకులు మా అల్లుడూ స్వరం కలిపారు. 8వ రుద్రం నుంచి నేనూ జత కలిశాను. అయేసరికి రాత్రి 8 అయింది. భోజనాలు ఏర్పాటు చేశారు. 30 మందిదాకా వచ్చారు అమెరికన్ లేడీస్ కూడా ఉన్నారు. లక్ష్మి దంపతులకు సరసభారతి ప్రచురణలు –సువర్చలాన్జనేయ శతక త్రయం కొలచల సీతారామయ్య, దైవ చిత్తం, సిద్ధయోగ పుంగవులు కానుకగా ఇచ్చాను. మా అమ్మాయి సాయంత్రం ఆరున్నరకు ద్యూటీ అయ్యాక యూనివర్సిటీ నుంచి మా పెద్ద మనవాడు సంకల్ప్‌ను పికప్ చేసుకొని వాళ్ళ అమ్మను పెద్దకొడుకు శ్రీకేత్‌ను తీసుకొని వచ్చింది. అందరం భోజనం చేసి ఇంటికి రాత్రి 9.30కు చేరాం. రాత్రి కాసేపు వరదను చదివా.

ఆదివారం విజ్జికి సెలవు యధా ప్రకారం పట్టుబట్టకట్టి సంధ్య పూజాదులు చేశా. వీలున్నప్పుడల్లా వరద చదివా. ఇండియాకు ఫోన్ చేసి పిల్లలతో మాట్లాడాం. సాయంత్రం మనవడిని రైల్వేస్టేషన్ దగ్గర దింపి మా అమ్మాయి నేను సామ్స్‌కు వెళ్లి కావలసిన పాలు వగైరా కొని ఇంటికి వచ్చాము.

ఇవాళ సోమవారం యధాప్రకారం పూజచేసి నాకు ఇచ్చిన లాప్ టాప్ సహాయంతో రాయటం మొదలు పెట్టా. ముందుగా అమెరికా ప్రయాణంలో పదనిసలు రాశా. మధ్యాహ్నానికి వరద చదవటం పూర్తి చేసేశా. సాయంత్రం దహగం లక్ష్మీ

నారాయణపై ఆర్టికల్ రాశా.

కారీ నుంచి డా. యల్లాప్రగడ రామమోహనరావు గారు ఫోన్ చేసి మాట్లాడారు. అయన బావ గారు డా. బండారు వారికి హార్ట్ ఎటాక్ వచ్చి 3 స్టెంట్‌లు వేయాల్సి వచ్చిందని, ఇంటికి వచ్చారని కులాసా అని అందుకని మేము రాగానే ఫోన్ చేయలేక పోయానని అన్నారు. వారిది రేపల్లె. మా బాబాయి రాయప్రోలు శివరామ దీక్షితులు గారింటి ప్రక్కనే వారిల్లుట. బాబాయి పిన్నీ కొడుకు సుబ్బులు కూతురు పిచ్చాలు అందరూ బాగా తెలుసాయనకు. మా బాబాయి గొప్పతనం గురించి మురిసిపోతూ చెప్పారు.

మమ్మల్ని తాము వచ్చి వారింటికి కారీకి స్వయంగా తీసుకు వెడతామని, మైనేని దంపతులనూ ఆహ్వానించానని అందరం అక్కడ కలుద్దామని అన్నారు. చాలా సంతోషం అన్నారు. మన పుస్తకాలన్నీ మైనేని గారు పంపగా చదివానని గొప్ప కృషి అని అన్నారు. వారి బావగారు బండారు వారికే గీర్వాణ కవుల కవితా గీర్వాణం - మూడవ భాగం అంకితం చేయాలని మైనేని గారికి చెప్పటం నేను ఓకే అనటం, దాని ముద్రణకు రామమోహన్‌రావు గారే స్పాన్సర్ అని మైనేని గారు ముందే చెప్పారు. ఈ విషయం శ్రీ హేవిళంబి ఉగాది వేడుకలలో ప్రకటించామని మీకు గుర్తు ఉండే ఉంటుంది. అలాగే "ఆధునిక ప్రపంచ నిర్మాతలు -జీవితాలలో చీకటి వెలుగులు" పుస్తకాన్ని మైనేనిగారి బావమరిది గారు డా. పరుచూరి రామ కృష్ణయ్యగారికి అంకితం చేస్తున్నట్లు దాని ముద్రణ ఖర్చు శ్రీ మైనేని గోపాలకృష్ణ, శ్రీమతి సత్యవతి దంపతులు భరిస్తున్న సంగతి మీకు తెలుసు. మంచి పనికి ఎందరు ఎన్ని విధాలుగా సాయం చేస్తారో మనకు తెలియదు. వారి సౌజన్యం అలాంటింది. పుస్తకాలు ముద్రించాలని నేను రాయలేదు విషయాలు అందరికి తెలియాలని నెట్‌లో రాశాను. అవి పుస్తక రూపం దాల్చటం యాదృచ్ఛికం దైవ నిర్ణయం, సహృదయ స్పందనం. నేను నిమిత్త మాత్రుడిని. మేము షార్లెట్ వచ్చి అప్పుడే నాలుగు రోజులయింది.

(10-4-17-కాంప్-షార్లెట్-అమెరికా)

## వీక్లీ అమెరికా-2 (9-4-17 నుండి 16-4-17 వరకు)

9వ తేదీ సోమవారమ్ వరకు ఒకటవ ఎపిసోడ్‌లో రాసేశాను. ఆ సోమవారం సాయంత్రం కేరీ నుంచి డా. యల్లాప్రగడ రామమోహనరావు గారు ఫోన్ చేసి మాట్లాడిన వివరాలూ అందులో రాశాను. ఆ తరవాత మాసా చూసెట్స్‌లోని ఆస్టిన్ నుంచి శ్రీ డొక్కా రామ భద్ర ఫోన్ చేశారు. దాదాపు నాలుగేళ్లు అయింది ఆయన ఫోన్‌లో మాట్లాడి. అపర అన్నపూర్ణ నిరతాన్న ప్రదాత శ్రీమతి డొక్కా సీతమ్మగారి ముని

మనవాడిగారి అబ్బాయి అంటే ఇని మనవడు ఇక్కడ సాఫ్ట్‌వేర్‌లో పనిచేస్తున్నారు. ఒకసారి ఇద్దరం ఫ్లాష్ బాక్‌కి వెళ్లాం. సుమారు నాలుగేళ్ల క్రితం చాగంటి వారి ప్రవచనాలతో డొక్కా సీతమ్మగారి వితరణ గురించి మరోమారు విని సరసభారతి తరఫున విద్యార్థులకు ఆమె జీవితం అన్నదానంపై వ్యాసరచన ఏర్పాటు చేసాం. దీన్ని నెట్ ద్వారాను మా మిత్రుడు శ్రీ కోసూరి ఆదినారాయణ ద్వారా తెలుసుకున్న రాంగారు నాకు ఫోన్ చేసి అభినందించటం, తాము అమెరికాలో ఆమె పై కార్యక్రమాలు చేస్తున్నామని, కానీ ఆమె పుట్టిన గడ్డ ఆంధ్రాలో మేము చేయటం సంతోషంగా ఉందని మాకేదైనా ఆర్థిక సాయం కావాలంటే చేస్తామని చెప్పారు. మాకు ఏ రకమైన సాయం వద్దని ఆమె మీద గౌరవంతో చేస్తున్నామని చెప్పాను. ఆయన వదలకుండా అయితే పేద విద్యార్థులకు సీతమ్మగారి పేరుమీద స్కాలర్షిప్‌లు ఇద్దాం డబ్బు పంపిస్తాను అనగానే సరేనని మూడు హై స్కూళ్ళ హెడ్ మాస్టర్‌లకు తెలియజేసి పదవ తరగతిలో బాగా చదువుతూ ఆర్థికంగా వెనుకబడిన విద్యార్థుల పేర్లను నిష్పక్ష పాతంగా విమర్శలకు అతీతంగా తయారుచేసి పంపని చెప్పాం. అలాగే ముగ్గురు అమ్మాయిలూ ముగ్గురు అబ్బాయిలను సెలక్ట్ చేసి రామ్ గారు పంపిన 10 వేల రూపాయలు అందరికి సమానంగా ఇవ్వాలని నిర్ణయించి మరో కార్యక్రమం ఏర్పాటు చేసాం. దీనికి రామ్ గారి తలిదండ్రులు శ్రీ డొక్కా సూర్యనారాయణగారు శ్రీమతి లలితకుమారి గారు హైదరాబాద్ నుంచి వచ్చారు. ఆ రోజంతా జోరున వాన. సాయంత్రం కాస్త తెరిపిచ్చింది. మా ఇంటికి ముందు ఆ దంపతులు వచ్చి కాఫీ త్రాగి అందరం శ్రీ సువర్చలాఞ్జనేయస్వామి దేవాలయం చేరాం. శ్రీ గుంటక వేణు గోపాలరెడ్డితో పానుగంటివారి హాస్యంపై ప్రసంగింపజేసి ఆ తర్వాత శ్రీ డొక్కా దంపతుల చేతులమీదుగా విద్యార్థినీ విద్యార్థులకు ఒక్కొక్కరికి 1667 రూపాయలు సమానంగా అందజేశాము. ఆ దంపతులకు రామభద్రగారికి సరసభారతి పుస్తకాలు రెండు సెట్లు శ్రీ సువర్చలాఞ్జనేయస్వామి ఫోటో జ్ఞాపిక ఇచ్చి ఆలయ మర్యాదలతో సత్కరించాం వారిద్దరూ పరమానందం పొంది వారిమాటలలో సభాముఖంగా వ్యక్తం చేశారు. ఆ తర్వాత ఒకసారి రామ్ గారు ఫోన్ చేశారు అని జ్ఞాపకం. సరసభారతి మెయిల్స్ అన్నీ వారికి పంపేవాడిని ఒక్కోసారి రిప్లై ఇచ్చేవారు. ఆ తర్వాత గాప్ వచ్చింది. "మహిళా మాణిక్యాలు" పుస్తకం రాసి ప్రచురించినప్పుడు మొదటి వ్యాసంగా డొక్కా సీతమ్మగారిదే వేసాం. దీనికి స్పాన్సర్ శ్రీ మైనేని గోపాలకృష్ణగారని వారి శ్రీమతి సత్యవతి గారికి అంకితమిచ్చామని దీని ఆవిష్కరణ విజయవాడ రేడియో స్టేషన్ డైరెక్టర్ శ్రీమతి ముంజులూరి కృష్ణకుమారి గారు చేశారని ఆ రోజు ప్రపంచ ప్రముఖ ఈల విద్వాంసులు శ్రీ కొమరవోలు శివ ప్రసాద్ గారు తమ బృందంతో వచ్చి రెండు గంటల సేపు కచేరీ చేసి గాంధర్వ లోకాలకూ తేలించారని ఒక్కసారి జ్ఞాపకానికి వచ్చింది. బహుశా సరసభారతి తప్ప ఆంధ్రదేశంలో

ఏ సాహిత్య సంస్థ సీతమ్మగారిపై ఏ కార్యక్రమం జరపలేదని ఆ అదృష్టం మాకే దక్కిందని చెప్పుకున్నాం.

ఇప్పుడు రామభద్ర గారు ఫోన్ చేసి మాట్లాడిన దానిలో మన మెయిల్స్ అన్నీ రెగ్యులర్‌గా చదువుతున్నామని చెప్పారు వారి తలిదండ్రులు అట్లాంటలో తమ్ముడు శ్రీ ఫణి గారి దగ్గర ఉంటున్నారని మే నెలలో ఆస్టిన్ వస్తారని అప్పుడు "మా బడి" కార్యక్రమం నిర్వహిస్తామని అట్లాంటాలో తమ్ముడు తెలుగు కార్యక్రమాలు చేస్తూ ఉంటారని చెప్పి మా ప్రోగ్రామ్ సంగతి అడిగారు. ఇంకా ఏమీ ఆలోచించలేదని కారీకి శ్రీ రామమోహనరావు గారు వచ్చి తీసుకువెడతామని ఫోన్ చేశారని చెప్పాను. ఆస్టిన్ ఆలోచన ఉంటే స్వాగతం అన్నారు. అక్కడే మా ఆదినారాయణ గారి అమ్మాయి మా అమ్మాయి పాలిటెక్నిక్ క్లాస్‌మేట్ ఉన్నది.

మైనేనిగారు పంపిన వరద కవనకుతూహలం వరద కాలం చదివేశాను. దానిపై "వరదలో తేలి(రి)న తేట ఊట రాయటం ప్రారంభించి 7 ఎపిసోడ్లు మహాదాత దహదం "లక్ష్మీనారాయణపై ఒక ఆర్టికల్ రాశాను. మేనల్లుడు శాస్త్రి మంగళవారం కాలిఫోర్నియా నుంచి ఫోన్ చేయి తాము యూరప్ వెళ్లి ముందురోజు రాత్రికే వచ్చామని మా ప్రయాణంలో పదనిసలు చదివానని చెప్పాడు. బిజెపి అధ్యక్షుడు అమిత్ షా యెన్ డి ఏలోని 32 పార్టీల వారిని సంప్రదించి రాష్ట్రపతి ఉపరాష్ట్రపతి పదవికి ప్రధాని మోడీ ప్రకటించే పేరును ఆమోదించేట్లు చేశాడని వార్త చదివాను. అద్దాడలో శిష్యురాలైన కోడూరి పావనికి ఫోన్ చేసి మాట్లాడా వాళ్ళు ఒక రెండునెలలో ఉన్నచోటి నుండి మారాల్సి రావచ్చునని చెప్పింది పిల్లలతో మాట్లాడించింది చక్కగా తెలుగులో మాట్లాడారు ఆ అమ్మాయి చదువులోనేకాక సాంస్కృతిక కార్యక్రమాలలో కూడా చాలా ముందు ఉండేది మంచిపిల్ల.

రమణ ఎమ్మెల్సీ రాజేంద్రతో తిరుపతి వెళ్లానని అక్కడ శివప్రసాద్ గారు కనిపించి మాట్లాడారని చెప్పాడు ఒంటిమిట్ట కూడా చూసి ఇంటికి వచ్చాడు. మా కొడాక్ కెమెరాను దుబాయ్ ఎయిర్ పోర్ట్‌లో తీసేసుకొని విడిగా పాక్ చేసి డెస్టినేషన్‌లో కలెక్ట్ చేసుకోమని చెప్పారు. అంటే షార్లెట్ అనుకొన్నాను. న్యూయార్క్‌లోనే తీసుకోవాలిట మా బాగేజ్‌తో పాటు కనిపించలేదు 12 ఏళ్ళ నుండి వాడుతున్నాం కదా పొతే పోయిందని కున్నా. కానీ ఎమిరేట్స్ వాళ్ళు ఫోన్ చేసి న్యూయార్క్‌లో కెమెరా ఉందని డెమరేజ్ కట్టి తీసుకోమని విజ్జికి ఫోన్ చేస్తే మావాళ్ళు 15 గంటలు ఎయిర్‌పోర్ట్‌లో పడిఉన్నారు ఎవరూ వాళ్లకు ఆ సంగతి చెప్పలేదు కనుక మీరే మీ ఖర్చులతో షార్లెట్‌కు పంపమని చెప్పింది. సరే అన్నారట.

గురువారం మధ్యాహ్నం చరణ్‌కు ఫోన్ చేసాం ఫస్టియర్ రిజల్ట్స్ వచ్చాయి.

60 శాతం మార్కులు వచ్చాయని చెప్పాడు. మనగుడి "బడ్డీ బుడ్డి" పెళ్లి కుదిరిందని మే 17న ధార్మిక భవనంలో పెళ్లి అని రమణ మెసేజ్ పెట్టాడు. చాలా మంచివాడు కార్తీకమాసంలో దీపాలంకరణకు బొమ్మలు వేయటం దీపాలు అలంకరించటం గుడిని జాగ్రత్తగా కాపాడటంలో అత్యంత విశ్వాసంగా ఉంటున్నాడు. వాడితోపాటు సహకరించినవారికి అందరికీ పెళ్లిళ్లు అయ్యాయి. ఇక మిగిలింది శ్రీదేవి, ఇంకో అమ్మాయి చంద్ర శేఖరరావు గారి అబ్బాయి ఉన్నారు. స్వామి అనుగ్రహంతో వాళ్ళ పెళ్లిళ్లు కూడా త్వరలో జరగాలి. రాత్రి భానుచంద్ర సుమన్‌ల ఇంటర్వ్యూలను యు ట్యూబ్‌లో చూశాం. బాగున్నాయి. దాపరికం లేకుండా మాట్లాడారు. గురువారం సాయంత్రం స్పీడ్ పోస్ట్‌లో ఎమిరేట్స్ వాళ్ళు పంపిన కొడాక్ కెమెరా నాకు క్షేమంగా చేరింది. బుజ్జిముండ ఇప్పటికి ఎన్ని వేల ఫోటోలు తీసిందో లెక్క లేదు. ఈ విషయాన్ని మైనేని గారికి "విడ్డూరం" అని రాస్తే జవాబుగా "విడ్డూరాతి విడ్డూరం" అని రాశారు. రాత్రి సుడిగాడు సినిమా చూసాం. మొదట్లో బానే ఉన్నది.

సాయంత్రం వేలూరి పవన్ భార్య రాధ వచ్చారు. కెమెరా సంగతి చెబితే అందులోని మెమరికార్డ్ లాక్ అయిందని చెప్పి తీసి పని చేసేట్లు చేశాడు. శతకత్రయం వాళ్లకు ఇచ్చాను. అవధాని గారి శిష్యులు వచ్చి ఆయనవద్ద వేదం నేర్చుకున్నారు. రాత్రి విజ్జి స్నేహితురాలు గోసుకోండ వారమ్మాయి వచ్చి పలకరించింది. మళ్ళీ ఒక సారి 70 ఏళ్ళ ఫ్లాష్‌బాక్‌కు వెళ్లి మాట్లాడుకున్నాం. మా చిన్నప్పుడు శ్రీ గోసుకోండ వాసుదేవ శాస్త్రిగారు గురజాడ నుంచి వచ్చి వంగలవారి ఎత్తరుగుల ఇంట్లో ఉన్నారు. ఆయన భార్య సావిత్రమ్మగారు మా అమ్మకు గురువు అంటే సలహా సంప్రదింపులు వగైరాలకు వాళ్ళబ్బాయి రామచంద్రుడు ఫాక్టరీలో స్టోర్స్‌లో పని. నత్తి ఎక్కువ మాకు కాఫీపొడి పంచదార తెచ్చిపెట్టేవాడు. భార్య రుక్మిణమ్మ మాకు అక్కలాంటిది. ఆ తర్వాత శాస్త్రిగారు భార్య పోవటం, రుక్మిణమ్మ కూతుళ్ళు నాదగ్గర ట్యూషన్ చదవటం మామయ్యా అని అత్తయ్యా అని మమ్మల్ని ఇద్దర్నీ పిలవటం వాళ్ళపేర్లు భ్రమరాంబ సావిత్రి కావటం గుర్తు చేసుకున్నాం. రుక్మిణమ్మకు ఊరంతా పరిచయం ఎవరికి ఏసాయం చేయాలన్నా చేసేది. చిట్కా వైద్యం బాగా తెలుసు. మందు వేస్తే తగ్గిపోవాల్సిందే.

ఆదివారం శ్రీ హేవిళంబి హనుమజ్జయంతి కార్యక్రమం రాసి రమణకు పంపాను. రెండుపూటలా వాకింగ్ చేస్తున్నాను. రాత్రి రాంగోపాలవర్మ "సత్య–2" సినిమా చూశా. శర్వానంద్ హీరో. చాలాబాగుంది. ప్లాట్ విషయం ప్రక్కన పెడితే ట్రీట్‌మెంట్ అమోఘం. హీరోయిన్ అందాలు బాగా ఆరబోసింది. అందరిలో "నటన రసాన్ని" వర్మ పిండేసి ఇక వాళ్ళదగ్గర ఏమీ మిగలకుండా చేశాడేమో ననిపించింది. ప్రతిపాత్రనూ సమర్ధవంతంగా తీర్చిదిద్దాడు. కెమెరా వర్క్ సూపర్బ్, మంచి అందమైన

లొకేషన్లు. ప్రతి షాట్ పెర్ఫెక్ట్‌గా ఉన్నది కనుల పండువుగా చూపించాడు. ఎన్నో ఏళ్లయింది వర్మ సినిమా చూసి. మనీ మనీ తర్వాత ఇదేనేమో చూడటం. అగ్రశ్రేణి దర్శకుడని ఎందుకు అంటారో అర్థమయింది. అతని సమర్థతకు హేట్సాప్. ఇన్నేళ్లకు ఒక పెర్ఫెక్ట్ సినిమా చూశానన్న సంతృప్తి కలిగింది.

ఉయ్యూరులో బయల్దేరేటప్పుడు రసాలు తినటం ప్రారంభించి హైదరాబాద్‌లోనూ వచ్చేదాకా లాగించి ఇక్కడికి వచ్చాక కూడా మా అమ్మాయి తెస్తున్న నీలాలు తోతాపురి బ్లెండ్ చేసి చిన్న రసం ఆకారంలో సృష్టించిన పళ్ళు తింటున్నాం. బాగానే ఉన్నాయి చెట్టులేని చోట అన్నట్లు.

మొదట్లో నీళ్లు పూలు లేకుండా పూజ చేసినా కిందటి ఆదివారం నుండి నీటితో సంధ్యావందనం పూలతో పూజ దీపారాధన, అగరువత్తిలతో పూజ చేస్తున్నాను. రామకోటి రాసి భగవద్గీత చదువుతున్నాను. ఇంకా లైబ్రరీ దర్శనం కాలేదు. ఇవాళ సాయంత్రం వెళ్ళవచ్చు. కానీ ఇంట్లో ఉన్న బ్రాహ్మణ సంక్షిప్త చరిత్ర చదివా. అయిదేళ్లక్రితం మైనేనిగారు పంపిన జార్జ్ ఆర్వెల్ రాసిన యానిమల్ ఫారం. మామనవళ్ల పాఠ్యగ్రంథం Elie Wiesels అనే నాజీ దురాగతాలపై చిన్నపుస్తకం ఖాళీ ఉన్నప్పుడు చదువుతున్నా. మా ఇద్దరి ఆరోగ్యాలు బాగానే ఉన్నాయి. మా శ్రీమతికి మంచి విశ్రాంతి దొరికింది. నా పని అక్కడా ఇక్కడా ఒకటే తేడా ఏమీ లేదు దినపత్రికలు ఆన్‌లైన్‌లో చదువుతున్నాను. శ్రీ దేవినేని నెహ్రూ అకస్మాత్తుగా మరణించినట్లు వార్త చూశాను. తెలుగు దేశంలోకి చేరి కొన్ని నెలలే అయింది. ఈ వారానికి ఇంతే .

(17-4-17-కాంప్-షార్లెట్ -అమెరికా)

## వీక్లీ అమెరికా-3 -1

17-4-17 నుంచి 23-4-17 వరకు

వీక్లీ అమెరికా-2

సోమవారం రాసి మధ్యాహ్నం 3-15కు మా పెద్ద మనవాడు శ్రీకేత్‌తో కలిసి మేక్లిన్ బర్గ్ లైబ్రరీకి వెళ్లాను. ఈ సరస్వతీ ఆలయాన్ని అయిదేళ్ళక్రితం చాలా పుస్తకాలు చదివి సార్థకం చేసుకొన్నాను. మళ్ళీ అక్కిడికి రావటం గొప్ప అనుభూతి నిచ్చింది. మనవడు 5 గం నుంచి 7 వరకు వాలంటరి చేశాడు. అలా చేయాలట దానికి మార్కులు ఉంటాయట. నేను అక్కడ మూడు పుస్తకాలు చదివాను. 10 పుస్తకాలు ఇంటికి తెచ్చుకున్నాను. అక్కడ చదివినవాటిలో మొదటిది -The art of x ray reading. దీన్ని "రాయ్ పీటర్ క్లార్క్" రాశాడు. అందులో నాకు నచ్చిన వాక్యాలు మీ కోసం -డాంటే రాసిన "ఇంఫెర్నో"లో బతికి ఉన్నవారు చనిపోయిన వారూ ఒక ఫెర్రిలో

అధోలోకానికి ప్రయాణం చేస్తారని దానినే హేడ్స్లేక హెల్ నరకం అంటారని ఫెర్రి నడిపే చరోన్ అనే వాడికి డబ్బు ముట్ట జెబితే బోటులో స్టైక్స్ రివర్ మీదుగా లివింగ్ అండ్ డేడ్ వరల్డ్‌లను విభజించే చోటుకు తీసుకు వెడతాడని ఉందట. గ్రీసు దేశంలో పూర్వం చచ్చినవాడి నోరు, కళ్ళ మీద నాణాలు పెట్టేవారని, ఇది వాడి ఇతరలోక ప్రయాణానికి దారిఖర్చు ఆధునిక భాషలో "కాబ్ ఫేర్' ఫర్ దిజర్నీ ఇంటూది నెక్స్ట్ వరల్డ్". ఇంగ్లాండ్‌లో కింగ్ ఆర్థర్ చనిపోతే శవాన్ని బోటులో పెట్టి ధన కనక వస్తు వాహనాలు అందులో ఉంచి దాన్ని పాతి పెట్టటమో, సముద్రంలో వదిలేయటమో చేశారట. అది ఆయనకు ఉత్తమ లోకానికి దారి చూపిస్తుందని నమ్మకం.

ఇందులోనే రచయిత రచయిత రచన ఎలా ఉండాలో మంచి సూచనలు చేశాడు. అందరికీ శిరో దార్యమే అవి. –"Your writing should move -move -move from concrete to abstract ,from specific to general, from idea to example -from information to anecdote, from expression to dialogue. A good book is a perpetual motion machine that drives a story and lets the reader feel the energy" అంటాడు. వ్లాదిమిర్ నేబోకోవ్ రాసిన "లోలిత" నవలలో నేబోకో "సాహిత్యాన్ని ముక్కలు ముక్కలుగా చేసి లాగి పీకి అరచేతిలో నలిపి పెట్టి పీల్చాలి. నోటిలో వేసి నవలాలి అప్పుడే దాని ప్రయోజనం తెలిసి, దానిలో చెప్పబడిన అసలు విషయం అవగతమై, ఇందాక మనం చేసిన ముక్కలు చక్కలూ మన మైండ్‌లో అతుక్కుపోయి రక్తగాతమై అనుభూతినీ ఆనందాన్ని ఇస్తుంది" అన్నాడు. రాయ్ పీటర్ "Lolita is a kind of love letter to English Literature" అని గొప్ప నిర్వచనమిచ్చాడు.

రెండవ పుస్తకం "గ్రేటెస్ట్ ఆథర్స్ ఆఫ్ క్లాసిక్ హిట్" పుస్తకం Jeanne Nagle రాసింది. ఇందులో కొన్ని విషయాలున్నాయి. ఫ్లాబర్ట్ – మేడం బోవరి నవల రాసేటప్పుడు సరైన నిర్దుష్టమైన పదం కోసం రోజులతరబడి ఆలోచిన్చేవాడట. దీనినే అతని మాటల్లోనే తెలుసుకొంటే బాగుంటుంది –"My head reels and throat aches with chasting after, slogging over, delving into, turning around, gropping after and bellowing in a hundredth thousand different ways, a sentence that i have at last finished" అని చెప్పాడు. మనవాళ్ళు చెప్పిన కృత్యాద్యవస్థ అంటే ఇదే.

మూడవ పుస్తకం –Flights and wisdom of the ancient– అలేక్సాన్డ్రియా పబ్లిషింగ్ వాళ్ళది చిన్నపుస్తకంలో అనేక అద్భుత విషయాలు చదివాను.

పూర్వం మాయన్ ఖగోళ వేత్తలు సంవత్సరానికి 365.24 20 రోజులు అని

చెప్పారు. ఇవాల్టి రోజుల్లో మనం 36 5 .24 25గా రోజులుగా వాడుతున్నాం. హుందూరస్ శిధిలాలో ఈ కాలెండర్ రాతి మీద చెక్కబడి ఉంది. దానిపై 1 day July 26 736 అని ఉందట.

5 వేల ఏళ్ళ క్రితం సుమేరియాలో ఉన్నత వంశస్తులకే హై స్కూల్స్ ఉండేవట. బాటని జువాలజీ మినరాలజి జాగ్రఫీ లెక్కలు వగైరా నేర్పేవారట. రెండు వేల ఏళ్ళక్రితం బాగ్దాద్‌లో ఒక మట్టి కుండలో సోల్డరింగ్ కాపర్ షీట్ ట్యూబ్ ఇక అంగుళం వెడల్పు, నాలుగు అంగుళాల పొడవుతో కనిపించింది. అడుగున కాపర్ డిస్క్ ఇనుప కాడది ఉన్నాయి. దీనిలో యాసిడ్ పోస్తే బాటరీలాగా పని చేసేదట. కైరో మ్యూజియంలో క్రీ. పూ 200లో విమానం తయారు చేసిన దాఖలాలున్నాయట. బాబిలోనియాలో 5 వేల ఏళ్ళ క్రితం కాపర్ గ్రాఫైట్ ఎయిరోప్లేన్ భాగాలు కంపించాయట. 40 8 బి సి లో గ్రీకు గణిత వేత్త ఆర్చైటిస్ ఒక కర్ర పావురం తయారుచేసి ఎగిరెట్లు చేశాడట. లోపల ఇంజను రెక్కలు అన్నీ కూర్చాడట. ఇప్పుడు వాడుకంలో ఉన్న జెట్ ప్లేన్ ప్రిన్సిపల్ కూడా అతనే కానీ పెట్టాడని అంటారు. అతనిని "సైంటిస్ట్ హీరో" అని పిలిచేవారట. రొటేటింగ్ బాయిలర్‌ను రొటేటింగ్ రిపల్సివ్ ఎఫెక్ట్ కోసం తయారు చేశాడు. ఇదే జెట్ ప్లేంకు దారి చూపింది. చైనా రాజు షాన్ తలిదండ్రులు తనను చంపబోతున్నట్లు తెలుసుకొని ఒక విమానం తయారు చేయించుకొని పారిపోయినట్లు ఉన్నది. దీని తర్వాత 450 ఏళ్ళకు చింగ్ తాంగ్ చక్రవర్తి తన ఇంజనీర్‌కి కుంగ్-షితో ఫ్లైయింగ్ చారియట్ తయారు చేయించాడు. నాలుగవ శతాబ్దంలో కో హాంగ్ ఫ్లైయింగ్ కార్ ఉన్నట్లు రాశాడు. దాన్ని ఎద్దు చర్మంతో తయారు చేశారట. దానికి రొటేటింగ్ బ్లేడ్స్ ఇప్పటి హెలికాప్టర్‌కు లాగా ఉన్నాయట.

"సమర సూత్ర ధార" గ్రంథంలో పక్షిలాగా ఎగిరేదాన్ని విమానం అని అన్నారు. మధ్య ప్రాచ్యంలో కంబోడియాలోని బొగోటాలో "gold trinket resting in a blank vault" కనిపించిందట. ఇది సుమారు 6-9 శతాబ్దానికి చెందింది. రెండు అంగుళాలు పొడవు రెక్కలు అసాధారణ తోక ఒక పురుగు ఆకారం దాదాపు గబ్బిలం లాగా ఉండే ఎగిరే విమానం కనిపించింది ఇదే డెల్టా వింగ్‌తో ఉన్న స్టీప్ క్లైమ్బింగ్ జెట్ ఫైటర్ నిర్మాణానికి దారి చూపి ఉంటుంది.

రాత్రి 7 గంటలకు మా అమ్మాయి డ్యూటీ నుంచి వచ్చి నన్ను మనవడిని ఇంటికి తీసుకు వచ్చింది. మిగిలిన విషయాలు ఇప్పుడు రాస్తాను. మేము ఇక్కడికి వచ్చిన దగ్గర నుంచి రాత్రి 7-30 వరకు సూర్యుడు కనిపిస్తూనే ఉన్నాడు. పెద్దగా ఆశ్చర్యపడలేదు. కారణం మొదటిసారి అమెరికా టెక్సాస్ రాష్ట్రం హూస్టన్‌కు మా అమ్మాయి వాళ్ళ ఇంటికి వచ్చినప్పుడు రాత్రి 10-30కు కూడా సూర్యుడు కనిపించేవాడు జూన్ నెలలో.

## షార్లెట్ సాహితీ మైత్రి బంధం

ఈ సోమవారు డా.ఇన్నయ్యగారు ఫోన్ చేసి మాట్లాడారు ఆత్మీయంగా.

నేను లైబ్రరి నుంచి తెచ్చుకున్న 10 పుస్తకాలలో మొదటిది "ది ట్రోజన్ వార్" చదవటం ప్రారంభించా దానిపై ఒక వ్యాసమూ రాశాను. రాత్రి బ్రహ్మానందం కోవై సరళ కామెడీ బిట్స్ చూశాం. సాయంత్రం గంగాధరరావు గారికి ఫోన్ చేసి మాట్లాడా. మంగళవారం ఖాజీ పాలెంలో ఉన్న నా బి ఎడ్ మిత్రుడు వారణాసి సుబ్బయ్యకు ఫోన్ చేసి మాట్లాడితే పరమ సంతోషించాడు. వాళ్ళ మనవాడి ఉపనయనం అనీ మా ఇద్దరి ఆశీర్వాదాలు. కావాలని కోరాడు. తరువాత మన గుడి బడ్డీ బుద్దితో, తూములూరు వారితో, మనవడు చరణ్‌తో, వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రిగారితో ఫోన్ చేసి మాట్లాడాను. శాస్త్రిగారు మహదా నందం తెలియబరచారు. రెండవ పుస్తకం "లీడర్స్ ఆఫ్ ది ఏన్షెస్ట్ గ్రీస్" చదవటం మొదలెట్టా. దీనిపై కూడా మూడు ఆర్టికల్స్ రాశాను. ఈల వీజిల్ పూర్తిచేసి, లివింగ్ విత్ ది హిమాలయన్ మాస్టర్స్ స్వామి రాం రాసిన పెద్ద పుస్తకం ప్రారంభించి ఈ వారంలో సగం చదివా. మధ్యలో పాల్ జాన్సన్ రాసిన "హ్యూమరిస్ట్స్- చదివి విదేశీ హాస్యంపై రాశా. మాస్టర్స్ పుస్తకం ఆధారంగా ఏతి పై నేతి నేతి యేతి, హిమాలయ గుహాంతర ఆశ్రమ జీవనం రాశా. గ్రీస్ పుస్తకం ఆధారంగా గ్రీకు ప్రజాస్వామ్య పిత సోలోన్, నావికా దళపిత స్టేమో క్లెస్ రాశా. ఇందులో ఇంకో విషయం ఒకటి బాగా నచ్చింది -మాసిడోనియన్లు గొప్ప భవన నిర్మాతలు అని, వారు కట్టిన సిటడేల్స్-కోట ప్రహరీ గోడలు-10 అడుగుల మందంగా కట్టారని, రాజ సమాధులను తేనెటీగ గూడు లాగా నిర్మించారని, వాటి నిర్మాణానికి 120 టన్నుల బరువున్న కొండ రాళ్ళను ఉపయోగించారని తెలిసి కొంత ఆశ్చర్య పోయాను కాని మన బృహదీశ్వరాలయ నిర్మాణమూ ఇంత బృహత్తరమైనదే నని సంతోషించాను. గ్రీకు దేశంలో బ్రాంజ్ ఏజ్‌ను "ఏజ్ ఆఫ్ హీరోస్" అంటారని తెలిసింది. 1200 బి సిలో ట్రాయ్ నగర పతనం తర్వాత ఎజియన్ ప్రాంతం, తూర్పు భాగాలు అనుకోని సంక్షోభంలో పడిబలమైన మైసీనియన్ సామ్రాజ్యం నాశనమై ఆర్ధిక రాజకీయ సంక్షోభాలలో కూరుకుపోయి ఆటవిక జాతులు సిటీలను ఆక్రమించి మైసీనియన్ నాగరకత కనుమరుగైంది. ఈ 1100-800 బి సి సంక్షోభ కాలాన్ని "డార్క్ ఏజ్" అన్నారు చరిత్రలో. మళ్ళీ 800-500 బి సి నాటికి గ్రీసు వైభవం మొదలైంది. దీన్ని ఆర్కాయిక్ ఏజ్ అన్నారు. క్రమగా ఈజిప్ట్‌తో నౌకా వ్యాపారం సాగించారు.

ఇక 22-4-17 శనివారంనాడు షార్లెట్‌లో హిందూ సెంటర్‌లో జరిగిన "శ్రీ సత్యసాయిబాబా" ఆరాధనోత్సవంపై వివరంగా రెండో భాగంలో రాస్తాను.

(23-4-17 -కాంప్-షార్లెట్ -అమెరికా)

గబ్బిట దుర్గాప్రసాద్

## వీక్లీ అమెరికా-3 -2 (చివరిభాగం)

17-4-17 నుండి 23-4-17 వరకు

భగవాన్ పుట్టపర్తి సాయిబాబా 24-4-2011న సమాధి చెందిన సందర్భంగా ఆరవ ఆరాధనోత్సవాన్ని షార్లెట్‌లోని సత్యసాయి సెంటర్ వారు రెండు రోజుల ముందే శలవు రోజు 22-4-17 శనివారం హిందూ సెంటర్‌లో రాలీ యాన్డర్సన్ గ్రీన్స్ బరీ సాయి సెంటర్ వారిని కూడా ఆహ్వానించి ఘనంగా నిర్వహించారు. సుమారు రెండు వందల మంది సాయి బ్రదర్స్ అండ్ సిస్టర్స్‌కు ఉదయం టిఫిన్ కాఫీ మధ్యాహ్నం, రాత్రి భోజనాలు సాయంత్రం స్నాక్స్ టీ ఏర్పాటు చేశారు. మా అమ్మాయి విజయలక్ష్మికి భోజనం వగైరా ఏర్పాట్లకు కో ఆర్డినేషన్ బాధ్యతను సమావేశ నిర్వహణ బాధ్యత జయ అనే ఆవిడకు అప్పగించారు. మా అమ్మాయి అందరితో సంప్రదింపులు ఫోన్ ద్వారా జరుపుతూ ఏ లోపం లేకుండా శ్రమించి నిండుదనం తెస్తే జయ సభా నిర్వహణ చక్కగా చేసింది. అందరూ మంచి సపోర్ట్‌గా నిలబడి విజయవంతం కావటానికి దోహదపడ్డారు. ఇందులో నిర్వాహకులు సుబ్బు సత్య, పవన్, రవి పాత్ర మరువలేనిది.

ఉదయం 8-30కి నన్నూ మా మనవాడు పీయూష్‌ను ఇంటివద్ద తయారు చేసిన మైసూర్ పాకులు, సాంబారు వగైరాను తీసుకొని కారులో తీసుసుకొని వెళ్ళింది. హిందూ సెంటర్‌కు 9-30కి చేరాం. అక్కడ అప్పటికే ఉన్న డా. సర్వేశ్ దంపతులు సత్య సుబ్బు అయిదేళ్ళ తర్వాత మళ్ళీ మేము రావటంతో సంతోషంగా పలకరించారు. అప్పటికే ఆ రోజు ముఖ్య అతిథి వక్త కరణం బాల సుబ్రహ్మణ్యం అనే బ్రదర్ బాలు కూడా వచ్చి ఉన్నారు. మా రెండవ బావగారి అన్నగారి అబ్బాయి వేలూరి పవన్ ఏర్పాట్ల విషయం చూస్తున్నాడు. ఉదయం బ్రేక్ ఫాస్ట్‌గా ఉప్మా, కేసరి పొంగల్ , తిని కాఫీ తాగాను. పదింటికి ఉష భర్త రామకృష్ణ అనే రాంకీ మా శ్రీమతిని మనవడు అశుతోష్‌ను తీసుకు వచ్చాడు. అందరూ సరదాగా ఉన్నారు. కార్యక్రమాలతో నవ్వుతూ పలకరిస్తూ రమ్య, సుచిత్ర, పవన్ భార్య రాధ జయ సందడి చేస్తూ అందర్నీ బ్రేక్ ఫాస్ట్ చేయమని కోరుతూ నాబోటి వాళ్లకు కాఫీ కలుపుకోవటం రాకపోతే సహకరిస్తూ సాయం చేస్తున్నారు. దాదాపు ఆడవాళ్ళు చీరలతో సంప్రదాయ బద్ధంగా వచ్చారు. తెలుగు కన్నడం మలయాళం గుజరాతీ మహారాష్ట్ర అమెరికన్‌లు కూడా పాల్గొని ప్రపంచం చిన్నది అనిపించారు. ఆకాశంలో సగం అనుకొనే మహిళలు చాలా ఎక్కువ మందే పాల్గొన్నారు.

గాంధి భవన్‌లో ఉదయం 10.30కి భజనలతో కార్యక్రమం ప్రారంభమైంది. జయ, సౌమ్య విజ్జి సుబ్బు రవి మొదలైనవారు భజనలు పాడారు. వేదికపై పెద్ద సత్య సాయిబాబా ఫోటో దానికి రెండు వైపులా అట్టలతో నెమలి బొమ్మలు కలర్‌ఫుల్‌గా చేసి పుష్పాలతో హారాలు వేసి అలంకరించారు. ఎన్ని రోజులనుండి దీన్ని చేశారో?

## షార్లెట్ సాహితీ మైత్రి బంధం

ఉదయం 11 గంటలకు కరణం బాలసుబ్రహ్మణ్యం ప్రసంగం ప్రారంభమైంది. ఆయన పుట్టపర్తి దగ్గర పల్లెటూరివాడు. పల్లె చదువు పూర్తిచేసి, పుట్టపర్తిలో సత్యసాయి విద్యాసంస్థలలో ఏం ఎసి సి చదివి పి.హెచ్‌డి చేసి కొద్దికాలం అక్కడే పని చేసి ఇప్పుడు అమెరికాలో అట్లాంటాలో కేమిస్ట్రి లెక్చరర్‌గా ఉన్నాడు. మంచి వక్త, కవి. బాబాతో చాలా ఏళ్ళ అనుబంధమున్నవాడు. కవితలతో బాబాను మెప్పించినవాడు. ఈనాటి అన్ని కార్యక్రమాలలో ఒక్కటే అంశం "హృదయ పరివర్తన" అనేది. దీనిపై చాలా స్పాంటేనియస్‌గా స్క్రీన్‌పై ప్రదర్శనాత్మకంగా మాట్లాడాడు. మధ్యాహ్నం పానెల్ డిస్కషన్ తర్వాత కూడా ఆయన మళ్ళీ మాట్లాడాడు. అందులోని సారాంశం అందరూ తెలుసుకోవాలి. అయన మాటలను ఎప్పటికప్పుడు నోట్‌బుక్‌లో రాసుకున్నా ఆ సారమే ఈ ప్రసారం– "హృదయం అనే మాటకు బాబా దయ కలిగింది అని అర్థం చెప్పారు. దైవం అంటే ప్రేమ. అందరికీ "కంపాషన్" ఉండాలే తప్ప కంపు ఫాషన్ కాదు. "అద్వితీయమందంగ ప్రేమకాక వేరొకటి ఏల? బాబా అనుగ్రహం ఎవరిమీదైనా కలిగితే "తాంబూలం ఇస్తా. తీసుకో" అనేవారు. తాంబూలం అంటే పళ్ళెంలో పళ్ళూ తమలపాకులు వక్కలు వస్త్రాలు డబ్బు కానుకగా ఇవ్వటం. ఆయన నడిపే స్కూల్‌లో ఎప్పుడూ విద్యార్థులకు పుట్టపర్తిలో దొరకని ఆపిల్స్ ఫలహారాలు భోజనాలు సమకూర్చేవారు. ఇది తెలిసి ఇక్కడే చదవాలనుకొన్నాడు బాలు.

మొదటిసారి బాబాను చూసి స్పందించి "కంటి నఖిలాండ మూర్తిని గంటి –మదములు పోగొట్టుకొంటి" అనిపించింది. ఎవరిన్నైనా గృహప్రవేశం చేయమని బాబాను ఆహ్వానించేవారు. వారికి తాంబూలం ఇచ్చి పాలలో వ్రేలు పెట్టి గృహప్రవేశం చేయించేవారట బాబా. పుట్టపర్తి స్టేట్ బాంక్ ప్రారంభోత్సవాన్ని కూడా ఇలాగే చేసి బ్యాంకులో డబ్బులు ధర్మవరం నుంచి ఇంకా రాకపోతే బంగారు నాణాలు సృష్టించి లాకర్లలో పెట్టించిన మొదటి ఖాతాదారు బాబాయే. బాబా ఎప్పుడూ "నేను డ్రిల్ మాస్టార్ని జాగ్రఫీ టీచర్ని కాదు. మీ శరీరానికి మనసుకు ఎక్సర్‌సైజ్‌లు ఇచ్చేవాడిని నేర్పేవాడిని" అనేవారు. విజయం అంటే మన పరిశ్రమ ప్లస్ స్వామి దయ అని నిర్వచించేవారు. "తనను తానూ తెలుసుకోవటం తనువుకు లక్ష్యం" అనేవారు.

బుక్కపట్నంలో వేంపల్లి జయమ్మ బాబా క్లాస్‌మేట్. ఆమె బాలుకు బాబా సాక్షాత్తు పరమాత్మ అని చెప్పి ఆయన్ను నమ్ముకొంటే నీకు మంచి భవిష్యత్తు ఉంటుందని బోధించింది. ఆమె ప్రతి పుట్టిన రోజును జ్ఞాపకముంచుకొని బాబా ఆమె ఇంటికి ఘనంగా కానుకలు పంపేవారు. ఎవరైనా బాబా దగ్గర కొచ్చి "నేను పాడుతాను" అంటే "మంచిది పాడు" అనేవారు అంటే సరే నాయనా పాడు అని ఒకర్థం మంచి పాటలు పాడు అని వేరోకర్థం. "singers who sing with ego are sinners"

అనేవారు. "సాయి దర్శనం సుదర్శనం" అని బాలు రాసి చూపాడు. "చావు లేని చదువు చదువ వలెను" అని చెప్పేవారు. పుట్టపర్తిలో ఫ్రీ ఎడ్యుకేషన్ అంటే మన గవర్నమేంట్ బడులలో ఉన్న లెస్ ఎడ్యుకేషన్ కాదు బెస్ట్ ఎడ్యుకేషన్" అన్నాడు బాలు. సాయి చిరుకోపం వస్తే దున్నపోతా బక్కోడా బండోడా అనేవారు సాధారణంగా అందర్నీ "బంగారూ" అనే సంబోధించేవారు. "సాయి నీ హృదయ స్థాయి–తెలుసుకొంటే మనసుకు హాయి" అనేవారు బాబా . మరోసారిబాలు "స్వామితో మాట్లాడితే ఆనంద బాష్పాలు కారు" అని కవిత వినిపిస్తే "కపిత్వం" బాగానే అబ్బిందే అని మేలమాడారు. బాలు "కోదండ పాణి నువ్వైతే కపి (హనుమాన్)ని నేను" అన్నాడు. పద్యాలన్నీ విని "నీకేం కావాలో తీసుకో" అన్నారట. ఆయనతో గడపటం "లివింగ్ విత్ లవింగ్ గాడ్" అన్నాడు బాలు. ఎవరైనా భయమేస్తోంది బాబా అంటే "నువ్వు చేస్తుంటే భయం – బాబాకు వదిలేస్తే అభయం" అనేవారు.

మధ్యాహ్నం 2కు మళ్ళీ ప్రసంగిస్తూ బాలు "టెక్నాలజీ ఈజ్ ట్రిక్నాలజి" అని బాబా అనేవారని, బాబా అల్కెమిస్ట్ అని గోల్డ్ స్మిత్ విత్ లవ్ అనివర్ణించాడు. ఒకసారి అసలు పుష్పించని చెట్టునుంచి పూలు పళ్ళు కాయించి ఇచ్చారు. "ఇన్ని విషయాలు మీకు ఎలా గుర్తు ఉంటాయి?" అనియా అడిగితే "నీకు కావాల్సినప్పుడు అవే గుర్తుకు వస్తాయి" అనేవారు. భగవద్గీత మొదటి శ్లోకం చివరి శ్లోకంలలో ధర్మ మన ఉన్నాయి అదే దాని పరమార్థం నీ డ్యూటీ నువ్వు చెయ్యి అని గీత సారం. కురుక్షేత్రంలో గీత బోధించినప్పుడు అర్జునుని వయసు 75, శ్రీకృష్ణుని వయసు 80 అని బాబా చెప్పారు. "నిజమైన ఆనందం నీలోనే ఉంది –అది చూపించటానికే వచ్చాడు సాయి" అనేవారు బాబా. సాయిబాబా సంస్థలలో "స్టెప్పింగ్ డౌన్" అనేది లేదు స్టెప్పింగ్ అప్ మాత్రమే ఎప్పుడూ.

"పాపాత్మా పాపసంభావానామ్ పాప కర్మాణానాం" అనే శ్లోకాన్ని మార్చి బాబా "ప్రాప్తోహం ప్రాప్త సంపన్నానాం" అని చెప్పించేవారు. ఈ దేహం నాకు వచ్చింది. దాన్ని సార్థకం చేసుకొంటాను అని అర్థం. ఎవరో "సాయికి వేదం తెలుసా?" అని అడిగితే "సాయి చెప్పిందే వేదం" అన్నారు ఆయన వద్ద ఉన్న మహా వేదవేదాంత శాస్త్ర విజ్ఞానులు.

బాబాకు అపత్ సమయంలో ఎలా ఆదుకోవాలో తెలుసు. బాలు అక్క పెద్దగ చదువుకోలేదు. పెళ్లి అయి రెండో ప్రసవంలో ఆమె డిప్రెషన్‌లోకి వెళ్ళింది, ఇంట్లో వాళ్ళందరూ బాబాకు చెప్పమన్నారు. ఆలోచించి ఆలోచించి బాబాకు బాలు విషయం చెప్పాడు. మర్నాడే ఆమెను అమ్మనూ తీసుకుని రమ్మని జేబులో డబ్బు పెట్టి పంపారు. మర్నాడు వాళ్ళు వచ్చారు. బాబా "వచ్చారా" అని అడిగితే అంత మంది జనంలో

ఎక్కడున్నారా అని చూస్తుంటే "అదిగో అక్కడ ఉన్నారని చెప్పి" వాళ్ళను లోపలి తెప్పించారు. ఒక శివలింగం సృష్టించి దాన్ని గ్లాసు నీళ్ళలో వేసి ఏడు రోజులపాటు తీర్థంగా అక్కకు ఇస్తే తగ్గిపోతుందని చెప్పితే అలా చేయగానే తగ్గిపోతే కుటుంబం అంతా బాబా దగ్గరకు వచ్చి కృతజ్ఞతలు చెబితే అక్క బాలు సంగతి చూడమని అంటే ముందు నీ పిల్లల ఆలనా పాలనా చూసుకో అని చెప్పి బావనూ పిలిచి ఆమె నీకు సేవ చేసినట్లు నువ్వు ఆమెకు సేవ చేయి అని బోధ చేశారని బాలు తన అనుభవాన్ని తెలియజేశాడు.

బాబాపై తనకు అత్యంత భక్తి అని బాలు బాబాతో అంటే "కాన్షస్‌లో కాన్ఫిడెన్స్ ఉండాలి" అని బోధించారు. బస్ బయల్దేరితే డస్ట్ కూడా దాని వెనక వచ్చి బస్సు ఆగితే ఆగిపోతుంది. కనుక సాధన నిరంతరం సాగాలి. అమెరికాలోని అలబామా రాష్ట్రంలోని మాంట్ గోమరీలో ఉన్న ఒకాయన 35 ఏళ్ళనుంచీ దిగ్విజయంగా ఎక్కువ మంది సాధకులతో సాయిసెంటర్ నడుపు తున్నాడని ఆయన జీవితంలో కనీసం ఒక్క సారికూడా బాబాను సందర్శించలేదని ఇదొక అద్భుత అపూర్వ విషయమని బాబా స్ఫూర్తి అలాంటిదని బాలు అన్నాడు. "మనసు కొంతయునిచ్చి –స్వామి కరుణ అందరాని సుఖము నందగలరు" అంటూ తన ట్రాన్స్‌ఫర్మేషన్‌కు బాబా ఎలా దోహదపడ్డారో సోదాహరణంగా ప్రసంగించి, అందరి ప్రశంశలు అందుకున్నాడు బాలు.

మధ్యాహ్నం వివేకా హాల్‌లోనే లంచ్. పప్పు రెండు కూరలు పులిహోర ఫ్రైడ్ రైస్, ఆవకాయ, టమేటా చట్నీ, సాంబారు పెరుగన్నం, లడ్డూ అరటిపండులతో భోజనం. అందరూ సంతృప్తిగా తిన్నారు. అన్నీ బాగానే ఉన్నాయి. కావాల్సినవారికి పూరీ చానా మసాలా కూడా పెట్టారు.

భోజనం తర్వాత మధ్యాహనం 1–30కి కాసేపు భజనలు. తర్వాత హార్ట్ ట్రాన్స్ఫర్మేషన్ "పై పానల్ డిస్కషన్. ఇందులో నస్రిన్ అనే ఇరానీ పి.హెచ్‌డి అమ్మాయి రుద్రం అద్భుతంగా కంఠో పాఠంగా వచ్చినమ్మాయి, అరుణ, రవి, రాజారావు శంకర్‌లు పాల్గొన్నారు మోడరేటర్‌గా బాలు వ్యవహరించాడు. వీరందరి చర్చ సారాంశం–పరివర్తన అంటే కామ క్రోధాదులను దూరం చేసుకోవటం గ్రోయింగ్ టువర్డ్స్ గాడ్. చేంజ్ ఆఫ్ నో రికగ్నిషన్. ఫిజికల్ వరల్డ్ నుంచి స్పిరిట్యువల్ వరల్డ్‌కు ప్రయాణం భౌతిక హృదయం ఆధ్యాత్మిక హృద్యంగా మారటం. ఇందులో పాల్గొన్న వారు వారి అనుభవాలు వివరించారు. ఒకసారి సాయిమందిరంలో పెయింటింగ్ వేయాల్సివచ్చింది. నిరంతరం భక్తుల ప్రవాహం వలన పెయింటర్‌లకు అర్ధ రాత్రికాని వీలు చిక్కేదికాదు. సమయం దగ్గర పడుతోందని బాబా హెచ్చరిక. ఒకరోజు అందరూ ఒక కుర్రాడి మీద వదిలేసి విసుగొచ్చి వెళ్లిపోయారు. వాడు తెల్లవార్లూ వేస్తూ బాబాకు కనిపించాడు. మర్నాడు వాడిని పిలిపించి తాంబూలం

ఇచ్చారు. వాడు ఈ అదృష్టానికి వలవలా ఏడ్చేశాడు. ఇది తెలిసిన మిగిలినవాళ్ళు కూడా అప్పటిదాకా సాయిని చూడనివాళ్ళు అందరూ బాబా పాదాలపై పడ్డారు. వారందరికీ కానుకలు ఇస్తే అక్కడే వదిలి పాద స్పర్శ తప్ప తమకు ఏమీ వద్దన్నారు. వాళ్లకు నచ్చ చెప్పి కానుకలు మళ్ళీ ఇప్పించారు బాబా. తరవాత టీ బ్రేక్–మరమరాలు పళ్ళముక్కలు బిస్కట్లు జ్యూస్లు టీ ఇచ్చారు.

సాయంత్రం 4 గం.లకు సాంస్కృతిక కార్యక్రమాలు. ఇందులో కూడా హృదయ పరివర్తనమే సబ్జెక్ట్. గ్రీన్ బరో వాళ్ళు శ్రీరామ వనవాసం చిత్రాలతో "పప్పెట్ షో" చేశారు బాగుంది. యాండర్సన్ వాళ్ళు లఘు చిత్రాలు "డజ్ గాడ్ ఎక్సిస్ట్, వాట్ ఈజ్ వర్షిప్, ది గెస్ట్లు" ప్రదర్శించారు.

మొదటిసారిగా షార్లెట్ సెంటర్ వారు మగవాళ్ళందరూ కలిసి నాలుగు చిన్న నాటికలు ప్రదర్శించారు. మొదటిది– వాల్మీకి–బోయ రత్నాకరుడు వాల్మీకిగా రూపాంతరం చెందటం రెండవది ప్రాఫెట్ మొహమ్మద్‌ను ఏవగించుకొనే వీధులు ఊడ్చే ముసలివాడిలో ఆయన కరుణ వలన హృదయ పరివర్తన రావటం, యేసు క్రీస్తును ఆరాధించే ధనవంతుడిపై అసూయ చెందినవారు. ఆయన అంతరంగాన్ని తెలుసుకోవటం అధనవంతుడు తన సంపద వీళ్ళకు ఇచ్చి యేసు భక్తుడుగా మారటం, నాలుగవది కల్పగిరి అనే ఖైదీ బాబాకు తన గోడు జాబులో తెలియజేస్తే ఆయన అనుగ్రహంతో శిక్షాకాలం తగ్గి విడుదలవటం ఇందులో మా బంధువు వేలూరి పవన్ ఖైదీగా గొప్ప నటన ప్రదర్శించాడు. మరో నాటిక కేరళకి చెందిన వీర కమ్యూనిస్ట్ హిందూ మత ప్రచారకులు అంటే గిట్టక బాబాను అర్ధరాత్రి చంపటానికి పుట్టపర్తి చేరి బాబాతో పాటు నిద్రించగా బాబా "ఇంకా సమయం కాలేదా?" అని అడగటంతో తప్పు తెలుసుకొని బాబా అనుగ్రహంతో మారి అక్కడే ఉండిపోవటం "లవ్ ఈజ్ గాడ్" అనే సందేశం.

ఈ నాటికలలో పాల్గొన్నవారంతా బాగా నటించారు. పవన్ మాత్రం నటనతో జీవించాడు అని చెప్పక తప్పదు. ఎక్కడా బోర్ కొట్టకుండా చక చక సాగిపోయాయి. ఉన్నంతలో రంగాలంకరణ అన్నీ బాగా చేశారు. అందరూ ఉద్యోగస్తులే. పిల్లా పాపా ఉన్నవారే. పిల్లల చదువులతో తీరిక లేనివాళ్ళే అయినా గొప్ప సంకల్ప బలంతో దీన్ని సాధించారు. అందరూ అభినందనీయులే.

బ్రేక్ ఫాస్ట్ లంచ్ చేసిన వివేక్ హాల్‌ను మధ్యాహ్నం ఒంటిగంటకు గుజరాతీ సభ జరిపే వారికి అప్పగించాలి. అందుకని భోజనాలు అవగానే ఆడ, మగా అందరూ త్వరత్వరగా సామాన్లు తీసుకొని గాంధీ భవన్ కింద అంతస్తులోకి చేరవేయటం, క్లీన్ చేయటం చేసేశారు. వాలంటరీ వర్క్ అంటే ఎలా ఉంటుందో రుజూవు చేశారు. వాళ్ళ ఓర్పుకు సాయానికి హేట్సాఫ్. నేనేదైనా చేద్దామనుకొంటే నన్ను చేయనివ్వలేదు.

సాంస్కృతిక కార్యక్రమాలు కాగానే డౌన్ స్టేయిర్‌లో డిన్నర్. దూర ప్రదేశాల నుండి వచ్చినవారికి బాక్స్‌లలో చపాతీ కూరా పులిహోర, మైసూర్ పాక్, బిర్యానీ సర్ది ఇచ్చారు ఆడవాళ్ళు. తినే సమయం ఉన్నవారు ఇక్కడే తిన్నారు. అంతా అయేసరికి, ఊడ్చి బాగు చేసేసరికి సామాన్లు సర్దుకొని ఎవరిసామాను వాళ్ళు తీసుకుపోయేసరికి రాత్రి తొమ్మిదయింది. అప్పుడు బయల్దేరి అందరం ఇంటికి చేరేటప్పటికి తొమ్మిదిన్నర.

సందట్లో సడేమియా -వివేక్ హాల్‌లో మధ్యాహ్నం 1 గంట నుండి గుజరాతీ వాళ్ళు "దాదా భగవాన్"పై సత్సంగం చేశారు. ఒకటి రెండుసార్లు వెళ్లి చూశాను. వాళ్ళూ భోజనాలు వగైరాలతో ఉన్నారు. యాభై మంది దాటిలేరు ఆడామగా. ఇంతకీ ఎవరి గురించి అని ఒక పెద్దాయనను ఇంగ్లీష్‌లో అడిగితే చెప్పాడు నెలకోసారి ఇలా సమావేశామౌతారట. మాట్లాడుకొంటారు. భజనలు పాడతారు. అవి సంస్కృతంలోనే ఉన్నాయి. ఫోటోలు తీసుకోవచ్చా అని అడిగి సరేనంటే ఫోటోలు తీశాను.

దాదా భగవాన్ అంటే గుజరాత్‌లో 7-11-1909లో బరోడా దగ్గర తరసలిలో జన్మించిన అంబాలాల్ ముంజీభాయ్ పటేల్. 1958లో ఆత్మజ్ఞానం పొంది దాదా భగవాన్ అయ్యాడు. జైనులు చెప్పే క్రమపద్ధతిలో ఆత్మజ్ఞానం పొందకుండా తక్షణ ఆత్మజ్ఞానం పొంది మోక్షం సాధించటానికి అంటే -"అక్రం విజ్ఞాన్" పొందటానికి సాధనాలు చెప్పాడు. దీన్నే వ్యాప్తి చేశాడు. తన అనుభవాలను అందరితో పంచుకోనేవాడు. ఒకసారి ఉగాండా నుంచి 1962లో చంద్రకాంత పటేల్ అనే ఆయన వచ్చి ఈయన ప్రభావానికి లోనై రెండవ తక్షణ ఆత్మజ్ఞాని అయ్యాడు దాదా తర్వాత. దేశ విదేశాలలో పర్యటించి "అక్రం విజ్ఞాన్" వ్యాప్తి చేశాడు. 1-2-1988న ఆయన మరణించినప్పుడు 60 వేల మంది భక్తులు అంత్యక్రియలకు హాజరయ్యారు. ఈవిధంగా ఇవాళ మరో మహానుభావుడిని గురించి తెలుసుకొనే అదృష్టం కలిగిందినాకు.

(23-4-17-కాంప్-షార్లెట్-అమెరికా)

**వీక్లీ అమెరికా-4-1** 24-4-17 నుండి 30-4-17 వరకు

వీక్లీ అమెరికా -4 -1

## మూడు విందులు రెండు పూజల వారం

24వ తేది సోమవారం ఇంకా బెడ్ మీద ఉండగానే సెల్ మోగింది. నిద్రలో ఎత్తా. విశాఖ నుంచి స్వామిగారట, మెయిల్ రాశాను జవాబు లేదని ఫిర్యాదు. తెలివి తెచ్చుకొని అమెరికాలో ఉన్నా తడిసి మోపెడవుతుంది అని కట్టేశా. అయినా 30 రూపాయలు బొక్క పొద్దున్నే. అలాగే ఇక్కడికి వచ్చిన 7వ తేది వాషింగ్టన్ నుంచి కారులో వస్తుంటే రావి శాస్త్రిగారి అబ్బాయి ప్రసాద్ గారు ఫోన్ చేశారు. అప్పటికి

రోమింగ్ విషయం గుర్తులేక కాసేపు వాయించామ్. మా అమ్మాయి అరుస్తూనే ఉంది. ఉండమని ఆపేశా. 90 రూపాయలు తోసింది. అప్పటినుంచి మ్యూట్‌లో పెడుతున్నా సెల్. రెండు రోజులుగా వర్షం పడుతోంది. శ్రీ గండికోట సుబ్బారావు, సోమలత గుర్తించిన వైద్య భైరవ దత్తులపై నెట్‌లో రాశా. ఇల్లంతా ఇద్దరు ఆడవాళ్ళు బహుశా మెక్సికన్లు అన్నీ సర్ది క్లీన్ చేశారు.

హైదరాబాద్‌లో జ్యోతి శ్శాస్త్రవేత్త, పంచాంగకర్త శ్రీ అదుసుమిల్లి (బ్రాహ్మణుల ఇంటిపేరు కమ్మవారింటి పేరు కాదు) లీలాప్రసాద్ గారబ్బాయి రాంకీ, భార్య ఉషలు అయిదేళ్ళ క్రితం వచ్చినప్పుడే బాగా పరిచయం. వాళ్ళ ఇంట్లో ఇవాళ రాత్రి సాయి భజనకు పిలిస్తే మా అమ్మాయి ఆఫీస్ నుంచి వచ్చాక రాత్రి 7-30కు బయల్దేరి 8కి చేరాం. సుమారు 50 మంది వచ్చారు. రాంకీ ఉషా దంపతులకు శతకత్రయం ఇచ్చాము. ఆతను "వేద మాల" అనే సంస్కృత శ్లోకాల పుస్తకం ఇచ్చాడు. తర్వాత భోజనాలు. మూడు స్వీట్లు రెండుహాట్లు రెండుకూరలు పప్పు అప్పడం సాంబారు, పెరుగు, పుచ్చముక్కలు వగైరాలతో భోజనం. అన్నీ బాగానే ఉన్నాయి. రాంకీ తమ్ముడు భార్య ఇక్కడే ఉంటున్నారు. ఆమె పద్మశ్రీ సంగీతం బాగా పాడింది. మా మనవళ్ళు ఆశుతోష్, పీయూష్‌లకు సంగీత గురువు. అక్కడ ఒక డాన్స్ టీచర్ పరిచయమైంది. అలాగే పవన్ డోమేనికన్ రిపబ్లిక్‌కు చెందిన ఆవిడను పరిచయం చేశాడు. ఆవిడను ఆరాధన రోజూ చూశా. ఇప్పుడు మాట్లాడా. ఆమె అక్కడ దేశానికి ప్రెసిడెంట్ అయ్యే చాన్స్ వచ్చినా వదిలేసి ఇక్కడ కొడుకుతో ఉంటోంది. మన సంప్రదాయాలు తెలుసు. ఉష బొట్టుపెడితే చక్కగా పెట్టించు కోన్నది . పవన్ చెబితే ఆవిడపై నెట్‌లో వ్యాసం రాద్దామని అనుకొన్నాను. ఆవిడకు నా మెయిల్ ఐడి ఇక్కడి ఫోన్ నంబర్ ఇచ్చి ఆమె గురించి విషయాలు మెయిల్ చేయమన్నాను. అందగానే తెలుగులో రాస్తానని చెప్పా. ఈ రోజు వరకు ఆమె నుండి విషయం రాలేదు. ఇంటికి వచ్చేసరికి రాత్రి పదిఅయింది.

మంగళవారం మధ్యాహ్నం మాంచి నిద్రలో ఉండగా మధ్యాహ్నం 2 గంటలకు విజయ వాడ నుంచి నేను అడ్డాడ హెడ్ మాస్టర్‌గా ఉన్నప్పుడు చదివిన భూషణం బాబు వాట్సాఫ్‌లో రెండుసార్లు ప్రయత్నిస్తే నేను ఎత్తలేదు. మూడోసారీ చేస్తే అప్పుడు మెసేజ్‌లో తాను స్టూడెంట్ అని ఉంటే నేనే ఫోన్ చేశా. దర్వాజా అయ్యాడు పాపం ఆనందం పట్టలేక. చాలా విషయాలు మాట్లాడుకున్నాం. అతని ప్రక్కనే సురేష్ అనే అదే బాచి కుర్రాడు కూడా మాట్లాడాడు. అడ్డాడ వదిలి సుమారు 20 ఏళ్ళు అయినా ఇంకా గుర్తుపెట్టుకున్నారు. ఈ బాచ్ వాళ్లందరూ కలిసి అక్టోబర్‌లో నేను ఇండియా వచ్చిన తర్వాత ఒక గెట్ టు గెదర్ పెట్టాలన్న ప్లాన్‌లో ఉన్నట్లు చెప్పారు. వీళ్ళతో పాటే 12 ఏళ్ళుగా ఇక్కడున్న పావని అనే అమ్మాయి దుబాయ్‌లో ఉన్న ఆనంద్ కూడా

ఇదివరకే మాట్లాడారు. నిద్రపట్టక మైనేనిగారికి వాట్సప్‌లో ప్రయత్నిస్తే దొరక్కపోతే మెయిల్ పెట్టాను. తర్వాత ఆయనే ఫోన్ చేసి మాట్లాడారు. తర్వాత డా.యెన్ ఇన్నయ్యగారు ఫోన్ చేసి మాట్లాడుతూ చిత్రకారులు శ్రీ ఎస్వీ రామారావు గారు చికాగో వచ్చి వారమయిందని తెలుగు విద్యార్థి పత్రికకు ఆర్టికల్ రాయమంటే రాశానని చెప్పారు. బైజాంటిన్ సామ్రాజ్యం చదవటం మొదలుపెట్టి దాని నాగరకతపై ఒక వ్యాసం రాశాను. గీర్వాణంలో 125 వరకు లాగాను.

కళాతపస్వి కాశీనాధుని విశ్వనాద్‌కు దాదాసాహెబ్ ఫాల్కే అవార్డ్ ఇచ్చారు. విశ్వనాధ, మొల్ల, వెంగమాంబ పోస్టేజ్ స్టాంపులను కేంద్రం విడుదల చేసింది. రాత్రి 12 వరకు నిద్ర పట్టలేదు.

బుధవారం ఎండ బాగానే వచ్చింది. రెండుపూటలా వాకింగ్‌కు వెళ్ళా. ఢిల్లీ మునిసిపల్ ఎన్నికలలో బిజెపి “ఆప్”ను వాళ్ళ “చీపిరి”తోనే తుడిచేసి 182 స్థానాలు 3 మునిసిపాల్టీలు గెల్చింది. రాత్రి యు ట్యూబ్‌లో క్రిష్ సినిమా “కృష్ణం వందే జగద్గురుం” చూశాం. పేరుకీ సినిమాకు లంకె లేదు. సీన్లు అన్నీ ఇష్టం వచ్చినట్లు తీసి అతికించినట్లు అనిపించింది. నయనతార ఎందుకున్నదో ఎవరికీ తెలీదు. దగ్గుబాటి రాణా బానే చేశాడు. టార్జాన్ సినిమాలకు బ్రహ్మాండంగా పనికోస్తాడనిపించింది. మణిశర్మ సంగీతం సిరివెన్నెల పాటలూ వినసొంపు. పిక్చరైజేషన్ బాగుంది. సాయంత్రం “కారీ”లో ఉంటున్న మా అన్నయ్యగారి మనవడు అంటే కూతురు వేదవల్లి కొడుకు వేలూరి హరి ఫోన్ చేశాడు. భార్య కూడా మాట్లాడింది.

గురువారం గీర్వాణం 135 వరకు దేకా. రెండుపూటలా నడక. స్వామి రామా పుస్తకం “లివింగ్ విత్ ది హిమాలయన్ మాస్టర్స్” పూర్తిచేసి హిమాలయ యోగులపై రాశా. విజ్జి వాళ్ళ ఇంటి ప్రక్క రవి గాయత్రి పలకరించి మాట్లాడారు. రవి తలి దండ్రులు బుధవారం వస్తారట ఇండియా నుంచి. మధ్యాహ్నం విజ్జి స్నేహితురాలు వీటూరి పద్మ వచ్చి పలకరించింది. తర్వాత గోసుకొండ అరుణ కూడా వచ్చి శుక్రవారం వాళ్ళ ఇంట్లో అమ్మవారి మణిద్వీప పూజ ఉందని, తాంబూలాని భోజనానికి రమ్మని పిలిచింది. నేనెందుకు “పోతు పేరంటాలు”లాగా అనిపించింది. కాని అంత ఆప్యాయంగా పిలిస్తే వెళ్ళాలి అనుకొన్నా. రాత్రి ఏమీ తోచక “ఫ్యన్ బకెట్” చూశాం. ఒక జోకు మురికిదే అయినా బాగుంది-అది చెప్పకపోతే నా కడుపుబ్బరం తగ్గదు. ఒక భార్యా భర్తా తగువులాడుకొని విడాకులిప్పించమని పోలీస్‌స్టేషన్ కొచ్చి సబిన్స్పెక్టర్ను అడుగుతారు. సరేనని ఆమె దగ్గర లక్ష రూపాయలు కాష్ ఉందని సగం భర్త కిస్తానని అంది. ఒకే ఇంటిలో వంటిల్లు భార్యకు బెడ్ రూమ్ భర్తకు పంచాడు. ముగ్గురు పిల్లల్ని ఏం చేయాలని సమస్య. ఎస్ ఐ నాలుగో సంతానం కన్నాక విడాకుల

సంగతి చూద్దామన్నాడు. భార్య "ఈయనపై నమ్మకం పెట్టుకొంటే ఆ ముగ్గురూ కూడా పుట్టేవాళ్ళు కాదు" అని గబుక్కున నోరు నొక్కుకుంది. అవాక్కవటం భర్త, ఎస్.ఐ.ల వంతు అయింది. పనిలో పని మరోకుళ్ళు జోకూ చెప్పకపోతే ఆగలేదు. బిగ్ జోక్స్ అనే పుస్తకం చదువుతున్నా. అందులో రాజకీయ నాయకుల మీద ఏదో కల్పిత జోకులు చాలా ఉన్నాయి. అందులో ఒకటి చదివి నవ్వు ఆపుకోలేక పోయా. అమెరికా ప్రెసిడెంట్ ఒబామా ఇంగ్లాండ్ వెళ్ళాడట. రాణి ఆరు గుర్రాల బండీలో ఆయన్ను రాజసౌధానికి తీసుకు వస్తోందట. అందులో ఒక గుర్రం కొంతదూరం వెళ్లేసరికి డామ్మని పెద్ద శబ్దంతో పిత్తిందిట. పిచ్చ కంపుట. ఇద్దరూ అవాక్కయి "పిత్తిన ముత్తయిదుల్లా ముక్కు మీద కర్చీఫ్ పెట్టుకొని భరిస్తున్నారట. కాసేపయ్యాక రాణి ఇక మర్యాదగా ఉండదని "మిస్టర్ ప్రెసిడెంట్! మహారాణీ అయినా కొన్ని విషయాలు ఆవిడ చేతుల్లో ఉండవు" అన్నదట. అప్పుడు ఒబామా కూడా నవ్వుతూ "ఇప్పటిదాకా ఆ శబ్దం గుర్రానిదనుకున్నాను మీదా?" అన్నాడట ఆశ్చర్యంగా. ఆ పుస్తకం చదివితే జోకులు ఎలా పుట్టాయో మొదటి అధ్యాయంలో రాస్తూ ఇలాంటి కుళ్ళు జోకులే ముందు పుట్టాయని అన్నాడు రచయిత. కొన్ని జోకులు తరువాత రాస్తా. ఇప్పటికే వాసన భరించ లేకపోతున్నారేమో?

(30-4-17-కాంప్-షార్లెట్-అమెరికా)

## వీక్లీ అమెరికా-4 -2 (చివరి భాగం)

24-4-17 నుండి 30-4-17 వరకు మూడు విందులు రెండు పూజల వారం

వీక్లీ అమెరికా -4-2 (చివరి భాగం)

మూడు విందులు రెండు పూజల వారం.

శుక్రవారం ఎండబానే ఉంది. రాత్రి కొన్ని చినుకులు మాత్రమే పడ్డాయి. ఇక్కడ ''షవర్స్ ఇన్ ఏప్రిల్ బ్రింగ్ ఫ్లవర్స్ ఇన్ మే" అనే సామెత బాగా ప్రచారంలో ఉంది. ఏప్రిల్ వర్షాలు మేలో పూలు రావటానికి బాగా తోడ్పడతాయని భావం. మా అమ్మాయి విజ్జి ఉదయం 6-30కే డ్యూటీకి వెళ్లి మధ్యాహ్నం లీవ్ పెట్టి ఒంటిగంటకు వచ్చి మమ్మల్ని గోసుకొండ అరుణ ఇంటికి భోజనానికి తీసుకు వెళ్ళింది వీళ్ళ కమ్యూనిటీలోనే ఆ చివర ఉంటారు. అప్పటికే "మణిద్వీప" పూజ పూర్తిచేసి మా కోసం రెడీగా ఉంది అరుణ. మణిద్వీప పూజ ఇప్పటికి 8 వారాలుగా ప్రతి శుక్రవారం చేస్తూ ఆఖరి 9వ వారం ఇవాళ చేసి మా శ్రీమతికి వాయనం ఇవ్వాలని ఆమె సంకల్పం. దేవుడి గది చాలా బాగా ఉంది. అమ్మవారి అలంకారం పూలతో శోభాయ మానంగా ఉంది. లలితా పరమేశ్వరీ అమ్మవారు మణి ద్వీపంలో ఉంటుందని మనకు తెలుసు.

మణి ద్వీపేశ్వరిపై అష్టోత్తరం ఉంది. అది ప్రతివారం చదివి పూజ చేస్తారు. 32 శ్లోకాల మణి ద్వీప వర్ణన స్తోత్రం, మణిద్వీప స్తోత్రం, పంచదశీ మంత్రం 40 చరణాల "లలితా చాలీసా" నిత్య పారాయణ శ్లోకం, దీప ప్రార్ధన, లలితా నవ విధ భక్తిమాలిక భక్తీ నీరాజనం మంగళహారతి చదివి పూజ పూర్తి చేస్తారు. మేము ఈ పూజను వినటం ఇదే మొదటిసారి. ఈ విషయాలన్నీ ఉన్న చిన్న పుస్తకాన్ని పెద్ద బాల శిక్ష సంకలనకర్త శ్రీ గాజుల సత్యనారాయణ ప్రచురించారు. ఆ పుస్తకం మాకు ఇచ్చింది. దాన్ని బట్టే వివరం తెలిసింది.

"పార్వతీ పరమేశ్వరుల వంటి దంపతలు మా ఇంటికి వచ్చారు" అంటూ అరుణ పొంగిపోయింది. మా శ్రీమతికి నాకూ పూజచేసి నూతన వస్త్రాలు అందజేసి మా శ్రీమతికి వాయనమిచ్చింది. తర్వాత భోజనాలు. మా కోసం కారం ఉప్పు తగ్గించి ప్రత్యేకంగా చేసింది. టమేటా పప్పు వంకాయ కూర, బీన్స్ కూర కొత్త ఆవకాయ, చట్నీ పూర్ణపు బూరెలు, గారెలు పాయసం, పులిహోర, కర్నాటక బేడల (పప్పు) చారు అనే రసం పెరుగు మాంగో సలాడ్ లతో కమ్మని భోజనం పెట్టింది. దగ్గర కూర్చుని అన్నీ అడిగి వడ్డించి కొసరి కొసరి తినిపించింది అరుణ. అక్కడ సుమారు 15 మంది ఆడవాళ్ళు కూడా మాతో ఉన్నారు భోజనానికి. గురువారం ఉదయం మా ఇంటికొచ్చిన పద్మ అనే అమ్మాయి కబుర్లతో జోకులతో మంచి సందడి చేసింది. ఈ బాచ్‌ని చూస్తే మా అమ్మాయికి ట్విన్స్ పుట్టినప్పుడు 2005లో మేము మిచిగాన్‌లోని డెట్రాయిట్ దగ్గరున్న ట్రాయ్‌కి వెళ్ళినప్పుడు అక్కడున్న జ్యోతి ప్రీతీ బిందు మొదలైన వారంతా గుర్తుకొచ్చారు. అక్కడ వారాని కొకరింట్లో భోజనాలు కబుర్లు సరదాలు పుట్టినరోజు, సీమంతం వేడుకలతో కాలం ఇట్టే గడిచిపోయింది. అందరం అరుణ ఇంట్లో గ్రూప్ ఫోటో దిగాం. మా అమ్మాయి అరుణకు చీర జాకెట్ పెట్టింది. ఇంటికి వచ్చేసరికి మధ్యాహ్నం 3.30 అయింది. సాయంత్రం స్వామి బ్రహ్మానంద సరస్వతిపై రాశా. రాత్రి యు ట్యూబ్‌లో కామెడీ చూశాం.

ఈ వారంలో "హ్యూమరిస్ట్స్", బిగ్ జోక్స్, బైజాంటిన్ ఎంపైర్, ది నాజిహోలో కాస్ట్ చదివాను. దీనిపై రాయానిపిస్తోంది. ఇవికాక ది వైకింగ్స్ ఇంటరెస్ట్‌గా ఉంటే చదువుతున్నా. "28 టు యాక్టర్ ప్లేస్ డ్రైవింగ్ త్రూసౌది" మొదలుపెట్టా కాని రుచించలేదు.

శనివారం మా ఇంట్లో శ్రీ శంకర జయంతి. మా అల్లుడి సంకల్పం అమ్మాయి సహకారం. ఉదయం 7 గంటలకే ఆవాహనతో ప్రారంభమైంది. రాంకీ తమ్ముడు ఇంకొక ఆయన వచ్చారు. ఉపనిషత్తులు ఆదిత్య హృదయం అరుణం చదివారు. తర్వాత ఒక 10 మంది వచ్చారు. మధ్యాహ్నం 12.30కు కేసరి ఉప్మా కాఫీలతో ఫలహారం.

తర్వాత నమక చమకాలు. మధ్యాహ్నం 3కు ఒక 25 మంది అయ్యారు. అప్పటికే రాంకీ వగైరాలు వచ్చారు. ఒకాయన భజగోవిందంపై పది నిమిషాలు మాట్లాడాడు. తరువాత ఆడవాళ్ళు పాటలు పాడారు. మా అమ్మాయి చెప్పే అపర ఘంటసాల గారు పూర్వపు కాళహస్తీశ్వర మహాత్మ్యం సినిమాలోని భక్తి గీతం పాడారు. రాంకీ తమ్ముడి భార్య పద్మశ్రీ త్యాగరాజ కృతులు బహుకమ్మగా గానం చేసింది. ఇద్దరు పిల్లలూ బాగా పాడారు గాయత్రి అనే అమ్మాయి కూడా చక్కగా స్వరరాగ యుక్తంగా పాడింది. ఈమెను "షార్లెట్ స్కైలార్క్" అన్నాను. రాంకీ తమ్ముడు పంచాంగ శ్రవణం చేశారు. సరైన హోమ్ వర్క్ చేయనట్లు అనిపించింది. మధ్య మధ్య నేను కొంత చెప్పా. తర్వాత శ్రీ శంకరాచార్యస్వామికి అష్టోత్తర పూజ జరిగింది. రాంకీ పురోహితునిగా ఉన్నాడు. చివరికి మధ్యప్రదేశ్‌లో పుట్టి బొంబాయిలో పెరిగి అమెరికా చేరిన ఒక యోగా మాస్టర్ తేలికైన ఇంగ్లీష్, హిందీలలో యోగా గురించి డిమాన్ స్ట్రేషన్ లెసన్ చెప్పాడు. అందరూ మెచ్చారు. కేరళలోని 92 ఏళ్ళ స్త్రీ యోగాసనాలు చాలా సునాయాసంగా చేస్తున్న వీడియో క్లిప్పింగ్ చూపించాడు. అందరూ చప్పట్లు చరిచారు. తర్వాత మహా నైవేద్యం హారతి, మంత్రం పుష్పంతో కార్యక్రమం పూర్తి. నాలుగు మాటలు నన్ను మాట్లాడమని రాంకీ అడిగితే "ఇండియాలో మేము మరచిపోతున్న శంకరాచార్య స్వామిని అమెరికాలో గుర్తుంచుకొని మా అమ్మాయి అల్లుడూ శ్రద్ధగా ఉదయం 7.30 నుంచి సాయంత్రాం 6.30 వరకు నిర్వహించటం గొప్ప విషయమని వారిద్దరిని అభినందిస్తున్నానని, కంచి పెద్ద స్వామి శ్రీ చంద్రశేఖర యతీంద్రులు "మైత్రీ భజతే" అనే సంస్కృత గీతాన్ని రచిస్తే అంతర్జాతీయ సమితి యు యెన్ వో 50వ వార్షికోత్సవంలో భారతరత్న ఎం.ఎస్. సుబ్బులక్ష్మి గానం చేసిందని దానికి అందరూ లేచి నిలబడి కరతాళ ధ్వనులతో అభినందించారని, సరస భారతి మార్చి 26 ఉగాది వేడుకలో "వసుధైక కుటుంబం" శీర్షికపై కవి సమ్మేళనం నిర్వహించిందని దాన్ని పుస్తకంగా తెస్తున్నామని, అప్పుడు జ్ఞాపికగా వసుధైక కుటుంబం చిత్రం పరమాచార్య ఫోటో, వారి మైత్రీ గీతంలో చివరిభాగంతో జ్ఞాపిక తయారు చేయించి అందరికీ ఇచ్చామని చెప్పి జ్ఞాపిక చూపించా. పద్మశ్రీ వెంటనే ఆ గీతాన్ని బహు శ్రావ్యంగా పాడింది. అందరూ అభినందించారు. కార్యక్రమం పూర్తి ఆయే సమయానికి 45 మంది ఉన్నారు పొద్దున్న కొందరు వచ్చి వెళ్ళారు. "రాలీ"లో భగవద్రామానుజ జయంతి చేస్తున్నారని అక్కడ సినీ, టీవీ గాయని శ్రీమతి ఉష సంగీత విభావరి ఉందని చాలా మంది ఇక్కడికి రాలేదు లేకపోతే మరో 15 మంది వచ్చి ఉండేవాళ్ళు. ఉష అమెరికాలోనే ఉండి ప్రోగ్రాములున్నప్పుడు మాత్రమే ఇండియాకు వస్తుంది. ఉష అక్క ఉదయమే వచ్చి కాసేపు ఉండి వెళ్ళింది.

తర్వాత మా అమ్మాయి అందరికీ చేసిన వంటకాలతో కమ్మని విందు భోజనం-

టమేటా పప్పు వంకాయ చిక్కుడుకాయ కూర ,ఆవకాయ, పూరీలు, బంగాళాదుంప కూరా, కేసరి, బూరెలు, గారెలు, పెరుగు పచ్చడి, సాంబారు, పెరుగన్నం. అందరూ సంతృప్తిగా భోజనం చేశారు. 5 ఏళ్ళక్రితం పరిచయమైనా మంజుల, ప్రక్కి అరుణ చక్కగా పలకరించారు.

భోజనాల తర్వాత గాయత్రితో అందరూ అడిగి పాటలు పాడించాం. ప్రక్కి వాళ్ళమ్మాయి అబ్బాయి కూడా పాడారు. గాయత్రికి “షార్లెట్ కౌమార కోకిల” అని సరదాగా బిరుదు ఇచ్చి ఆ పేరే రాసి శతకత్రయం సరసభారతి ఉగాది జ్ఞాపిక అంద జేశాం. ఆ అమ్మాయి తలిదండ్రులు బాగా శ్రద్ధ తీసుకొని సంగీతం నేర్పిస్తుంటే ఆ అమ్మాయి సార్ధకం చేస్తోంది. ఇక్కడ పాడిన వారందరి తలిదండ్రులను అభినందిస్తున్నాను. సరదాగా నేను ఇద్దరు అరుణలలో ఒకమ్మాయిని ఇంటిపేరుతో ప్రక్కి అరుణ అని రెండో అమ్మాయి మాటల్లో చాలాసార్లు “కరెక్ట్ అంకుల్ మీరు కరేక్ట్ ఆంటీ” అనటం మూలంగా ఆ అమ్మాయిని “కరెక్ట్ అరుణ” అన్నా. అందరూ పగలబడినవ్వారు. అరుణ “కరెక్ట్ అంకుల్” అంది సరదాగా. ఇదంతా పూర్తి అయేసరికి రాత్రి 9 అయింది. పవన్ భార్య రాధ ఉదయం నుంచి విజ్జికి చాలా సహాయంగా ఉంది. చివరికి అన్నీ సర్ది పవన్ దంపతులు మా ఆశీర్వాదాలు తీసుకొని ఇంటికి వెళ్ళారు.

పవన్ రెండో కూతురు మా రెండవ బావ గారు వేలూరి వివేకానంద్ గారి చెల్లెలు శాంతమ్మగారు లాగా నవ్వుతూ నవ్విస్తూ మూతి ముప్పై వంకర్లు తిప్పుతూ అచ్చంగా ఆవిడ పోలికలే వచ్చినట్లు అనిపించింది. ఈ విషయం హైదరాబాద్ వెళ్ళినప్పుడు శాంతమ్మగారితో చెప్పాలని మా ఆవిడ తహ తహలాడుతోంది. తాత గారి చెల్లెలి అంటే మేనత్త పోలిక అన్నమాట.

కొసముక్క –తిరువాయూర్‌లో త్యాగరాజ ఆరాధననాడు ఆయనకూ శివునికి అభిషేకం చేస్తారు. శంకర జయంతి నాడు కూడా శంకరాచార్యులు అపర శంకరులే కనుక ఆయనకు మహన్యాసంతో అభిషేకం చేస్తే బాగుంటుంది. వ్యాస మహర్షి వేద వాఙ్మయాన్ని పురాణ ఇతిహాసాలను మనకు వరంగా ప్రసాదించారు. శ్రీ శంకర భగవత్పాదులు ప్రస్థానత్రయానికి వ్యాఖ్యానం రాసి జ్ఞానానికి మార్గం సుగమం చేశారు. ఇది ఒక స్థాయి ఉన్నవారికే పనికొస్తుంది. సామాన్యులు తరించటానికి మార్గం వారు రాసిన స్తోత్రాలు, శివానంద సౌందర్య లహరి మొదలైనవి. అందులో వేద వేదాంత సారం అంతా నిక్షిప్తం చేశారు. సంస్కృతాన్ని సామాన్య జనం స్థాయికి స్తోత్రాల ద్వారాతెచ్చి తరుణోపాయం చూపారు. కనుక జయంతి నాడు కనీసం రెండు గంటలు శివానంద సౌందర్య లహరి, స్తోత్రాలను విడివిడిగా సామూహికంగా గానం చేస్తేనే ఆయన ఋణం తీరుతుంది. అప్పుడే గొప్ప అనుభూతి కలుగుతుంది. సౌందర్య లహరి అందరికీ

అందుబాటులో ఉండటం కష్టం. శివానంద లహరి చాలా సులభం అందరూ నేర్చుకొని పాడచ్చు. అలాగే స్తోత్రాలు కూడా సామూహికంగా పాడాలి. అప్పుడే దాని ఇంపాక్ట్ మనకు తెలుస్తుంది.

మరో విషయం శంకర జయంతినాడు సంస్కృతంలో కృషి చేసినవారికి కాని, స్తోత్ర గానం చేసినవారికి కాని సంగీత నృత్యాలలో రాణించినవారికి కాని ప్రోత్సాహక బహుమతులు అందిస్తే సార్ధకమౌతుంది. దేశం కాని దేశంలో చేస్తున్నప్పుడు ఈ రెండూ బాగా రాణిస్తాయి. కనుక ఈ సారి శంకర జయంతికి ఈ ఆలోచన చేస్తే బాగుంటుందని నా భావన. ఒడ్డున కూర్చుని ఎన్నైనా చెప్పవచ్చు. దిగితే కానీ లోతు తెలియదని నాకు తెలుసు. అందుకే సరసభారతి గాయత్రికి శ్రీ సువర్చలాన్జనేయ శతక త్రయం, ఉగాది జ్ఞాపిక అందజేసి మార్గం చూపించింది.

రాత్రి భారవి తీసిన శంకరాచార్య తెలుగు సినిమా చూశాం యు ట్యూబ్‌లో. పైత్యం ఎక్కువ శ్రీహరిని మోహనబాబును, సుమన్‌ను భరణిని ఎక్కడపడితే అక్కడ చూపించి పలచన చేశాడు. హుందాతనం ఉత్కృష్టత లోపించి చౌకబారు సినిమాగా గ్రాఫిక్ మయంగా మారింది. నిద్రపోయేసరికి రాత్రి 12.

30-4-17 ఆదివారం వైశాఖ శుద్ధ పంచమి శ్రీ శంకర జయంతి. వీలు ప్రకారం శనివారం చేశారు మా వాళ్ళు. నేను ఉదయం 6.30కే లేచి కాలకృత్యాలు పూర్తిచేసి ఉదయం 7.30కు పూజలో కూర్చున్నా. మామూలు నిత్యపూజ చేసి శంకరాచార్య అస్తోత్తరం శివ అస్తోత్తరం సహస్రం, లలితా సహస్రం దక్షిణామూర్తి దత్త్రేయ అస్తోత్తరాలతో పూజ చేసి శివానంద లహరి సౌందర్య లహరి చదివి, మహాన్యాసంతో నమక చమకాలు దశ శాంతి సామ్రాజ్య పట్టాభిషేకంతో ఏక రుద్రం చేసి (చదివి), బిల్వ అష్టోత్తరంతో పూర్తి చేసేసరికి ఉదయం 10.30 అయింది. అంటే మూడు గంటలు పట్టింది. ధన్యుడను అనుకొన్నా. తర్వాత టిఫిన్.

వీక్లీ అమెరికా 4 మొదలుపెట్టి కొంత రాశా. కాలిఫోర్నియా నుంచి మేనల్లుడు శాస్త్రి భార్య విజయలక్ష్మి కొడుకు కృష్ణ ఫోన్ చేసి మాట్లాడారు. కృష్ణకు సాన్ ఫ్రాసిస్కోలో మంచి కొత్త ఉద్యోగం వచ్చిందని మే 15 చేరుతాడని, విజయలక్ష్మి అమ్మగారు మే 7న కొడుకుతో ఇండియా నుండి అమెరికా వస్తున్నారని, మమ్మల్ని వాళ్ళ ఇంట్లో కొన్ని రోజులు ఉండేట్లు రమ్మని కోరారు. సరే అన్నాం. మా ప్రయాణం మా చేతుల్లో లేదు కదా.

ఈవారమంతా బాహుబలి హడావిడి ఇండియాలో టికెట్ వెయ్యి రూపాయలు అమెరికాలో 42 డాలర్లని అంటున్నారు. అయినా కొని చూస్తూనే ఉన్నారట. 80 కోట్లు కూడా ఉండని తెలుగు సినిమా రేంజ్‌ని రాజమౌళి 450 కోట్ల స్థాయికి తెచ్చి,

బాలీ వుడ్‌ను మించి అతనిపై నమ్మకంతో నిర్మాతలు అంత డబ్బు పెట్టుబడి పెట్టారు. వాళ్ళ పంట పండినదని కాసులవర్షం కురుస్తోందని మీడియా కోడై కూస్తోంది. రాజమౌళి తీసిన్న మగధీర కాని బాహుబలి 1 కాని నేను చూడలేదు. ఆ సీన్లు ఏదైనా ఛానల్‌లో వచ్చిన స్కిప్ చేస్తా. సినిమా హృదయాన్ని కదిలించాలి కాని గ్రాఫిక్స్ కాదు.

విజ్జి ఉదయం 9.30కు తెలుగు క్లాసు నిర్వహించి మధ్యాహ్నం 12కు ఆఫీస్‌కు వెళ్ళింది. రాత్రి 8కి వచ్చింది. కాసేపు ఫ్యాన్ బకెట్ చూశా. అయ్యర్ సంస్కృత శంకరాచార్య కాసేపు చూశా. 1970 దశకంలో తమిళ నుంచో మలయాళం నుంచో తెలుగులోకి డబ్బింగ్ అయిన ఆది శంకరాచార్య సినిమా బాగా ఆడింది. అందరికీ నచ్చింది. అద్భుతమనిపించింది. అది యెక్కడైనా దొరుకుతుందేమోనని యు ట్యూబ్‌లో వెతికితే కనపడలేదు. ఇక ఈ వారానికి స్వస్తి.

(30-4-17 -కాంప్ -షార్లెట్-అమెరికా)

## వీక్లీ అమెరికా-5-1 (1-5-17 నుండి 7-5-17 వరకు)

## రెండు పుట్టిన రోజులవారం

1-5-17 సోమవారం ఉదయం నిద్ర మంచం మీదనించి ఇంకా కేవకుండానే ఉయ్యూరు నుంచి మా మనవడు చరణ్ ఫోన్ చేసి "తాతా! ఉయ్యూరును, మమ్మల్ని మర్చిపోయావు ఫోన్ చేయటం లేదు" అని నేరం వేశాడు నవ్వుతూ. మధ్యాహ్నం అడ్డాడ శిష్యుడు భూషణం ఫోన్ చేసి అక్కడ నేను పని చేసినప్పుడు దివాకర్లవారు రాసిన "భారతావతరణం" పద్యనాటిక నేను వేయించటం అందులో తానూ నన్నయ పాత్ర వేయటం జ్ఞాపకం చేశాడు. నిజమే అక్కడ ఎక్కువ మంది విద్యార్థులు ఎస్ సి వాళ్ళు. వాళ్లకు మాటలు పలకటమే రాదు కానీ సాహసంగా తీసుకొని వాళ్ళతో పద్యాలు ప్రాక్టీస్ చేయించి వేయించాను. చాలా చక్కగా చెప్పారు. అదొక సాహసం. మల్లినాథ సూరి 29వ ఎపిసోడ్ రాసి సుమారు 5 నెలలయింది. మళ్ళీ ఇవాళ మొదలుపెట్టి 30వ ఎపిసోడ్ రాశాను.

సాయంత్రం డా.ఎల్లాప్రగడ రామమోహనరావు గారు "కారీ" నుంచి ఫోన్ చేసి చాలా ఆప్యాయంగా మాట్లాడారు. మైనేనిగారికి ఊరగాయలు పంపించానని ఆయన చాలా అల్ప సంతోషి అని, తనకు క్లాస్‌మేట్ అని ఏరా అనుకుంటామని ఊరగాయలు పంపినందుకు తనకు వెయ్యి డాలర్లు పంపిస్తానన్నారని తానూ "ఏరా! నేను పచ్చళ్ళు అమ్ముకునే వాడిగా కనపడుతున్నానా?" అన్నానని చెప్పి మైనేని గారి వితరణ శీలత్వం సరసభారతి పుస్తకాలలో బాగా నేను రాశానని, డబ్బు ఎందరికో ఉంటుంది కానీ దాన్ని మంచిపనులు ఖర్చు చేసి వారు అరుదు అలాంటి ఆరుదైనవాడు

మా గోపాలకృష్ణ అన్నారు. ఆ తర్వాత మా చిన్నతనాలలో ఊరగాయలు పెట్టటం ఒక ఖార్ఖానాగా ఆ పరిశ్రమలాగా ఉండేదని ఇద్దరం జ్ఞాపకం చేసుకున్నాం. ఇళ్లల్లో గజం ఎత్తు జాడీలు ఉండేవని మామిడికాయలు తరగటం కలపటం వగైరా వేసవి కాలపు కుటీర పరిశ్రమగా ఉండేదని అనుకొన్నాం. ఈ విషయాలన్నీ మైనేని గారికి వెంటనే మెయిల్ రాశా. ఆయన రావుగారు రేపల్లెలో తమ స్వంత తోటలో కాసిన మామిడికాయ చింతకాయ గోంగూర, నిమ్మకాయ పండు మిర్చిలతో ఊరగాయలు పెట్టిస్తారని వాటినే తమకు పంపారని రాశారు. వారిద్దరి సౌజన్యం గొప్పది అలాంటి వారు నాకు మిత్రులవటం నా అదృష్టం.

లైబ్రరీ పుస్తకాల గడువు రెండువారాలు మాత్రమే. మామనవాడు పీయూష్ చేత ఆన్‌లైన్ రెన్యూ చేయించా. మళ్ళీ మంగళవారం మధ్యాహ్నం భూషణం వాట్సాప్ చేశాడు. విషయం ఏమీ లేదు. సాయంత్రం కోడూరి పావని కెంటకీ నుంచి ఫోన్ చేసి మాట్లాడింది. ఆ అమ్మాయి చాలా పద్ధతిగల పిల్ల. భూషణం విసిగిస్తున్నాడా సార్ అంది. తాము జులైలో మరో చోటికి వెళ్లవచ్చని చెప్పింది. మా శ్రీమతితోనూ మాట్లాడింది. ఎండ బాగానే ఉంది. రెండుపూటలా వాకింగ్ చేశాను. “చెన్నై చంద్రమా” అన్నట్లు షార్లెట్ సూర్యుడు రాత్రి 8 గంటలకూ కనిపించాడు. రాత్రి సునయన ప్రెసెంట్ చేస్తున్న “ఫ్రస్టేటెడ్ ఉమన్” యు ట్యూబ్‌లో చూసాం. సరదాగా బాగుంది ఎన్నో సమస్యలపై తనదైన ధోరణిలో బాగా ప్రదర్శిస్తోంది. దాదాపు ఏక పాత్రాభినయం. కరెంట్ టాపిక్స్‌పై మంచి కథనాలు. ఎంత ఈజీగా చేస్తోందో చూస్తే ఆశ్చర్యమేస్తుంది. మహా నటీమణులు చాలరు అనిపించింది. చిన్నతనంలో బేబీ సునయనగా చాలా చేసిందని ప్రభావతి జ్ఞాపకం చేసుకొన్నది. మహాతల్లిలూ బాగుంటాయి.

బుధవారం మా మనవడు చి.హర్ష 6. 7/10 మార్కులతో తెలంగాణా ఎస్.ఎస్.సి పాసయ్యాడు. 2015 ఆగస్టు 9న పెద్ద యాక్సిడెంట్ అయి డివైడర్‌కు తల తగిలి రెండుసార్లు బ్రెయిన్ ఆపరేషన్ జరిగి అన్నీ మర్చిపోయి క్రమ క్రమంగా కోలుకుని 10 పరీక్షలు రాయాల్సినవాడు 9 చదివి తర్వాత 10 కూడా చదివి ఈ ఏడాది టెన్త్ పాసవ్వటం అద్భుతం. అందుకే వాడి బ్రెయిన్ ఆప రేషన్ చేసిన డాక్టర్ వాడిని మిరకిల్ బాయ్ అంటాడు. నిజమే హోప్స్ లేవని చెప్పారు కానీ దైవ కృపవలన సమయానికి హాస్పిటల్లో చేర్చిన యువ దంపతుల చలువ వలన మా శ్రీ సువర్చలాఞ్జనేయ స్వామి కృప వలన బతికి బయటపడి క్రమంగా అన్నీ గుర్తుకు వచ్చి చదివి పరీక్ష పాసవటం ఎనిమిదవ వింతయే. వాడు పాసయిన సంగతి అందరికి మెయిల్‌లో తెలియబరచాను. మైనేనిగారు శ్యామలాంద ప్రసాద్ గారు, వారణాసి సూర్యకుమారిగారు బొడ్డపాటి చంద్రశేఖర్ మొదలైనవారు సంతోషం వెలిబుచ్చుతూ సమాధానమిచ్చారు .

వైకింగ్ శకంపై మూడు ఎపిసోడ్లు రాశాను. ది నాజీ హోలోకాస్ట్, ఏ వరల్డ్ వితౌట్ జ్యూస్ ది వైకింగ్స్ పుస్తకాలు చదివేశాను. ఉయ్యూరు నుంచి తెచ్చుకొన్న ఆలంకారికులు చదివాను ఈవారంలో. గురువారం సాయంత్రం 6.30కు మా మనవళ్లు 6 వతరగతి చదువుతున్న స్కూల్‌లో పిల్లల జంత్ర వాయిద్య ప్రదర్శనకు వెళ్లాం. మా మనవడు చి॥ ఆశుతోష్ ట్రంపెట్ వాయించాడు బృందంతో. చాలామంది పేరెంట్స్ చూడటానికి వచ్చారు.

మే 21వ తేదీ జరిగే శ్రీ హనుమజ్జయంతి కార్యక్రమం తయారు చేసి ప్రింట్ చేయించమని రమణకు మెయిల్‌లో పంపాను. శ్రీమతి శాంతిశ్రీ భక్తి సంగీత విభావరి డా. శ్రీ ఆచంట శివరామ కృష్ణమూర్తిగారి ధార్మిక ప్రసంగం, శతకత్రయ ధారణ పోటీలు బహుమతుల ప్రదానం మిగిలిన వాటితో చేర్చాం.

శుక్రవారం హర్ష పాలిటెక్నిక్ ఎంట్రన్స్ బాగా రాస్వాడని శర్మ చెప్పాడు. ఆదివారం హిందూ సెంటర్‌లో శ్రీ సత్యసాయి మాతృశ్రీ ఈశ్వరమ్మగారి జయంతి కార్యక్రమవీలో వేసే పిల్లల డ్రామాలో మా మనవాళ్ళు స్టేజ్ ప్రాక్టీస్ కోసం విజ్జి పిల్లని రాత్రి 7కు తీసుకువెళ్లి 10కి తిరిగివచ్చింది. అంతకు ముందుకొక గంట ఇంట్లో తెలుగు స్పెషల్ క్లాస్ నిర్వహించింది ఆఫీస్ నుంచి రాగానే.

రాత్రి బాలమురళీకృష్ణ సంగీతం ఎలాపడాలి గాత్ర ధర్మాన్ని ఎలా కాపాడుకోవాలి స్వరరాగ విషయాలలో ఏయే జాగ్రత్తలు తీసుకోవాలి అనే విషయాలపై ఇంగిలీషులో చేసిన డిమాంస్ట్రేషన్ లెసన్ చూసాం. యు ట్యూబ్‌లో తర్వాత బృందావని రాగ తిల్లానా ఎలా పాడాలో నేర్పే తీరునూ చూసాం. బాలమురళి అంటే తిల్లానా స్పెషల్. దీన్ని తమిళ విద్యార్థులకు నేర్పే సిడి అది బాగుంది. వాళ్ళు ఆయనతో చక్కగా పాడారు. ఇవి చూస్తే ఇలాంటి విషయాలపై బాలమురళికి ఉన్న సర్వజ్ఞత్వాన్ని మన తెలుగువాళ్ళు ఉపయోగించు కోలేకపోయారని పించింది. ఇలాంటి ఆయన పాఠాలు తెలుగులో ఉన్నాయో లేదో నాకు తెలియదు ఉంటే సంతోషం.

శనివారం జ్యూలపై రెండు పుస్తకాలూ చదివి ఘోరకలి పేరిట 5 ఎపిసోడ్‌లు రాశా. చి॥ హర్ష పాలిటెక్నిక్ ఎంట్రన్స్ పరీక్షలో 45 మార్కులతో క్వాలిఫై అయినట్లు శర్మ మార్కుల మెమోతో సహా పంపాడు సంతోషించాము ఫోన్ చేసి మాట్లాడాం. అందరికి మెయిల్ ద్వారా విషయం తెలియబరచాను. శ్రీ మైనేని, శ్రీ గాయత్రిప్రసాద్ గార్లు వెంటనే స్పందించి సంతోషం తెలిపారు.

సరసభారతి వీక్షకుల సంఖ్య ఈ ఉదయానికి 4 లక్షల 61 అయింది ఈ సంతోష వార్తనూ అందరికీ పంపాను. పవన్ రెండవ అమ్మాయి చి॥ ప్రశాంతి పుట్టిన రోజును పిల్లలందరితో బయట నిర్వహించి రాత్రికి మమ్మల్ని ఇంటికి భోజనాలకు

పిలిచాడు. మా కుటుంబం, రాంకీ తమ్ముడు సాయి పవన్ కుటుంబం పవన్ మేనమామ కొడుకు కుటుంబం అతిధులం. పవన్ భార్య రాధ అతిథి మర్యాద బాగా చేస్తుంది. వాళ్ళత్త గారిని కంటికి రెప్పలాగా చూసుకుంటోంది. ఆవిడ మా రెండవ బావగారు వేలూరి వివేకానంద్ గారి అన్నగారైన ముకుందం గారి భార్య అంటే వదినగారు పవన్ ఆమె కుమారుడు. పవన్ తండ్రి ముకుందం గారు చనిపోయి చాలా ఏళ్లయింది. వీరి బాగోగులు మా బావా అక్కయ్య చూశారు. మంచి బంధుప్రేమ ఉన్నవాడు. భోజనంలో వంకాయ, బెండకాయ కూరలు అల్లం చట్నీ ఆవకాయ, బజ్జీలు, గులాబ్జామ్, పెరుగు పుచ్చ ముక్కలు, మా అమ్మాయి తీసుకువెళ్లిన జున్ను, పనస తొనలుతో సుష్టుగా భోజనం చేసాం. అన్నీ అదరహో. రాంకీ తమ్ముడు సాయి నా మెయిల్స్ పంపితే చదువుతానని అన్నాడు. వాళ్ళత్తగారు మామగారలకు మేమంతా బాగా తెలుసునన్నారు. విష్ణుభొట్ల ఇంటిపేరట. ఇంటికొచ్చి కొన్ని పంపాను. పవన్‌తో డొమినికన్ ఆవిడ తన గురించి నాకేమీ సమాచారం పంపలేదని చెబితే తనకు పంపిందని తన గురించి రాయతగినంత గొప్ప విషయాలు లేవని తెలియజేసిందని చెప్పాడు. సరదాగా ఒక అరగంట కబుర్లు చెప్పుకొని ఇంటికి రాత్రి 11 గంటలకు చేరాం. పవన్ ఇల్లు మా వాళ్ళ ఇంటికి చాలాదగ్గరే ఏడెనిమిది నిమిషాల కారు ప్రయాణమే. మిగిలిన విషయాలు తర్వాత రెండో ఎపిసోడ్‌లో రాస్తా.

(7-5-17-కాంప్-షార్లెట్-అమెరికా)

## **వీక్లీ అమెరికా-5-2 చివరిభాగం** (1-5-17 నుండి 7-5-17 వరకు)

## **రెండు పుట్టిన రోజుల వారం-2**

7వ తేదీ ఆదివారం విషయాలు-నిన్న మైనేనిగారు నాకు మెయిల్ రాస్తూ డా.ఇన్నయ్యగారి భార్య గారు "ఈల్ వీజిల్" రాసిన నైట్ పుస్తకాన్ని తెలుగులోకి "కాళరాత్రి"గా అనువదించి ముద్రించారని తనకు పంపిన మూడు కాపీలలో ఒకటి పంపానని మంగళవారం అందుతుందని తెలియజేశారు. దీన్ని మా మనవుడు శ్రీకేత్ టెక్స్ట్ బుక్‌గా చదివి నాకిస్తే నేనూ చదివి తెలుగులో డబ్బింగ్ చేద్దామనుకొని ఎందుకో చివర నచ్చక మానేశాను. ఆ పని ఆమె చేసినందుకు అభినందనలు. మా అమ్మాయి ఇంటి దగ్గర నిర్వహించే తెలుగు క్లాసులు ఈ రోజుతో అయిపోయాయి. పరీక్ష పెట్టారు మళ్ళీ సెప్టెంబర్‌లో బడులు తెరిచాకనే మళ్ళీ ప్రారంభం అప్పటిదాకా ఆటవిడుపు. ఇవాళ ఉదయం వీక్లీ 5 మొదటిభాగం రాశాను. మధ్యాహ్నం భోజనాలయ్యాక రెండు గంటలకు బయల్దేరి హిందూ సెంటరుకు వెళ్లాం. అక్కడ షార్లెట్ సాయి సెంటర్ వాళ్ళు గాంధీభవన్‌లో శ్రీ సత్య సాయి మాతృమూర్తి శ్రీమతి ఈశ్వరమ్మగారి జయంతిని

జరిపారు. శ్రీమతి జయ ముఖ్య భూమిక వహించింది. పిల్లలతో చక్కని ప్రోగ్రాములు నిర్వ హింప జేశారు. తలిదండ్రుల సహకారం పిల్లల కుతూహలం, సెంటర్‌లోని టీచర్ల శిక్షణ అన్నీ కలిసి కార్యక్రమాన్ని విజయవంతం చేశాయి మా మనవాళ్ళు చి॥ ఆశుతోష్, పీయూష్‌లు కూడా పాత్ర పోషణ చేశారు.

సరిగ్గా మధ్యాహ్నం 3కు ప్రార్ధనతో మొదలైంది. తర్వాత అందరూ సత్య అని పిలిచే సత్య శంకర్–బాబాకు తల్లికి ఉన్న చక్కని అనుబంధాన్ని తేలికమాటలతో అందరికీ అర్థమయ్యేట్లు ఇంగ్లీష్‌లో తెర మీద పిక్చర్లు చూపిస్తూ ప్రసంగించారు. అతడు మంచి వక్త, వాద్యకారుడు. భార్య సౌమ్య హార్మోనిస్టు గాయకురాలు. కూతురు కూడా మంచి గాయని. ఈ కుటుంబం సాయి సెంటర్‌కు వెన్నెముక అన్నివిషయాలలో–

"సాయి బాబా తాత కొండలరాజు మనవడిలో దైవ లక్షణాలు కనిపెట్టి చేయెత్తి నమస్కరించకుండా చేయి పట్టుకునేవాడు. అదే నమస్కారం బాబా నిద్రపోతుంటే వచ్చి పాదాలకు నమస్కరించేవాడట తాత. తాతకు అన్నం వండేవాడు. బాబా రసం బాగా కాచేవాడట. పుట్టపర్తి అంటే పాము పుట్టపర్తి అనేవారట. నాగ సంచారం ఎక్కువ కొండలు రాళ్లు రప్పలమయం బాబా చిన్నతనం లో. బాబాను చిన్నప్పటినుంచి బ్రహ్మ జ్ఞాని అనేవారట అందరూ. తల్లి నమ్మేది కాదట. ఒక్కోసారి ఆయన మహిమలు చూసి కంగారుతో అత్తగారికి చెప్పేది. ఆమె ఎవరికీ చెప్పకు నవ్వుతారు అనేది. ఇంట్లో ఏ పండగ జరిగినా తన పుట్టినరోజు అయినా సరే అందరికీ అన్నీ ఇప్పించి చివరికి తాను తీసుకునేవాడు సత్య నారాయణ రాజు అనే సత్యసాయి. దూరంగా అడవుల్లో ధ్యానంలో ఉన్న బాబాను చూడటానికి తలిదండ్రులు వస్తే "మాయ" వచ్చింది అనేవాడు. అంటే తానూ సంసార బంధానికి దూరామని అర్థం. బ్రహ్మజ్ఞానికి ఏ బంధాలు ఉండవని భావం. తల్లితో "నువ్వు ఈ ప్రపంచానికి చెందిన దానివి సర్వ ప్రపంచం నీదే" అనేవాడు.

దగ్గరున్న కొండపై మందిరం కడతాననేవాడు. అక్కడెందుకు పాములమయం ఇక్కడున్న బడిని బాగు చేసి కొత్తది కట్టించు అని తల్లి చెబితే ముందర ఎలిమెంటరీ స్కూల్ కట్టించాడు. తర్వాత తల్లి కోరికపై హైస్కూల్ కట్టించి ఆమె పేరు పెట్టించాడు. ప్రశాంతి మందిరం కట్టించిన తర్వాత బాబా అక్కడే ఉండేవారు. తల్లిదండ్రులు గ్రామంలోనే ఉండేవారు. అందరు అప్పుడు రాగి సంకటే తినేవారు. ప్రజలుసాయి గురించి చెడుమాటలు అంటూటే భరించలేక కొడుక్కి చెబితే అప్పుడు అందర్నీ మందిరంలోనే ఉండే ఏర్పాటు చేశారు. ఒకసారి ప్రిన్సిపాల్ గోకక్ ఒక పిల్లాడు మందిరంలో అనేక పనులు చేసి ఆలస్యంగా వెడితే పంపించేశాడు. వాడు ఏడుస్తూ కూర్చుంటే తానూ ప్రిన్సిపాల్‌కు ఖాళీ ఉన్న సమయంలో వెళ్లి "సారూ! మీ కన్నీ తెలుసు

బిడ్డడు పనులన్నీ చేసి రావటం మూలాన కుసుసింత లేటుగా వచ్చిండు. తొలి తప్పు కాయండి" అని బతిమాలి ఆయన్ను ఒప్పించి కుర్రాడు వెళ్లేట్లు చేసిన మాతృమూర్తి అన్నాడు సత్య. తల్లి దండ్రులను తాతగారిని వీలున్నప్పుడల్లా వెళ్లి అంతకు ముందు చూసివచ్చేవారు సాయి. ఒకసారి తల్లికి తీవ్రంగా జ్వరం వచ్చి భరించలేక పోతుంటే సాయి వచ్చిమందు వేసి తగ్గించారట. అప్పుడు ఆమెకు నమ్మకం కలిగిందట బాబా దైవ స్వరూపం అని. అలాగే చివరిసారి 1972లో "స్వామీ స్వామీ" అని కలవరించిందట. వెంటనే ఆమె ముందు ఉన్నారట బాబా "నాయనా నువ్వెవరవో నాకు ఎరుక పరచావు ధన్యోస్మి" అంటూ చేతులు పట్టుకొని బాబా తల్లి ఈశ్వరమ్మగారు మరణించారని సత్య ప్రసంగం పూర్తి చేశాడు. ఆసాంతం చాలా క్రమపద్ధతిలో వివరించగా అందరు కరతాళ ధ్వనులతో అభినందించారు.

తర్వాత 4-15 నుంచి నాలుగు ప్రదర్శనలు నిర్వహించారు. అందరూ పిల్లలే. వినాయక షణ్ముఖ ఈశ్వర రామకృష్ణ సరస్వతి లక్ష్మి షిర్డీబాబ సత్యసాయి వేషాలతో మంచి దుస్తులు అలంకారాలు ఆయుధాలతో అలంకరించిన కుర్చీలలో కూర్చుని దేవతలంతా ఒక్కటే అనే భావాన్ని కలిగించారు. సాయి సర్వదేవతా స్వరూపుడు అనే భావం కలిగించారు. దీనికి మంచి ట్రెయినింగ్ ఇచ్చి, తీర్చిదిద్దిన లేడీ టీచర్ మానిని అభినందనీయురాలు. డెకరేషన్‌తో సహా అన్నీ ఆమె సమకూర్చింది. తలిదండ్రులు వస్త్రాలు సమకూర్చారు. కాన్సెప్ట్ బాగుంది. పిల్లలతో తాము ఎందుకు ఏ పాత్ర వేసింది తెరమీద చెప్పగా చూపించి వైవిధ్యం కలిపించారు. తర్వాత రీ సైక్లింగ్ విధానంపై నలుగురు ఆడపిల్లలు వివరించారు. చిలక పలుకుల్లా ఉన్నాయి. ఫీల్ రాలేదని పించింది. మూడోది సెల్ఫ్ కాన్ఫిడెన్స్‌తోబాటు బాబా కాన్ఫిడెన్స్ కూడా ఉండాలన్న థీరీతో పిల్లలే రాసి ప్రదర్శించింది బాగానే ఉంది. అందరూ బాగానే చేశారు. చివరిదైన నాలుగవది సత్యసాయి జియోపార్డీ. దీనిని హిందూ సెంటర్‌లో తెలుగు నేర్పే టీచరూ పిల్లల డాక్టర్ మంచి డాన్స్ టీచర్ అయినా సాయికృష్ణ అనే ఆవిడ నేతృత్వంలో ప్రదర్శించారు. ఇందులో మా మనవాళ్ళు అశుతోష్, పీయూష్‌లు కూడా ఉన్నారు. ఇంటి దగ్గర ఏ వేషం వేస్తున్నార్రా అని అడిగితే "సీక్రెట్" అక్కడే చూడాలి అన్నారు. అంతటి సీక్రెసీని బృందం అంతా మెయిన్ టైన్ చేసింది. ఇది సాయిబాబా జీవితంపై క్విజ్ ప్రోగ్రామ్. చిన్న ప్రశ్నలే తేలికైనవే. ప్రేక్షకులకే సరైన సమాధానం చెబితే బాబా ఫోటో బహుమతిగా ఇచ్చారు. తమాషా ఏమిటట. ఇన్నేళ్ళుగా సాయి సెంటర్ నడిపే వాళ్లు ఆయనపై ఎన్నో ప్రసంగాలు విన్నవాళ్ళు కూడా ఆయన ఎప్పుడు ఏ నెల ఏ తేదీ ఏ వారం పుట్టారని అడిగితే కరెక్ట్ సమాధానం చెప్పకపోవటం వింత అనిపించింది.

## దీని తర్వాత మళ్ళీ ఒక అరగంట భజన

సాయంత్రం 6 నుంచి స్నాక్స్ టీ ఏర్పాటు. ఎవరికి వారు తమకు చేతనయింది ఇంటి దగ్గర చేసుకొచ్చి ఇక్కడ అందరూ తినే ఏర్పాటు చేశారు. ఒక తెలుగమ్మాయి పుట్టినరోజు నిన్నయితే ఇవాళ అందరి సమక్షంలో "ఎగ్ లెస్ బర్త్ డే కేక్" కోయించి అందరికి పెట్టించారు. ఇదికాక రసగుల్లాలు, పునుగులు, మిరపకాయ బజ్జీ, మరొక స్వీటు, పిజ్జాలు, అటుకుల పులిహోర కర్బూజ కాయ ముక్కలు, మరమరాలు, కాఫీ, టీలతో అందరూ సుష్టుగా లాగించారు. అంతా అయ్యేసరికి రాత్రి ఏడు అయింది. ఇంటికి వచ్చేసరికి ఏడున్నర. ఈ ఫోటోలు పెట్టి ఇదంతా రాసేసరికి రాత్రి 10. ఇంతటితో ఈ వారానికి స్వస్తి.

(7-5-17-కాంప్-షార్లెట్-అమెరికా)

## వీక్లీ అమెరికా-6

## మనవడు సంకల్ప్ ఏం ఎస్ గ్రాడ్యుయేషన్ వారం

8-5-17 నుండి 14-5-17 వరకు

ఈనెల 6వ తేదీకి అమెరికా వచ్చి నెల, 7వ తేదీకి షార్లెట్ వచ్చి నెలా అయింది. 8వ తేదీ సోమవారం ఫిష్ బుక్‌లో పద్మశ్రీ పోతుకూచి సాంబశివరావు గారు అంతకు ముందు రోజు డా. మాదిరాజు రామలింగేశ్వరరావు గారు పలకరించారు. మైనేని గారు పంపిన వెనిగళ్ల కోమలగారి అనువాద రచన "కాళరాత్రి' 'చేరింది. రెండుపూటలా నడక. సాయంత్రం మా అమ్మాయి ఆఫీసు నుంచి వచ్చేసరికి భోజనాలు చేసి సిద్ధంగా ఉంటే "బలి"కి తీసుకు వెళ్ళింది. హాలు అరగంట ప్రయాణ దూరం. టికెట్ పెద్దవాళ్లకు 17, పిల్లలకు 11 డాలర్లు. మొత్తం 75 నష్టం. నాకు ఒక్క అంగుళం కూడా నచ్చలేదు. రొయ్యల మీసాల నాజర్‌ను చూస్తే డోకు వచ్చింది. ప్రభాస్ డైలాగ్ పల్లెటూరి బైతు మాటలాగా చాలా రఫ్‌గా ఉంది. బాగ్రౌండ్ సంగీతం గుండెల్లో రైళ్లు పరుగెత్తించింది. సంగీతం పాటలూ అసలు నచ్చలేదు. రాణా శెభాష్ అనిపించాడు. ఈ కథకు అన్నికోట్లు కుమ్మరించటం పరమ దండగ. దీనికంటే శాతకర్ణి వెయ్యి రెట్లు, పూర్వపు శోభన్ బాబు "వీరాభిమన్యు" పదివేల రెట్లు నయం. సినిమా నుంచి రాగానే ఒక కవిత గీకాను. "డబ్బు-టైము -బుర్ర-మనసు -విశ్రాంతి -వినోదం -వివేకం -విచక్షణ -విజ్ఞానం -సెల్యులాయిడ్ ఇలా" బహు "బలి-బాహుబలి. ఇది నా అభిప్రాయం. చూసేవాళ్ళనీ కనకవర్షం కురిపించేవారినీ ఏమీ అనలేను. ఒక్కటి మాత్రం నిజం. అసలు ఏమీలేని కథను అంత భారీ ఖర్చుతో తీసి రెట్టింపు పైగా డబ్బు 1500 కోట్లు పిండటం రాజమౌళి వ్యాపార దక్షతకు నిదర్శనం.

మనవళ్లు స్కూల్ ట్రిప్‌లో మంగళవారం కొలంబియా వెళ్లి సాయంత్రానికి వచ్చారు. మధ్యాహ్నం ఏమీ తోచక "మీ గొట్టం"–యూ ట్యూబ్ తిరగేస్తుంటే ఆకెళ్ళ రాసి డైరెక్ట్ చేసిన పద్యనాటకం "అల్లసాని పెద్దన" కనిపిస్తే పెట్టాను. అద్భుతం అని పించింది. "బలికి బలైన" మనసు ఆనంద తాండవమే చేసింది. మనసంతా ఆర్ద్రతతో నిండిపోయింది. పర్గెషన్ అంటారే అది జరిగి తేలికపడింది. బుర్ర హాయిగా ఊపిరి పీల్చుకున్నాను. తర్వాత ఆకెళ్ళతో ఇంటర్వ్యూ చూశాను. చాలా హుందాగా, నిజాయితీగా వినయంగా ఆత్మ విశ్వాసంగా చెప్పారాయన. బెజవాడ బుక్ ఎక్సిబిషన్‌లో ఈ జనవరి 10 తేదీ సాయంత్రం రచయితలతో సమావేశం ఉందని తప్పక రమ్మని నాకు శ్రీ పూర్ణచంద్ ఫోన్ చేసి చెప్పగా వెళ్లాను. అక్కడే మొదటిసారిగా ఆకెళ్ళను చూశాను. తనను గురించిన పరిచయంలో ఆయన బాగా తనను ఆవిష్కరించుకొన్నారు. తన కథా నవల నాటక సినీ సాహిత్య కృషిని 15 నిమిషాలలో చెప్పేశారు. నేనూ తర్వాత నా గురించి చెప్పాను. మా ఇద్దరితోపాటు మరో పాతిక మందికి మాట్లాడే అవకాశానిచ్చి ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక శాఖ కార్యదర్శి శ్రీ డి.విజయభాస్కర్ బుక్ ఎక్సిబిషన్ సొసైటీ అధ్యక్షులు శ్రీ బాబ్జీ, కృష్ణా జిల్లా రచయితల సంఘం అధ్యక్ష కార్యదర్శులు శ్రీ గుత్తికొండ సుబ్బారావు డా.జి.వి పూర్ణచంద్ మొదలైన పెద్దల సమక్షంలో సన్మానం చేశారు. ఇవన్నీ గుర్తుకు వచ్చాయి.

కోమలగారు ఇంగిలీషులో రాసుకున్న "మై లైఫ్" పుస్తకాన్ని పంపిస్తున్నట్లు గోపాలకృష్ణ గారి నుంచి మెయిల్ వచ్చింది. మర్నాడే అందింది. బుధవారం సాయంత్రం గుంటూరుకు చెందిన రిటైర్డ్ పశువుల డాక్టర్ శ్రీ తాళ్ళూరి వెంకట, పుట్టపర్తి నివాసి, బిల్డర్ శ్రీ సూరపనేని నారాయణప్ప గార్లు ఇంటికి వచ్చారు. శతకత్రయం ఇద్దరికీ ఇచ్చాను. తరచూ కలుసుకొందామనుకొన్నాం.

గురువారం కిరణ్ ప్రభ ఆకేళ్లతో చేసిన ఇంటర్వ్యూ ఆమని ఇంటర్వ్యూ చూసాం. రమణ, చరణ్, భవానిగారు మంకు శ్రీను గార్లతో ఫోన్‌లో మాట్లాడాము.

12వ తేదీ శుక్రవారం మా పెద్దమనవడు చి॥ సంకల్ప్ అంటే మా పెద్దబ్బాయిశాస్త్రి కొడుకు ఎం.ఎస్.కోర్స్ పూర్తయిన సందర్భంగా షార్లెట్ యూనివర్సిటీలో జరిగిన గ్రాడ్యుయేషన్‌కు మేమిద్దరం మా అమ్మాయి వెళ్లాం. సుమారు 45 నిమిషాల ప్రయాణం. మధ్యాహ్నం సరిగ్గా ఒంటిగంటకు ప్రారంభమైంది. ముందు బాండ్ వాయిద్యం తర్వాత ఛాన్సలర్ ఫిలిప్ ఎల్ దూబోస్ ప్రసంగం, తర్వాత బోర్డు ఆఫ్ ట్రస్టీ మాటలు, దానివెనుక కొంతమంది ప్రముఖుల ఉపన్యాసాలు జరిగాయి. హామిల్టన్ సెంటర్ హాల్‌లో జరిగిన ఈ జరిమానికి వేలాది తలిదండ్రులు గాలరీలనిండా కూర్చుని నుంచొని వీక్షించారు. వారందరి ఆనందం వర్ణనా తీతము. ముందుగా డాక్టరేట్‌లకు

మెడలో పతకంవేసి సర్టిఫికెట్ ఇచ్చారు. ఆతర్వాత ఏం ఎస్ వాళ్లకు వరుసగా షేక్ హాండ్‌లతో సరిపుచ్చారు. ఆతర్వాత బాచెలర్స్‌కు. ఇదంతా రెండుంబావు గంటలలో అత్యంత క్రమశిక్షణతో వేడుకగా జరిగింది. మా మనవడు సంకల్ప్ "డేటా సైన్స్ అండ్ బిజినెస్ ఎనలిటిక్స్"లో ఎం.ఎస్ చేశాడిక్కడ. మా అమ్మాయి వాళ్ళున్న షార్లెట్‌లోని యూని వర్సిటీ ఆఫ్ షార్లెట్‌లో సీట్ వస్తే డిసెంబరు 26న 2015 హైదరాబాద్ నుంచి బయల్దేరి వచ్చి ఇందులో చేరాడు. సుమారు ఒకటిన్నర ఏడాది చదువుతో పూర్తయింది. కోర్స్ చివరి పరీక్ష ఈ నెల 10న జరిగింది. అది కూడా పాసయ్యాక సర్టిఫికెట్ ఇస్తారు. మనకు డిగ్రీ పాసయ్యాక కాంవోకేషన్ జరిపి సర్టిఫికెట్ ఇవ్వటం అలవాటు. మనకు భిన్నం ఇది. ఎం.ఎస్ ఇక్కడ చేసిన వారిలో ఆంధ్రప్రదేశ్‌కు చెందినవాళ్లు మా వాడితో సహా దాదాపు 25 మంది ఉన్నారు.

మా అల్లుడు ఫ్లొరిడాలోని నోవా యూనివర్సిటీ నుండి ఆన్‌లైన్ ఎం.ఎస్ చేశాడు. మేము మొదటిసారి 2002లో అమెరికాకు టెక్సాస్ రాష్ట్రం హూస్టన్‌కు మా పెద్ద మనవడు అంటే అమ్మాయి పెద్దకొడుకు శ్రీకేత్ పుట్టిన మూడు నెలలకు వచ్చాము. అప్పుడు మా అల్లుడి ఎం.ఎస్ గ్రాడ్యుయేషన్ కోసం మేమిద్దరం మా అమ్మాయి అల్లుడు మనవడు హూస్టన్ నుంచి ఫ్లయిట్‌లో లాడర్ డేల్‌కు వెళ్లి అక్కడ హోటల్‌లో రూమ్ తీసుకొని మర్నాడు జరిగిన గ్రాడ్యుయేషన్‌లో పాల్గొన్నాం. మియామీలో డాల్ఫిన్ సర్కస్ చూసాం. ఇలా అల్లుడి, మనవాడి గ్రాడ్యుయేషన్‌లలో పాల్గొనే అవకాశం వచ్చి ఆనందంగా ఉంది మాకు.

ఇప్పుడు ఈ యూనివర్సిటీ గురించి కొన్ని విషయాలు తెలుసుకొందాం. 1000 ఎకరాల విస్తీర్ణంలో ఇది వ్యాపించి ఉంది. అన్ని కోర్సులూ ఉన్నాయి రైల్వేస్టేషన్ కూడా కాంపస్‌లోకి వచ్చింది. జూన్‌లో ప్రారంభమవుతుంది. ఈ వర్సిటీకి "49 ERS" అనే నిక్ నేమ్ అనే మారు పేరుంది. దీనికి కారణం1949 సంవత్సరం యొక్క ప్రాధాన్యమే. ఒకప్పుడు ఆఫ్-కాంపస్‌గా ప్రారంభమైన యూనివర్సిటీ 1949 లో మూతపడి మరణం చెంది ఉండాల్సింది. అప్పుడు "బొన్నే కోన్" అనే వితరణశీలి ఆమె బృందమూ కలిసి నార్త్ కరోలీనా లెజిస్లేచర్‌ను షార్లెట్‌లో ఉన్నత విద్యలకోసం శాశ్వత వ్యవస్థ ఉండాలని చెప్పి ఒప్పించి దాని ఆమోదంతో షార్లెట్ కాలేజీని 1949లో స్థాపించారు. అంతేకాకుండా ఈ యూనివర్సిటీ 49 నంబరు హైవే మీద ఉండటం మరో ప్రాముఖ్యమైన విషయం. అంతే కాదు, అమెరికాలోని నార్త్ కరోలీనాలోని షార్లెట్‌లో బంగారు గనులు బాగా ఉన్నాయి. కాలిఫోర్నియాలో "గోల్డ్ రష్" కంటే ముందే ఇక్కడ బంగారు గనుల త్రవ్వకం జరిగింది. ఇవన్నీ కలిసి వచ్చేట్లుగా యూనివర్సిటీ కాంపస్‌లో "కాటో కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, అండ్ కాలేజ్ ఆఫ్ హెల్త్

అండ్ హ్యూమన్ సర్వీసెస్ ప్లాజ" ప్రాంగణంలో కూర్చుని పళ్లెంలో బంగారు రజనును నీటితో శుద్ధి చేస్తున్నట్లున్న ఒక బంగారు గని కార్మికుని బ్రాన్జ్ విగ్రహాన్ని ఏర్పాటు చేశారు. ఇది ఈ ప్రాంతం గోల్డ్ మైనింగ్ సెంటర్ అనే చారిత్రిక సత్యాన్ని, అదీకాక , 1949 సంవత్సరం ఈ యూనివర్సిటీ అభివృద్ధిని నాటకీయంగా మలుపు తిప్పిన సంవత్సరమని గుర్తు చేస్తుంది. ఆ స్టాథ్యూలో జీవకళ ఉట్టిపడుతుంది. దీని ఫోటో కింద జమ చేశాను చూడండి. యూని వర్సిటీ చరిత్రను ఇంతగా మలుపుతిప్పిన బొన్నీ కోన్ అనే మహిళా మాణిక్యం గురించి తెలుసుకోకపోతే చరిత్ర క్షమించదు.

బొన్నీ ఇ.కోన్ 1907లో జన్మించింది. 1946 నుంచి ఈ యూనివర్సిటీ సంస్థాపకురాలు. ఇక్కడే టీచర్‌గా పని చేసి, 1947లో షార్లెట్ సెంటర్ ఆఫ్ ది యూనివర్సిటీ ఆఫ్ నార్త్ కరోలీనాకు డైరెక్టర్ అయింది. ఈ సంస్థ మూతపడి చనిపోయే స్థితిలో ఉంటే కోన్ లెజిస్లేచర్‌ను ఒప్పించి 1949లో షార్లెట్ కాలేజీ స్థాపనతో జీవింపజేసి దానికి ప్రెసిడెంట్‌గా ఉన్నది. 1963లో రాష్ట్ర ప్రభుత్వ ఆసరాతో 1963లో 4 ఏళ్ళ వికసించింది. 1965లో కాలేజీని యూనివర్సిటీ స్థాయికి తీసుకురావటానికి తీవ్రంగా కృషి చేసి సఫలమనోరథురాలైంది కోన్. అప్పుడామె స్టూడెంట్ ఎఫైర్స్‌కు వైస్ ఛాన్సలర్‌గా సేవ ప్రారంభించి రిటైర్ అయ్యేదాకా ఉంది. 8-3-2003న బొన్నీ కోన్ శాశ్వతయోగా ఈ లోకానికి దూరమైంది. తన జీవితాన్ని త్యాగం చేసి ప్రాణం పోసి ప్రాణాధికంగా ఆరాధించిన యూనివర్సిటీ కాంపస్‌లో 2004 స్ప్రింగ్‌లో కోన్ భౌతిక శరీరాన్ని ఖననం చేశారు. కానీ ఆమె ఆత్మ ఈ యూని వర్సిటీలోనే పరిభ్రమిస్తూ వివిధ సంక్షేమ కార్యక్రమాలను అభివృద్ధినీ చూస్తూ సంతృప్తి చెందుతూ ఉంటుందని భావిస్తారు.

ఈ యూనివర్సిటీ మొదటి చాన్సలర్ డీన్ డబ్ల్యు కొల్వర్డ్. 1966లో ఈ పదవిలో చేరి 12 ఏళ్ళు పనిచేసి ఇందులో అనేక కాలేజీలు హాస్టళ్లు, కట్టించి గ్రాడ్యుయేట్ వర్క్ ప్రారంభించి దీర్ఘకాలిక ప్రణాళిక అమలు చేశాడు. ఆయన కృషితోనే యూనివర్సిటీ రీసెర్చ్ పార్క్, యూనివర్సిటీ అర్బన్ ఇన్‌స్టి ట్యూట్‌లు ఏర్పడి అర్బన్ వాతావరణమున్న షార్లెట్ విద్యార్థులకు బహుముఖాలుగా తోడ్పడ్డాయి. ఈయన 1913లో జన్మించి 2007లో మరణించాడు. ప్రస్తుతం ఛాన్సలర్ ఫిలిప్ ఎల్. డుబోయిన.

శనివారం సాయంత్రం కాకినాడ వాసి రిటైర్డ్ ఎస్ బి ఐ.ఉద్యోగి పుట్టపర్తి ప్రస్తుత నివాసి శ్రీ అప్పారావుగారు మా ఇంటికి వచ్చారు. ఆయన పూర్తిగా సత్యసాయి భక్తులు. అక్కడే సేవలో గడుపుతారు. మన శతకాలిచ్చాను. మా అమ్మాయికి బాగా పరిచయం. ఆయన్ను కారులో వారి అబ్బాయి ఇంట్లో దింపివచ్చాము. మా మనవడు చి॥ హర్షకు 20015 ఆగస్టులో యాక్సిడెంట్ అయిందని తెలిసి మా అమ్మాయి ఉండలేక ఆగలేక ఆగమేఘాలమీద మర్నాడే బాయల్దేరి ఇండియావచ్చి హైదరాబాద్ ఎయిర్‌పోర్ట్

నుంచి ఇంటికి రాగానే ఆయన కాకినాడ నుంచి ఫోన్ చేశారట మా అమ్మాయికి. ఆయన మనసు మంచిది. గొప్ప సాయి భక్తులు కనుక సెంటిమెంట్‌గా ఫీలయి మా "హర్షకు ఏమీ కాదు. గండం నుంచి బయట పడతాడు" అని గట్టిగా నమ్మానని చెప్పింది చెపుతుంది ఎప్పుడూ.

మా అమ్మాయి గొల్లపూడి కాలం చూడమని చెబితే కొన్ని చూశా. చాలా బాగా ఉన్నాయి. ఆయనలాగా విషయాన్ని కరెంట్ టాపిక్‌ను అంత అర్థవంతంగా సుత్తిలేకుండా సూటిగా నిష్పక్షపాతంగా చెప్పేవాడు లేదని నా నమ్మకం. ఆయన హావ భావాలు ఊగటాలు స్ట్రెస్సులు, ఊనికలు ఒత్తి చెప్పటాలు నాకు భలే ఇష్టం. ఆకెళ్ళ గొల్లపూడి గురించి నేను చూసినవి మైనేనిగారిని చూడమని రాస్తే చూసి చాలా ఎంజాయ్ చేశానని రాశారు. రాత్రి చంద్ర మోహన్ ఇంటర్వ్యూ చూసాం నిష్పక్షపాతంగా చెప్పాడు.

14 ఆదివారం ఉదయం మల్లినాథ 40 రాశా. మధ్యాహ్నం సంగీత గురువు శ్రీ రామాచారి గారి ఇంటర్వ్యూ యూ ట్యూబ్‌లో చూశా. అద్భుతం. ఆయన ఎంత ఉదారంగా స్వచ్ఛంద సేవ చేస్తున్నారో తెలిస్తే చలించి పోతాం. అందరూ కూడాల్సిందే. మధ్యాహ్నం "కాళరాత్రి" చదివేశాను. బాగుంది. ఇదొక్కటే ఈవారం చదివిన పుస్తకం. మరిన్ని విషయాలు వచ్చే వీక్లీలో.

(14-5-17-కాంప్-షార్లెట్-అమెరికా)

## వీక్లీ అమెరికా-7

### 55వ సుందరకాండ పారాయణ, హనుమజ్జయంతి వారం

15-5-17 నుండి 21-5-17 వరకు

15 సోమవారం మల్లినాధ సూరి వ్యాఖ్యానం పూర్తయింది. ఆయన రచనలపై రాయటం ప్రారంభించి 44వ ఎపిసోడ్ వరకు రాశాను. సోమవారం మధ్యాహ్నం యు ట్యూబ్‌లో మంగళంపల్లి బాలమురళీకృష్ణ కాంభోజి రాగాలాపన అందులో తన రచన "ఏమి పాలింప జాలము?" విని పరవశించాను. రాత్రి LOLలో రౌడీ -బండ, పెళ్లి ఎగగొట్టటానికి ఎత్తులు చూసాం. సరదాగా ఉన్నాయి. ఎంతమంది దగ్గర ఎంతటి టేలెంట్ ఉన్నదో రుజువు చేసేవి ఇవి.

మంగళవారం మామూలుగా శ్రీ సువర్చలాన్జనేయస్వామి అష్టోత్తర శతనామాలతో పూజచేసి శ్రీ రామ లక్ష్మణాచార్యుల "సువర్చలా వల్లభ శతకం" పఠించాను. సాయంత్రం ఇన్నయ్యగారి ఫోన్ పలకరింపు. ఆయన భార్య కోమలగారు రాసిన "మై లైఫ్" చదివాను. ఆవిడ పామర్రు దగ్గర కొండిపర్రు ఆశ్రమంలో హిందీ చదివారు. ఆమె హైదరాబాద్‌లో ఉండగా రేడియోస్టేషన్ ప్రోగ్రామ్ ఎక్సిక్యూటివ్ శ్రీ వేలూరి

సహజానంద గారు ఆమెను కొందరు విదేశీ రచయితలను శ్రోతలకు పరిచయం చేయమని కోరగా కాఫ్కా ఆల్బర్ట్ కాము మొదలైన వారిని చక్కగా పరిచయం చేసినట్లు రాశారు. శ్రీ సహజానంద మా రెండవ బావ గారు వేలూరి వివేకానంద గారి పెదనాన్న గారి అబ్బాయే. తేలప్రోలు దగ్గర చిరివాడ అగ్రహారం వాసి. సహజ శ్రీ అరవింద భక్తులు. అరవింద దర్శనంపై పుస్తకాలు రాశాడు. వీరి తమ్ముడు సదానంద. ఈ అన్నదమ్ముల్ని మా బావ గారి కుటుంబం సహజ, సదా అని పిలిచేవారు ఇద్దర్నీ చూశాను. ఇన్నయ్యగారి పెద్దబ్బాయి శ్రీ రాజు నరిశెట్టి మా పెద్దబ్బాయి శాస్త్రికి గుజరాత్‌లోని “ఇర్మ”లో క్లాస్‌మేట్ అని మా మనవడు సంకల్ప్ గుర్తించి చెప్పాడు.

17 బుధవారం నుండి 5 రోజులన 55వ సుందరకాండ పారాయణ మొదలు పెట్టాను. నిత్యపూజ ఆంజనేయ అష్టోత్తర, శతనామ పూజ తర్వాత పారాయణ ప్రారంభించాను. మొదటిరోజు సంక్షిప్త రామాయణం, తర్వాత శ్రీరామ జననం, సీతారామ కళ్యాణం, సీతారామ సుఖ జీవనం సర్గలు చదివి సుందరకాండ ప్రారంభించి 15 సర్గలు పూర్తిచేసి మంకు శ్రీనుగారి “శ్రీ సువర్చలేశ్వర శతకం” చదివి పూర్తి చేశాను. అయిదు రోజులూ పానకం వడపప్పు చలిమిడి డ్రై ఫ్రూట్స్ నైవేద్యం. 7 గంటలకు ప్రారంభిస్తే పూర్తి అయేసరికి 10.30 అయింది తర్వాతే టిఫిన్. ఉదయం 11.30కి డా.యల్లాప్రగడ రామమోహనరావు గారు ఫోన్ చేశారు. ఏం చేస్తున్నారని అడిగితే పారాయణ సంగతి చెప్పా. ఆయన నిత్యం సంధ్యావందనం పూజ చేస్తారట. నేను చెప్పాక పారాయణ కూడా చేద్దామని అనుకొన్నారటగాని 83 ఏళ్ళ వారు అంతటి శ్రమ వద్దని కుటుంబ సభ్యులు వారించారట. అందుకని చేయటం లేదని తర్వాత గోపాల కృష్ణ గారు మెయిల్ రాశారు. మైనేనిగారు పంపిన “Harry G.Frankfurt” రచన “డి రీజన్స్ ఆఫ్ లవ్” అందింది. చదివాను. పెద్దగా చెప్పిందేమీ లేదనిపించింది. రాత్రి ఫన్ బకెట్‌లో “వుయ్ వాంట్ జస్టిస్” అని బాహుబలి–3 తీయాలంటూ నిరాహార దీక్ష చేసిన సరదా ఎపిసోడ్ చూసి పగలబడి నవ్వుకున్నాం.

గురువారం– రెండవ రోజు పారాయణలో 27వ సర్గ వరకు చేసి ముదిగొండ సీతారావమ్మగారి “శ్రీ సువర్చలా వల్లభ మారుతి శతకం” పఠించా. దాదాపు మొత్తం 3 గంటలు పట్టింది. “నా దారి తీరు”లో కృష్ణాజిల్లాలోని “గెలాక్సీ ఆఫ్ హెడ్ మాస్టర్స్” గురించి రెండు ఎపిసోడ్‌లు రాశాను. రాత్రి నర్మదా నదీతీర “కరి వీర పీఠం” శంకరాచార్య శ్రీ స్వామి రామా గురించి “పీఠాధిపత్యం బందిఖానాగా భావించి పారిపోయిన పీఠాధిపతి” అని రాశా. పారిపోయిన రామా గురువు బెంగాలీ బాబాను దర్శించి విషయం చెప్పగా “సాధకుడికి ఈ అనుభవమూ కావాలనే నేను నిన్ను నర్మదా తీరానికి 6 నెలల తపస్సుకోసం పంపాను. దనం వ్యామోహం పదవీ ఎంత బాధకు గురి చేస్తాయో నీకు అనుభవం

రావాలనే పంపాను" అంటాడు.

శుక్రవారం- ఉదయం 7.30కే పూజ ప్రారంభించి 10.15కు మూడవరోజు పారాయణ 38వ సర్గ వరకు చేసి సీతా రావమ్మగారి "శ్రీ సువర్చలా వల్లభ మారుతి శతకం" పఠించా. దీనిని మా అమ్మాయి వీడియో తీసి ఫేస్ బుక్‌లో పెట్టిందట. నాకు తెలీదు. మామూలుగా చేసే పానకం వడపప్పు చలిబిడితోపాటు రవ్వకేసరి ప్రసాదం నైవేద్యం. 10.15కు పూర్తిఅయింది. మధ్యాహ్నం మైనేనిగారి ఫోన్. తర్వాత నేనూ చేసి మాట్లాడాను. రాత్రి శ్రీ బులుసు సాంబమూర్తి పద్మ దంపతుల ఇంట్లో డిన్నర్. వాళ్ళ అమ్మాయి ప్లస్-2కు సెలెక్ట్ అయి ర్యాలీలో సీట్ వచ్చిన సందర్భంగా ఈ ఏర్పాటు. ఇలా సెలెక్ట్ అయినవారి చదువు హాస్టల్ ఖర్చు అంతా ప్రభుత్వమే భరిస్తుంది. స్టేట్‌లో 300 మందికే ఆ ఛాన్స్. దాన్ని పొందటానికి అందరూ తీవ్రంగా కష్ట పెడతారట ఒరిస్సా లోని తెలుగు వారు. ఇక్కడే బరంపురం తెలుగువారైన రాయప్రోలు వారూ కలిశారు. మేమూ, పవన్, రాంకీ కుటుంబం గెస్ట్ లం అదనంగా. పప్పు ఆలూ కూర, తమాషా పాయసం, పునుగులు, పులిహోర, సాంబారు, పెరుగు పండ్ల ముక్కలతో పాటు వాళ్ళ స్పెషల్ "అప్పడాలపిండి ఉండలు" వేశారు. ఒరిస్సా ప్రాంత తెలుగువారిళ్ళల్లో విందులూ వినోదాలలో అప్పడాల పిండి ఉండలు వడ్డించకపోతే మహా తప్పుట. చెప్పారు వాళ్ళు. అలాగే తద్దినాలలో మనం ఆవ పచ్చడి, నువ్వుల పొడి తప్పక చేస్తాం. కానీ వాళ్ళు ఉసిరి గింజల పచ్చడి పెరుగుతో కలిపి, ఉసిరి గింజల పొడి చెయ్యటం తప్పదట. మనకు కొత్తగా ఉంది కానీ ఏ ప్రాంతం వారి అలవాటు వారిది. మనకు ఎవరైనా చనిపోతే దినవారాలలో 12వ రోజు శుద్ధినాడు ఉసిరి పొడి నెత్తిమీద రాసుకొని స్నానం చేసి శుద్ధి అవటం ఉంది.

శనివారం నిత్యపూజ ఆంజనేయ స్తోత్ర శతనామ పూజ. తర్వాత నాల్గవ రోజు పారాయణ ఉదయం 7.30కు ప్రారంభించి 54వ సర్గ వరకు పారాయణ చేసి మామిడిపండ్లు ఆరంజ్ పీచు అరటిపళ్ళతో పూజచేసి మంకు శ్రీను గారి "శ్రీ సువర్చలేశ్వర శతకం" పఠించా. అదనపు ప్రసాదం "చిట్టిగారెలు" 11 గంటల వరకు సాగింది. సంకల్ప్‌ను మా అమ్మాయి యూనివర్సిటీ నుంచి తీసుకొని వచ్చింది.

మా మనవడు శ్రీకేత్ 9లో ఉన్నాడు. కనుక ఎం సెట్ లాంటి దాని కోచింగ్‌కు షార్లెట్ యూనివర్సిటీ దగ్గర "రమణ" అనే లెక్చరర్ దగ్గర లెక్కల కోచింగ్‌కు శని, ఆదివారాలలో ఉదయం 7 గంటలకు వెళ్లి 12 దాకా ఉండి వస్తాడు. మా అల్లుడో అమ్మాయో తీసుకుని వెళ్లి మళ్ళీ తీసుకు వస్తారు. మావాళ్ళ ఇంటినుంచి 45 మైళ్ళు అంటే సుమారు 70 కిలోమీటర్లు. మైనేని గారు పంపిన "క్లియరెన్స్ డారో" రచన "ది స్టోరీ ఆఫ్ మై లైఫ్" బృహద్గ్రంథం అందింది. మొదలు పెట్టాను. సాయంత్రం మా

అమ్మాయి మనవాళ్లతో లైబ్రరీకి వెళ్లి 7 పుస్తకాలు తెచ్చుకున్నాను. చదవాలి.

21-5-17 ఆదివారం వైశాఖ బహుళ దశమి శ్రీ హనుమజ్జయంతి- ఉదయం 6.45కే నిత్యపూజా, ఆంజనేయ అష్టోత్తర సహస్ర నామ పూజ చేసి 5వ రోజు అంటే చివరి రోజు పారాయణ ప్రారంభించి 68వ సర్గతో సుందరకాండ పూర్తి చేసి తర్వాత నాగ పాశ విమోచనం ఆదిత్య హృదయం, రామ రావణ యుద్ధం రావణ సంహారం, దేవతలు చేసిన శ్రీరామస్తుతి, శ్రీ రామపట్టాభి షేకంతో మొత్తం సుందరకాండ పారాయణ పూర్తి చేసి రామ లక్ష్మణాచార్యుల "శ్రీ సువర్చలా వల్లభ సుందర వాయు నందన శతకం" పఠించే సరికి ఉదయం 10.45 గంటలు అయింది. దీనితో శతక త్రయంను రెండుసార్లు పఠించినట్లయింది. పావు గంట విశ్రాంతి తీసుకొని శ్రీ సువర్చలాంజనేయ శాంతి కళ్యాణం పుణ్యాహ వాచనం, దిక్పాల నవగ్రహ పూజ కన్యావరణం, ప్రవర మాంగల్యా పూజ, ప్రవర చూర్ణిక మహా సంకల్పం మంగళాష్టకాలతో సహా చదివి తంత్ర రహిత మంత్రం సహిత కళ్యాణం చేసి స్వామి వారల ఫోటోకు నేను తెచ్చుకున్న శ్రీ ఆంజనేయస్వామికి ప్రక్కనే పెట్టిన పసుపుతో చేసిన సువర్చలాదేవికి అక్షతారోపణ అంటే తలంబ్రాలు పోసి కళ్యాణం పూరి చేసాం. అంతా అయ్యేసరికి 12.45 అయింది. అంటే ఉదయం నుంచి సుమారు 6 గంటల కార్యక్రమం నిర్వహించాం. నిత్య ప్రసాదాలతోపాటు పులిహోర ప్రత్యేక ప్రసాదం ఆ అమ్మాయి, మనవడు పీయూష్ రాత్రి కూర్చుని స్వామికి పూల హారాలు కట్టారు. ఇవాళ పూలతో మామిడిపండ్లతో చక్కగా అలంకరణ చేసి శోభాయమానం చేసింది మా అమ్మాయి. భోజనానికి పవన్ కుటుంబం గోసుకోండ అరుణ కుటుంబాన్ని పిలిచాం. వాళ్ళూ వచ్చి స్వామి పాదాలకు తలంబ్రాలు పోసి భోజనం చేసి వెళ్లారు. భోజనంలోకి మామిడికాయ పప్పు, వంకాయ కూర, చిక్కుడుకాయ కూర పెరుగు పచ్చడి టమేటా చట్నీ చారు, జున్ను వడ్డించాం. కళ్యాణ విందుకూడా జరిగింది అనుకోకుండా.

శనివారం రాత్రి కాలిఫోర్నియా నుంచి మా మేనల్లుడు శాస్త్రి, భార్య, అత్తగారు ఫోన్ చేసి మా అమ్మాయి పేస్ బుక్‌లో పెట్టిన వీడియో చూసి ముచ్చటపడి ఆనందించామని అభినందనలు తెలిపారు. మొత్తం మీద షార్లెట్‌లో నా 55వ సుందర కాండ పారాయణ హనుమజ్జయంతి స్వామివార్ల అనుగ్రహంతో దిగ్విజయంగా జరిగింది.

ఉయ్యూరు శ్రీ సువర్చలాన్జనేయ స్వామి దేవాలయం 19వ తేదీ నుండి మూడు రోజులు 21వ తేదీ వరకు శ్రీ హనుమజ్జయంతి కార్యక్రమాలు ఘనంగా నిర్వహించినట్లు మా అబ్బాయి ఏ పూటకాపూట ఫోన్ చేసి చెబుతూ ఫోటోలు పెడుతూ తెలియ జేశాడు. మొదటి రోజు ఉదయం స్వామివార్లకు అభిషేకం. సాయంత్రం శతకత్రయ పోటీకి "ఒక్క పురుగు" కూడా రాలేదట. శివాలక్ష్మి శ్రీ రామ లక్ష్మణాచార్యులు గారు

నిర్వహించటానికి వచ్చారు. వారికి శాలువాలతో సత్కారం జరిగింది. రెండవ రోజు 1000 రసం మామిడిపండ్లతో పూజ కనుల పండువుగా జరిగిందని రాత్రికి మా శ్రీమతి కంటి డాక్టర్ శ్రీ మతి జయశ్రీ గారి కుటుంబం పూజలో పాల్గొన్నారని, వారి అబ్బాయి అమ్మాయి చక్కగా పాటలు పడారని, మామానవరాలు హర్షిత్హాని కూడా పాడిందని, శ్రీమతి శారదా గారు కూడా చక్కగా గానం చేశారని తెలిసింది. మూడవ రోజు ఉదయం 200 తమల పాకు కట్టలతో అన్ని రకాల పుష్పాలతో అర్చన ఘనంగా జరిగిందని, స్వామివార్ల శాంతికల్యాణాన్ని మా రెండవ అబ్బాయి శర్మ ఇందిరా దంపతులు మూడవ కుమారుడు మూర్తి, రాణి దంపతులు పీటలమీద కూర్చుని ఘనంగా నిర్వహించారని తెలిసి చాలా సంతోషించాం. రాత్రి శ్రీ కోనేరు చంద్ర శేఖరరావు గారు సంకల్పించి స్పాన్సర్ చేసిన 25 కిలోల మినపపప్పుతో స్వామివార్లకు గారెల దండలు అద్భుతః అనిపించాయి. కాలనీ మహిళామండలి వారు శ్రీ హనుమాన్ చాలీసా చాలా భక్తిగా చేశారు. అక్కడ మేము లేకపోయినా మా రమణ అన్ని బాధ్యతలు నిర్వహించి కార్యక్రమాలకు నిండుదనం తెప్పించాడు. ఈ వారానికి స్వస్తి.

(21-5-17-కాంప్-షార్లెట్-అమెరికా)

## వీక్లీ అమెరికా -8

## ఫయెట్టే విల్ సత్య సాయి రిట్రీట్ వారం

22-5-17 నుంచి 28-5-17 వరకు

22 సోమవారం- వర్షం బాగా పడింది. సాయంత్రం పుట్టపర్తిలో ఉంటున్న కాకినాడ వాసి శ్రీ అప్పారావు గారు, అమ్మాయి వచ్చి రిట్రీట్‌కు వెళ్లే విధానం మా అమ్మాయి విజ్జితో చర్చించి వెళ్లారు. “మధ్యయుగాల వైద్య విధానం”పై నెట్‌లో రెండు ఎపిసోడ్‌లు రాశా. “నోర్సే మైథాలజీ” చదివా. రాత్రి అమృతం సీరియల్ కాసేపు చూసాం.

మంగళవారం ఉయ్యూరుకు ఫోన్ చేసి మా అన్నయ్యగారి అబ్బాయి, రాంబాబు మనవడు, కళ్యాణ్‌తో మాట్లాడాం. నా “సుందర కాండ పారాయణ” వీడియో చూశామని చాలా బాగుందని చెప్పారు. “నా దారి తీరు”లో కృష్ణాజిల్లా హెడ్ మాస్టర్‌లను “గెలాక్సీ ఆఫ్ హెడ్ మాస్టర్స్”గా రాసిన రెండు ఎపిసోడ్‌లు చదువుతుంటే వాళ్ళను ప్రత్యక్షముగా చూస్తున్న అనుభూతి కలిగింది అన్నాడు రామ్ బాబు. మా అబ్బాయి రమణ ఫోన్ చేసి హైదరాబాద్‌లో ఉన్న మా మేనకోడలు చి॥ సౌ॥ పద్మకు 3 బాక్సులతో శ్రీ హనుమజ్జయంతి నాడు పూజ చేసిన మామిడిపళ్ళు సుమారు 200కు పైగా ట్రావెల్స్ బస్‌లో పంపానని అందినట్లు పద్మ ఫోన్ చేసిందని చెప్పాడు. పద్మ నాకు వాట్సాప్‌లో “పళ్ళు అందాయి

మామయ్యా. అందరికి ప్రసాదంగా పంచాం" అని మెసేజ్ రాసింది. సంతోషం అన్నాను. "వ్యాఖ్యాన చక్రవర్తి మల్లినాథ సూరి-45" ఎపిసోడ్ తోపాటు, "నోర్సే గాడ్స్" రాత్రి రాశా. రాత్రి "అన్నోన్ ఫాక్టర్స్"లో మిస్టరీ ఆఫ్ ద్వారక, హిమాలయాల్లో స్వర్గం, పద్మవ్యూహం చూసాం. చాలా వివరణాత్మకంగా ఉన్నాయి. మైనేనిగారినీ చూడమని మెయిల్ రాశా. గోపాలకృష్ణగారు పంపిన-మైరా మాక్డొ నాల్డ్ రాసిన "హైట్స్ ఆఫ్ మ్యాడ్నెస్" పుస్తకం అందింది.

బుధవారం యు ట్యూబ్‌లో కాదంబరి కిరణ్ ఇంటర్వ్యూ చూస్తుండగా మధ్యాహ్నం 2 గంటలకు నెట్ పోయింది. వర్షం పడుతూనే ఉంది. నెట్ లేకపోవటంతో "స్వామి రామా" అంతా ప్రత్యక్షరం చదివి రాత్రికి పూర్తి చేశా.

గురువారం రాత్రి 7 గంటలకు మళ్ళీ నెట్ వచ్చింది. మధ్యాహ్నం మన ప్రక్కనున్న రవి గారి నాన్నగారు రాఘవేంద్రరావు సుగుణ కామాక్షి దంపతులతో వాళ్ళు ఇక్కడికొచ్చిన 3 వారాలకు మాట్లాడా. అయిదేళ్ల క్రితం వాళ్ళు ఇక్కడే పరిచయమయ్యారు. రమణ ఫోన్ చేసి నిన్న ఆర్ ఐ గారి రెండవ అబ్బాయి ఇవాళ కుమారిగారమ్మాయి వడదెబ్బకు చనిపోయారని ఇద్దరి కుటుంబాలకు డబ్బు అందజేశానని చెప్పాడు. "యోగి భోగి రోగి", యేసు క్రీస్తు కాశ్మీర్‌లో కొంతకాలం ఉండి వెళ్లాడా?" రెండు ఎపిసోడ్‌లు రాశా. గోపాలకృష్ణ గారు పంపిన క్లియరెన్స్ డార్రో రచన "ది స్టోరీ ఆఫ్ మై లైఫ్" అందింది.

## శ్రీ సత్య సాయి వార్షిక రిట్రీట్ (సింహావలోకనం) విశేషాలు

సైన్యంకు శత్రువు భయంకరంగా కనిపించినప్పుడు రిట్రీట్ అవుతుంది. అంటే వెనక్కి తగ్గుతుంది. తర్వాత శక్తి యుక్తులు సమకూర్చుకొని మళ్ళీ విజృంభిస్తుంది ఇది రాజనీతి. సింహం అయిదారు అడుగులకోసారి వెనక్కి తిరిగి చూసుకొంటుంది. ఎందుకంటే తాను మృగరాజు అయినా ఎక్కడినుంచి ఏ ప్రమాదం మీద పడుతుందోననే సంకోచం. దీన్నే "సింహావ లోకనాం" అంటారు. అలాగే ఏ సంస్థ అయినా ఒక ఏడాది పని చేశాక, తన ప్రగతి గురించి సమీక్ష చేసుకొని, లోటుపాట్లు సరిదిద్దుకొని, మరింత బలం చేకూర్చుకొని ప్రగతి పదంలో నడిచే ప్రయత్నం చేస్తుంది. ఇదే రిట్రీట్. దీనిలో పెద్దలు అనుభవజ్ఞులచేత స్ఫూర్తి పూర్వక ప్రసంగాలు ఉంటాయి. సత్సంగం భజనలు, పిల్లలకు ఆటాపాటా వారి సృజనకు వేదికగా కార్యక్రమాలు వారి కళా సంస్కృతులకు ఉద్దీపనగా నాటకాలు, పాటలు ఉంటాయి ఇక్కడ. అంటే ఒక రకంగా "రిఛార్జి" చేసుకోవటం. మనభాషలో "పునరంకితం అవటం" అన్నమాట.

అమెరికాలోని అన్నిప్రాంతాల సత్యసాయి సెంటర్లన్నీ ప్రతి ఏడాదీ సోమవారం వచ్చే "మెమోరియల్ డే" ముందు వచ్చే శని, ఆదివారాలతో కలిసి మూడురోజుల

సత్యసాయి రిట్రీట్ నిర్వహిస్తారు. మెమోరియల్ డే అంటే "స్మారక దినం" దేశ స్వాతంత్రానికి, స్వాతంత్ర రక్షణకు. ప్రజల ధనమాన ప్రాణ సంరక్షణలో అసువులు బాసిన వారందర్ని స్మరించే రోజు అన్నమాట. మనం మహాత్మా గాంధీజీ అమరవీరుడైన జనవరి 31ను "మృతవీరుల సంస్మరణ దినోత్సవం" జరుపుకొంటాం. అలాగే ఇక్కడ కూడా. ఆ రోజున వారందరి ఆత్మకు శాంతి కలగాలని ప్రార్థిస్తారు. దేశం మొత్తం శలవు దినంగా ప్రకటిస్తుంది. ఇలా మూడు రోజులు సెలవలు కలిసివస్తే ఇక్కడ వీళ్ళు "లాంగ్ వీకెండ్" అంటారు. శుక్రవారం మధ్యాహ్నం నుంచే ఆఫీసులు వదిలేసి చక్కగా మూడురోజులు ఎంజాయి చేయటానికి టూర్లు వెడతారు కుటుంబాలతో.

సత్యసాయి సెంటర్‌ల రీజియన్ 3 అంటే సౌత్ జోన్‌లో ఉన్న 7 రాష్ట్రాలు - అలబామా, నార్త్ కరోలినా, సౌత్ కరోలినా, జార్జియా, ఫ్లోరీడా, టెన్నెస్సీ వర్జిన్ ఐలాండ్స్ రాష్ట్రాలలోని సాయి సెంటర్ల వారందరికీ నార్త్ కరోలినా రాజధాని రాలీలోని సాయి సెంటర్ వారు దానికి ఒక గంట ప్రయాణ దూరంలో "కంబర్లాండ్ కౌంటీ"లో ఉన్న "ఫయెట్టీ విల్" అనే చోట 27-5-17 నుండి 29-5-17 వరకు శని, ఆది సోమవారాలలో వార్షిక రిట్రీట్ నిర్వహించారు. 2012లో మేము షార్లెట్‌కు వచ్చినప్పుడు గ్రీన్ హిల్స్‌లో జరిగిన రిట్రీట్‌లో పాల్గొన్నాం. ఫయెటీవిల్ నార్త్ కరోలినాలో అమెరికా ఆర్మీకి నార్త్ వెస్ట్ భాగంలోని "ఫోర్ట్ బ్రాగ్" దళానికి ప్రాముఖ్యమున్న చోటు. నేషనల్ సిటీ లీగ్ నుంచి మూడుసార్లు ఫయెట్టే విల్ "ఆల్ అమెరికన్ సిటీ అవార్డు" పొందింది. కేప్ ఫియర్ నది దగ్గర్లో సాండ్ హిల్స్‌లో ఉన్న ప్రాంతమిది. సౌత్ ఈస్టర్న్ నార్త్ కరోలినాలో ఇది పెద్ద మెట్రోపాలిటన్ పట్టణమే కాక నార్త్ కరోలినా రాష్ట్రంలో 5వ పెద్ద పట్టణం కూడా. అంతేకాక సియోవన్ నేటివ్ అమెరికన్ల ఆవాస భూమి. హైలాండ్ స్కాట్స్ ఇక్కడే మొదట స్థిరపడ్డారు. అమెరికా అంతర్యుద్ధకాలంలో ప్రసిద్ధి పొందింది. ఇక్కడి ఎయిర్ బార్న్ స్పెషల్ ఆపరేషన్ మ్యూజియం, వార్ మెమోరియల్ మ్యూజియం, పో హౌస్ మొదలైనవి దర్శింప తగిన ప్రదేశాలు. అందుకనేనేమో రాలీ సెంటర్ వారు ఈ చారిత్రిక ప్రదేశాన్ని రిట్రీట్ కోసం ఎన్నుకొని ఉంటారని పించింది. ఇక్కడి RAMADA హోటల్‌లో రిట్రీట్ ఏర్పాటు చేశారు. చక్కని విశాలమైన ప్రాంతం 250 గదులు, కింద 400 మంది కూర్చుని భోజనాలు చేసే ఏర్పాట్లు, పైన 800 మంది కూర్చునే వీలున్న విశాల మైన సభా మందిరం ఉన్నది. రాలీ వాళ్ళు షార్లెట్‌లో జరిగిన సాయి ఆరాధనకు వచ్చినప్పుడు 3 రోజుల రిట్రీట్‌కు అందర్నీ ఆహ్వానించారు.

## ఫయెట్టేవిల్‌కు మా ప్రయాణం

మా అమ్మాయి ముందుగానే ఇక్కడ హోటల్ రూమ్ బుక్ చేసింది. మా మనవళ్లకు 26 శుక్రవారం మధ్యాహ్నం దాకా వార్షిక పరీక్ష ఉన్నందున పవన్ కారులో

మేమిద్దరం వాళ్ళమ్మ మామనవాడు సంకల్ప్ మధ్యాహ్నం 3 గంటలకు బయల్దేరి దారిలో కొత్తగా కట్టబోయే షిర్డీ సాయి మందిరానికి భూమి పూజ జరిగిన చోటు, మీదుగా హైవే నుంచి సింగిల్ లైన్ గుండా కొంత దూరం ప్రయాణం చేస్తూ దారిలో రెండు వైపులా పచ్చని జొన్న, కోతకు సిద్ధమైన గోధుమ పంటలను కోళ్ల ఫారాలను మధ్యలో ఫియర్ నదిని దాటి మళ్ళీ హైవేపై కొంతదూరం వెళ్లి మళ్ళీ డొంక రోడ్డు మీద ఒక 50 మైళ్ళు ప్రయాణం చేసి 3 గంటల ప్రయాణం తర్వాత సాతంత్రం 6.15కు' “రమడా” చేరాం. మా అమ్మాయి పవన్ భార్య రాధా వాళ్ళ పిల్లలతో సాయంత్రం 6కు బయల్దేరి రాత్రి 9కి చేరారు.

మేము చేరే సరికే డిన్నర్ సిద్ధంగా ఉంది. రిజిస్ట్రేషన్ అయ్యాక భోజనం చేశాను. హాలులో టేబుల్స్ వాటి ముందు కుర్చీలతో ఏర్పాటు ఉంది. ర్యాలీ నిర్వాహకులు అందర్నీ చక్కని నవ్వు ముఖాలతో “సాయిరాం” అంటూ పలకరిస్తూ పూరీ కూరా పరవాన్నం పులిహోర ఆవకాయ, పెరుగన్నం ఆరంజ్ ఆపిల్, అరటిపళ్ళతో అడిగి అడిగి మరీ వడ్డించి తినిపించారు. పైన కాసేపు భజన చూసి అందరం మేము బుక్ చేసుకున్న రెడ్ రూఫ్ ఇన్ హోటల్‌కు వెళ్లి అక్కడ పడుకున్నాం.

ఎవరికి వాళ్ళు తమ రూమ్‌లను హోటల్‌లో స్వంత ఖర్చులతో బుక్ చేసుకోవాలి. మూడు రోజులకు రెండుపూటలా భోజనం, టిఫిన్ కావాల్సినప్పుడల్లా కాఫీలకు మనిషికి కేవలం 65 డాలర్లు మాత్రమే. కాలేజీ స్టూడెంట్‌లకు 25. పిల్లలకు ఫ్రీ. అంటే దాదాపు ఉచితంగా భోజనం పెట్టినట్లే. సాయి సెంటర్ వాళ్ళు లాభా పేక్ష లేకుండా “లవ్ ఆల్ సెర్వ్ ఆల్” మోటోతో పని చేస్తారు. శుక్రవారం సాయంత్రం, సోమవారం ఉదయం బ్రేక్ ఫాస్ట్ అంతా నిర్వాహకులే భరిస్తారు. శని, ఆదివారాలు దగ్గరలోని హోటల్‌లో కేటరింగ్‌కు ఆర్డర్ ఇచ్చి తెప్పించి తామే పూటకు ఒక సెంటర్ వాళ్ళు వడ్డనలో ఉండేట్లు ఏర్పాటు చేశారు. చిన్నపిల్లలా దగ్గర్నుంచి 80 ఏళ్ళు దాటినా స్త్రీ పురుష సాయి భక్తులందరూ మగవారైతే తెల్లని పాంట్ షర్టలతో ఆడవాళ్లు చీర జాకెట్, నిండుగా కప్పుకున్న కొంగులతో అత్యంత సాంప్రదాయ బద్ధంగా చెదరని చిరునవ్వుతో సాయిరాం పలకరింపులతో ఆప్యాయంగా ఆదరంగా ఆహ్వానించటం కూర్చోబెట్టటం లేవలేనివారికి వారే తీసుకొచ్చి అందించటం ఇంకో పండు తినండి, ఇంకాసిన పళ్లముక్కలు తినండి పెరుగన్నం మరి కాస్త వేయమంటారా, ఆపిల్ కోసి ఇవ్వమంటారా అంటూ మహా మర్యాదగా చూశారు. వారందరి సేవ మరువ రానిది. ఈ సేవలో పాల్గొన్నవారికి మిగిలిన కార్యక్రమాలు ఎలా జరిగాయో తెలియటం కష్టమేమో అనిపించింది కానీ వారు డ్యూటీ చేస్తూనే వాటిని చూసి ఉంటారు. కాఫీ కలిపి ఇవ్వమంటారా షుగర్ సరిపోయిందా, పాలు కాసిని పోయినా అంటూ ఆప్యాయత చాటారు. మూడు రోజులూ

రెండు పూట్లా భోజనాలకు టిఫిన్లకు ఇదే పద్ధతి. ఎవ్వరి ముఖంలోను అలసట కనిపించలేదు. కష్టపడి పోయామన్న భావం లేదు. సేవలో తరించామన్న సంతృప్తియే గోచరించింది. ఆదివారం రాలీ నిర్వాహకులతో ఒకరైన శ్రీమతి మాధవి ఆలపాటితో నేను ఈ విషయం చెబితే ఆమె ఎంతో సంతోషించారు. ఆమెతో పాటు పని చేసినవారిని నన్ను పరిచయం చేస్తే వారితోనూ ఈమాట అంటే పులకించిపోయారు వారు. మాధవి గారు తన సెల్‌లో నేను చెప్పిన "it is not only retreat, t is good well done treat satisfactory successful resourceful retreat" మాటలను రికార్డ్ చేసుకొన్నారు. అభిప్రాయం సేకరణ పుస్తకంలోనూ అదే రాశాను.

శనివారం ఉదయం నేను స్నానం చేసి సంధ్య, పూజా చదివి మా హోటల్ వాళ్ళు ఫ్రీగా మాకు పెట్టిన టిఫిన్ కాఫీ తీసుకొని హోటల్ మారుద్దామని మాతోపాటు వచ్చిన అప్పారావు గారి అమ్మాయితో వాళ్ళు ఉంటున్న దగ్గర హోటల్‌లో రూమ్ బుక్ చేయించి ఇక్కడ చెక్ అవుట్ చేసి మధ్యాహ్నం అక్కడ చెకిన్ చేసాం. రమడా హోటల్‌లో మామూలుగా అయితే లాంగ్ వీకెండ్‌లో రూమ్ రెంట్ 90 డాలర్లు ఉంటుందట. కానీ ఇక్కడ రిట్రీట్ జరుగుతున్నందున 60 డాలర్లకు కన్సెషన్ రేట్‌లో ఇచ్చారట. పవన్ వాళ్ళు, చాలా మంది ఇక్కడే బుక్ చేసుకున్నారు. రెండుపూటలా భజన ఉపన్యాసాలు వర్క్ షాప్‌లు జరిగాయి. వర్క్ షాప్‌లకు నేను వెళ్ళలేదు. సాయి గ్రంథాలు అక్కడ పెట్టారు. కావాల్సినవాళ్లు ఉచితంగా తీసుకోవచ్చు. నేను 9 పుస్తకాలు-women saints, life is a game -play it, Satya sai speaks loving god, satyam sivam sundaram, footprints in shirdi and parthi, the dharmik challenge premavahini పుస్తకాలు తీసుకున్నాను. లక్ష్మీదేవి ఫోటోలు కృష్ణుని ఫోటోలు కూడా కావాల్సిన వాళ్ళు తీసుకున్నారు.

ఆదివారం ఉదయమే లేచి సంధ్య, పూజా కానిచ్చి షార్లెట్ నుంచి తెచ్చుకున్న ఉప్మా వేడి చేసుకొని తిని స్టార్ బక్స్‌లో కాఫీ తాగి రమడాకు చేరి, ఉపన్యాసాలు విని పిల్లల వాక్ చూసి కాసేపు విశ్రాంతి. భోజనాలు తర్వాత మళ్ళీ గీతా రామ్ ఉపన్యాసం, తర్వాత పిల్లలు ఏర్పాటు చేసిన ప్రదర్శన చూసి, సాయంకాలపు స్నాక్స్ కాఫీ తీసుకొన్నాం. శ్రీమతి గీతారాం, జ్ఞానభాస్కర్ భార్య మా టేబుల్ దగ్గరే కూర్చున్నారు. నన్ను వాళ్లకు పవన్ పరిచయం చేశాడు. నేను గీత గారితో "అమ్మా మీ నాలుకపై సరస్వతీదేవి నర్తించినట్లుంది. అంత బాగా మాట్లాడారు" అన్నాను. ఆమె సంతోషించి "ఈ విషయం బాబా గారికి చెబుతాను. అయన ఎంతో సంతోషిస్తారు" అన్నది. భాస్కర్ భార్య తానూ బందరులో డిగ్రీ చేశానని ఒకసారి ఫ్రెండ్‌ను చూడటానికి ఉయ్యూరు వచ్చానని అని పవన్ నా బ్లాగు విషయం చెబితే అడిగి తెలుసుకున్నది. శనివారం మధ్యాహ్నం

బాలు అనబడే శ్రీ కరణం బాలకృష్ణ గారిని పవన్ నా దగ్గరకు తీసుకువచ్చి పరిచయం చేశాడు. ఆయన్ను ఆరాధనా దినోత్సవం నాడు షార్లెట్‌లో చూశా. కలిసి ఫోటో దిగాం. అది జ్ఞాపకం చేసుకొని తానూ బాబాపై ఒక శతకం రాశానని దాన్ని చూసి అభిప్రాయం రాయాలని కోరారు. మహద్భాగ్యం అన్నాను. రాలీ సెంటర్ ముఖ్య పాత్ర దారిని శ్రీమతి ఆలపాటి మాధవి మెయిల్ ఐడి తీసుకొని వీక్లీ అమెరికా పంపిస్తాను. చూడమంటే దానికోసం ఎదురు చూస్తాను అన్నారు. ఇంతమంది సజ్జనులతో సాహచర్యం ఆనందాన్నిచ్చింది. పెదన దగ్గర ముంజులూరు ఆయన బెజవాడ ఆయన కనిపించి పలకరించారు. ఒక వీల్ చైర్‌లో వచ్చిన ఒక అమ్మాయి మధ్యాహ్నం మా దగ్గర కూర్చున్నప్పుడు స్వామి రామా గురించి అప్పారావు గారితో చెబుతుంటే శ్రద్ధగా విని సాయంత్రం నా దగ్గరకొచ్చి తన తండ్రిగారు బెంగుళూరులో డాక్టర్‌గా ఉన్నప్పుడు స్వామి రామా వచ్చి ట్రీట్‌మెంట్ తీసుకున్నారని చెప్పింది. భలే సంతోషమేసింది ఈ అమ్మాయి వాళ్ళు ప్రస్తుతం ఫ్లొరిడాలోని మయామిలో ఉంటున్నామని చెప్పింది.

**పోయి దొరికిన ఉంగరం**

శనివారం మధ్యాహ్నం మా శ్రీమతి చేతి ఉంగరం రామడాలో ఎక్కడో జారిపోయింది. దాన్ని ఆదివారం మధ్యాహ్నం కానీ పోయిందని తెలుసుకోలేదు. అప్పుడు రాధకు చెబితే తనకే దొరికిందని దాన్ని ఇక్కడి నిర్వాహకుడికి అందజేశామని మైకులో చాలాసార్లు కటించారని చెప్పింది. అప్పుడు విజ్జి ఎవరికి ఇచ్చిందో ఆయన్ను కనుక్కొని ఆయన జాగ్రత్తగా దాచి ఇస్తే తీసుకు వచ్చింది. దానిపై శ్రీ షిర్డీ సాయి బాబా బొమ్మ ఉంది. కనుక మా ఆవిడ నమ్మకం ఆయనే తెప్పించి ఇస్తాడని. అలాగా జరిగింది. అసలు కార్యక్రమ వివరాలు ప్రసంగాల సారాంశం తర్వాత భాగంలో తెలియ జేస్తాను.

**వీక్లీ అమెరికా-8-(2)**

**ఫయెట్టే విల్ సత్యసాయి రిట్రీట్ వారం-2 (చివరిభాగం)**

22-5-17 నుంచి 28-5-17 వరకు

**శని ఆది సోమవారాలలో కార్యక్రమ వివరాలు**

27, 28 తేదీలలో ఉదయం 5.30కు ధ్యానం, 6నుంచి 6.30 వరకు సుప్రభాతం 6.30 నుంచి 7వరకు నగర సంకీర్తనం, 7 నుంచి 8 వరకు ఉపాహారం 8నుంచి 8.40 వరకు భజన 9 నుంచి 10.15 వరకు శ్రీమతి గీతారామ్ ప్రసంగం, 10.20 నుంచి 10.50 వరకు బ్రేక్ ఫాస్ట్, 11 నుంచి 12.30 వరకు "పని కొట్లు" అంటే వర్క్ షాప్స్, 12.30 నుంచి 1.45 వరకు భోజనం మధ్యాహ్నం 2 నుంచి 3.30

వరకు మళ్ళీ "పని దుకాణాలు", 3.30 నుంచి 4 వరకు టీ బ్రేక్, 4 నుంచి 5 వరకు శనివారంనాడు కొన్బి పావెల్ ప్రసంగం 5నుంచి-6.15 వరకు రోమెల్ చిత్తూరి ఉపన్యాసం 6.20 నుంచి 7 వరకు భక్తి గీతాలాపన రాత్రి 7నుంచి 8 వరకు డిన్నర్, రాత్రి 8.15 నుంచి 10 వరకు సాంస్కృతిక కార్యక్రమాలు, ఆదివారం ఉదయం మధ్యాహ్నం శ్రీమతి గీతారామ్ ప్రసంగాలు 4నుండి 5వరకు టామ్‌ల సంటా ఉపన్యాసం 5నుంచి 6వరకు గీతారామ్‌తో ముఖాముఖి మిగిలినవన్నీ పై విధంగానే.

29-5-17 సోమవారం ఉదయం ధ్యానం, సుప్రభాతం నగర సంకెర్తన బ్రేక్ ఫాస్ట్ తర్వాత రిట్రీట్‌పై సమాలోచనం 8.40 నుంచి 9వరకు హారతితో మూడురోజుల రిట్రీట్ సమాప్తం.

మొత్తం 600 మంది ఈ రిట్రీట్‌లో స్వంత ఖర్చులు పెట్టుకొని వచ్చి, డబ్బు పెట్టి హోటల్ రూమ్స్‌లో ఉంటూ, కార్యక్రమాలలో పాల్గొని తమ అకుంఠిత సాయి ఆరాధనను చాటుకున్నారు. ఇంతమందికి విసుగు విరామం లేకుండా ఇక్కడ సేవలు అందజేశారు. సాయి భావ దీప్తికి నిదర్శనమే నిలిచారు. రిట్రీట్‌ను జయప్రదం చేశారు. ప్రసంగాలన్నీ ఇంగ్లీష్‌లోనే అని మరువరాదు. తెలుగు వచ్చిన వాళ్ళు ఉంటే మధ్యలో తెలుగు పదాలు ఎక్కడైనా రావచ్చు తప్ప అంతా ఆంగ్లంలోనే అందరికీ అర్థమయ్యేటట్లే ప్రసంగాలు చేస్తారు. ఇక్కడ ఏ సభలోనైనా అంతే అని గమనించాలి. ఏ ప్రసంగాన్ని అయినా అత్యంత శ్రద్ధతో విన్నారు. "పిన్ డ్రాప్ సైలెన్స్" పాటించి సంస్కారాన్ని చాటారు. దీనికి అందర్నీ తప్పక అభినందించాలి.

రాలీ సెంటర్ వాళ్ళు మాకు 100 ఆపిల్ పళ్ళు ఉన్న పెద్ద బాక్స్ "ప్రసాదం" అని చెప్పి ఆదివారం మేము ఇంటికి బయల్దేరేటప్పుడు వాళ్ళే తీసుకొచ్చి కారులో పెట్టారు. ఇంకో బాక్స్ కూడా ఇస్తామంటే మేమే వద్దన్నాం. ఈ వంద ఆపిల్స్‌ను ఎలా సద్వినియోగం చేయాలో మా అమ్మాయి ఆలోచించింది. వచ్చే శనివారం తెలిసినవాళ్లు ఇంట్లో రుద్రాభిషేకం భోజనాలకు ఆహ్వానించారట అక్కడ సద్వినియోగంగా ప్రసాదంగా పంచి బెట్టాలని నిర్ణయించింది. చక్కని గ్రామీణ వాతావరణంలో పరిశుభ్రత, పారిశుద్ధ్యం భక్తి, ప్రేమ సేవల మధ్య మనసులకు తాకే ప్రసంగాలతో భక్తిభావ భజనలతో ఆప్యాయత వర్షించే ఆతిథ్యంతో రెండు రోజులు గడిపి మానసిక ఆనందాన్ని పొంది రీకూప్ అయి ఇంటికి తిరిగి వచ్చాము. ఇప్పుడు ప్రసంగ విషయాలు రాస్తాను.

జార్జియాకు చెందిన కాస్బి పావెల్ ప్రసంగంలో 1979లో సత్య సాయిని మొదటిసారి దర్శించినట్లు, తర్వాత బెంగుళూరులో 20 వేల మంది ఉన్న సభలో ఉపన్యాసమిచ్చిన సాయిని చూసినట్లు, తానూ ఒకసారి కస్టమ్స్ అధికారులవలన ఇబ్బందులు పడుతుంటే తెల్ల దుస్తులతో వచ్చి పరిష్కరించిన సాయిని చూసినట్లు,

పుట్టపర్తి రాగానే తనకేమీ తెలియనట్లు "నీకు కస్టమ్స్ వారి వాళ్ళ ఏదైనా ఇబ్బంది కలిగిందా అని అడిగినట్లు, I+I=WE అని సాయి చెప్పారని, సాయి ఉపన్యాసాన్ని ఒకామె ఇటాలియన్ భాషలోకి అనువదించి చెబుతుంటే ఆమెకు సరైన పదం దొరక్క ఇబ్బంది పడుతుంటే బాబా అర్థవంతమైన ఇటాలియన్ పదాన్ని సూచించటం తనకు ఆశ్చర్యం కలిగించిందని ఆయన సర్వాంతర్ వ్యాపి అనటానికి "లవ్ ఈజ్ గాడ్" అనటానికి ఇది నిదర్శన మని తన అనుభవాన్ని తెలియజేశాడు.

గ్రీన్స్ లాండ్ సెంటర్ ప్రెసిడెంట్ గిరీష్ జంధ్యాల బాబాతో తన అనుభవాన్ని 10 నిమిషాలలో చెప్పాడు. ప్రసాదంగా పులిహోర అడిగి అడిగి మరీ పంచమని తనకు బాబా ఇస్తే అందరికీ పంచానని, కానీ బాబా రెండుమూడు సార్లు రెట్టించి అడిగి అక్కడ ఒక కుర్రాడికి తక్కువే పెట్టావు వాడు దాన్ని వాళ్ళ అమ్మకు కూడా పెట్టాలి అని చెప్పటం తనకు ఆశ్చర్యం కలిగిందని గొప్ప అనుభూతితో తెలియ జేశాడు.

శ్రీ రోమెల్ చిత్తూరి ముస్లిం. అమితమైన సాయి భక్తుడు భజనలతో పరవశిస్తాడు. 2012 రిట్రీట్‌లో ఆయన్ను చూశా. మాట్లాడా. తానూ రాసిన పుస్తకాలు కూడా ఇచ్చాడు. చక్కని ప్రాసంగికుడు. మాటలప్రవాహంలో కొట్టుకు పోవాల్సిందే. i +i=we కాదని I మాత్రమే అవుతుందన్న ఉపనిషత్సారం చెప్పాడు రోమెల్. భక్తులు పార్ట్ టైంగా కాక పూర్తి భక్తులుగా మారాలని, తనను బాబా ఐ ఎస్ పరీక్షకు తయారు కమ్మని ఆదేశిస్తే రోజుకు 16 గంటలు స్వామి సేవ చేస్తూ చదువుతూ పాసయ్యానని చెప్పాడు. తనకు గుండె ఆపరేషన్ జరిగితే స్వామి వచ్చి తన చెయ్యి పట్టుకొని ధైర్యం కలిగించారని, తానూ సి బి ఐ ఆఫీసర్‌గా దేశమంతా పనిచేశానని విదేశాలలో కూడా పని చేశానని ఎక్కడ చేసినా సాయి సత్సంగాలు నిర్వహించి సాయి పుస్తకాలు పంచి ప్రజలలో సాయి అవేకెనింగ్ తెచ్చానని, తనపై అభియోగాలు మోపితే అవి అన్నీ తప్పుడు వేనని స్వామి కృపవలన రుజువై తనజీవితం మచ్చలేని జీవితంగా బాబా మలచారని, రువాండాలో తానూ రిట్రీట్ చేస్తుండగా సత్య సాయి అన్ని ఏర్పాట్లు స్వయంగా చూసినట్లు అక్కడి వాళ్ళు తనకు చెప్పారని వాళ్లకు బాబా ఎవరో అసలు తెలియదని దీన్ని బట్టి నమ్మిన వారికి బాబా ఎంత చేరువలో ఉంటారో తెలిసిందని, ఆయనపట్ల శరణాగతి ఉంటే అన్నీ ఆయనే చూస్తారని, తానూ డిగ్రీ చదివిన మూడేళ్లు అన్ని వ్యసనాలకు బానిసయ్యానని, తన పాత్ర ఏమిటో లోకానికి తెలియజేయటానికి బాబా తనను ఆ చెడు అభ్యాసాలనుంచి దూరమయ్యేట్లు చేసి ఐ ఎస్ చదివించారని కృతజ్ఞతతో చెప్పాడు "take active roll the rest He would do" అటూ ప్రచార ఆర్భాటాలు వద్దు, ఆయనకు ఇష్టం ఉండదు. అతి వినయంగా ఉండాలి. ప్రతి ఇంట్లో సాయిబాబాకు ఒక కుర్చీ వేసి పవిత్రంగా ఉంచితే ఆయన అన్నీ చూస్తాడు. తాను ఒక దొంగతనం

కేసులో ప్రభుత్వ ధనం కోట్లాది రూపాయలను దొంగలనుంచి స్వాధీన పరచుకొంటే ప్రభుత్వం తనకు 3 లక్షల నగదు పారితోషికమిస్తే దాన్ని బాబా పాదాలవద్ద ఉంచి దాన్ని కనిపెట్టించింది నువ్వే కనుక ఇది నీదే అని సమర్పించానని, కానీ ఒక ధనికుడు 25 లక్షల చెక్కు పంపిస్తే అన్యాయపు సొమ్ము అది దాన్ని తగలబెట్టమని తగల బెట్టించారని ఆయనకు విలువలతో కూడిన జీవితమే ఇష్టమని చెప్పాడు.

20-3-2011న సత్యసాయి అందరికి రెండు చేతులు ఎత్తి నమస్కరిస్తూ చివరి దర్శనమిచ్చారని, మనం కూడా అలాంటి ప్రేమతో అందర్నీ పలకరించాలని, స్వామి శివానందను పుట్టపర్తిలోని డాక్టర్ నర్సింహన్ ఒకప్పుడు బాబా దర్శనం వలన ఏమిటి ప్రయోజనం అని అడిగితే "సత్య సాయి సందర్శనం లక్ష దేవుళ్ళ దర్శనంతో సమానం" అని చెప్పారని, తానూ ఒకసారి పాలం బాగ్‌లో నగర సంకీర్తనం చేస్తుంటే ఉదయాన ఆకాశం నుంచి వింత కాంతి భూమి మీద ప్రసరించటం అందరూ చూసి పులకించారని, అందుకే బాబాకు సంకీర్తన చాలా ఇష్టమని చెప్పాడు. "భారత దేశం ధర్మ రాజు అయితే అమెరికా అర్జునుడు" అని గొప్పగా రోమెల్ అభి వర్ణించాడు. "మూడు సి"లను దూరం చేసుకోవాలని అవే కంపారిజన్, క్రిటిసిజం, కంప్లెయింట్ అని వివరించాడు. ఈ మూడూ దూరమైతే ఇలపై స్వర్గమే నర్తిస్తుంది. చివరగా "వన్ లవ్, వన్ ఫ్యామిలీ వన్ వరల్డ్" అనేది బాబా ఆదర్శమని అందరం దాన్ని అనుసరించి అందరికి సంతోషం కలిగిద్దామని చెప్పి రోమెల్ హర్షధ్వానాల మధ్య ప్రసంగం పూర్తి చేశాడు. స్ఫూర్తి దాయకమైన గొప్ప ప్రసంగం. టామ్ లసంటా ప్రసంగం సంతృప్తిగా లేదనిపించింది.

బాలు కరణం 8 నిమిషాలలో తనకు ఉద్యోగంలో ప్రమోషన్ వచ్చి జీతం 5 వేలు నుంచి 25 వేలకు పెరిగినా ఒక నాస్తికుడైన బాస్ దగ్గర పని చేయటం ఇబ్బంది అనిపించి బాబాకు చెబితే "వాడు ఎవడైతే నీకేమి. నీ పని నువ్వు చెయ్యి" అని ప్రోత్సహించిన వృత్తాంతాన్ని చక్కగా నాటకీయంగా చెప్పి మెప్పించారు.

చివరగా శ్రీమతి గీతారాం మూడుసార్లు చేసిన ప్రసంగ సారాంశాన్ని తెలియ జేస్తున్నాను. ఇందరిలో ఆమె స్టార్ స్పీకర్ అనిపించారు. హృదయాలకు హత్తుకొనేట్లు ప్రసంగించటం ఆమెకున్న గొప్ప లక్షణం "షి. కాప్టి వేటేడ్ ది ఆడియెన్స్" సరస్వతీ దేవి ఆమె నాలుకపై నిజంగానే నర్తించింది అనిపిస్తుంది. గీతా రామ్ "బాబా అంటే బి అలెర్ట్, బి అవేర్ అరౌండ్ యు అండ్ ఇన్" అని అర్థమని సాయి అంటే "సాయి ఆల్వేస్ ఇన్ యు" అని భావమని, సత్యసాయికి సోనమ్మ అనే 80 ఏళ్ళ ముసలావిడ స్నానానికి నీళ్లు పెడుతూ, ఆయన తిన్న పాత్రలు కడుగుతూ సేవ చేసేదని, ఆమెకు ఒక సారి జబ్బు చేస్తే తన తండ్రిగారి కారులో ముందుబాబా వెనక ఆమె, గీతా పెనుగొండకు

తీసుకు వెడుతుంటే గతుకుల మట్టి రోడ్డుపై కారు దిగిపోయి ఆగిపోతే బాబా ఒక్క వేలితో దాన్ని తోస్తే ముందుకు కదిలేదని ఇదేమిటి స్వామీ అని తన తండ్రి అడిగితే "గోవర్ధనపర్వతాన్ని చిటికెన వేలుపై నిలబెట్టిన నాకు ఇది పెద్దకష్టమా" అన్నారని, గతుకుల రోడ్డులో సోనమ్మ బాధతో సాయీ సాయీ అని అంటుంటే "సోనియామ్మా నేను నీ దగ్గరే ఉన్నానమ్మా" అంటూ అనునయిస్తూ బెంగుళూరులో డాక్టర్ కాలప్ప హాస్పిటల్‌కు తీసుకు వెడితే వెంటనే ఆపరేషన్ జరగాలని చెబితే, ఎనస్తీషియా ఇచ్చే డాక్టర్ ఆదివారం అవటంతో రాలేడేమో అని కాలప్ప అంటే "మందుతాగి వాడే ఎనస్తీసియాలో ఉంటే వాడొచ్చి చేసేదేమి ఉంది" అని బాబా చెప్పి సోనమ్మను నిద్రపొమ్మని చెప్పి ఆపరేషన్ చేయాల్సిన చోట తన వ్రేలు పెడితే అది మొద్దుబారగా డాక్టర్ కాలప్ప ఆపరేషన్ పూర్తి చేశాడని, తన తండ్రి డా. పద్మనాభన్ ఇంటికి బాబాను తీసుకు వెళ్లారని ఆయనకు వంట రాకపోతే బాబా తానే మిరియాల చారు కాచారని అప్పుడు వాళ్ళ అమ్మ వచ్చిందని తండ్రి బాబాతో "ఈ పనేదో మీరే ఆమెకు పుట్టపర్తిలో చేయచ్చుకదా" అని అడిగితే "కాలం కర్మ కలిసి రావాలి పద్మనాభం" అన్నారని చెప్పింది.

ఒకసారి ఒకమ్మాయిని పేరేమిటని అడిగితే ఆమె జాయ్ అని చెప్పిందని దానికి బాబా "జీసెస్ ఫస్ట్ అదర్స్ నెక్స్ట్, యు లాస్ట్" అనే అర్థం చెప్పారన్నారు. నమ్మకం కావాలి నీ నమ్మకంలో నీకు విశ్వాసం ఉండాలి, క్రమశిక్షణ అంతటా ముఖ్యమన్నారని. తనను అమెరికా వెళ్ళమని చెప్పింది బాబాయేనని చెప్పింది గీతారామ్.

"వాక్ విత్ వాల్యూస్" అనే మరో ప్రసంగంలో గీతారామ్ బాబా ఎప్పుడూ తానూ ఒక అయస్కాంతం అని భక్తులు ఇనుప రజను అని దాన్ని ఆకర్షించటం తన లక్షణమని కానీ రజను తుప్పు పడితే ఆకర్షింప బడదని కనుక కల్మషం అనే తుప్పును ఎప్పటి కప్పుడు వదిలించుకోమని చెబుతారన్నది. ఒకసారి ఒక విద్యార్థి తానూ యుద్ధానికి వెళ్లి అక్కడ సేవ చేస్తానని బాబాకు చెబితే ముందు చదువు పూర్తిచేయి తర్వాత నీ ఇష్టం అని హితవు చెప్పారని తానూ అన్నీ గమనిస్తూనే ఉంటానని "foot steps of the ant is a thunder in my ears" అని తన మనోభావాన్ని తెలియ బరచారని యెంత గొప్ప ఉన్నత విద్యావంతులైన ఉద్యోగస్తులైనా సేవలో ధన్యత చెందుతారని ఇంజనీర్ దశరధరామి రెడ్డి రోజూ పుట్టపర్తిలో పాలు కొని తీసుకువచ్చి బాబా భక్తులకు అందజేసేవాడని చెప్పారు. ఆయన భార్య పుష్పాలతో చక్కని హారాలు అల్లేవారని రోజూ 5 సార్లు ఆ దండలు బాబాకు వేసేవారని ఒక దండను పోలి మరొక దండ ఉండకుండా ఆమె అల్లేవారని చెప్పారు. కానీ ఏనాడు ఆమె తన చేతులతో బాబాకు హారం వేసేవారు కాదని, ఇతరులు వేస్తే చూసి ఆనందించేవారని అయన చనిపోతే భార్యను బాబా ఆశ్రమంలోనే ఉంచారని చెప్పారు. కొంతకాలానికి 1980లో బాబా

హారాలు వేయవద్దన్నారని ఆమెకు ఆపని లేకుండా పోయిందని ఆ తర్వాత 22 ఏళ్ళు అక్కడే ఉన్నా బాబాను ముసలివారు దర్శించే "బుడ్డీ క్యూ"లోనే వెళ్లి చూసేవారని చెప్పారు. ఆమెతో బాబా ఎప్పుడూ మాట్లాడని లేదని అన్నారు. కానీ ఒకసారి బాబా బెంగుళూర్‌లో ఉండగా ఇద్దరు కుర్రాళ్లను ఆమెను కారులో బెంగుళూరు తీసుకురమ్మని చెప్పి పంపారని, వాళ్ళు వచ్చి రమ్మంటే రాంగ్ అడ్రస్‌కు వచ్చారేమోనని తిప్పి పంపిందని, బాబాకు చెబితే తిట్టి కారులో వెంటనే తీసుకురమ్మని మళ్ళీ పంపారని, అప్పుడామె నమ్మి వెళ్లిందని, ఆయన ఆమెను బట్టల షాపులో 15 చీరెలు జాకెట్లు కొనిపించారని, కావాల్సినవన్నీ కొనిపించారని విమానంలో ఆమెకు చాలా ప్రదేశాలు చూపించి మళ్ళీ పుట్టపర్తి చేర్చారని ఆమె స్వయంగా గీతారామ్‌కు వివరించినట్లు చెప్పారు. కనుక మనం ఆయన దృష్టిపడాలని ఎదురు చూడక్కర లేదు. ఆయనకు అందరూ తెలుసు. ఎప్పుడు ఏది ఎలా ఇవ్వాలో అలా ఇస్తారు అన్నారు గీతాజీ.

సాయి సాయి సాయి అనవే –సర్వం బ్రహ్మమనవే –బాబా బాబా బాబా అనవే భక్తితో మహిమతో పాల్గొనవే –రామ రామ రామ అనవే రాక్షస గుణములు పొమ్మనవే –కృష్ణా కృష్ణా కృష్ణా అనవే కష్టములు పోగొట్టుకొనవే –శివా శివా శివా అనవే శివ కేశవులు సమమనవే– "హరి ఓమ్ హరి ఓమ్ ఓమ్ హరి ఓం అనవే ఆత్మా రాముని కనుగొనవే" అనే కీర్తన బాబా రాశారని ఇది దేశ విదేశాలలో బాగా ప్రచారమైంది చెప్పారు. ఒకసారి ఒక కెనడియన్ బృందం విని పులకించి అందులోని భావ ఔన్నత్యానికి పొంగిపోయారని గీత అన్నారు. సేవ అంటే ఆధ్యాత్మికతకు దారి. saveలోని అక్షరాలను మారిస్తే seva అవుతుంది. సాయిని ఆరాధిస్తే అడ్డంకులు తొలగిపోతాయి అని నమ్మిన వారికి బాబా ఎంతటి ఆప్తుడుగా ఉంటారో వివరించారు గీతారామ్.

సాయంత్రం ప్రశ్నోత్తరాలకు ముందు మళ్ళీ గీతారామ్ మాట్లాడుతూ ఒకసారి బాబా తమను హార్స్లీ హిల్స్‌కు తనతో తీసుకు వెళ్లారని, అక్కడ నీటికి ఇబ్బంది అని అందరం 8 గదుల్లో ఉన్నామని ఇంతమందికి నీళ్లను రెండు దున్నపోతులకు అటూ ఇటూ పెద్ద డ్రమ్ములు కట్టి 3 మైళ్ళు కిందనుంచి రోజుకు మూడుసార్లు తెప్పించేవారని తమతో డాక్టర్ కస్తూరి కూడా ఉన్నారని 10 రోజుల రిట్రీట్ తర్వాత అందరం ఇంటికి బయలుదేరటానికి కార్లు ఎక్కి కూర్చున్నామని కానీ బాబా ఆ బంగాళా వెనక్కి వెళ్లి అక్కడ నీళ్లు మోసిన దున్నపోతుల వీపులు తట్టి పది రోజులుగా తమకు నీళ్లు మోసి తెచ్చినందుకు కృతజ్ఞత చెప్పి, ఏడవ వద్దని చెప్పి తాను మళ్ళీ వస్తానని అభయమిస్తుంటే కస్తూరి గీతాలు స్వామి ఏమి చేస్తున్నారో చూడటానికి వెడితే "దున్నపోతుల్లారా నేనేదో ఇక్కడ చేస్తుంటే మీరెందుకు వచ్చి చూశారు అని చిరుకోపం ప్రదర్శిస్తే మేము చూడకపోతే

ఈ విషయం లోకానికి ఎవరు రాసి చెబుతారు అంటే నవ్వేశాడట బాబా. అదీ సత్య సాయి కృతజ్ఞతా భావం అన్నారు.

తన వివాహ సంబంధం బాబానే కుదిర్చారని ఆయన అన్ని వస్తువులు కొని కావలసిన పదార్థాలన్నీ చేయించి దగ్గరుండి వివాహం జరిపించారని చెప్పారు గీతారామ్. వెయ్యి మందికి భోజనాలు ఏర్పాటు చేశారట.

అమెరికాలో ఒక సభలో తాను మాట్లాడుతుంటే ఒక కాంగో జంటకు బాబా వాళ్ళ భాషలో దాన్ని చెప్పారని వాళ్ళు వచ్చి తనకు అభినందనలు తెలిపారని ''హి హాజ్ ఏ ఫోకస్ ఆన్ ఎవరి థింగ్. అలాగే రష్యన్లకూ బాబా తన ఆంగ్ల ప్రసంగాన్ని వాళ్ళభాషలో అర్థమయ్యేట్లు చేశారని చెప్పింది. "సాయికి అందరి హృదయ భాషలు తెలుసు" అన్నది అన్నారు. బాబా 70వ పుట్టిన రోజుకు రమ్మని గీతను ఆహ్వానిస్తే రాలేనని అమెరికాలోనే జరుపుతున్నానని అంటే "అయితే నేనే వస్తాను" అని చెప్పారని, ఆ రోజు ఉదయం బాంక్‌కు వెళ్లి ఏ టి ఏంలో డబ్బు తీసుకొని కారు ఎక్కగా ఎవరో నల్లని ఆగంతకుడు ముసుగేసుకుని కారులో ఎక్కి కూర్చుని కత్తి మెడమీద పెట్టి అరవవద్దని చెప్పగా అనుకోకుండా కారులో ఉన్న సత్యసాయి చిన్న ఫోటో కాళ్లకు తన బొటన వ్రేలు తగిలిందని ఇంతలో పోలీసుకారు రావటం, తానూ కంగారు పడకుండా ఉండటం, తనను వాడు డ్రైవ్ చేయమంటే చేయలేననటం, వాడే పోలీసుల హడావిడి చూసి డోర్ తెరుచుకు దిగటం వెంటనే పోలీసులు కారులోకి నెట్టేసి ఎక్కించుకోవటం తనకు భయం లేకపోయినా పోలీసులు ఎస్కార్ట్‌తో ఇంటిదగ్గర దింపటం మూడు నాలుగునిమిషాల వ్యవధిలో జరిగిపోవటం అంతా బాబా మహిమగా ఆమె చెప్పారు. అప్పటికే సాయి జన్మదినం ఇండియాలో జరగటం వాళ్ళమ్మ బాబా దర్శనం చేయటం "గీత బాగుందా" అని తెలియనట్లు అడగటం తానూ అక్కడికి వచ్చేముందే ఫోన్ చేసిందని చెప్పటం గీత ఇంటినుంచి బెంగళూర్‌లోని తండ్రికి విషయమంతా చెప్పటంతో విషయం తెలిసింది. సాయంత్రం తండ్రిని బాబా జరిగిన విషయం చెప్పమంటే రెండే రెండు నిమిషాల్లో చెప్పటం అప్పుడు బాబా పూసగుచ్చినట్లు జరిగిన విషయమంతా వివరించటం ఆమె నన్ను ఒక్కసారి తలచుకొంటే నేను ఆమెకు ట్రిప్లికేట్‌లో బదులిచ్చానని మొదటగా ఆమెలో స్థిర చిత్తాన్ని, తర్వాత పోలీస్‌లను రప్పించటం మూడవది దొంగకు బుద్ధి వచ్చేట్లు చేసి వాడంతటకు వాడే కారు దిగిపోవటం అనే ట్రిపుల్ బెనిఫిట్ కలిపించానని సత్యసాయి వివరించారని ఈ మొత్తం ఉదంతాన్ని చాలా నాటకీయంగా, ప్రదర్శన పూర్వకంగా సస్పెన్స్ భరితంగా గీతారామ్ వివరించి ప్రేక్షకుల హృదయాలను దోచుకున్నారు. తనను పోలీసులు హాట్ లైన్ నంబర్ ఇచ్చి అవసరం వచ్చినప్పుడు ఫోన్ చేయమని చెబితే గీత "నా హార్ట్‌లైన్ నంబర్ బాబా" ఉన్నారని చెప్పిందట. ఎందుకు భయపడలేదని అడిగితే

స్వామి ఉండగా నాకు భయమెందుకు. జీవితం శాశ్వతం కాదు అని బాబా నేర్పారు అన్నది. చివరగా సత్యసాయి బాబా చెప్పిన “నీ పని నువ్వు చేస్తే నా పని నేను చేస్తా” అన్న స్ఫూర్తిదాయకమైన మాటతో ప్రసంగం పూర్తి చేసి హర్షధ్వానాలు అందుకొన్నారు శ్రీమతి గీతారామ్. ఇలాంటి వారితో పరిచయమవ్వటం మాతో ఫోటో తీయించుకోవటం మా అదృష్టం.

(29-05-17-కాంప్-షార్లెట్-అమెరికా)

## వీక్లీ అమెరికా-9 (29-5-17 నుంచి 4-6-17 వరకు)

## రుద్రాభిషేక వారం

29 సోమవారం ఉదయం మైనేనిగారు ఫోన్ చేసి ఆధునిక ప్రపంచ నిర్మాతలు విషయం మాట్లాడి కొన్ని మార్పులు చేయమంటే చేశాను. వారి బావమరిదిగారి భార్యతో మాట్లాడమని ఫోన్ నంబర్ ఇస్తే రాత్రి హాయ్ చెప్పాను. మంగళవారం “వుమెన్ సెయింట్స్ ఈస్ట్ అండ్ వెస్ట్” కొంత చదివా. దాసరి నారాయణరావు మరణ వార్త విన్నాను. స్వర్గం నరకం, తాతామనవడు, తుగ్లక్, మేఘ సందేశం, శివరంజని మాత్రమే నాకు నచ్చాయి. మిగిలినవన్నీ “పైత్యం” అనిపిస్తాయి. నటన బాగుంటుంది. డైలాగ్ డెలివరి కూడా. మెసేజ్‌లో “సరిలేని దాసరి” అని రాశాను. మల్లినాథ సూరి 48, ఆపన్న హస్తాలు, దివ్య ధామం రాశాను. విజ్జి వాళ్లకు తెలిసినాయన సిద్ధిపేట వారు శ్రీ గ్రంధి హరి రాత్రి వచ్చి శనివారం సాయంత్రం వాళ్ళ ఇంట్లో బి.టెక్ చివరి సంవత్సరం చదువుతున్న వాళ్ళబ్బాయికి ఎం.బి.బి.ఎస్ సీట్ సాధన కోసం రుద్రాభిషేకం చేస్తున్నామని ఆశీర్వదించి దగ్గరుండి అన్నీ చూడమని సంకల్పం పూజ విధానం వగైరా చేయించమని కోరాడు. సరే అన్నా. వచ్చి తీసుకు వెడతానన్నాడు.

బుధవారం ఉదయం శ్రీ ఎల్లాప్రగడ వారు కారీ నుంచి ఫోన్ చేసి మమ్మల్నిద్దర్నీ రైలులో కారీకి తీసుకువెళ్లే ఏర్పాట్లు చేస్తానని ఆయన మేము రిట్రీట్‌కు వెళ్లిన ఫయ టేవిల్ లో యూనివర్సిటీలో అకౌంట్స్ ప్రొఫెసర్‌గా చేసి రిటైరయ్యానని చెప్పారు. ఫోన్ మా అమ్మాయికిస్తాను మాట్లాడుతుంది అని చెప్పి ఇచ్చాను. పిల్లలకు జూన్ 10 వరకు పరీక్షలని అవి అయ్యాక తానే మమ్మల్ని తీసుకు వస్తానని చెప్పగా ఆయన చాలా సంతోషించారు. సూరి 48, లండన్ థియేటర్లు-1, అఘోరీ-1 రాశా. లేటెస్ట్ ఫ్యన్ బకెట్ 87 చూశా రాత్రి.

1-6-17 గురువారం ఉదయం అప్పారావు గారు వస్తే మా అమ్మాయి మమ్మల్ని గుంటూరాయన ఇంటికి తీసుకు వెళ్ళింది. పుట్టపర్తి ఆయన తల్లికి జబ్బుగా ఉందని తెలిస్తే వెళ్లిపోయారని చెప్పాడు. కనీసం లోపలి రమ్మని లేదు. డిక్కీలో అంటే

గారేజ్ బయట కుర్చీలేసి కూచోపెట్టి తన సోది వాయించాడు. నాకు చిర్రెత్తుకొచ్చింది. ఒక్కమాట కూడా వినలేదు. పాపం అప్పారావు గారు బలయ్యారు. పావు గంట తర్వాత వెడదామని నేను ముందు బయల్దేరితే ఆయన కూడా వచ్చారు. ఎలా వెడతారు అని కూడా గుంటూరు పశువు-ల డాక్టర్ అడగలేదు. మా ఇంటికి దగ్గరే అయినా, మేమిద్దరం నడిచి దారి తప్పి దారిలో ఒక ఇల్లు రిపేర్ చేస్తున్న అమెరికన్ అతనిని రిక్వెస్ట్ చేస్తే చాలా సంతోషంగా కారులో తీసుకు వచ్చి ఇంటి దగ్గర దింపాడు. ఎంతో కృతజ్ఞత చెప్పుకున్నాం. ఇద్దరం చెమటలు కార్చాం. మా అమ్మాయి అప్పారావుగార్ని వాళ్ళ అమ్మాయి గారింట్లో దింపి వచ్చింది. సాయంత్రం గుంటూరు మరో అడ్డాడ దగ్గరాయన్ను వెంటేసుకొని వాకింగ్‌లో మా ఇంటికి వచ్చి వెళ్ళాడు. పొడి పొడిగా మాట్లాడి పంపేశాను. సూరి 49, అఘోరీ 2, థియేటర్ 2 రాశా.

## ఎల్ బి శ్రీరామ్ ఇంటర్వ్యూ

రాత్రి యు ట్యూబ్‌లో నాటక రచయితా డైరెక్టర్ అనేక అవార్డుల విన్నర్ సినీ డైలాగ్ రచయిత 400 సినిమాల హాస్య, కేరక్టర్ నటుడు ఎల్ బి శ్రీరామ్ ఇంటర్వ్యూ చూశా. అద్భుత అనిపించింది. 7 గురు అన్నదమ్ములలో 6వ వాడు శ్రీరామ్. పెద్దన్న మిగిలినవాళ్ళల్లో ఒక్కొక్కరిని హైదరాబాద్ తీసుకువెళ్లి చదివించి ప్రయోజకులను చేశాడని, తానూ 22 ఏళ్ళు నాటక రచయితగా, ప్రొడ్యూసర్‌గా, డైరెక్టర్‌గా మంచి పేరు పొందానని తమ నాటకాలు ఏ పోటీకి వెళ్లినా బహుమతి రాకుండా ఉండలేదని, తనకు తనికెళ్ళ భరణి నాటకాలకు విపరీతమైన పోటీ అని తమకు ఫస్ట్ ప్రయిజ్ వస్తే అతని సంస్థకు సెకండ్ లేకపోతే అటూ ఇటూ మారేవి. కాని మధ్యలో ఏ ఒక్క సంస్థకూ మొదటి లేక రెండు బహుమతులు వచ్చేవికావని చెప్పాడు. నాటక రంగంలో తన గురువు శ్రీ దేశిరాజు హనుమంతరావు గారని తమ కుటుంబ సభ్యులందరూ నటులవటం వలన తమ కుటుంబాన్ని "మినీ సురభి" కుటుంబం అనేవారని ఆత ను చెబుతుంటే కన్ను ఆర్పకుండా అతన్నీ చూడాలనిపించింది. ఆ కళ్ళల్లో స్వచ్ఛత నిజాయితీ నిర్భీకత ఆ ముఖంలో వర్చస్సు నన్ను బాగా ఆకర్షించాయి.

నాటక రంగం ఆకర్షణ తగ్గిపోగా శ్రీరామ్ తమ్ముడు అన్నకున్న తపన జ్వాల ఆగి పోకూడదని ప్రోత్సహించి మద్రాస్ పంపి ఖర్చులన్నీ తానే పెట్టుకొని ఆ తర్వాత కుటుంబాన్ని అక్కడికి చేర్చి, ఆఖర్చులూ తానే రెండేళ్లు భరించి నిలదొక్కు కొనేట్లు చేశాడని, ఆశపెట్టుకున్న కోట శ్రీనివాసరావు ఏ సహాయమూ చేయలేదని ఉద్యోగి నటుడు విద్యాసాగర్ తనను ఆదరించి ప్రోత్సహించి దారి చూపాడని ఇలా తన పెద్దన్న తన తమ్ముడు నిస్వార్ధంగా ఆలోచించబట్టి వాళ్ళేమీ పెద్ద ఉద్యోగస్తుడ్ని కాకపోయినా

కుటుంబాలను ఆదుకొని పైకి తెచ్చినవారని ఎంతో కృతజ్ఞతగా చెప్పాడు. ఈ వి.వి. సత్యనారాయణ వి.వి. వినాయక్ తనను సినిమాలలో ఉన్నత స్థితికి తెచ్చారని డైలాగ్ రైటర్‌గానే సినీ అరంగేట్రం చేశానని దానికోసమే వచ్చానని భగవంతుని దయవల్ల సాధ్యమై తన రచనాశక్తి చూపగలిగానని ఎవరికిందా "ఘోస్ట్ రచయిత"గా పని చేయలేదని, తర్వాత నటించటం ప్రారంభించి అందులోనూ వెరైటీ డైలాగ్ డెలివరీ పండించానని చెప్పాడు.

## మిథునం కిరికిరి

నాకు తెలియని ఇంకో విషయం కూడా ఎల్బీ చెప్పాడు –హాస్యరచయిత శ్రీరమణ రాసిన మిథునం కథను తనికెళ్ళ భరణి డైరెక్ట్ చేసిన సినిమాలో మొదట అందులోని ముసలాయన పాత్రకు తననే భరణి ఎంపిక చేశాడని, నువ్వే చేయమని శ్రీరామ్ అంటే కాదు నువ్వు చేస్తేనే ఆ పాత్ర పండుతుంది అని నిర్మొహమాటంగా చెప్పాడని, స్క్రీన్ ప్లే కూడా తనతోనే రాయించాడని, లక్ష వత్తులు వెలిగించే సీనులో వాళ్ళందరూ అన్ని వత్తులు ఒక దానిలోనే పెట్టి వెలిగిద్దామని అంటే అలా బాగుండదు విడిగా ప్రమిదల్లో పెట్టి వెలిగిస్తే శోభ వస్తుందని కన్విన్స్ చేసి మార్పించానని, అందులో తనపాత్ర తనభార్య చనిపోయే ముందు "పాహి పాహి పాహి" అనే వేదపనస ఘన పనసలో చదువుతుందని, దాన్ని సుస్వరంగా ఉచ్చరించటానికి తాను హైదరాబాద్ ఏ ఎస్ రావు నగర్‌లో ఉన్న తన తండ్రిగారి శిష్యుడైన ఘనాపాటీ వద్ద నెల రోజులు నేర్చుకున్నానని, సినిమాలో ఆ పాత్ర ఆంగ్లంలో కూడా మాట్లాడుతుందని అందుకని అందులోనూ ఏ దోషాలూ లేకుండా ఉండాటానికి ఉస్మానియా యూనివర్సిటీ ఇంగ్లిష్ ప్రొఫెసర్ వద్ద నెల రోజులు శిక్షణ పొందానని, సినిమాను వాళ్ళు వేసవిలో తీద్దామని ప్లాను వేస్తే ఆ కథకు సరైన వాతావరణం కావాలంటే వింటర్లో ప్రకృతి మధ్య తీయాలని సూచించానని సరే అంటూనే కాలయాపన చేశారని, తాను మిథునంపై ముఖ్యపాత్ర కోసం ఒక్క ఏడాది విపరీతంగా కష్టపడ్డానని చెప్పాడు. తనకు జోడీ అయిన హీరోయిన్ కోసం వెదకటంలో కాలం గడిచి పోయిందని, రెండుసార్లు నిర్మాతలు మారిపోవుటటం, లక్ష్మిని లేడీ కేరక్టర్‌గా ఎన్నిక చేయటం జరిగిందని, భరణికి మాత్రం పురుషపాత్ర నేను చేస్తేనే బాగుంటుంది అని ఉన్నా ప్రొడ్యూసర్ల ఒత్తిడికి లక్ష్మికి తాను తగనని భావించి బాలును పెట్టుకొన్నారని ఇది తన జీవితంలో అత్యంత చేదు ఘటన అని చెప్పాడు. తనకు అడ్వాంసుగా చాలా పెద్ద మొత్తమే ముందుగానే ఇచ్చారని దాన్ని మొత్తం తిరిగి ఇచ్చేసి చేతులు దులుపుకొని బయటికి వచ్చేశానని చెప్పాడు. ఇందులో శ్రీరామ్ నిజాయితీ ఆ కథ పట్ల ఉన్న తపన అర్ధమయింది. ఎవరిపైనా ఆయన నెపం వేయకపోవటం నన్ను ఆశ్చర్యపరచింది. నేను మిథునం సినిమాపై రివ్యూ రాసిన సంగతి మీకు గుర్తుండే

ఉంటుంది. బాలు ఆ పాత్రలో ఒక "బండ ఆరవాయన"లాగా ఉన్నాడుకాని శ్రీరమణ సృష్టించిన తెలుగాయన లాగా లేడన్నాను. శ్రీరామ్ వేసి ఉంటే ఆ పాత్ర నూటికి వెయ్యి శాతం తెలుగుదనం తెలుగు తేజం ఉట్టిపడేది. బాలు, లక్ష్మిలు "అరవ మొగుడు అచ్చతెలుగు పెళ్లాలు"గా ఉన్నారు. ఈ మనోబాధతో గాయపడిన హృదయంతో తాను మిథునం సినిమా ఇప్పటి వరకు చూడనే లేదని చూసి అవతలి వారిపై ఈర్ష్య ద్వేష అసూయలు పెంచుకోవటం తనకు నచ్చని పని కనుక చూడలేదని నిజాయితీగా చెప్పాడు. మిథునం సినిమాలో ఇంతమలుపు ఉన్నదని మొదటిసారిగా ఎల్బీ ఇంటర్వ్యూ వల్లనే నాకు తెలిసింది. అందుకే ఇంత తపన పడి రాశా.

2-6-17 గురువారం మధ్యాహ్నం టివి నటుడు వినోద్ బాల ఇంటర్వ్యూ చూశా. అతనిది మరీ వింత పరిస్థితి. బుల్లి తెరకు ఒక వెలుగు తెచ్చినవాడు. రామ్‌గోపాల్ వర్మ హేండిచ్చాడని చెప్పాడు. నాకు ఇతని నటన బాగా ఇష్టం. మైనేనిగారు పంపిన నీల్ డి గ్రాసీ రచన "ఆస్ట్రో ఫిజిక్స్ ఫర్ పీపుల్ ఇన్ ఏ హర్రీ" పుస్తకం చేరింది. చదవటం మొదలుపెట్టా బాగుంది. గబ్బిట మాణిక్య శాస్త్రికి పూరీలోని జగన్నాథ సంస్కృత విశ్వ విద్యాలయంలో అసోసియేట్ ప్రొఫెసర్ నుంచి ప్రొఫెసర్ అండ్ హెడ్ ఆఫ్ ది డిపార్ట్‌మెంట్‌గా ప్రమోషన్ వచ్చినట్లు మెయిల్ రాస్తే సంతోషించి ఆశీర్వదించా. శుక్రవారం సూరి 50 థియేటర్ 3 రాశా. మా మనవడు చి॥ భువన్ సెంట్రల్ సిలబస్ టెన్త్ క్లాస్ పరీక్షలో 9..4 /10 మార్కులతో పాసయ్యాడని తెలిసింది. వీడి అన్న సంకల్ప్‌కు అమెరికాలో 4-6-18 వరకు ఉండి పని చేయటానికి వర్క్ పర్మిట్ వచ్చింది. కొంత టెన్షన్ తగ్గింది. కాలిఫోర్నియాలోని మా మేనల్లుడు శాస్త్రి "లఘు పూజా విధానం" పంపమంటే పంపాను.

## రుద్రాభిషేకం

3-6-17 శనివారం ఉదయం ఆస్ట్రో ఫిజిక్స్ కొంత చదివా. సాయంత్రం 4-30కి శ్రీ హరి గారు వచ్చి కారులో మా ఇద్దర్ని వాళ్ళ ఇంటికి రుద్రాభిషేకానికి తీసుకు వెళ్లారు. పూజ మొదలు పెట్టేసరికి 5.30 అయింది. గణపతి అష్టోత్తర పూజ చేయించి భవానీ శంకరదేవుల ఆవాహన అష్టోత్తర పూజ చేయించి లఘున్యాసం చదివి 11సార్లు రుద్రాభిషేకం శ్రీహరి శ్రీమతి విజయ దంపతుల చేత ప్రారంభించాను. మా అల్లుడు అవధాని వద్ద దాదాపు ఏడాది కాలం ఇంటి వద్ద వేదం నేర్చుకున్న 6 గురు నమక చమకాలు చక్కని స్వరంతో సామూహికంగా పలికి నిండుదనం తెచ్చారు. పండ్ల రసం, పాలు, తేనే, చక్కర, కొబ్బరి నీళ్లతో ఘనంగా అభిషేకం జరిగింది. నేను కూడా నా స్ఫటిక లింగాన్ని విష్ణుపాదాలను సాలగ్రామాలు ఆంజనేయస్వామి విగ్రహాన్ని శ్రీచక్రాన్ని పూజలో పెట్టి అభిషేకం వీటికీ చేయించాను. వచ్చినవారంరి చేత అభిషేకం చేయించారు.

అభిషేకజలాన్ని వేరే పాత్రలో తీయించి అన్నిటినీ కడిగించి అష్టోత్తర శతనామాలు లలిత అష్టోత్తరం చేయించి నైవేద్యం హారతి మంత్రం పుష్పం ఉద్వాసనలతో కార్యక్రమాన్ని రాత్రి 9 గంటలకు ముగించాము. తర్వాత ఒక అరగంట భజన చేశారు. ఆ పిమ్మట భోజనాలు. సుమారు 80 మందిదాకా వచ్చారు. చపాతి, పూరీకూరా, ఇడ్లీలు, స్వీటు, వెజ్ బిర్యాని, పప్పు, కూర, వాంగీ బాత్, సాంబారు, మాంగో ఐస్ క్రీమ్. నాకు పెద్దగా తినాలనిపించక తినలేక పోయాను. అందరు భోజనాలు చేసేసరికి రాత్రి 10.30 అయింది. నేను సాయంకాలం వాళ్ళ ఇంటికి వెళ్ళగానే శ్రీ సువర్చలేశ్వర శతకం హరిగారికి అందజేశాను.

కార్యక్రమం అవగానే చాలామంది "అంకుల్ చాలా బాగా చేయించారు" అని అన్నారు. చిరునవ్వే నా సమాధానం. నా స్పీడ్‌కు కుర్రకారు ఆశ్చర్యపోయారు. నాకు శ్రీహరి దంపతులు "ఘనమైన తాంబూలం" ఇచ్చి వాళ్ళబ్బాయితో సహా మా ఇద్దరికీ పాదాభి వందనం చేసి ఆశీస్సులు అందుకొన్నారు. కొందరు దగ్గరకొచ్చి నమస్కారాలు పెట్టి వెళ్లారు. హరి దంపతులు చాలా ఆనందించారు. సంతృప్తి చెందారు. అదే కావలసింది. వారి శ్రద్ధ భక్తులే దీనికి కారణం. పవన్ కారులో మేమందరం బయల్దేరి అప్పారావుగారిని వారింటివద్ద డ్రాప్ చేసి మమ్మల్ని మా ఇంటిదగ్గర దింపి పవన్ "పుష్పక విమానం" తన ఇంటికి తన కుటుంబంతో చేరింది. రాత్రి 11 దాటింది. అప్పారావుగారు మా పెద్ద మేనల్లుడు అశోక్‌తోపాటు సిద్ధిపేట స్టేట్‌బాంక్‌లో పనిచేసినట్లు ఈ రోజే ఆయన, పవన్ మాట్లాడుకొంటుంటే తెలిసింది. తెల్లవారుజామున 3.30కే మెలకువ వస్తే లేచి మైనేనిగారి మెయిల్స్‌కు సమాధానం రాసి యు ట్యూబ్‌లో సూర్య స్తుతి పెట్టుకొని మాగన్నుగా వింటూ నిద్రలోకి జారుకున్నాను.

4-6-17 ఆదివారం- మల్లినాథ 52 రాశా. రాత్రి కొద్దిగా వర్షం పడింది. ఉదయం బాగానే ఎండ వచ్చింది. వీక్లీ -9 సాయంత్రం రాశా.

(4-6-17- కాంప్-షార్లెట్-అమెరికా)

## వీక్లీ అమెరికా-10 (5-6-17 నుండి 11-6-17 వరకు)

### మనవడి ఉద్యోగ వారం

5-6-17 సోమవారం- దాదాపు 7 నెలల క్రితం నెట్‌లో రాయటం మొదలు పెట్టిన "వ్యాఖ్యాన చక్రవర్తి మల్లినాథ సూరి"ని ఇవాళ 54వ ఎపిసోడ్‌తో పూర్తి చేసి హాయిగా ఊపిరి పీల్చుకున్నాను. మైనేనిగారు ఆదరంతో పంపిన "తానా" ప్రత్యేక సంచిక అందింది. చాలా "రిచ్"గా ఉందనిపించింది. తీరికగా చదవాలి. రాత్రి "గొట్టం"లో మళ్లీ మళ్ళీ ఇది రాని రోజు సినిమా చూసాం. శర్వానంద్, నిత్యామీనన్

నటించారు. "బుర్రా" కుర్రాడి బుర్ర బాగా పనిచేసి మంచి డైలాగులు రాశాడు. నీట్‌గా ఆదర్శంగా ఉంది. మంగళవారం "కారీ"లో ఉంటున్న మా అన్నయ్యగారి మనవడు హరి ఫోన్ చేసి సోమవారం వాళ్ళావిడకు సిజేరియన్ జరిగి రెండవ మగపిల్లాడు పుట్టాడని చెప్పాడు. మూడువారాల ముందే పిల్లాడు పుట్టాడు. తల్లీ పిల్లాడు కులాసాగా ఉన్నారు. "గీర్వాణ కవుల కవితా గీర్వాణం-3"లో 100 మంది కంటే ఎక్కువ మంది దొరకరేమో అనుకున్నాను. కానీ ఇవాల్టికి 148 మంది గురించి రాయగలిగాను. అంటే కొంత ధైర్యమొచ్చింది. "వుమెన్ సెయింట్స్ ఆఫ్ ఈస్ట్ అండ్ వెస్ట్" సగం చదివాను. ట్యూబ్‌లో "గుండె జారి గల్లంతైంది" సినిమా ఫన్ బకెట్ చూసాం.

బుధవారం- పది రోజులుగా ఫోన్‌లో ఇంటర్వ్యూలు చేస్తున్న మా మనవడు చి॥ సంకల్ప్‌కు చికాగో కంపెనీ వాళ్ళు ఫోన్ చేసి సెలెక్ట్ చేసినట్లు చెప్పి ఒక అరగంటలోనే అపాయింట్మెంట్ ఆర్డర్ మెయిల్ చేశారు. అందరం చాలా ఆనందించాం. రాత్రి శ్రీకాంత్ నటించిన "మల్లిగాడు మ్యారేజ్ బ్యూరో" యు ట్యూబ్‌లో చూసాం సరదాగా ఉంది.

గురువారం గీర్వాణం-3లో 169 వరకు రాశా. సాయంత్రం శ్రీమతి వీటూరి పద్మజ, శ్రీమతి గోసుకోండ అరుణలు వచ్చారు. పద్మజ వాళ్ళు పై శుక్రవారం మద్రాస్ వెళ్లి పోతున్నారట. మా శ్రీ సువర్చలాన్జనేయ స్వామి పూజాదికాలు కొంత డబ్బు ఇచ్చింది. ఇద్దరికి "మా అన్నయ్య" పుస్తకాలు ఇచ్చాము. అందరం కలిసి ఫోటోలు తీసుకొన్నాం. శుక్రవారం- సంకల్ప్ ఆదివారం ఉదయం చికాగో ప్రయాణానికి ఫ్లయిట్ టికెట్, కావాల్సిన సామాను కొని రెడీ అయ్యాడు. గీర్వాణం 188 వరకు రాశాను. శనివారం గీర్వాణం-3లో 200 కవుల గురించి రాసి చాలా ఆనందించా. తవ్వేన కొద్దీ దొరుకుతున్నారు. ఎప్పటికప్పుడు ఖాళీ అనుకొంటుంటే ఇంకా ఊరుతూ నన్నూ ఊరిస్తున్నారు నా అదృష్టం. నాలుగు ఆమ్నాయ పీఠాల జగద్గురువులలో గీర్వాణ రచనలు చేసిన వారందరి గురించీ రాసి, వేద కాల స్త్రీలు, మహర్షుల గురించి, వారి రచనల గురించి రాశాను. కొంత వరకు ఆత్మ సంతృప్తి కలిగింది. ఆస్ట్రో ఫిజిక్స్ కొన్ని చాప్టర్లు చదివాను. చాలా ఇంటరెస్టింగ్‌గా ఉంది దీనిపై కొన్ని ఆరికల్స్ రాయాలనిపిస్తోంది. 52 ఏళ్ళ క్రిందటి శిష్యురాలు శ్రీమతి కరుణానిధికి ఫోన్ చేశాను. తాము ఉయ్యూరులో ఉన్నామని తన తల్లిగారు చనిపోయి 9 రోజులయింది చెప్పింది. సానుభూతి తెలియజేశాను.

11-6-17 ఆదివారం -ఉదయం 9 గంటలకు కారులో సంకల్ప్‌ను నేనూ, విజ్జి, పీయూష్ ఎయిర్ పోర్ట్‌కు తీసుకు వెళ్లి చికాగో ఫ్లయిట్ ఎక్కించి వచ్చాము. మధ్యాహ్నం 2 గంటలకు చికాగో చేరినట్లు తెలియ జేశాడు. గీర్వాణం-3లో 204

వరకు రాశా.

(11-6-17-కాంప్-షార్లెట్-అమెరికా)

**వీక్లీ అమెరికా -11** (12-6-17 నుండి 18-6-17) వరకు

## షష్టి పూర్తి మహోత్సవ వారం

12-6-17 సోమవారం -జ్ఞానపీఠ పురస్కార గ్రహీత, నిత్య కవితా కృషీవలుడు డా. సి. నారాయణ రెడ్డిగారు 86వ ఏట మరణించటం సాహిత్య సంగీతాభిమానులను అశనిపాతం లాంటి వార్త. జీవితంలో అన్ని సోపానాలు అధిరోహించిన సార్ధక జీవి. మంగళవారం యు ట్యూబ్‌లో తెలుగు పాప్యులర్ టి విలో బుల్లితెర నటుడు దాన్ని తీర్చిదిద్దిన ఘనుడు, ముద్దమందారం సినిమాతో చలన చిత్ర అరంగేట్రం చేసిన ప్రసిద్ధ నాటక రేడియ సినీ నటుడు స్వర్గీయ విన్నకోట రామన్న పంతులుగారి మనవడు ప్రదీప్, భార్య సరస్వతిల ఇంటర్వ్యూ చూసాం. వారిద్దరూ చేస్తున్న కృషి అద్వితీయమని పించింది. ఆస్ట్రో ఫిజిక్స్ చదవటం నత్త నడకలా ఉంది. సాయంత్రం మైనేనిగారు ఫోన్ చేసి డా. ఎల్లాప్రగడ రామమోహనరావు గారి బావగారు డా. భండారు రాధాకృష్ణమూర్తి గారి ఫోన్ నంబర్ ఇస్తే మూర్తిగారితో మాట్లాడాను. వారు ఎంతో అభిమానంగా మాట్లాడారు. నా రచనలన్నీ రావుగారి ద్వారా చదివానని సంతోషం తెలియబరచారు. బుధవారం గీర్వాణం-3ను 225 వరకు రాశాను. రాత్రి "గొట్టం"లో హాస్య నటుడు శివారెడ్డి, ఇమిటేషన్ రాజుల ఇంటర్వ్యూలు చూసాం బాగున్నాయి.

## పవన్ ఇంట్లో "అలనాటి గ్రామీణ వైభవం"

పవన్ పెద్ద కుమార్తె పెద్దమనిషయినందున శుద్ధి రోజు గురువారం నన్ను విఘ్నేశ్వర పూజ, పుణ్యాహవాచనం చేయాలని కోరాడు. ఉదయం 11 గంటలకు మొదలు పెట్టి 12.30కు పవన్ దంపతులతో పూర్తి చేయించాను. మా అందరికి వాళ్లింట్లోనే భోజనం. దోసకాయ పప్పు వంకాయ కూర బెండకాయ కూర, అట్లు, టమేటా పచ్చడి పపూర్ణం బూరెలు, పులిహోర, సాంబారు పెరుగు మామిడిపండు ముక్కలు కమ్మని భోజనం చేశాము. మా ఇద్దరికీ నూతన వస్త్రాలు అందజేసి "ఘనమైన తాంబూల"మిచ్చారు. సాయంత్రం గీర్వాణం 230 వరకు రాశాను. రాత్రి వర్షం వచ్చే హడావిడేకాని రాలేదు.

శనివారం మధ్యాహ్నం పవన్ వాళ్ళ ఇంట్లో "బంతి భోజనం" మా కుటుంబం, ఉషా -రాంకీ, బులుసు కుటుంబాలు, పవన్ తమ్ముడు భార్య పిల్లలు, పవన్ భార్య రాధ మేనమామ కొడుకు కుటుంబం భోజనాలలో పాల్గొన్నాం. చి॥ ప్రణీతకు హారతి ఇచ్చి, అందరి చేత ఆశీస్సులు అందజేయించి మా అల్లుడిచేత వేదాశీస్సులు ఇప్పించాడు

పవన్. ఉదయం రాంకీతో అభిషేకం చేయించాడు. మంగళహారతి ఆడవాళ్ళ పాటలు చాలా సందడిగా హడావిడిగా అమెరికాలో తెలుగింటి లోగిలి లా పవన్ ఇల్లు కళకళ లాడింది.

దీనికి మించి పవన్ తీసుకున్న శ్రద్ధ, సంప్రదాయం ఆచరణ మరింత వన్నెకు తెచ్చింది మరొకటి ఉంది. 50 ఏళ్లకు పూర్వం తెలుగు గ్రామసీమలలో చక్కగా అందరూ కింద కూర్చుని అరిటాకులలో హాయిగా భోజనం చేసే "పంక్తి భోజనం" పద్ధతిని "బంతి నాడు" పవన్ ఏర్పాటు చేశాడు. అందరిని హాయిగా కింద కూర్చునే సౌకర్యం కలిగించి కష్టపడి అరటి ఆకులు కొని వాటిలో భోజనం చేయించే ఏర్పాటు చేశాడు. దీనికి అతనిని మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను. భార్య రాధ కూడా అతనికి సరైన చేదోడు. ఇద్దరికీ కృషి దీని విజయం వెనుక ఉంది. ఒక మినీ "అగ్రహారపు" వేడుకలా జరిగింది. నేను దీన్ని అందరికి "పవన్ చిరివాడ అగ్రహారాన్ని తన అమెరికా ఇంట్లో చూపించాడు" అన్నాను. అందరు చాలా ఉప్పొంగిపోయారు. అందరికి అభినందనలు. కేరింతలు నవ్వులు, ముచ్చట్లు కొసరి కొసరి వడ్డించటాలు పదార్థాలపై చక్కని కామెంట్లుతో వాతావరం పరామ రామణీయకంగా జరిగింది. మా శ్రీమతి ప్రణీత కోసం కుట్టిన పూలజడ ఆ అమ్మాయికి అలంకరించి ఆడపిల్లలు ముత్తైదువులు ఆనంద పరవశులయ్యారు. దీనికి మించి వడ్డించిన పదార్థాలు మరీ రుచికరంగా ఉన్నాయి.

మామిడికాయ పప్పు, వంకాయ కూర, దొండకాయ కూర, ఆలూ వేపుడు, కొబ్బరి చట్నీ, మైసూర్ పాకం, పరవాన్నం అట్లు, పులిహోర, అప్పడాల పిండి, ఊరమిరపకాయ అప్పడాలు సాంబారు పెరుగు మామిడిపండు ముక్కలు, ఐస్క్రీమ్‌లతో అందరం కడుపునిండా తిన్నాం. అన్నీ రుచికరంగా ఉన్నాయి. ఏ ఒక్క దానికీ వంక పెట్టే వీలులేదు. పవన్ వాళ్ళ ఇంట్లో ఎప్పుడు పిలిచినా చక్కని ఆతిధ్యం మర్యాదా, మన్నన లభిస్తాయి. ఆ దంపతుల "రూటే సెపరేటు". ఈ రోజు రాధ ఉషాల పుట్టిన రోజు కూడా కావటం విశేషం అన్నాల దగ్గరే బర్త్ డే కేక్ కట్ చేయించి పాట పాడి వేడుక నిర్వహించటం మరింత శోభనిచ్చింది. ఇంత సరదాగా ఇంతమంది వచ్చి నిండుమనసుతో ప్రవర్తించటం చాలా గొప్ప విషయం అందరూ అభినందనీయులే. పవన్ ఇంట్లో పెళ్లి వేడుక ముందే వచ్చినంత శోభ కనిపించింది. ఈ ఫోటోలన్నీ పవన్ గూగుల్ ఫోటోలులో పంపాడు కావాల్సివస్తే చూడచ్చు.

శనివారం సాయంత్రం మా అల్లుడు, మనవళ్లు అశుతోష్, పీయూష్‌లు ఫ్లయిట్‌లో కాలిఫోర్నియా వెళ్లారు ఒక వారం గడిపి వస్తారు.

## కొలంబియాలో 15 నిమిషాలు

మా అల్లుడి మేనమామ కొడుకు చైతు అనే చైతన్య హైదరాబాద్ నుంచి, మా మనవడు సంకల్ప్‌తోపాటు షార్లెట్ వచ్చి కొలంబియా యునివర్సిటీలో ఎం.ఎస్ చదివి పాసై అట్లాంటాలో ఉద్యోగం పొందాడు. అక్కడ చేరే లోపు ఇక్కడి మావాళ్లను చూడటానికి గురువారం వచ్చాడు. అతను సోమవారం ఉదయం ఫ్లయిట్‌లో కొలంబియా నుంచి అట్లాంటా వెళ్లి ఆఫీస్‌లో చేరాలి. అందుకని మా అమ్మాయి అతన్ని అట్లాంటాలో కారులో దిగబెట్టి రావటానికి వెడుతూ ఉంటే మేమిద్దరం కూడా సరదాగా మరో కొత్త ప్రదేశం చూడచ్చునని మేమూ వెళ్లాం. కొలంబియా సౌత్ కరోలినా రాజధాని ఇక్కడినుంచి కారులో వెళ్ళటానికి గంటన్నర పడుతుంది. కొలంబియాలోని బిజినెస్ స్కూల్ అమెరికాలోనే చాలా ప్రసిద్ధి చెందింది. మేము శనివారం రాత్రి 7.30కు బయల్దేరి 9 గంటలకు కొలంబియా చేరి యూనివర్సిటీకి దగ్గరలో చైతు ఉంటున్న అపార్ట్‌మెంట్‌లో దింపి ఒక పావు గంట మాత్రమే ఉండి రాత్రి 9.15కు మళ్ళీ బయల్దేరి రాత్రి 10.45కు షార్లెట్ చేరాం. ఇదో సరదా అనుభవం.

## మా గురు వరేణ్యులు శ్రీ మహంకాళి సుబ్బరామయ్య గారి కుటుంబ సభ్యులతో పరిచయం

ఎవరు ఎప్పుడు ఎక్కడ ఎలా కలుస్తారో తెలియదు. మా అమ్మాయికి పరిచయం ఉన్న డాక్టర్ ఉపాధ్యాయుల శ్రావ్య గారింట్లో వాళ్ళ అమ్మా నాన్నలకు షష్టి పూర్తి మహోత్సవం 18-6-17 ఆదివారం "ఫాదర్స్ డే" నాడు జరుపుతున్నామని శనివారం దంపతులకు పూజ ఉంటుందని, మా దంపతులను తీసుకొని తప్పనిసరిగా రావాలని కోరారు, ఆమె భర్త కూడా డాక్టర్. ఆయన మా పెద్ద తోడల్లుడు ఖమ్మంలో ఉంటున్న శ్రీ శంభుని శ్రీరామ చంద్రమూర్తిగారి పెద్దబ్బాయి రవికి క్లాస్‌మేట్. అందుకని కొలంబియా వెళ్లేముందు వాళ్ళ ఇంటికి వెళ్లాం. దంపతుల పూజ ఆదివారం ఉదయం 11 గంటలకు మార్చామని లక్ష వత్తుల నోము శ్రావ్య అమ్మా నాన్న గార్లు చేసుకొంటున్నారని చూసి, భోజనం చేసి వెళ్ళమన్నారు. అక్కడ డా. శ్రావ్య గారి అమ్మమ్మగారు మా అమ్మాయికి పరిచయమై ఉయ్యూరు వాళ్లమని తెలిసి ఆప్యాయంగా మమ్మల్ని పలకరించటానికి వచ్చారు. మాటలలో ఆవిడ ఉయ్యూరు హైస్కూల్‌లో నాకు 8వ తరగతిలో తెలుగు చెప్పిన సెకండరీ గ్రేడ్ టీచర్, ఆ తర్వాత 1967లో నేను సైన్స్ టీచర్‌గా అక్కడ పని చేస్తున్నప్పుడు నా సహా ఉపాధ్యాయులు, వారి అమ్మాయిలూ అబ్బాయిలు నా దగ్గర చదువుకొన్న గురువుగారు స్వర్గీయ మహంకాళి సుబ్బరామయ్య గారి తమ్ముడి భార్య. ఆయన తణుకు పాలిటెక్నిక్‌లో లెక్చరర్‌గా చేసి చనిపోయారు. ఆయన్ను ఉయ్యూరులో మా గురువుగారింట్లో చూశాను ఒకసారి. అంతేకాదు, ఆవిడ

మరొక కూతురు ఉయ్యూరులో ఫ్యాక్టరీలో పనిచేసిన స్వర్గీయ దంటు శర్మగారి పెద్ద కోడలు అని విషయాలు తెలిసి చాలా సంతోషమేసింది. మళ్ళీ మా గురువుగారిని చూసినంత ఆనందం కలిగింది ఆవిడతో మాట్లాడుతుంటే. రేపు వస్తామని చెప్పి కొలంబియా వెళ్లాం.

డా. శ్రావ్య గారి తలిదండ్రులు శుక్రవారం సత్యనారాయణ వ్రతం శనివారం లక్ష వత్తుల నోము మూడురోజులూ యధా ప్రకారం హోమాలు దానాలు స్నానాలుతో ఆదివారం అవబృధస్నానం పూర్ణాహుతి తర్వాత దంపతులకు పూజ నిర్వహించారు. అన్నీ శ్రావ్యగారే దగ్గరుండి చూస్తున్నారు. మా ఇద్దరు తోపాటు మరో దంపతులకు పూజచేసి నూతన వస్త్రాలు ఇచ్చి ఆశీర్వచనం పొందారు. వారిద్దరికీ మేమిద్దరం కొత్త బట్టలు పెట్టాము. వారు "మీరు రావటమే మా అదృష్టం మళ్ళీ బట్టలు కూడానా?" అంటే "అమెరికాలో శాస్త్రోక్తంగా షష్ఠి పూర్తి జరుపుకొంటున్నందుకు అభినందనగా అందజేస్తున్నాము" అన్నాను. ఆయన చాలా సరదాగా మాట్లాడారు. వారిది తణుకు. మా బావమరిది ఆనంద్ వియ్యంకుడు విజయబాంక్ ఆఫీసర్ జి.ఎల్.మూర్తిగారు తెలుసా అని అడిగితే చాలా బాగా తెలుసు" అన్నారు. ఈయన భార్య చెల్లెలే దంటు శర్మగారి పెద్ద కోడలు. దంటు వారి బంధుత్వం పరిచయాలు గుర్తు చేసుకున్నాం వాళ్ళతో. దంటు వారబ్బాయి సుబ్రహ్మణ్యం మా పిల్లలకు క్లాస్‌మేట్. డా. శ్రావ్య గారి అమ్మమ్మ గారికి అంటే మా గురువుగారు సుబ్బరామయ్య గారి మారదలుగారికి సరసభారతి పుస్తకం "దైవ చిత్తం" ఇచ్చాను. ఆవిడ చాలా సంతోషించారు. దంటువారి కోడలు తమ అత్తగారికి ఫోన్ చేసి మేము వచ్చిన సంగతి చెబుతామని సంతోషంగా చెప్పారు. ఇలా తీగ లాగకుండానే డొంకంతా కదిలింది. ఉదయం 11 గంటలకు మమ్మల్ని ఇక్కడ దించి మా అమ్మాయి వేరే ఫన్‌క్షన్‌కు వెళ్ళింది. ఈ విధంగా మన ఆంధ్రులు అమెరికాలో తమ దేశ సంస్కృతీ సంప్రదాయాలను ఘనంగా పాటించి ఆదర్శంగా నిలిచారు అభినందనలు.

## కీ.శే.వెంట్రప్రగడ బ్రహ్మానందం కూతురు రజనితో పరిచయం

డా. శ్రావ్య గారింట్లో ఉండగానే ఒకమ్మాయి నా దగ్గరకొచ్చి "అంకుల్ మీరు దుర్గా ప్రసాద్ గారు కదా" అన్నది నేనెప్పుడూ చూడని ముఖమనిపించి ఆశ్చర్యంగా ఉంటే తాను ఉయ్యూరులో మా ఇంటికి ముందు ఉండే బ్రహ్మానందం కూతురు రజని అని చెప్పింది. మరింత ఆశ్చర్యమేసింది. ఆ అమ్మాయివాళ్లూ షార్లెట్‌లోనే మా అమ్మాయి వాళ్ళ ఇంటికి వెనక వైపు ఉంటారట. భోజనాలు అయ్యాక మా అమ్మాయికి ఫోన్ చేసి తాను రావటం ఆలస్యమౌతుందని చెబితే రజని భర్త పిల్లాడు మమ్మల్ని వాళ్ళ కారులో మా ఇంటి దగ్గర దించారు. ఇదొక అనుభవం.

భోజనాలలో బొబ్బట్లు పులిహోర, వడ, ఆవడ, మామిడికాయ పప్పు, గుత్తి వంకాయ కూరా, కంద బచ్చలి కూర, పనసపొట్టు కూర, చట్నీ, సాంబారు పెరుగు కిళ్లీ. పెద్దగా తినాలనిపించక బొబ్బట్లు మాత్రమే తిని మిగిలినవి తిన్నాననిపించాను. ఇలా ఈ వారం మూడు భోజనాలు రెండు ఫంక్షన్లుగా గడిచింది.

గీర్వాణం-3ను 242 వరకు రాశాను. ఆధునిక కాశ్మీర్ పండిట్ల సంస్కృత సేవ లోకానికి పెద్దగా తెలియదు. వారి గురించి రాస్తుంటే ఒళ్ళు పులకిస్తోంది. క్రికెట్ ఫైనల్‌లో ఇండియాను పాకిస్తాన్ ఓడించటం మన వాళ్లకు కొరుకుడు పడటం లేదు. మైనేనిగారు వాళ్ళ పెరడులో కాసిన కాయగూరల ఫోటోలు పెట్టి నోరూరించారు.

(18-6-17-కాంప్-షార్లెట్-అమెరికా)

## వీక్లీ అమెరికా-13 (19-6-17 నుంచి 25-6-17 వరకు)

## పూరీ జగన్నాథ రథోత్సవ, దువ్వాడ జగన్నాథ వారం

19-6-17 సోమవారం- మా మనవడు చి॥ సంకల్ప్ చికాగోలో ఉద్యోగంలో చేరాడు. రూమ్ మేట్లు కూడా తెలుగు వాళ్ళే దొరికారని చెప్పాడు సంతోషం. భారత రాష్ట్రపతి అభ్యర్థిగా మోడీ ఒక దళిత మేధావి, మాజీ బీహార్ గవర్నర్, ఉత్తరప్రదేశ్‌కు చెందిన శ్రీ రామ్‌నాథ్ కోవింద్‌ను యెన్.డి.ఏ బలపరచిన బిజెపి అభ్యర్థిగా, అందరి అంచనాలను తలక్రిందు చేసి నిలబెట్టాడు. కాంగ్రెస్ కూడా బీహార్‌కే చెందిన జగజ్జీవన్‌రామ్ కుమార్తె మాజీ లోక్‌సభ స్పీకర్ శ్రీమతి మీరాకుమార్‌ను పోటీగా నిలబెట్టింది. గీర్వాణం-3లో 250 దాకా కవుల గురించి రాశాను. మంగళవారం గీర్వాణం-3 అంకిత, స్పాన్సర్ ఆర్టికల్స్ రాశాను. శ్రీ చలపాక ప్రకాష్‌కు ఫోన్ చేసి ఆధునిక ప్రపంచ నిర్మాతలు డిటిపి ఎంతవరకు వచ్చిందో తెలుసుకొన్నా. రాష్ట్ర కార్యదర్శి అవటంతో ప్రతి ఆదివారం గుంటూరు వెళ్లాల్సి వస్తోందని తన రమ్యభారతి కూడా సమయానికి వెలువరించలేక పోతున్నామని తెలిపి మన పుస్తకాన్ని మరో రెండు వారాల్లో పూర్తి చేస్తానన్నారు. అది అవగానే శివ లక్ష్మికి పంపి తప్పులు దిద్దించి సరి చేశాక స్క్రిప్ట్‌లో మార్చి నెట్‌లో నాకు పంపితే నేను రెండవసారి చూసినట్లవుతుందని ఇండియా రాగానే మూడవసారి చూసి ప్రింట్‌కు ఇవ్వవచ్చునని అన్నాను. సరేనన్నారు. ఇది అవగానే గీర్వాణం-3 కూడా అంతా రెడీ చేసి ఫైల్ పంపిస్తానని అప్పుడు మొదలు పెట్టమని చెప్పాను. అలాగే అన్నారు.

ఇక్కడికి వచ్చాక రెండుసార్లు వసుధ గారికి మెయిల్ చేసి "వసుధైకం" ఎంత వరకు వచ్చిందని అడిగితే సమాధానం రాలేదు. ఆయనకూ తీరిక లేకపోవటం, వేసవి తీవ్రత వలన అడుగులు ముందుకు సాగలేదనిపిస్తోంది. రాత్రి అల్లరి నరేష్ "సీమ

టపాకాయ్ "గొట్టం"లో చూసాం బాగానే ఉంది. బుధవారం చరణ్, రమ్యలతో ఫోన్‌లో మాట్లాడాము. ఈ రోజు సాయంత్రం అడ్డాడ శిష్యురాలు అమెరికాలో ఉంటున్న శ్రీమతి కోడూరి పావని ఫోన్ చేసి మాట్లాడింది. తాము ఆగస్టు రెండవవారంలో కొలంబస్‌కు ఉద్యోగంలో చేరటానికి వెడుతున్నామని చెప్పింది. రాత్రి "ఇదేం పెళ్ళాం రా బాబోయ్" రాధికా, రాజేంద్ర ప్రసాద్ సినిమా ట్యూబ్‌లో చూసాం. సరదాగా ఉంది. మూడు రోజుల నుంచి వర్షాలు బాగానే పడుతున్నాయి. గురువారం శైవ వీరశైవ సంస్కృత కవుల వివరాలు దొరికితే రాసి 260కి చేర్చా.

## దువ్వాడ జగన్నాథం

23-6-17 శుక్రవారం మధ్యాహ్నం 2 గంటల మాటినీ షోలో "దువ్వాడ జగన్నాథం చూసాం. మా ముగ్గురు కాక మరొక 7 గురు మాత్రమే ఉన్నారు మొత్తం 10. ఉదయం ఆట వేయలేదట గురువారం రాత్రి ఆట ఆడారట. వర్కింగ్ డే కనుక జనం ఉండరు అంది మా అమ్మాయి. మా మనవడు శ్రీకేత్ మాతో రాకపోతే మా అమ్మాయి రాత్రి ఆటకు వాడిని తీసుకొనివెళ్ళి రెండోసారి చూసింది. ఆర్భాటం పెద్దగా బడ్జెట్‌లేని సాధారణ ఆంధ్ర బ్రాహ్మణ కుటుంబం కథ. వాడే దువ్వాడ జగన్నాథం. వాడు పరిత్రాణాయ సాధూనాంగా మారితే మెడలోని రుద్రాక్ష తీసేసి డి.జే.గా మారి ఫైట్లు చేసి విలన్లను చావబాది అగ్రిగోల్డ్ ఖాతాదారుల డబ్బు 9 వేలకోట్లు దోచుకొన్న వాళ్ళ భరతం పట్టి ఆ డబ్బు బాధితులకు అందేట్లు చేస్తాడు డి.జె అల్లు అర్జున్. అతని పెర్ఫార్మన్స్‌కు తగిన కథ. మాటలు రాసి డైరెక్ట్ చేసిన హరీస్ శంకర్ ప్రతిభ ప్రతిభ అంగుళంలోనూ కనిపిస్తుంది. మాటలు అదుర్స్ అంటే మామూలు మాట అవుతుంది. అల్లు భాషలో "ఉత్కృష్టహ్, ఉత్కృష్టస్య, ఉత్కృష్టే భ్యం". అర్జున్ బ్రాహ్మణ వాచకం కూడా సూపర్బ్. ఈ పాత్ర అతనికి కొత్తదే కానీ కొట్టిన పిండిని చేసేశాడు. అతని ఎనర్జీ అంతా ఖర్చు చేసి పోరాటాలు డాన్స్‌లు చేశాడు. డాన్సుల్లో ఒంగిన చువ్వ అనిపించి "ఇరగ" దీశాడు. అన్నిటికంటే గొప్ప విషయం రావు గోపాలరావులాగా మట్టలాగు, బారు చొక్కా రొయ్య మీసం వేసుకున్న ఆయన కొడుకు రావు రమేష్ అదే యాసలో తండ్రికి తగిన కొడుకు కాక, మించిన తనయుడు అనిపించాడు నటనలో. ఇది బాగా ప్లస్ పాయింట్. జొన్నవిత్తుల పాటలు సుశబ్ద సరళ సుందరంగా ఉంటే దేవిశ్రీ సంగీతం అర్జున్ డాన్స్‌లకు తగ్గ భంగిమలో నాట్యం చేసింది. హీరోయిన్ వలన ఒరిగిందేమీ కనిపించలేదు. చూసినవాళ్లకు అల్లుకు సెక్సీగా కనిపించిందేమో తెలీదు. మిగిలిన పాత్ర దారులందరు యధాశక్తి నటించి "అన్నపూర్ణా కేటరింగ్"లో రుచికరమైన శుచికరమైన హాయైన హాస్య సాహస, ఉద్రేక, శోకాది భావోద్రేక పిండివంటలతో సహా వంటలు వండి వడ్డించి, తినిపించి "బ్రేవ్" మని "త్రేనుపు"

తెప్పించారు. "ఇంగువ వేసిన పులిహోర"లాగా ఘుమ ఘుమ లాడించి "ఎక్సలెంట్, ఎక్స్ట్రార్డినరీ, మైండ్ బ్లోయింగ్" అనిపించాడు దువ్వాడ. ఒక రకంగా "సభ్య సమాజానికి మంచి సందేశమే" ఇచ్చాడు డి.జె.

శనివారం శ్రీయల్లాప్రగడ వారు ఫోన్ చేసి మళ్ళీ మాకు ఎప్పుడు వీలయితే అప్పుడు వాళ్ళ ఊరు కారీకి రమ్మని కోరారు తప్పక వస్తామన్నాం.

## విశ్వ నాదామృతం

రాత్రి యు ట్యూబ్‌లో "విశ్వనాధామృతం" చూసాం. ఇండియాలో ఉండగా మొట్ట మొదటి ఎపిసోడ్ మాత్రమే చూసాం ఇవాళ సాగర సంగమం, స్వర్ణకమలం సప్తపది ఎపిసోడ్‌లు చూసాం. రచయితా దర్శకుడు త్రివిక్రమ్ శ్రీనివాస్ కళాతపస్వి విశ్వనాథ్ దర్శకత్వ ప్రతిభను అన్నికోణాలలో ఆవిష్కరించాడు. సాగర సంగమం తనకు బాగా నచ్చిన సినిమా అని అది శంకరాభరణం తర్వాత మరొక ట్రెండ్ సెట్టర్‌గా నిలిచిందని అందులో 12 పీక్ పాయింట్లున్నాయని. ప్రతి పాయింట్ దగ్గరా సినిమా అయిపోతుందే మోననిపించి మళ్ళీ సాగటం విశ్వనాధ ప్రతిభకు నిదర్శనమని నెగటివ్ కేరక్టర్, జీవితంలో ఫెయిల్యూర్ అయిన వాడి కథను అంత అద్భుతంగా తీయటం ఆషామాషీకాదని, ఆయన మనతోపాటు ఉంటూ మనకు మార్గ దర్శకత్వం చేస్తూ, మన హృదయాలను కదిలిస్తూ ద్రవీభూతం చేస్తూ భారతీయ కళా సంస్కృతి విలువల పట్ల అభిమాన్నాన్ని వెయ్యి రెట్లు పెంచిన దార్శనికుడు విశ్వనాథ్‌ను కళాతపస్వి అని ఏ అరణ్యంలోనో ముక్కు మూసుకుని కూర్చున్నవాడిగా భావించరాదని ఆయన జనక చక్రవర్తిలాగా జ్ఞాన బోధకుడు కనుక ఆయనను అన్నట్లే "కళా రాజర్షి" అనటం సముచితమని అన్నాడు. నాకు బాగా నచ్చిన మాట. ఇలాంటి సినిమాలు ఏ దర్శకుడైనా జీవితం అంతా కష్టపడి ఒక్క సినిమా మాత్రమే తీయగలడని కానీ విశ్వనాథ్ ఇలాంటివి 10 కళాఖండాలు తీసి నభూతో న భవిష్యతి అనిపించారని చెప్పాడు. నా దృష్టిలో "కళాఖండాల కళావిశ్వం –విశ్వనాథ్". స్వర్ణకమలం అద్భుత కళాఖండం. భానుప్రియ అభినయ నృత్య వేదమే అది. పాపం చర్చలో పాల్గొన్న అందులోని హీరో వెంకటేష్ మనసులో ఉన్న భావాలను ఇంగ్లిష్ తెలుగు మిక్సింగ్‌లో సరిగ్గా చెప్పలేక పోయాడు. ఇక "సప్తపది" హీరోయిన్ సబితను 1998లో పెదకళ్లేపల్లిలో వేటూరి గారు రెండు రోజులపాటు తమ ఇంట్లో కాఫీ టిఫిన్ భోజనాలతో నిర్వహించిన కళాసదస్సులో విశ్వనాథ్ బాలు, దేవదాస్ కనకాల దంపతులతో పాటు చూసాం. భరణి దీని చర్చలో ఉన్నాడు. అసలే మాట కంగారు. దానికి తోడు మహా గొప్ప సినిమా గురించి చెప్పేటప్పుడు మరింత కంగారుపడి తొందరగా మాట్లాడి పాపం ఇబ్బందిపడి, ఇబ్బంది పెట్టాడు. ఈ మూడిట్లో విశ్వనాథ్ ఉన్నా చెదరని చిరునవ్వుతో తనకేమీ తెలియదన్న భావంతో ఆ

సమయానికి అలా తోచింది కనుక అలా చేశాననే నిర్లిప్తతతో కళా యోగిగా కనిపించాడు. సప్తపది ఒక విప్లవాత్మక భావ వ్యాప్తి. దీన్ని సమాజం స్వీకరించటానికి తగిన ఉపపత్తులన్నీ దట్టంగా దట్టించుకుని తీశాడు. నమ్మించాడు. దీనిపై విమర్శ లేమీ రాలేదా అని ఈ ఎపిసోడ్‌లు తీసిన పార్ధ సారధి అడిగితే ఒకే ఒక్క బ్రాహ్మణ సంఘం వారు మాత్రమే తిరస్కరించారని “మీ అమ్మాయికి ఇలాగే పెళ్లి చేస్తారా?” అని సూటిగానే ప్రశ్నించారని చెప్పాడు. సప్తపదిలో జానకి పాడిన త్యాగరాజకీర్తన “మరుగేలరా ఓ రాఘవ” హృదయాలను కదిలించే పాట నాకెంతో ఇష్టమైంది. త్యాగరాజుకు వేయి రెట్ల గౌరవం ఆపాదించేట్లుగా ఈ కీర్తనను మహదేవన్ జానకి విశ్వనాధ్‌లు తీర్చిదిద్దారు. దీనికి విరుద్ధంగా సెంటిమెంట్‌లకు గౌరవం కలిపిస్తూ బాపుగారు “రాధా కళ్యాణం” తీసి అభిమానం పొందారు. తాను ఇలాంటి చిత్రాలు తీయటానికి కారణం అభిరుచి ఉన్న నిర్మాతలు ముందుకు రావటమేనన్నారు కళాతపస్వి. పార్ధ సారధి “విశ్వనాధ్ గారు తన చిత్రాలలో ఎన్నోపాటలకు పల్లవులు సూచించారని అవి ఒక గ్రంథంగా వస్తే బాగుంటుందని” అన్నాడు. నాకేమనిపిస్తుంది అంటే “విశ్వనాధ్ కళా సర్వస్వము” అనే గ్రంథం రావాలి.

## పూరీ జగన్నాధ రధోత్సవం

25-6-17 ఆదివారం- ఆషాఢ శుద్ధ విదియ పూరీలో జగన్నాధ రధోత్సవం కన్నుల పండువుగా జరిగింది. ఇక్కడ షార్లెట్‌లో కూడా హిందూ సెంటర్‌లో మినీ రధ యాత్ర పిల్లలతో సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించారని తెలిసింది. చికాగో కూడా ఇస్కాన్ వారు బ్రహ్మానందంగా రధ యాత్ర నిర్వహిస్తారని చదివాను.

ఇండియాలో ఉండగా గీర్వాణం-3లో 138 కవుల గురించి రాశాను. ఇక్కడికి వచ్చాక సుమారు 15 రోజులనుంచి అన్ని చోట్ల సేకరించి ఇవాళ్టికి 300 మంది గీర్వాణకవుల గురించి రాయగలిగాను. ముఖ్యంగా మనకు తెలియని ఎందరో కాశ్మీర సంస్కృతకవులు కాశ్మీర పండిట్‌లు రాసిన రచనలు, శైవశాక్తేయ వీరశైవ కవులు మరీ ముఖ్యంగా ఒరిస్సా కవులు చాలా కొద్దిమంది మాత్రమే మనకు తెలుసు. వారిలో అన్నియుగాలలోని కవుల విషయాలు తెలుసుకొని వారి గురించి కూడా సమగ్రంగానే రాశాను. వీరుకాక మన సమకాలీన కవులు ఏ యునివర్సిటీలలో ఉన్నా వారి గురించి వివరాలు సేకరించమని పాపం మైనేనిగారిపై ఈ ముసలి వయసులో పెద్ద బాధ్యత పెట్టాను. వారు శక్తి వంచన లేకుండా ప్రయత్నిస్తున్నారు. శైవ పీఠంకు చెందిన కొందరు ప్రసిద్ధ కవుల గురించి వివరాలు అడిగి తెలుసుకోమని కీ.శే. సద్గురు సదానంద మూర్తి గారి కుమారులు శ్రీ బసవ రాజుగారిని సంప్రదించమని కోరగా వారితో సంప్రదించారు. ఒకటి రెండు రోజుల్లో ఆ వివరాలూ లభ్యమవచ్చు.

ఇంత రాసినా ఈ రాత వ్యగ్రతతో దాదాపు రెండు వారాలనుండి పుస్తకాలు చదవటం కుదరటం లేదనే బాధ ఎక్కువగా ఉంది. అందరికి "శు, శుభస్య, శుభస్యేభ్యం" అని డి జె మాటతో వీక్లీకి సమాప్తి పలుకుతున్నాను.

(25-6-17-కాంప్-షార్లెట్-అమెరికా)

## వీక్లీ అమెరికా-14 (26-6-17 నుండి 2-7-17 వరకు)

### శ్రీ రుద్రాభిషేకం సత్యనారాయణ స్వామి వ్రత వారం

26-6-17 సోమవారం మధ్యాహ్నం శ్రీ మైనేని గారు శ్రీ ఎల్లాప్రగడ వారు ఫోన్ చేసి నా పుట్టిన రోజు 26 అనుకొని "ముందే కోయిలలు కూసినట్లు" శుభాకాంక్షలు తెలియజేశారు. నిన్ననే మా అల్లుడు, మనవళ్లు కాలిఫోర్నియా నుంచి తిరిగి వచ్చారు.

### శ్రీ రుద్రాభిషేకం సత్యనారాయణ స్వామి వ్రతం

27 జూన్ తేదీలప్రకారం నా పుట్టిన రోజు. తిధులప్రకారం జ్యేష్ఠ బహుళ సప్తమి. మా అమ్మ ఉన్నన్నాళ్ళు, ఆ తర్వాత కూడా చాలా ఏళ్ళు ఈ సప్తమి తిథినాడే పుట్టిన రోజు చేసుకునేవాడిని మా అమ్మ తప్పని సరిగా నాకు చాలా ఇష్టమని మైసూర్ పాక్ చేసేది. మా శ్రీమతీ ఎప్పుడూ చేస్తూనే ఉంది. ఈసారి అమెరికాలో ఉండటం మా పెద్ద మనవడు చి॥ సంకల్ప్ (పెద్దబ్బాయి శాస్త్రి కొడుకు) ఎం.ఎస్ పాసవటం, చికాగోలో ఉద్యోగం వచ్చి చేరటం, వాడి తమ్ముడు చి॥ భువన్ సెంట్రల్ సిలబస్ టెన్త్ క్లాస్ పాసై, కాలేజీలో ఇంటర్‌లో చేరటం, మా రెండవ అబ్బాయి శర్మ కొడుకు చి॥ హర్ష టెన్త్ పాసై కాలేజీలో చేరటం వాడి చెల్లెలు మా మనవరాలు చి॥ హర్షిత టెన్త్‌కు రావటం, మా మూడోవాడు మూర్తికొడుకు చి॥ చరణ్ ఇంటర్ ఫస్ట్ ఇయర్ పాసవటం వాడి చెల్లెలు మా మనవరాలు చి॥ రమ్య నైన్త్ క్లాస్‌కు రావటం, మా ఇక్కడి పెద్దమనవడు (మా అమ్మాయి పెద్దకొడుకు ) చి॥ శ్రీకేత్ టెన్త్ స్టాండర్డ్‌కి రావటం వాడి తమ్ముళ్లు మా బుడ్డి మనవళ్ళు చి॥ ఆశుతోష్, పీయూష్‌లు సెవెంత్ స్టాండర్డ్‌కు రావటం, నాకు 77 వెళ్లి 78 ఏళ్ళు రావటం అన్నీ పురస్కరించుకొని 27-6-17 మంగళవారం మా అమ్మాయి వాళ్ళ ఇంట్లో ఉదయం 7.15 నుంచి 11 వరకు శ్రీ సువర్చలాన్జనేయ స్వామి అష్టోత్తర సహస్ర నామ పూజ, మహాన్యాస పూర్వక రుద్రాభిషేకం, శివా ష్టోత్తర సహస్రనామ పూజ, బిల్వాష్టోత్తర పూజ చేశాను. ఉదయం 11 గం. నుంచి మధ్యాహ్నం 1.15 వరకు శ్రీ రమా సహిత సత్యనారాయణ స్వామి వ్రతం నవగ్రహాలకు అష్టోత్తర పూజతో సహా చేసుకున్నాం. అంటే సుమారు 6 గంటలు ఈ రూపంగా భగవధ్యానంలో గడిపే అదృష్టం కలిగింది. వ్రతం కాగానే మా అమ్మాయి శ్రీ మైనేనిగారు పంపిన "ఘన నగదు" కానుక, ప్రత్యేక గ్రీటింగ్, తాను కొన్న "ఘనవస్తు కానుక" అందజేసింది.

నేను మా ముగ్గురు మనవళ్లను "యధాశక్తి" నగదు కానుక అందించాను. భోజనంలోకి మామిడికాయ పప్పు, బీన్స్ కూర కొబ్బరి పచ్చడి, పులిహోర, బొబ్బట్లు చేసింది. ఈ మధ్య చాలాసార్లు మైసూర్‌పాక్ చేయటం వలన వెరైటీగా బొబ్బట్లు చేసింది. శ్రీ మతి గోసుకొండ అరుణ, వాళ్ళబ్బాయిలను భోజనానికి పిలిచాము. వాళ్ళు ఇక్కడికి వచ్చేదాకా విషయం చెప్పలేదు మేము. వచ్చి ఆశ్చర్యపోయింది అరుణ. మైనేనిగారికి ఫోన్ చేసి ధన్యవాదాలు తెలిపాను. మా అబ్బాయిలు శాస్త్రి శర్మరమణ మనవళ్లు మనవరాలు రమ్య. మా అన్నయ్యగారబ్బాయి రాంబాబు ఫోన్ చేసి శుభాకాంక్షలు తెలియ జేశారు. ఇమెయిల్ ద్వారా సాహితీబంధువులు పంపిన శుభాకాంక్షలకు ధన్యవాదాలు తెలిపాను. శ్రీ సుంకర అప్పారావు గారు, అమ్మాయివచ్చి పళ్ళు ఇచ్చి శుభాకాంక్షలు తెలియజేశారు. సాయంత్రం మా ఇంటికి సుమారు 15 మైళ్ళ దూరంలో ఉన్న శ్రీ త్రిమూర్తి దేవాలయానికి వెళ్లి అక్కడి బ్రహ్మ, శ్రీనివాస, శివులను, సరస్వతీ పార్వతీ పద్మావతీ అమ్మవార్లను మా ఆంజనేయస్వామిని దర్శించి మంగళవారం వీరందరి దర్శన భాగ్యం కలిగినందుకు సంతృప్తి చెందాం. 5 ఏళ్ళ క్రితం ఈ ఆలయానికి శంకుస్థాపన జరిగినప్పుడు మేము ఇక్కడే ఉన్నాం. రెండుసార్లు వెళ్లి చూశాం. ఇప్పుడు నిర్మాణం పూర్తయి విగ్రహ ప్రతిష్ట జరిగి ఆలయం దర్శనానికి వీలుగా తయారయింది.

బుధవారం రాత్రి మైనేనిగారి బావగారు శ్రీ రాచకొండ శర్మగారికి ఫోన్ చేసి యోగ క్షేమాలు తెలుసుకున్నాను. ఆ డాక్టర్ దంపతులకు 93 ఏళ్ళు వచ్చిన సందర్భంగా విశాఖ సీనియర్ సిటిజెన్ అసోసియేషన్ వారు ఇంటికి వచ్చి ఇద్దరినీ పుష్పహారాలతో సన్మానించారని శర్మ గారు చెప్పారు. వారిద్దరూ మరింత ఆరోగ్యంగా శతాధిక ఆయుస్సుతో ఆరోగ్యంగా వర్ధిల్లాలని భగవంతుని ప్రార్ధించా. మార్చి 15న మేము విశాఖ వెళ్లి ఆ దంపతులతో కొన్ని గంటలు గడిపిన మధురానుభూతి మరువ లేనిది. రాత్రి "గొట్టం"లో సీతమ్మ అందాలు-రామయ్య చందాలు "సినిమా చూసాం నీట్‌గా ఉంది. జగపతిబాబు "కబడ్డీ కబడ్డీ" ట్రాక్ కథ.

గురువారం గీర్వాణం-3 లో శ్రీ హనుమద్రామాయణంతో పాటు అస్సామ్ గీర్వాణకవుల గురించి రాసి 330కు చేర్చా. సాయంత్రం అప్పారావు గారింటికి వెళ్లి ఆయనకు జన్మదిన శుభాకాంక్షలు చెప్పి ఫలాలు ఇచ్చి వచ్చాము. మా మనవరాలు చి॥ రమ్యకు హాపీ బర్త్ డే చెప్పాం.

రాత్రి రాజేంద్రప్రసాద్ చలపతిరావు నటించి కోన వెంకట్ సంభాషణలు రాసిన "ఓనమాలు" సినిమా ట్యూబ్‌లో చూసాం. చాలా పర్పస్ ఫుల్ పిక్చర్. అందరూ బాగా చేశారు. ఎవరు ఎంతకు ఎదిగినా జన్మభూమిని మూలలను మరచిపోరదనే చక్కని సందేశం ఉన్న సినిమా.

## షార్లెట్ సాహితీ మైత్రీ బంధం

శుక్రవారం శ్రీ గుమ్మడి గోపాల కృష్ణ నటించిన ఆకెళ్ళ నాటకం శ్రీనాధుడు చూసాం. చాలా బాగుంది. గుమ్మడి నటన బాగానే ఉంది పద్యాలూ మైనేనిగారన్నట్లు కంచుగొంతుతో ఆలాపించాడుకాని బిగుసుకుపోయి నటించినట్లని పించింది నాకు. సినిమా గుమ్మడి రాజసం కొరవడింది. ఏమైనా పద్యనాటకం రాయటం, దాన్ని ఆడటం ఆషామాషీ కాదు. దాన్ని మెప్పించారు రచయితా నటుడూ. గీర్వాణం 340కు చేరింది.

శనివారం -గీర్వాణం-3లో 351 మంది కవుల గురించి రాయగలిగా. దాదాపు ఇరవై రోజులకు ఆస్ట్రో ఫిజిక్స్ చదివి పూర్తి చేశా. ది స్టోరీ ఆఫ్ మై లైఫ్ చదవటం నత్తనడకలో సాగుతోంది. గొట్టంలో ఏవేవో సినిమాలు ట్రై చేశాము కాని అవీ "గొట్టంలా" ఉండటంతో చూడలేదు.

2-7-17 ఆదివారం- ఉదయంమా అమ్మాయి రమణ ఫోన్ చేసి రాత్రి చెప్పాడని మా శిష్యుడు చిలుకూరి కొడుకుకు ఎంసెట్‌లో ఎం.బి.బి.ఎస్‌కు 1600 రాంక్ వచ్చిన శుభవార్త చెప్పింది. వెంటనే మెయిల్ రాయటమేకాక కాకినాడకు ఫోన్‌లో వాడికి కంగ్రాట్స్ చెప్పాను. నిరుడు ఎంట్రన్స్‌లో ఈ కుర్రాడికి 26000 రాంక్ వచ్చింది. వాడిని బెజవాడ తీసుకొచ్చి ఏడాది ఇన్సెంటివ్ కోచింగ్‌లో పెట్టాడు. దానికి తగ్గట్టే కుర్రాడూ కష్టపడి చదివి 1600 రాంక్ సాధించాడు. అంటే గవర్నమెంట్ కాలేజీలలో సీట్ వస్తుంది. రూపాయి కూడా డబ్బు కట్టక్కర లేదు. చాలా మంచి వార్తమా అందరికి. మార్చిలోనే మా చిలుకూరి అంటే సి.ఎల్.యెన్.శర్మ తల్లీ, తమ్ముడు రెండు రోజుల తేడాలో ఉయ్యూరులో చనిపోయారు. వారిద్దరి కార్యక్రమాలు వీడే దగ్గరుండి జరిపాడు. చిలుకూరి అంటే మా ఇంట్లో కుర్రాడనే భావన. వాడు వాళ్ళ నాన్నగారు మా కుటుంబానికి చేసిన సేవలు తీర్చుకోలేనిది. అందుకే ఈ కుర్రాడి ఉపనయనానికి రెండేళ్ల క్రితం జోరున వర్షంలో కారులో కాకినాడ వెళ్లి ఆశీస్సులు అందజేశాము. అంతటి అభిమానం మాకు ఆ కుటుంబం అంటే. ఇంతకాలానికి చిలుకూరి దంపతుల కోరిక తీరింది. కొడుకు బాధ్యతగా చదివి వారి కోరిక తీర్చాడు. మంచి కాలేజీలో సీటు వచ్చి చదివి డాక్టరై అందరికి మరింత సంతోషం కలిగిస్తాడని ఆశిస్తున్నాము.

మా కుటుంబంలో డాక్టర్ చదివిన వాళ్ళెవరూ లేరు. మా రేపల్లె బాబాయి శ్రీ రాయప్రోలు శివరామ దీక్షితులుగారి చివరి కొడుకు రామకృష్ణ -నాకంటే ఐదారేళ్ళ చిన్నవాడు ఎం.బి.బి.ఎస్ చదివి హైదరాబాద్ మల్కాజిగిరిలో ప్రాక్టీస్ చేస్తూ స్వంత హాస్పిటల్ కట్టుకొని మంచి పేరు ప్రఖ్యాతులు పొందాడు. వీడు తప్ప మాలో ఎవరూ డాక్టర్ కాలేదు. ఇప్పుడు చిలుకూరి కొడుకు చి॥ సాయి డాక్టర్ సీట్ సాధించాడంటే మా కుటుంబలో వాడు సాధించినంత ఆనందంగా ఉంది.

గీర్వాణం 356కు చేరింది. ఈ వీక్లీ ఇంతటితో సమాప్తం.
(2-7-17-కాంప్-షార్లెట్-అమెరికా)

**వీక్లీ అమెరికా-15** (3-7-17 నుండి-9-7-17 వరకు)

## గురుపూర్ణిమ, షార్లెట్‌లో సరసభారతి 104 కార్యక్రమంగా వ్యాసజయంతి వారం

3-7-17 సోమవారం గీర్వాణం-3లో 365 వరకు రాశా.

4-7-17 మంగళవారం- శయన ఏకాదశి అనే తోలి ఏకాదశి పేలపిండి ప్రత్యేక ప్రసాదంగా నైవేద్యం పెట్టాం. సాయంత్రం శ్రీ సుంకర అప్పారావుగారొచ్చి సాయి సచ్చరిత్రపారాయణ చేద్దామంటే రేపటి నుంచి చేద్దామని చెప్పా. రాత్రి 11.30 వరకు కూర్చుని గీర్వాణం-3లో 372 వరకు రాశా. ఇప్పటికి మూడుభాగాలు కలిపి 1000 మంది సంస్కృత కవులను గురించే రాసే అదృష్టం దక్కింది.

## శ్రీ షిర్డీ సాయి సచ్చరిత్ర పారాయణ

5-7-17 బుధవారం 6-7-17 గురువారంలలో ఉదయం, సాయంత్రం రోజుకు 5 గంటలు చదివి 51 అధ్యాయాల 400 పేజీల శ్రీ సచ్చరిత్ర పారాయణ పూర్తి చేసాం నేనూ అప్పారావుగారూ. మా అమ్మాయి ప్రసాదం చేయగా గురువారం సాయంత్రం నైవేద్యం పెట్టాం. సాయిని పూలతో అలంకరించాము.

అప్పారావుగారు ఆయన ఎంతో సంతృప్తి ఆనందం పొందారు. నాకు ఇదే మొదటిపారాయణ, ఆయన చాలాసార్లు చేసి ఉంటారు. రెండు రోజుల్లో ఆయన జీవితంలో ఎప్పుడూ జరగలేదట. భలే ఖుషీ అయ్యారు. భగవత్ కృప ఉంటే కార్యక్రమాలు అలానే జరుగుతాయని నమ్మకం. గురువారంతో పూర్తవటం మరీ సంతోషంగా ఉంది.

బుధవారం సాయంత్రం కారీ నుంచి మా అన్నయ్యగారి మనవడు హరి ఫోన్ చేసి వాళ్ళబ్బాయిని హాస్పిటల్ నుండి 30వ తేదీ శుక్రవారమే ఇంటికి తీసుకొచ్చామని బాగా కోలుకున్నాడని చెప్పాడు. కనుక మా కారీ ప్రయాణం దగ్గర పడిందనుకొన్నాం. రాత్రి యు ట్యూబ్‌లో భానుప్రియ ఇంటర్వ్యూ చూసాం. ఎంతో కమ్మగా, సరళంగా స్వచ్ఛంగానే మాట్లాడింది. ప్రఖ్యాత నర్తకి సుమతీ కౌశల్ ఆమె అత్తగారట. భర్త నేషనల్ జగ్రాఫికల్ ఛానెల్‌లో పనిచేస్తే ప్రపంచ ప్రసిద్ధ ఫోటోగ్రాఫర్ అట మరిది పండిట్ రవి శంకర్ గ్రూప్‌లో తబలా కళాకారుడు. స్వర్ణకమలం సినిమాలో ఆమె చెప్పిన "అర్థం చేసుకోరూ" అనే డైలాగును ఎన్ని రకాలుగా చెప్పి కనుబొమలు మూతితో ఎంత గొప్పగా అన్నదో వాటిని మళ్ళీ చేసి చూపించింది. మా కుటుంబానికి భానుప్రియ చాలా బాగా నచ్చిన నటి. శివాజీ గణేశన్ ఒక సభలో సావిత్రి, పద్మినిల నటన అంతా

భానుప్రియలో ఉందని అలాంటి నటి అరుదని అన్నాడట. గురువారం "గొట్టం"లో రాజేంద్రప్రసాద్ "గడుగ్గాయి" సినిమా చూసాం. మొదట్లో బాగున్నా తర్వాత బోర్. శుక్రవారం గీర్వాణం-3 అంతా ఒక చోటుకు తెచ్చి డెస్క్ టాప్‌పై ఉంచా. మామనవాడు శ్రీకేత్ చాలా సహాయపడ్డాడు దీనికి.

8-7-17 శనివారం ఆషాఢపౌర్ణమి గురుపూర్ణమి అనే వ్యాసపూర్ణమి. ఇంట్లో మామూలుగా పూజ చేశా. షార్లెట్‌లో కొత్తగా కట్టబోయే షిరిడీ సాయిబాబా గుడి ప్రాంగణంలో గురుపౌర్ణమి సుదర్శన హోమం నిర్వహించారు. మేము వెళ్ళలేదు. కానీ ఎందుకో మనసులో ఇక్కడ గురుపౌర్ణమిగా వ్యాస జయంతి జరిపితే బాగుండుననిపించి మధ్యాహ్నం రాంకీకి ఫోన్ చేశా. అతడు లిఫ్ట్ చేయలేదు. సాయంత్రం 6 గంటలకు అతనే ఫోన్ చేసి ఫోన్ చేసిన కారణం అడిగితే ఇక్కడ గురుపౌర్ణమిగా వ్యాస జయంతి జరపాలని ఉంది మీ ఇంట్లో. ఒక అరగంట సేపు నలుగురైదుగురం కూర్చుని వ్యాస మహర్షి పూజ చేసి నాలుగు ముక్కలు మాట్లాడుకొందాం. నీకు వీలైతేనే" అన్నాను. క్షణం కూడా ఆలోచించకుండా తప్పని సరిగా రేపు ఉదయం 10 గంటలకు మా ఇంట్లో ఏర్పాటు చేద్దాం. ప్రసాదం (భోజనం) కూడామా ఇంట్లోనే. ఇది మాకు దక్కిన అదృష్టం అనుకొంటున్నాము అని భార్యా భర్తలిద్దరూ చెప్పటం చాలా సంతోషమేసింది. ఒక నాలుగు కుటుంబాలవాళ్ళకు చెబుతాను అన్నాడు. సరే నన్నాను. అతనే మా అమ్మాయితో అల్లుడితో మాట్లాడి విషయం చెప్పాడు.

9-7-17 ఆదివారం వ్యాసజయంతిగా షార్లెట్‌లో సరసభారతి 104వ సమావేశం

ఉదయం 10 గంటలకు నేనూ మా అల్లుడు కలిసి రాంకీ ఇంటికి ఉదయం 10.30కు చేరాం. దంపతులు అప్పటికే అన్నీ తయారు చేసి రెడీగా ఉన్నారు. నేను నిన్న సాయంత్రమే రాంకీకి వ్యాసుని ఫోటో నెట్‌లో నుంచి డౌన్‌లోడ్ చేసి ఒక అట్టకు అంటించి ఉంచమన్నాను. కానీ అతడు 50 డాలర్లకు కలర్ ఫోటో డౌన్‌లోడ్ చేయించి దానికి చక్కని ఫ్రేం కూడా కట్టించి ఉంచాడు. శ్రద్ధ అంటే అలావుండాలి. అప్పుడు నేను చెప్పాను. ఈ కార్యక్రమాన్ని సరసభారతి 104వ సమావేశంగా జరుపుదామని అన్నాను మంచి ఆలోచన అన్నాడు. 11 గంటలకు పవన్ కుటుంబం, ప్రభల రామకృష్ణ కుటుంబం పేరి చంద్రశేఖర్ కుటుంబం మా అమ్మాయి మా శ్రీమతి మనవళ్లు వచ్చారు. అప్పటికే ప్లాస్టిక్ బోర్డు మీద కార్యక్రమం నాతో రాయించి రాంకీ బయట డిస్ప్లే పెట్టాడు. తానూ ఈ మధ్యే ఇండియా నుంచి తెప్పించిన మహా భారతం 18 పర్వాలు రామాయణం మూడు భాగాలు దేవుడి దగ్గర చక్కగా ఏర్పాటు చేశాడు. అప్పుడు రాంకీ దంపతులు కూర్చుని ముందు విఘ్నేశ్వర పూజ, తర్వాత విష్ణు అష్టోత్తరం తర్వాత వ్యాస అష్టోత్తర పూజ చేసి, నైవేద్యం హారతి ఇచ్చారు. అనుకోకుండా చాలా బాగా జరిగింది. రాంకీని

ముందు మాట్లాడమన్నాను. ఒక అయిదు నిమిషాలు మాట్లాడి నన్ను మాట్లాడమన్నాడు. నేను సరసభారతి గురించి కార్యక్రమాల గురించి ముందు చెప్పి వ్యాసునిపై స్తోత్రాలు చదివి వ్యాసుని గురించి వివరించా. దాని సారాంశం–

## వ్యాస అష్టోత్తర స్తోత్రం

1–వేద వ్యాసో విష్ణు రూపః పరాశరార్యాస్తపోనిదిహ్ –సత్య సందహ్ ప్రశాంతస్య సత్య వాదీ సుతః

2–కృష్ణ ద్వైపాయనో దాంతో బాదరాయణ సంజ్ఞితః –బ్రహ్మ సూత్ర ప్రథితవాన్ భగవాన్ జ్ఞాన భాస్కరః

3–సర్వ వేదాంత తత్వజ్ఞహ్ సర్వేజనా వేద మూర్తిమాన్–వేదం శాఖావ్యసన కృత కృత్యో మహా మునిహ్

4–మహా బుద్ధిర్మహాసిద్ధిర్మహా శక్తి ర్మహా ధృతిః మహా కర్మా మహా ధర్మా మహా భారత కల్పకహ్

5–మహా పురాణ క్రుజ్ఞానీ జ్ఞాన విజ్ఞాన భాజనం –చిరంజీవీ చిదాకారీ శ్చిత్త దోష నివారకః

6–వాశిష్ఠహః శక్తి పౌత్రస్య శుకదేవర్గునుర్గురుహః –ఆషాఢ పూర్ణిమా పూజ్యా పూర్ణ చంద్ర నిభాననః

7–విశ్వనాథ స్తుతికరో విశ్వజనో జగద్గురుహ్– జితేన్ద్రియో జితక్రోధో వైరాగ్య నిరతః శుచిహ్

8–జైమిన్యాది సదాచార్యహ్ సదాచార సదాస్థితః స్థితప్రజ్ఞహ్ స్థిరమతిః సమాధి సంస్థితారతహః

9–ప్రశాంతిదః ప్రసన్నాత్మా శంకరార్యప్రసాద కృత్ –నారాయణాత్మకః స్తవ్యహ్ సర్వ లోక హితే రతః

10–అఛత్రవదన బ్రహ్మ ద్విభుజబర కేశవః –అఫాల లోచనశ్శివః పరబ్రహ్మ స్వరూపకః

11– బ్రహ్మన్యో బ్రహ్మణో బ్రాహ్మీ బ్రహ్మ విద్యా విశారదః –బ్రహ్మాత్మైకత విజ్ఞాతా బ్రహ్మ భూతః సుఖాత్మకః

12–వేదాంగ భాస్కరో విద్వాన్ వేద వేదాంత పారగః –ఉపాంతరతమో నామా వేదాచారో విచారవాన్.

## వ్యాసునిపై కొన్ని ప్రత్యేక శ్లోకాలు

1–వేద వ్యాసః స్వాత్మ రూపం సత్య సంధం పరాయణం –శాంతం జితేంద్రియ క్రోధం సా శిష్యం ప్రణమామ్యహం

2–వ్యాసం వశిష్ఠ నప్తారం శక్తే పౌరుష మకల్మషం –పరాశరాత్మజం వన్దే శుక తాతం

తపోనిధిమ్

3–వ్యాసాయ విష్ణు రూపాయ వ్యాస రూపాయ విష్ణవే –నమో వై బ్రహ్మ నిధ్యాయ వాసిష్టాయ నమోనమః

4–అవికారాయ శుద్ధాయ నిత్యాయ పరమాత్మనే –సదైక రూప రూపాయ విష్ణవే సర్వ జిష్ణవే

5–వ్యాస స్మరణ మాత్రేణ జన్మ సంసార బంధనాత్ విముచ్యతే –నమస్తస్మై విష్ణవే ప్రభ విష్ణవే

## పరాశర స్తుతి

6–కరుణాతీత చిద్రూపం పరి పూర్ణ పరాయణం – పరమానంద సంతుష్టం పరాశర మొహం శ్రయే

శుక స్తుతి

7–త్రికాలాతీత చిన్మాత్ర ప్రశాంత స్వా0త సంయుతం –వికార ఘోర సంస్పృష్టం శుకం గురు మొహం శ్రయే

## శంకరాచార్య స్తుతి

8– శంకారూపేణ మచ్చిత్తం పంకీకృత మాభూద్యేయా –కింకరీ యస్య సా మాయా శంకరాచార్య మాశ్రయే

భావం– మాయ అందర్నీ కప్పి ఆడిస్తుంది .మనసు బుద్ధిలలో కల్లోలాలు తుఫాన్లు సృష్టిస్తుంది .అలాంటి మాయను కింకరి అంటే సేవకురాలినిగా చేసుకొన్నశంకరాచార్యులు ప్రణామం .

## వేద వ్యాస చరిత్ర

నేపాల్ దేశంలో తానాహుజిల్లా "దమౌళీ"లో వ్యాసుడు తపస్సు చేసి బ్రహ్మ సూత్రాలు పురాణాలు వేద విభజన చేసిన గుహ ఉంది అది గొప్ప యాత్రాస్థలం. విష్ణు మూర్తి యొక్క "కాలావతారం" వ్యాసుడు. చిరంజీవులలో ఒకడు. అద్వైత ఋషి పరంపరలో నాల్గవవాడు. ప్రతి యుగంలో ఒక వ్యాసుడు పుడతాడు. వ్యాసుడు అనేది ఒక అధికారం. ద్వాపరంలో కృష్ణ ద్వైపాయనుడు లేక బాదరాయణుడు వ్యాసుడయ్యాడు. వ్యాస పరంపరలో 28వ వాడు. మొదటి ద్వాపరంలో స్వాయంభువు వ్యాసుడు అయ్యాడు. రెండవ ద్వాపరంలో ప్రజాపతి వ్యాసుడు. మూడవదానిలో శుక్రుడు వ్యాసుడు. ఆ తర్వాత వసిష్ఠుడు, త్రివర్షుడు, సనద్వాజుడు వగైరా 27 మంది వ్యాసులు అయ్యాక ద్వాపరంలో కృష్ణ ద్వైపాయనుడు వ్యాసుడు అయ్యాడు.

విష్ణుమూర్తి నాభికమలం నుంచి బ్రహ్మపుట్టి నాలుగు ముఖాలనుండి నాలుగు వేదాలను ప్రసరింప జేయాలనుకొన్నప్పుడు. విష్ణువు మనసులో తలచుకోగానే "అపాంతర తముడు" జన్మించాడు. పుత్రోత్సాహంతో నారాయణమూర్తి "వ్యాసా! రా నాయనా! నా మానస పుత్రుడివిగా పుట్టి నాకు ఆనందాన్నిచ్చావు. అన్ని మన్వంతరాలలోనూ ఇలానే జన్మించు. తర్వాత పరాశర కుమారునిగా పుట్టి, కురురాజుల అధర్మ క్రూర హింసా దౌర్జన్యాలను అదుపు చేసి, వేదాన్ని వ్యాపకం చెయ్యి. నీకు రాగద్వేష రహితుడైన కొడుకు పుట్టి నిన్ను మించిపోతాడు" అన్నాడు. రాబోయే సూర్య సావర్ణికాలంలో వ్యాసుడు సప్తర్షులలో ఒకడు అవుతాడు.

## కృష్ణ ద్వైపాయన వ్యాస జననం

లోకోద్ధరణ కోసం నారాయణుడు కొన్ని ధర్మాలు ఏర్పాటు చేశాడు. కాలక్రమంలో అవి లోపించాయి. బ్రహ్మ రుద్ర ఇంద్రాది దేవతలు విష్ణుమూర్తిని దర్శించి ధర్మ పునరుద్ధరణ చేయమని ప్రార్ధించగా మూడవదైన ద్వాపర యుగంలో పరాశార సత్యవతి దంపతులకు ఆషాఢ శుద్ధ పౌర్ణమినాడు నారాయణుడు వ్యాసభగవానుడుగా అవతరించాడు. ఒకరోజు వ్యాసుడు సరస్వతీ నదిలో స్నానం చేసి తపోధ్యానాలు పూర్తిచేసి ఏకాంతంలో ఆసీనుడై దివ్య దృష్టితో యుగ విశేషాలను తెలుసుకున్నాడు. కాల ప్రభావాన భౌతిక భావనలు అంటే శక్తులు తగ్గుతున్నాయని గ్రహించాడు. శ్రద్ధ బలం ఆయుస్సు తగ్గి దౌర్బల్యం పెరిగినట్లు గుర్తించాడు అన్ని వర్ణాలవారికి ఉపయోగపడేట్లు వైదిక కర్మలను పరీక్షించి యజ్ఞ విస్తరణకు ఒక్కటిగా ఉన్న వేదాన్ని నాలుగుగా విభజించాడు. పంచమ వేదంగా మహాభారతం రచించాడు. పైలుడికి ఋగ్వేదం, వైశంపాయుడికి యజుర్వేదం జైమినికి సామం, సుమంతునికి అదర్వణం ఉపదేశించాడు. ఇతిహాస పురాణం అనే పంచమ వేదం భారతాన్ని రోమ హర్షుడు అనే సూతమునికి చెప్పాడు. వీరంతా తమ శిష్యులకు బోధిస్తే వారు వారి శిష్యులకు ఉపదేశించగా అనేక శాఖలయ్యాయి.

కొంచెం బుద్ధి తక్కువగా ఉన్నవారికి ఉపాఖ్యాన కథారూపంగా మహాభారతం రాశాడు. దీనిలో ధర్మం సంస్కృతీ మొదలైన విషయాలన్నీ చెప్పాడు వ్యాసుడు. ద్వాపరాంతంలో వచ్చే కలియుగంలో వచ్చే అనర్దాలు, ఆపద గ్రహించటానికి భారత రచన చేశాడు. అన్ని వర్ణాలవారు జాతులవారు లింగ వయో భేదం లేకుండా ఆచరించదగిన ధర్మాలు ధర్మ సూక్ష్మాలు చిన్న చిన్న కథలలో చెప్పాడు.

దీనితో తృప్తిపడక జ్ఞానులకు పరబ్రహ్మ స్వరూపం తెలుసుకోవటానికి 545 బ్రహ్మ సూత్రాలు రాశాడు. దీనికి శంకరాచార్య భాష్యం రాశారు. అష్టాదశ అంటే 18 పురాణాలు రచించాడు. వేదానికి అంతాలైన ఉపనిషత్తులు రాశాడు. వీటిలో

దశోపనిషత్తులకు శంకర భాష్యం ఉంది. అంతా బాగానే ఉంది. కానీ సర్వ వ్యాపకుడైన పరమేశ్వరుడి గురించి భక్తి తాత్పర్యాలతో రాయలేక పోయానని చింతిస్తుంటే నారద ముని హితోపదేశంతో శ్రీ విష్ణు లీలామృతమైన శ్రీ మద్ భాగవతం రాశాడు. దీన్ని పోతనామాత్యుడు మందార మకరంద తుందిలంగా తెలుగులోకి అనువదించాడు. భారతాన్ని నన్నయ తిక్కన ఎఱ్ఱనలనే కవిత్రయం అనువదించారు. ఇవన్నీ లోక శ్రేయస్సుకోసం రాయబడినవే. భారతం హరివంశం కలిపి 1 లక్షా 25 వేలు పురాణాల్లో 5 లక్షల శ్లోకాలు మొత్తం 6 లక్షల 25 వేళా శ్లోకాలు రాశాడు భగవాన్ వేదం వ్యాసుడు. భారతం చివరలో వ్యాసుడు– "యదాహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి సతత్ క్వచిత్" అని ఒక ప్రతిజ్ఞ చేశాడు– అంటే "భరతంలో లేనిది ఎక్కడా ఉండదు –ఇందులో లేనిది ఇంకెక్కడా ఉండదు" శాంతి ఆనుశాశానిక స్వర్గా రోహణ పర్వతాలలో 26 వేల శ్లోకాలలో రాజనీతి, ఆపద్ధర్మాలు, దానం, ధర్మం, మోక్షప్రాప్తి, స్త్రీ ధర్మాలు వివవిడి విడిగా చెప్పాడు. అంటే పాత్రలచేత చెప్పించాడు. భారతంలోని పాత్రలు మనమే మన ఇళ్లల్లో జరిగే కథయే భారత కథ.

ఇన్ని ఇన్ని రకాలుగా చెప్పినా పెడ చెవిని పెట్టి వారిని చూసి జాలితో బాధతో వ్యధతో "ఊర్ధ్వ బాహుః విరోమ్యేష నహి కశ్చిత్ శృణోతిమే –పరోపకారాయ పుణ్యాయ, పాపాయి పర పీడనం" అని చేతు లెత్తి మొక్కాడు –అంటే "ఇతరులకు మేలు చేస్తే పుణ్యం – ఇతరులను బాధిస్తే పాపం" అని చేతులు పైకెత్తి నెత్తీ నోరూ మొత్తుకున్నా నా మాట ఎవరూ వినటం లేదే" అని పరితపించాడు ఆ విశాల దయార్ద్ర హృదయుడు వ్యాస భగవానుడు.

## భారతంలో వ్యాస పాత్ర

భారత రచన చేయటమేకాక అందులో తానూ పాత్రధారియే వ్యాసుడు. తల్లికిచ్చిన మాటకోసం కురు వంశాన్ని నిలపటానికి పాండవ ధృతరాష్ట్ర విదురులకు జన్మనిచ్చాడు. అవసరమైనప్పుడు రంగ ప్రవేశం చేసి ధర్మ సూక్ష్మాలు చెప్పాడు. అర్జునుడు మత్స్య యంత్రాన్ని భేదించి ద్రౌపదిని దక్కించుకొంటే ధర్మరాజు ఆమె సోదరులందరికి భార్య అవ్వాలంటే ద్రుపదుడు వ్యాసుడిని తలచుకొంటే వచ్చి ఆమె సామాన్య మానవ స్త్రీ కాదు అయోనిజ యాజ్ఞ సేనీ కనుక పంచ భర్తృక అవటంలో తప్పు లేదని తీర్పు చెప్పాడు. వనవాసంలో పాండవులు కస్టాలు పడుతూ ప్రార్థిస్తే "మీకే కాదు కస్టాలు మీ ముందు నలమహారాజు దమయంతి ఎన్నో కష్టాలుపడి చివరికి సుఖపడ్డారని ఆ కథ చెప్పి ఊరట కలిగిచాడు. అర్జుడిని శివుని మెప్పించి పాశుపతాస్త్రం సాధించామని సలహా ఇచ్చాడు. కురుపాండ బలాలను బేరీజు వేసి చెప్పమని గుడ్డిరాజు కోరితే ధర్మం కృష్ణ రూపంలో పాండవుల వద్ద ఉంది ధర్మం ఉన్నచోట విజయం తప్పదు అని నిష్కర్షగా

చెప్పాడు. కురుక్షేత్ర సంగ్రామం ముందువచ్చి "నువ్వు తెచ్చిన యుద్ధం యెంత అనర్ధాన్ని తెస్తోందో చూడాలని ఉంటే కళ్ళు ఇస్తానంటాడు. చేసిన తప్పు తెలుసుకనుక తాను ఆ భీభత్సాన్ని చూసి తట్టుకోలేను అంటే సూతుడికి దివ్య ద్రుష్టి ప్రసాదించి యుద్ధాన్ని ప్రత్యక్ష ప్రసారంగా చూసి గుడ్డిరాజుకు చెప్పించాడు.

అశ్వత్థామ కృష్ణార్జునులపై నారాయణాస్త్రం సాధించగా వారిద్దరో దానికి నంస్కరించగానే అది నిర్వీర్యమైపోతే, కారణం తెలీక జుట్టు పీక్కొని వ్యాసుని స్మరిస్తే వచ్చి "మీ మీ శివ పూజా ఫలితం ఇది. వాళ్లిద్దరూ పూర్వ జన్మలో శివుడిని మట్టి లింగంగా చేసి ఆరాధిస్తే నువ్వు విగ్రహ రూపంలో పూజించావు. లింగా రాధన సర్వ శ్రేయస్కరం అది వారిని కాపాడింది" అని ధర్మ సూక్ష్మం చెప్పాడు. వ్యాసునికి ఆంధ్ర దేశానికీ సంబంధం ఉంది. ఏడు రోజులు కాశీలో వ్యాసునికి శిష్యులకు భోజనం దొరక్కపోతే కోపంతో కాశీని శపించాలని సంకల్పించి భిక్షా పాత్రను నేలమీద శతధా భిన్నం ఎట్లు పగలకొడితే ముదుసలి సాధ్వీరూపంలో పార్వతీదేవి వచ్చి విందుకు ఆహ్వానించి కమ్మని భోజనం పెడితే అప్పుడు శివపార్వతులు వారి వద్ద ప్రత్యక్షమవగా శివుడు కోపంతో "పుణ్యరాశి కాశీపై శాపం పెడతావా పొమ్ము నిర్భాగ్య మా యూరి పొలము విడిచి" అని కాశీనుంచి గెంటేస్తే బ్రతిమాలితే దక్షిణకాశి దాక్షారామం వెళ్లి భీమేశ్వర సేవలో తరించామని చెబితే విధవ లేక విధవ లేక ద్రాక్షారామ చేరగా అక్కడ అగస్త్య మహర్షి ఊరట కలిగిస్తాడు. బాసర సరస్వతీ ఆలయం మనకు తెలుసు. వ్యాస బాసర అయింది.

అలాగే కాశ్మీర్లో ప్రవహించే బియాస్ నది అంటే వ్యాస నది అని అర్ధం. ఇలా ప్రకృతితో మమేక ఆమినవాడు వ్యాసుడు.

రెండు చిలుకలు సంసారం చేస్తుంటే ముచ్చటపడి తనకు ఒక కొడుకు కావాలనుకొని హిమాలయాలకు వెళ్లి "శక్తిని గూర్చి తీవ్ర ఆతపస్సు చెస్తే, తపోభంగానికి వచ్చిన ఘృతాచి అనే అప్సరస చేసిన ప్రయత్నాలు ఫలించక చిలుక రూపంలో వస్తే రేతస్కలనం జరిగి పుట్టిన కుమారుడే శుకమహర్షి ఆయన మూతి చిలక మూతిలాగా ఉంటుందంటారు. పుట్టగానే సకలశాస్త్రాలు వచ్చేశాయి. జనక మహారాజు వద్ద బ్రహ్మ విద్య నేర్చాడు. పరీక్షిత్తుకు ఏడు రోజులలో మహాభారత కథ అంతా చెప్పాడు శుకమహర్షి. నిరీహుడు నిస్సంగుడు శుకుడు. తండ్రి పరాశరుని పేరా పరాశర సంహిత ఉంది. ఆంజనేయ చరిత్ర అంతా అందులో ఉంటుంది.

ఇంతటి జ్ఞానాన్ని ధర్మాలను నీతులను అక్షరరూపంగా ప్రసాదించిన భారత జాతి వ్యాసభగవానునికి ఏమిచ్చి ఋణం తీర్చుకోగలదు. కనీసం వ్యాస పూర్ణిమనాడైనా ఆ గురు మహారాజును స్మరిద్దాం. ఇలాంటి అరుదైన అవకాశం అమెరికాలో షార్లెట్లో

## షార్లెట్ సాహితీ మైత్రీ బంధం

సరసభారతి 104వ సమావేశంగా వ్యాస జయంతిని తమ ఇంట్లో జరిపించిన రాంకీ ఉషా దంపతులకు, ఆసక్తిగా వచ్చి పాల్గొన్న వారందరికీ సరసభారతి ధన్యవాదాలు తెలియజేస్తోంది. ప్రతి సంవత్సరం మా అమ్మాయి శ్రీమతి విజయలక్ష్మి, అల్లుడు శ్రీ అవధాని శంకర జయంతి జరుపుతున్నట్లే వ్యాస జయంతిని గురుపౌర్ణమిగా నిర్వహించాలని ఈ దంపతులను కోరుతున్నాను" అని చెప్పి ఇక్కడ భారతీయ సంస్కృతిని ఆచరిస్తూ నిలబెడుతున్న చి॥ అడుసుమిల్లి రామకృష్ణ (రాంకీ)కు సరసభారతి ఆనందంగా "సంస్కృతీ ప్రదీపక" బిరుదు ప్రదానం చేస్తున్నానని అనగానే అందరు హర్ష ధ్వానాలతో చప్పట్లు మోగించారు. సరసభారతి గ్రంథం "గీర్వాణ కవుల కవితా గీర్వాణం-2 (రెండవ భాగం) రాంకీ దంపతులకు మా దంపతులం కానుకగా అంద జేశాము. మంత్ర పుష్పంతో కార్యక్రమం పూర్తయింది.

ఆ తర్వాత పప్పు, వంకాయ కూర చిక్కుడుకాయ కూర, కాబేజీ కూర టమేటా చట్నీ, స్వీటు, పులిహోర, బజ్జీలు అప్పడం, మజ్జిగ పులుసు, చారు, పెరుగు, పల్లముక్కలతో కమ్మని భోజనం ఏర్పాటు చేశారు. అందరం తృప్తిగా తిని ఆనందించాం. మా దంపతులకు రాంకీ దంపతులు నూతన వస్త్రాలు సమర్పించి "ఘనమైన నగదు" తాంబూలం ఇచ్చి ఆశీర్వాదం పొందారు. ఇలా సుమారు 15 గంటల వ్యవధిలో సరసభారతి 104వ కార్యక్రమంగా వ్యాస జయంతిని అమెరికాలోని షార్లెట్‌లో జరిపి అందరి సహకారంతో రికార్డ్ సృష్టించింది. ఈవారం వార్తలు ఇంతటితో సమాప్తం.

(9-7-17-కాంప్-షార్లెట్-అమెరికా)

## వీక్లీ అమెరికా-16 (10-7-17 నుండి 16-7-17 వరకు)

### మరో రుద్రాభిషేకం వారం -1

10-7-17 సోమవారం- మా మనవళ్లు చి॥ ఆశుతోష్, పీయూష్‌లను ఒక నెలరోజుల కాంప్‌లో చేర్చారు. ఉదయం 7 గంటలకు వెళ్లి సాయం కాలం 4కు వస్తారు పొద్దున్న దిగబెట్టి సాయంత్రం తీసుకొస్తున్నారు. పెద్దమనవడు చి॥ శ్రీకేత్‌ని కూడా ఇంగిలీషు స్పెషల్ కోచింగ్‌లో చేర్చారు రోజుకు రెండు గంటలు. వాడినీ దింపి తీసుకు వస్తున్నారు. దీనితోనే వీళ్ళ టైం సరిపోతోంది. తప్పదు. రాత్రి "గొట్టం"లో రాజేంద్ర ప్రసాద్ సినిమాలు వాలుజడ తోలు బెల్టు, అప్పుచేసి పప్పుకూడు చూసాం. సరదాగా ఉన్నాయి రేలంగి నరసింహారావు డైరెక్టర్. మనవడు, మనవరాలు చరణ్ రమ్యలకు ఫోన్ చేసిమా ట్లాడాం. రమణ ఉయ్యూరు విషయాలు ఎప్పటికప్పుడు తెలియజేస్తున్నాడు వర్షాలు బాగానే పడుతున్నాయి కాలువలు నిండుగా ప్రవహిస్తున్నాయట.

మంగళవారం- గీర్వాణం పని నిన్నా ఇవాళ. రాత్రి ప్రముఖ జర్నలిస్ట్ 83 ఏళ్ళ

గుడిపూడి శ్రీహరితో తెలకపల్లి రవి ఇంటర్వ్యూ చూశా. ఈనాడులో "హరివిల్లు" శీర్షిక 30 ఏళ్ళు నిర్వహించిన ఘనత ఆయనది. జర్నలిజంలో 60 ఏళ్ళ అనుభవం ఆయనది. హిందూకు కూడా ఆయన రాస్తాడు. ఆయన ఆర్టికల్స్ చదవటం అదొక గొప్ప అనుభూతి. హాస్యం అంతర్వాహినిగా చక్కగా నిండుగా చురుకుగా కరుకుగా ప్రవహిస్తుంది. ఆయన సినిమాలమీద రాసిన వ్యాఖ్యానాలు సూపర్బ్. నాకు చాలా ఇష్టమైన రచయిత. ఈ కామెంట్లు నాకు అత్యంత ఆప్తులు భారతీయ సాహిత్య పరిషత్ అధ్యక్షులు బందరు హిందూ హై స్కూల్ లెక్కల మేస్టారు గొప్ప కథా రచయితా ఇంగ్లిష్‌లో అమోఘ పాండిత్యం ఉన్న స్వర్గీయ ఆర్.ఎస్.కె.మూర్తి గారి పోకడ కనిపిస్తుంది. మూర్తిగారు వారం వారం జాగృతి వారపత్రికలో సినిమా సమీక్ష చాలా ఏళ్ళు నిర్వహించారు.

గుడిపూడి వారు చెప్పిన విషయాలు మీతో చెప్పాలనిపిస్తోంది. ఒకసారి సురభి నాటక కంపెనీ గురించి హిందూ పత్రికలో రాయటానికి ఫోటోగ్రాఫర్‌ను తీసుకొని వాళ్ళు ఉండే పల్లెటూరువెళ్లి వారంతా ఉదయం లేచిన దగ్గర్నుంచి రాత్రి పడుకొనే వరకు వారి దైనందిన కార్యక్రమాలన్నీ ఫోటోలు తీశారని వీళ్ళ కోసం వాళ్ళు అప్పటికప్పుడు తెరలు కట్టి నాటకాలు ఆడి చూపించారని, మద్రాస్ వెళ్లి దీనినంతటిని హిందూ ఆదివారం స్పెషల్‌లో 4 పేజీల వ్యాసం రాశానని ఫోటోలన్నీ అందులో పెట్టానని హిందూ పేపర్ చరిత్రలో ఒక అంశంపై అన్ని పేజీల ఆర్టికల్ అంతవరకూ ఎన్నడూ రాలేదని ఈ ఎడిషన్ ప్రపంచం అంతా చదివే ఎడిషన్ అని దీనితో సురభి చరిత్ర ప్రపంచానికి అంతటికీ తెలియజెప్పే అవకాశం తనకు దక్కిందని అన్నారు. ఆ తర్వాత ఎప్పుడో సురభి వాళ్ళు ఆయన దగ్గరకొచ్చి కేంద్ర అకాడెమీ ద్వారా తమకేదైనా ఆర్థిక సాయం చేయించమని అభ్యర్థించారని తానూ వాళ్లకు ఒక రికమండేషన్ లెటర్ ఇచ్చి ఢిల్లీలో ఉన్న శ్రీ గరిమెళ్ళ వెంకట రమణ? గారి వద్దకు పంపానని, ఆయన వారిని అకాడెమీ అధ్యక్షుల దగ్గరు తీసుకు వెళ్లారని, సురభి అధినేత ఆయనతో తమ గోడు చెప్పుకోబోతుంటే "మీరేమీ చెప్పక్కరలేదు మీ గురించి అంతా గుడిపూడి శ్రీహరిగారు హిందూలో రాసిన ఆర్టికల్ చదివి పూర్తిగా తెలుసుకున్నామని చెప్పి క్షణం ఆలస్యం చేయకుండా 75 లక్షల చెక్ ఇచ్చి పంపారని చెప్పారు. మహోపకారం జరిగింది శ్రీ హరిగారిద్వారా సురభికి. అకాడెమీ వదాన్యతనూ ప్రశంసించాలి. మరో విషయం గుడిపూడి చెప్పారు. ప్రముఖ గాయకుడు స్వర్గీయ ఎం.ఎస్.రామారావు గారు గొప్ప సంగీతజ్ఞులు ఆయన సినిమాలకు ఎన్నో పాటలు పాడారు చక్కని స్వరం ఆయనది. ఆయన పాడిన "ఓహో జహాపనా" అలాగే చివరికి మిగిలేది సినిమాలో మల్లాది రాసిన పాటలు "చెంగున అలమీద మిడిసిపోతది మీను"వంటి పాటలు అంటే నాకు మహా ఇష్టం. నా ఆరాధ్య గాయకులలో ఆయన ఒకరు. అలాంటి ఎం.ఎస్.రాజమండ్రిలో దిక్కూ మొక్కూ లేకుండా ఒక చిన్న

గుడిసెలో భార్యతో ఉండేవారట. తిండి తినే వారో లేదో తెలీదు. ఆయన ప్రక్కన ఉన్న ఒక ప్రయివేట్ స్కూల్ ప్రిన్సిపాల్ , ఈయన కమ్మగా పాడుకొంటుంటే “ఏమిటీ పొద్దున్నే ఈ దరిద్రపు పాటలు ఇక ఆపు” అని కేకలేయటం గుడిపూడి స్వయంగా చూసి కరిగిపోయి అంత గొప్పగాయకుడికి ఇంతటి అవమానమా అని బాధపడి వెంటనే హైదరాబాద్‌కు తనతో పాటు తీసుకొచ్చి తన ఇంట్లోనే 3 నెలలు ఆ దంపతులను ఉంచుకొని, అన్నిరకాల ఆదుకొంటూ తన స్కూటరుపై ఆయన్ను ఎక్కించుకొని ప్రముఖ సాహిత్య సాంస్కృతిక సంస్థల వారందరికి పరిచయం చేసి, ఒక రోజు రవీంద్ర భారతిలో 6 సంస్థల ఆధ్వర్యంతో రామారావుగారి సంగీత విభావరి, హనుమాన్ చాలీసా ఏర్పాటు చేస్తే, క్రిక్కిరిసి రసజ్ఞులతో హాలు నిండి, ఆయన గాన వాహినిలో జనం తన్మయం చెందారట వారికి తగినంత ఆరాధిక సాయమూ చేకూరింది. ఆ తర్వాత ఆయనే సుందర కాండ తెలుగులో రాసి అనేక సభలో పాడి మంచి ప్రచారం పొంది “సుందర దాసు” అయ్యారు అమీర్‌పేటలో స్వంత గృహం నిర్మించుకొని బాగా పాప్యులర్ అయ్యారు. ఏలోటూ లేకుండా గౌరవగా జీవించారు. గడిపూడి చెయి అందించకపోతే ఆ మహా గాయకుడి అరిస్థితి ఎలా ఉండేదో సుందరదాసుగారి మనవడు ఇప్పుడు సుందరకాండ పారాయణలో ఛానళ్లన్నీ దున్నేస్తున్న సంగతి మనకు తెలుసు.

ఇంకో విషయమ –రామోజీరావు తీసిన సినిమాను విక్టరీ మధుసూదనరావు డైరెక్ట్ చేశాడట. ఆ సినిమా గురించి హరి తన సహజ ధోరణిలో తానూ ఈనాడులో పనిచేస్తున్నా నిష్కర్షగా సమీక్ష రాశాడు. నిగ్రహించుకోలేని విక్టరీ రామోజీ దగ్గరకు వెళ్లి “మన సినిమాపై కూడా ఇలా రాస్తే ఎలాగండి. కాస్త పిలిచి చీవాట్లు పెట్టండి” అన్న బాధతో కంప్లైంట్ చేస్తే “అది ఆయన స్వభావం ఆయన సినిమాను సినిమాగా చూసి రాస్తాడు. అది నేను తీసిందా ఇంకోరు తీసినదా కాదు. అందులో పదార్థం ఉందా లేదా అనేదే ఆయన వెతుకులాట. మనం దీనిలో వేలు దూర్చరాదు. సినిమా బాగుంటే చూస్తారు. లేకపోతే లేదు మనకోసం ఆయన రాయడు అయన పద్ధతి అంతే” అన్నాడట. దిమ్మ తిరిగింది విక్టరీకి. ఆ సినిమా ఆడనే లేదట. గుడిపూడి సుమారు 4 వేల తెలుగు సినిమాలు ఒక వెయ్యి ఇంగ్లిష్ హిందీ సినిమాలు మొత్తం 5 వేలకు పైగా సినిమాలు చూసి మాత్రమే సమీక్షలు రాశాడు. ఇంట్లో కూర్చుని చూడాకుండా రాసినవి కావు అన్నాడు. ఒకసారి మద్రాస్‌లో తెలుసు సినీ ప్రొద్యూసర్లు అందరూ సమావేశమై శ్రీహరి సమీక్షలపై విరుచుకు పడ్డారని, రామోజీ తరపున కేస్ రామారావు వెళ్లి పాల్గొని గుడిపూడి ముక్కు సూటితనాన్ని తెలియ జెప్పారడని. చివరికి “కనీసం సమీక్ష హెడ్డింగ్ అయినా సౌమ్యంగా పెట్టమని కోరారని” కానీ తానూ వీటిని వేటినీ లెక్క చేయక తన ధోరణిలో తానూ రాసుకు పోయాయానని చెప్పాడు.

పద్మశ్రీ పిక్చర్స్ అధినేత, దర్శకుడు పి.పుల్లయ్య దగ్గర ఏదైనా సినిమాలో ప్రయత్నిద్దామని వెడితే "ఇదిగో అయ్యోరూ! ఇక్కడ సెట్ మీన నా నోటికి బండ బూతులొస్తాయి. అందరూ విని భరించి పనిచేస్తారు. నువ్వు బాగా సదూకున్నోడివి నీకిది వద్దులే అబ్బాయా" అన్నాడని చెప్పారు. రామోజీ అన్ని విషయాలు తనతో చర్చించేవాడని, గొప్ప ఆలోచనాపరుడని, వాళ్ళ సినీపత్రిక "సితార"లో కూడా తానూ సినీ సమీక్షలు రాశానని చెప్పారు. వెంగళరావు దాకా అందరు ముఖ్యమంత్రులతో తనకు మంచి పరిచయం, చొరవ ఉండేదని తన మాటకు విలువ ఉండేదని, ఆ తర్వాత వచ్చిన ముఖ్యమంత్రులెవ్వరూ తనకు తెలియరని అన్నారు. మరో ముఖ్యవిషయం చెప్పారు, ఎన్టీ రామారావు గారు తానూ ఆ రోజు చేయబోయే సినిమాలో తన స్క్రిప్ట్‌ను తెల్లవారు జాముననే భార్య బసవతారకం గారికి చదివి వినిపించేవాడని ఇది తానూ స్వయంగా చూసిన విషయమని గుడిపూడి చెప్పాడు. ఫిలిం సెన్సార్ బోర్డులోనూ హరి పని చేశాడు.

తనకు అన్నమయ్య సినిమా నచ్చలేదని అందులో ఎన్నో అసందర్భాలున్నాయని తానూ సమీక్షలో రాశానని అన్నాడు. ఒక అభిమాన జర్నలిస్ట్ ఇంటర్వ్యూ చూసిన ఆనందం కలిగింది. మిగిలిన విషయాలు పార్ట్-2లో

(16-7-17 -కాంప్-షార్లెట్-అమెరికా)

## వీక్లీ అమెరికా-16-2 (10-7-17 నుండి 16-7-17 వరకు)

## మరో రుద్రాభిషేకం వారం-2

12-7-17 బుధవారం టివి 5 దర్శకుడు విశ్వనాధ్‌కు గురుపౌర్ణమినాడు చేసిన గురుపూజోత్సవం "గురు బ్రహ్మ" చూసాం. దాని అధిపతి నాయుడుగారు చాలా భక్తి శ్రద్ధలతో కార్యక్రమం నిర్వహించారు. అందరూ చెప్పులు, బూట్లు బయటే వదిలి లోపలి వచ్చి కూర్చున్నారంటే ఎంత నిబద్ధత పాటించారో అర్ధమౌతుంది. ప్రముఖ గాయకుడు గంగాధర్ "లంగరే"శాడు, అంటే యాంకరింగ్ చేశాడు. సుస్పష్టమైన శబ్దోచ్చారణతో అపరఘంటసాల అనిపించే గానమాధుర్యంతో నిర్వహించిన తీరు ముచ్చటగా ఉంది. కళాతపస్వి విశ్వనాధ్‌తోపాటు శ్రీ కందాడై రామాచార్యులు, సంగీత దర్శకుడు ఆర్ పి పట్నాయక్, నటి నృత్య కళాకారిణి మంజుభార్గవి, కవి సిరివెన్నెల అన్నమయ్య ఫేమ్ భారవి, సినీ పాటల రచయిత రామజోగేశ్వరరావు వగైరాలు పాల్గొన్నారు. మంజు, మంజుల నాట్యం కనువిందు చేసింది. సిరివెన్నెల మాటల సిరివెన్నెల కురిపిస్తే పట్నాయక్ పాట కచేరీలా మాట్లాడితే కందాళై గురు పరమార్ధమ్ బోధిస్తే, భారవి విశ్వనాధుని కీర్తి స్తవం చేసి కార్యక్రమ రక్తి కట్టిస్తే విశ్వనాధ్ తనదైన

వినమ్ర శైలిలో కృతజ్ఞతలు తెలిపారు. సిరివెన్నెల చెప్పిన విషయం ఒకటి అందరు గుర్తించాలి. ఎందరెందరికో దాదాసాహెబ్ ఫాల్కే అవార్డు లభించింది. ఆ సందర్భంగా ఒకటో రెండో అభినందన సభలు జరిగాయి కానీ విశ్వనాథ్‌ను ఆ అవార్డు వరిస్తే, 2 నెలల నుంచి రోజూ ఎక్కడో అక్కడ సభ, సమావేశం, అభినందన చందనం జరుగుతూనే ఉన్నాయి. భారతదేశ చలన చిత్ర చరిత్రలో ఇంతటి వేడుక ఎవ్వరికీ జరగలేదు. ఒక్క విశ్వనాథ్‌కే ఆ అరుదైన గౌరవం దక్కింది కారణం ఆయన సినిమా ప్రతి ఇంటి సినిమా ఆయన ప్రతి ఇంటికీ చెందిన వాడవటం అందులో భారతీయ సంస్కృతీ ప్రతిఫలించటం ఆ కథల్లో తెలుగుదనం ఉట్టిపడటం, హృదయపు లోతుల్లోకి ఆయన పాట మాట నృత్యం దూసుకుపోయి తిష్టవేయటమే ఇంత అభిమానాన్ని సంపాదించి ఆయనకు ఆంధ్రాజనులు గుండెలో గుడి కట్టుకున్నారు. "విశ్వనాథ కళా కాశీ నాథుని" ప్రతిష్టించి పూజ సలిపారు" అన్నాడు. హృదయపు లోతుల్లోంచి వచ్చిన మాటలవి. గంగాధర శాస్త్రి విశ్వనాథ్ మరొక సినిమా తీయాలని ప్రొద్యూసార్లు రెడీగా ఉన్నారని అన్నాడు. కానీ నా ఉద్దేశ్యంలో విశ్వనాథ్ ఇక సినిమా తీయరాదు. ఉన్న కీర్తి అనుభవిస్తూ ఆనందించాలి. క్రియేటివిటీ ఎప్పుడూ ఉండదు .ఒక్కోసారి ఒట్టిపోతుంది. దానిలో నుంచి ఎంతపిండినా సారం రాదు. ఆయన వయసూ ఇక సహకరించదు కనుక ఆయనపై ఒత్తిడి తేరాదు.

టివి-5 వారు "హిందూ ధర్మం" అనే కొత్త ఛానల్‌ను ప్రారంభిస్తున్నారట. దానికి పాట సిరివెన్నెల రాయాలని, పట్నాయక్ స్వరకల్పన చేయాలని నాయుడుగారు కోరగా వేదిక మీదే సిరివెన్నెల పల్లవి రాసి వినిపించి అందరి కరతాళ ధ్వనులు అందుకొన్నాడు. నేత్రపర్వంగా జరిగిన ఈకార్యక్రమంలో విశ్వనాథ్ దట్టమైన తెల్లగడ్డం, మీసంతో కూచిపూడి సిద్ధేంద్ర యోగి ముఖవర్చస్సుతో వెలిగి పోయాడు అనిపించింది. టివి 5కు అభినందన చందనం .

గురువారం రాత్రి యు ట్యూబ్‌లో కేరక్టర్ నటి అన్నపూర్ణ ఇంటర్వ్యూ చూసాం. ఆమె నవ్వులో మాటలో ఎంతో స్వచ్ఛత గుబాళించింది. సినీ అమ్మలుగా శాంతకుమారి, నిర్మలమ్మ, అంజలీదేవి సూర్యకాంతంల తర్వాత ఆతల్లి పాత్రకు మరింత వన్నె తెచ్చింది అన్నపూర్ణ. తనను తానూ తీర్చిదిద్దుకొన్నది. తానూ ఏ వేషానికి పనికొస్తానో అర్ధం చేసుకొని అందులోనే శిఖరాయమానంగా నిలిచింది. స్వర్గం నరకం సినిమాలో హీరోయిన్‌గా ఉన్న ఆమె ఆ తర్వాత హీరోయిన్ వేషాలకు వెంపరలాడ లేదు. వేషాలకోసం ప్రాకులాలేదు. ఆమెను వెతుక్కొని వచ్చాయి వేషాలు. సార్ధక నటి అన్నపూర్ణ .

14-శుక్రవారం మధ్యాహ్నం హాస్య నటుడు రావికొండలరావు ఇంటర్వ్యూ చూసాం. క్రేన్స్ చలన చిత్రోత్సవంలో ప్రముఖ దర్శకుడు సత్యజిత్ రే "ఏ సినిమా

ప్రేక్షకులకు నచ్చుతుందో ఎవరూ ఊహించి చెప్పలేరు" అని చెప్పినమాట పరమ ప్రామాణ్యం అంటాడు రావి. డబ్బు నిలువ చేసుకోలేక హాస్య నటుడు కస్తూరి శివరావు మహా నటుడు నాగయ్య, అత్యుత్తమ విలన్ రాజనాల వంటి వారు జీవితం చివరి దశలో అత్యంత దీన స్థితిలో గడిపిన వైనాన్ని గుర్తుకు తెచ్చాడు. కస్తూరి రాజనాల వ్యసనాలకు బానిసలై ఉన్నదంతా పోగొట్టుకొన్నారు. ఆనాడే ఏ హీరో కూడా తీసుకోనంత అత్యధిక పారితోషికం లక్ష రూపాయలు తీసుకొన్న నాగయ్యగారు డబ్బు అజమాయిషీలేక చివరికి ఆయన నటించిన "బీదల పాట్లు"లాగా గడిపారన్నాడు. నాగయ్య గారి ఆనాటి లక్ష ఈనాటి లెక్కల్లో 15 కోట్లు ఉంటుంది అని అక్కినేని ఎప్పుడూ చెప్పేవాడని అన్నాడు.

ప్రముఖ హాస్యనటుడు పుణ్యమూర్తుల రాజబాబు తమ్ముళ్లు చిట్టిబాబు, అనంత్‌లు తామూ అన్నకు తక్కువ ఏమీ కాదని నిరూపించారు. ఇండస్ట్రీ తమను బాగా ఆదరించిందని తమకేమీ లోపం లేదని ధీమాగా చెప్పారు. చిట్టిబాబు ఇంటర్వ్యూలో రాజబాబు ఎన్టీ రామారావుతో సమానంగా ఆయనకు 30 వెలిస్తే తానూ 30 వేలు ఆయనకు లక్ష ఇస్తే డిమాండ్ చేసి తానూ లక్షా పారితోషికం తీసుకొన్న దమ్మున్న హాస్య నటుడు అన్నాడు. ఆయన చేయని పుణ్యకార్యాలు లేవని ఎం.జి.రామచంద్రన్ లాగా రిక్షావాలాకు చెప్పులు డ్రస్సులు కొనిపెట్టిన ఉదార హృదయయుడని, ఆయన పుట్టిన రోజు మద్రాస్‌లో మూడు రోజులు ఘనంగా జరుపుకొని దేశంలోని కళాకారులందర్నీ పిలిపించి ప్రయాణపు ఖర్చు లాడ్జింగ్ బోర్డింగ్‌లన్నీ పెట్టుకొని నాటకాలు బుర్రకథలు వగైరా చెప్పించి తగిన పారితోషికం ఇచ్చి పంపేవాడని అన్నాడు. అక్కినేని నందమూరి వగైరా అగ్రనటులనే కాక అందర్నీ "బాబాయ్" అని పిలిచే చొరవ ఉన్నవాడు అన్నాడు. వాళ్ళు కూడా రాజబాబు లేకుండా వేషాలు ఒప్పుకొనేవారు కాదట.

రాజబాబు సినీ అరంగేట్రంపై ఒక కథ చెప్పాడు. మొదటిసారి వేషం దొరికి మొదటి షాట్ రేలంగితో రేలంగి నౌకరు వేషం వచ్చింది. మేకప్ అయి రెడీగా ఉన్నాడు. వరుసగా అందరి మేకప్పులు అయి ఈయన యాక్టింగ్‌కు టైం ఉండటంతో ఆరుబయట స్నేహితులతో పిచ్చాపాటీ మాట్లాడుతూ వాళ్ళు చేయమన్న మిమిక్రీ చేస్తూ రేలంగిని కూడా అనుకరించమంటే అనుకరిస్తుండగా షాట్ రెడీ వార్త వచ్చి షూటింగ్‌కి వెళ్లి ఆ రేలంగి ఇమిటేషన్‌లోంచి బయటపడకుండానే మొదటి డైలాగ్ రేలంగితో ఆయన అనుకరణతో చెప్పాడట. ఇంకేముంది రేలంగి ఫైర్ అయి "ఎవడీ దొంగ నాకొడుకు నన్నే ఇమిటేట్ చేస్తున్నాడు. తీసిపారెయ్యండి ఈ రాస్కెల్‌ని" అని హుకుం జారీచేయగా ఎంత బ్రతిమాలినా వేషం దక్కక వెళ్లి పోయాడట. 4నెలల తర్వాత అదే రేలంగి తాను తీస్తున్న "సమాజం" సినిమాకు "ఒరే. ఆ రోజు నన్ను ఇమిటేట్ చేసిన పంతుల్ని పిలిపించండి వేషం వేయిద్దాం" అని పిలిచి వేషం ఇచ్చాడట. ఇదే రాజబాబు మొదటి

సినిమా.

రాజమండ్రి గోదావరి తీరంలో రాజబాబు కాంశ్య విగ్రహాన్ని మద్రాస్‌లోని హాస్య నటులందరూ కలిసి నిర్మించి ట్రెయిన్‌లో నాలుగు బోగీలలో వారంతా రాజమండ్రి వచ్చి ఆవిష్కరణ మహోత్సవంలో పాల్గొన్నారని అంతటి అభిమానం ఏ హాస్య నటుడికీ దక్కలేదని అన్నాడు. మనకు తెలియని ఎన్నో రాజబాబు రహస్యాలు విప్పి చెప్పాడు చిట్టితమ్ముడు చిట్టిబాబు.

## 15-7-17 శనివారం మరో రుద్రాభిషేకం

జూన్ 3న ఇక్కడ శ్రీ గ్రంధి హరి గారింట్లో ఆయన కోరికపై నేను రుద్రాభిషేకం జరిపించటం చూసిన కన్నడ దంపతులు శ్రీమతి మాలిని శ్రీ వాసుకి దంపతులలో మాలిని జూన్ 5వ తేదీ సోమవారం ఉదయం మా ఇంటికి వచ్చి ఇంగ్లిష్‌లో హరి గారింట్లో అభిషేకం బాగా చేయించానని మెచ్చి, జులై నెలల15వ తేదీ సాయంత్రం తమ ఇంట్లో రుద్రాభిషేకం నా ఆధ్వర్యం జరిపించాలని కోరితే సరే అన్నాను.

నిన్న అంటే శనివారం మధ్యాహ్నం 3 గంటలకు మా అమ్మాయి నన్ను కారులో వాళ్ళ ఇంటికి తీసుకొని వెళ్ళింది. 3.30కి మాలిని దంపతులచేత విఘ్నేశ్వర పూజ, శివ ఆవాహనం, అష్టోత్తర శతనామ పూజ లలితా అష్టోత్తరం వారి ఇలవేల్పు సుబ్రహ్మణ్యేశ్వర వల్లీ, దేవ సేన పూజ చేయించి రుద్రం ప్రారంభించేసరికి సాయంత్రం 5.15 అయింది. ఇంతలోకి రుద్రం చదివే వాళ్ళు సుమారు 10 మంది వచ్చారు. లఘున్యాసంతో రుద్రాభిషేకం ప్రారంభించి ఏకాదశ రుద్రం చేసి వచ్చిన వారందరి చేత చేయించి, మళ్ళీ అష్టోత్తరపూజ, నైవేద్యం హారతి ఇప్పించి అందరం కలిసి మంత్రం పుష్పం ఏక కంఠంతో చెప్పి వేద హోరుతో పునీతం చేసాం. ఆ తర్వాత భోజనాలు. దాదాపు 80 మందికి పైగానే వచ్చారు. రాత్రి 9 అయింది. అంటే సుమారు అయిదున్నర గంటల కార్యక్రమం. మాలిని కోరికపై నిర్విఘ్నంగా జరిగింది. తర్వాత భోజనాలు – టమేటా బాత్, రెండు స్వీట్లు, మజ్జిగ పులుసు వగైరాలు... నాకేమీ తినాలని పించక కొద్దిగా మజ్జిగ పులుసు కొంచెం పెరుగన్నం ఒక స్వీట్‌తో సరిపెట్టుకొన్నాను.

కన్నడ సంప్రదాయంలో మా దంపతులకు మాలిని వాసుకి దంపతులు మంచి నూతన వస్త్రాలు, 4 కొబ్బరికాయలతో "ఘనమైన నగదు" తాంబూలంతో సత్కరించి ఆశీర్వాదం అందుకొన్నారు. అప్పుడు ఆ దంపతులతో "ఇవాళ ఉదయం షష్ఠి సాయంత్రం సప్తమి తిధి. రేపు రాత్రి సూర్యుడు కర్కాటక రాశిలో ప్రవేశిస్తాడు కనుక దక్షిణాయనం వస్తుంది. ఇవాళ ఉత్తరాయణ మహా పుణ్యకాలంలో సప్తమి తిధినాడు మీ ఇంట్లో రుద్రం చేసాం" అనగానే వాళ్ళు "ఈజిట్ అంకుల్ వి.ఆర్ వెరీ ఫార్చ్యు నే ట్ యు డిడ్ వెరీ వెల్ అంకుల్" అని ఉప్పొంగిపోయారు. ఆ తర్వాత శివలింగాన్ని ఎందుకు

పూజించాలో కూడా క్లుప్తంగా చెప్పా. అలాగే –మాలిని అంటే మాలలు ధరించేది అని సరస్వతిదేవి అష్టోత్తరంలో మాలిన్యైనమః అని ఉందని వాసుకి శివుని కంఠాభరణమైన సర్పరాజని మాలిని హారంగా అంటే భర్తగా వాసుకి ఉన్నాడు కనుక వారిద్దరూ అర్ధ నారీశ్వరులని మొత్తమంతా ఇంగ్లిష్‌లో చెప్పా. ఎంతో సంతోషించి ఇలాంటి మంచిమాటలు ఒకసారి మా ఇంట్లో మళ్ళీ చెప్పాలి మీరు అంకుల్ అన్నది మాలిని. సరే అన్నా. ఆ దంపతులు ఇక్కడి సాయి సెంటర్‌కు వెన్నెముక వంటివారు. మాలిని గొప్ప సహాయకారి అని మా అమ్మాయి ఎప్పుడూ చెబుతుంది. కార్తీకమాసంలో మావాళ్ళు నిర్వహించే అభిషేక కార్యక్రమానికి ఆమె ఎంతగానో తోడ్పడుతుంది. మంచి మనసున్న మహిళ మాలిని. వాసుకి కూడా హిందూ సెంటర్లో జరిగే అన్ని కార్యక్రమాలకు మైక్ లైటింగ్ వగైరాలు దగ్గరుండి చూస్తాడు. అందుకే అంత అభిమానంగా ఇంతమంది వచ్చారు.

## మా షార్లెట్ మనవరాలు రమ్య

ఇక్కడ జరిగిన మొదటి సాయి కార్యక్రమంలో నాకు ఒక అమెరికా మనవరాలు దొరికింది. మా ఉయ్యూరు మనవరాలు రమ్య పేరే ఆమెదీ. మొదటి సారే చెప్పా. నువ్వు మామనవరాలవు అని. ఆమె పొంగిపోయింది. ఎప్పుడు కనిపించినా నేను మనవరాలు అనే పలకరిస్తాను. చక్కని నవ్వు అణకువ సంప్రదాయమున్న తమిళ అమ్మాయి తెలుగు కొంతవరకు బాగానే మాట్లాడుతుంది. ఇవాళ రుద్రాభిషేకం భోజనం అయ్యాక నా దగ్గరకు వచ్చి "అంకుల్! మీరు పట్టు బట్టలు రుద్రాక్షలతో చాలా "క్యూట్"గా కనిపించారు అంకుల్" అన్నది. నాకు మహా ఆనందం కలిగింది. అందరి భోజనాలు అయి ఇంటికి వచ్చేసరికి రాత్రి 10.45 అయింది. నా కొడాక్ కెమెరా పని చేయటం లేదు. అందుకని సెల్‌లో ఫోటోలు తీస్తున్నా వీటిని పెట్టాలంటే మా మనవడు చి॥ పీయూష్ ఎక్స్‌పర్ట్. వాడిపై ఆధార పడాల్సి వస్తోంది. ఇవాళ పొద్దున్న వాడితోనే పెట్టించా.

5 ఏళ్ళ క్రితం 2012లో షార్లెట్ వచ్చినప్పుడు అంతా "సాయి" హవా నడిచింది. ఇప్పుడు దాన్ని తిరగేస్తే "ఈశా" హవా నడుస్తోంది. ఈ వారం కథ ఇంతటితో సమాప్తం.

(16-7-17-కాంప్-షార్లెట్-అమెరికా)

**వీక్లీ అమెరికా-17** (17-7-17 నుండి 23-7-17 వరకు)

## వెంకయ్య నాయుడు వారం

17-7-17 సోమవారం- ఉపరాష్ట్రపతి పదవికి యెన్.డి.ఏ అభ్యర్థిగా శ్రీ

ముప్పవరపు వెంకయ్యనాయుడిని ప్రధాని మోడీ ప్రకటించాడు. మోడీ ప్రభుత్వం ఏర్పడిన దగ్గర్నుంచీ ఈ పేరు వినిపిస్తూనే ఉంది. వెంకయ్య మాత్రం "నేను ఉషాపతిని మాత్రమే ఉపరాష్ట్రపతిని కాను" అని ప్రకటిస్తూనే ఉన్నాడు. ఇప్పుడు తప్పలేదు. ఒక ఆంధ్రుడికి ఒక క్రియాశీలక కార్యకర్తకు వక్తకు ముఖ్యంగా మన భాష సంస్కృతులపై విశేషమైన అభిమానమున్న వెంకయ్యకు, అంటే ఆంధ్రులకు దక్కిన అరుదైన గౌరవం ఇది. మెజారిటీ ఎలానూ ఉంది కనుక ఎన్నిక లాంఛన ప్రాయమే.

వెంకయ్యపై నాకున్న అజ్ఞాత పరిచయం. బహుశా 1967-70 మధ్యకాలం అనుకొంటా సరిగ్గా గుర్తు లేదు. బందరు హిందూ కాలేజిలో లెక్కల మేస్టారుగా శ్రీ రాజనాల శివరామ కృష్ణ మూర్తి -ఆర్ ఎస్ కె మూర్తి అనే ఆయనతో పరిచయం కలిగింది. ఆయన లెక్కలు బాగా చెప్పేవారు. ఇంటిదగ్గర ట్యూషన్‌కు వందలాది విద్యార్థులు ఉండేవారు. ఇంగ్లీష్‌లో దిట్ట. ఆర్ ఎస్ ఎస్‌కు సుశిక్షిత కార్యకర్త బిజెపి నాయకుడు. జాగృతి వారపత్రిక ఆయనే చూసేవారు. అందులో సినిమా రివ్యూ చాలా గొప్పగా రాసేవారు. మీదు మిక్కిలి మంచి కథా రచయిత. హాస్యం అంతర్వాహినిగా ఉండేది ఆయన రచనలలో. మాకు ఫామిలీ ఫ్రెండ్. ఇద్దరం కలిసి శ్రీ కొల్లూరి కోటేశ్వరరావు గారి అభ్యర్థన మేరకు ఆయన శాసనమండలి ఎన్నికకు ప్రచారం కూడా చేసాం. మేస్టారూ అని ఆప్యాయంగా పిలిచేవాడిని.

అప్పుడాయన "సాందీపని" అనే మాస పత్రిక నడిపేవారు. దానిలో నన్ను కవితలు రాయమని కోరేవారు. అప్పుడాయన నెల్లూరి కుర్రాడు వెంకయ్య నాయుడు అనే అబ్బాయి చాలా వినయ వివేకశీలి బుద్ధిమంతుడు, గొప్ప కార్యకర్త. సాందీపనిలో రాస్తూంటాడు అని చెప్పేవారు. ఇదే అజ్ఞాత పరిచయం. నేను ఇందిరా గాంధీపై "కొమ్మా బొమ్మా అమ్మ" అనే వ్యంగ్య కవిత రాశాను. అది చదివి ఆయన సాందీ పనిలో ప్రచురించారు. కనుక వెంకయ్య రాసే పత్రికలో నేనూ రాయటం అజ్ఞాత పరిచయమే. తరచుగా వెంకయ్య మేష్టారి దగ్గరకు వచ్చి సలహాలు తీసుకొనేవాడు. ఆ తర్వాత ఆంధ్రా ఉద్యమంలో ఢిల్లీ నుంచి గల్లీ దాకా జరిపిన సభలలో వెంకయ్య, యలమంచిలి శివాజీ, వడ్డే శోభనాద్రీశ్వరరావు, సుంకర సత్యనారాయణ, కొమరగిరి కృష్ణమోహన్‌ల వంటి యువ రక్తం ఊరూరా ఉపన్యాసాలతో హోరెత్తించేవారు. విశాఖ ఉక్కు ఉద్యమంలోనూ ముందే ఉన్నారు. వాటి ఫలితం దక్కలేదు కానీ వీరి పాత్ర మరువలేనిది. వీరిలో శివాజీ థీరిటీషియన్. స్టాటిస్టిక్స్‌తో మాట్లాడేవాడు. ఉపన్యాసం రాణించేది కాదు. కొమరగిరి, వెంకయ్యలు దారాళపాత వక్తలు. బిజెపి ఆర్ ఎస్ ఎస్‌ను నరనరానా జీర్ణించుకున్నవారు. సుంకర కూడా వంకర ప్రాసలతో జనానికి కిక్కెక్కించేవాడు. శివాజీ రాజ్య సభ సభ్యత్వంతో చరణ్ సింగ్ అంతే వాసిత్వంతో

ఆగిపోతే, కొమరగిరి ఇక్కడే ఆగి ఒక ఆధ్యాత్మిక పత్రికా సంపాదకుడుగా బందర్‌కే పరిమితమైతే లక్కు ఎక్కడో లక్కలాపట్టి సుంకర కృష్ణాజిల్లా పరిషత్ చైర్మన్ అయ్యాడు. వద్దే లోక్‌సభ సభ్యుడు, రాష్ట్ర మంత్రీ అయ్యాడు. పార్టీని సిద్ధాంతాన్ని పూర్తిగా నమ్మి జనసంఘ్‌తో తర్వాత భారతీయ జనతాపార్టీతో నిబద్ధంగా ఉంటూ సుశిక్షిత ఆర్ ఎస్ ఎస్ కార్యకర్తగా అందరి అభిమానం పొంది, గొప్పవక్తగా ప్రాస యమక చక్రవర్తి గా అంచెలంచలు మీద ఎదిగి బిజెపి అత్యున్నత వ్యవస్థాగత స్థానం పొంది, ఆంధ్రా విభజన సమయంలో కీలక పాత్ర పోషించి అన్యాయం జరగకుండా ప్రయత్నించి, అటల్ బిహారీ వాజ్ పేయికి, లాల్ కృష్ణ అద్వానీకి అంతేవాసియై మోడీ ప్రధానికావటానికి అడ్డంకులు తొలగించి, తానూ కేంద్ర మంత్రిపదవి పొంది, ప్రతిపక్షాలతో చక్కని సంబంధం కలిగి సమస్యా పరిష్కారానికి తగిన వాదనిపించి, ఇప్పుడు ఉపరాష్ట్రపతి పదవి అందుకోబోతున్నాడు. నిబద్ధతకు తగిన ప్రతిఫలం ఇది. ఏనాడూ జంపింగ్ ఫ్రాగ్ కాలేదు. ఇది ఆంధ్రులందరు గర్వించదగిన సమయం. అందుకే ఈవారం వెంకయ్య వారం అన్నాను.

మంగళవారం గీర్వాణం-3లో కొండవీటి వేంకటకవిపై రాశాను. ఆస్ట్రో ఫిజిక్స్ ఆధారంగా బ్లండరే బ్లండర్, మూలకాలు అంతరిక్ష మార్పులు రాశాను. ఇక్కడి వేసవి ఉష్ణోగ్రత 100 ఫారం హీట్ డిగ్రీలు ఉంటోంది. యెన్ కస్తూరి అనే ఆయన రాసిన "లవింగ్ గాడ్" చదవటం ప్రారంభించి ఆపకుండా దాదాపు ఎనభై పేజీలు చదివాను. చాలా బాగా ఉంది. కేరళలో పుట్టి మైసూర్‌లో ఉద్యోగించి, ఎన్నో సేవా కార్యక్రమాలు చేసి, శ్రీరామకృష్ణ పరమహంస, వివేకానంద మార్గంలో ప్రయాణించి సత్యసాయికి దగ్గరై ఆయన జీవిత చరిత్రను తన జీవిత చరిత్రతో కలిపి చాలా బాగా రాశాడు. షిరిడీసాయి జీవిత చరిత్రకు దంబోల్కర్ అనే హేమాద్రిపంత్ రాసిన షిర్డీబాబా సచ్చరిత్ర ఎంత సాధికారమైనదో, శ్రీ కస్తూరి రాసిన "లవింగ్ గాడ్" సత్యసాయి జీవిత చరిత్రకు అంతటి ఆదేంటిక్ రచన అని అందరి అభిప్రాయం.

గురువారం పెన్సిల్వేనియా నుంచి శ్రీమతి శ్రీదేవి గారు మెయిల్ రాస్తూ తాను రెండు పుస్తకాలు పంపాననని, అందాయా అని అడిగి మనబ్లాగ్ చాలా ఆసక్తికరంగా ఉందని మెచ్చుకొన్నారు. ధన్యవాదాలు తెలియజేశాను. రాత్రి రాజేంద్ర ప్రసాద్ సినిమా "గుండమ్మగారి మనవళ్ళు" గొట్టంలో చూసాం. సరదా సినిమా .

శుక్రవారం శ్రీ మైనేనిగారు శ్రీ వాడ్రేవు చిన వీరభద్రుడుగారు "ముండకోపనిషత్"పై ప్రసంగం చూడమంటే చూశాను, బాగుంది. దీనితోపాటు స్వామి రామా ఉపనిషత్తులపై ఆంగ్ల ప్రసంగం అద్వైత వేదికలో శ్రీ అరవిందరావు ప్రసంగాలూ చూశాను. దేనికదే అనర్ఘ రత్నం.

**షార్లెట్ సాహితీ మైత్రీ బంధం**

22-7-17 శనివారం ఉయ్యూరు శ్రీ సువర్చలాన్జనేయ స్వామి దేవాలయంలో ఉదయం అభిషేకం శాకాంబరీ పూజ, సాయంత్రం శాకాంబరీ పూజా విశేషాలపై ప్రసంగం బాగా జరిగాయి రమణ అన్నీ దగ్గరుండి నిర్వహింపజేశాడు.

సెప్టెంబర్ 5 మంగళవారం ఉపాధ్యాయ దినోత్సవం నాడు నాకూ మైనేనిగానికి గురువులైన కీ.శే శ్రీ కోట సూర్యనారాయణ శాస్త్రి గురు వరేణ్యుల గురుపూజోత్సవ కార్యక్రమాన్ని శ్రీ గోపాలకృష్ణ గారు, మా గురుపుత్రులు శ్రీ కోట సోదరులతో మా అబ్బాయి రమణతో సంప్రదించి నిర్ణయించాము. రాత్రి అన్నమయ్య సినిమా ట్యూబ్‌లో చూసాం.

23-7-17 ఆదివారం ఉదయం అంతా తీవ్రమైన ఎండ సాయంత్రం మంచి వర్షం కురిసింది. వీక్లీ న్యూస్ సమాప్తం.

(23-7-17 -కాంప్-షార్లెట్-అమెరికా)

## వీక్లీ అమెరికా-18 (24-7-17 నుండి 30-7-17 వరకు)

## సుందరకాండ లలితాసహస్ర పారాయణ, గృహప్రవేశ, కూచిపూడి రంగప్రవేశ వారం

24-7-17 సోమవారం -శ్రావణ మాసం ప్రారంభం. న్యాయవాది నాటక సినీ నటుడు, ప్రజాన్యాయ ఉద్యమ నిర్మాత సి.వి.ఎల్ నరసింహారావుతో యు ట్యూబ్‌లో ఇంటర్వ్యూ చూశాను. ఆయన ఉద్దేశ్యంలో కొత్త చట్టాలు తేవక్కరలేదు. ఇంకో వంద యేళ్ళ వరకు కావలసిన చట్టాలు ఉన్నాయి. వాటిని అమలు పరచటంలోనే సమస్య. ఆ చొరవ ప్రభుత్వం తీసుకొంటే చాలు. అమలు అతి వేగవంతంగా జరగాలి. చట్టంపై భయంతో పాటు భక్తీ ఉండాలి. ప్రజలకు అవగాహన కల్పించాలి. లేబర్‌కు ప్రభుత్వం ఎన్నో సదుపాయాలూ కలిపించింది లాయర్లను వారికి ఏర్పాటు చేస్తోంది. ఇది తెలియని చాలామంది సామాన్యులున్నారు. మా దగ్గర కొచ్చేవారికి ఈ విషయం చెప్పి ప్రభుత్వం ఏర్పాటు చేసే న్యాయవాదుల దగ్గరకు మేమె పంపుతున్నాము. మా దంపతులం కౌన్సిలింగ్ చేసి ఎన్నో కుటుంబాలను ఎందరో దంపతులను కాపాడాం అన్నాడాయన. అందరూ చూడాల్సిన ఇంటర్వ్యూ. 20వ శతాబ్ది అరుదైన మహా సంస్కృత విద్వాంసుడు కపాలి శాస్త్రి గురించి గీర్వాణం-3లో 381వ కవిగా రాశాను.

మంగళవారం "అలంకారిక ఆనంద నందనం" సీరియల్ రాయటం మొదలు పెట్టాను. అవధాన సరస్వతి శ్రీ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్ మెచ్చి చదువుతూ సలహాలతో మార్గదర్శనం చేస్తుండటం నాకు ఆనందంగా ఉంది.

బుధవారం -కాకినాడలో ఉన్న మా శిష్యుడు చిలుకూరి కొడుకుకు

ఎం.బి.బి.ఎస్ కౌన్సెలింగ్ లో శ్రీకాకుళం ప్రయివేట్ మెడికల్ కాలేజ్‌లో కన్వీనర్ కోటాలో సీటు వచ్చిందని ఫోన్ చేసి చెప్పాడు. మా కుటుంబం అంతా చాలా సంతోషించాం. ఆలంకారికులు 2,3 భాగాలు రాశాను.

బీహార్ ముఖ్యమంత్రి నితీష్ కుమార్ అకస్మాత్తుగా రాజీనామా చేసి లాలూ ముఠాను వదిలించుకొని "కమలాన్ని" చేత ధరించి మళ్ళీ 6వసారి ముఖ్యమంత్రి అయ్యాడు. చాణక్యానికి మించిన ఉదాహరణ.

27-7-17 గురువారం -శ్రీ సుందరకాండ 56వ 9 రోజుల పారాయణ మొదటి రోజు ఉదయం 7.30కు మొదలు పెట్టి 9.30కి పూర్తి చేశాను. రోజుకు ఒక శ్రీ సువర్చలాన్జనేయ శతకం కూడా చదవటం మొదలు పెట్టాను. ఆలంకారికులు 4,5 భాగాలు రాశాను.

28-7-17 శుక్రవారం- పారాయణ రెండవ రోజు పూర్తి చేశాను. మా అల్లుడి వద్ద వేదం నేర్చుకున్న శ్రీ నూకల రాంబాబు గారింట్లో నూతన గృహప్రవేశానికి వెళ్లాం. పురోహితుడు మా మంటాడలోని శ్రీ వెంకటేశ్వర స్వామి దేవాలయంలో సుమారు 30 ఏళ్ళక్రిందట ఉన్న పూజారి శ్రీ బలరామాచార్యులే. ఇక్కడికి వచ్చి 27 ఏళ్ళు అయిందట. శ్రీ సత్యనారాయణ స్వామి వ్రతం, వాస్తుహోమం కూడా చేశారు. మా ఇద్దరికీ నూతన వస్త్రాలు పెట్టి ఆశీస్సులు పొందారు రాంబాబు ఉషా దంపతులు. తర్వాత భోజనాలు- పూర్ణాలు, గారెలు పులిహోర వంకాయ కూర పప్పు సాంబారు పెరుగుతో భోజనం. నేను స్వీటు, పెరుగన్నంతో సరిపుచ్చుకున్నాను.

## సరసభారతి 105వ సమావేశంగా లలితా సహస్రనామ పారాయణ

రాంకీ దంపతులు ఈ మొదటి శుక్రవారం రాత్రి 7 గంటలకు వాళ్ళ ఇంట్లో లలితా సహస్ర నామ పారాయణ చేస్తూ మా శ్రీమతిని మా అమ్మాయినీ పిలుస్తూ "పోతు పేరంటాలు"గా నన్నూ రమ్మన్నారు. ముగ్గురం వెళ్లాం. భక్తిగా చేశారు. దీన్ని సరసభారతి 105వ కార్యక్రమంగా అందరి అనుమతితో నిర్వహించాం. అనుకోకుండా ఇక్కడ కొందరు పరిచయమయ్యారు. నా మిత్రుడు శ్రీ పసుమర్తి ఆంజనేయ శాస్త్రిగారి బంధువులు శ్రీ దూర్వాసుల కామేశ్వరరావు దంపతులు శాస్త్రిగారి స్వగ్రామం కృష్ణాజిల్లా కూడేరులో వారి శ్రీ దాసాంజనేయ స్వామి దేవాలయ ప్రాంగణంలో నవగ్రహ ప్రతిష్ట చేశారట. కామేశ్వరరావుగారి భార్య రాంకీ భార్య శ్రీమతి ఉషకు అమ్మక్కయ్యే. ఆయన విశాఖ స్టీల్ ప్లాంట్‌లో పనిచేస్తున్న శాస్త్రి గారి రెండవ అబ్బాయి సుబ్రహ్మణ్యంకు ఆఫీస్ బాస్. వీరుకాక గండి గుంటవారైనా మహిళ ఉయ్యూరు శాసనసభ్యులు స్వర్గీయ శ్రీ అన్నే బాబూరావు గారి మేనకోడలు. మరొకామె కెసిపిలో ఉద్యోగి కుమార్తె. ఇంకోరు చల్లపల్లి వారు. మరొకామె నాదెళ్ల అంజయ్యగారి మనవరాలు. తమాషాగా ఎలా

కలిశారో ఆశ్చర్యమేసింది. అందరం ఆనందించాం. పారాయణ తర్వాత అందరికి ఉపాహారం. మహా రుచిగా ఉన్న పనస తొనలు ప్రత్యేకం.

నేను సరస భారతి గురించి రెండుమాటలు చెప్పి షార్లెట్‌లో రెండవ సమావేశమూ రాంకీ వాళ్ళ ఇంట్లో జరగటం దానికి ఆ దంపతుల తోడ్పాటుకు ధన్యవాదాలు చెప్పి, ఇందులో పాల్గొన్నవారంతా సరసభారతి సభ్యులే అని తెలియజేశాను. తర్వాత లలితా సహస్రనామ విశేషాలు, శ్రావణమాస ప్రాముఖ్యత క్లుప్తంగా 8 నిమిషాలలో చెప్పాను– దాని సారాంశం తెలియ జేస్తున్నాను.

"లలితా సహస్ర నామాలలో శాస్త్రీయ దృక్పధం ఉంది. మహామేధావి శాస్త్రజ్ఞుడు అయిన్ స్టీన్ చెప్పిన సాపేక్ష సిద్ధాంతం ఇందులో ఉంది. పదార్ధం దాని శక్తి యొక్క ప్రతిక్రియ వలన ఈ ప్రపంచం నడుస్తుంది. పదార్ధానికి, శక్తికీ భేదం లేదు. పదార్ధం శక్తిగా శక్తి పదార్ధంగా మారుతుంది. శక్తి యొక్క స్థూల రూపమే పదార్ధం. పదార్ధం పరమశివుడైతే శక్తి పరమేశ్వరి. శివుడు శక్తి ఒకే శక్తికి రెండు రూపాలు. ప్రతి పదార్ధంలోను శక్తి నిగూఢంగా ఉంటుంది. ఆ శక్తియే శ్రీ లలితా పరమేశ్వరి –"యస్య యస్య పదార్ధస్య యాయా శక్తి రుదాహృతా –సా సా సర్వేశ్వరీ దేవీ, శక్తిమంతో మహేశ్వరః" అన్నారు. భండాసురుడు మొదలైన రాక్షసులు జడత్వానికి అజ్ఞానానికి, బద్ధకానికి ప్రతీకలు. జడత్వం వదిలే దాకా వాళ్లకి వాళ్లలో ఉన్న శక్తి తెలియదు. ఆ శక్తినీ శ్రీ మాత అంటాం. జడత్వాన్ని సంహరించి చైతన్య జ్ఞాన ప్రకాశం కలిగిస్తుంది. లోపలి శక్తి మేల్కొనాలి అంటే సాధన చేయాలి. లలితా సహస్ర పారాయణ చేస్తే అమ్మవారు మనల్ని చెయ్యిపట్టుకొని ముందుకు నడిపిస్తుంది. చైతన్య యాత్ర చేయిస్తుంది. ఈ సహస్ర నామాలలో చివర పరమేశ్వరి శివుని అభిన్న రూపంగా తాదాత్మ్యం చెందుతుంది. లలితా రూపం లోజగదాంబ దర్శన మిస్తుంది. ప్రతినామం ఒక మజిలీ. లలితా స్తోత్రం అంటే శ్రీదేవి దివ్య విభూతి, విజ్ఞాన సర్వస్వము. ఈ భావాలు అర్ధం చేసుకొని పారాయణ చేస్తే అలౌకిక ఆనందం కలిగి మోక్షం కలుగుతుంది.

"ఇప్పుడు శ్రావణ మాసం విశేషాలు తెలుసుకొందాం. శ్రవణా నక్షత్రం పౌర్ణమి నాడు ఉన్న నెల శ్రావణ మాసం విష్ణు మాసం. ఈ నెలలోనే విష్ణువు ఉద్భవించాడు. ఈ మాసంలోనే బ్రహ్మ మొదటిసారి విష్ణు సందర్శనం చేశాడు. తిరుమలలోని గోవిందుడూ ఈ నెలలోనే వెలుగు చూశాడు. శ్రావణ శుద్ధ పంచమి నాగ పంచమి లేక గరుడ పంచమి అంటారు. గరుత్మంతుడు తన తల్లి వినతాదేవి బానిసత్వాన్ని పోగొట్టిన రోజు. తానూ విష్ణువుకు వాహనమైన రోజు. గరుడ పురాణం ఆవిర్భవించిన రోజు కూడా పంచమి తిథినాడే.

శ్రావణ శుద్ధ ఏకాదశి పుత్రాది ఏకాదశి. మొగ సంతానం కోసం నోములు

నోస్తారు. గొడుగులు దానం ఇస్తారు. ద్వాదశి దామోదర ద్వాదశి. విష్ణువుకు ప్రీతికరం. త్రయోదశి చతుర్దశి శివ పార్వతుల పూజ చేస్తారు. శ్రావణ పౌర్ణమి జంధ్యాల పౌర్ణమి రాఖీ పున్నమి కూడా. హయగ్రీవుడు వైఖానస ముని జన్మించిన రోజు. సంతోషిమాత అవతరించిన రోజు కూడా. ఈ రోజుననే అగస్త్య మహర్షికి హయగ్రీవుడు లలితా సహస్రనామం బోధించాడు.

శ్రావణ బహుళ చవితి సంకష్ట హరణ చతుర్థి. అష్టమి శ్రీ కృష్ణ జన్మాష్టమి. శ్రావణ అమావాస్య పోలాల అమావాస్య.

కొత్తగా పెళ్లి అయిన అమ్మాయిలూ శ్రావణ గౌరీవ్రతం ప్రతి మంగళవారం చేసి వాయినాలు ఇస్తారు. తమకు దీర్ఘ సుమంగళీత్వం లభించాలని చేసే వ్రతం ఇది. పౌర్ణమికి ముందువచ్చే శుక్రవారం శ్రీ వరలక్ష్మీ వ్రతం. ఇన్ని విశిష్టతలున్న మాసం శ్రావణమాసం. అందరికి శుభాలు కలిగించాలని ఆ జగదేక మాతను ప్రార్థిద్దాం.

## 29-7-17 శనివారం-కుమారి రచిత కూచిపూడి రంగ ప్రవేశం

సాయంత్రం 5 గంటలనుండి 8.45 వరకు కమ్యూనిటీ హాల్‌లో కుమారి రచిత కూచిపూడి రంగ ప్రవేశానికి వెళ్లాం. ఈమె గురువు శ్రీమతి మాడభూషి పల్లవి. 7వ ఏటనుంచే నాట్యం అభ్యసించింది. గణపతి ప్రార్ధన, వాణీ పరాకులతో ప్రారంభించి కొలువైతివా రంగసాయి అనే స్వర్గీయ దేవులపల్లి కృష్ణ శాస్త్రిగారి విప్రనారాయణ సంగీత నాటకంలో రాసిన దాన్ని అభినయించింది. తర్వాత గోవర్ధన గిరిధార చేసింది. 6 గంటలకు విరామం -బిస్కట్లు శ్వీట్లు వగైరాలు టీ. మళ్ళీ 6.15కు ప్రారంభం. అంబాష్టకం, తర్వాత కొలువై ఉన్నాడే, చేసింది అన్నీ రాగమాలికలే. కురవంజి రాగంలో ముద్దుగారే యశోదా అన్నమయ్య కీర్తన చేసింది. చివరికి కుంతలవరాలి రాగంలో మంగళంపల్లి బాలమురళీ కృష్ణ తిల్లానాతో రాత్రి 8.45కు పూర్తి చేసింది. తర్వాత రెండు స్వీట్లు, పప్పు, కూర, చపాతీ, బిర్యానీ వగైరాలతో మంచి విందు హాజరైన దాదాపు 300పై జనాలకు ఆత్మీయంగా ఏర్పాటు చేశారు. నేను రెండు స్వీట్లు "కరుడన్నం"తో సరిపెట్టుకున్నా.

బాగానే చేసింది కానీ నృత్యం ఆత్మ కనిపించలేదు. అన్నమయ్య గీతంలో రతికేళీ రుక్మిణి దగ్గర మంచి హావ భావాలు చూపించింది. పెద్ద వెలితి ఏమిటి అంటే కాలికి గజ్జలు కట్టలేదు. ఆ సవ్వడి లేకపోవటంతో మొత్తం ప్రోగ్రామ్ తేలిపోయింది అనిపించింది. అమెరికాలో మేము చూసిన రెండవ రంగ ప్రవేశమిది. 2002లో మొదటిసారి అమెరికాకు హూస్టన్‌కు వచ్చినప్పుడు మా బంధువు శ్రీమతి వావిలాల లక్ష్మిగారు మా ఇద్దరినీ రైస్ యూనివర్సీటీలో నాసాలో పని చేసే ఆంధ్రా దంపతుల అమ్మాయి రంగ ప్రవేశానికి తీసుకు వెడితే చూసాం. చాలా బాగా చేసింది. అక్కడే

జానపద గాయని శ్రీమతి అనసూయ (కృష్ణ శాస్త్రిగారి మేనకోడలు) గారమ్మాయి శ్రీమతి రత్నపాప గారిని అనసూయగారినీ మొదటిసారి చూసి మాట్లాడాం. ఒక రకంగా బంధుత్వం ఉంది. మా అమెరికా మేనల్లుడు శాస్త్రి అనే జె వేలూరి కూతురు వీణ రెండేళ్లక్రితం కాలిఫోర్నియాలో ఇలాగే కూచిపూడి రంగ ప్రవేశం చేసింది. మా అమ్మాయి షార్లెట్ నుంచి వెళ్లి చూసి వచ్చింది. ఈ వారం వీక్లీకి సమాప్తం పలుకుతూ సెలవ్.

(30-7-17-కాంప్-షార్లెట్-అమెరికా)

## **వీక్లీ అమెరికా-19-1** (31-7-17 నుండి 6-8-17 వరకు)
## **సుందరకాండ పూర్తి, వరలక్ష్మీ వ్రత, సరసభారతి 106వ సమావేశ వారం**

31-7-17 సోమవారం- ఉదయం సంధ్యావందనం, నిత్యపూజ, ఆంజనేయ అష్టోత్తర, సహస్ర నామ, సువర్చలా అష్టోత్తరపూజ తర్వాత తొమ్మిదిరోజుల సుందరకాండ శ్రీ సువర్చలాన్జనేయ శతక పారాయణలో 5వ రోజు పారాయణ ఉదయం పూర్తి చేశాను. మా అమ్మాయి కొత్త ఉద్యోగంలో చేరింది. మధ్యాహ్నం యు ట్యూబ్ జయ టివిలో మార్గశిర సంగీత ఉత్సవం చూశాను. చాలా అద్భుతంగా ఉంది. తమిళ తెలుగు కన్నడ మళయాళ హిందీ భాషలో గొప్ప సంగీత కచేరీలు కర్ణానందంగా ఉన్నాయి. అలంకారిక ఆనంద నందనం-8, 9 ఎపిసోడ్స్ రాశాను. రాత్రి "గొట్టం"లో విశ్వనాథ్ సినిమా "స్వరాభి షేకం" చూశాము. ఆనందంతో గుండె కరిగి ఆనందబాష్పాలు అడుగడుక్కీ కారి మహదానందమేసింది. ధన్యుడు విశ్వనాథ్. మనల్నీ ధన్యులను చేశాడు. అందులో రైల్వే కంపార్ట్‌మెంట్‌లో శివాజీరాజా భార్య ప్రసవం సీను సెంటిమెంట్‌కు, మానవత్వానికి, సంగీత ప్రభావానికి, హోమియో మందు ప్రయోజనానికి అద్దం పట్టింది. గుండెలు కరిగి ఆనంద తాండవమే చేయిస్తుంది. మొత్తం సినిమాలో ఒక పావుగంట సినిమా ఎడిటింగ్‌లో తీసేసి ఉంటే శిఖరాగ్రాన నిలిచేది అనిపించింది.

ట్యూబ్‌లో ఫైట్ మాస్టర్స్ రామ్-లక్ష్మణ్ కవల సోదరుల ఇంటర్వ్యూ చాలా ఇంటరెస్టింగ్‌గా రియలిస్టిక్‌గా వాళ్ళ నిజాయితీకి నిదర్శనంగా ఉంది. పల్లెటూరు నుంచి సినీ పరిశ్రమకు వచ్చి ఎన్నో కష్టాలు పడి, ఏ దశలోనూ తమ నాయనమ్మకు సిగరెట్ మద్యం జోలికి వెళ్ళమని చేతిలో చెయ్యేసి పెట్టిన ఒట్టును, ఇచ్చిన మాట జవదాటకుండా, అంచెలంచెలుగా ఎదిగి ఫైట్ మాస్టర్లు అయి సిగరెట్, మద్యం లేకుండా పైకొచ్చిన సోదరద్వయం వీరు. హీరోలుగానూ చేసి శెభాష్ అనిపించారు. అందులో వాళ్ళు "మేము మంచివాళ్ళం అని అనుకునేవాళ్లం. ఇది కూడా గర్వానికి దారి తీస్తుందని మేమే గ్రహించి ఆ మాట చెప్పుకోవటం మానేసాం. ప్రతి స్టేజ్‌లోనూ మా అంతటికీ మేము చెక్ చేసుకొని చేసిన తప్పులు తెలుసుకొని పురోగమించాం" అని వారిద్దరూ

ఏకకంఠంతో చెప్పటం నాకు బాగా నచ్చింది.

1-8-17 మంగళవారం- పారాయణ ఆరవ రోజు బాగానే జరిగింది. ఆలంకారికులు 10,11 రాసి పూర్తి చేశా.

బుధవారం-7వ రోజు పారాయణ. గీర్వాణ కవుల కవితా గీర్వాణం-3 లో 382,383 ఎపిసోడ్‌లు రాశాను.

గురువారం-పారాయణ 8వ రోజు. గీర్వాణం-3 లో 384 నుండి 387 వరకు కవుల గురించి రాశాను. రాత్రి యు ట్యూబ్‌లో హాస్య చిత్ర దర్శకుడు రాజా వన్నేం రెడ్డి ఇంటర్వ్యూ చూశాను. "క్షేమంగా వెళ్లి లాభంగా రండి" ఆయన దర్శకత్వం వహించిన మొదటి సినిమా సూపర్ సక్సెస్. ఆయనే డైరెక్ట్ చేసిన ఒక కుక్కపై తీసిన "టామీ" సినిమా అవార్డులను పొందింది. రాజేంద్ర ప్రసాద్ అందులో హీరో. ఎక్కడో దారిలో ఒక కుక్క ఆయన వెంటపడి ఇంటికి వస్తే దాన్ని అల్లారుముద్దుగా పెంచుకొంటూ అదే సర్వస్వంగా గడుపుతాడు. రోజూ అతను రైల్‌లో వేరే చోటుకు వెళ్లి ఉద్యోగం చేసి, సాయంత్రం ఇంటికి వస్తాడు. కుక్క ఆయనతో స్టేషన్‌కు వెళ్లి మళ్ళీ సాయంత్రం ఆ ట్రెయిన్ వచ్చే సమయానికి అక్కడికి వెళ్లి వెంట తీసుకు వస్తుంది. అంత బాంధవ్యం ఏర్పడుతుంది వాళ్ళిద్దరికీ. ఒకరోజు యధా ప్రకారం ఆయన వెళ్ళాడు కానీ, తిరిగి రాలేదు. ఆ విశ్వాసపు కుక్క ఏళ్ళ తరబడి రైల్వే స్టేషన్ దగ్గర అలాగే ఎదురు చూస్తూ తిండీ నీరు లేక చనిపోయింది. అతను కూడా ఎక్కడో చనిపోయాడన్నమాట. విశ్వసానికి ప్రతీకగా టామీ కుక్క నిలిచిపోయింది. ఈ కథ జపాన్‌లో యదార్థంగా జరిగింది. ఆ కుక్క విగ్రహం స్థాపించి దాన్ని చిరస్మరణీయం చేశారట. ఆ కథకు ప్రేరణ పొందిన వన్నేం రెడ్డి మన వాతావరాణానికి తగిన మార్పులు చేసి తీశానని చెప్పాడు. అందులో రాజేంద్ర ప్రసాద్ నటన అద్వితీయమని, కుక్క నాలుకను తన నాలుకతో తాకటం తన నాలుకను కుక్క తాకి నాలుకపై ఉన్నది తినటం దృశ్యాలలో ఏ మాత్రం సంకోచం, అసహ్యం పడకుండా రాజేంద్ర చేయటం అతని నిబద్ధతకు నిదర్శనం అన్నాడు. అలా చేసిన నటుడు ఎవరూ ఉన్నట్లు తనకు తెలియదనీ రాజేంద్రను మెచ్చాడు. హాట్స్ ఆఫ్ రాజేంద్ర.

మదర్స్ డే సందర్భంగా ఎప్పటిదో- రాజీవ్ కనకాల, వాళ్ళ అమ్మగారితో ఇంటర్వ్యూ అతని చెల్లెలు శ్రీలక్ష్మితో ముఖాముఖీ బాగున్నాయి. అందరికీ ఆదర్శంగా కనకాల కుటుంబం నిలిచింది. సుమారు 20 ఏళ్ళక్రితం వేటూరి సుందర రామమూర్తిగారి స్వగ్రామం కృష్ణాజిల్లా పెదకళ్లేపల్లిలో ఆయన తన ఇంట్లో ఆతిధ్యమిచ్చి జరిపించిన రెండురోజుల సభలో కనకాల దేవదాస్ దంపతులను, విశ్వనాధ్, బాలు, సప్తపది సినీ హీరోయిన్ సబితా వగైరాలను మేమిద్దరం చూసి మాట్లాడిన విషయాలు గుర్తుకొచ్చాయి.

## 4-8-17 శుక్రవారం-సుందర కాండ పారాయణం పూర్తి వరలక్ష్మీ వ్రతం

శ్రావణ మాసం రెండవ శుక్రవారం శ్రీ వరలక్ష్మీ వ్రతం. ఉదయం 4 గంటలకే లేచి కాలకృత్యాలు తీర్చుకొని 5 గంటలకు నిత్యపూజా, శ్రీ సువర్చలాన్జనేయ అష్టోత్తర, శతనామ పూజ చేసేసరికి ఉదయం 6.30 అయింది. రాత్రి తల్లీ కూతుళ్లు అమ్మవారిని సర్వాలంకార శోభితంగా అలంకరించి గొప్ప శోభ చేకూర్చారు. అమ్మవారికి కట్టిన చీర చాలా శోభస్కరంగా ఉంది. అప్పటికే మా అమ్మాయి వాళ్ళమ్మ లేచి వంట సగంపైనే చేసేశారు. 6.30 నుండి 7.45 వరకు వాళ్ళిద్దరికీ వరలక్ష్మీ వ్రతం యధా ప్రకారం చేయించి తోరపూజ తోరధారణ మంత్రాలు చెప్పి కథ చెప్పి వాయినాలు ఇప్పించేశాను. మా అమ్మాయి 8 గంటలకు బయల్దేరి ఆఫీస్‌కు వెళ్ళింది. నేను తొమ్మిది రోజులలో చివరి రోజు సుందరకాండ, శ్రీ సువర్చలాన్జనేయ శతక పారాయణ పూర్తి చేసేసరికి ఉదయం 8.45 అయింది. నైవేద్యంగా పూర్ణం, బూరెలు, గారెలు, పులిహోర, పాయసం, పప్పు, వంకాయ కూర, కొబ్బరి చట్నీ. ఇంతలో శ్రీమతి ప్రక్కి అరుణ దంపతులు వచ్చారు. నైవేద్య హారతి మంత్రపుష్పం పూర్తయ్యేసరికి 9.15 అయింది. అరుణ దంపతులు మా దంపతులకు వస్త్రాలు అందజేసి వాయనం ఇచ్చుకున్నారు. ఆమెకూ మా వాళ్ళు కొత్త చీర జాకెట్ పెట్టి వాయనం ఇచ్చారు. తర్వాత టిఫిన్ చేశాను.

సుమారు 11 గంటలకు ప్రముఖ మృదంగ విద్వాన్ శ్రీ ఎల్లా వెంకటేశ్వరరావు గారి అల్లుడు వచ్చి వాళ్ళ ఇంటికి కారులో తీసుకువెళ్లాడు. ఎల్లా వారమ్మాయి 5 ఏళ్ళ క్రితం ఇక్కడే పరిచయం. అప్పుడే వాళ్ళ నాన్నగారితో ఫోన్‌లో మాట్లాడుతుంటే మేమూ ఆయనకు నమస్కారాలు చెప్పాం. అయిదేళ్ల క్రితం వారు మా అమ్మాయిగారింటికి రావటం ఆయనను నేను "టోరీ రేడియో"కు ఇంటర్వ్యూ చేయటం ఆయన మా ఇంట్లో భోజనం చేయటం జ్ఞాపకం వచ్చాయి. ఆయన మర్చిపోలేదు. ఏడాది క్రితం ఇక్కడికి వచ్చినప్పుడు నాతో ఉయ్యూరుకు ఫోన్‌లో మాట్లాడారు. విజయ మా ఇద్దరికీ బట్టలు పెట్టి వాయనమిచ్చి టిఫిన్ పెట్టింది. మేము వాళ్ళ ఇంటికి వెళ్ళటం ఆమె ఆనందానికి అవధులు లేవనిపించింది.

ఇంటికి రాగానే శ్రీమతి గోసుకొండ అరుణ కారులో వాళ్ళింటికి తీసుకువెళ్లి ఆదంపతులు మాకు బట్టలుపెట్టారు. వాయనం ఇచ్చారు. ఈ రెండు ఇళ్లకు మాతోపాటు మా ప్రక్కనున్న శ్రీ మతి సుగుణ కామాక్షిగారు కూడా వచ్చారు. ఇంటికి వచ్చి భోజనం చేసి సరికి మధ్యాహ్నం 1.30 అయింది. మధ్యాహ్నం 3 గంటలకు పవన్ భార్య శ్రీమతి రాధ మా ఆవిడను కారులో ఇంటికి తీసుకువెళ్లి వాయనం ఇచ్చి, చీర జాకెట్ పెట్టింది.

సాయంత్రం ఆఫీస్ నుంచి వచ్చాక మా అమ్మాయి, వాళ్ళమ్మ కలిసి పిలిచిన వాళ్ళ ఇంటికి పేరంటానికి వెళ్లి వచ్చారు. ఇంటికి వచ్చిన వారికి వాయనమిచ్చారు. రాత్రి 9 గంటలకు రాంకీ తమ్ముడు పవన్ భార్య శ్రీమతి పద్మశ్రీ వచ్చారు. పద్మశ్రీ అమ్మవారిపై శ్రావ్యంగా పాట పాడింది. తర్వాత రాంకీ భార్య శ్రీమతి ఉషా, వాళ్ళ పెద్దమ్మ దంపతులు శ్రీమతి బులుసు పద్మజ వచ్చి పాటలుపాడి వాయనం తీసుకొన్నారు. పద్మ శనివారం సాయంత్రం వాళ్ళ ఇంట్లో టిఫిన్‌కు రమ్మని ఆహ్వానించింది. ఆతర్వాత డా. శ్రీమతి ఉపాధ్యాయుల శ్రావ్య, వాళ్ళ అమ్మగారు వచ్చారు. ఆమె తలిదండ్రుల షష్టిపూర్తికి మమ్మల్ని పిలిస్తే వెళ్లాం. ఆమె అమ్మమ్మ మా గురువుగారు స్వర్గీయ మహంకాళి సుబ్బరామయ్యగారి తమ్ముడి భార్య అని అప్పుడు తెలిసింది. మళ్ళీ ఒకసారి జ్ఞాపకం చేసుకున్నాం. డా. శ్రావ్య ఎంతో సాదా సీదాగా ఉంటారు. మంచి సంస్కారి. మళ్ళీ మనం కలుద్దాం అండీ అన్నారు. వీళ్ళందరికి మా అమ్మాయి వాయినాలు ఇచ్చింది. అందరికి సరసభారతి పుస్తకాలు ఇచ్చాను. చాలా సంతోషించారు.

శనివారం–విజ్జీ వాళ్ళు తెలిసిన అమ్మాయి సీమంతానికి వెళ్లారు. మధ్యాహ్నం సాయి సెంటర్ నిరాహాహకురాలు శ్రీమతి జయ్ వాళ్ళ అత్తగారు, లక్ష్మి పిల్లల డాక్టర్ నృత్య కళాకారిణి శ్రీమతి సాయి లక్ష్మి మొదలైనవారు వస్తే అందరికీ వాయినాలు ఇచ్చింది మా అమ్మాయి. డాక్టర్ గారికి మహిళా మాణిక్యాలు ఇచ్చాను. ఆమె పొంగి పోయారు. (6–8–17–కాంప్–షార్లెట్–అమెరికా)

## **వీక్లీ అమెరికా–19–2** (31–7–17 నుండి 6–8–17 వరకు) **సుందరకాండ పూర్తి, వరలక్ష్మీ వ్రత, సరసభారతి 106వ సమావేశవారం**

సరసభారతి 106వ సమావేశంగా మహర్షి బులుసు సాంబమూర్తి గారి131 జయంతి

ఈ శ్రావణ శుక్రవారం షార్లెట్‌లోని మహిళలందరు సంప్రదాయ పద్ధతిలో పట్టు చీర జాకెట్ తలలో పూలు కళ్ళకు కాటుక, చేతులకు గాజులతో సాక్షాత్తు అపర లక్ష్మీదేవి స్వరూపంగా కనిపిస్తుంటే ఎంతో ముచ్చట వేసింది. మన సంప్రదాయ సంస్కృతులను ఇంత గొప్పగా పాటిస్తూ మనందరికి కీర్తి తెస్తూ, ఆదర్శ ప్రాయమవటం అభినందించదగిన విషయం. భారతీయ మహిళలూ మీకు జోహార్లు.

శ్రీ మతి బులుసు పద్మ తమ ఇంటికి శనివారం రాత్రి టిఫిన్‌కు రమ్మనమని చెప్పినప్పటినుంచి ఆ రోజు ఎలా దాన్ని సరసభారతి కార్యక్రమంగా నిర్వహించాలా అనే ఆలోచనలో మధనపడ్డాను. శ్రీ బులుసు సాంబమూర్తి గారింట్లో కలుస్తున్నాం కనుక మనమందరం మర్చిపోయిన స్వాతంత్ర్య సమారయోధులు ఆంధ్రరాష్ట్ర

అవతారాణానికి శ్రీ పొట్టి శ్రీరాములుగారితో ఉద్యమించిన మహర్షి బులుసు సాంబమూర్తిగారు జ్ఞాపకం వచ్చి, బులుసు వారింట బులుసు వారిని జ్ఞాపకం చేసుకుందామనిపించి, దానితోపాటు "నవ్వులతో ఆట నవ్వులాట"ను కలిపి అందరూ పాల్గొనేట్లు చేద్దామని అనుకొన్నాను.

5-8-17 శనివారం- మేము వాళ్ళ ఇంటికి రాత్రి 7 గంటలకే చేరాం. మిగతావాళ్ళు రావటం ఆలస్యమైంది. వాళ్ళు వచ్చాక ముందు "టిఫిన్ కోర్ట్"లో "బ్యాటింగ్" ప్రారంభించాం. పూరీ కూర, ఇడ్లీ చట్నీ సాంబార్, మిర్చిబజ్జీ, వెజిటబుల్ బిర్యానీ, జున్ను లపై పడి వీరంగం చేసాం. అంతా అయేసరికి రాత్రి 10 అయింది. అప్పుడు అందరం ఒకచోట చేరి సరసభారతి 106వ కార్యక్రమంగా మహర్షి బులుసు సాంబమూర్తిగారి 131వ జయంతిని నవ్వులతో ఆట నవ్వులాట కార్యక్రమం ప్రారంభించాం. అందరూ ఎంతో ఆశ్చర్యపోయారు. బులుసువారింట బులుసువారిపై కార్యక్రమం అనగానే. యాక్సిడెంటల్ కో ఇన్సి డేన్స్ అంటే ఇదేనేమో కదా. నేను ముందుగా సరసభారతి సాహితీ ప్రస్థానాన్ని వివరించి బులుసు వారి జీవిత విశేషాలను తెలియజేశాను. నేను ఈమాట చెప్పే దాకా ఎవరికీ చెప్పకుండా రహస్యంగా ఉంచాను. అందరూ ఎంతో ఆశ్చర్యానందాలు పొందారు. అలా ఉండాలనే సస్పెన్స్ క్రియేట్ చేశా. నా మాటల సారాంశం-

"శ్రీ బులుసు సాంబమూర్తిగారు తూర్పు గోదావరిజిల్లా కాకినాడ దగ్గర దూళ్ల గ్రామంలో 4-3-1886న జన్మించారు. తండ్రిగారు సుబ్బావధానులుగారు ప్రసిద్ధ వేద పండితులు. సాంబమూర్తిగారు ప్రాధమిక విద్య స్వగ్రామంలో నేర్చి విజయనగరం మహా రాజాకాలేజిలో ఫిజిక్స్ చదివి డిగ్రీ పొందారు. కొద్దికాలం గుమాస్తాగా లెక్చరర్‌గా పనిచేశారు. తర్వాత న్యాయ శాస్త్రం చదివి 1911లో పాసై కాకినాడ బార్ కౌన్సిల్‌లో చేరి న్యాయవాది అయ్యారు.

1920లో దేశమంతటా ఉధృతంగా సాగిన సహాయ నిరాకరణ ఉద్యమంలో పాల్గొన్నారు. దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారి ఉపన్యాసాలకు ప్రభావితులై న్యాయవాద వృత్తి వదిలేసి స్వాతంత్ర్య సంగ్రామ ఉద్యమంలో పాల్గొన్నారు. మహాత్మా గాంధీ జీవిత విధానం నచ్చి 1923లో కాకినాడలో జరిగిన కాంగ్రెస్ సభలో సభ్యత్వం తీసుకున్నారు. భారత దేశానికి పూర్ణ స్వరాజ్యం కావాలని డిమాండ్ చేసిన తొలికొద్దీ మంది నాయకులలో సాంబమూర్తిగారూ ఒకరు. 1930లో కాకినాడలో ఉప్పు సత్యాగ్రహానికి నేతృత్వం వహించారు. 18-4-1930లో అరెస్టయి వెల్లూర్ జైలులో నిర్బంధంలో ఉన్నారు. 1937 మద్రాస్ అసెంబ్లీకి జరిగిన ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీ తరఫున పోటీ చేసి గెలిచారు. అసెంబ్లీలో అత్యధిక స్థానాలు కాంగ్రెస్ పార్టీ గెలిచి

సాంబమూర్తిగారిని లెజిస్లేటివ్ కౌన్సిల్ ప్రెసిడెంట్‌ను చేసింది. ఈ పదవిలో అయిదేళ్ళున్నారు.

1942లో క్విట్ ఇండియా ఉద్యమం ఊపందుకొన్నప్పుడు గాంధీ ఆదేశంపై రాజకీయ నాయకులందరు పదవులను త్యాగం చేయగా సాంబమూర్తిగారు లెజిస్లేటివ్ కౌన్సిల్ ప్రెసిడెంట్ పదవికి రాజయినామా చేసి ఉత్సాహంగా ఉద్యమం నిర్వహించారు. గాంధీగారిలాగానే సాంబమూర్తిగారు కూడా పంచెపై చొక్కాలేకుండా ఉత్తరీయం మాత్రమే ధరించి ఆదర్శ జీవితం గడిపారు. భారత దేశం 1947 ఆగస్టు 15న స్వతంత్రం పొందింది సాంబమూర్తి వంటి త్యాగ ధనుల నిస్వార్థ సేవకు ప్రతిఫలంగా దాన్ని మనం హాయిగా అనుభవిస్తున్నాం.

అప్పటికి మనం ఉమ్మడి మద్రాస్ రాష్ట్రంలో ఉన్నాం. ఇప్పుడు ఆంధ్రులకూ స్వతంత్రం కావాలని మద్రాస్ రాష్ట్రం నుండి వేరు చేసి ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం ఇవ్వాలని కేంద్ర ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చారు. శ్రీ పొట్టి శ్రీరాములు శ్రీ బులుసు సాంబమూర్తి శ్రీ ప్రకాశం పంతులు మొదలైన నాయకులు. ప్రధాని నెహ్రూ ఊగిసలాటకు ఆగ్రహించిన పొట్టి శ్రీరాములుగారు ఆమరణ నిరాహార దీక్షకు సంకల్పించారు. అప్పటిదాకా ఆయనవలన లబ్ది పొందిన కాంగ్రెస్ నాయకులు మొహం చాటేయటం ప్రారంభించారు. శ్రీ రాములు గారి దీక్షకు స్థలం కానీ ఇల్లు కానీ ఇవ్వటానికి ఎవరూ ముందుకు రాలేదు. అప్పుడు బులుసుసాంబమూర్తిగారు తమ ఇంట్లో సత్యాగ్రహం చేయమని కోరగా, చేశారు. ఆ తర్వాత సంగతులు మనకు తెలిసినవే. ఆంధ్ర రాష్ట్రం మహనీయుల త్యాగ ఫలితంగా ఏర్పడింది. కానీ ఆ మహనీయులను తర్వాత ఎవరూ పట్టించుకోలేదు ఉపేక్షకు గురి చేశారు.

సాంబమూర్తిగారు కాకినాడ చేరి జీవిత చరమాంకం అక్కడే గడిపారు. చేతిలో చిల్లి గవ్వలేని దీన స్థితి వారిది. కేంద్ర మంత్రి గోవింద వల్లభ పంతుకు ఈ విషయం తెలిసి ఆర్థిక సాయం చేశారు. అంతకు మించి ఆదరించిన వారెవ్వరూ లేకపోవటం సిగ్గుతో తలవంచుకోవాల్సిన విషయం. మహర్షిగా అందరి మన్నన పొందిన బులుసు సాంబమూర్తిగారూ 2-2-1958న 72వ ఏట పరమ పదించారు. ఆ తర్వాత ఎప్పుడో ఆయన కుమార్తె ప్రభుత్వానికి ఆర్థిక సాయం కోసం విన్నపం పంపిస్తే "సాంబమూర్తి ఎవరు?" అని అడిగారట. అదీ మన జాతీయ నాయకులకిచ్చిన గౌరవం. అందుకే సాంబ మూర్తిగారిని "నెగ్లెక్టెడ్ పేట్రియట్" అన్నారు. ఈ నెల 15న మనం భారత స్వాతంత్ర్య దినోత్సవం జరుపుకోబోతున్నాం. ఆ సందర్భంగా మహనీయ త్యాగమూర్తి మహర్షి బులుసు సాంబమూర్తి గారిని సంస్మరించి ధన్యులమవుదాం. శ్రీ బులుసు సాంబమూర్తి గారింట్లో స్వర్గీయ బులుసు సాంబమూర్తిగారిని స్మరించుకొని అవకాశం

మనకు కలిగినందుకు ధన్యులం. దీనికి బులుసు దంపతులను అభినందిస్తున్నాను" అని చెప్పాను. బులుసువారి త్యాగనిరతిని అందరు మొదటిసారి తెలుకొని తరించామని భావించారు.

## నవ్వులతో ఆట నవ్వులాట

తర్వాత నవ్వులతో ఆట నవ్వులాట ప్రారంభించాం. ఇందులో అందరూ పాల్గొని తమ అనుభవాలను, తాము విన్న కన్నా హాస్యపు పనస తొనలను, జోకుల కేకులు తినిపించారు. శ్రీమతి సుబ్బలక్ష్మిగారు ఆమె భర్త కామేశ్వరరావుగారు రాకీ దంపతులు పద్మ దంపతులు మా అమ్మాయి విజ్జి తమ అనుభవాలను తెలిపారు. బాధ్యత నాదే. దీనికీ ఫినిషింగ్ టచ్ ఇస్తూ "మన హాస్య రచయితలైన చిలకమర్తి వారి గణపతి, ప్రహసనాలు, పానుగంటి సాక్షివ్యాసాలు, వీరేశలింగంగారి ప్రహసనాలు, మొక్కపాటి నరసింహ శాస్త్రిగారి బారిస్టర్ పార్వతీశం మునిమాణిక్యంగారి కాంతం కథలు, భమిడిపాటివారి హాస్య నాటికలు, శ్రీశ్రీ రిమరిక్కులు, ఆరుద్ర కూనలమ్మపాదాలు, పఠాభి పంచాంగం, జలసూత్రం పేరడీలు, బాపు రమణల హాస్యకథామృతం కార్టూన్లు, శ్రీరమణ పేరడీలు హాస్యపు చెణుకులు, రావికొండలరావు హాస్య నాటికలు, సినీకవి పింగళి సినీమేటి హాస్యం తెలుగు హాస్యం పండించిన శివరావు రేలంగి రమణారెడ్డి, హాస్య రాజాబాబు, బ్రహ్మానందం, ఎం.ఎస్, ధర్మవరపు, ఏ వి ఎస్, ఆంగ్ల హాస్యం పండించిన చార్లీ చాప్లిన్ లారెల్, హార్డీ, రచయితలు మార్క్ ట్వైన్ డికెన్స్, అమెరికా కార్టూనిస్ట్ జాన్ థర్బర్, కోటికి పడగలెత్తిన కార్టూనిస్ట్? తెలుగు హాస్యం అమెరికాలో చిందించిన వంగూరి చిట్టెన్ రాజులను ఒకసారి గుర్తు చేసుకొందాం. అలాగే ఆవకాయ అత్తగారుతో సంసార ధర్మహాస్యం ఘాటు చూపించిన భానుమతి, సురేకార హాస్య టపాకాయ్ సూర్యకాంతం, కె.ఆర్కే మోహన్ మొదలైనవారు గురించి యెంత చెప్పినా అతక్కువే.

శ్రీనాధుడు పల్నాటిపై రాసిన చాటువులు తెనాలి పాండురంగనిపై ప్రచారంలో ఉన్న కథలు అన్నీ హాస్యపు తేనే తుట్టెలే. తాగే ఓపికవుంటే మధురమేకాదు అద్భుతః

.

పల్నాడులో నీరు దొరక్క "తిరిపెమున కిద్దరాండ్రా పరమేశా! గంగ విడువు పార్వతి చాలున్" అని "కుళ్ళా యుంచితి కోకచుట్టితి మహా కూర్పాముమున్ గట్టితిన్, చల్లా యంబలి ద్రావితి విశ్వస్తవడ్డింపగా –తల్లీ కన్నడ రాజ్యలక్ష్మీ దయలేదా నేను శ్రీనాధుడన్", "జొన్నకలి జొన్నన్నము జొన్నపిసరు జొన్నలే తప్పన్ సన్నన్నము సున్నసుమీ పదునుగ పల్నాటిసీమ ప్రజలందరికిన్"

అలాగే తెనాలి రాముడు తాతా ఊతునా అంటే సరేనంటే తాంబూలం ముఖాన ఉమ్మేస్తే

పాంకోడు పెట్టి పన్ను రాలగొడితే దుప్పికొమ్ము పెట్టుకొని రాయల సభకి వస్తే రాయలు రవి గాననిచో కవి గాంచునే కదా అని సమస్య ఇస్తే – "ఆ రవి వీరభద్రు చరణాహతి కిన్ దుళ్ళిన బోసి నోటికిన్ కొక్కెర పంటికిం దుప్పి కొమ్ము పల్గా రచియించె నౌరా – రవిగానని చో కవి గాంచునే కదా" చాటువు –విజయనగరమహారాజు పూసపాటి ఆనంద గజపతి రాజు తన ఆస్థాన వైణిక విద్వాన్ నడిమింటి సంగమేశ్వర శాస్త్రి గారిని "శాస్త్రి గారూ ఇంకా నడిమిల్లేనా" అని హాస్యమాడితే "ప్రభూ మా నడిమిల్లు మీ" పూసపాటి చేయదా?" అని ఇచ్చిన రిపార్టీ, కాంతం, మునిమాణిక్యం ప్రణయ కోపంతో కొంతకాలం మాట్లాడుకోపోతే ఒక రోజు ఆయన మేడ మెట్లు ఎక్కుతూంటే ఆమె దిగుతుండగా ఎదురుపడితే మునిమాణిక్యం "నేను మూర్ఖులకు దారి ఇవ్వను" అంటే "నేను ఇస్తాను" అని చాచి చెంపమీదకొట్టినట్లు రిపార్టీ ఇవ్వటం, ఫన్ బకెట్ ఫన్ బకెట్ జూనియర్స్, ఫన్నీ ఫెల్లోస్, ఫ్రాస్ట్రేటేడ్ వుమన్ మొదలైనవన్నీ ఒక్కసారి జ్ఞాపకం జేసుకొని హాయిగా 45 నిమిషాలు నవ్వుకున్నాం. తర్వాత ఉషా పద్మ విజ్జి అంతా కలిసి పాడవోయి భారతీయుడా, మా తెలుగు తల్లికి పాటలు పాడి ముగింపుకు వన్నె తెచ్చారు. అనుకోకుండా కార్యక్రమం అద్భుతంగా ఆనందంగా హాయిగా జరిగినందుకు "ఆల్ హాపీస్". (6-8-17-కాంప్ -షార్లెట్-అమెరికా)

**వీక్లీ అమెరికా-20** (7-8-17నుండి 13-8-17) వరకు

## కస్తూరి వెంకయ్య అరంగేట్ర వారం

శీర్షిక కంఫ్యూజింగ్‌గా ఉందా? కిందకి వస్తే అదే తేటతెల్లమవుతుంది.

7-8-17 సోమవారం- అమెరికా వచ్చి నాలుగు నెలలయింది- మార్చి 30న సీజన్‌లో మామిడిపళ్ళు తినటం మొదలుపెట్టి ఈ రోజువరకు అంటే నాలుగు నెలలపై 15 రోజులవరకు మామిడిపళ్ళు తింటూనే ఉన్నాం. మా జీవితంలో ఇంత లాంగెస్ట్ మామిడి సీజన్ ఇదే. మా అమ్మాయి పటేల్ బ్రదర్స్‌లో పండ్లు కనబడటం ఆలస్యం కొని తెచ్చి తినిపిస్తోంది. గీర్వాణం-3లో 394 వరకు రాశా. ఇవాళ శ్రావణ పౌర్ణమి జంధ్యాల పౌర్ణమి. నూతన యజ్ఞోపవీతం ధరించాను.

మంగళవారం- మచిలీపట్నం హిందూకాలెజ్ హిస్టరీ హెడ్ శ్రీ ఎస్.వెంకటేశ్వరరావు గారికి ఫోన్ చేసి ఆధునిక ప్రపంచ నిర్మాతలుకు ముందుమాట రాయమని కోరగా వెంటనే అంగీకరించటం వారికి ఫైల్‌ను ఫార్వార్డ్ చేయటం జరిగిపోయింది. అవధాన సరస్వతి శ్రీ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్ గారికి గీర్వాణం-3కు ముందుమాట రాయమని మెయిల్ పెట్టిన వెంటనే జవాబు ఇస్తూ తప్పక రాస్తానని తెలియజేశారు. వారు ఆగస్టు 27 అమెరికా వచ్చి సెప్టెంబర్ 27 మళ్ళీ

ఇండియా చేరుతారు. కనుక ఆ తర్వాత ఆ పని చేస్తానంటే సరే అన్నాను.

91 ఏళ్ళ శ్రీ పోతుకూచి సాంబశివరావు గారు మరణించిన వార్త చూశాను. ఆయన ఆంధ్రపత్రిక లేక ప్రభ వీక్లీలో సీరియల్‌గా రాసిన "ఏడు రోజుల మజిలీ" నవల బాగా నచ్చింది. 10 ఏళ్ళక్రితం ఒకసారి ఆయనకు ఫోన్ చేసి హైదరాబాద్‌లో వారింటికి వెళ్లి ఒక అరగంట సేపు మాట్లాడాను. మంచి సంభాషణా చతురులు ఆయన. ఒక మాసపత్రిక కూడా నడిపేవారు.

బుధవారం- గీర్వాణం-3ను 410 వరకు లాగించా.

గురువారం- "కస్తూరిసేవా పరిమళ వ్యాప్తి" రెండుభాగాలు రాశా. ఇంద్రజ, నారా రోహిత్, లవకుశ నాగరాజుల ఇంటర్వ్యూలు చూశా. నాగరాజు తన స్నేహితుడు హైదరాబాద్ ఝూన్సినగర్‌లో కట్టించిన శ్రీ షిరిడీ సాయిబాబామందిరంలో భార్యతో సేవలో ఉంటున్నాడట. ఇంద్రజకు ఇద్దరు బాబాలు పూజనీయులేట. "గొట్టం"లో నారా నటించిన రౌడీ ఫెలో చూశా కొల్లేరు సరస్సు, ఆక్రమణపై కథ బాగా చేశాడనిపించింది.

11-8-17 శుక్రవారం- వెంకయ్య 15వ ఉపరాష్ట్రపతిగా ప్రమాణ స్వీకారం చేశాడు. అఖిల భారతీయ విద్యార్థి పరిషత్‌లో క్రియాశీలకంగా పని చేసినవాడు. అత్యున్నత పదవిని అలంకరించటం మనకు గర్వకారణం. అత్యున్నత పదవులలో ఈనాడున్న అత్యంత సామాన్యులు ప్రధాని మోడీ, రాష్ట్రపతి కోవింద్, ఉపరాష్ట్రపతి ఉషాపతి వెంకయ్య. స్పీకర్ సుమిత్రా మహాజన్‌తో కూడా కలిపితే బిజెపి నాయకులు నలుగురు అత్యున్నత పీఠాలపై ఉండటం ఆపార్టీకి గర్వకారణం. మోడీ, షాల చాకచక్యం చాణక్యం.

సెప్టెంబర్ 5 ఉపాధ్యాయ దినోత్సవంనాడు శ్రీ కోట గురుదేవుల గురు పూజోత్సవ కార్యక్రమం తయారు చేసి పంపాను. కస్తూరి 3,4 రాశా.

## అరంగేట్రం

12-8-17 శనివారం - కస్తూరి 5 రాసి ముగించా .

ఇక్కడ మా కమ్యూనిటీలోనే ఉన్న గుజరాతీ దంపతులు ప్రేరా, అనుపమ పటేల్‌ల కుమార్తె కుమారి త్విషా పటేల్ భరత నాట్యం శ్రీమతి రాధికా ఉన్నితన్ వద్ద నేర్చి ఈ రోజు హాల్టన్ థియేటర్‌లో అరంగేట్రం చేసింది. అందరం వెళ్లాం 4.45కు బయల్దేరి చూడటానికి. సరిగ్గా 5 గంటలకు ప్రారంభమైనది. షణ్ముఖ ప్రియ రాగంలో గణేశ అంజలి ముందుగా చేసింది. తర్వాత నాటరాగంలో అలరిపు (అలరింపు), రసాళిరాగంలో జతిస్వరం, రాగమాలికలో శబ్దం, ధన్యాసిరాగంలో వర్ణంలను కృతులు కీర్తనలకు తగినట్లు ఒక గంటసేపు అభినయించింది. తర్వాత ఒక 20 నిమిషాలు

విశ్రాంతి–అందరికి సమోసా మాంగో జ్యూస్, టీ ఇచ్చారు.

విరామానంతరం హిందోళ రాగంలో మైసూర్ వాసుదేవాచార్య కృతి "మామవతు" సరస్వతీ దేవీ స్తుతి, తర్వాత శివ తాండవానికి శివా అంటే పార్వతీదేవి చేసే "లాస్యం" చివరగా తిల్లానకు నాట్యం చేసి, ఆ తర్వాత తండ్రికోసం గుజరాతీ పాటకు, తల్లికోసం హిందీ పాటకు నృత్యాభినయం, చేసి చివరకు నాట రాగంలో మంగళంలో దేవుడికి గురువుకు ప్రేక్షక దేవుళ్ళకు విన యాంజలి ఘటించి ఒక గంటలో ముగించింది. గురువు శ్రీమతి రాధికగారు నట్టువాంగం చేస్తూ ప్రోత్సహించింది. హావ భావాలు బాగానే ఉన్నాయి. కానీ ప్రతి అంశం 7 లేక 8 నిమిషాలకంటే లేకపోవటం, ఏదో చేసేసి వెళ్ళిపోదాం అన్నట్లు చేయటంగా నాకు అనిపించింది. భరతనాట్యం పద్ధతి ఇంతేనేమో నాకు తెలియదు తర్వాత అందరికి డిన్నర్. రోటీ, రెండు నాకు కూరల పులుసులు సువీత్, పులిహోర, బిర్యానీలాంటిది, అప్పడం. కావాల్సిన వాళ్లకు కోకాకోలా. రోటీ ఒకటిన్నరముక్క స్వీట్ అప్పడంతో లాగించా అంతే.

ఇంతకు ముందు మేము చూసిన కుమారి రచిత కూచిపూడి రంగ ప్రవేశమే నాకు బాగా నచ్చిందేమో అనిపించింది. మనకు నచ్చటం నచ్చకపోవడం అటుంచి ఇంగ్లీష్‌లో చదువుతూ, క్షణం ఖాళీ లేని విద్యా జీవితం గడుపుతూ ఇంత ఉత్సాహంగా అంకితభావంతో తమదికాని భాషలో, తమ భాషకాని గురువువద్ద క్రమశిక్షణతో నృత్యం నేర్వటం ఆ చిన్నారుల పట్టుదల క్రమశిక్షణ, అకుంఠిత దీక్ష కు జోహార్లు. మన సంస్కృతిని ఇక్కడ ఇంత గొప్పగా ప్రదర్శిస్తూ మన్ననలు అందుకోవటం సామాన్యమైన విషయం కాదు. ఆ పిల్లల తలిదండ్రులకున్న అభిరుచి గురువుపై నమ్మకం, ఎన్నో వేలడాలర్లు ఖర్చుపెట్టి నేర్పించటం, రంగప్రవేశ అరంగేట్రాలకు కూడా సంకోచంలేకుండా డబ్బు ఖర్చు చేయటం చూస్తుంటే వీరందరికి ఉన్న ఉత్తమాభిరుచికి మనస్ఫూర్తిగా తప్పక అభినందనలు తెలియ జేయాల్సిందే. మేరా భారత్ మహాన్.

13-8-17 ఆదివారం– ప్రొద్దున, మధ్యాహ్నం "శంకరాభరణం పాలెస్" "కిట్టుగాడున్నాడు జాగ్రత్త" యు ట్యూబ్‌లో చూశా. సరదాగా ఉన్నాయి. రమణ ఫోన్ చేసి ఉయ్యూరులో సేవింగ్స్ ఏజెంట్ మండా ప్రసాద్ భార్య శ్రీమతి పావని చనిపోయినట్లు తెలిపాడు. పాపం ఆమె రెండేళ్ల నుంచి కేన్సర్‌తో బాధ పడుతోంది. వైద్య లోపం ఏమీలేదు. ఖరీదైన వైద్యమే చేయించారు. నేను మార్చి చివర్లో ఆమెకు రీకరింగ్ డిపాజిట్ కట్టాను కూడా. అలాగే ఈవారంలోనే మా పెద్దకోడలు అమ్మక్కయ్యగారు శ్రీమతి భవానిగారు కూడా చనిపోయినట్లు తెలిసింది. ఈ ఇద్దరి ఆత్మలకు శాంతి కలగాలని భగవంతుని ప్రార్థిస్తున్నాను. ఆ కుటుంబాలకు మా సానుభూతి తెలియ జేస్తున్నాను.

వాగ్గేయకారుడు మైసూర్ వాసుదేవాచార్య సంస్కృతంలో కృతులు రాశాడని తెలుసుకొని గీర్వాణం-3లో 411వ కవిగా ఇప్పుడే ఆయన గురించి రాశాను. ఈ వీక్లీ సమాప్తం. (13-8-17-కాంప్-షార్లెట్-అమెరికా)

**వీక్లీ అమెరికా-21** (14-8-17 నుండి 20-8-17 వరకు)

## భజనవారం

14-8-17- సోమవారం- "సంసారంలో రిగమనిస" సరదా హాస్య ఆర్టికల్ రాశా. నాని నటించి ఇంద్రగంటి మోహనకృష్ణ దర్శకత్వంతో వచ్చిన "జెంటిల్మన్" సినిమా "గొట్టం"లో చూశా. మంచి సస్పెన్స్‌తో నాని నటనా వైదుష్యంతో చక్కని హమ్మింగ్ పాటలతో క్లైమాక్స్ బాక్ డ్రాప్‌గా సినిమా కనుల పండువుగా ఉంది.

## 15-8-17 మంగళవారం -శ్రీ కృష్ణాష్టమి

ఉదయమే మా శ్రీమతి ముగ్గుతో వాకిలి నుంచి ఇంట్లోకి బాల కృష్ణుని పాదాలు వేసి కన్నయ్యకు ఆహ్వానం పలికింది. నేను మామూలు సంధ్యావందనం చేసి తర్వాత మంగళవారం కనుక శ్రీ సువర్చలా సహిత ఆంజనేయ స్వామి అష్టోత్తర సహస్ర నామ పూజ, కృష్ణాష్టమి సందర్భంగా కృష్ణా అష్టోత్తర, విష్ణు సహస్ర నామ పూజ చేశా. కృష్ణాష్టమి సందర్భంగా వైష్ణవాలయాలలో ప్రసాదంగా పెట్టే "కట్టెకారం" మా ఆవిడ చేయగా దానితోపాటు అటుకులు బెల్లం పాలు పెరుగు నెయ్యి వెన్న పండ్లతో సహా నైవేద్యం పెట్టాము. తర్వాత కృష్ణలీలలు శ్రీకృష్ణ కర్ణామృతం జయదేవుని అష్టపదులు జానకి పాడిన కస్తూరిరంగా పాటలూ సుబ్బులక్ష్మి విష్ణు సహస్రనామ స్తోత్రం సదాశివ బ్రహ్మేంద్ర కీర్తనలు మాడుగుల చదివిన పోతన భాగవతం వగైరా వింటూ సాయం కాలం దాకా కాలక్షేపం చేశాను.

## సాయం భజన

సాయంకాలం7 గంటలకు మా అమ్మాయి ఇంట్లో సాయి సెంటర్ వాళ్ళను ఆహ్వానించి భజన ఏర్పాటు చేసింది. శ్రీమతి గోసుకోండ అరుణ ఇంట్లోని పెద్ద శ్రీ కృష్ణ విగ్రహాన్ని వాళ్ళబ్బాయి తెచ్చాడు. దాన్నీ అలంకరించి సిద్ధంగా ఉన్నాం. దేవుళ్ళ అలంకారం మా అమ్మాయి బాగా చేసింది. ఇంట్లో ఉన్న డబుల్ స్పీకర్‌లతో నాలుగు మైకుల ఏర్పాటు మా మనవళ్లు శ్రీకేత్ అశుతోష్ పీయూష్‌లు సిద్ధం చేశారు. అకస్మాత్తుగా సాయంకాలం 6.30 నుంచి పెద్ద వర్షం పడింది. అప్పటికే సాయి సెంటర్ హెడ్ సుబ్బు వచ్చేశారు. మిగిలినవాళ్లు వస్తారా రాగలరా అను కొంటుంటే ఉరుములు మెరుపులు వచ్చి వర్షం అంతే సడన్‌గా 6.50కి ఆగిపోయింది. హమ్మయ్య అనుకొన్నాం. సరిగ్గా 6.55కు సాయి సెంటర్ నిర్వాహకురాలు శ్రీమతి జయ రాగా ఖచ్చితంగా 7

గంటలకు సుబ్బు జయ మా అమ్మాయి విజ్జి భజన ప్రారంభించారు. ఆ తర్వాత అందరూ వచ్చేశారు. దాదాపు 75 మంది అందరూ ఏకకంఠంగా భజనలు చేశారు. శ్రీ కృష్ణ భజనలు ఎక్కువగా చేశారు. చిన్నపిల్లలూ చాలా శ్రావ్యంగా పాడారు. మంచి నిండుదనం వచ్చింది. ఖచ్చితంగా రాత్రి 8 గంటలకు భజన ఆపేశారు. తర్వాత జయ రెండు నిమిషాలు మాట్లాడాక మా అమ్మాయి నన్ను మాట్లాడమంటే కృష్ణాష్టమి, భారత స్వాతంత్ర్య దినోత్సవ ప్రాధాన్యంపై 9 నిమిషాలు మాట్లాడాను. అందరూ తెలుగు తెలియని తమిళ కన్నడిగులు కూడా బాగుందని అన్నారు. ఇంకా ఒక అరగంట మాట్లాడితే బాగుండునన్నారు. అది సమయం కాదు అంతా "ఫుడ్ కోర్ట్‌లో చేతికీ మూతికీ బాటింగ్ హడావిడి"లో ఉన్నారన్నాను. కాదు భోజనాలయ్యాక మాట్లాడాలి అన్నారు. సరే అన్నా. భోజనంలో పూరీ, బంగాళాదుంపకూర, మామూలు ఇడ్లీ రాగి రవ్వ ఇడ్లీ, సాంబారు గోంగూర పచ్చడి, అటుకుల పులిహోర, చట్నీ జున్ను, ఫ్రూట్ సలాడ్, ఫ్రూట్ జ్యూస్, అన్నం, పెరుగు, పెరుగన్నం పుచ్చకాయ ముక్కలు చక్రపొంగలి వగైరాలతో కమ్మని భోజనం.

భోజనాలు అయ్యాక ఒక పది మంది నేను మాట్లాడాలని కోరగా హాలులో కూర్చుని రాత్రి 9.30కు మొదలుపెట్టి సుమారు 20 నిమిషాలు బ్రహ్మ వైవర్త పురాణంలోని గోలోకం విశేషాలు, మరికొన్ని విషయాలు మాట్లాడాను. చాలా శ్రద్ధగా విన్నారు. మా అమ్మాయి, రాధ, లక్ష్మి, ఉషా, సురేఖా నీలిమ, పవన్, రాంకీ అవధాని జగదీశ్ మొదలైనవారు. అభిరుచి ఉన్నవారికి నాకు తెలిసినవి నాలుగు ముక్కలు చెప్పటంలో నాకు ఆనందం అలాగే అందరూ ఆనందాన్ని సంతృప్తిని పొందారు. రాంకీ ఉషా విజ్జి వీడియో తీసి లైవ్‌గా మా వాళ్లకు పంపారు. అంతా అయ్యేసరికి రాత్రి 10 అయింది. అప్పుడు ఇళ్లకు బయల్దేరి వెళ్లారు. మంచి కార్యక్రమం అనుకోకుండా జరిగింది. వర్షం హర్షం ఆనందం పంచింది.

బుధవారం –నిన్నటి విశేషాలన్నీ "కృష్ణం వందే జగద్గురుమ్"గా రాశాను. రాజ్ తరుణ్ సినిమా "ఉయ్యాల జంపాల" యు ట్యూబ్‌లో చూశా. కొత్తకుర్రాడు చాలా ఫ్రెష్ గా ఈజీగా చేశాడు అనిపించింది. చక్కని గోదావరి పల్లెటూరు కూనవరం బాక్ గ్రౌండ్‌గా తీసిన చిత్రం ప్రకృతి అందాలన్నీ ఒడిసిపట్టి చూపించాడు దర్శకుడు. సంగీతం వీనులవిందు ఫోటోగ్రఫీ నయనానందకరం.

17–8–17 గురువారం– మా అన్నయ్యగారి మనవడు చి॥ కళ్యాణ్ చి॥ సౌ॥ మీనాల వివాహం ఈ రోజు ఉయ్యూరులో ఉదయం 9 గంటలకు జరిగింది. మా బంధువులందరూ వచ్చారట. గ్రాండ్‌గా జరిగిందని రమణ ఫోన్ చేసి చెప్పాడు. మా మేనల్లుడు అశోక్, మేనకోడలు పద్మ మా అబ్బాయి శాస్త్రి, మనవడు భువన్ తమ్ముడు

**షార్లెట్ సాహితీ మైత్రీ బంధం**

మోహన్ భార్య సునీత మా అన్నయ్య మనవడు రవి, హైదరాబాద్ నుంచి, మా పెద్ద మేనకోడలు కళ, భర్త చంద్రశేఖర్, కొడుకు బాలాజీ, మేనల్లుడు శ్రీనివాస్ దంపతులు చెన్నై నుంచి, గరివిడినుంచి మా అన్నయ్య కూతురు వేదవల్లి భర్త రామకృష్ణ మొదలైన బంధుగణం హాజరై దగ్గరుండి వివాహం జరిపించారు.

శుక్రవారం– "ట్యూబ్‌లో శాతకర్ణి హిందీ సినిమా చూసి ఆనందించా.

శనివారం– త్రిపురనేని గోపీచంద్ దర్శకత్వంలో ఘంటసాల సంగీతంతో, కృష్ణవేణీ నారాయణరావు నాయికా నాయకులుగా శోభనాచల వారి శ్రీ లక్ష్మమ్మ చూశాము గోపీచంద్ డైరెక్షన్ స్క్రీన్‌ప్లే నీట్‌గా ఉన్నాయి. తర్వాత కృష్ణవేణి గారి ఇంటర్వ్యూ కూడా చూశాను. ఎందరెందరినో చిత్రసీమకు పరిచయం చేసిన ఘనత కృష్ణవేణీ భర్త మీర్జాపురం రాజా వారిది. నూజివీడు రైల్వేస్టేషన్ పేరు మీర్జాపురం అని ఉండేది చాలాకాలం. గీర్వాణం –3లో 415 వరకు రాశా.

మా అమ్మాయితో సహా ఇక్కడి సాయి సెంటర్ వాళ్ళు గ్రీన్స్ బరోలో నిర్వహించిన ఒక రోజు వాలంటరి టీచర్స్ ప్రోగ్రామ్‌కు ఉదయం 5.30కి బయల్దేరివెళ్లి రాత్రి 7.30కు వచ్చారు.

మా మనవళ్ళు ఆశుతోష్, పీయూష్‌లు నెల రోజుల టెన్నిస్ కోచింగ్ పూర్తి అయిన సందర్భంగా వాళ్ళు ఏర్పాటు చేసిన కాంప్‌కు ఉదయం వెళ్లి సాయంత్రం వచ్చారు. మా పెద్దమనవడు శ్రీకేత్ శని, ఆదివారాలలో ఉదయం మాథ్స్ ఇంటెన్సివ్ కోచింగ్‌కు వెళ్లి, ఆ తర్వాత వై ఏం సిలో ఆడుకొని వస్తున్నాడు. ఇక్కడి స్కూళ్ళు ఈ నెల 28 నుంచి ప్రారంభం. మళ్ళీ హడావిడి.

20–8–17 ఆదివారం– గీర్వాణం–3లో 418 వరకు కవుల గురించి ఇవాళ రాశాను.

ఈ వీక్లీ ఇంతటితో సమాప్తం.

(20–8–17–కాంప్–షార్లెట్–అమెరికా)

దీన్ని పంచుకోండి:

**వీక్లీ అమెరికా –22 –1** (21–8–17 నుంచి 27–8–17 వరకు)

**వినాయక చవితి, మూడవ రుద్రం వారం**

21–8–17 సోమవారం– ఈ రోజు సంపూర్ణ సూర్యగ్రహణం– ఉదయం 11 గంటలకే భోజనాలు పూర్తి చేసాం. సాయంత్రం గ్రహణం వదిలిన తర్వాత విడుపు స్నానం చేసాం.

"నాహం కర్తా –హరి కర్తా" అని తిరుపతి దేవుని నమ్మిన ఆలయ పరిపాలనా దక్షునిగా భక్తులకు ఎన్నెన్నో సేవలు అందించి ముఖ్యమంత్రుల సెక్రెటరీగా ఎన్నో

ప్రజాహితకార్యక్రమాలు నిర్వహించి, ప్రధాని నరసింహారావు కార్యదర్శిగా సాహసోపేత నిర్ణయాలకు సూత్రధారి అయిన శ్రీ పత్రి రామకృష్ణ ప్రసాద్ అంటే పి.ఆర్.కె.ప్రసాద్ మరణించారు. ఆయన సేవలగురించి మూడు నాలుగు వ్యాసాలూ నిరుడే నేను నెట్‌లో రాశాను. సర్వ సమర్థుడు అయిన ఒక మహా భక్త శిఖామణిని సేవకుని మరణం తీవ్రమైన లోటు. ఆ మహామహుని ఆత్మకు శాంతి కలగాలని ప్రార్థిద్దాం.

మా అబ్బాయి రమణ ఫోన్ చేసి సోమవారం ఉదయం లాయర్ గోవింద రాజు శ్రీనివాస్ గుడివాడలో హఠాత్తుగా హార్ట్ అటాక్ వచ్చి చనిపోయాడని చెప్పాడు. హై స్కూల్‌లో నా శిష్యుడు మా అబ్బాయి క్లాస్‌మేట్, మా లాయర్ కూడా శ్రీనివాస్. శ్రీనివాస్ తండ్రి అబ్బి అనే శర్మ నాకు క్లాస్‌మేట్. శీను తమ్ముడు వేణు కూడా శిష్యుడే. ఈ సోదరులు తమ తండ్రి శర్మగారి స్మారకంగా శ్రీ సువర్చలా మారుతి శతకానికి స్పాన్సర్‌లుగా ఉన్న సంగతి మీకు తెలుసు. శ్రీనివాస్ ఆత్మకు శాంతి కలగాలని ఆకుటుంబం ఈ విషాదాన్ని తట్టుకొని ధైర్యంగా ముందుకు సాగాలని భగవంతుని ప్రార్థిస్తున్నాం.

గీర్వాణం–3 లో 427 వరకు రాశాను.

మంగళవారం– సుమారు 30 ఏళ్ళ క్రితం రామ గుండం నుంచి మంచి చదువుకోసం ఉయ్యూరు వచ్చి హైస్కూల్‌లో చేరి నాదగ్గర ట్యూషన్ చదివిన నా శిష్యుడు, నా క్లాస్‌మేట్ స్వర్గీయ చేవూరి సుదర్శన రావు మేనల్లుడు వజ్రాల జస్వంతరావు ఉయ్యూరులో కనపడ్డాడని మా అబ్బాయి రమణ ఫోన్ చేసి అతని నంబర్ నాకు ఇస్తే రాత్రి ఫోన్ చేసి మాట్లాడాను. ఆతను అంటే నాకు మంచి అభిమానం. చాలా వినయంగా ఉండేవాడు. హెవీ మెషిన్‌లపై ట్రెయింగ్ ఇచ్చే ఆఫీసర్‌గా రామ గుండంలో ఉన్నాడట. కాసేపు ఆనాటి సంగతులు మాట్లాడుకున్నాం.

గీర్వాణం–3లో 433 వరకు రాశా. సుప్రీం కోర్ట్ మూడుసార్లు తలాక్ రాజ్యాంగ విరుద్ధమని చారిత్రాత్మక తీర్పు ఇచ్చి ముస్లిం మహిళలకు ఊరట కలిగించింది. మా బావమరిది ఆనంద్‌తో మాట్లాడాం.

బుధవారం–దేవుళ్లను “పులిగాపు” చేసి వినాయక చవితికి సిద్ధం చేసాం. ఫన్ బకెట్‌ను అభినందిస్తూ రాస్తే వాళ్ళు ఏవైనా జోక్స్ పంపమని రాస్తే వెంటనే నేను “కుట్టిన” 6 జోక్స్ రాసి పంపాను. రాత్రి 2.30 వరకు ఎందుకో నిద్రపట్టలేదు. శ్రీ కృష్ణ కర్ణామృతం వింటూ తర్వాత నిద్రపోయాను.

21 సోమవారం జరిగిన నంద్యాల ఉప ఎన్నికలో 80 శాతం ఓట్లు పోలయ్యాయి. తెలుగు దేశమే 10 వేల నుంచి 20 వేలవరకు మెజార్టీతో గెలుస్తుందని లగడపాటి సర్వే చేయించి ప్రకటించాడు. రాత్రి వర్షం బాగానే పడింది.

గురువారం– గీర్వాణం–3లో 435 వరకు కవుల గురించి రాశా. కస్తూరి రాసిన 462 పేజీల "లవింగ్ గాడ్" పుస్తకం పూర్తి చేశాను. ఉయ్యూరులో కూడా వర్షాలు బాగా పడుతున్నాయని రమణ ఫోన్ చేసి చెప్పాడు.

## శ్రీ వినాయక చవితి

25–8–17 శుక్రవారం శ్రీ వినాయక చవితి– ఉదయమే లేచి మామూలు పూజతోపాటు శ్రీ వినాయక చవితి వ్రతం చేశాను. మా అమ్మాయి తెల్ల వారుఝామునే లేచి ఉండ్రాళ్ళు పరవాన్నం పులిహోర వంకాయ కూర, కొబ్బరి చట్నీ, మైసూర్ పాక్ చేసి ఉదయం 8 గంటలకు ఆఫీస్‌కు వెళ్ళింది. మా అల్లుడు నిన్నరాత్రి ఇవాళ పొద్దున పిల్లలతో గణేష్ పూజ చేయించి సంస్కృత శ్లోకాలు నేర్పాడు.

ఇక్కడ కమ్యూనిటీ సెంటర్‌లలో గణేష్ విగ్రహం పెట్టుకొని సామూహిక పూజ నిర్వహిస్తున్నారు. అలాంటి ఒక పూజ "టాం షార్ట్" సెంటర్‌లో జరుగుతుంటే అందరం వెళ్లి నమస్కారాలు చేసి కాసేపు కూర్చుని అటునుంచి జగదీశ్, లక్ష్మి దంపతుల ఇంట్లో సాయి భజనకు వెళ్లాం. 7 గంటలకు మొదలు పెట్టి 8కి పూర్తి చేశారు. 60 మందికి పైనే వచ్చారు. నన్ను కాసేపు మాట్లాడమంటే గణేశుని ప్రశస్తి గురించి చెప్పాను. ఆ తర్వాత భోజనాలు– లడ్డూ మైసూర్ పాక్, గారే, ఆవడ కొబ్బరన్నం పూరి వంకాయ కూర, కొబ్బరి చట్నీ, పరవాన్నం వగైరా. అంతా అయి ఇంటికి వచ్చేసరికి రాత్రి 10.30 అయింది. జగదీశ్ దంపతుల కూతురు "డోలా"కు ఐర్లాండ్‌లో మెడికల్ కాలేజీ సీట్ వచ్చింది. సోమవారం చేరటానికి వెడుతున్న సందర్భంగా ఈ భజన భోజనాలు. ఆడవాళ్లందరి కొబ్బరికాయ జాకెట్ స్టీల్ ప్లేట్ పళ్ళు ఇచ్చారు. మా దంపతులకు ఆ దంపతులు అమ్మాయి అబ్బాయి కూడా కాళ్లకు నమస్కారాలు చేసి ఆశీస్సులు అందుకొన్నారు. ఇప్పుడు నేను మాట్లాడిన విషయాల సారాంశం రాస్తున్నాను.

## వినాయకుడు

"మనం ఏ కార్యక్రమాన్ని అయినా చేసేముందు ముందుగా గణపతి పూజ చేసి ప్రారంభిస్తాం. ఆయన విఘ్నాలను నివారిస్తాడని మనం అనుకొన్న పనులు నిర్విఘ్నంగా కొనసాగిస్తాడని విశ్వాసం. కానీ ఆయన వికృతమైన రూపం కలవాడు. అట్రాక్షన్ లేనివాడు. కానీ అగ్ర పూజ ఆయనకే. ఇందులో పరమార్ధం ఉంది. బాహ్య సౌందర్యం ముఖ్యంకాదు ఆంతరంగిక సౌందర్యం ముఖ్యం అనే గొప్ప సత్యాన్ని ఆయన చాటి చెబుతున్నాడన్నమాట. పెద్ద బానలాంటి గణేశుని పొట్ట పరిపూర్ణమైన ఈ విశ్వానికి ప్రతీక. ఏనుగుతల, సన్ననికళ్ళు సునిశిత పరిశీలనకు, మేధస్సుకు సంకేతాలు. వక్ర తుండం ప్రణవం అయిన ఓం కారానికి ప్రతీక. ఏనుగు లాంటి ఆ శరీరాన్ని మోసేది అనింద్యుడు అనే చిట్టెలుక. ఇది విద్దూరం అదే ఆత్మ. ఇంతపెద్ద మన శరీరానికి

కదలిక నిచ్చేది హృదయం ఆత్మ. శరీర పరిమాణంలో దాని స్థానం ఎంతో అత్యల్పం. అది లేనిది ఇంతటి శరీరం ఏపనీ చేయలేదు. అంతటి ప్రాముఖ్యం దానిది అదే ఎలుక. అదే ఎలుక లేక మౌస్ మన కంప్యూటర్‌ను ఆడిస్తుంది, నడిపిస్తుంది. ఇప్పుడు టచ్ స్క్రీన్ వచ్చాక మన వేలే మౌస్‌గా మారింది అంతే తేడా.

గణపతి పొట్ట చుట్టూ నాగుపాము బెల్ట్ లాగా చుట్టుకొని ఉంటుంది. నాగుపాము శక్తికి చిహ్నం. భారత దేశంలో నాగుపాము పూజ అనాదిగా ఉంది. జంట పాముల విగ్రహాలను పూజిస్తాం. నాగుల చవితికి పాలు పోస్తాం. నాగ పంచమి జరుపుతాం. ఆ జంట పాములు ఇడా, పింగళా నాడులకు సాంకేతికాలు. జగత్తు అంతా వ్యాపించిన మాయాశక్తి కూడా నాగుపాము గుర్తు. అయన చేతిలోని పాశం అంకుశం బుద్ధిని మనసును సన్మార్గంలో నడిపించే సాధనాలు. మరో చేతిలో ఉన్న దంతం ఆయనదే. మహాభారతం రాసేటప్పుడు వ్యాసభగవానుని వ్రాయసకాడుగా గణపతి ఉండి, తన దంతంవిరిచి దానితో రాశాడు. మరొక చేతిలో ఉండ్రాయి లేక వెలక్కాయ (కపిత్థం) ఉంటుంది. ఉండ్రాయిని "మోదకం" అంటారు–ఆనంద హేతువు. పైన గట్టిదనం ఉన్నా లోపల గుజ్జు మహా మెత్తగా తియ్యగా రుచికరంగా ఉండటం వెలగ పండు ప్రత్యేకత. గణేశుని మూడవ కన్ను జ్ఞాన నేత్రం. చేటలాంటి చెవులు ప్రత్యేకమైనవి. భక్తుల కోరికలు ఎన్ని ఉన్నా వినటానికి అవి ఉపయోగిస్తాయి. అంతే కాదు చేటతో పొల్లు తప్పా తాళి చెరిగేసి నికార్సైన మంచి దాన్ని తీయటానికి ఉపయోగపడుతుంది. అలాగే మన కోరికలలో స్వార్ధ పూరితమైనవి హాని కలిగించేవాటిని చెరిగేసి మంచి వాటినే స్వీకరిస్తాడని భావం. మొత్తం మీద వినాయకుని ఆకారం మనం విజ్ఞానం కోసం, త్యాగం కోసం చేయాల్సిన కృషిని బోధించే రూపం అని గ్రహించాలి.

ఆయన సౌందర్యం వినోదం ఇస్తుందేకాని సుందర రూపం కాదు. కనుక మనసు సౌందర్యమే ముఖ్యం. బయటి ఆకారం కాదు అని మనకు గట్టిగా తెలియజేస్తుంది. బాహ్య సౌందర్యానికి, అంతరంగ సౌందర్యానికి సంబంధం లేదు అనే జ్ఞానాన్ని కలిగించటమే. అంటే జ్ఞాన బోధ చేయటమే ఆయన శరీరంలో ఈ వికృతత్వానికి గుర్తు. సాధారణంగా మనం ఏవైనా తప్పులు చేస్తే దేవుడి ముందు చెంపలు వేసుకొంటాం. కానీ వినాయకుని ముందు మన తప్పును ఒప్పుకొంటూ గుంజీలు తీస్తాం. అంటే మనకు మనమే శిక్ష వేసుకొంటాం అని అర్ధం. ఈ ఆచారం తమిళనాడులో ఎక్కువ అక్కడ గణేష్, మురుగన్ ఆరాధన బాగా జాస్తి.

గణపతికి కృత యుగంలో 10 చేతులు, సింహవాహనుడుగా ఆరాధింపబడితే, త్రేతాయుగం 6 చేతులతో నెమలి వాహనంతో పూజింపబడ్డాడు. ద్వాపరం నుంచి

నాలుగు చేతులు ఏనుగు ముఖం ఎలుక రౌతు అంటే గుర్రంగా ఆవాహన చేయబడినాడు. పరశురాముడి, గణపతికి జరిగిన యుద్ధంలో ఆయన గుండ్ర గొడ్డలితో ఈయన దంతాన్ని నరికేసినట్లు పురాణ కథనం. చంద్రుడు అవమానిస్తే దంతం పీకి చంద్రునిపై విసిరాడనీ ఉంది. ఏక దంతం అంటే– "ఏక శబ్దాత్మి కా మయా తస్యం –సర్వం సముద్భవం భ్రాతి మోహదం పూర్ణం –నానా ఖేలాత్మికమ్ కిలః" ఏక అంటే మాయ –దంత అంటే నిజంగా ఉండేది. అంటే సత్తా మాత్రుడుగా చాలకుడు –అంటే నడిపించేవాడుగా ఆయన ప్రపంచాన్ని నడిపిస్తాడు. మాయతో ప్రపంచాన్ని నడిపించే చాలకుడు అంటే "మూవర్" గణేశుడు .

వైష్ణవ ఆలయాలలో గణేశుని విష్ణుమూర్తిగా, మధ్యప్రదేశ్‌లో "మండేసేరు" ప్రాంతంలో, కన్యాకుమారి దగ్గరున్న శుచీన్ద్రంలో, మధుర సుందరేశ్వరాలయంలో గణపతిని స్త్రీమూర్తిగా పూజిస్తారు. చైనా, బర్మా, బోడియా, మెక్సికో, అమెరికాలలో కూడా గణపతి ఆలయాలున్నాయి. "గాణాపత్యం" అనే ఆరాధనా విధానం ఉంది. షణ్మతాలలో ఇదొక్కటి–

గణ+ఈశ –గణేశ గ అంటే జ్ఞానం ఈశ అంటే అధిపతి అంటే జ్ఞానానికి అధిపతి గణ అంటే ఇంద్రియాలు అని కూడా అర్ధం అంటే ఇంద్రియాధిపతి అని కూడా అర్ధం శ్రీకృష్ణుని పరిపూర్ణ అవతారం గణేశుడు. హేరంబా –అంటే ఓ రక్షకుడా దీన రక్షకా అని అర్ధం. ఏక దంతాః అంటే సర్వ ఉత్కృష్ట బలశాలి –శూర్పకర్ణా –చేట లంత చెవులవాడా –చెడును చెరిగేసి మంచిని ఉంచేవాడా. మనకు నాలుక బయట ఉంటుంది. చెడుమాటలకు మూలమై అవతలివారి గురించి చెడుగా మాట్లాడటం దాని లక్షణం. మనసు అనే నాలుక చివరను మనవైపే త్రిప్పి ఉంచితే, అంటే మన దోషాలను మనమే తెలుసుకొంటే ముక్తి లభిస్తుంది. యోగులు నాలుకను ఈ విధంగా ఉంచుకొని అందులో స్రవించే అమృతాన్ని త్రాగుతూ ఏ ఆహారం లేకుండా ఎంతకాలమైనా జీవించగలుగుతున్నారు. గణపతి జిహ్వాగ్రము కంఠం వైపుకు ఉండటం ప్రత్యేకత. అలా ఉండమని మనకు మార్గదర్శకం చేస్తున్నాడన్నమాట.

పరశురాముడిని తన తొండంతో బంధించి సర్వ బ్రహ్మాండ దర్శనం చివరికి గోలోకంలో శ్రీ కృష్ణ దర్శనం చేయించాడు. గణపతి అని బ్రహ్మ వైవర్త పురాణం "గణేశ ఖండం"లో ఉంది.

శ్రీ కృష్ణ గణేశులు అభిన్నులు. అంటే వేరు వేరు కాదు ఒక్కరే. నిర్గుణ సగుణ బ్రాహ్మలు ఆయన అధిపతి. "ఓం నమస్తే గణపతయే త్వమేవ కేవలం కర్తాసి, త్వమేవ కేవలం హర్తాసి త్వమేవ సర్వం ఖల్విదం బ్రహ్మాసి" అని గణపతి అధర్వ శీర్ష కృతి చెబుతోంది.

శ్రీ కృష్ణ దర్శనం చేసి వస్తున్న గణేశుని ధర్మధ్వజుని కూతురు తులసి చూసి తాను నారాయణుని ప్రేమించి పెళ్లి చేసు కోవాలనుకొని గణపతి కృష్ణునికి అభిన్నుడ కనుక తనను పెళ్లి చేసుకోమని కోరుతుంది. ఆ కోరిక తీరదు అన్నాడు. అప్పుడు "నీకు పెళ్లి అవుతుంది" అని శపించింది. ఈయన వెంటనే ప్రతిగా "నువ్వు రాక్షసివై పుడతావు" అని శపించాడు. బ్రతిమిలాడితే వృక్ష రూపం పొంది అందరి చేతా ఆరాధింపబడుతావు అని విమోచనం కలిగించాడు. తర్వాత జన్మలో శంఖ చూడుడు అనే రాక్షసుని భార్యగా పుట్టింది. రాక్షసుని ఆగడాలు మితిమీరుతుంటే శివుడు త్రిశూలంతో సంహరించాడు. తన కళాంశంతో తులసి వృక్ష రూపం పొందింది. ముక్తికి కారకురాలైంది. అందుకే తులసి దళాలు గణపతి పూజకు నిషిద్ధాలు. వినాయక చవితికి మాత్రం తులసి దళాలతో పూజ చేయవచ్చు. మిగిలినప్పుడు పనికిరావు. విష్ణు పూజకు తప్పని సరి. కృష్ణ తులసి సర్వ శ్రేష్టం.

"గణాలలో గణపతివి కవులకు కవి, అన్నాన్ని సమృద్ధిగా కలవాడు, ఇచ్చేవాడు, అందరికంటే ముందే ప్రకటితమైనవాడు, వేద మంత్రాలలో ప్రకాశించేవాడు అయిన గణపతికి మా నమస్కారం. మా ప్రార్ధనలు విని అన్ని శక్తులతో మా ఇంటిలోకి రావయ్యా" అని గణపతిని ఆహ్వానించే మంత్రానికి అర్ధం.

మహారాష్ట్రలో "గణపతి బప్పా మోరియా" అని పాటలు పాడతారు. బప్పా అంటే తండ్రీ దేవుడా అని అర్ధం. మోరియా అంటే ఏమిటి? దీనికి ఒక యదార్ధ కథ ఉంది. 14వ శతాబ్దంలో మహారాష్ట్ర పూనాలోని చించివాడలో "మొర్యా గోసావి" అనే గణపతి భక్తుడు ఉండేవాడు. ఆయన వలన సిద్ధులు పొందాడు ఈయన. ఇతని భక్తికి మెచ్చి వరం కోరుకోమంటే గణపతి పేరుతో పాటు తనపేరు కూడా శాశ్వతం చేయమని కోరాడు. అలాగే అన్నాడు. అప్పటినుంచి గణపతిని పిలిచినప్పుడల్లా మోరియా పేరు దానికి కలపి పలకమని గణపతి శాసించాడు. అందుకనే "గణపతి బప్పా మోరియా" అయింది.

చిత్తూరు జిల్లాలో తిరుపతికి సుమారు వంద కిలోమీటర్ల దూరంలో కాణిపాకంలో నూతిలో వెలసిన వరసిద్ధి వినాయక స్వయం భూ విగ్రహం ఉంది. చాలా పవర్ఫుల్ దేవుడు. ఎవరైనా అబద్ధ సాక్ష్యం ఆయన ముందు చెబితే వాళ్లకు ఏదో కీడు తప్పక జరుగుతుంది. అందుకని ఆయన ఎదుట నిలబడి నిజాన్నే చెబుతారు. అబద్ధం చెప్పరు. కోర్టులు కూడా ఈ సాక్షాన్ని పరిగణలోకి తీసుకొనేవి. అంటే ఇక్కడ వరసిద్ధి వినాయకుడే సుప్రీం జడ్జి అన్నమాట. ఈ గుడి ప్రక్కన ఉన్న నదికి "బహుదా నది" అనిపేరు. దీనికి ఒక కథ ఉంది. పూర్వం శంఖుడు, లిఖితుడు అనే అన్నదమ్ములు కాణిపాకంకి నడుచుకొంటూ వస్తుంటే దారిలో తమ్ముడికి ఆకలి బాగా

ఎక్కువై అక్కడ కనిపించిన మామిడి తోటలో పండుకోసుకు తింటానని అన్నకు చెబితే అడగకుండా కోయరాదు అని అన్న చెప్పినా వినక కోసి తింటే దాన్ని రాజుగారికి అన్న తెలియజేస్తే రాజు అతని తమ్ముడు లిఖితుడి రెండు చేతులు నరికించాదు. చిన్నతప్పుకు ఇంతపెద్ద శిక్షా అని బాధ పడుతూ అన్న తమ్ముడిని ఓ దారుస్తూ కాణిపాకం చేరి అక్కడి నదిలో స్నానం చేయగానే తమ్ముడి చేతులు వచ్చేశాయి. బాహువులను దా అంటే ఇచ్చిన నది కానుక బాహుదా అయింది, కాలక్రమాన బహుదా నది అయింది".

రెండవ భాగంలో శ్రీ గౌడ రఘు దంపతుల ఇంట్లో శనివారం సాయంత్రం జరిగిన రుద్రాభిషేకం విశేషాలు తెలియ జేస్తాను.

(27-8-17-కాంప్-షార్లెట్-అమెరికా)

**వీక్లీ అమెరికా-22-2** (21-8-17 నుంచి 27-8-17 వరకు)

వినాయక చవితి, మూడవ రుద్రం వారం

## మూడవ రుద్రాభిషేకం

శ్రీ కృష్ణాష్టమి నాడు మా అమ్మాయి వాళ్ళ ఇంట్లో సాయంత్రం జరిగిన భజనకు వచ్చిన శ్రీ గౌడు రఘు గారి భార్య శ్రీమతి సుచిత్ర 26-8-17 శనివారం సాయంత్రం తమ ఇంట్లో రుద్రాభిషేకం ఉందని, నన్ను చేయించమని మా అమ్మాయికి మాకు చెప్పారు. సరే అన్నాను. ఇది ఇక్కడ నేను చేయించిన మూడవ రుద్రాభిషేకం. వీరి అమ్మాయే కుమారి రచిత కిందటి నెలలో కూచిపూడి రంగప్రవేశం చేస్తే వెళ్లి చూసాం.

నిన్న మధ్యాహ్నం 2.45కు వాళ్ళు పంపిన శ్రీ వెంకట్ అనే అనంతపురం జిల్లా ఆయన కారులో మా ఇంటికి వచ్చి నన్ను ఎక్కించుకొని ,దారిలో వాళ్ళ ఇంటికి తీసుకు వెళ్లి భార్యను పిల్లలను ఎక్కించుకొని సుమారు 45 మైళ్ళదూరం అంటే దాదాపు 70 కిలోమీటర్ల దూరంలో ఉన్న రఘు గారింటిలో దింపారు. వెంకట్ గారి భార్య కృష్ణాజిల్లా ఘంటసాల వాసి. అక్కడి హై స్కూల్ సైన్స్ మేష్టారు, తర్వాత హెడ్మాస్టర్ అయినా శ్రీ మూల్పూరి చిన్నారావు గారు నాకు మంచి స్నేహితులు. ఆయన దగ్గర ఈమె చదివింది అవి గుర్తు చేసుకున్నాం దారిలో. చెన్నారావుగారబ్బాయి శ్రీ వెంకటేశ్వరరావు అమెరికాలో ఉంటారు. ఘంటశాల గ్రామం ఆ పాఠశాల అభిరుద్ధికి తండ్రీ కుమారులు చేసిన సేవ నిరుపమానం. చెన్నారావుగారు మరణించి సుమారు ఆరునెలలు పైనే అయింది.

రఘు గారింటికి వెళ్లేసరికి అంతా రెడీగానే ఉన్నారు. రఘు దంపతులకు "దర్శనీయ దైవ క్షేత్రాలు" అందజేశాను. సాయంత్రం 4.30కు గణపతి పూజ చేయించి,

శివుని ప్రతిష్టించి అష్టోత్తర శతనామ పూజ, లలితా అష్టోత్తరం చేయించేసరికి 5.30 అయింది. అప్పుడే రుద్రం చదివేవారు. సుమారు 10 మంది దాకా వచ్చారు. మా శ్రీమతిని శ్రీ గ్రంధి హరి కుటుంబం వారు ఇంటికి వచ్చి సాయంత్రం 4.30కు పికప్ చేసుకొని రఘుగారింటికి తీసుకు వచ్చారు. అభిషేకం ప్రారంభించే ముందు నన్ను రుద్రం గురించి చెప్పమని అక్కడి రవీంద్ర గారు అడిగితే చెప్పాను. ఈయన రఘుగారింట్లో ప్రతి ఆదివారం రుద్రం నేర్పుతున్నారు. తర్వాత లఘున్యాసం, నమక చమకాలతో ఏకాదశ రుద్రాభిషేకం పాలు ఫలరసం తేనే పంచదార పెరుగు నెయ్యి నీరులతో చేయించి వచ్చిన వారందరితో (సుమారు 70 మంది) చేయించి లింగాలను కడిగించి తర్వాత మళ్ళీ షోడశోపచార పూజ అష్టోత్తరం చేయించి నైవేద్యం పెట్టించి హారతి ఇప్పించి, మళ్ళీ నేను లింగం అంటే ఏమిటి అభిషేకం ఎందుకు చేయాలనే విషయాలతోపాటు సరసభారతి విషయాలూ చెప్పి, ఏకాదశ రుద్రాలను పుస్తకం చేతిలో లేకుండానే చక్కగా మాతో స్వరం కలిపి చదివిన కృష్ణాజిల్లా పెనుగంచిప్రోలు అమ్మాయి శ్రీమతి కాకాని లక్ష్మి భక్తికి, స్పష్టమైన ఉచ్చారణను మెచ్చి ఆమెకు సరసభారతి తరఫున 1,116 రూపాయలు (వెయ్యిన్నూట పదహారు రూపాయలు) నగదు కానుక ప్రకటించి, వీలయినప్పుడు మా అమ్మాయి వాళ్ళ ఇంటికి వచ్చి సరసభారతి పుస్తకాలతో సహా తీసుకోమని సభా ముఖంగా తెలియజేసి, ఆ తరవాత మంగళహారతి, మంత్రం పుష్పం అందరు లేచి నిలబడి ఏక కంఠంగా చెప్పించి ఉద్వాసన చెప్పించాను. రఘు దంపతులకు నా చేతులమీదుగా తీర్థ ప్రసాదాలు అంద జేశాను. దంపతులు వారితోపాటు అందరూ ఎంతో బాగా చేయించానని నన్ను అభినందించారు. నాకు కూడా ఇప్పటికి చేయించిన మూడు రుద్రాలలో ఇది చాలా సంతృప్తి నిచ్చింది. రుద్రం గురించి విపులంగా చెప్పే అవకాశమూ వచ్చి అందరికి ఆనందాన్ని, సంతృప్తిని కలిగించగలిగాను. తర్వాత– కర్ణాటక స్పెషల్ అయిన హోళిగలు బేడలచారు, గారే పప్పు కూర సాంబారు పెరుగులతో మంచి భోజనం అందరికి. అయ్యాక నాకు "ఘనమైన నగదు కానుక"నిచ్చి రఘు దంపతులు మా దంపతుల కాళ్లకు మొక్కి పిల్లలతో కూడా మొక్కించి ఆశీర్వాదాలు పొందారు. గ్రూప్ ఫోటో తీసుకున్నారు. అలాగే వెంకట్ కుటుంబం హరి కుటుంబం మొదలైనవారు కూడా. అంతా అయేసరికి రాత్రి 11 అయింది. రాత్రి 11.30కు ఇంటికి చేరుకున్నాం. నేను రుద్రం గురించి చెప్పిన విషయాలు తెలియజేస్తాను.

## శ్రీ రుద్రం

"నమకంలో 11 అనువాకాలు, చమకంలో 11 అనువాకాలు కలిస్తే రుద్రం లేక రుద్రాధ్యాయం లేక శత రుద్రీయం అంటారు. శత అంటే వంద అనికాదు చాలా అని అర్థం. అంటే అనంతమైన రుద్రుల గురించి చెప్పేది అని. రుద్రుడు రోదసి లేక

అంతరిక్షంకు అధిపతి. 11 రూపాలతో వ్యక్తమవుతాడు. ఇవే ఏకాదశ రుద్ర రూపాలు. వీరిని "Gods of vibration" అంటారు. దివి లేక ఆకాశానికి సంబంధించిన 12 మందిని ద్వాదశాదిత్యులు అంటారు. వీరు "Gods of radiation". భూమికి సంబంధించిన 8 మంది దేవతలను అష్ట వసువులు అంటారు. వీరికి "Gods of materialization" అని పేరు. సృష్టికి కారణభూతమైనవారు భీష్ముడు ఒక వసువు రూపమే. వీరిని బట్టే సంస్కృత ఛందస్సులు ఏర్పడ్డాయి. 12 అక్షరాల ఛందస్సును త్రిష్టుప్ అని, 11 అక్షరాలా జగతి, 8 అక్షరాలా గాయత్రి 16 అక్షరాలా అనుష్టుప్ ఛందస్సులు ఏర్పడ్డాయి.

శత రుద్రీయం అమృతత్వ సార్ధకం. శివ అంటే అవాఙ్మానస గోచర సత్య, జ్ఞాన ఆనంద లక్షణ పరబ్రహ్మం. అంటే అమృతత్వ భావన–మోక్షానికి మార్గం. ఇదే శ్రీ విద్యారూపం కూడా. నమకమ్ మొదటి అనువాకం –"నమస్తే రుద్రమన్యవ ఉతోషత ఇశవే నమః" మంత్రంతో ప్రారంభమవుతుంది. ఇందులో అన్ని వ్యసనాలకు మూలకారణం అయిన క్రోధానికి నమస్కారం చెప్పబడింది. తర్వాత బాధను కలిగించే శివ ధనుస్సుకు బాణానికి దాన్ని చేబట్టే చేతులకు నమస్కారం చెప్పారు. అంటే ఈ జగత్తును లయం చేసే రుద్రుడు అయిన శివుని యొక్క "ఘోర రూపం" వర్ణించబడింది. శివుడు "అఘోర రూపం"లో కూడా ఉంటాడు– "అఘోర ఘోర తరే భ్యహ" రెండవ అనువాకంలో సుఖాన్ని కలిగించే శాంత స్వభావం వర్ణించబడింది. 8వ అనువాకంలో శివ పంచాక్షరీ ఉంది. ఇది బంధ విచ్చేదనం చేసి జ్ఞానాన్నిచ్చి ముక్తినిస్తుంది. అందుకనే రుద్రాధ్యాయంలో దీన్ని మణిపూస అంటారు. క్రోధం నశిస్తే శాంతి కలుగుతుంది అని భావం. శాంతి ఉంటే సకల సౌఖ్యాలు కలుగుతాయి. విష్ణువును "శాంతాకారం భుజగ శయనం పద్మనాభం సురేశం" అనే శ్లోకంతో, శివుడిని "శాంతం పద్మాసనస్థం శశిధర నయనం పంచ వక్త్రం త్రినేత్రం" అనే శ్లోకంతో ప్రార్థిస్తాం. రెండింటిలోనూ శాంతమే మొదటి పదం. నమకం అంతా అనేక రూపాల రుద్రునికి నమస్కారాలను తెలియజేస్తుంది.

చమకం "అఙ్నా విష్ణూ సజో ష సేమా వర్ధంతు వాంగిరః –ద్యుమ్నై ర్వాజే భి రాగతం" అనే మంత్రంతో ప్రారంభమవుతుంది. చమకంలో శివుడికి మన కోరికల చిట్టా విప్పుతాం. నాకు అదివ్వు ఇదివ్వు అని వేడుకొంటాం. దీన్ని "చమే" పదం సూచిస్తుంది. దీని అర్ధం అది కూడా అని. మన కోరికల లిస్ట్ చాలా ఉంటుంది కనుక "చమే" చాలాసార్లు వస్తుంది. ఇందులోనే "కల్పతాం" అనే మాటకు అర్ధం కలుగుగాక. రుద్రంలో రెండు వాక్యాలమంత్రాన్ని ఋక్కులని ఒకే వాక్యం ఉంటే యజుస్సు అని అంటారు. శివ తమా అంటే శివ తత్త్వం –అంటే మోక్షమే. రుద్రుడు

ధరించే ధనుస్సు మొదటి సగం మన శిరసులోని బ్రహ్మ రంధ్రం నుంచి ముందువైపుకు భ్రూమధ్యం వరకు ఉంటుంది. ఇక్కడే "మన్యువు" అనే శక్తి ఉంటుంది. రెండవ సగం భ్రూమధ్యం నుంచి మెడవరకు ఉంటుంది. కనుబొమల నుండి మెడ వరకు అడ్డంగా పుర్రెపై వ్యాపించి ఉన్న రేఖయే శివధనుస్సు. అందుకే శివుడు "కపాలం" చేతిలో ధరిస్తాడు. ఇది సాంకేతికం. ఆకాశంలో సూర్యుడు ఉదయం నుంచి సాయంత్రం వరకు పయనించే దారి ఒక ఆర్క్‌లాగా ఉండే శివ ధనుస్సే. దీనివలన పగలు రాత్రి ఏర్పడుతాయి. శివుడు కాలస్వరూపం. మహాకాలుడు అంటారు. ఉజ్జయిలో ఉన్న శివుడు మహా కాళేశ్వరుడు. మన ఇంద్రియ శక్తులు కపాలం నుంచి రుద్ర గ్రంథి వరకు అంటే మెడుల్లా మీదుగా పని చేస్తాయి. అందుకే మెడుల్లా చాలా ముఖ్యమైనది. అది పని చేయకపోతే జీవితం వ్యర్థం. 5జ్ఞానేంద్రియాలు 5 కర్మేంద్రియాలు మనసును ఆశ్రయించి ఉన్న రుద్రుని 11 రూపాలే శివుని 11 బాణాలు.

"నా రుద్రో రుద్ర మర్చయేత్" అంటే రుద్రుడు కానివాడు రుద్రుని అర్చించటానికి అర్హుడు కాదు. అందుకే రుద్రుని యొక్క విభూతిని అంటే బూడిద కాదు. ఐశ్వర్యాన్ని మన శరీరంలో ఒక్కొక్క అవయవంలో ఉంచుకొని అంటే న్యాసం చేసి మనం రుద్రులం అయి అప్పుడు రుద్రాభిషేకం చేస్తాం. దీన్నే మహాన్యాసం అంటారు. గొప్పగా ఉంచుకోవటం. "దేహో దేవాలయ ప్రో క్తో జీవో దేవ స్సనాతనః" అంటే దేహమే దేవాలయం జీవుడే సనాతను డైన పరమేశ్వరుడు. శివుడు వ్యోమ కేశుడు అంటే ఆకాశమే జుట్టుగా కలవాడని భావం. దిక్కులే ఆయన వస్త్రాలు కనుక దిగంబరుడు. అంతేకాని బట్టలు విప్పుకొని తిరిగే వాడు అని అర్థం కాదు. ఆయన జటాజూటి- అన్ని రహస్యాలు తెలిసినవాడు.

ఇప్పటిదాకా రుద్రార్చనా విధిని తెలుసుకున్నాం, ఇప్పుడు శివలింగం గూర్చి దానికి ఎందుకు అభిషేకం చేయాలి అనే దాన్ని తెలుసుకొందాం.

## శివ లింగం

శివుడే లింగం, శివుడైన లింగం శివ లింగం. లింగాన్ని పూజించాలి అని శివ పురాణంలో ఉంది. శివ లింగంలో ప్రజ్ఞానంలో బ్రహ్మ, పాదంలో విష్ణువు, హస్తంలో హరుడు, బాహువుల్లో ఇంద్రుడు, జఠరంలో అగ్ని, హృదయంలో శివుడు, కంఠంలో వనవాసి, నాలుకతో సరస్వతి, ముక్కులో వాయువు, కళ్ళల్లో సూర్య, చంద్రులు, చెవులలో అశ్వినీ దేవతలు లలాటంలో రుద్రుడు, మూర్ధ భాగంలో ఆదిత్యుడు, శిరసులో మహాదేవుడు, పృష్ఠంలో పినాకిని, ముందు శూలి, ప్రక్కల శివుడు, శంకరుడు, అన్నిటా వాయువు, దాని బయట అగ్ని జ్వాలా, సర్వాంగాలలో సర్వ దేవతలు యధా స్థానంలో ఉండి నన్ను రక్షించుగాక యజమానులు రక్షించుగాక" అని ఆవాహన చేసి ప్రార్థిస్తాం.

"లిం గమయతే ఇతి లింగః" అంటే దేనిలో నుంచి విశ్వం ఆవిర్భవించి దేనిలోకి లయం అవుతుందో అదే లింగం. ఆది మధ్యాంత రహితమై అవాఙ్మానస గోచరమైనది లింగం.

లింగాన్ని ఎందుకు పూజించాలి? దీనికి మహా భారతం ద్రోణ పర్వంలో ఒక విషయం ఉంది. ద్రోణుడు మరణించాక కొడుకు అశ్వత్థామ తీవ్ర కోపావేశంతో పాండవ సైన్యంపై విరుచుకుపడి ఒక అక్షౌహిణి సైన్యాన్ని సంహరించి ప్రళయకాల రుద్రుడుగా చెలరేగి పోయాడు. అతన్ని ఎదిరించే సాహసం ఎవరూ చేయలేక పోయారు. ఆగ్నేయ బ్రహ్మాస్త్రాలతో భీభత్సం సృష్టించాడు. చివరికి నరనారాయణులైన కృష్ణార్జునపై యుద్ధం ప్రారంభించాడు. చాలా సేపు యుద్ధం చేశాడు. కానీ దీటుగా అర్జునుడు సమాధానం చెబుతున్నాడు. ఇక ఆగలేక చివరి అస్త్రంగా నారాయణాస్త్రం ప్రయోగించాడు ఇద్దరిపైనా. కృష్ణార్జునులు రథం దిగి ఆయుధాలు వదిలేసి దానికి భక్తితో నమస్కరించారు. అది వారిని ఏమీ చేయకుండా విఫలమై వెనక్కి వెళ్లి పోయింది. నారాయణాస్త్రంతో ఇదివరకు ఎందరినో జయించిన అశ్వత్థామకు ఎందుకు ఇలా జరిగిందో తెలీక బుర్ర గోక్కొని వ్యాసమహర్షిని ప్రార్థించాడు. ఆయన ప్రత్యక్షం అవగానే కారణం అడిగాడు. దానికి ఆయన పూర్వ జన్మలో మీరు చేసిన శివ పూజా ఫలితమే ఇది. కృష్ణార్జునులు మట్టితో శివలింగం చేసి పూజించి అభిషేకాలు చేశారు. నువ్వు శివుని బొమ్మ తయారు చేసి పూజించావు. లింగ పూజ ప్రతిమ పూజ కన్నా శ్రేష్టం. అందుకే వారిని శివుని వరం వలన నారాయణాస్త్రం ఏమీ చేయలేక పోయింది- "వారలు లింగాధిష్టా-నారూఢంగా నొనర్చి యర్చించిరి -భవ్యారాధన వరులై మును -గౌరీపతిని అతుల నియామకల్పన వెలయన్"

"శుభ్రమగు నుర్వి మృత్తిక సురు చిరంపు -బ్రతిమగావించుకొని, యందు బరము నావహించి-పూజలు విశేషంబులెల్ల జేసి - దీవు దొలు మేన గొలిచితి నిష్ఠ తో డ"

"లింగంబు నందు బూజించుట -యర్చయందారాధించుట కంటే -ననేక గుణంబు లెక్కువ" అని తిక్కనగారు వ్యాసునితో చెప్పించారు. అందుకే లింగ పూజ సర్వ శ్రేష్టం.

లింగానికి అభిషేకం పుణ్యఫలం. బ్రహ్మాండం అండాకారంలో ఉంటుంది. శివుని శిరసుపై గంగ, చంద్రవంక ఆయనకు చల్లదనాన్ని కల్గిస్తాయి. శివుడు కృత్తికా నక్షత్రంలో పుట్టాడు. అది అగ్ని నక్షత్రం. ఆయన మూడవ కన్ను కూడా అగ్ని గోళమే. అందుకని ఆ వేడిని చల్లబరచటానికి ఎప్పుడూ నెత్తిన నీళ్లు పోస్తూండాలి అంటే అభిషేకం చేయాలి. ఆయన చల్లగా ఉంటే లోకాలు చల్లగా ఉంటాయి. కనుకనే శివలింగంపై

ఎప్పుడూ నీటిధారపడే ఏర్పాటు ఉంటుంది. శివాలయంలో శివలింగానికి ఎదురుగా కూర్చున్న నంది విగ్రహం ఉంటుంది. దీని ఉచ్ఛ్వాస నిశ్వాసాలు శివలింగాన్ని చల్లబరుస్తాయి. మన మనసులోని కోరికల వలన మనసులు కూడా వేడెక్కుతాయి. వీటిని చల్లబరచటానికి అంటే కోరికలు తీర్చుకోవటానికి అభిషేకం చేస్తామ్ లేక చేయిస్తాం. పంచామృతాభిషేకం అంతరాత్మ శుద్ధినిస్తుంది. ఇందులోని ఆవుపాలు జ్ఞానానికి గుర్తు. జ్ఞానప్రదాత. తేనే ఆపాత మధురం. ఎక్కువ వాడితే మత్తు ఎక్కుతుంది. అది విషయం వాంఛలకు ప్రతి రూపం. విషయ వైరాగ్యం కలగాలని ప్రార్ధించాలి. పంచదార అహంకారానికి ప్రతిరూపం. దాన్ని తొలగించమని, వినయం ఇవ్వమని ప్రార్ధించాలి. ఆవునెయ్యి పాప హరణం. పాపాలను తొలగించమని కోరుకోవాలి. ఇదీ అభిషేకంలో ఉన్న అంతరార్ధం.

పుష్పదంతుడు అనే గంధర్వరాజు మహా శివ భక్తుడు. కామ రూపం ధరించే సిద్ధి ఉన్నవాడు. మహా సంగీత విద్వా ంసుడు. అందుకే ఇంద్రుడు ఆస్థాన గాయకుని చేశాడు. ఒకసారి భూలోకంలో కామ రూపంలో సంచరిస్తూ ఒక రాజు గారి పూలతోటలో శివ పూజకు పెంచుతున్న పుష్పాల సుగంధానికి పరవశుడై రాత్రివేళ వాటికి కోసుకు పోతున్నాడు. రాజుకు శివపూజకు పూలు చాలక నిఘా పెట్టించి పూలమొక్కల వద్ద నేలపై మారేడు దళాలను పరపించాడు. పుష్పదంతుడు రాత్రివేళ పూలు కోయటానికి మొక్కలవద్దకు వెడుతూ మారేడు దళాలను తొక్కాడు. కైలాసంలో శివుని తపస్సుకు భంగం కలిగి అతని శక్తులన్నీ లాగేశాడు. దీనితో కాపలా వాళ్లకు పట్టుబడగా రాజు కారాగారంలో బంధించాడు. జరిగిన దానికి చింతిస్తూ శివమహిమలపై స్తోత్రం రాశాడు. అదే "శివ మహిమ్న స్తోత్రం". స్తోత్రం పూర్తికాగానే మెచ్చిన శివుడు అతని శక్తులను మళ్ళీ ఇచ్చివేశాడు. రాజుకు క్షమాపణలు చెప్పి మళ్ళీ గంధర్వ లోకానికి వెళ్ళాడు. ఆ స్తోత్రంలో ఒక శ్లోకం చాలా తమాషాగా బాగా ఉంటుంది.

"యత్కృత్యమ్ తన్నకృత్యం యదకృత్యం కృత్య వదాచరితం-ఉభయో ప్రాయశ్చిత్తం శివ, తవనామాక్షర ద్వయోచ్చరితం"

భావం- శంకరా! జీవితంలో తప్పకుండా చేయాల్సిన పనులు చేయ లేకపోయాను. ఆచరించ కూడనివి తప్పనిసరిగా ఆచరించాను. ఈ రెండూ దోషాలే, పాపాలే శిక్షార్హాలే. వాటికి పరిహారం నీ పేరులోని రెండు అక్షరాలైన "శివ" అనే నామం భక్తితో పలకటమే" అదీ శివ మహిమ అంటే.

ఈ వీక్లీ ఇంతటితో సమాప్తం .

(27-8-17-కాంప్-షార్లెట్-అమెరికా)

**వీక్లీ అమెరికా-23-1** (28-8-17 నుండి 3-9-17 వరకు)

## శ్రీ సత్యనారాయణ వ్రతం, కారీ ప్రయాణ వారం-1

28-8-17 సోమవారం నంద్యాల ఉప ఎన్నిక ఫలితాలు భూమా నాగిరెడ్డి కుమారుడు 28 వేల భారీ మెజార్టీతో గెలుపు. సోమవారం సాయంత్రం పవన్, రాధా వచ్చి శనివారం వాళ్ళ ఇంట్లో శ్రీ సత్యనారాయణ స్వామి వ్రతం చేయించమని కోరారు. సరే అన్నాను వ్రతం అయ్యాక దాదాపు 5 నెలలనుండి వాయిదా వేస్తున్న కారీ ప్రయాణం చేద్దామనుకొన్నాం మా అమ్మాయి మేము. రాత్రి నాటక నటుడు రచయిత సినీ హాస్య నటుడు లంకా భద్రాద్రి శ్రీరామ్ అనే ఎల్ బి శ్రీరామ్ తీస్తున్న షార్ట్ ఫిలిం సీరీస్ "he art" "films" మళ్ళీ చూశా. అందులో గంగిరెద్దు అద్భుత. దేవాలయంలో ప్రసాదంగా మంచి పాతపుస్తకాలు పంచి పెట్టే కాన్సెప్ట్‌తో ఉన్న "ప్రసాదం", "రాళ్లు" ఫిలింలో శిల్పి అందరికి నయనానందం కల్గిస్తాడు కాని అతని ఇంట్లో పొయ్యిలో పిల్లిలేవటానికి ఎంత కష్టపడతాడో తెలిపే సినిమా గొప్పగా ఉంది. దేవుడు గుడిలో మాత్రమే లేడు, సర్వత్రా ఉన్నాడు. చూసే కళ్ళు ఉంటే అని తెలియజెప్పే "దేవుడు" తండ్రి ఇంటికి వస్తున్నాడంటే డబ్బు అడుగుతాడేమోనని కొడుకు కోడలు భావించి వెంటనే పంపించేద్దామని అనుకొంటున్న వారిద్దరికీ షాకింగ్‌గా తండ్రి 20 వేల రూపాయలు కొడుకు చేతిలో పోసి, కోడలి జబ్బు నయం చేయించమని చెప్పగా వాళ్ళిద్దర్నీ అవాక్కు చేసిన "నాన్న" లఘు చిత్రం, కూతురు తండ్రి అనుమతి లేకుండా ఎవర్నో పెళ్లి చేసుకొంటే భరించలేక పోయిన తండ్రి మరణ శయ్యమీద కూతురు ఫోన్ నంబర్ నర్సుకు ఇస్తే, మానవత్వమున్న నర్స్ ఆ అమ్మాయికి ఫోన్ చేసి పిలిపించి ఆమె బాధ పడకూడదని తండ్రి ఆ అమ్మాయిని క్షమించినట్లు తానే ఉత్తరం రాసి, చనిపోయిన తండ్రిని చూడటానికి వచ్చిన కూతురుకు మనశాంతిని, చనిపోయిన తండ్రికి ఆత్మశాంతిని కలిగించిన నర్స్ ఔదార్యం తెలియజేసే "నర్స్" చిత్రం హృదయాలను కదిలించాయి.

గొల్లపూడి మారుతీరావు తనికెళ్ళ భరణి, బలభద్ర పాత్రుని రమణి వంటి లబ్ధ ప్రతిష్టులతో తీసిన సెంటిమెంట్ చిత్రం "పల్లకి" గుండెలను కదిలిచేస్తుంది. అందరూ జీవించారు ఇందులో. దీన్ని అపర అన్నపూర్ణ నిరతాన్న ప్రదాత కీ.శే. శ్రీమతి డొక్కా సీతమ్మగారి మనవడి కొడుకు అంటే ఇన్ని మనవడు శ్రీ డొక్కా ఫణి డైరెక్ట్ చేశారు. ఫణిగారు అట్లాంటాలో ఉంటూ తమ ఇంట సాహిత్య కార్యక్రమాలు క్రమం తప్పకుండా నిర్వహిస్తూ ఉంటే తమ్ముడు శ్రీ డొక్కా రామభద్ర ఆస్టిన్‌లో ఉంటూ సాహిత్య సామాజిక సేవ చేస్తూ, పుస్తకాలు రాసి ప్రచురిస్తున్నారు. ఈ లఘు చిత్రాలలో శ్రీరామ్ నటన పారాకాష్టకు చేరింది. ఎక్కడా కృత్రిమత కనిపించదు. సహజత్వం ఉట్టి పడుతుంది. తప్పని సరిగా "హార్ట్ ఫిలిం"లను అందరూ చూసి ఆనందించమనీ, ఎల్బీ ఇందులోనూ

శిఖరాగ్రాన నిలవాలని కోరుతున్నాను. మానవీయ కోణాల ఆవిష్కరణకు జేజేలు పలుకుతున్నాను.

మంగళవారం- గీర్వాణం-3లో 443 వరకు రాశాను.

**30-8-17 బుధవారం- మంచి మనిషి శ్రీ ఆదిత్యారామ్ ఆకస్మిక మరణం**

27వ తేదీ ఆదివారం మధ్యాహ్నం ఇక్కడ మా కమ్యూనిటీలోనే మా ఇంటికి మూడవ ఇంట్లో ఉంటున్న దంత వైద్యురాలు శ్రీమతి భావన గారి భర్త, బాంక్‌లో పనిచేస్తున్న అందరికి ఆప్తులు శ్రీ ఆదిత్యారామ్ అకస్మాత్తుగా హార్ట్ ఎటాక్ వచ్చి ఒక్కసారిగా కుప్పకూలి చనిపోయారు. వయసు 48 మాత్రమే. మా అమ్మాయికి తెలిసివాళ్ళ అమ్మాయిని తీసుకొచ్చి మా ఇంట్లో ఉంచి మా మనవాళ్లతో ఆమెతో మాట్లాడిస్తూ ఆ అమ్మాయికి షాక్ కలగకుండా జాగ్రత్త పరచింది అబ్బాయి పెద్దవాడు. అతడూ తరచుగా మా మనవడు శ్రీకేత్ కోసం వస్తూంటాడు. ఆదిత్యారామ్‌ను అంబులెన్స్‌లో హాస్పిటల్‌కు తీసుకువెళ్లి అన్ని ప్రయత్నాలు చేయించినా ఫలితం దక్కక సాయంత్రం 5.30కు డాక్టర్లు చనిపోయినట్లు ప్రకటించారు. అక్కడే ఐ.సిలో ఉంచి 30వ తేదీ బుధవారం మధ్యాహ్నం శవ దహన వాటికకు చేర్చారు. మా అమ్మాయి స్నేహితురాలు సురేఖ ఆమె భర్త మరో మిత్రురాలు సునీతతో నన్ను అక్కడికి తీసుకు వెళ్లారు కారులో. అరగంటకు పైగా ప్రయాణం మధ్యాహ్నం 1.15కు చేరాం. అందరూ ఆదిత్యారామ్ పార్థివ దేహాన్ని చూసే వీలు కల్పించి అంతిమ దర్శనం కలిగించారు. వాళ్ళ కుటుంబంతోపాటు సుమారు 100 మంది హాజరయ్యారు. రామ్ వాళ్ళు బెంగుళూరుకు తెలుగు కుటుంబం. ఇక్కడ ఈ ఇంట్లోకి వచ్చి మూడేళ్లే అయింది. మంచి స్థితిపరులు. దంపతులిద్దరికీ మంచి పేరు ప్రతిష్టలున్నాయి. ఆయనతో దాదాపు 30 ఏళ్ళ అనుబంధం ఉన్న ఒక మిత్రుడు, 15 ఏళ్ళ మిత్రత్వం ఉన్న మరో మిత్రుడు ఇక్కడి అమెరికన్ మిత్రులు స్నేహితులు ఆదిత్య గురించి మనసువిప్పి చెప్పారు. భార్య కన్నీరు మున్నీరుగా విలపిస్తూ, చెప్పలేక చెప్పలేక నాలుగు మాటలు చెప్పింది. కొడుకు చిన్నవాడే అయినా సందర్భాలని బట్టి పెద్ద వాడై హుందాగా ప్రవర్తించాడు. అయిదుసార్లు అమెరికా వచ్చిన నాకు ఇదే మొదటిసారి ఇలాంటి దానిలో పాల్గొనటం. ఇదంతా అయ్యేసరికి మధ్యాహ్నం 3.15 అయింది. సాయంత్రం 4.30కు అక్కడే ఉన్న విద్యుత్ శ్మశాన వాటికలో దహనం. నన్ను సురేఖను సునీత భర్త మధ్యాహ్నం 3.30కు మా ఇళ్లకు కారులో తీసుకొచ్చాడు. రాగానే బట్టలు తడిపి స్నానం చేసి విభూతి పెట్టుకొన్నాను.

ఆదివారం నుండి ఈ కమ్యూనిటీలోని ఆడవాళ్లు మగవాళ్ళు అందరూ డ్యూటీలు వేసుకొని ఇంటిదగ్గరా హాస్పిటల్ లోనూ ఆ కుటుంబానికి అన్నిరకాల సహాయ సహకారాలు అందిస్తున్నారు. మా అమ్మాయి అందరికి కో ఆర్డినేట్ చేసింది. ఆఫీస్ నుంచి రాగానే

కాఫీ టీ పెట్టి ఫ్లాస్కులలో వాళ్ళ ఇంటికి తీసుకు వెళ్లి ఇచ్చి వచ్చేది. మానవత్వం పరిమళించటం అంటే ఇదే.

గురువారం పవన్ రాధా వచ్చి వ్రతానికి, భోజనానికి పిలిచారు. మర్యాద పూర్వకంగా. మా మనవడు అశుతోష్‌కు కాలి బొటనవ్రేలుకు దెబ్బతగిలితే. మా అమ్మాయి ఆఫీస్ నుంచి రాగానే దగ్గరలో ఉన్న పీడియాట్రిక్స్‌కు తీసుకు వెళ్లాం. ఎక్స్-రే తీశారు. కాని రేడియాలజిస్ట్ లేకపోవటంతో మర్నాడు రమ్మన్నారు. నేను హోమియో అందు ఆర్నికా, రూస్టక్స్ వేశాను. రాత్రికి ఉపశమనం కలిగి నిద్ర బాగానే పోయాడు. శుక్రవారం బడికి వెళ్ళాడు కూడా.

శుక్రవారం అన్నదమ్ములిద్దరూ స్కూల్‌కు వెళ్లారు. శ్రీ ఎల్లాప్రగడ రామమోహనరావు గారికి ఫోన్ చేసి శనివారం సాయంత్రం బయల్దేరి కారీ వస్తున్నట్లు తెలియజేశాను. చాలా ఆనంద పడ్డారు. మైనేనిగారికీ మామనవాడు హరికీ కూడా చెప్పాం. గీర్వాణం -3లో 450 వరకు రాశా. శ్రీ చలపాక ప్రకాష్ ఆన్ లైన్‌లో పంపిన 1-100 పేజీల ఆధుని ప్రపంచ నిర్మాతలు డిటిపిలో తప్పులు దిద్ది వెంటనే ఆ లిస్ట్ ప్రకాష్ గారికి పంపాను. మైనేని గారినీ దిద్దమని చెప్పి ఆ లిస్ట్ కూడా ప్రకాష్‌కు పంపి సరి చేయమని ఫోన్ చేసి చెప్పా.

(4-9-17-కాంప్-షార్లెట్ -అమెరికా)

**వీక్లీ అమెరికా-23-2** (28-8-17 నుండి 3-9-17 వరకు)

## శ్రీ సత్యనారాయణ వ్రతం, కారీ ప్రయాణ వారం-2

పవన్ ఇంట్లో శ్రీ సత్యనారాయణ స్వామి వ్రతం

2-9-17 శనివారం- ఉదయమే లేచి ఇంట్లో సంధ్య, పూజాదికాలు ముగించి 9.30కు మా అమ్మాయి కారులో మేమిద్దరం పవన్ వాళ్ళ ఇంటికి వెళ్లాం. అప్పటికే కొంత ఏర్పాటు చేశారు. మేము వెళ్ళాక స్పీడ్ పెంచి అన్ని ఏర్పాట్లు చేసేసరికి 11 అయింది. పవన్, రాధా దంపతులు ముఖ్య తారాగణంగా రాంకీ, ఉష దంపతులు, పవన్ సాయి పద్మజ దంపతులు, పవన్ బంధువులు శ్రీనాధ్ దంపతులు, బులుసు సాంబమూర్తి పద్మజా దంపతులు అతిథి నటులుగా వ్రతంలో కూర్చున్నారు. ముందుగా విఘ్నేశ్వర పూజ చేయించి తర్వాత శ్రీ రామా సహిత సత్యనారాయణ స్వామి ప్రాణ ప్రతిష్ఠ చేయించి, నవగ్రహాల ఆవాహనం ప్రతి గ్రహానికి అష్టోత్తర పూజ అక్కడ వాడవలసిన రంగుపుష్పాలతో చేయించి అష్ట దిక్పాల పూజ మొదలైనవాటి తర్వాత, లక్ష్మీ సమేత శ్రీ సత్యనారాయణ ప్రతిమలకు రూపులకు పురుషసూక్త, స్త్రీ సూక్త భూసూక్తాలతో అభిషేకం చేయించి, పిమ్మట సత్యనారాయణ అస్టోత్తర విష్ణు సహస్ర నామ, లక్ష్మీ అష్టోత్తర పూజ

చేయించి సత్యనారాయణ స్వామి ప్రసాదం నైవేద్యం పెట్టించి వ్రత కథలు అయిదు చెప్పి మళ్ళీ అష్టోత్తరపూజ చేయించి ఆ తర్వాత శ్రీ వెంకటేశ్వర దీపారాధన అష్టోత్తర పూజ చేయించి మహా నైవేద్యం పెట్టించాను. మంగళహారతి ఇప్పించి తర్వాత అందరం లేచి ఏకకంఠంగా మంత్రపుష్పం ఉచ్చై స్వరంతో పఠించి పూజ పూర్తి చేయించాను. తర్వాత ఉద్వాసన మంత్రమూ చెప్పించి చేయించాను. దంపతులందరికి మా శ్రీమతి రాధ బంధువులావిడ మొదలైన ముత్తైదువులు మంగళ హారతి పట్టారు. నేను ఆశీర్వాద మంత్రాలు క్రమ జట ఘనంతో ఒక వేదపనస చదివి ఆశీర్వ దించాను. తర్వాత తీర్ధ ప్రసాదం అందరికి ఇచ్చాను. ఈ రోజు ప్రాముఖ్యతను, అన్నవరం క్షేత్రాన్ని గురించి చెప్పాను. అంతా అయ్యేసరికి మధ్యాహ్నం 3 దాటింది. అంటే సుమారు మూడున్నర గంటల పూజ.

ఈ రోజు ప్రత్యేకత– అన్నవరం క్షేత్రం

ఇవాళ అంటే భాద్ర పద శుద్ధ ఏకాదశి ద్వాదశి కలిసిన పుణ్య ఘడియలలో శ్రీ సత్యనారాయణ వ్రతం చేయటం అనంత పుణ్య ప్రదం.

"సంస్పృశ్య ఏకాదశీ రాజన్, ద్వాదశీ మపి సంస్పృశేత్ –శ్రవణం, జ్యోతిషామ్ శ్రేష్టం బ్రహ్మ హత్యాది వ్యపోహతి –"

"ద్వాదశీ శ్రవణం పృష్ఠ స్పృశేత్ ఏకాదశీమ్ యది –స ఏవ వైష్ణవో యోగః – విష్ణు శృంఖల సౌజ్ఞితః" అని నారద పురాణం చెప్పింది. దీని భావం ఏమిటి అంటే – భాద్రపద మాసంలో శుక్లపక్షంలో ఏకాదశి ద్వాదశీ తిధులు కలసి ఉన్నరోజున శ్రవణా నక్షత్రం ఉంటే చేసే వ్రతం బ్రహ్మ హత్యా దోషాన్ని పోగొట్టి మోక్షాన్నిస్తుంది. దీనికే విష్ణు శృంఖలా యోగం అంటారు. ఈ రోజు బుధవారం కూడా అయితే మరింత ఫలప్రదం. దీన్ని అప్పుడు "మహాద్వాదశి" అంటారు. ఉపవాసం ఉండి వ్రతం చేసి దానాలిస్తే వచ్చే జన్మలో చక్రవర్తిగా పుడతారని మార్కండేయ పురాణమూ మత్స్య పురాణమూ చెప్పాయి. ఇందులో మనకు తిధులు మాత్రమే కలిశాయి కనుక సగం పుణ్యం సాధించినట్లే. ఇవాళ పూర్వాషాఢ వెళ్లి ఉత్తరాషాఢలో ఈ వ్రతం చేస్తున్నాం తర్వాత వచ్చేదే శ్రవణా నక్షత్రం.

ఇవాళ్టి భాద్ర పద శుద్ధ ఏకాదశిని "పరివర్తన ఏకాదశి" అంటారు. వామన ఏకాదశి అనే పేరుకూడా ఉంది. బలి చక్రవర్తిని విష్ణువు వామనమూర్తిగా అవతరించి మూడు అడుగులు దానం అడిగి ఒకడుగు భూమిపై రెండవది ఆకాశంలో పెట్టి మూడో దానికి చోటులేక బలి నెత్తిన పెట్టి పాతాళలోకానికి అదిమి పంపి తాను ద్వారపాలకునిగా కావలిగా ఉన్న రోజు ఇది.

## అన్నవరం

పూర్వం మేరు పర్వతం భార్య మేనక పుత్ర సంతానం కోసం శ్రీ మహా విష్ణువుపై ధ్యాన తపస్సులు చేయగా, వారు కోరుకున్న పుత్ర సంతానాన్ని వరంగా ఇచ్చాడు. భద్రుడు, రత్నాకరుడు అనే ఇద్దరు కొడుకులు పుట్టారు. భద్రుడు శ్రీరాముని కోసం తపస్సు చేసి ప్రత్యక్షంకాగా తనకొండపైనే కొలువుండమని కోరటం ఆయన భద్రగిరిపై సీతా సమేతంగా వామాంక స్థితుడై ఉండటం అదే భద్రాచల పుణ్య క్షేత్రంగా ప్రసిద్ధ మవటం మనకు తెలిసిందే. రత్నాకరుడు విష్ణువు కోసం తపస్సు చేసి ప్రత్యక్షమవగానే తనకొండ రత్నగిరిపై శాశ్వతంగా ఉండిపొమ్మనటంతో శ్రీ సత్యనారాయణ స్వామిగా ఉండిపోవటం వలన ఇది అన్నవరం క్షేత్రంగా ప్రసిద్ధమైంది. ఈ విధంగా సోదరులిద్దరూ విష్ణు అనుగ్రహ పాత్రులై ఆయననే తమ గిరులపై వెలసేట్లు చేసుకొన్న పుణ్యమూర్తులు. రత్నాచలమే అన్నవరం. రత్నాచల్ ఎక్స్‌ప్రెస్ అందువలననే ఆ పేరుతో వచ్చింది.

## స్వామి ఆవిర్భావం

తూర్పు గోదావరిజిల్లా పిఠాపురం దగ్గర "గోరస" అనే గ్రామానికి ప్రభువు శ్రీ రాజా ఇనగంటి వేంకట రామాయణిం బహదూర్. దీనికి దగ్గరలో అరికంపూడి వద్ద "అన్నవరం" గ్రామం ఉంది. అన్నవరంలో శ్రీ ఈరంకి ప్రకాశంరావు అనే బ్రాహ్మణుడు చాలా నిష్ఠగా వేదం వేదాంగాలు నేర్చి మహా భక్తుడుగా ప్రసిద్ధి చెందాడు. రాజుగారికి ప్రీతి పాత్రుడు కూడా. ఒక రోజు రాత్రి కలలో ఈ ఇద్దరికీ విష్ణుమూర్తి కనిపించి తానూ వచ్చే ఖర నామ సంవత్సర శ్రావణమాసం శుక్ల విదియ మఖా నక్షత్రంలో ఉన్న గురువారంనాడు రత్నగిరిపై వెలుస్తాననని, తనను తెచ్చి అన్నవరం కొండపై ప్రతిష్ట చేసి గుడి కట్టించమని చెప్పాడు.

మర్నాడు ఈ ఇద్దరు కలుసుకొని తమకు వచ్చిన కల గురించి చెప్పుకొని ఆశ్చర్యపోయి ఖర నామ సంవత్సర శ్రావణ శుద్ధ పాడ్యమి నాటికే అన్నవరం చేరి స్వామి కోసం వెదికారు. అక్కడ ఒక "అంకుడు చెట్టు" (కృష్ణ కుటజము)– "Nerium Anty dysentirium" కింద సూర్యకిరణాలు పడగా పొదలను తొలగించి చూస్తే సత్యనారాయణ స్వామి విగ్రహం లభించింది. దీన్ని రత్నాచలంపైకి తీసుకు వెళ్లారు. కాశీ నుంచి ప్రత్యేకంగా తెప్పించిన "శ్రీ మత్రిపాద్విభూతి మహా వైకుంఠ నారాయణ యంత్రం "విష్ణు పంచాయతన పూర్వంగా తెప్పించి 1891 ఆగస్టు 6న ప్రతిష్టించారు.

## ఆలయ నిర్మాణం –ప్రత్యేకతలు

శ్రీ అనంత లక్ష్మీ సత్యదేవీ సమేత శ్రీ వీర వెంకట సత్యనారాయణ స్వామి ఆలయాన్ని 1934లో నిర్మించారు. పంచాయతనం ఉండటం వలన, దానికి ప్రతీకగా

ముందు గణపతి, శంకరుని చిహ్నాలు, శూల శిఖరాళలతో రెండు చిన్న విమాన, గోపురాలు, మధ్యగా ప్రధాన విమాన గోపురం, వెనక ఆదిత్య దేవత, అంబికా దేవి ప్రతీకలైన శ్రీ చక్రాలున్న మరో రెండు విమాన గోపురాలతో ఆలయాన్ని కట్టారు. ఒకే చోట ఇంతమంది దేవతలు కొలువై ఉండటం ఒక ప్రత్యేకత. గిరిపై శ్రీ కోదండ రామాలయం, వనదుర్గాలయం కింద గ్రామదేవత ఆలయాలు కూడా ఉన్నాయి.

శ్రీ సత్యనారాయణస్వామి త్రిముర్త్యా త్మక విష్ణు స్వరూపుడు. అందుకే "మూలతో బ్రహ్మ రూపాయ, మధ్యతశ్చ మహేశ్వరం –ఆదతో విష్ణు రూపాయ త్రైక్య రూపాయతే నమః" అని భక్తితో అర్చిస్తారు.

## ఆలయ ప్రత్యేకతలు

ఈ ఆలయం రుద్రాకృతిలో ఉండటం ఒక ప్రత్యేకత. ఆలయ నైరుతిభాగంలో సూర్యుడు, ఆగ్నేయంలో గణపతి, వాయవ్యంలో అంబికా, ఈశాన్యంలో ఈశ్వరుడు, మధ్యలో ప్రత్యేక యంత్ర వేదికపై లింగాకారంలో బిందు స్థానంలో పంచాయతన స్వామిగా సత్యదేవుడు ప్రతిష్ఠితమై ఉన్నాడు. ఆలయం రెండు అంతస్తులతో ఉండటం మరో విశేషం. పై అంతస్తులో దివ్య మంగళ విగ్రహ స్వరూపుడుగా శ్రీ అనంత లక్ష్మీ సత్యదేవీ సమేత శ్రీ వీర వెంకట సత్యనారాయణమూర్తి విరాజిల్లుతూ దివ్య దర్శనమిస్తాడు. ఈ రెండిటి మధ్య పానవట్టంలాంటి నిర్మాణం ఉండటం వింతలలో వింత. దీనిలో బీజాక్షర సంపుటి ఉన్న యంత్రం ఉండటం వింతలకే వింత.

క్రింద ఉన్న వృత్తాకార శిలాయంత్రం బ్రహ్మ స్వరూపం, మధ్యలో శివ స్వరూపం, పై విగ్రహం శ్రీమన్నారాయణమూర్తి అవటం అత్యంత విశేషం. సత్యదేవుడిని "త్రిపాద్విభూత మహా నాయకుడు" అంటారు. అమ్మవారు అనంత లక్ష్మీ సత్యదేవి"

ఈ ఆలయంలో నిత్యం సామూహిక సత్యనారాయణ వ్రతాలు జరుగుతాయి. ఇక్కడి సత్యనారాయణ స్వామి ప్రసాదం మహా రుచికరమే కాదు, అత్యంత పవిత్రం కూడా".

ఈ మొత్తాన్ని నేను ఈ రోజు వ్రతంలో 5 కథలు అయ్యాక 6వ కథ చెబుతాను అని ఊరించి సరదాగా విశేషంగా ఈ కథ చెప్పి సస్పెన్స్‌కు తెరదించాను.

పవన్ ఇంట్లో వ్రతం అయ్యాక పవన్ రాధా దంపతులు మా దంపతులకు నూతన వస్త్రాలు "ఘనమైన తాంబూలం"తో అందజేసి ఆశీసులు అందుకొన్నారు. రాంకీ, ఉషా దంపతులు పవన్ సాయి పద్మజా దంపతులు "యధాశక్తి తాంబూలాలు" ఇచ్చి ఆశీస్సులు పొందారు .

తర్వాత భోజనాలు. పప్పు వంకాయ కూర బీన్స్ కూర, దోసావకాయ, చట్నీ, పునుగులు, పరవాన్నం పులిహోర, మామిడిపండు ముక్కలతో సుష్టైన భోజనం చేసాం.

నా బోటి "పీఠాధిపతులం" కుర్చీలలో కూర్చుని భోజనం చేస్తే మిగిలిన వారందరూ కింద కూర్చుని పవన్ స్పెషాలిటీ అయినఅరటి ఆకులలో చక్కగా ఆంధ్ర బ్రాహ్మణ లోగిళ్ళలో చేసే విధానంలో భుజించి తెలుగు విందు భోజన వైభవాన్ని ఇక్కడ ప్రదర్శించి కనువిందు చేశారు.

ఈ రోజు రాంకీ పుట్టిన రోజు అవటంతో కేకు తెప్పించి పవన్ రాంకీతో కోయించి జన్మదిన శుభాకాంక్షలు అందరి చేత ఇప్పించి బర్త్ డే పాటలు పిల్లలతో పాడించి శోభ తెచ్చాడు. పవన్ కూతురు పెద్దమనిషి అయినప్పుడు బంతి భోజనాలనాడు రాంకీ భార్య ఉష పుట్టినరోజు నాడూ పవన్ ఇదే మాదిరిగా ఏర్పాటు చేసిన విషయం గుర్తు చేసుకున్నాం. నేను రాంకీ ఉషా దంపతులను "షార్లెట్ వసిష్ఠ అరుంధతులు" అని పవన్ రాధ దంపతులను "షార్లెట్ అత్రి అనసూయ దంపతులు" అని, పవన్ సాయి పద్మజ దంపతులను "షార్లెట్ ఋష్యశృంగ శాంత దంపతులు" అని చమత్కరించా. చమత్కరించటం కాదు నిజంగానే వాళ్ళు అలా సన్మార్గంలో ప్రవర్తిస్తారు. ఇదంతా అయ్యేసరికి సాయంత్రం 5.45 అయింది. వెంటనే అందరికీ కాఫీలిచ్చారు. శ్రీ రఘు సుచిత్ర దంపతుల ఇంట్లో కిందటి శనివారం రుద్రాభిషేకం నాడు రుద్రం బాగా చెప్పిందని నేను మెచ్చిన శ్రీమతి కాకాని లక్ష్మికి ఆనాడు వాగ్దానం చేసిన రూ 1,116 రూపాయలు సరసభారతి పుస్తకాలు ఉన్న పాకెట్ ఇచ్చి శ్రీ రవీంద్ర గారి ద్వారా అందజేయించమని పవన్‌కు ఇచ్చాను. తర్వాత మేమిద్దరం మా అమ్మాయి విజ్జి, పిల్లలు ముగ్గురం కారులో సాయంత్రం 6కు కారీ బయల్దేరాం.

## కారీలో ఇరవై మూడున్నర గంటలు

2-9-17 శనివారం సాయంత్రం 6 గంటలకు కారులో కారీకి బయల్దేరి రాత్రి 9 గంటలకు మా అన్నయ్యగారి మనవడు చి॥ వేలూరి హరికిషన్ సారిక దంపతుల ఇంటికి చేరాం. మేమిద్దరం ఏమీ తినలేదు. పిల్లలు ఇడ్లీలు తిన్నారు. మజ్జిగ తాగి పడుకున్నాం. ఎల్లాప్రగడ రామమోహనరావుగారికి ఇక్కడికి వచ్చినట్లు ఫోన్ చేసి చెప్పి, రేపు మధ్యాహ్నం భోజనం వారింట్లోనే నని చెప్పాను సంతోషించారు. 5 నెలల నుంచీ వేసుకొన్న ప్లాన్ ఇది ఇవాళ కుదిరింది.

3-9-17 ఆదివారం- ఉదయమే లేచి కాలకృత్యాలు తర్వాత సంధ్యపూజ కానిచ్చి టిఫిన్ చేసి చి॥ సౌ॥ సారికకు ఒడిలో మా శ్రీమతి చలవ చలిమిడి పెట్టి, రెండో పిల్లాడితో ముద్ద కుడుములు ఇప్పించి వేడుక చేసింది. సారిక తల్లిగారు కూడా ఇక్కడే ఉన్నారు. పెద్ద పిల్లాడు చి॥ దర్శి మంచి మాటగాడు, కలుపుకోలు తనం ఉన్నవాడు. చనువుగా దగ్గరకొచ్చాడు. చిన్నవాడికి మూడు నెలలు. అచ్చం వాళ్ళ నాయనమ్మ అంటే మా అన్నగారి అమ్మాయి వేదవల్లిలాగా ఉన్నాడు. ఈ వేడుక తర్వాత మా ఇద్దర్నీ

6 మైళ్ళ దూరంలో ఉన్న ఎల్లాప్రగడ వారి చెల్లెలు బావగారు హార్ట్ డాక్టర్ల దంపతులు నందిగామకు చెందిన శ్రీ బండారు రాధాకృష్ణ మూర్తి శ్రీమతి సులోచన దంపతుల ఇంటికి మధ్యాహ్నం 12 గంటలకు తీసుకు వెళ్లి దింపింది. అక్కడే ఎల్లాప్రగడ వారు వాళ్ళమ్మాయి శ్రీలక్ష్మి ఉన్నారు. మమ్మల్ని అందరూ ఆత్మీయంగా ఆహ్వానించారు. ఒక గంట సేపు సరదాగా మాట్లాడుకొంటూ శ్రీ మైనేని గోపాలకృష్ణ గారితో ఫోన్‌లో సంభాషిస్తూ కాలక్షేపం చేసాం. మైనేనిగారి ఈ సమావేశానికి రూపకర్త సంధానకర్త. మధ్యాహ్నం ఒంటిగంటకు భోజనాలు చేసాం. భోజనంలో పప్పు, చిక్కుడుకాయ కూర పూరీలు బంగాళా దుంపకూర. ఎల్లాప్రగడ స్వయంగా చేసిన గుంటూరు గోంగూర పచ్చడి, పండు మిరపకాయ పచ్చడి, అల్లం పచ్చడి, గులాబీ జామ్, గారెలు రావుగారి స్పెషల్ ఘుమ ఘుమల సాంబారు, రెండు రకాల అప్పడాలు, ఊరు మిరపకాయలు, పెరుగు, మామిడి పండు ముక్కలతో కమ్మటి తెలుగు భోజనం చేసాం. కొసరి కొసరి అన్నా చెల్లెలు వడ్డించి మరీ మరీ తినిపించారు. తర్వాత రావుగారు మా అందరికి స్వహస్తాలతో కస్తూరి జాజికాయ జాపత్రి, ఏలక్కాయ, లవంగం త్రివేణీ వక్కపొడితో కట్టిన కమ్మని కిళ్లీ తిన్నాం. నేను రెండు తిన్నా. చాలా బాగున్నాయి ఆయన టెస్ట్‌కు జేజేలు. రావు గారు సరాదా మనిషి. గుంటూరు జిల్లా రేపల్లె దగ్గర వారికి ఒకప్పుడు వేలాది ఎకరాల సుక్షేత్రమైన మాగాణి మామిడితోటలు ఉండేవి. 400 ఆవులు ఉండేవి. తండ్రిగారి హయాం వరకు పాడీ పంటా వ్యవసాయంతో ఉండేది. రావు గారు 18 ఏళ్ళు వ్యవసాయం చేశారు. ట్రాక్టర్‌తో దుక్కి దున్నారు. అన్నదమ్ముల పంపకాలలో అన్నీ అవగా ఇప్పటికీ వీరికి అక్కడ 25 ఎకరాల భూమి ఉంది. ప్రతి వేసవిలో ఇండియా వెళ్లి వ్యవసాయం చూసుకొంటారు. తోటలోని మామిడికాయ, మిర్చి గోంగూర నిమ్మకాయ వగైరాలతో ఊరగాయలు పెట్టిస్తారు. అమెరికా వచ్చి అకౌంటింగ్ ప్రొఫెసర్‌గా స్థిరపడి రెండేళ్లక్రితం రిటైరయ్యారు. ఒక అన్నగారు ఎయిర్ ఇండియా పైలట్ చేశారు. రావుగారు కూడా పైలట్ లైసెన్స్ పొంది హాబీగా విమానాలు నడిపేవారు. మంచి సహృదయులు, స్నేహశీలి మైనేనిగారి క్లాస్‌మేట్. ఏరా అంటే యేరా అనుకొనే చనువున్న వారు.

బండారు డాక్టర్ దంపట్ల హార్ట్ స్పెషలిస్ట్‌లుగా ప్రభుత్వ ఉద్యోగం చేసి రిటైరయి ఇక్కడే ఉంటున్నారు. ఇద్దరిళ్లూ ప్రక్క ప్రక్కనే. మూర్తిగారిది కృష్ణాజిల్లా నందిగామ దగ్గర వేములపల్లి అగ్రహారం. ఒకప్పుడు వీరికీ అమరావతి ప్రభువు ఇనాంగా ఇచ్చిన గ్రామం. మూర్తి గారు రజాకార్లకు వ్యతిరేకంగానూ స్వాతంత్ర సమరంలోనూ పాల్గొని జైలుకెళ్లిన దేశభక్తులు. తర్వాత బూర్గుల రామకృష్ణారావు, కె.ఎల్.రావు గారుల హితవుపై చదువు కొనసాగించి అంచెలంచెలుగా ఎదిగి డాక్టర్. పాసై ఉస్మానియాలో

పని చేసి ఇక్కడికి వచ్చారు. సులోచనగారు రావు గారి చెల్లెలు. మూర్తిగారి మొదటిభార్య చనిపోతే వీరినిచ్చి వివాహం చేశారు. పిల్లలు అమెరికాలోనే ఉన్నారు. మూర్తిగారి సహస్ర చంద్ర మాసోత్సవాన్ని పిల్లలు ఘనంగా ఇక్కడే నిర్వహించారు. అంటే వారికి ఇప్పుడు 85 ఏళ్ళు. భగవద్ ధ్యానం పూజలతో సత్కార్యాలతో కాలక్షేపం చేస్తున్నారు.

రావుగారు తమల పాకు తీగలను కర్వేపాకు చెట్లను బాగా పోషిస్తున్నారు. మూర్తిగారి పెరడులో రుద్రాక్ష చెట్టు ఇద్దరి పెరడులలో బిల్వ వృక్షాలు ఉండటం విశేషం. అనీ త్రిప్పి మాకు చూపించారు. మధ్యాహ్నం 2 గంటలకు మా అమ్మాయి పిల్లలు హరి కుటుంబం వచారు భోజనాలు చేశారు. తర్వాత రావు గారి కిళ్ళీలు ఆరగా ఆరగా తిన్నారు.

సాయంత్రం నేను శ్రీ మంకు శీను గారు రాసిన శ్రీ సువర్చలేశ్వర శతకం ఒక పావుగంటలో చదివి రావు గారి హనుమద్ భక్తికి దోహదం చేశాను. ఆయన హనుమ ఉపాసకులు సద్గురు శివానందమూర్తి గారి సామవేదం షణ్ముఖ శర్మగారి శిష్యులు. డాక్టర్ మూర్తిగారింటికి శ్రీ ప్రతాపరాయకులపతి గారైన శ్రీ కుర్తాళం పీతాధిపతులు వచ్చి మూదు రోజులు అనుగ్రహ భాషణం చేసి ఆశీస్సులందించారు.

నేను రాస్తున్న గీర్వాణ కవుల కవితా గీర్వాణం-3 గ్రంథాన్ని శ్రీ బండారు డాక్టర్ దంపతులకు అంకితమిస్తున్నాం. దీనికి ముద్రణ ఖర్చుకు స్పాన్సర్ శ్రీ ఎల్లాప్రగడ రామమోహనరావు గారు. ఈ విషయాలు ముచ్చటించుకొని సరసభారతి కార్యక్రమాలు తెలియజేశాను. మా దంపతులం డాక్టర్ దంపతులకు నూతన వస్త్రాలు సరసభారతి జ్ఞాపిక, శివానందలహరి శ్రీ సువర్చలాన్జనేయ స్వామి చిన్న ఫోటో బహూకరించాము. మూర్తి దంపతులు మా దంపతులకు నూతన వస్త్రాలతో సత్కరించి "ఘనమైన నగదు తాంబూలం" అందజేశారు. రావు గారికి వారమ్మాయి శ్రీ లక్ష్మికి నూతన వస్త్రాలు మేము అందజేశాము. సరస భారతి జ్ఞాపిక, సువర్చలా మారుతి శతకం, సువర్చలేశ్వర శతకం, శ్రీ హనుమత్ కథానిధి శ్రీ ఆంజనేయ మహాత్మ్యం, శివానంద లహరి చిన్న శ్రీ సువర్చలాన్జనేయ స్వామి ఫోటో కానుకగా అందజేశాము. రావు గారు మా దంపతులకు నూతనవస్త్రాలు తాము తమ కూతురు కలిసి అందించారు. చాలా ఆత్మీయంగా మానసికానందంగా ఈ కార్యక్రమం జరిగింది. రావు గారు పెంచిన మొక్కలు మా వాళ్లకు ఆప్యాయంగా ఇచ్చారు. అందరి వద్దా సెలవు తీసుకొని బయల్దేరాం.

దారిలో బాలాజీ దేవాలయం, శివాలయం దర్శించి మా అల్లుడి మేనత్తగారు శ్రీమతి లక్ష్మి, భర్త శ్రీ చీమలకొండ దుర్గాప్రసాద్ రావు దంపతుల ఇంటికి వెళ్లి చూసి పావు గంట ఉండి, మా హరి ఇంటికి వెళ్లి అక్కడ వాళ్ళు చేసిన పూరీలలో ఒక్కటి మాత్రమే నేను తిని ఐస్ క్రీమ్ లాగించి మజ్జిగ తాగి, అందరి టిఫిన్లు అయ్యాక వాళ్ళు

మాకు బట్టలు పెట్టి ఆశీర్వాదం తీసుకొన్న తర్వాత రాత్రి 8.30లకు కారులో షార్లెట్ బయల్దేరాం. అంటే కారీలో మేమున్నది కేవలం 23న్నర గంటలు మాత్రమే. అయినా సత్కాల క్షేపం. ఇదంతా మా మైనేని గారి మహాత్మ్యమే.

రాత్రి సరిగ్గా 11 గంటలకు షార్లెట్‌లో మా ఇంటికి చేరాం. రాగానే రావుగారికి ఫోన్ చేసి చెప్పి మైనేనిగారికి మా అబ్బాయి రమణకు మెయిల్ రాశాను.

డా. మాదిరాజు రామలింగేశ్వరరావుగారు మచిలీపట్నం నుండి మెయిల్ రాస్తూ అందులో తమ బంధువు ఒకరు ఒక భక్తి మాస పత్రిక నడుపుతున్నారని అందులో నేను రాసిన "సిద్ధ యోగిపుంగవు"లను సీరియల్‌గా ప్రచురించాలని భావిస్తున్నారని అనుమతిస్తే అక్టోబర్ సంచిక నుంచి అవి ధారావాహికంగా ప్రచురిస్తారని చెప్పారు. సంతోషంగా అంగీకరిస్తున్నానని జవాబు రాయగా వెంటనే వారు ధన్యవాదాలు తెలియజేశారు.

మరొక ముఖ్య విషయం కేంద్ర మంత్రి వర్గ పునర్వ్యవస్తీకరణలో శ్రీ పరకాల ప్రభాకర్ భార్య కేంద్ర మంత్రి శ్రీమతి నిర్మలా సీతారామన్ గారిని రక్షణ మంత్రిగా ప్రధాని మోడీ నియమించటం ఊహించని పరిణామమే కాదు, సమర్ధతకు పట్టాభిషేకం. 70 ఏళ్ళ స్వాతంత్ర ఆనంతర భారత దేశంలో మొట్టమొదటి సారిగా మహిళకు డిఫెన్స్ పదవి ఇవ్వటం అపూర్వమైన గర్వించదగ్గ విషయం. నిర్మల గారు తెలుగు, తమిళ రాష్ట్రాల కోడలు కూతురు. ఈ పదవిలో సమర్ధత చూపి రాణించాలని అభినందిస్తున్నాను.

ఈ వీక్లీ ఇంతటితో సమాప్తం

(4-9-17 -కాంప్ -షార్లెట్-అమెరికా)

## వీక్లీ అమెరికా-24 (4-9-17 నుండి 10-9-17 వరకు)

## పిక్నిక్, ఫెస్టివల్ ఆఫ్ ఇండియా వారం

4-9-17 సోమవారం- వేసవి సెలవుల తర్వాత మా అమ్మాయి మళ్ళీ ఇంట్లో ఆగస్టు 27 ఆదివారం నుండి తెలుగు క్లాసులు ప్రారంభించింది. మా అల్లుడు 28 ఆగస్టు ఇండియాకు కాకినాడలో భాద్రపద శుద్ధ ద్వాదశి నాడు ఆయన తండ్రిగారి ఆబ్దీకం పెట్టటానికి బయల్దేరి వెళ్ళాడు. తర్వాత తిరుపతి, తిరువన్నామలై సందర్శించి 15వ తేదీకి తిరిగి షార్లెట్ చేరతాడు.

5-9-17 మంగళవారం ఉపాధ్యాయ దినోత్సవంనాడు మా కోట గురువరేణ్యుల గురుపూజోత్సవాన్ని ఉయ్యూరులో నిర్వహించటం గురుపుత్రులు శ్రీ కోట సీతారామాంజనేయులుగారు వారి కజిన్ శ్రీ కోట సీతారామ శాస్త్రిగారూ హాజరవడం పేద ప్రతిభగల విద్యార్థులకు శ్రీ మైనేని గారు గురు భక్తితో ఏర్పాటు చేసిన రెండు 10

వేల రూపాయల నగదు బహుమతులను, గురు పుత్రులు తాము ఏర్పరచిన తమ తలిదండ్రుల స్మారక నగదు బహుమతి 10 వేల రూపాయలు, శ్రీ వేమూరి సదాశివ తమతల్లి గారు కీ.శే. శ్రీమతి దుర్గ గారి జ్ఞాపకార్థం అందజేసిన 5 వేల రూపాయలు అర్హులకు అందజేయించి ఉపాధ్యాయ దినోత్సవ సందర్భంగా 10 మంది ఉపాధ్యాయులకు సన్మానం చేసిన సంగతి మీకు తెలిసిన, తెలిపిన విషయమే.

ఇవాళ శ్రీ అనంత పద్మనాభ చతుర్దశి సందర్భంగా శ్రీ రాంకీ భార్య శ్రీమతి ఉష ఇంటి వద్ద నోము నోచుకోని, అట్లు వాయనం తెచ్చి మా శ్రీమతికి ఇచ్చి చీరె జాకెట్ "ఘనమైన నగదు తాంబూలం" ఇచ్చి నాకూ బట్టలు పెట్టి ఆశీర్వాదం పొంది వెళ్ళింది. ఇక్కడున్నా సంప్రదాయాన్ని ఆమె అంత శ్రద్ధగా పాటిస్తోంది. అభినందనలు. పట్టుబట్టను "కాశా బోసి"గా మన ఇళ్ల వద్ద పెద్ద ముత్తైదువులు కట్టుకొనే తీరులో కట్టుకొని ముఖాన పెద్ద కుంకుమ బొట్టు తలలో పూలు చేతులనిండా గాజులు, చేతులకు గోరింటాకుతో వాయనం ఇవ్వటం చూస్తే సాక్షాత్తు అమ్మవారిని చూసినట్లు అనిపించింది మా ఇద్దరికీ. మనసులో ఎంతో అభినందించాము శ్రీమతి ఉషను .

బుధవారం– విహంగ మహిళా వెబ్ మాసపత్రిక సెప్టెంబర్ సంచికకు వ్యాసం రాసి పంపాను. రాత్రి మా మనవడు చి॥ సంకల్ప్ చికాగో నుంచి ఫోన్ చేసి కొత్తకారు కొన్నానని మంచి రోజు చెబితే ఇంటికి తెచ్చుకొంటానని అంటే గురువారం బాగుందని చెప్పాను.

గురువారం– ఫ్లోరిడాలో ఇర్మా తుఫాను భీభత్సం సృష్టించింది. ప్రజలను ఖాళీ చేయిస్తున్నారు. దానితో పెట్రోల్ డీజల్ ధరలు పెరిగాయి. బంకుల వద్ద కార్ల క్యూలు అంతులేకుండా ఉంది. భయంతో అవసరమైన వస్తువులను కొని దాచుకొంటున్నారు.

శుక్రవారం– మౌంట్ సోమా నుండి అక్కడి శివాలయ పురోహితులు శ్రీ ప్రసాదావధాని గారి భార్య శ్రీమతి అనసూయ గారు ఫోన్ చేసి "బాబాయ్ గారూ! మీరు షార్లెట్ వచ్చి 5 నెలలు దాటింది ఒక్కసారి కూడా మౌంట్ సోమాకు రాలేదు. మావారు "గబ్బిట వారు ఇంతవరకూ రాలేదే" అని అంటున్నారు. వీలు చూసుకొని తప్పకరండి అన్నారు. సరే అన్నా.

కిందటి శనివారం శ్రీ రఘు గారింట్లో రుద్రాభిషేకం నాడు రుద్రం బాగా చదివింది అని నేను మెచ్చుకొని బహుమతి పంపిన శ్రీమతి కాకాని లక్ష్మి ఫోన్ చేసి "త్వరలో ఇంటికి వచ్చి కలుస్తాను" అన్నది. సంతోషం అన్నాను.

## సాయి సెంటర్ వారి పిక్నిక్

ఇక్కడి సాయి సెంటర్ వాళ్ళు అందరికి మంచి లొకేషన్‌లో పిక్నిక్ ను 9-9-17 శనివారం మధ్యాహ్నం నుంచి ఏర్పాటు చేశారు. అందరం ఉదయం 11.45కు బయల్దేరి రమణ కోచింగ్ సెంటర్ నుంచిమా మనవడు శ్రీకేత్‌ను పికప్ చేసుకొని వాడిని డౌన్ టౌన్‌లో ఉన్న ఫెస్టివల్ ఆఫ్ ఇండియా వద్ద దింపి పిక్నిక్కు చేరేసరికి మధ్యాహ్నం ఒంటి గంట అయింది. అప్పుడే అందరూ భోజనాలు ప్రారంభించ బోతున్నారు. పులిహోర, రవ్వలడ్డు, పెరుగన్నం, అరటి, ద్రాక్ష, పళ్ళు, చిప్స్, పళ్ల ముక్కలుతో భోజనం.

తర్వాత పిల్లలకు సర్టిఫికెట్స్ ఇచ్చారు. తర్వాత పిల్లలకు ఆటలపోటీలు, పెద్దలకు నడక. నేనూ పవన్ కలిసి కాసేపు తిరిగాం. అతనిని అంపైర్‌గా పెట్టుకొని పిల్లలు క్రికెట్ ఆడారు. మా మనవడు చి॥ పీయూష్ టీమ్ 30 పరుగులు చేసి గెలిచింది. మావాడు అందులో 18 పరుగులు చేసి మాన్ ఆఫ్ ది మ్యాచ్ అయ్యాడు. మెచ్చిన నేను వాడికి ఇంటివద్ద 10 డాలర్లు బహుమానంగా ఇచ్చాను. పురాతత్వ సంస్థలో పని చేసిన మా రెండవ బావగారి చెల్లెలు శాంతగారబ్బాయి రాంబాబు చిరివాడ వెళ్లాడని, అక్కడ వేలూరాయన చేసిన విగ్రహాలు పాడుపడి ఉంటే, చూడలేక హైదరాబాద్‌లో తన ఇంటికి తీసుకు వెళ్లి భద్రపరచాడని పవన్ చెప్పాడు. ఈయన అన్నగారు శ్రీ వేలూరి రాధాకృష్ణ ప్రపంచ ప్రసిద్ధ చిత్రకారులు. భోపాల్‌లో ఉండేవారు. మా కాలిఫోర్నియా మేనల్లుడు శాస్త్రికి ఈ విషయం రాసి ఆ శిల్పి చరిత్ర తెలుసుకొంటే ఆయన గురించి ఒక ఆర్టికల్ రాస్తానని చెప్పా. వెంటనే స్పందించి ఆ ప్రయత్నంలో ఉంటానని సమాధానమిచ్చాడు. సాయంత్రం అందరికి టీ ఏర్పాటు చేశారు. ఇక్కడి ఐటెమ్స్ సాయి భక్తులు ఇళ్లవద్ద తయారు చేసి తెచ్చినవే. ఎవరి వద్దా డబ్బు తీసుకోవటం ఈ సెంటర్‌కు అలవాటు లేదు. అందరూ వాలంటీర్‌గా సేవలు అందించటమే.

వనవిహారం నుండి సాయంత్రం 4కు బయల్దేరి రాంకీ తమ్ముడు పవన్ భార్య శ్రీమతి పద్మజ వద్ద మా మనవాళ్ళు అశుతోష్, పీయూష్‌లు సంగీతం క్లాస్‌కు తీసుకొచ్చాము. పవన్ మాటల సందర్భంగా మోపిదేవి శ్రీ సకలేశ్వర స్వామి ఆలయం వారి అడుసుమిల్లి వంశం వారిదేనని చెప్పాడు. అతను తీసిన శిలా ఫలకం ఫోటో నాకు పంపాడు. ఇంటికి వచ్చేసరికి రాత్రి 7 అయింది. ఉయ్యూరులో మా గురు పుత్రుడు నా సహాధ్యాయి వేమూరి దుర్గయ్య అన్న కామేశ్వరరావు కుమార్తె శ్రీమతి లక్ష్మి మా అమ్మాయికి మంచి స్నేహితురాలు. వాళ్లబ్బాయిని తండ్రి శ్రీమోహన్ పిక్నిక్ వద్ద దింపి మాకు అప్పగించి వెళ్ళాడు. రాత్రి 8కి వచ్చి కాసేపు కబుర్లు మాట్లాడి కుర్రాడిని తీసుకు వెళ్ళాడు.

## భారత మహోత్సవం

షార్లెట్‌లో నిన్నా ఇవాళ ఫెస్టివల్ ఆఫ్ ఇండియా–భారత మహోత్సవం జరిగింది. ఒక సంతలాగా తిరునాళ్ళు లాగా జరుగుతుంది. అయిదేళ్ల క్రితం చూసాం. అప్పుడు మా బావమరిది పెయింటింగ్‌లు ప్రదర్శనకు పెట్టాం. నేనూ మా అమ్మాయి మా అమ్మాయి స్నేహితురాలు నాగలక్ష్మి భర్త కలిసి. అంతా చూసి బాగున్నాయని మెచ్చినవారేకాని ఒక్కరూ కొనే సాహసం చేయలేదు. "శ్రమ మెప్పు ఫుల్ ఆదాయం మాత్రం నిల్".

10వ తేదీ ఆదివారం మధ్యాహ్నం 3 గంటలకు అందరం బయల్దేరి ఈ సంతకు వెళ్లాం మనిషికి 7 డాలర్లు టికెట్. పదేళ్ల లోపు పిల్లలకు ఫ్రీ. అక్కడే ఉన్న బెల్క్ థియేటర్‌లో నృత్య ప్రదర్శనలు నాన్‌స్టాప్‌గా జరుగుతాయి భారత దేశంలోని అన్ని రకాల నృత్య రీతులను పిల్లలు, పెద్దలు ఇక్కడ ఉత్సాహంగా ప్రదర్శించారు. ఒకరకంగా సాంస్కృతిక భారతదేశ దర్శనం చూడగలుగుతాం–మినీ ఇండియా చూసిన అనుభూతి ఉంటుంది. బయట మాత్రం గుడారాలకింద బడ్డీకొట్లు లాంటి హోటళ్లు అన్నిరకాల చిరు తిళ్ళు, ఇడ్లీ, దోసె, పునుగు, గారే, బజ్జీ, పూరీ, చపాతి సహా అన్నీ అక్కడికక్కడే తయారు చేస్తారు. జనం ఆబగా కొని ఇదివరకు ఎప్పుడూ ఎక్కడా తినలేదేమో అన్నంతగా తినటం ఆశ్చర్యమేస్తుంది. ఈ బయటి "కొట్లు" సంతలాగా తిరునాళ్ల లాగా అనిపిస్తుంది. అనేక రకాల చీరెలు చుడీదార్లు డ్రెస్ మెటీరియల్స్, నగలు కూడా అమ్ముతారు.

ఆరుబయట కూడా ఒక వేదిక ఉంటుంది. దానిపైనా ఉదయ సాయంకాలాలలో మధ్యాహ్నం కూడా రాజస్థానీ మరాఠీ, పంజాబీ, గుజరాతీ నృత్యాలు పెద్దలూ పిన్నలు చక్కగా చేస్తారు. థియేటర్‌లో జనం ఎప్పుడూ నిండుగా ఉంటారు. పవన్ పెద్ద కూతురు, థియేటర్‌లో డాన్స్ బృందంతో డాన్స్ చేస్తే రాంకీ తమ్ముడి కూతురు బయట డాన్స్ చేసింది. పెద్దలకు ఇదొక పెద్ద పండగ. పిల్లల్ని హుషారుగా తీసుకు వెళ్ళటం తరిఫీదు ఇప్పించటం, చేయించటం, పిల్లలు అంత ఉత్సాహంగా డ్రెస్‌తో చేయటం గొప్ప విషయం. వాళ్ళ ఎనర్జీ ప్రవాహానికి హేట్స్ ఆఫ్ అనిపిస్తుంది. దీనికి భారత ప్రధాని రాజీవ్ గాంధీ గొప్ప ప్రోత్సాహమిచ్చాడు. శ్రీమతి పుపుల్ జయకర్ ఆయనకు సలహాదారుగా ఉంటూ అన్నిదేశాలలో ఫెస్టివల్ ఆఫ్ ఇండియా ఘనంగా జరగటానికి బాగా తోడ్పడింది.

ఈ రోజు ఉదయం దర్శనీయ శివాలయాలులో 72వ ఆలయంగా మోపిదేవి "శ్రీ గంగా పార్వతీ సమేత స్వయంభుశ్రీ సకలేశ్వర దేవస్థానం" గురించి రాశాను.

మా పెద్ద తోడల్లుడు శ్రీ శంభుని శ్రీ రామచంద్రమూర్తిగారి పెద్దబ్బాయి

ఫ్లొరిడాలో ఉద్యోగం చేస్తున్న రవి భార్య, పిల్లాడితో ఫ్లొరిడానుండి మూడు రోజుల క్రితం అట్లాంటా వచ్చి, ఇవాళ మౌంట్ సోమా వెళ్లి స్వామిని దర్శించి రాత్రి 7 గంటలకు మా అమ్మాయి వాళ్ళ ఇంటికి వచ్చాడు. ఈ వీక్లీ ఇంతటితో సమాప్తం.

(10-9-17-కాంప్-షార్లెట్-అమెరికా)

**వీక్లీ అమెరికా-25** (11-9-17 నుండి-17-9-17) వరకు

## ఇర్మా తుఫాన్ ఉయ్యూరు పెన్షన్ స్కామ్ వారం

11-9-17 సోమవారం- ఇర్మా హరికేన్ క్యూబా, ఫ్లొరిడాలో విలయం సృష్టించి జనాలకు నిలువ నీడ లేకుండా చేసింది. దీనివలన పెట్రోల్‌తో సహా నిత్యావసర వస్తువుల ధరలు పెరిగిపోయాయి. షార్లెట్ స్కూళ్లు మామూలుగానే పని చేశాయి. నిన్నరాత్రి ఫ్లోరిడా నుంచి మా తోడల్లుడు మూర్తిగారి మనవడు రవి, భార్య శారదా, కొడుకు అద్రీశ్‌లు వచ్చారు. సోమవారం సాయంత్రం ఇక్కడే ఉన్న రవి డాక్టర్ ఫ్రెండ్ భార్య శ్రావ్య దంపతుల ఇంటికి వెళ్లి వచ్చారు. అప్పటికి వర్షం భీభత్సంగా ఉంది. రవి ఫోన్‌తో మేమూమూర్తి గారి దంపతులతో మాట్లాడాం. రవి కొడుకు చాలా ముచ్చటగా, కలుపు కోలుగా నన్ను తాతగారు అని మా శ్రీమతిని అమ్మమ్మా అని, శారద కూడా నన్ను తాతయ్య అంటూ ఆమెను అమ్మమ్మా అంటూ చాలా సరదాగా ఉన్నారు. గీర్వాణం -3 కవుల కేటగిరి ప్రారంభించాను.

12-9-17 మంగళవారం- ఇక్కడ స్కూళ్లు ఇవాళ రెండు గంటలు ఆలస్యంగా మొదలయ్యాయి. రమణ ఫోన్ చేసి ఉయ్యూరులో మా ఇంట్లో అద్దెకుంటున్న మాస్టారు కుటుంబం అంతా 15 రోజుల రామేశ్వరం మొదలైన తీర్థ యాత్రకు వెళ్లినట్లు చెప్పాడు. “బడ్డీ బుడ్డి”కి ఆపరేషన్ అయి ఇంటికి వచ్చాడట. కాల విభజనలో తల మునకలుగా ఉన్నాను. పవన్‌కు వాగ్దానం చేసినట్లు 2012లో రాసిన వేలూరి వారి డిప్రెషన్ చెంబు కథ నెట్‌లో మళ్ళీ అందరికోసం పెట్టాను. మంచి రెస్పాన్స్ వచ్చింది.

శ్రీ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్ అవధాని గారు హూస్టన్‌లో శ్రీ వంగూరి చిట్టెన్ రాజు గారింట ఆతిధ్యంలో ఉన్నానని, తోటలో గోంగూర బాగుందని కవిత్వం రాశారు. నేనూ తగిన సమాధానం ఇస్తూ అమెరికాలో హూస్టన్‌లో తొలి తెలుగు సంస్థ ఏర్పాటు చేసిన వారిలో చిట్టెం రాజు, శ్రీ వావిలాల కృష్ణ ముఖ్యులని కృష్ణ గారిభార్య శ్రీమతి లక్ష్మి గారు ఉయ్యూరులోని మా అప్పన్నకొండ మామయ్య కూతురేనని, 2002లో మొదటిసారి మేము అమెరికా హూస్టన్‌కు వచ్చినప్పుడు వారితో బాగా కాలక్షేపం చేశామని, కృష్ణగారు రాజమండ్రి కవిత్రయంలో ఒకరైన వావిలాల వాసుదేవ శాస్త్రి గారి మనవడని తెలియజేశాను.

రవి ఫోన్ చేస్తుంటే వాళ్ళమ్మా నాన్న సూర్యం స్వర్ణ దంపతులతో మాట్లాడాం. నా "ముఖ బుక్"ను స్వర్ణ బాగా ఫాలో అవుతున్నానని చెప్పింది. ఇదో "తుత్తి".

శ్రీమతి మల్లికాంబ గారికి ఫోన్ చేస్తే తాను బెజవాడలో ఉన్నానని 15 రోజులుగా జ్వరంతో బాధ పడుతున్నానని, ఎస్పీ బాలు పెద్ద చెల్లెలు శ్రీమతి గిరిజ మరణించారని ఆ షాక్‌తో అందరం ఉన్నామని చెప్పారు.

బుధవారం– రవి వాళ్ళు తెల్లవారుజామున 5 గంటలకే ఫ్లోరిడాబయల్దేరి మధ్యాహ్నం 3కు చేరారు. వాళ్ళతో ఉన్న ఈ రెండు రోజుల్లో వాళ్ళతో ఫోటోలు తీసుకోలేక పోయాం. వెళ్ళాక గుర్తొచ్చింది. పిల్లాడు చాలా సరదాగాగా గడిపాడు. "కేరీ"లో హరికోడుకు "దర్శి"లాగా మంచి మాటకారి.

గురువారం– రమణ ఫోన్ చేసి ఉయ్యూరు పెన్షనర్ అసోసియేషన్ అధ్యక్షుడు రంగ రామానుజం సుమారు 5 కోట్ల ప్రభుత్వ డబ్బుకుకు పంగనామం పెట్టాడని, తన భార్య చెల్లెలు కూతురు వగైరా 11 మందికి, వాళ్ళు ఏ రకమైన ఉద్యోగం చేయక పోయినా సర్వీస్ రిజిష్టర్లు సృష్టించి రిటైరుమెంట్ ఇప్పించి అన్నిరకాల పెన్షన్ సదుపాయాలూ వాళ్లకు కట్టబెట్టించి, ప్రభుత్వ ఖజానాకు పెద్ద బొక్క పెట్టాడు. దీనిలో ఆయా స్కూళ్ల హెడ్ మాస్టర్లు, ఎం.యి.ఓ.లు, మండల అధ్యక్షులు, ట్రెజరీ సిబ్బంది, బాంక్ ఆఫీసర్లు, విద్యాశాఖాధికారి మొదలైన వారిని ఎలా మాయం చేశాడో ఎలా సాంక్షన్ చేయించాడో ఆశ్చర్యం. జూనియర్ ఎం.టి .ఆర్ సినిమాలో "అదుర్స్"లో బ్రహ్మానందం డబ్బును రమాప్రభాదులు "నాకేశారు" అన్నట్లు జుర్రేశాడు. అసలు ఈ మిస్టరీని బయట పెట్టిందెవరో, ఎలా తీగ లాగితే డొంకంతా కదిలిందో తమాషాగా ఉంది. పేపర్లలో ఈ వార్తలు బాగా వచ్చాయి. నాకూ పేపర్ కటింగ్‌లు రావటంతో కొంత తెలిసింది. అమెరికాలో "ఇర్మా" జనాన్ని నాకేస్తే ఉయ్యూరులో రంగ రామానుజం "స్కామ్ ఇర్మాతో" సర్వం నాకేశాడనిపిస్తుంది.

రాత్రి "గొట్టం"లో "సంసారంలో సంగీతం" చంద్రమోహన్ విజయశాంతి సినిమా చూసాం. సరదాగా ఉంది. "సరదా చిత్రాల రేలంగి" దర్శకుడు.

గురువారం– గీర్వాణం–3 కవులను 18వ శతాబ్ది వరకు యుగ విభజన చేసి శర్మకు పంపాను. రేలంగి నరసింహారావు డైరెక్ట్ చేసిన రాజేంద్ర, యమున నటించిన "బ్రహ్మచారి మొగుడు" ఇదివరకు చాలాసార్లు చూసినా మళ్ళీ చూశా. రాఘవులు సంగీతం చాలా బాగుంది. అందులో నా నోట్లో ఎప్పుడూ నానే ఇష్టమైన పాట "ముత్యాల ముగ్గేయరే –ముగ్గుల్లో".

15–9–17 శుక్రవారం– ఈ శరన్నవరాత్రులలో మా అమ్మాయి గారింట్లో భగవదనుగ్రహంతో 21–9–17 గురువారం, 25–9–17 సోమవారం రుద్రాభిషేకం

22-9-17 శుక్రవారం నుండి 30-9-17 శనివారం వరకు నా 57వ (షార్లెట్‌లో 3వ) శ్రీ సుందరకాండ పారాయణ చేయాలని అనుకొంటున్నాను.

డా. శ్రీ ఎల్లాప్రగడ రామ మోహనరావు గారు కేరీ నుంచి ఫోన్ చేసి నేను వారికి పోస్ట్‌లో పంపిన 5 పుస్తకాలు అందాయని చెప్పారు. గీర్వాణం-3ని 19 శతాబ్దం వరకు కాలక్రమంలో కవులను పెట్టాను.

రాత్రి "నలుపు -తెలుపు" మాయాబజార్ సినిమా ట్యూబ్‌లో చూశాను. ఎన్నిసార్లు చూసినా ఆ పరవశం తగ్గదు. ఇంత గొప్ప సినిమా లేదేమోననిపిస్తుంది. కలర్‌లో చూడటం ప్రారంభించి నచ్చక బ్లాక్ అండ్ వైట్‌కి షిఫ్టయ్యాను. అల్లుడు రాత్రికి ఇండియా నుంచి వచ్చాడు.

16-9-17 శనివారం- రాత్రి 8.30కు "Sears"కు వెళ్లి మనవరాళ్లకు ఫాషన్ ఇయర్ రింగ్స్ కొన్నాం.

17-9-17 ఆదివారం- గీర్వాణం-3లో 20వ శతాబ్ది 21 శతాబ్ది కవులను తయారు చేసి శర్మకు పంపి ఆప్రకారం కవులను వరుసలో పెట్టి ఫైల్ తయారు చేయమని చెప్పాను. ఇవాళ మా అమ్మాయి తెలుగు క్లాస్ జరిపింది.

## తెలుగు తరగతి

వేసవి సెలవుల ముందు తర్వాత ఇక్కడ మా ఇంట్లో తెలుగు తరగతులు జరిగినా, నేను ఫోటో తీయటం తప్ప, క్లాస్ ఎలా జరుగుతోందో చూడలేదు. వినటం మాత్రం వింటున్నాను. దాన్ని బట్టి నాకు అర్ధమైంది ఏమిటి అంటే, ఇక్కడి తెలుగు తలిదండ్రులు తమ పిల్లలు తెలుగు మర్చిపోకుండా ఉండటానికి చాలా శ్రమ పడుతున్నారు. వాళ్ళే టీచర్స్‌గా పేరెంట్స్‌గా ఉంటూ సహకరిస్తున్నారు. తెలుగు ఉచ్చారణ, సంభాషణ కోసం చాలా తాపత్రయ పడుతున్నారు. వీళ్లందరినీ మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను. ఇది ఒక రకంగా పేరెంట్స్ తెలుగు మర్చిపోకుండా చేయుటానికి బాగా ఉపయోగపడుతోందని నా విశ్వాసం. పిల్లలు కూడా చాలా హుషారుగా ఉత్సాహంగా నేర్వటానికి వచ్చి నేర్చి అభివృద్ధి పొందుతున్నారు. ఆ చిన్నారులకు మనస్ఫూర్తి ఆశీస్సులు. ఈ జాగృతి ఇలానే నిలబడాలి. మనం తెలుగు వారమైనందుకు గర్వపడేట్లు చేయాలి. తెలుగు సంస్కృతి ని కూడా పండుగలద్వారా జరిపించి వారిలో పండగల పరమార్ధం ఏమిటో తెలియజెప్పాలి. అన్ని పండగలు కాకపోయినా సంక్రాంతి ఉగాది సామూహికంగా సాయంత్రాలలో నిర్వహిస్తే బాగుంటుంది. కృష్ణరాయల పద్యం "తెలుగదేల యన్న దేశంబు తెలుగు -ఏను తెనుగు వల్లభుండ తెలుగొ కండ -యెల్ల నృపులు కొలువ యెరుగవే బాసాడి -దేశ భాష లందు తెలుగు లెస్స" అందరికి నోటికి వచ్చేట్లు నేర్పాలి. అందరితో అనిపిస్తే అదే వచ్చేస్తుంది కష్ట పడక్కరలేదు.

ఇదికాక మరో ముఖ్య విషయం- పిల్లలు తెలుగు క్లాస్‌లో తెలుగులోనే మాట్లాడటం హర్షించదగిన విషయమే. కానీ మనం మరచిపోతున్న తెలుగు బంధుత్వాలను ఇక్కడ వారికి పరిచయం చేయాలి. పెద్ద వాళ్ళను అంకుల్ ఆంటీ అనకుండా బాబాయ్ పిన్నీ మామయ్యా, అత్తయ్య అని పిలవమని చెప్పాలి. ఆడపిల్లలు తమ తోటి ఆడపిల్లలను అక్కా, చెల్లీ అని, మగ పిల్లలను అన్నా, తమ్ముడు అని ముసలివారిని తాతగారు, బామ్మగారు అమ్మమ్మ గారూ పిలిపిస్తే తెలుగుదనం ఉట్టిపడుతుంది. ఇండియాలో స్కూళ్లలో ఆడ పిల్లలు మగ పిల్లలు అన్నా అక్కా అని చక్కగా పిలుచుకొంటారు. వినటానికి ఎంతో మధురంగా ఉంటుంది. ఆ సంస్కృతి ఇక్కడి తెలుగు తరగతులలో కూడా ప్రతిబింబించాలి. అమెరికా తెలుగుపిల్లలను చూసి ఇండియాలోని తెలుగు పిల్లలు గర్వ పడాలి. వీటికి ఇక్కడి తెలుగు తరగతుల ఉపాధ్యాయ ఉపాధ్యాయినులు వీరిపైన ఉండి పర్య వేక్షించేవారూ తగిన విధంగా సహకరించి స్పందించాలి. ఇవన్నీ బయట ఉండి నాబోటి వాళ్ళు చెప్పటం బాగానే ఉంటుంది. ఒడ్డున నిలబడి రాయి విసరటం తేలికే. కానీ దీనిలోని సాధక బాధకాలు బోధించేవారికి తలిదండ్రులకు మాత్రమే తెలుస్తుంది అని నేను నమ్ముతున్నాను.

చివరగా మా ఇంట్లో తెలుగు క్లాసులలో మా అమ్మాయి, టీచర్లు, పేరెంట్స్ పడే శ్రమ చూడలేదు కాని వింటున్నాను. పిల్లలు కొందరు "సుందరకాండ" సినిమాలో వెంకీ క్లాస్‌మేట్, విద్యార్థి అయిన బ్రహ్మానందంలాగా నవ్విస్తున్నారు. సరదా పుట్టిస్తున్నారు. వాళ్ళ వచ్చి రాని తెలుగుతో వినోదమూ కలిగిస్తున్నారు. బోల్డు హాస్యం సృష్టిస్తున్నారు. ఇవన్నీ ఉంటేనే క్లాస్ సరదాగా ఉంటుంది. "కీప్ ఇట్ అప్ తెలుగు విద్యార్థులూ ఉపాధ్యాయులూ తలిదండ్రులూ".

ఈ వీక్లీ ఇంతటితో సమాప్తం.

(17-9-17-కాంప్-షార్లెట్-అమెరికా)

## **వీక్లీ అమెరికా-26** (18-9-17 నుండి 24-9-17 వరకు)-1

## **57వ సుందరకాండ, 3 రుద్రాభిషేకాలు 4 భోజనాల వారం-1**

18-9-17 మా శ్రీమతి ప్రభావతి 72వ పుట్టిన రోజు. మా అమ్మాయి కొత్త చీర జాకెట్ కొని పెట్టింది. మా అమ్మాయి అల్లుడులకు, మనవలు ముగ్గురికి దసరా కానుకగా నగదు ఇచ్చి కావలసినవి కొనుక్కోమన్నాం. ఆధునిక ప్రపంచ నిర్మాతలు డిటిపి చేసి ప్రకాష్ గారు పంపిన 151-200 పేజీలలో తప్పులు దిద్ది వెంటనే పంపేశాను.

మంగళవారం-.రమణ ఫోన్ చేసి ప్రక్కనున్న మల్లికాంబగారబ్బాయి మోహన్‌తో కూడా మాట్లాడించాడు.

21-9-17 గురువారం- శరన్నవరాత్రులు దసరా ప్రారంభం. ఉదయం మామూలు పూజతోబాటు మహాన్యాసంతో దశశాంతి సామ్రాజ్య పట్టాభిషేకంలతో రుద్రాభిషేకం శివ అష్టోత్తర శతనామ, బిల్వాష్టోత్తరంతో పూజ చేశాను. మైనేనిగారు సూచించిన దానిప్రకారం గీర్వాణం-3 అంకితం స్పాన్సర్ ఆర్టికల్స్ రాసి మా శర్మకు పంపి మొత్తం ఫైల్ తయారు చేయమని రాశాను.

## 50 ఏళ్ళ క్రిందటి శిష్యురాలి పరిచయం

గురువారం సాయంత్రం డా. ఫణిమోహన్, డా. శ్రావ్య దంపతుల ఇంట్లో నవరాత్రి సందర్భంగా శ్రీ లలితా సహస్రనామ స్తోత్ర పారాయణకు మమ్మల్ని ఆహ్వానించగా సాయంత్రం 6 గం.లకు, డా. ఫణిమోహన్ గారు మమ్మల్నిద్దర్నీ కారులో వాళ్ళ ఇంటికి తీసుకు వెళ్లారు. ఫణిగారిది ఖమ్మం. మా పెద్ద తోడల్లుడు మూర్తిగారి పెద్దబ్బాయి రవికి అక్కడ క్లాస్‌మేట్. వాడు ఇక్కడికొచ్చినప్పుడు తప్పక వీళ్ళింటికి వెడతాడు. వారం క్రితం వచ్చినప్పుడు రవి దంపతులు వెళ్లి చూసొచ్చారు. రాత్రి 7 గం.లకు డా. శ్రావ్యగారి స్నేహితురాండ్రు అయిదు కుటుంబాలవారు వచ్చి ముందుగా పాటలుపాడి తర్వాత పారాయణ చేశారు. మళ్ళీ కొన్ని కీర్తనలు పాడారు. నేను 10 నిమిషాలు లలితా నామ విశిష్టతపై మాట్లాడాను. మాటల సందర్భంగా అమ్మవారి "లావణ్యం" గురించి చెబుతూ లవణం అంటే ఉప్పు అనీ అది స్పటికంగా ఉన్నప్పటి మెరుపును లావణ్యం అంటారనీ చెప్పాను. ఇంతలో పాటలు పాడిన అమ్మాయి నా పేరు లావణ్య అన్నది. పైన నాలాగే "పీఠాధిపతి" అంటే కింద కూర్చోలేక కుర్చీలో కూర్చున్నావిడ "మా అమ్మాయే నండీ" అన్నది. అప్పుడు ఎవరు ఏమిటి ఎక్కడి వారు అనే ప్రశ్నోపనిషత్ ప్రారంభమై ఆతల్లి కృష్ణాజిల్లా పెదప్రోలు ఆవిడని పసుమర్తి వారి ఆడబడుచని, కూచిభోట్ల వారి కోడలని విషయం బయట పడింది. అప్పుడు నేను 1963లో మోపిదేవి హైస్కూల్‌లో నా ఉద్యోగం ప్రారంభించి 65 వరకు పని చేశానని పెదప్రోలులో కాపురం ఉండేవాడినని అనగానే ఆవిడ "మాస్టారూ! మీరు సైన్స్ మాస్టర్ దుర్గాప్రసాద్ గారేనా?" అని ఆశ్చర్యంగా అడిగితే ఔనన్నాను. అప్పుడు అక్కడి పసుమర్తి సీతారామశర్మగారు సోషల్ మాష్టారని నన్ను, లెక్కల మేస్టర్ స్వర్గీయ జె.వి.రమణారావు గారిని శర్మగారింట్లో "నెలరోజులు పెళ్లి కొడుకులను మేపినట్లు మేపారని" అనగానే, ఆవిడ "మేష్టారు! నేను పసుమర్తి లక్ష్మిని. అందరూ పి.లక్ష్మి అని పిల్చేవారు. మీ దగ్గర ట్యూషన్ కూడా చదివాను. శర్మగారి చెల్లెలు దుర్గతోపాటు లాంతర్లు తీసుకొని రాత్రి ట్యూషన్‌కు వచ్చేవాళ్ళం" అని పాత జ్ఞాపకాల తేగల పాదు తవ్వింది. కావలసినన్ని కబుర్ల రుచికరం విషయాల తేగలన్నీ బయట పడ్డాయి. నాకు లెక్కల మేష్టారికీ వీపులు రుద్ది తలంట్లు పోశామని తానూ నా సైకిల్ వెనక ఎక్కి పెదప్రోలు నుంచి మోపిదేవి స్కూల్‌కు వచ్చేదాన్నని,

లెక్కలమాస్టారి బైక్ మీద దుర్గ ఎక్కి వచ్చేదని గుర్తు చేసింది. ఎందుకో నాకు లక్ష్మి అసలు జ్ఞాపకం రాలేదు. పెదప్రోలులో శర్మగారి బాబాయి గారమ్మాయట. ఈమె సుబ్రహ్మణ్యం చెల్లెలట. సుబ్రహ్మణ్యమూ జ్ఞాపకం రాలేదు. శర్మగారి తమ్ముడు భగవంతం మోపిదేవి పూజారి కొడుకు సుబ్బయ్య, లొల్లా వారు కరణంగారు సాయి నళినీ జయంత్ మండవ వెంకటేశ్వరరావు అనే మార్క్సిస్టు పార్టీ నాయకుడి కూతురు, అడివి శ్రీరామమూర్తి కృత్తివెంటి మాధవ అందరూ గుర్తున్నారు. ఈ లక్ష్మి మాత్రం గుర్తులో లేనే లేదు. మాధవ తమ్ముడు శ్రీనివాస్ ఇప్పుడు కేంద్ర సాహిత్య అకాడెమీ సెక్రెటరీ అని జ్ఞాపకం చేసుకున్నాం. అప్పుడు లక్ష్మి 6, 7 తరగతులు చదివి ఉంటుంది. మా క్లాసులు 8, 9, 10 తరగతుల బోధన. అందుకే గుర్తులేకపోయి ఉండచ్చు. సాధారణంగా నాకు నాదగ్గర చదివిన పిల్లలెవరైనా గుర్తే వుంటారు. ఒకవేళ మర్చిపోయినా వాళ్ళు జ్ఞాపకం చేస్తే వెంటనే "బల్బు వెలుగుతుంది". లక్ష్మి విషయంలో ఎన్నిసార్లు స్విచ్ వేసినా బల్బ్ వెలగలేదు. ఆ అమ్మాయికి అన్నీ జ్ఞాపకం ఉన్నాయి. నాకే లేవు. ఇది తమాషా.

ఇది అవగానే అక్కడ భోజనం ఏర్పాటు. ఆవడ, గారే పులిహోర, రవ్వకేసరి, వంకాయ కూర, ఆలూ ఫ్రయ్, అల్లం చట్నీ దోసావకాయ, పాయసం, ముక్కలపులుసు, అప్పడం, పెరుగుతో చాలా కమ్మటి భోజనం కడుపు నిండా తిన్నాను. ముక్కలపులుసు అదరహో అంత బాగుంది. శ్రావ్యగారు కొసరి కొసరి వడ్డించి తినిపించారు. తర్వాత మళ్ళీ పాట కచేరి. శ్రీమతి పద్మజ ఆమె ఆడ బడుచు, లావణ్య, శ్రావ్య అమ్మవారిపై చక్కగా శ్రావ్యంగా పాటలు పాడారు. అందరం గ్రూపు ఫోటోలు తీసుకొన్నాం. నేను ఒక ఫోల్డర్ "పసుమర్తి లక్ష్మి" అని పెట్టి తీసిన ఫోటోలన్నీ అందులో పెట్టాను. శ్రావ్య గారింట్లోనే మొదటిసారి వాళ్ళ అమ్మ నాన్నల షష్ఠి పూర్తికి వెళ్ళినప్పుడు శ్రావ్య అమ్మమ్మ గారు పరిచయమైనారు. ఆమె మా గురువుగారు స్వర్గీయ మహంకాళి సుబ్బరామయ్య గారి తమ్ముడి భార్య. ఆ ఉదంతం అంతా ఇదివరకే వీక్లీలో కుక్కేశాను. ఆ ఉత్సవంలో లక్ష్మీ పిల్లా జిల్లా వచ్చారట. కానీ అప్పుడు పరిచయం కాలేదు. ఆడో తమాషా.

శుక్రవారం– ఈ రోజు నుంచి విజయదశమి వరకు 57వ షార్లెట్‌లో 3వ శ్రీ సుందరకాండ 9 రోజుల పారాయణ ప్రారంభించాను. "కర్ణాటక సంగీత పితామహ పురందరదాసు" ఆర్టికల్ రాశా.

ఉదయం పారాయణ తర్వాత చల్లపల్లి–పెదప్రోలు మధ్య ఉన్న కప్తాను పాలెంలో ఉంటున్న నా 52 ఏళ్ళ పూర్వపు శిష్యుడు అడవి శ్రీరామమూర్తికి ఫోన్ చేసి పసుమర్తి లక్ష్మి పరిచయమైన సంగతి చెప్పా. వాడు చాలా సంతోషించాను వాళ్ళమ్మగారితోనూ మాట్లాడా. ఆవిడ నాకు కొన్ని నెలలు అన్నం వండి పెట్టారు. వాళ్ళింటికే వెళ్లి రెండు పూట్లా తినేవాడిని. ఆ మహా తల్లిని నేను జీవితాంతం మరువ లేను. వాళ్ళు వండిపెట్టిన

దానికి నేను వాళ్ళకేమైనా ధనరూపంలో ఇచ్చిన దానికీ సరిపోల్చలేను. సిగ్గుతో నేనే తలవంచు కోవాలేమో. అంతటి ఉన్నత హృదయం ఆమెదీ భర్త గారిదీ. కొడుకుకు గురువు నేను గనకనే భక్తితో చేసిన సేవ ఎంత నేను వారికిచ్చినా ఆకుటుంబం ఋణం తీర్చుకోలేను. శ్రీరామమూర్తి తరచూ కనిపిస్తూనే ఉంటాడు. ఉయ్యూరుకు సరసభారతి కార్యక్రమాలకూ వస్తూనే ఉంటాడు. మాధవ తండ్రి చనిపోగానే బొంబాయి వెళ్లి ఉద్యోగం చేస్తూ తమ్ముళ్లను చెల్లెళ్లను పెంచి పోషిస్తూ తల్లిని ఆప్యాయంగా చూశాడు. వాడూ ఒకటి రెండుసార్లు ఉయ్యూరు వచ్చాడు. మాధవ తమ్ముడే ఇప్పుడు అకాడెమి సెక్రెటరీ. ఒక తెలుగువాడు పొందిన అత్యున్నత గౌరవం అది. అందునా నా శిష్యుడి తమ్ముడవటం అతని చిన్నతనం నాకు తెలియటం ఈ పదవిలో ఉంటూ తెలుగు రచయితల సభలో ఆతను పాల్గొనటం కిందటి సారి అంటే 2012లో మేము అమెరికాలో ఇక్కడే ఉండగా ఆతను ఉయ్యూరు మాకోసం రావటం, మా అబ్బాయి రమణ అతనికి ఆత్మీయ ఆతిధ్యం ఇచ్చి సరసభారతి పుస్తకాలు అందజేయటం వరుసగా గుర్తుకొచ్చాయి. ఎక్కడ తీగో లాగితే ఎక్కడి డొంకో కదిలింది. తీపి గుర్తుల పరిమళాలను వెదజల్లింది.

## నేను చేయించిన 4వ రుద్రం

23-9-17 శనివారం- కిందటి నెల శ్రీ రఘు గారింట్లో రుద్రం చేయించినప్పుడే శ్రీమతి రంజని "అంకుల్! మీ రుండగానే మా ఇంట్లో రుద్రం మీతో చేయించుకోవాలని ఉంది తప్పకుండా చేయించాలి" అని అడిగిందిసరే అన్నా. శనివారం మధ్యాహ్నం 3.30కి మా అమ్మాయి మా ఇద్దర్నీ శ్రీ నాగరాజు శ్రీమతి రంజని దంపతుల ఇంటికి తీసుకెళ్లి దింపింది. అప్పటికే వాళ్ళు అంతా రెడీగా ఉన్నారు. సాయిరాం సాయిరాం అంటూ అందరూ ఆహ్వానించారు. నాలుగున్నరకు ప్రారంభించి గణపతిపూజ రుద్రవాహన అష్టోత్తర సహస్రనామ లలితా అష్టోత్తర పూజ చేయించాను. రుద్రం చదివేవారు రాగానే లఘున్యాసంతో రుద్రం 5.30కి ప్రారంభించి ఏకాదశ రుద్రాభిషేకం సామూహికంగా చేయటం జరిగింది. రుద్రుడు ఎవరు అనే విషయంపై నేను కాసేపు మాట్లాడాను. తర్వాత అక్కడ ఒకమ్మాయి పుస్తకం చూడకుండా రుద్రం జమాజెట్టీలాగా మాతోపాటు చదువుతుంటే ఆశ్చర్యంపోయి ముచ్చటపడి ఆమెకు సరసభారతి తరపున రఘుగారింట్లో కాకాని లక్ష్మికి ఇచ్చినట్లే 1,116 రూపాయలు సరసభారతి పుస్తకం ఇవ్వాలనిపించి మా అమ్మాయికి ఫోన్ చేసి డబ్బూ పుస్తకం తెమ్మని చెబితే తెచ్చింది. రుద్రం అవగానే శ్రీ కందుల రవీంద్ర గారిని ఆమె పేరు అడిగితే ఆమె కాకాని లక్ష్మి అని చెప్పారు. అవాక్కయ్యాను. అప్పుడామె చీర కట్టుకొని పెనుగంచిప్రోలు తిరుపతమ్మ తల్లిలాగా కనిపించింది. ఇప్పుడు చిన్న పిల్లలాగా డ్రెస్‌లో ఉంది. నేను అసలు గుర్తుపట్ట లేకపోయాను. కనుక నేను ఇవ్వాలనుకున్న దాన్ని ఇంత కష్టపడి ఆడవారికి

## షార్లెట్ సాహితీ మైత్రీ బంధం

మగవారికి అత్యంత శ్రద్ధతో రుద్రం నేర్పుతున్న శ్రీ కందుల రవీంద్ర గారికే ఇవ్వాలనుకొని ఆమాట చెప్పగానే అందరూ హర్షధ్వానాలతో హాలు మారు మ్రోగించారు. ఒక సర్వ సమర్థుడికి ఇస్తున్నామన్న సంతృప్తి కలిగి వెయ్యిన్నూట పదహారు రూపాయలు శ్రీ సువర్చలేశ్వర శతకం అందజేశాను. చాలా వినమ్రంగా ఆయన అందుకున్నారు. ఇదే కార్యక్రమం మొదట్లో నాగరాజుగారికి "మహిళా మాణిక్యాలు, రవీంద్ర గారికి "సిద్ధ యోగి పుంగవులు" పుస్తకాలు అందజేశాను. మాకు కాకాని లక్ష్మి స్వీట్ పాకేట్ ఇచ్చి తాము డిసెంబర్‌లో ఇండియా వస్తామని అప్పుడు ఉయ్యూరు వచ్చి శ్రీ సువర్చలేశ్వర స్వామిని తప్పకుండా దర్శించుకొంటామని చెప్పింది. తర్వాత భోజనాలు– పూర్ణం, బూరెలు, పులిహోర, పూరీలు కాప్సికం కూర, చానామసాలా చట్నీ, పులుసు, పెరుగు వంటకాలు. నేను రెండు పూరీలు, పులిహోరలో పెరుగు కలుపుకొని అయిందనిపించాను. ఈ కార్యక్రమానికి మా శిష్యురాలు పసుమర్తి లక్ష్మి కూడా వచ్చింది. రెండోసారి చూశాను. ఆమెతో "మీ అమ్మాయికి మోపిదేవి సకలేశ్వరస్వామి గురించి మిగిలిన ఆర్టికల్స్ గురువారం శుక్రవారం మెయిల్‌లో పంపాను చూశావా" అని అడిగితే బంధువుల రాకతో చూడలేదని చెప్పింది. డా. ఫణి గారికీ పంపాను అప్పుడే. నేను రుద్రునిపై చెప్పిన విషయాలు చాలా బాగున్నాయని శ్రీ చక్రవర్తి గారు నా దగ్గరకొచ్చి తెలుగులోనే అభినందించారు. భార్య నిండుగా నవ్వుతూ రెండు చేతులతో నమస్కరించారు అభినందనగా. రుద్రం బాగా చేయించానని అందరూ వచ్చి అభినందించారు. నేను సభాముఖంగానే "నేను ఇందులో ప్రొఫెషనల్ కాదు. ఎవరి వద్దా నేను నేర్చుకోలేదు. నాది శ్రుత పాండిత్యం. పుస్తకాలు చదివి నేర్చుకొన్నది మాత్రమే. నాకు గురువులెవరూ లేరు. నేను మా ఇంటి దగ్గర ఎలా చేసుకొంటానో మా జిల్లాలో మా శివాలయంలో ఎలా చేస్తారో అలా చేయిస్తున్నాను ఇక్కడ" అని చెప్పాను. నాగరాజు దంపతులు చాలా ఆనందం పొంది దక్షిణ తాంబూలం ఇచ్చి ఆశీస్సులు మా ఇద్దరి వద్దా పొందారు.

### రుద్రుడు ఎవరు?

2012లో 5 ఏళ్ళ క్రితం మేము షార్లెట్ వచ్చినప్పుడు ఇక్కడ అంతా "సత్యసాయి హవా" బాగా ఉండేది. దాదాపు ప్రతివారం ఎవరింట్లోనో ఒకరింట్లో భజన భోజనాలు చాలా వైభవంగా జరిగేవి. ఇప్పుడు సాయిని తిరగేస్తే వచ్చే "ఈశ" అంటే రుద్రాభిషేకం హోరు బాగా ఉన్నది దానితోపాటు వేద మంత్రం తరంగాలు షార్లెట్‌ను పవిత్రీకరించటం ఆహ్వానింపదగిన విషయం. ఇలాగే కొనసాగాలని కోరుతున్నాను. రుద్రం నేర్పేవాళ్ళు నేర్చుకొనే వారూ క్షుద్రమైన ఆలోచనలకు దూరంగా ఉండాలి. అప్పుడే భద్రత కలిగి అభద్రత తొలగిపోతుంది. నిర్ణిద్ర స్థితి కలుగుతుంది. రుద్రుడు ఘోర రూపంలో నూ అఘోర రూపంలోనూ ఉంటాడు.

దేవతలే ఒకసారి రుద్రుని దర్శించి "కో భవానీతి?" అంటే "నువ్వు ఎవరవు?" అని అడిగితే రుద్రుడు "నేను నిత్య అనిత్య, పరబ్రహ్మను తూర్పు పడమర, ఉత్తరం దక్షిణం, ఆకాశం, పాతాళం, ఉపదిశలూ నేనే. నేనే బ్రహ్మాండం. నేనే స్త్రీ నేనే పురుషుడను. నేనే సావిత్రి, గాయత్రి, సరస్వతి, నేనే త్రిష్టుప్, అనుష్టుప్, జగతీ మొదలైన ఛందస్సులు నేనే. గార్హపత్య, దక్షిణాగ్ని ఆహవనీయఅగ్ని నేనే. సత్యాన్ని నేను. జ్యేష్ఠుడిని, శ్రేష్ఠుడిని, వరిష్ఠుడను నేనే. నేనే జలం, అగ్నీ కూడా. రుక్, యజుస్ సామ అధర్వ వేదాలు నేనే. నాశనం కానీ సత్యాన్ని, నాశనమయ్యే సృష్టి కూడా నేనే. గూఢత్వ గోపనీయమూ నేనే. అరణ్యాలు పుష్కారాలూ నేనే. పవిత్రమైనది అంతానేనే. సృష్టికి మూలం మధ్యా అంతమూ నేనే. ఉన్నదీ నేనే, లేనిదీ నేనే. నేనే స్వయం ప్రకాశకుడిని. సర్వత్రా వ్యాపించి ఉండేది నేనే అని చెప్పాడు. కనుక ఒక్కమాటలో చెప్పాలంటే సర్వం శర్వుడే అంటే రుద్రుడే.

మహర్షులు దేవతలను "రుద్రుడు ఎలా ఉంటాడు?" అని ప్రశ్నిస్తే వాళ్ళు "ఎవని శిరసు ఉత్తరాన, పాదాలు దక్షిణాన నిలిచి ఉంటాయో, ఎవరు ప్రణవం అయిన ఓం కార స్వరూపుడో, సర్వం వ్యాపించినవాడో, ఎవరు అంతమో, ఏది తారేమో, ఏది సూక్ష్మమో ఏది వైద్యుతమో, ఏది శుక్లమో అదే పరబ్రహ్మ అదే ఏకం అదే ఏక రుద్రం. ఆయనే ఈశానుడు. భగవానుడు, మహేశ్వరుడు, మహాదేవుడు ఆయనే రుద్రుడు" అని తెలియ జెప్పారు. శివలింగం అంటే నిర్గుణ పరబ్రహ్మ స్వరూపం అయినా అగ్ని అగ్ని నుంచి వచ్చేదే విభూతి అదే భస్మం. భస్మం అంటే జ్యోతిర్లింగం. ప్రకాశించే స్వరూపం కలది అని అర్థం. భస్మం 5 రకాలు. శివుడి ముఖాలు అయిదు. సద్యోజాతాహం నుండి విభూతి, వామదేవం నుండి భసిత, అఘోరం నుండి భస్మం, తత్పురుష రూపం నుండి క్షారం, ఈశానం నుంచి రక్ష పుట్టాయి.

## రుద్రుడు ఎలా పుట్టాడు

బ్రహ్మ దేవుడు సృష్టి చేయాలని సంకల్పించి ముందుగా సనకస సనంద మొదలగు ఋషులను సృష్టించి వాళ్ళను సృష్టి చేయమని కోరాడు. దానికి వారు తాము సర్వసంగ పరిత్యాగులమని ముక్కుమూసుకొని తపస్సు చేయటంతప్ప తాము ఏ పనీ చేయలేమని చెప్పేశారు. దీనితో బ్రహ్మకు చిరాకు కోపం వచ్చి నుదుటిమీద చెమట బిందువులేర్పడి అందులో నుంచి ఒక పిల్లాడు పుట్టి ఏడుపు లంకించుకొన్నాడు. రోదనం చేస్తున్న ఆబాలుడికి బ్రహ్మ "రుద్ర" అని పేరు పెట్టారు. రుదం అంటే ఏడుపు అది చేసేవాడు కనుక రుద్రుడు. కాసేపాగి మళ్ళీ ఏడిస్తే భవుడు మళ్ళీ ఏడిస్తే శర్వుడు అంటూ వరుసగా 11 పేర్లు పెట్టాడు. రుద్రుడికి వారే ఏకాదశ రుద్రులు.

"రుత్ దుఃఖం దుఃఖ హేతుహః ద్రావ యత్యేషణః ప్రభుః –రుద్రా ఇత్యుచ్యతే

తస్మాత్ శివమ్ పరమ కారణం"-అంటే దుఃఖాన్నికానీ, దుఃఖ కారణాన్నికానీ రుత్ త్ అంటారు. ఆ రుదం అంటే దుఃఖాన్ని దూరం చేసేవాడు అయిన శివుడిని రుద్రుడు అంటారు అని అర్ధం.

"నమశ్శం భవేచ మయోభవేచ, నమశ్శం కారాయచ, మయస్కరాయచ, నమశ్శవివాయ శివ తరాయచ" అని రుద్రుని పూజిస్తాం-మంగళ స్వరూపుడు సుఖాన్నిచ్చేవాడూ, మోక్ష ప్రదాత భక్తులకు కళ్యాణ కారకుడు అయిన రుద్రునికి నమస్కారం. వేదం నాదంతో ధర్మాన్ని బోధిస్తాడుకనుక "ఈశానస్సర్వ విద్యానాం" అంటారు. "రు త్యాప్రణవ రూపాయా స్వా త్మానం ప్రాపయతీతి వా రుద్రహ్"-ఓంకారంతో జీవులను తనదగ్గరకు చేర్చుకొని వాడు రుద్రుడు. బ్రహ్మ దేవుడికి వేదాన్ని నేర్పినవాడు రుద్రుడే. "రోదనం యత్ దుఃఖం ద్రావయతీతి రుద్రః" -దుఃఖాన్ని నాశనం చేసేవాడు రుద్రుడు. శ్రీకృష్ణుడు ఒక ఏడాది పాశుపతం అనే దీక్ష పొంది రుద్రాధ్యాయాన్ని అధ్యయనం చేసినట్లు కూర్మ పురాణం చెప్పింది. మహాన్యాసం మూడవ న్యాసంలో "రౌద్రీకరణం" జపిస్తే పాపాలు నశిస్తాయి, నాల్గవ న్యాసం "ఆత్మ రక్షా" చదివితే మన ఆత్మ పరమాత్మలో కలుస్తుంది. 5వ న్యాసాంశివ సంకల్పం "పఠిస్తే మోక్షం లభిస్తుంది, దేహం వజ్ర కవచం అవుతుంది, శత్రుబాధ నశిస్తుంది.

శివ అంటే నిత్యమైన ఆనంద సుఖాలనిచ్చేవాడని అర్ధం. అమృత శక్తి అనిభావం ఆయన నిత్య, శుద్ధ అమృత శక్తి ప్రదాత. శివుడు "త్రిపురాసుర సంహారం" చేశాడు. ఆపురాలు ఎక్కడో లేవు. అవి మన శరీరంలో ఉన్న స్థూల సూక్ష్మ కారణం శరీరాలు. వీటిని సంహరించి మోక్షమిస్తాడు. ఈ మూడూ అజ్ఞానానికి చిహ్నాలు. శివుని రెండు కళ్ళు సూర్య చంద్ర లైతే మూడవది అగ్ని అది ఆత్మజ్ఞానాన్నిస్తుంది. జీవులందరూ పశువులే అనీ ఆయన పశుపతి అని ఉపనిషత్ కథనం. శివుడు కపాల దారి. ఎవరి మనస్సులో సర్వకాల సర్వావస్థలలో శివుని ధ్యానిస్తారో, అలాంటి వారి కాపాలాలు మాత్రమే అయన ధరించి కపాల మాలాధారి అవుతాడు. వాళ్ళ అందరి ఆలోచనలో శివుడు మగ్నమై ఉంటాడు. కాలుడు శివుడు ఉజ్జయినిలో మహా కాళేశ్వరాలయం ఉంది బ్రహ్మ రాజా గుణంతో సృష్టి చేస్తే విష్ణువు తమోగుణంతో సృష్టిని కాపాడుతాడు. సత్వ గుణంతో శివుడు లయం చేస్తాడు. "సర్వాన శిరోగ్రీవః సర్వ భూత గృహాశ్రయః -సర్వవ్యాపీ స భగవాన్ -తస్మాసర్వగతః శివః" అందరికంటే గొప్పవాడు, అందరిలో ఉండేవాడూ, అంతటా వ్యాపించి ఉండేవాడు శివుడు అని అర్ధం. "ఆద్యంత రహితం దివ్యం సత్యం జ్ఞాన మనంతం, జ్ఞాన విజ్ఞానదం మహత్" అని శివపురాణం -.శివుడు కాలాగ్ని రుద్రుడే కాదు, జ్ఞానాగ్ని రుద్రుడు కూడా.

కామ దహనం అంటే శివుడు మన్మధుడిని సంహరించటం మాత్రమే కాదు-

మన ఇంద్రియాల ఉన్మాదాన్ని నాశనం చేసుకోవటమే. మనలో జ్ఞానం అనే మూడవ కన్ను తెరుచుకొంటే, కామం నశించి ఇంద్రియ నిగ్రహం కలగటమే కామదహనం అని గ్రహించాలి. శివుని మూడవ కన్ను మన్మధ దహనం చేస్తే మన మనో నేత్రం తెరుచుకొంటే కోర్కెలు బూడిదైపోతాయి. అప్పుడు శివుడూ మనమూ ఒకటే– శివోహం అంటే ఇదే. శివుడు "రసవిరాట్" అందుకే తనలీల కోసం ఎడమ వైపు పార్వతీ దేవితో అర్ధనారీశ్వరుడై కనిపిస్తాడు. శివ పార్వతులు ఆదిదంపతులు. అందుకే కాళిదాస మహాకవి కుమారసంభవ కావ్యంలో మొదటి శ్లోకంలోనే వారిని "వాగర్ధా వివ సంపృక్తౌ వాగర్ధ ప్రతి పత్తయే జగతః పితరం వన్దే పార్వతీ పరమేశ్వరౌ" అని స్తుతించాడు. రసమయ జీవ సృష్టికి ఆదిదంపతులు కారణమయ్యారు "ఏ నద్యోహ్ పృథివీ చాంతరిక్షం చ యే పర్వతాః ప్రదిశో దిశశ్చ –ఏ నేదం జగద్వ్యాప్తం ప్రజానాం తన్మే శివ సంకల్పమస్తు" అని రుద్రంలో చెబుతాం– సర్వజీవ సమాధారణ అనేది శివతత్త్వం అని గ్రహించాలి. శివుని శిరస్సుపై ఉండేది జ్ఞాన గంగ. శివుని ఆయుధం త్రిశూలం–సృష్టి స్థితి లయాలకు అది ప్రతీక ఆయన వాహనం వృషభం అయిన నంది అది ధర్మానికి ప్రతీక. దాని నాలుగు కాళ్ళు –శాంతం దయ, దానం, శౌచాలకు ప్రతీకలు. అదృష్ట, అనాహార్య అగ్రాహ్య, అలక్షణ, అచింత్య, అవ్యప్రదేశశ్యా, ఏకాత్మ ప్రత్యయుసారం, ప్రపంచ ఉపశమనం, శాంతం, శివమ్ అద్వైతం చతుర్ధం ఘన్యంతే –స ఆత్మా స విజ్ఞానం" అని మాండూక్య ఉపనిషత్ వాక్యం ఇంద్రియాలకు కనిపించని, దేనితోనూ సంబంధం లేని, ఏదీ చేయని తెలిసికోలేని, ఊహించటానికి వీలులేని అవాజ్మానస గోచరుడు భావనలో మాత్రమే పొందగలిగేవాడు పరమాత్మ.

(25-9-12- కాంప్-షార్లెట్-అమెరికా)

## 57వ సుందరకాండ, 3 రుద్రాభిషేకాలు 4 భోజనాల వారం-2

24-9-17 ఆదివారం– సాయి పవన్ పద్మశ్రీ దంపతుల ఇంట్లో రుద్రాభిషేకం

శ్రీ కృష్ణాష్టమినాడు మా ఇంట్లో భజన రోజునే సాయితో వీలున్నరోజు ఉదయమే మహాన్యాసంతో దశ శాంతులు సామ్రాజ్య పట్టాభిషేకంతో రుద్రాభిషేకం జరిపి అష్టోత్తర సహస్ర శివపూజ, బిల్వాష్టోత్తరంతో మనం నలుగురైదుగురం ఒకరి ఇంట్లో "మోడల్ రుద్రాభిషేకం" చేసుకొందాం అన్నాను. క్షణం ఆలోచించకుండా "మా ఇంట్లోనే చేద్దాం. అన్నయ్య రాంకీని వేలూరి పవన్‌ను కూడా సంప్రదించి డేట్ ఫిక్స్ చేస్తాను. అసలు నా మనసులో ఉన్న మాట మీరే ముందు చెప్పేశారు" అన్నాడు. సంతోషమేసింది. సుమారు 15 రోజులక్రితం వాళ్ళఇంటికి మా మనవళ్లను సంగీతం క్లాస్‌కు తీసుకు వెళ్ళినప్పుడు అతనే ఈ విషయం మళ్ళీ ప్రస్తావించి తన ఇంట్లోనే 24-9-17 ఆదివారం

ఉదయం 7.30కే ఏర్పాటు చేశానని చెప్పాడు సరే అన్నాను. ఆ తర్వాత మెయిల్‌లో మళ్ళీ తెలియజేస్తాడేమోనని అనుకొన్నా. నేను నవరాత్రి సందర్భం ఉదయం మా ఇంట్లో 21-9-17 గురువారం 25-9-17 సోమవారం మహాన్యాసంతో అభిషేకం 22-9-17 శుక్రవారం నుండి 30-9-17 శనివారం ఉదయం నా 57వ (షార్లెట్ లో 3వ) శ్రీ సుందరకాండ పారాయణ చేస్తున్నట్లు అందరికి తెలియజేశాను. సాయి ఇంట్లో ఉదయం 7.30కి అభిషేకం కనుక ఆ రోజు ఆదివారం నా కార్యక్రమం తెల్లవారుఝామున 4 గంటలకే అనీ ముందే అందులో రాశాను. సాయి నుంచి కన్ఫర్మేషన్ వస్తుందనుకున్నాను. మా అమ్మాయికి మెసేజ్ వచ్చినట్లు చెప్పింది సరే.

అందుకని ఈ ఆదివారం ఉదయం 4 గంటలకే ప్రారంభించాలనుకొని, శనివారం రాత్రి ఇంటికొచ్చేసరికి 11 దాటటం ఫోటోలు పంపటంతో 12 -30 దాకా నిద్ర లేదు. కలత నిద్ర కొంతసేపు పోయా. మూడింటికి అలారం పెట్టుకున్నా. "సుందరానికి తొందరెక్కువ" అన్నట్లు "మాసుందరికి" నిద్రరాక అర్ధరాత్రి 2 గంటలకే లేచి కాఫీ ఏర్పాటు చేసింది. నేనూ 3 గంటలకే లేచి స్నానాదికాలు పూర్తిచేసి 3.30కు కూర్చుని నిత్యపూజ శ్రీ ఆంజనేయ అష్టోత్తర సహస్రనామ పూజ శ్రీ లలితా అష్టోత్తర, దుర్గా సరస్వతీ, గౌరీ గాయత్రీ అన్నపూర్ణా అష్టోత్తరాలతో శ్రీసూక్తంగా నిత్యం చేస్తున్నట్లే చేసి, సుందరకాండ మూడవ రోజు పారాయణ చేసి శతకం చదివి పూర్తి చేసేసరికి ఉదయం 6 అయింది. టాప్‌గా హాయిగా సంతృప్తిగా చేసుకొన్నాను రోజూ ఏదో ఒక ప్రసాదం మా శ్రీమతి చేస్తే నైవేద్యం పెడుతున్నా. ఇవాళ పాలలో అటుకులు నానేసి ఇచ్చింది. రామకోటి రాసి భగవద్గీత చదివి డైరీ రాసి పాలటుకుల నైవేద్యం తిని మందులు వేసుకొని సాయి వాళ్ళ ఇంటికి వెళ్ళటానికి నేను 6.30కే రెడీ అయ్యానన్నమాట. మా రైడర్ అంటే మా అమ్మాయి విజ్జి లేచి కాఫీ తాగేసరికి ఏడున్నర దాటింది. రెండోసారి కాఫీ తాగి ఆ మేము ముగ్గురం కారెక్కేసరికి 7-.53. సాయి వాళ్ళ ఇంటికి 8.15కు చేరాం. అప్పటికే రాంకీ సాయిలు అభిషేకం డ్రెస్‌లో తయారుగా ఉన్నారు ఏర్పాట్లు కూడా పూర్తయ్యాయి. వంటలు కూడా చేస్తున్నారు. మాకు కాఫీ ఇచ్చారు . ప్రభల ప్రభాకర్ గారూ వచ్చే ఉన్నారు. అంతా సరి చేసుకొని పూజ అభిషేకం ప్రారంభించేసరికి ఉదయం 9 అయింది. నేను కూడా కూర్చుని అభిషేకం చేసుకొందామన్న ఉద్దేశ్యంతో వచ్చాను. వాళ్ళు అన్నీ గురుముఖతా నేర్చినవారు. ఇలాంటి అభిషేకాలు వాళ్లకు కొట్టిన పిండి. వారి తండ్రిగారు తాతగారు వీరి సోదరులను ఇందులో తీర్చిదిద్దారు కనుక వాళ్ళ ఆధ్వర్యంలో నేను మనస్ఫూర్తిగా అభిషేకం చేసుకొనే భాగ్యం కలిగింది కదా అని సంబరపడ్డాను. కానీ సాయి బాంబు పేల్చాడు. "మీరే మాతో చేయించాలి. మీ ఆధ్వర్యం లోనే జరగాలని మా కోరిక అన్నాడు. "రోట్లో తలపెట్టి రోకటి పోటుకు

వెరవనట్లు అయిష్టంగానే సరే అన్నాను. అలామొదలైంది ఇక్కడి రుద్రం. అందరం కలిసి మంత్రాలు చదువుతూ గణపతి పూజ ప్రారంభించాం. సాయి పద్మశ్రీ దంపతులు కూర్చుని పూజ చేశారు. పద్మశ్రీ పట్టుబట్ట కాషాయ బోస్‌గా కట్టి సంప్రదాయంగా పెద్ద ముత్తైదువగా వ్యవహరించింది. ప్రభాకర్, వేలూరి పవన్ సాయి వాళ్ళ ఇంటి పక్కనున్న తమిళ దంపతులతో భర్త కూడా అభిషేకంలో కూర్చున్నారు. బులుసు సాంబమూర్తి గారు పద్మజ దంపతులు వచ్చారు. సాయికి బంధువుతో స్నేహితుడా శ్రీమతి విద్యుల్లత భర్త కూడా మాతో పట్టుబట్టలతో కూర్చున్నారు. బులుసువారు "సివిల్ డ్రెస్"లో ఉండటం, పిల్లల డ్రాపింగ్ పికప్ డ్యూటీ ఉండటంతో మాతో కూర్చోలేదు. వాతావరణం చాలా బాగా పవిత్రంగా సెట్ అయింది. సాయి ఇంట్లో అభిషేకానికి కావాల్సిన సామగ్రి అంతా ఉంది. అందరికి రాగి పంచ పాత్ర ఉద్ధరిణె రాగి పాత్రలున్నాయి. అభిషేకం చేయటానికి అనువైనఇత్తడి వేదిక ఉంది. దానిపై శివలింగాలను వాళ్ళు తమ విధానంలో చక్కగా అమర్చాడు సాయి. నా సాలగ్రామాలు ఆంజనేయ విగ్రహం, స్ఫటిక లింగాన్ని కూడా అమర్చాడు. పంచామృతాలతో అభిషేకానికి ఏర్పాట్లు జరిగాయి. ఆవాహన అయ్యాక మహాన్యాసం ప్రారంభించాం. రాంకీ సోదరులు నేనూ, ప్రభాకర్ చదివాము. కనుక మూడు సార్లు చేస్తే 11 ఆవర్తనాలు పూర్తి అవుతాయని మొదటి నమకం. తర్వాత నాలుగు చమక అనువాకాలు, రెండో నమ్మకం. తర్వాత మరో నాలుగు చమక అనువాలాలు మూడో నమకమ్ తర్వాత 3 చమకానువాకాలతో ఏకాదశ రుద్రాభిషేకం. తర్వాత వాళ్ళపద్ధతిలో పంచసూక్తాలు నా పద్ధతిలో దశ శాంతులు సామ్రాజ్య పట్టాభిషేకం, శివాష్టోత్తర సహస్రనామ బిల్వాష్టోత్తర పూజ చేసాం. పుష్పాలంకారం సాయి చాలా ముచ్చటగా చేశాడు. బాగా ఆకర్షణీయంగా ఉంది. అంతా అయ్యేసరికి నాలుగున్నర గంటల సమయం పట్టి మధ్యాహ్నం 1.30 అయింది. ఆరగా ఆరగా "అరకొడుతూ" అంటే కాఫీ తాగుతూ ఉచ్చై శ్వరంతో జరిపాం. ఆ తర్వాత ఉద్వాసన. సాయి దంపతులకు "గీర్వాణ కవుల కవితా గీర్వాణం-1 మొదటిభాగం కానుకగా ఇచ్చాము. తర్వాత భోజనాలు. ఆరవ దంపతుల తండ్రి మద్రాస్‌లో కేటరింగ్ ఎక్స్పర్ట్ పేరు పద్మనాభన్. చెన్నై అన్నా నగర్‌లో ఉంటారట. అడ్రస్ ఇచ్చి వచ్చినప్పుడు తప్పక రమ్మన్నారు. ఆయన, కూతురు ఇక్కడ సాయి వాళ్ళ ఇంట్లో వంట చేశారు. నాకోసం వంకాయ కూర అందరికోసం దొండకాయ కూర, పప్పు, వడ, పులిహోర, కరివేపాకు పులిహోర, అల్లం చట్నీ, సాంబారు, పెరుగన్నంతో భోజనం. నేను ఒకటిన్నర వడ కొద్దిగా పప్పన్నం, పులిహోర, కొంచెం సాంబారన్నం, పులిహోరలో పెరుగుతో లాగించాను. అల్లం చట్నీ బాగా ఉంది. సుమారు 30 మంది దాకా వచ్చారు.

అందరి భోజనాలు అయ్యేసరికి 3 అయింది. సాయి దంపతులు మా ఇద్దరికీ నూతనవస్త్రాలు కట్టబెట్టి దక్షిణ తాంబూలం ఇచ్చి ఆశీర్వాదం పొందారు. అయిదేళ్లక్రితం అంటే 2017లో ఇక్కడికి వచ్చినప్పుడు ఇక్కడినుంచి ఇండియా వెళ్లేముందు రాంకీ ఇంట్లో నాతో సత్యనారాయణ వ్రతం చేయించుకున్నారు. అప్పుడు అతని అత్తగారూ మామగారు కూడా ఉన్నారు. దానికి వాళ్ళందరూ చాలా సంతోషించారు. సాయివాళ్ళు ఇక్కడ అప్పుడు లేరు. 5 ఏళ్ల తర్వాత మళ్ళీ రాంకీ తమ్ముడు సాయి ఇంట్లోనే చివరి కార్యక్రమంగా ఈ రుద్రం. తమాషా అనిపిస్తుంది. ఏమైనా నాలుగున్నర గంటలు వేద మంత్రాలు ఇక్కడ ప్రతిధ్వనించటం మహదానందం. కార్యక్రమాన్ని వీడియో తీసి "గొట్టం"లో పెట్టారు. అందరి దగ్గర వీడ్కోలు తీసుకొని ఇంటికి చేరేసరికి సాయంకాలం 4 అయింది. మంచం మీద కాసేపు అటూ ఇటూ దొర్లా, కానీ నిద్ర పట్టలేదు. ఫోటోలు అందరికి పంపాను.

## ప్రక్కివారింట్లో డిన్నర్

శ్రీ ప్రక్కి రమణ శ్రీమతి అరుణ దంపతుల ఇంట్లో ఈ రోజు రాత్రి భోజనం. మా కుటుంబం పవన్ కుటుంబం పంచాగం ఆయనా, పిల్లలు అతిధులం. సువర్చలేశ్వర శతకం ఆ దంపతులకు ఇచ్చాము. తర్వాత భోజనం. పప్పు, వంకాయ కూర, అల్లం చట్నీ బజ్జీలు, పులిహోర మినపసున్ని ఉండ ఉప్మా, ముక్కల పులుసు, తియ్యని గడ్డ పెరుగు. అన్నీ చాలా రుచికరంగా ఉన్నాయి. ఇష్టంగా ఆనందంగా అన్నీ తిన్నాను. కొసరి కొసరి వడ్డించింది అరుణ. అయిదేళ్లక్రితం రెండుసార్లు శ్రావణ మాసంలో మమ్మల్ని అరుణ భోజనానికి పిలిస్తే వెళ్లాం. మంచీ మర్యాదా పద్ధతి ఉన్న అమ్మాయి. భక్తి కూడా ఎక్కువే. మా అమ్మాయికి మంచి స్నేహితురాలు . ఇంటికి చేరే సరికి రాత్రి 11 అయింది. రెండు రోజులు వరుస రుద్రాలు ఇంట్లో పారాయణ తో గొంతు బొంగురు పోయింది. హాల్స్ చప్పరిస్తూ ఉపశమనం పొందాను. ఇబ్బందేమీ లేదు. ఈ వీక్లీ ఇంతటితో సమాప్తం.

(25-9-17-కాంప్-షార్లెట్-అమెరికా)

## వీక్లీ అమెరికా-27-1 (25-9-17 నుండి 1-10-17 వరకు)

## లలితా పారాయణ, సుందరకాండ పారాయణ పూర్తి, దసరా సరదా సాహితీ కదంబ వారం-1

25-9-17 సోమవారం- ఉదయం అమెరికాలో మా అమ్మాయిగారింట్లో చివరి మహాన్యాస పూర్వక రుద్రాభిషేకం పూర్తి చేసి, తర్వాత సుందరకాండ నాలుగవ రోజు పారాయణ పూర్తి చేశాను. శని, ఆదివారాలలో పూర్తిగా రుద్రాభిషేకంలో

మంత్రాలు చదవటంతో గాత్రానికి "కించిత్ అసౌకర్యం" కలిగి బొంగురు మాట వచ్చింది. హాల్స్ ఆరాగా ఆరాగా చప్పరించి ఉపశమనం పొందాను. వీక్లీ అమెరికా 25లో రెండుభాగాలు రాశాను.

మంగళవారం– నిత్యపూజతో పాటు అమ్మవారి అష్టోత్తరాలూ రోజూ చేస్తున్నట్లే చేసి అయ్యవారి అష్టోత్తర సహస్ర నామ పూజ, సుందరకాండ అయిదవ రోజు పారాయణ పూర్తి చేశాను. సరసభారతి కార్యదర్శి శ్రీమతి మాదిరాజు శివలక్ష్మి కుమార్తె చి॥ బిందు దత్తశ్రీ బి.టెక్ ఫైనల్ ఇయర్‌లో టి.సి.ఎస్ వాళ్ళ కాంప్ సెలెక్షన్ సాధించిందని మెయిల్ పెడితే శుభాశీస్సులు పంపాను. కష్టపడి చదివి సాధించినందుకు అభినందించాను.

బుధవారం– సరస్వతీ పూజ– పై విధంగానే పూజ అంతరం ఆరవరోజు సుందర కాండ పారాయణ పూర్తి చేశాను. సోమవారం నుండి ఈ రోజు వరకు గొంతుకు ఇబ్బంది కాకుండా చాలా సైలెంట్‌గా పూజ, పారాయణ చేశాను.

28–9–17 గురువారం– ఇవాళ మౌంట్ సోమాలో చండీ హోమంకు మా అల్లుడితో పాటూ మేమూ వెళ్లాలని మా అమ్మాయి చెప్పటం, ఈ రోజు దుర్గాష్టమినాడు మా నాయనమ్మగారి "తిథి" అవటం వలన రాత్రి 2.30కే లేచి కార్యక్రమాలు పూర్తి చేసి తెల్లవారురుఝామున 3 గంటలకు సంధ్యావందనం నిత్యపూజ, 7వ రోజు సుందరకాండ పారాయణ ఉదయం 6 గంటలకు పూర్తి చేశాను.

## మా నాయనమ్మ గారి ఆబ్దికం

6 గంటలకు నేను ఇండియానుంచి తెచ్చుకొన్న ఆబ్దిక మంత్రాల పుస్తకం తీసుకొని మంత్రాలు చదువుకొంటూ, మానసికంగా మా మామ్మ నాగమ్మగారికి ఆబ్దిక విధి నిర్వహించాను. అన్నసూక్తం అధిశ్రవణం కూడా చదివి అంతా అయ్యేసరికి ఉదయం 7.30 అయింది. తర్వాత రామకోటి రాసి భగవద్గీత చదివి, డైరీ రాసేసరికి 8 అయింది. మా శ్రీమతి నాతోపాటు లేచి లలితా పారాయణం చేసి రెడీగా ఉంది. మా అమ్మాయి యధాప్రకారం వంట చేసి 8 గంటలకు ఆఫీస్‌కు వెళ్ళింది. దేవుడి నైవేద్యం పెరుగులో నానేసిన అటుకులు ఫలహారం కొద్దిగా చేసి మందులు వేసుకొని మౌంట్ సోమాకు సిద్ధంగా ఉన్నాం.

## మౌంట్ సోమాలో చండీ యాగం

మేమిద్దరం మా అల్లుడూ కారులో ఉదయం 9.15 కు బయల్దేరి 12.30కు మౌంట్ సోమా చేరాం. మేమిద్దరం మాతో తెచ్చుకొన్న కూర, పచ్చడి అన్నం దారిలోనే కారులోనే తినేసాం. అక్కడ హోమం అక్కడి శ్రీ సోమేశ్వర శివాలయం అర్చకులు శ్రీ గారపాటి ప్రసాదావధాని గారు, శ్రీమతి అనసూయ దంపతులు యాగశాలలో నిర్వహిస్తున్నారు. కార్యక్రమం వారనుకొన్న సమయానికే ఆదాయం 11.30కు

ప్రారంభించారు. మా అల్లుడిని హోమద్రవ్యాలను అగ్నిలో వ్రేల్చటానికి, అర్చకస్వామినియోగించారు. నేను పట్టుబట్టలు కట్టుకొని ఊరికే ప్రక్కన కూర్చున్నాను. 13 ఆవృత్తాలతో హోమం జరిగింది. ప్రతిసారి గారెలు చెరుకు ముక్క చిన్న గుమ్మడికాయ, దానిమ్మపండు, పుష్పాలను తమలపాకులతో పెట్టి ఆవృత్తం అవగానే హోమంలో వేశారు. ఇలా 13 సార్లు చేశారన్న మాట. చివరికి ప్రకృతిలోని మనలోనూ ఉన్న వ్యతిరేక శక్తులను కూడా శాంత పరచటానికి "కూష్మాండ బలి" ఇచ్చారు. తర్వాత పూర్ణాహుతి నిర్వహించారు. అంతా అయ్యేసరికి సాయంత్రం 5 అయింది. ప్రసాదంగా గారెలు, పులిహోర. దేవాలయం ప్రక్కనే శ్రీ ఆంజనేయస్వామి పెద్ద సైజు నల్లరాతి శిలా విగ్రహం ఉన్నది. దూరంగానే చూసి నమస్కరించాను.

ఈ శివాలయం నిర్మించిన అమెరికన్ దంపతులు, మరి కొందరు స్థానిక అమెరికన్‌లు, హిందూ భక్తులు అయిదున్నర గంటలు జరిగిన హోమంలో చాలా భక్తి శ్రద్ధలతో కదలకుండా కూర్చోవటం అత్యాశ్చర్యమేసింది.

హోమం పూర్తికాగానే మా నాయనమ్మగారిని తలచుకొని అర్చకులు ప్రసాదావధానిగారి చేతిలో తాంబూలం దక్షిణ పండ్లు పెట్టి నమస్కరించి సంతృప్తి చెందాను. ఈ రకంగా మా నాయనమ్మ గారి ఆబ్దికం ఇక్కడ నెరవేరింది.

తర్వాత అందరం శివాలయానికి వెళ్లాం. అర్చకస్వామి యధా విధిగా పూజ పూర్తి చేసి ఆ దంపతులు, మా దంపతులకు దంపతి పూజగా నూతన వస్త్రాలు సమర్పించి దక్షిణ తాంబూలాలతో సత్కరించి నమస్కరించి ఆశీస్సులు అందుకొన్నారు. ఇది మేము ఊహించని విషయం. విజయదశమినాడు మా అమ్మాయి పుట్టిన రోజు కనుక మా అమ్మాయికి కొత్త చీర జాకెట్ ఇచ్చారు.
తర్వాత వారింటికి ఆహ్వానించి మా ముగ్గురకు భోజనం పెట్టారు. పప్పు, బీన్స్ కూర, అల్లం చట్నీ, పరవాన్నం, పులిహోర, గారెలతో భోజనం. ఏదో తిన్నాననిపించాను. సాయంత్రం 6.15కు బయల్దేరి రాత్రి 9 గంటలకు ఇంటికి చేరాం. ఫోటోలు నెట్‌లో పెట్టి నిద్రకు ఉపక్రమించాను.
అలసట తో మాంచి నిద్ర పట్టింది

## 29-9-17 శుక్రవారం-లలితా పారాయణ, భజన

ఉదయం 8వ రోజుసుందరకాండ పారాయణ పూర్తి చేశాను. సాయంత్రం 6 గంటలకు మా అమ్మాయి సామూహిక కుంకుమ పూజ ఏర్పాటు చేసింది. నేనే అందరి చేతా చేయించాను. 25 మంది మహిళలు భక్తితో పాల్గొన్నారు. అందరికి ఒక ప్రత్యేక ప్లాస్టిక్ పెద్దపళ్లెం అందులో ప్లాస్టిక్ భరిణెలో కుంకుమ మరొక దానిలో అక్షింతలు, పూలు ఒక డాలర్ కాయిన్ ఏర్పాటు చేసింది. కాయిన్‌కు కుంకుమ

బొట్టుపెట్టి, అమ్మవారిగా భావించి పూజ జరిపించాం. తర్వాత అందరూ కలిసి శ్రీ లలితా సహస్రనామ పారాయణ చేశారు. 7గంటలకు పూజ పూర్తయింది.

సరిగ్గా రాత్రి 7 గంటలకు భజన మొదలు పెట్టారు. గంటసేపు అమ్మవారి కీర్తనలు సాయి నామంతో కలిపి చేశారు. 8గంటలకు భజన పూర్తయింది. అక్టోబర్ 1 ఆదివారం సరసభారతి కార్యక్రమంలోనూ 8 వతేదీ ఆదివారం హిందూ సెంటర్‌లో కూచిపూడి నాట్యాచార్యులు ప్రదర్శిస్తున్న "కీచకవధ" కార్యక్రమంలో అందరూ తప్పక పాల్గొనాలని చెప్పాం.

రేపు విజయదశమినాడు మా అమ్మాయి పుట్టినరోజు సందర్భంగా మామమ్మాయి విజ్జికి గ్రంధి హరి గారి భార్య విజయ లక్ష్మిగారికీ జాయింట్‌గా జన్మదిన శుభాకాంక్షలు అందరూ తెలియజేశారు.

తర్వాత విందు. చపాతీ, బంగాళాదుంప, కాప్సికం కూర, చానామసాలా కూరా, రవ్వకేసరి మరొక స్వీట్, చక్రపొంగలి, పులిహోర కర్వేపాకు పులిహోర, టమాటా ఊరగాయ, సాంబారు, పెరుగన్నం. అన్నీ బాగానే ఉన్నాయి. సుమారు 45 మంది దాకా విందు ఆరగించారు. తర్వాత నేను కట్టిన రామరాజు పంచె ఉత్తరీయం చూసి శ్రీమతి గోసుకోండ అరుణ "అంకుల్ మీరు పెదరాయుడు పోజు పెట్టండి. నేను ఫోటో తీస్తా" అంటే పురజనుల కోరికపై ఆ పోజు పెట్టగా అరుణ దంపతులు, పవన్ దంపతులు, మా అమ్మాయి మాతో ఫోటోలు దిగారు. "నాకు దిష్టి తగులుతుందేమోనని అనుమానంగా ఉంది బాబూ".

కదంబంకు స్పందన బాగానే ఉందని పవన్ చెప్పాడు. చాలా సంతోషమేసింది. సాయి పవన్ భార్యకు "మా అన్నయ్య డా.శ్రీమతి భావన గారికివారి అమ్మగారి ద్వారా "శతకం" అందజేశాను. రాత్రి 10.30కి ప్రముఖ గాయని శ్రీమతి ఉష గారి అక్కగారు వచ్చి భక్తిగా అమ్మవారిపై పాటలు పాడారు. అదే సమయంలో ఇండియా నుంచి ఉషగారు ఆమెకు ఫోన్ చేశారు. ఆమెతో మా శ్రీమతి మా అమ్మాయి ఆవిడ ఫాన్‌లమని గర్వంగా చెప్పారు.

30-9-17 శనివారం- యధావిధిగా పూజ అయ్యాక 9వ రోజు చివరి రోజు సుందరకాండ పారాయణ పూర్తి చేసి సరికి ఉదయం 10.45 అయింది. ఇది నా 57 వ్యాపారాయణ. షార్లెట్‌లో 3వ పారాయణ.

శ్రీ డొక్కా రామ్ గారు ఆస్టిన్ నుంచి పంపిన ఆత్మానందం ఆత్మారామం పుస్తకాలు అందాయి. అందినట్లు మెయిల్ ద్వారా తెలియజేసి గీర్వాణం-2 ఆయనకు పంపిస్తున్నానని రాశాను.

ఇవాళ విజయ దశమినాడు మా అమ్మాయి పుట్టిన రోజు సందర్భంగా మా

ఉయ్యూరు శ్రీ సువర్చలాఞ్జనేయ స్వామి వారి దేవాలయంలో ప్రత్యేక పూజ, చక్రపొంగలి, రవ్వకేసరి, పులిహోర ప్రసాదాలు చేయించాడు మా అబ్బాయి రమణ. మా మూడవ అబ్బాయి మూర్తి రాణి దంపతులు కూర్చుని సాయంత్రం శమీ పూజ నిర్వహించారు.

(30-9-17-కాంప్-షార్లెట్-అమెరికా)

**వీక్లీ అమెరికా-27-2** (25-9-17 నుండి 1-10-17 వరకు)

30-9-17శనివారం సాయంత్రం- మా మనవళ్ళు చదివే కమ్యూనిటీ స్కూల్‌లో ఇక్కడి తెలంగాణా ప్రజలంతా కలిసి "బతకమ్మ" ఉత్సవం బ్రహ్మానందంగా చేశారు. చూడటానికి మేమూ వెళ్లాం. కానీ టికెట్ 5 డాలర్లు పెట్టారు. అప్పటికే ప్రసిద్ధ తెలంగాణా కవి శ్రీ గోరటి వెంకన్న మాట్లాడుతున్నారు. వినాలని సరదాగా ఉన్నా, వెళ్లలేకపోయాం. తెలంగాణా మహిళలు సంప్రదాయ దుస్తులు ధరించి పళ్ళాలలో బతుకమ్మను ఏర్పాటు చేసుకొని సందడిగా కనిపించారు. వారి ఆరాధనా భావానికి ఆశ్చర్యమేసింది. దేశం మారినా సంప్రదాయం మర్చిపోనందుకు వారిని అభినందించాం. గోరెటి వెంకన్నగారు ఇక్కడ ఉన్నారని తెలిసి ఆయన సాహితీ కదంబ కార్యక్రమానికి రాగలుగుతారేమో కనుక్కోమని శ్రీగ్రంధి హరిగారికి నేనూ మా అమ్మాయి 29 సాయంత్రం మా ఇంట్లో భజన సమయంలో చెప్పాం. ఆయన వాకబు చేసి వెంకన్నగారు 1 తేదీ తెల్లవారు ఝామున 2 గంటల ఫ్లయిట్‌లో వెళ్లి పోతున్నారని 30 మధ్యాహ్నం మాకు తెలియజేశారు. అద్భుతమైన అవకాశం చేజారిందనుకొన్నాం.

అక్కడ నుండి మా అమ్మాయి మమ్మల్ని శ్రీ మల్లవరపు శివకుమార్ గారింట్లో జరిగే దసరా బొమ్మల కొలువుకు ఆహ్వానం వస్తే తీసుకు వెళ్ళింది. శివగారు ప్రసిద్ధ కవి స్వాతంత్ర సమరయోధులు, రవీంద్రుని శిష్యులేకాక శాంతి నికేతన్ విద్యార్థి, "రవీంద్ర వ్యాసావళి", "మధుకీల" కావ్యం మొదలైన గ్రంథకర్త, కృష్ణశాస్త్రికి చాలా దగ్గర బంధువు, ఆచంట జానకి రామ్ రచనల్లో "మా విశ్వం బావ" అని పొగడబడిన వాడు స్వతంత్ర ఉద్యమకాలంలో తర్వాత ఎన్నో దేశభక్తి గీతాలు రాసి నిత్యం రేడియోలో గేయాలు రాసి వినిపించిన స్వర్గీయ శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావు గారి కుమారులు. వారింట్లో బొమ్మలకొలువు కనుల పండువుగా ఉంది. మాకు ప్రసాదంగా పులిహోర, తాలింపు సెనగలు, పెరుగన్నం పెట్టారు. చాలా ఆత్మీయంగా గలగలా మాట్లాడే తత్త్వం శివ గారిది. రేపు జరిగే సాహితీ కదంబంకు రమ్మని ఆహ్వానించాం. తనకు మెయిల్ వచ్చిందని తప్పక వస్తానని చెప్పారు. శివ గారింట్లోనే ప్రసిద్ధ నాట్య శిక్షకురాలు దర్శకురాలు శ్రీమతి మంగళంపల్లి మహా క్రిస్ట్యన్ కుటుంబం పరిచయమయ్యారు. ఆమెది హైదరాబాద్. విదేశీయుని వివాహమాడి ఇక్కడ గొప్ప నర్తకిగా ప్రసిద్ధి చెందింది.

అందరితో ఫోటోలు తీసుకొన్నాం. అవి రాత్రే అందరికి పంపాను చూసే ఉంటారు.

## శ్రీరామ్ దొక్కా గారి కవితలు

శనివారం మధ్యాహ్నం టెక్సాస్ రాష్ట్రంలో ఆస్టిన్‌లో ఉంటున్న శ్రీరామ్ దొక్కా గారు తాము ఇటీవల రాసి ప్రచురించి విడుదల చేసిన రెండు కవితా సంపుటాలు "ఆత్మానందం", "ఆనందారామం" పంపగా అందాయి. పంపుతున్నట్లు బుధవారమే ఫోన్ చేసి చెప్పారు. అందాయి. రాత్రి 10 గంటలకు మొదటి పుస్తకంలోని 116 కవితలు చదివి "ఆత్మానందారామం" అని నా అభిప్రాయంగా వ్యాసం రాసి అర్ధరాత్రి 12 గంటలకు ఆయనకూ మీకూ పంపిన సంగతి గుర్తు ఉండే ఉంటుంది. రామ్ గారు ఎంతో ఆనందించి వెంటనే ధన్యవాదాలు రాశారు.

నిద్ర పోయేసరికి రాత్రి ఒంటిగంట అయి ఉంటుంది. వీరిదే ఇంకో పుస్తకం మిగిలింది. తెల్లవారుఝామున 4.30కి మెలకువ వస్తే లేచి 5 గంటలకు రెండో పుస్తకమైన పద్య కవితల "ఆనందారామం" చదివి వెంటనే "జగదానందారామం"గా నా అభిప్రాయం రాసి పంపేసరికి తెల్లవారి 7 అయింది దీనిపై ఎందుకో రామ్ గారి నుంచి జవాబు రాలేదు. ఇంత తొందరగా ఎందుకు రాశానంటే ఈ రెండిటిని సాహితీ కదంబంలో సాహితీ అభిమానం ఉన్నవారికి వారి కానుకగా అంద జేయటానికే.

## 1-10-17 ఆదివారం-దసరా సరదా సాహితీ కదంబం

మేము ఏప్రిల్ మొదటి వారంలో షార్లెట్ వచ్చాము. అప్పుడు మొదటిసారిగా శ్రీ రాంకీ ఇంట్లో కార్యక్రమానికి వెళ్లాం. అక్కడ అతనితో వేలూరి, పవన్, రాంకీ తమ్ముడు సాయి పవన్‌తో షార్లెట్లో తెలుగు సాహిత్యం మీద అభిరుచి ఉన్నవారు కనీసం పది మందితో ఇష్టాగోష్ఠి జరుపుదాం అంటే తప్పక చేద్దామనటం, ఆతర్వాత రాంకీ ఇంట్లోనే రెండు సరసభారతి సభలు మరొకటి శ్రీ బులుసు సాంబమూర్తిగారింట్లో స్వాతంత్ర సమరయోధులు స్వర్గీయ బులుసు సాంబమూర్తిగారి కార్యక్రం చేయటంతో అందరిలో సరసభారతిపై అభిరుచి పెరిగి చివరికి "దసరా సరదా సాహితీ కదంబం" రూపు దాల్చి అద్భుతంగా జరిగింది.

మధ్యాహ్నం 1.45కే మేము అందరం వేలూరి పవన్ ఇంటికి దగ్గరున్న కమ్యూనిటీ సెంటర్‌కు చేరుకున్నాం. అప్పటికే అక్కడ ఏర్పాట్లు జరిగి పోయాయి. నేను సాంప్రదాయంగా పంచె, చొక్కా, ఉత్తరీయంతో వెళ్లాను. రాంకీ తమ్ముడూ కూడా అదే పద్ధతిలో వచ్చారు. మా అమ్మాయి మైసూర్ పాక్, బ్రేడ్ బజ్జీలు తయారు చేసి తీసుకొని వచ్చింది. అక్కడే టీ కాచి రెడీ చేశారు. ఈ కార్యక్రమం బాగా జరగాలని మా అబ్బాయి రమణ ఇక్కడి "పవన్ ద్వయం" మా అమ్మాయి విజ్జితో రోజూ ఫోన్ కాంటాక్ట్‌లో ఉంటున్నాడు. దిశా నిర్దేశమూ చేశాడు. జ్ఞాపికల డిజైన్ కూడా ఉయ్యూరులో

చేయించాడట. వాటిని ఇక్కడ తయారు చేయించారట. ఇదాంతా నాకు తెలియకుండానే జరిగిపోయింది. సంతోషం.

మధ్యాహ్నం 2.30కు అలవాటులో పొరబాటుగా కార్యక్రమం అరగంట ఆలస్యంగా మొదలైంది. ఎలా జరపాలి. నేను ముందే సూచించాను. దాన్ని తూచా తప్పకూండా చిన్నపవన్ బ్లు ప్రింట్ తయారు చేసి రెడీ చేశాడు. ఆదివారం ఉదయం శ్రీ మైనేని గారి మేనకోడలు ఇక్కడి కాంకర్డ్ నుంచి మా అమ్మాయికి ఫోన్ చేసి "మీ నాన్నగారిని మా ఇంటికి తీసుకు వెళ్లాలని ఉంది" అని చెబితే ఈ కార్యక్రమం సంగతి చెప్పి ఆవిడనూ ఆహ్వానించింది విజ్జి. ఆమె రాలేదని కొంటూ. ఆవిడకు మైనేనిగారు ఈ విషయం చెప్పలేదా? ఆయన ఎందుకో నెల నుంచి చాలా ఉదాసీనంగా ఉంటున్నారు. లేకపోతే ఇంత పెద్ద కార్యక్రమం ఇక్కడ జరుగుతుంటే దానిపై ఒక్కమాట కూడా ఆయన రాయలేదు నాకు. ఆశ్చర్యంగా ఉంది.

మా మనవళ్లు మిగిలిన ముగ్గురు ఆడపిల్లలు "మా తెలుగు తల్లికి" పాట చాలా శ్రావ్యంగా పాడారు. వీళ్లల్లో డా. శ్రావ్య గారమ్మాయి కూడా ఉంది. తర్వాత జ్యోతి ప్రదీపనం. తర్వాత మా అల్లుడు సాంబావదాని వేద మంత్ర ప్రార్ధన. ఈ కార్యక్రమానికి మా అమ్మాయినే అందరూ "లంగరు" వేయమంటే అంటే యాంకరింగ్ చేయమని యాంకర్‌ను చేశారు. ఇలాంటివి మా అమ్మాయికి కొట్టిన పిండి. నల్లేరుపై నడకే. తర్వాత అధ్యక్షుడిగా నన్ను ఆహ్వానించటం జరిగింది. అప్పుడు నేను సరసభారతి గురించి చెప్పుతూ "అక్షరం లోక రక్షకమ్" అనేది సరసభారతి నినాదం అని మొదలుపెట్టి దాని ప్రస్తానం మజిలీలు తెలిపి ప్రచురించిన ప్రచురించబోతున్న పుస్తకాల వివరాలు అనుభూతి కవి దేవరకొండ బాల గంగాధర తిలక్ రాసిన "వసుదైక గీతం" చదివి ఇంతటి విశాల దృక్పధంతో రాసిన కవి ఆనాడు లేడనీ అందుకే ఈ సభను తిలక్‌కు అంకితమిస్తున్నామని చెప్పగానే హర్షధ్వానాలు మారు మ్రోగాయి. అంతకు రెండు రోజుల ముందే తిలక్ ఫోటో పెద్ద పవన్‌కు మా ఇంట్లో చూపించి దాన్ని ప్రింట్ ఔట్ తీయించి ఫ్రేము కట్టించమని చెప్పా. చాలా మంచి ఫోటో వచ్చింది. దాన్ని వేదికపై సరస్వతీదేవి ఫోటో ప్రక్కన పెట్టి సార్ధకత చేకూర్చాము. పవన్ అభినందనీయుడు. ఇలాంటి కార్యక్రమాలలో అనుభవం వీళ్లకు లేనందున వేదికపై బానర్ తయారు చేసి ఉంచాలన్న ఆలోచన ఎవరికీ రాలేదు. నేనూ చెప్పలేదు. తెలుసుకదా ఆ పని చేయకుండా ఉంటారా, ఎన్నో సాయి సభలు చేసినవాళ్లకు నేను చెప్పాలా అనుకొన్నా, తీరా వచ్చి చూస్తే ఆ ప్రయత్నం జరగలేదు. అప్పటికప్పుడు మా అమ్మాయి ఇంటికి వెళ్లి బానర్ పేపర్ తెస్తే కలర్ మా ర్కింగ్ పెన్స్‌తో నేనే చెప్పి శ్రీమతి పద్మశ్రీ, లావణ్యలతో తయారు చేయించి వేదికపై పెట్టించి సార్ధకత కలిగించా. మరో సంగతి అధ్యక్షుడిని వేదిక

ఎక్కించకుండానే కొంత తంతు కూడా జరిపారు. అనుభవరాహిత్యం ఏది జరిగినా అధ్యక్షుడి సమక్షంలో జరగాలి అదీ సంప్రదాయం.

తెలుగు కవిత్వం ఎలా ఉండాలో పెద్దన గారి "పూత మెఱుంగులుం" అనే 24 పాదాల ఉత్పలమాలిక చదివి కృష్ణదేవరాయల "తెలుగుగదేల యన్న దేశంబు తెలుగు యే ను తెనుగు వల్లభుండ తెలుగొ కండ -యెల్ల నృపులు కొలువ యెరుగవే బాసాడి దేశ భాష లందు తెలుగు లెస్స" పద్యం చదివి తెలుగు అతి ప్రాచీనమైన భాష అని 2 వేల ఏళ్ళ క్రితమే తెలుగు ఉందని చెప్పి రాయల పద్యం ఇక్కడి తెలుగు పిల్లలకు నేర్పమని అలాగే తెలుగు తరగతులలో పిల్లలు ఒకరినొకరు "అక్కా అన్నా" అని సంబోధించుకొనేట్లు అలవాటు చేసి మన బాంధవ్యపదాలైన బాబాయి పిన్ని తాతగారు మామ్మగారు అమ్మమ గారు కూడా అభ్యాసం చేయించమని కోరా. ఇవి తమ దృష్టిలోకి ఇంతవరకు రాలేదని ఇకనుండి అలానే పిలిపిస్తామని తెలుగు బోధకులుశ్రీమతి జ్యోతి హామీ ఇచ్చారు. ఆధునిక కవిత్వానికి "మాగ్నాకార్టా" అని ప్రశంసింపబడుతున్న శ్రీ శ్రీ "కవితా ఓ కవితా" కవితను తిలక్ "నా అక్షరాలూ వెన్నెలలో తడిసె అందమైన ఆడ పిల్లలు" కవితను చదివి తెలుగు కవిత్వమార్గ నిర్దేశం చేశాను. అప్పయ్య దీక్షితులు "తెలుగులో మాట్లాడటం తెలుగు వాడిగా పుట్టటం పూర్వజన్మ తపో ఫలం అన్నాడని సుబ్రహ్మణ్య భారతి "సుందర తెలుంగు" అని కీర్తించాడని, తెలుగును ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్ అని పాశ్చాత్యులే ప్రష్మసించారని గుర్తు చేశాను.

తర్వాత శ్రీ మల్లవరపు శివకుమార్ మాటాడి తండ్రిగారి కవిత్వాన్ని గుర్తు చేశారు. తర్వాత శ్రీమతి పద్మశ్రీ అపర ఘంటసాల అని మా అమ్మాయి చెప్పే శ్రీ శ్రీనివాస్ కూచిపూడి నాటక నాట్యానుభవం ఉన్న శ్రీ పసుమర్తి సనత్ గరివిడికి చెందిన సంగీతము మేష్టారు శ్రీ మోకరాల మూర్తిగారి కరుణశ్రీ గారి "పుష్ప విలాపం" పద్యాలు సనత్ భార్య శ్రీమతి లావణ్య, ముసలితనం లోనూ సాహిత్యంపై అభిరుచి తగ్గని కవిత్వం రాసి పాడే శ్రీమతి సీతమ్మగారి పాటలతో నా సాహితీ స్రవంతి తర్వాత సంగీత స్రవంతి ప్రవహించింది.

తర్వాత నేనే సరదా కబుర్లుతో హాస్య వల్లరికి తెరతీశా. దీన్ని శ్రీ నాగరాజు గారు అందుకొని తన నేటివ్ హాస్యం జోడించి కడుపుబ్బా నవ్వించి అనుకొన్నది నెరవేరేట్లు చేసి సరదా పూలు పూయించారు. మధ్య మధ్యలో నేను పేరడీలు అందునా మల్లవరపు వారి మధుకీలపై కృష్ణశాస్త్రి గారు రాసిన ముందుమాటలపై జలసూత్రం రుక్మిణీ నాథ శాస్త్రి అనే జరుక్ శాస్త్రి రాసిన పేరడీ చెప్పి కడుపుబ్బ నవ్వించాను. మల్లవరపు వారబ్బాయి శివ గారుండగానే .

అక్టోబర్ 8 ఆదివారంనాడు షార్లెట్ హిందూ సెంటర్లో తమ శిష్యురాళ్ళ

శ్రీమతి డా. సాయి లక్ష్మి ప్రముఖ మృదంగ విద్వాంసులు శ్రీ ఎల్లా వెంకటేశ్వరరావు గారి అమ్మాయి శ్రీమతి విజయల కోరికపై "కీచక వధ" కూచిపూడి నృత్యాన్ని చేయబోతున్న ప్రఖ్యాత కూచిపూడి నాట్యకళాకారులు దర్శకులు శ్రీ పసుమర్తి వెంకటేశ్వర శర్మ గారు ఈ సభకు కాకతాళీయంగా రావటంతో వారిని వేదిక నలంకరింపజేసి కార్యక్రమం వారి సమక్షంలో జరిపాం. శర్మగారికి సరసభారతి తరఫున నూతన వస్త్రాలు శాలువా కప్పి 2,116 రూపాయలు అందజేశాము. దసరాలలో కళాకారులను సన్మానించటం మనకు అనుస్యూతంగా వస్తున్న సదాచారం. దాన్ని ఇక్కడ చేయగలగడం అందులో అత్యంత సర్వ సమర్ధకునికి చేయటం మహదానందంగా ఉంది. వీరిని సత్కరించే టప్పుడు రాంకీ అవధానులతో వేదాశీర్వచనం చేయించాచి. మరింత సార్ధకత తెచ్చాము. దీనితో సభ సాహిత్య సంగీత నృత్య త్రివేణీ సంగమమై విరాజిల్లింది. అందరిలో ప్రేరణ ప్రోత్సాహం స్ఫూర్తి కలిగింది. కార్యక్రమం ముగిసేముందు ప్రత్యేకంగా తయారు చేయించిన జ్ఞాపికలు పాల్గొన్నవారికీ, సేవ చేసిన వారందరికీ ఇప్పించాం. బాగున్నాయి జ్ఞాపికలు. నిజంగా కలకాలం దాచుకో దగినవిగా అసలైన జ్ఞాపికలుగా ఉన్నాయి. దీని డిజైనర్‌కు స్పాన్సర్‌కు అభినందనాలు. ఉయ్యూరుదగ్గర పైడి కొండలపాలెం నివాసి ఇక్కడ ఉంటున్న శ్రీ సుంకరరావు గారు చాలా చలాకీగా పాల్గొని తర్వాత కార్యక్రమానికి తానూ తనవంతు సహాయ సహ కారాలు అందిస్తానని చెప్పగానే మా అమ్మాయి సుంకర వారి వితరణ గురించి అందరికి తెలియజేసింది. ఇక్కడి తెలుగు తరగతులు నిర్వహించే శ్రీమతి జ్యోతిర్మయి పిల్లలకు చిన్న కథలు చెప్పి ఆకట్టుకున్నారు.

నేను చివర్లో మాట్లాడుతూ ఈ కార్యక్రమం దీనితో ఆగిపోరాదని కనీసం 6 నెలలకొకసారి అయినా షార్లెట్ తెలుగువారు సరసభారతి వేదికగా కార్యకర్మాలు నిర్వహించాలని కోరగా అందారూ ఉబ్బి తబ్బిబ్బయి తప్పకూండా చేస్తామని హామీ ఇచ్చారు. తర్వాత కార్యక్రమం ఉగాది రోజున చేయమని ఆనాడు ఉగాది పచ్చడి, పంచాంగ శ్రవణంతో కూడిన "ఉగాది విభావరి" నిర్వహించమని కోరాను. శ్రీమతి సాయి లక్ష్మిగారు "బాబాయిగారూ మీరిచ్చిన ప్రోత్సాహం మమ్మల్ని పరవశుల్ని చేసింది ఉగాదినాడు నేను డాన్స్ కూడా చేస్తాను" అనటం, పద్మ శ్రీ, ఉషా, రాధ, రాంకీ, పవన్ జంట, ఎల్లా విజయ మొదలైనవారంతా ఆనందం పట్టలేక కళ్ళ వెంట ఆనంద బాష్పవాలు కారుస్తుంటే నా జీవితం ధన్యమైందనిపించింది. జీవితానికి సార్ధకత చేకూరింది అనుకొన్నా. ఇంతటి హృదయ స్పందన ఉంటుందని ఊహించలేదు. మా ఈ అయిదవ అమెరికా పర్యటన సాహిత్య ఆధ్యాత్మిక ధార్మిక స్రవంతిగా జరగటం చాలా సంతృప్తిగా ఉంది.

సభలో నాకూ మా శ్రీమతికి శాలువా కప్పి సన్మానం చేశారు. ఒక గడియారం

బహూకరించారు. షార్లెట్, తెలుగు మిత్రులు అందరూ కలిసి కొంత డబ్బు పోగు చేసి ఇండియాలో సరసభారతి చేస్తున్న కార్యక్రమాలలో భాగంగా పేద ప్రతిభగల విద్యార్థులకు ప్రోత్సాహక నగదు బహుమతిగా అందజేయమని ఒక కవర్‌లో పెట్టి అందించారు. అందులో ఎంత ఉందో నేను ఇంకా చూడలేదు. ఈ సందర్భంగా నేను “ఇక్కడ మా దంపతులను ఆహ్వానించి సత్కరించి రుద్రం సత్యనారాయణ వ్రతం మొదలైన వాటిలో మాకు నగదుగా తాంబూలంలో పెట్టి, గౌరవించిన ప్రతి డాలర్‌నూ నేను లెక్క రాసుకొన్నానని దానిని ఆయా వ్యక్తుల పేరిట సరసభారతి పుస్తక ముద్రణలో సహకరించిన వదాన్యుల పేర్లలో చేర్చిరాబోయే సరసభారతి గ్రంథాలలో ముద్రించి కృతజ్ఞతలు తెలియజేస్తామని సరసభారతి ఎవరి వద్దా చందాలు వసూలు చేయదని, ఇలా డబ్బు ఇచ్చిన వారి పేర్లూ శ్రీ సువర్చలాన్జనేయ స్వామికి కైంకర్యంగా ఇచ్చేదాన్నీ ఇలాగే మా పుస్తకాలలో ముద్రిస్తామని తెలియజేశాను. కార్యక్రమంలో శ్రీ గ్రంధి హరి గారు ఆయన శ్రీమతి రంజని ఎంతో సేవ చేశారు. వారికి ప్రత్యేక అభినందనలు. కార్యక్రమం వేద స్వస్తితో ముగించాం. పూర్తి అయ్యేసరికి రాత్రి 7.30 అయింది. అంటే 5 గంటల నాన్ స్టాప్ కార్యక్రమం జరిపామన్నమాట. ఎవరికీ సమయమే తెలీకుండా పోయి నిమగ్నమై మరో లోకంలో తేలిపోయారు . ఇది షార్లెట్‌లో సరసభారతి సాధించిన అపూర్వ అద్వితీయ చారిత్రాత్మక ఘన, చిరస్మరణీయ విజయం. ఇందులో పాల్గొన్నవారికి సహకరించిన వారికి అందరికి సరసభారతి సదా రుణపడి కృతజ్ఞతగా ఉంటుంది. అందరూ మమ్మల్ని వదిలి వెళ్లలేక వెళ్లలేక గుడ్ల నీరు కుక్కుకొంటూ. “సంతోషపు కన్నీళ్లు” కారుస్తూ రాలుస్తూ “బాన్ వాయేజ్” చెబుతూ వీడ్కోలు తీసుకొన్నారు. ఇదంతా ఇక్కడి వాళ్ళ సౌజన్యం సౌహార్దత మేము చేసింది ఏమీ లేదు. దోహదం చేసి మా బాధ్యత నెరవేర్చాం అంతే. కార్యక్రమమే అంటా ఫిష్ బుక్‌లో లైవ్‌గా వచ్చేట్లు చేశారు. వీడియో తీసి యు ట్యూబ్‌లో పెట్టారు చూడండి.

నేను ఈ కార్యక్రమం 3 గంటలు పెట్టారు ఎవరు వస్తారో ఎవరు ఏ ఐటెంలో ఉంటారో తెలియదు కనుక మొత్తం బాధ్యత నామీదే ఉంటుందేమోనని అవసరమైతే ఆ మూడుగంటలూ జోక్స్‌తో సాహిత్య ప్రసంగాలతో హాస్యంతో కాలక్షేపం చేయాల్సి వస్తుందని మస్తుగా తయారై వచ్చాను. ఇంతమంది పాల్గొని భాగస్వామ్యులై నా బరువు తగ్గించారు. అందుకని నేను తయారు చేసుకొన్నదంతా ఇండియావెళ్ళాక వరుసగా ధారావాహికంగా రాస్తానని దీనివలన ఎంతో సాహిత్య సమాచారం అందుకొంటారని ఎవరికైనా చెప్పటానికి ఉపయోగ పడుతుందని చెప్పాను. ఆపని తప్పని సరిగా చేయమని కోరారు. సరే అన్నాను.

సభానంతరం శ్రీ పసుమర్తి సనత్ లావణ్య దంపతుల ఇంటికి డిన్నర్‌కు వెళ్లాం.

**షార్లెట్ సాహితీ మైత్రీ బంధం**

ఎప్పుడో ముందే బుక్ అయిన కార్యక్రమం ఇది. మాతోపాటు పసుమర్తి నాట్యాచార్యులు వారబ్బాయి కూడా అతిధులు. మొకరాల వారి కుటుంబమూ ఇక్కడ ఉన్నారు అందరం ఫోటోలు తీసుకొన్నాం. మొకరాలవారు గరివిడిలో మా అన్నగారమ్మాయి శ్రీ మతి వేదవల్లి రామకృష్ణ దంపతులకు బాగా పరిచయం ఉన్నవారేనట.

లావణ్య తల్లి శ్రీమతి పసుమర్తి లక్ష్మి 52 ఏళ్ళ క్రితం మోపిదేవిలో నా శిష్యురాలు ఈ మధ్యనే డా. శ్రావ్యగారింట్లో పరిచయమైంది. ఆమెను చూస్తుంటే ఇదివరకు రేడియోలో వచ్చే కడుపుబ్బ నవ్వించే నండూరి సుబ్బారావు నాగరత్నమ్మల "నాటికి నేడు" నాటిక గుర్తుకొస్తుంది. లక్ష్మికి "శ్రీ సువర్చలా మారుతి శతకం" అందజేశాను. సభలో ఎల్లా విజయకు "శ్రీ సువర్చ లేశ్వర శతకం" ఇచ్చాను. అలాగే ఉయ్యూరు ఊసులు, కాళరాత్రి, డొక్కా రామ్ గారి రెండు కవితా సంపుటాలు ఆసక్తి ఉన్నవారికి ఇచ్చేసి సార్ధకం చేశాను. లావణ్య ఇంట్లో భోజనంలో వంకాయ కూర కాబేజీ కూర టమేటా చట్నీ సాంబారు పెరుగుతో కమ్మని భోజనం. అన్నీ బాగానే ఉన్నాయి. సాధారణంగా నేను కాబేజీ కూరను తినను. దానికి "నీచు కూర" అని పేరు బెట్టాను. అలాగే బీట్ రూట్ కూరను "రక్తం కూర" అంటాను. దాన్నీపెద్దగా తినను. అయితే లావణ్య ఇంట్లో మా శిష్యురాలు లక్ష్మి కాబేజీ కూర బాగా చేసింది. ఇష్టంగా తిన్నాను. సాంబారూ మహా రుచికరంగా ఉంది. మా అమ్మాయి బీట్ రూట్ కూర బాగా చేస్తుంది. అప్పుడు కాస్త రుచి చూస్తా. లావణ్య మా శ్రీమతికి, మా అమ్మాయికి చీర జాకెట్ పెట్టి ఆశీస్సులు పొందితే మా శిష్యురాలు లక్ష్మి కవర్‌లో డబ్బు పెట్టి నన్ను బట్టలు కొనుక్కోమని చెప్పింది. వాళ్ళ అబ్బాయికి సంతానం కలగటానికి మా శ్రీ సువర్చలాన్జనేయ దేవాలయంలో వారి పేరు మీద అర్చన చేయించమని మరి కొంత డబ్బు పెట్టింది. తప్పక చేయిస్తాను అన్నాను. శర్మగారు, లక్ష్మి, సనత్‌లు వాళ్ళ ఫోన్ నంబర్లు నాకు ఇచ్చి నా నంబర్ నోట్ చేసుకొన్నారు. ఇంటికి చేరేసరికి రాత్రి 10.30 అయింది. ఇలా మధ్యాహ్నమంతా సత్కాలక్షేపం తీపి గుర్తులు మిగిల్చింది.

ఇక్కడి వీక్లీ అమెరికా 27 దీనితో పూర్తి చేస్తున్నాను. మిగిలిన రోజుల విశేషాలు ఇండియా వెళ్ళాక రాస్తాను.

గాంధీ జయంతి శుభాకంక్షలతో...

(2-9-17-కాంప్ షార్లెట్-అమెరికా)

## వీక్లీ అమెరికా-28 (2-10-17 నుండి 8-10-17 వరకు) మొదటిభాగం

## "సఫల షార్లెట్ యాత్ర" వారం- మొదటి భాగం

2-10-17 -సోమవారం- మహాత్మా గాంధీజీ జయంతి. మా అల్లుడు

కంపెనీ పనిపై లీడ్ పాత్ర పోషిస్తూ ఫిలడెల్ఫియా వెళ్ళాడు. మా ఇద్దరు బుడ్డి మనళ్ళు చి॥ ఆశుతోష్, పీయూష్ ఆదివారం కార్యక్రమానికి అలసి సొలసి జలుబుతో బాధపడి స్కూల్‌కు దుమ్మా కొట్టారు. పెద్దవాడు చి॥ శ్రీకేత్ వెళ్ళాడు.

వీక్లీ అమెరికా 27 రెండు భాగాలు రాశాను. శ్రీ డొక్కా రామ్ గారు చదివి చాలా సంతోషించి మెయిల్ "మొయిలు" (మేఘం) సందేశం పంపారు. అందులో వారు సరసభారతికి ఎప్పుడు ఏరకమైన సహాయ సహకారాలు కావాల్సి వచ్చినా చేయటానికి సిద్ధంగా ఉన్నానమని తెలియజేశారు. సమాధానంగా ధన్యవాదాలు చెప్పి సరసభారతి కార్యక్రమాల కోసం ఎవరినీ డబ్బు అడగదని చందాలు వసూలు చెయ్యం అని రసీదు పుస్తకాలు లేవని, ఎవరైనా సరసభారతి చేసే కార్యక్రమాలు బాగున్నాయని భావించి విరాళం ఇస్తే దానిని లేక శ్రీ సువర్చలాంజనేయ స్వామికి "భక్తిగా సమర్పించిన దానిని మేము ముద్రించే పుస్తకాలలో" సరసభారతి ముద్రిస్తున్న గ్రంథాలకు విరాళాలు అందజేసిన వదాన్యులకు కృతజ్ఞతలు" అని రాసి వారి పేరు, ఊరు, సమర్పించిన ధనం రాస్తామని తెలియజేశాను. అలాగే వారు అర అన్నపూర్ణ నిరతాన్నదాత గోదావరి డెల్టా ఆపద్బాంధవి వారి కులదైవం కీ॥ శే॥ శ్రీమతి డొక్కా సీతమ్మ గారిపై కార్యక్రమం పెడితే, పేద విద్యార్థులకు స్కాలర్షిప్‌లు ఇవ్వటానికి సిద్ధంగా ఉన్నామని తెలపగా ఇంతవరకు ఆ ఆలోచనలో లేము అని వారు పూనుకొని నిర్వహించమంటే తప్పక చేస్తామని అప్పుడు పారితోషికాలు అందజేయవచ్చునని తెలియజేశాను. వారు మా ప్రయాణం ఫలప్రదం కావాలని ఆకాంక్షించగా కృతజ్ఞతలు తెలియజేశాను. వారికి "గీర్వాణకవుల కవితా గీర్వాణం-2" ఈ శనివారం పోస్ట్‌లో పంపిస్తున్నామని తెలియజేశాను. వారి సౌజన్య వదాన్యతలకు, సంస్కారానికి జేజేలు.

చలపాక ప్రకాష్ గారు "ఆధునిక ప్రపంచ నిర్మాతలు -జీవితాలలో చీకటి వెలుగులు" గ్రంథంలో డిటిపి చేసిన 201-పేజీ నుండి 250 పేజీల వరకు పంపిన వాటిలో తప్పులు సరిచేసి మెయిల్‌లో పంపాను.

రాత్రి మా అమ్మాయి విజ్జి మా లగేజ్ అంతా జాగ్రత్తగా ఉండాల్సిన బరువుకు కొద్దిగా అటూ ఇటూగా సర్దేసింది. సాయి పవన్ మన షార్లెట్ కార్యక్రమాలను "గొట్టం"లో పెట్టి లింక్ పంపాడు. మా అబ్బాయి రమణ అందరికి దీన్ని మెయిల్ ద్వారా తెలియజేశాడు.

3-10-17 మంగళవారం- నిత్య సంధ్యావందనం, పూజాదికాలు అయ్యేసరికి ఉదయం 9 అయింది.

ఉదయం నా ఆత్మీయులు సరసభారతి శ్రేయోభిలాషి శ్రీ మైనేని గోపాల కృష్ణగారికి, గీర్వాణం-3 అంకితం అందుకో బోతున్న డా. శ్రీ బందారు రాధాకృష్ణమూర్తి,

శ్రీమతి డా. సులోచన దంపతులకు, దీనికి స్పాన్సర్ అయిన సులోచన గారి అన్నగారు డా. శ్రీ ఎల్లాప్రగడ రామమోహనరావు గారికీ ఫోన్ చేసి రేపే మా ఇండియా ప్రయాణం అని చెప్పాను. వారు సుఖ ప్రయాణం అంటూ దీవించారు. వీరు నా కంటే "ముదుళ్ళు" అంటే ముదుసలులు అంటే పెద్దవారు. అందుకే దీవించారు అన్నాను. తర్వాత నా అద్దాడ శిష్యురాలు 12 ఏళ్లుగా అమెరికాలో భర్త సంతానంతో ఉంటూ ప్రస్తుతం ఒహాయోలో ఉంటున్న శ్రీమతి కోడూరి పావనికి ఫోన్ చేసి ప్రయాణం విషయం చెప్పగా అప్పుడే తానూ నాకు ఫోన్ చేద్దామని అనుకొంటున్నట్లు చెప్పింది. మన బ్లాగ్‌ను బాగా ఫాలో అవుతుందీపావని. నేను గర్వంగా చెప్పుకొనే శిష్యురాలు పావని.

మధ్యాహ్నం నాటికి నేడు శిష్యురాలు శ్రీమతి పసుమర్తి (కూచిభొట్ల) లక్ష్మి ఫోన్ చేసి మా ప్రయాణం సుఖప్రదంగా జరగాలని కోరుతూ పసుమర్తి భగవంతం మా అమ్మాయి ఫోన్ నంబర్ అడిగితే ఇచ్చానని కాసేపట్లో ఫోన్ చేస్తాడని చెప్పటం, అలాగే అతను మాట్లాడటం ఆతర్వాత అతని చెల్లెలు శ్రీమతి దుర్గ ఫోన్ చేయటం వగైరా అంతా "ఏనాటి అనుబంధమో"లో పూర్తిగా "వాయించిన" సంగతి గుర్తుందిగా.

మధ్యాహ్నం లంచ్ బ్రేక్‌లో మా ఇంటికి వచ్చింది మా అమ్మాయి ఆత్మీయ స్నేహితురాలు శ్రీమతి సురేఖ. "షార్లెట్ సరసభారతి –సాహితీ మిత్రులు" అందించిన దానికి తోడుగా తానూ కొంత ధనం మా శ్రీ సువర్చలాఞ్జనేయస్వామికి కొంతధనం భక్తిగా సమర్పించింది. సాయంత్రం కన్నడం అమ్మాయి శ్రీమతి వేణి వచ్చి చాలా ఆత్మీయంగా సరసభారతికి కానుక ఇచ్చింది. మా అమ్మాయి విజ్జి షార్లెట్ సరసభారతి బృంద సభ్యురాలిగా కొంత, మా దేవాలయానికి కొంత ముట్ట చెప్పింది.

రాత్రి వేలూరి పవన్ శ్రీమతి రాధా దంపతులు వచ్చి ఒక అరగంట సేపు కూర్చుని మాట్లాడారు. పవన్ "అంకుల్" అని పిలవడు బంధువులం కనుక. ఇది నాకు బాగా నచ్చిన విషయం. రాధమాత్రం "అంకుల్" అంటుంది. మిగతా వాళ్ళూ అలానే అంటారు. దీన్ని కాదనలేను. "అంకుల్ ఆంటీ హవా" ప్రవాహ వేగంలో కొట్టుకు పోతున్నాం.

సరే. "నేనెవరినీ గురువుగారూ" అని పిలవను. నన్ను అలా ఎవరు పిలిచినా రాసినా ఇష్టపడను. మొదట్లో సాయిపవన్ "గురువుగారు" అని మెయిల్ రాశాడు. వెంటనే నేను జవాబు రాస్తూ "ఆ పిలుపు నేను పిలవను. ఎవరుపిల్చినా ఇష్టపడను. బాబాయ్ గారనో అన్నయ్యగారనో ప్రసాద్ గారు అనో ఎలాగూ నేను మాస్టర్ హెడ్ మాస్టార్‌నూ కనుక "మాస్టారూ" అనో సంబోధించు. ఇంకా చనువుగా పిలవాలని ఉంటే "ఒరేయ్" అని పిలువు, రాయి. ఇంకా సంతోషిస్తా" అని రాశా. అతనికే కాదు, ఎవరు అలా రాసినా పిలిచినా నా సమాధానాలం అదే. అంతే, అప్పటి నుంచి మళ్ళీ

"గురూ" దూరం అయింది. ఈ మధ్యే రాంకీ కూడా "గురువుగారు" అని మెయిల్‌లో సంభాషణల్లో అంటున్నాడు. బాహుశా ఇది చూసి దాన్ని విరమిస్తాడని భావిస్తా. నేనే కాదు మా నాన్న గారికీ ఇలా అనటం ఇష్టం ఉండేది కాదు. గురుత్వానికి తగిన అర్హత మాట ఏమోకానీ నాకు అది "కంపరం"గా ఉంటుందని గ్రహించ"మనవి". కొంచెం హార్ష్‌గా రాశానని అనుకొంటే మన్నించండి.

రాత్రి 9.30కు శ్రీమతి గోసు (ఊసు) కొండ అరుణ "రైట్ అంకుల్" అని తరచుగా అనే నేను పేరుపెట్టిన "రైట్ అరుణ" దంపతులు వచ్చి ఉడతాభక్తిగా శ్రీ సువర్చలాన్జనేయ స్వామి సేవాకార్యక్రమాలకు భక్తిగా కొంత అమౌంట్ ఇచ్చి వెళ్లారు.

## 4-10-17 బుధవారం-షార్లెట్‌లో చివరి రోజు

ఉదయమే లేచి స్నానాదుల తర్వాత సంధ్యావందనం, పూజా పూర్తి చేసేసరికి 8 అయింది. రాత్రి 12.30కు మా అల్లుడు ఫిలడెల్ఫియా నుంచి వచ్చాడు. షార్లెట్‌లో చివరి రోజు కనుక కొబ్బరికాయ కొట్టి నైవేద్యం పెటా ఫలాలతో బాటు. దేవుడి పూజా విగ్రహాలను పుస్తకాలనూ సర్దేశా. అల్లుడు అవధాని ఎప్పుడు ఆఫీస్‌కు వెళ్ళాడో తెలియదు.

మేము 11.30కే భోజనాలు చేసి సిద్ధంగా ఉన్నాం. దారిలో ఆరాగా ఆరాగా "మేయటానికి" మా శ్రీమతి పులిహోర పెరుగన్నం తయారు చేసి చిన్న చిన్న డబ్బాలలో సిద్ధం చేసింది. చిన్న చిన్న చపాతీలు కారట్ ఆకుకూర వగైరాలతో కలిపి ఒత్తి జిప్ లాగ్‌లలో బంధించింది.

మా అమ్మాయి మధ్యాహ్నం 1.30కే వచ్చేసింది. మధ్యాహ్నం సెలవు పెట్టింది. అంతకు ముందే మా అమ్మాయికి మంచి స్నేహితురాలు సర్వ సమర్ధురాలు మా అమ్మాయిగారింట్లో ప్రతి ఆదివారం, తెలుగు తరగతులు బోధించే ఉపాధ్యాయిని, మాంచి సేవాభావం ఉన్న మా ఆంజనేయస్వామి భక్తురాలు శ్రీమతి రావి ఉష ఎయిర్‌పోర్ట్‌లో మాకు సహాయం చేయటానికి వచ్చింది. ఆమె కూడా "షార్లెట్ సరసభారతి" తరఫున కార్యక్రమాలకు పేద విద్యార్ధుల సహాయానికి కొంత నిధిని, మా "స్వామి" సేవకు, 8వ తేదీ ఆదివారం వాళ్ళమ్మాయి అబ్బాయిల పుట్టినరోజు నాడు వారి పేరిట మా శ్రీ సువర్చలాన్జనేయ స్వామికి ప్రత్యేక పూజ చేయించటానికి కొంత నిధిని అందించింది. ఇలా షార్లెట్ విరాళాల వెల్లువ "మా ప్రయాణంలో చివరి నిమిషం దాకా సాగటం ఆనందాన్ని వారికి సరసభారతి పట్ల ఉన్న అనురాగం మా స్వామి పట్ల ఉన్న అకుంఠిత భక్తికి విశ్వాసానికి మాపై ఉన్న అపారమైన నమ్మకానికి నిదర్శనంగా నిలిచి పోయింది.

ఈ ఉషతో పాటు ఆ ఉషా, రాధా పద్మశ్రీ రాంకీ, జంట పవన్‌లు ఎల్లా విజయ మొదలైనవారందరూ "అంకుల్ మళ్ళీ ఎప్పుడొస్తారు! వేసవికి వచ్చేయండి. మళ్ళీ మన పూజలు అభిషేకాలు, సరసభారతి కార్యక్రమాలు సరదాగా మీ ఆధ్వర్యంలో

చేసుకొందాం" అని చాలాసార్లు అంటూ తమ ఆప్యాయతను ప్రకటించారు. నేను మాత్రం అందరికీ "ఇది సభా ప్రసూతి, వైరాగ్యాల వంటిది. ఎవరు ఉన్నా లేకపోయినా ఎవరు వచ్చినా రాకపోయినా కార్యక్రమాలు చేయండి. మంచిని పెంచండి. రుద్రం చదివిన వారు, నేర్పేవారు, నేర్చుకొనే "క్షుద్ర ఆలోచనలు" దూరం చేసుకోండి. భార్యా పిల్లలతో స్నేహితులతో మంచిగా మర్యాదగా ప్రవర్తించండి. మనసు విశాలమవటానికి ప్రయత్నించండి ఇరుకు మురికి ఆలోచనలకు సంకుచిత భావాలకు స్వస్తి పలకండి. మనమెవరమో తెలుసుకోవటానికి 'ఉపనిషత్తులు' చదవండి" అనే చెప్పాను. రావి ఉష ఇవాళ ఉపనిషత్తుల విషయం ప్రస్తావించి అవి ఎక్కడ దొరుకుతాయో అడిగి తెలుసుకున్నది నాకు ఇది మంచి సంతృప్తి నిచ్చిన విషయం.

ఇంకొక పావు గంటకు బయల్దేరుతామను కొంటుంటే మా అమ్మాయి వాళ్ళ ప్రక్కింట్లో ఉన్న రవి తలిదండ్రులు (హైదరాబాద్ వాస్తవ్యులు-5 ఏళ్ళ క్రితం ఇక్కడే పరిచయం అయిన వారు) శ్రీ రాఘవేంద్రరావు గారు శ్రీమతి సుగుణ కామాక్షి దంపతులు, వారింట్లో ఉన్న నృత్య దర్శకులు 8వ తేదీ ఆదివారం "కీచక వద్ద" కూచిపూడి నృత్యనాటకం దర్శకులు కీచకపాత్ర దారి శ్రీ పసుమర్తి వెంకటేశ్వర శర్మగారు, ఎల్లా విజయ కూడా వచ్చి మాకు వీడ్కోలు పలికారు అందరం కాఫీ తాగి ఫోటోలు దిగాం. మా అమ్మాయి సెల్‌లో ఫోటోలు తీశారు. అందరికి పంపే ఉంటుంది. ఇంత సందడి, సరదా వాతావరణంలో సరిగ్గా మధ్యాహ్నం 3.15 గంటలకు మా అమ్మాయి కారులో నేనూ మాశ్రీమతి ప్రభావతి శ్రీమతి రావి ఉషా షార్లెట్ విమానాశ్రయానికి బయల్దేరి 3.35కు ఎయిర్ పోర్ట్ చేరాం. మా అమ్మాయి కారు పార్క్ చేసి వచ్చేసరికి మేము చెకిన్‌లో నుంచుని బాగేజ్ ఇచ్చాం కొద్దిగా బరువు ఎక్కువైతే ఎయిర్ పోర్ట్‌ఆవిడే వాటిని మా హాండ్ లగేజిలో సర్దేసి ఫ్లయిట్‌లో సిబ్బందికి ఇస్తే టాగ్ వేసి తీసుకొని దిగేటప్పుడు ఇస్తారని చెప్పింది ఉష సర్దుతుండగా మా అమ్మాయి కూడా వచ్చి సాయం చేసి అంతా సరిపోయేట్లు సర్దింది. ఏది తీయాలో ఏది పెట్టాలో దానికే తెలుసు. మేమిద్దరం "ఉత్త" ఉత్స విగ్రహాలమే". అంతా అయేసరికి టైం ఇంకా 3.50. నా శాంసంగ్ మొబైల్‌లో ఉష ఎయిర్ పోర్ట్ వై.ఫై కనెక్ట్ చేసి రెడీ చేసి ఇచ్చింది. దీనితో మెసేజెస్ హాయిగా పంపుకోవటానికి వీలు చేసింది. సరే వాళ్లిద్దరూ మాకు బై చెప్పి వెళ్లిపోయారు. "తోపుడు బళ్ల వాళ్ళు" వీల్ చైర్ వాళ్ళు రెడ్డిగా వచ్చి మమ్మల్ని కూర్చోబెట్టి తోసుకొంటూ కస్టమ్స్ చెకింగ్ చేయించి ఏ ఇబ్బందీ లేకుండా విమానం ఎక్కించారు. సరిగ్గా సాయంత్రం 6 గంటలకు ఫ్లయిట్ బయల్దేరింది. ఇక్కడి నుంచి బోస్టన్, అక్కడి నుంచి ఎమిరేట్స్ ఫ్లయిట్‌లో దుబాయ్, అక్కడి నుంచి హైదరాబాద్. మిగిలిన విషయాలు తర్వాత రాస్తా -ఏప్రిల్ 6న షార్లెట్ చేరి 6 నెలల తర్వాత అక్టోబర్ 6న మళ్ళీ ఐడియా చేరుతున్నాం.

నిద్ర పట్టక రాత్రి 1.30కి లేచి కూర్చుని ఈ వీక్లీ మొదటి భాగం రాసి మెయిల్ చేసేసరికి టైం తెల్లవారుఝాము 5 గంటలయింది. నిద్ర బదులు "ఈ రుద్దుడు". (7-10-17-కాంప్-మల్లాపూర్-హైదరాబాద్)

## వీక్లీ అమెరికా-28 (చివరిభాగం)

(2-10-17 నుండి 8-10-17) -రెండవభాగం (చివరి భాగం)

### సఫల షార్లెట్ యాత్ర- రెండవభాగం (చివరిభాగం)

4వ తేదీ బుధవారం రాత్రి 8 గంటలకు బోస్టన్‌కు ఫ్లయిట్‌లో చేరాం. అక్కడి నుంచి ఎమిరేట్స్ ఫ్లయిట్‌లో దుబాయ్ వెళ్ళటానికి అన్నీ ఫార్మాలిటీస్ పూర్తియై తెచ్చుకున్న పులిహోర, పెరుగన్నం తిని గేట్ వద్ద సిద్ధంగా ఉన్నాం. అక్కడ కేరళ వెళ్లే ఆయన దగ్గర సెల్ తీసుకొని మా అమ్మాయికి సమాచారం తెలియజేశాను. రాత్రి 11 గంటలకు దుబాయ్‌కి విమానం బయల్దేరింది. నా పక్కన ఇస్కాన్ ఆయన కూర్చున్నాడు. వీలైనప్పుడల్లా జపమాలతో జపం చేసుకొంటున్నారు. దుబాయ్‌లో దిగే దాకా అంటే 11 గంటలపాటు ఆయన సీట్‌లో నుంచి లేవలేదు. ఆశ్చర్యమేసింది. విమానం-50 సెంటీగ్రేడ్ డిగ్రీలలో సుమారు భూమినుండి 30 వేలకు నుంచి 50 వేల అడుగుల ఎత్తులో యావరేజ్‌గా గంటకు 950 కిలోమీటర్ల వేగంతో ప్రయాణం చేసింది. నాముందున్న బుల్లితెరపై విమానం పోకడ హాస్య చిత్రాలు చూస్తూ గడిపాము. నిద్ర పట్టలేదు. "గాలి కన్యలు" ఏవేవో తినటానికి తాగటానికి ఇస్తూనే ఉన్నారు. ఏవీ సయించలేదు. కాఫీ మాత్రం తాగాము. ఆపిల్, మాంగో జ్యూసి అడిగి తాగాం. దుబాయ్ చేరేసరికి రాత్రి 7 అయింది. వీల్ చెయిర్ లాగటానికి ఒక ఆఫ్రో అమెరికన్ అమ్మాయి ఒక అమెరికన్ అమ్మాయి వచ్చారు. ఒకచోట లిఫ్ట్‌లో వెళ్ళాలిసొస్తే అక్కడ అమెరికామ్మాయి నన్ను ఆవిడ మీకేమవుతుంది అని అడిగితే భార్య అన్నాను. పెళ్లి అయి ఎన్నేళ్లయింది అని అడిగితే 53 ఏళ్ళయిందన్నాను బోల్డు ఆశ్చర్యపోయి "ఓ మైగాడ్" అంది. తర్వాత "ఈవిడ మీకు ఎన్నవ భార్య?" అని అడిగితే నాకు దిమ్మతిరిగి మైండ్ బ్లాక్ అయి "నా ఏకైక భార్య" అన్నాను. మళ్ళీ మరింత ఆశ్చర్యపోయి "ఓ వాట్ ఏ గ్లోరియస్ థింగ్. వి ఆర్ వెరీ వెరీ హాపీ టు హియర్ దిస్ న్యూస్" అంటూ "విష్ యు వెరీ లాంగ్ హాపీ మ్యారీడ్ లైఫ్" అని మనసారా శుభాకాంక్షలు తెలిపింది. అంటే పాశ్చాత్య దేశాలలో దాంపత్యాలు క్షణ భంగురాలు అని ఇంతకాలం మేమిద్దరం భార్యాభర్తలుగా జీవించటం వాళ్లకు అమితమైన ఆశ్చర్యాన్ని కలిగించింది. అందుకే నిండుమనసుతో శుభాకాంక్షలు తెలిపారు ఆ ఇద్దరూ. ఇక్కడ నాకొక చిన్న జోక్ జ్ఞాపకం వచ్చింది. దీన్ని దసరా సరదాల్లో చెబుదామనుకొని మర్చే పోయాను.

ఒక అమెరికన్ ఆయన ఒక హాలీవుడ్ నటిని ప్రేమించి పెళ్లి చేసుకొన్నాడు. ఆమెకు ఎన్నో పెళ్ళో ఆయనకు ఎన్నోపెళ్ళో వాళ్ళిద్దరికే తెలీదు మనకెందుకు. పెళ్లైన నాలుగు రోజులకే భార్య కొత్త భర్తతో "హానీ! మనం హనీమూన్‌కు ఆఫ్రికా వెడదాం అక్కడ సఫారీ బాగుంటుంది" అంది బుగ్గమీద ముద్దు ముద్ర వేస్తూ. వీడి గుండె జారి గల్లంతైంది. డియర్! ఇప్పుడిప్పుడే డబ్బు కూడా బెడుతున్నా. హానీమూన్ అంటే చాలాఖర్చు కదా" అన్నాడు. ఆమె "చిలిపి డియర్. మా లాంటివాళ్లకు హానీమూన్‌లు రెండేళ్లకో మూడేళ్లకో కదా వచ్చేది. కాదనకు హానీ" అంది గోముగా. వీడు ఆమాటలకు ఐసై పోయి హనీమూన్ చేసి దాచిన డబ్బంతా ఐస్ లాగా కరగించుకొన్నాడట. దుబాయ్‌కి రాత్రి 7 గంటలకు చేరింది. హైదరాబాద్ ఫ్లయిట్ రాత్రి 10 గంటలకు. లాగుడు బళ్ల వాళ్ళు రెడీగా ఉన్నారు. కస్టమ్స్ చెకింగ్ నిమిషాలమీద చేయించారు. ట్రెయిన్‌లో లిఫ్ట్ లమీద తీసుకొని వెళ్లి చివరికి హైదారాబాద్ విమానం గెట్ దగ్గర కూర్చోబెట్టారు. ఆవిడకి వీల్ చైర్ దొరికింది. నాకు లేదు. "గోవు వెంట దగులు కోడె భంగి" ఆవిడ వెంటే నడిచాను. ఈ వీల్ చైర్ కుర్రాడు చాలా మంచివాడు. విమానం ఎక్కబోయేముందు మా ఆవిడ రెస్ట్‌రూమ్‌కు వెడుతుంటే నడవనివ్వకుండా తీసుకొని వెళ్లి బయట ఉండి మళ్ళీ చైర్‌లో తీసుకొచ్చిన సౌజన్యశీలి. సేవాధర్మానికి ప్రతీక. ఫ్లయిట్ ఎక్కించిన తర్వాత డబ్బు ఇద్దామని జేబులో చేయిపెడుతుంటే ఇంగ్లిష్‌లో వద్దు అని మర్యాదగా చెప్పి, "విష్ యు హాపీ జర్నీ" అన్న సంస్కారి. షార్లెట్ నుంచి దుబాయ్‌లో హైదరాబాద్ విమానం ఎక్కేదాకా ఎవరూ మమ్మల్ని డబ్బులు అడగలేదు. డాలరుకూడా ఖర్చుచేయకుండా అమెరికా నుంచి హైదరాబాద్ చేరాం. ఉదయం 3 గంటలకు హైదరాబాద్‌లో దిగాం. ఇండియన్ పాస్‌పోర్ట్ వాళ్లకు ఇమ్మిగ్రేషన్ హడావిడి లేదు. కస్టమ్స్ చెకింగ్ కూడా నిమిషాలమీద జరిపించాడు వీల్ కుర్రాడు. నేను తెచ్చిన డాలర్లను రూపాయలలోకి ఎక్స్ఛేంజిలో మార్చేశా. డాలర్‌కు 60 రూపాయల వంతున ఇచ్చారు. బాగేజ్ క్లెయిమ్‌కు వెడుతుంటే శాల్తీకి వందరూపాయలు కట్టాలన్నారు. కట్టి రసీదు తీసుకొన్నాం. మా లగేజ్ తేలిగ్గా గుర్తుపట్టీసుకొని మా పెద్దబ్బాయి శాస్త్రికి ఫోన్ చేయగానే వాడు ఎయిర్‌పోర్ట్‌లోనే ఉన్నామని చెప్పాడు. సామాను తీసుకొని బయటకు రాగానే వాడు వాడిబాస్ బామ్మర్ది ప్రతాప్ గారి కారుతో వచ్చాడు. ప్రతాపిగారే ఏప్రిల్‌లో మమ్మల్ని అమెరికా విమానం ఎక్కించటానికి కారులో తీసుకొచ్చారు. మళ్ళీ ఆయనే. అప్పుడూ ఇప్పుడూ రూపాయి ఖర్చులేదు. సామాను కారులో ఎక్కించి 4.40కి బయల్దేరి మల్లాపూర్‌లో మా అబ్బాయి ఇంటికి 6వ తేదీ శుక్రవారం 5.45కు చేరాం. ఏప్రిల్ 6 బయల్దేరి 6 నెలల తరవాత అక్టోబర్ 6కు చేరాం. విమానంలో తిండి పేరుతో ఏదో చెత్త పెడతారు. దాదాపు 80 శాతం మంది ఏదీ తినరు. అంతా వేస్టే. దీనిపై

అధ్యయనం చేస్తే ఎన్నో విషయాలు బయటపడతాయి. చక్కగా బెజవాడ బాబాయ్ హోటల్ నుంచి ఇడ్లీ కారప్పొడి, రాజమండ్రి వరదరాజు హోటల్ నుంచి పేపర్ అట్టు, కాకినాడ నుంచి కాజాలు, శరవణ భవన్ నుంచి సాంబారు, ఉడిపి హోటల్ నుండి ఊతప్పం, పొంగల్, మరాటా కేఫ్ నుంచి పూరీ, చపాతీ, కూరా తెప్పించి పెట్టచ్చుగా అనిపిస్తుంది.

6-10-17-శుక్రవారం- దంతధావనాదులు పూర్తి చేసి కాఫీ స్నానం చేసి మాకోడలు సమత చేసిన పెసరట్లు తిని హాయిగా కడుపు నిండిందని సంతోషించా. విమానాలలో తిన్నది 10 శాతం పారేసింది 90 శాతం. ఉసూరుమనిపించింది. మాకోడలు స్కూల్‌కు మనవడు భువన్ కాలేజీకి ఉదయం 8కే వెళ్లారు. నెట్‌లో పోస్ట్ చూసి కాసేపు నడుం వాల్చా. నిద్ర పట్టలేదు. 12 గంటలకు భోజనం చేసి కాస్త పడుకున్నా. గబ్బిట గిరిజ ఫోన్ చేసింది. మధ్యాహ్నం 3 గంటలకే లేచి షార్లెట్‌లో నాకు డబ్బులు డాలర్‌లలో ముట్టజెప్పినవారి లిస్ట్, వారెంత ఇచ్చిందో రూపాయలలో తయారు చేశా. మా అక్కయ్య భావలకు ఆదివారం ఉదయం వాళ్ళ ఇంటికి వస్తామని, అక్కడి ఉంది మా రెండవబ్బాయి శర్మ ఇంటికి మధ్యాహ్నం భోజనానికి వస్తామని మా కుటుంబ డాక్టర్ చి॥ యాజికి మంగళవారం మధ్యాహ్నం హెల్త్ చెకప్‌కు వస్తామని తెలియజేశాను. శ్రీ పసుమర్తి శర్మగారికి శ్రీ రేమెళ్ళ అవధానిగారికి ఆదివారం సాయంత్రం వారిని కలుస్తానని ఫోన్‌లో తెలియజేశాను.

షార్లెట్‌లో నాకు డబ్బు అందజేసినవారు- చెన్నై వెళ్ళిపోతూ శ్రీ మతి వీటూరి పద్మజ మా సువర్చలాన్జనేయస్వామికి ఇచ్చింది (ఇదే బోణీ), గ్రంధి హరి గారింట్లో రఘు గారింట్లో మాలిని గారింట్లో నాగరాజు గారింట్లోలో రుద్రాభిషేకానికి ఇచ్చిన తాంబూలాలూ, వేలూరి పవన్ ఇంట్లో పుణ్యాహవాచనం, సత్యనారాయణ వ్రతంలలో ఇచ్చిన తాంబూలం, రాంకీ ఇంట్లో వ్యాసజయంతి నాడు, పవన్ ఇంట్లో వ్రతం నాడు, అతని భార్య ఉష అట్లతద్దినాడు ఇచ్చిన తాంబూలాలూ, నా పుట్టిన రోజుకు మైనేని గారు పంపినది, కారీలో డా. భండారు దంపతులు ఇచ్చిన తాంబూలం, మా అన్నయ్యగారి మనవడు హరి ఇచ్చినది, మా మనవడు సంకల్ప్ ఇచ్చింది, సాయి ఇంట్లో రుద్రానికి, పవన్ ఇంట్లో వ్రత సమయంలో ఇచ్చన తాంబూలాలూ, మౌంట్ సోమా అర్చక దంపతులు ఇచ్చిన తాంబూలం, గోసుకోండ అరుణ దంపతులు, రావి ఉషా, సురేఖ వేణి మా అమ్మాయి ఇచ్చింది అంతా రూపాయలలో లిస్ట్ తయారు చేశా. ముద్రించబోయే "ఆధునిక ప్రపంచ నిర్మాతలు -జీవితాలలో చీకటి వెలుగులు" గ్రంథంలో దాతల లిస్ట్‌లో ప్రచురిస్తాం. ఈ ధనాన్ని అవసరం మేరకు స్వామి సేవకు, గ్రంథ ముద్రణకు వాడుతాం. దీనినీ ఫిక్సెడ్ డియాజిట్‌లో వేస్తాం.

## షార్లెట్ సాహితీ మైత్రీ బంధం

2-షార్లెట్‌లో సరసభారతి నిర్వహించిన దసరా సరదా సాహితీ కదంబంలో కవర్‌లో పెట్టి సరసభారతికి కానుకగా, పేద విద్యార్థులకు స్కాలర్ షిప్ కోసం అందించిన, మీకు 2వ తేదీ తెలియజేసిన 726 డాలర్లతో పాటు మా అమ్మాయి, రావి ఉష, అరుణ, సురేఖ ఇంటివద్ద అందజేసిన దానితో కలిసి 1,000 డాలర్లు. అంటే 60 000 రూపాయలు. దీన్ని నేను ఉయ్యూరు వెళ్ళగానే నెలనెలా వడ్డీ వచ్చేట్లు ఫిక్సెడ్ డిపాజిట్ చేసి, దానిపై వచ్చే వడ్డీని అవసరమైన అర్హులైన చదువుకొనే విద్యార్థులకు స్కాలర్షిప్‌లను "షార్లెట్ సరసభారతి" తరఫున ఇచ్చే ఏర్పాటు చేస్తాను. ఒకవేళ అత్యవసరంగా నెలవడ్డీకి మించి ఇంకా ఎక్కువ డబ్బు ఇవ్వవలసివస్తే నేనే ఇచ్చి తర్వాత అసలులో తగ్గించే ఏర్పాటు చేస్తా. ఒకవేళ ఇంకెవరైనా ఉపకారవేతనాలు సరసభారతి ద్వారా ఇవ్వాలనిపించి పంపితే, ఫిక్సెడ్ డిపాజిట్‌లో చేరుస్తాం. అంతవరకూ అసలు తీయకుండా వడ్డీనే వాడుతాం. ప్రస్తుతానికి ఇదీ నా ఆలోచన. ఇంత డబ్బు నా దగ్గర ఉంచటం మంచిదికాదు అనే ఈ ఏర్పాటు.

రాత్రి నిద్ర పట్టక పోతే 1.30కే లేచి 5 గంటలదాకా వీక్లీ మొదటిభాగం రాసిన సంగతి మీకు తెలుసు.

7-10-17 శనివారం- మేమిద్దరం షుగర్ టెస్ట్ చేయించుకొన్నాం. సాయంత్రం కాఫీ పొడి, స్వీట్లు కొని 11వ తేది రాత్రి బస్‌కు ఉయ్యూరుకు టికెట్లు బుక్ చేశా. సాయంత్రం కృష్ణాజిల్లా నందమూరు అంటే ఎన్.టి రామారావు గారి స్వగ్రామంలో జూనియర్ రెసిడెన్షియల్ కాలేజీ ప్రిన్సిపాల్‌గా పని చేసిన శ్రీ సీతాపతి గారు ఫోన్ చేసి తానూ రిటైర్ అయ్యానని, తూర్పుగోదావరి జిల్లాలో తమ స్వగ్రామం వెదుతున్నామని, నేను పంపిన సరసభారతి పుస్తకాలన్నీ చదివానని అవి చాలా విలువయినవని రిఫరెన్స్ పుస్తకాలనీ చెప్పారు. మంచి హృదయం ఉన్నవారు. నాకు మంచి మిత్రులు. ఇద్దరం కృష్ణాజిల్లా రచయితల సంఘంలో క్రియా శీలకంగా పని చేసినవాళ్ళం. సంఘం ప్రచురించిన తెలుగుపసిడి వజ్రభారతి మొదలైన రిఫరెన్స్ గ్రంథాలలో విలువైన వ్యాసాలను రాసాం. రెసిడెన్షియల్ కాలేజీ సర్వతోముఖాభివృద్ధికి తీవ్రంగా కృషిచేసిన సమర్థుడైన ప్రిన్సిపాల్ ఆయన. తమ చిరునామా మెయిల్ చేస్తే సరసభారతి త్వరలో ప్రచురించబోయే 3 పుస్తకాలను పంపిస్తాను అని చెప్పాను.

### మా అక్కయ్య బావగార్ల ఇంటికి

8-10-17-ఆదివారం- ఉదయం 9.30కు కాబ్‌లో మేమిద్దరం మా మనవాడు భువన్ ఓల్డ్ బోయినపల్లిలో ఉన్న మా చిన్నక్కయ్య శ్రీమతి దుర్గ, మాబావగారు శ్రీ వేలూరి వివేకానంద్ గారింటికి వెళ్లి, కాఫీ తాగి అమెరికానుంచి మా చిన్నమేనల్లుడు శాస్త్రి ఫోన్ చేస్తే మాట్లాడి మా పెద్దమేనల్లుడు అశోక్ కూడా ఇక్కడికే వస్తే చూసి,

ఫోటోలు దిగి, 11.30కు మళ్ళీ కాబ్‌లో మేం ముగ్గురం బాచుపల్లిలోని మా రెండవ అబ్బాయి శర్మ ఇంటికి చేరాం. భోజనం చేసి కాసేపు పడకపై దొర్లా.

## శ్రీ పసుమర్తి శర్మగారిని 40 ఏళ్ల తర్వాత చూడటం

మధ్యాహ్నం 3.30కు మా అబ్బాయి కారులో నేనూ మా మనవాళ్ళు హర్ష, భువన్ అమీర్‌పేటలో ఉన్న 1963లో నాతోపాటు మోపిదేవి హైస్కూల్ సోషల్ మేష్టారు పెదప్రోలు వాసి మంచికి సహృదయతకు, సౌజన్య సౌశీల్యాలకు నిలయం నా శ్రేయోభిలాషి. నాకు మార్గదర్శి అయిన 90 ఏళ్ళ జ్ఞాన వయోవృద్ధులు. శ్రీ పసుమర్తి సీతారామ శర్మగారి అబ్బాయి శాస్త్రి గారింట్లో దాదాపు 40 ఏళ్ల తర్వాత మళ్ళీ శర్మ గారిని చూశాను. వినికిడి కొద్దిగా తగ్గింది కాని ఆయనకు షుగర్ బిపిలు లేవు. చక్కని ఆరోగ్యంతో ఉన్నారు. కంటి చూపు ఏమీ తగ్గలేదు. వారబ్బాయి శ్రీ ఉమామహేశ్వర శాస్త్రిగారు కోడలుగారు ఎంతో ఆత్మీయంగా మర్యాదగా, సకల సౌకర్యాలు కలిగించి ఇరవైనాలుగు గంటల నర్సు సహకారంతో ఓర్పుగా చూసుకొంటున్నారు. ప్రక్కనే ఇండో యు ఎస్ మల్టీ స్పెషాలిటీ హాస్పిటల్ ఉంది. ఏమాత్రం తేడా వచ్చినా అక్కడ చేర్పించి చక్కని వైద్యం అందిస్తున్నారు. శర్మగారు దేవునితో సమానం. శర్మ గారికి కొడుకు కోడలు చేస్తున్న పితృసేవ అందరికీ ఆదర్శంగా ఉంది. నిష్కల్మష మనస్కులు. విశుద్ధ వర్తనులు గొప్ప సహాయకారి. నన్నూ లెక్కల మేస్టారు రమణారావు గారినీ పెదప్రోలులో వారింట్లో నెల రోజులు మాకు సకల రాజ లాంఛనాలతో వసతి, భోజనం, కాఫీ టిఫిన్లు పెట్టి పెళ్లి కొడుకులను చూసినట్లు మేపి మర్యాదగా చూశారు. ఆయన మాట అంటే మాకు శిరోధార్యం. పడమట హైస్కూల్ హెడ్ మాస్టర్‌గా రిటైర్ అయ్యారు. కృష్ణాజిల్లా టీచర్స్ గిల్డ్‌కు మేమందరం కలిసివారిని ఏకగ్రీవంగా అధ్యక్షులను చేసాం. నిష్కర్షత నిర్భీకత వారి సహజ లక్షణాలు జిల్లాలో పేరెన్నికగన్న హెడ్ మాస్టర్‌గా పేరు పొందినవారు. నేను రాస్తున్న "నా దారి తీరులో" గెలాక్సీ ఆఫ్ హెడ్ మాస్టర్స్"లో శర్మగారి గురించీ రాసిన సంగతి మీకు తెలుసు. శర్మగారిని నేను నూతన వస్త్రాలు, ఫలాలు సమర్పించి సరసభారతి పుస్తకాలను అందజేశాను. నేను వారింటికి రావటం తనకు మహదానందంగా ఉందని నలభై ఏళ్లతర్వాత మళ్ళీ కలుసుకోవటం అపూర్వమైన విషయమని అన్నారు. దీనికంతటికి కారణం షార్లెట్‌లో నాకు పరిచయమైన నా శిష్యురాలు శ్రీమతి పసుమర్తి లక్ష్మి.

భువన్‌ను బస్ ఎక్కించి మల్లాపూర్ పంపించి మేము మధురానగర్‌లో ఉన్న డా. రేమెళ్ళ అవధానులు గారింటికి వెళ్లాం. వారు మాకోసం ఎదురు చోస్తున్నారు. వారికీ నూతన వస్త్రాలు ఫలాలు సమర్పించి "గీర్వాణకవుల కవితా గీర్వాణం-2" రెండవ భాగం, మాఅన్నయ్య, దైవ చిత్తం, సువర్చలేశ్వర శతకం అందజేశాను. ఆయన

కూడా ఎంతో సంబరపడిపోయారు. ఫోటోలు తీయించుకొన్నారు మాతో. నాకు వారే పాదాభివందనం చేయటం వారి సంస్కారానికి నిదర్శనం. వయసురీత్యా నేను పెద్దకావచ్చు కానీ సంస్కృత, సాహిత్య, వేద గణిత వేదం విజ్ఞానాలలో వారికి సాటి లేనివారు లేరు. నవంబర్ 11, 12 తేదీలలో అఖిల భారతీయ సంస్కృత సెమినార్ నిర్వహిస్తున్నామని నన్ను తప్పక హాజరవమని చెప్పి ఆహ్వానపత్రం ఇచ్చారు. "నేను సంస్కృత పండితుడిని, కవిని కాదుకదా" అన్నా. వారు "నేను సంస్కృతంలో ఏం కృషి చేశాను. దానిపై ఉన్న అభిమానమే చాలు, రండి" అన్నారు. సరేనన్నాను. వారు ఇటీవల ముద్రించిన రెండు విలువైన గ్రంథాలు "భారతీయ గణితశాస్త్ర చరిత్ర మొదటి, రెండవ భాగాలు ఒక్కొక్కదానిలో వెయ్యి పేజీలున్న ఒక్కొక్కటి 750 రూపాయలున్న గ్రంథాలను నాకు ఆప్యాయంగా బహూకరించారు. ఇంతటి విలువైన రిఫరెన్స్ గ్రంథాలు నాకు లభించటం నా అదృష్టం, పూర్వ జనం సుకృతం వారి సౌజన్యం. అవధాని గారి మిత్రులు శ్రీ మూర్తిగారినీ ఇక్కడ కలవటం యాదృచ్ఛికం. అవధానిగారు ఉయ్యూరులో కెమిస్ట్రీ లెక్చరర్ శ్రీ జోస్యుల నాగేశ్వరరావుగారికి దగ్గర బంధువట. ఫ్లోరా స్కూల్‌కు 2014లో వచ్చి మాట్లాడారట. మరొక గొప్ప వ్యక్తితో పరిచయం కలగటం నా అదృష్టం వీరి గురించి గీర్వాణం-3 రాశాను. అక్కడి నుంచి బాచుపల్లి ఇంటికి చేరే సరికి రాత్రి 8.30 అయింది. ఇలా ఈ ఆదివారం సార్థకమైంది.

ఈ విధంగా మా షార్లెట్ యాత్ర- అయిదవ అమెరికా ప్రయాణం సఫలమైంది. సాహిత్య సంగీత, ఆధ్యాత్మిక కార్యక్రమాలతో ఎందరో మిత్రుల పరిచయంతో, పూర్వపు వారి పరిచయాలతో యాత్ర సంపూర్ణమైంది. అయితే ఒక్కటే లోపం. మొదటి నాలుగు యాత్రలో ప్రతిసారీ కనీసం 300 ఆంగ్ల పుస్తకాలు చదివి వాటిపై నోట్స్ ప్రతిసారీ కనీసం 200 పేజీలు రాశా. అంటే కనీసం 1200 పుస్తకాలు చదివి 800 పేజీల నోట్స్ రాశా. ఈసారి ఎందుకో లైబ్రరీ మీద ఆసక్తి తగ్గింది కేవలం 40 పుస్తకాలే చదివా. కానీ "వ్యాఖ్యాన చక్రవర్తి కోలాచలం మల్లినాథ సూరి మనీష" నెట్‌లో రాసి పూర్తి చేశా. గీర్వాణం-3లో ఇక్కడికి వచ్చి సుమారు 350 మంది సంస్కృత కవులపై రాశా. ఆధునిక ప్రపంచ నిర్మాతలు డిటిపి ప్రూఫ్ రీడింగ్ చేసి తప్పులు సవరించా. స్వామి రామ్ రాసిన "హిమాలయన్ మాస్టర్స్" ఆధారంగా ఒక 8 విలువైన ఆర్టికల్స్ రాశా. ఆస్ట్రో ఫిజిక్స్‌పై నాలుగు వ్యాసాలు రాశా. ఇవి మాత్రమే కాస్త ఊరడింపు. అన్నిటికిమించి "వీక్లీ అమెరికా" శీర్షికతో వారం వారం విషయాలను 28 భాగాలుగా రాశా. నాల్గవసారి 2012లో షార్లెట్ వచ్చినప్పటి అనుభవాలను "అమెరికా వీక్లీ"గా ప్రతివారం రాసి 28 భాగాలు రాశా. ఈ రెండు కలిపి పుస్తకంగా తెస్తే మంచి ఉపయుక్త సమాచార యాత్రా సాహిత్య గ్రంథమే అవుతుంది. సుమారు 130 పేజీలు

రావచ్చు. ఆసక్తి ఉన్న స్పాన్సర్ దొరికినపుడు ఆలోచించవచ్చు.

షార్లెట్‌లో మా దంపతులను అభిమానించి ఆదరించి ఆప్యాయతా ఆదరణ ఆత్మీయత చూపిన వారందరికీ ధన్యవాదాలు. ముఖ్యంగా మమ్మల్ని ఇక్కడికి ఇన్నిసార్లు తీసుకొని వచ్చిన మా అల్లుడు కోమలి సాంబావదాని మా అమ్మాయి చి. సౌ. విజయలక్ష్మి లకు మా మనవాళ్ళు చి. శ్రీకేత్ ఆశుతోష్, పీయూష్‌లకు శుభాశీస్సులు. నిజం చెప్పాలంటే మేము ఇక్కడికి వచ్చి మా అమ్మాయికి చేసిన సాయం యేమాత్రమూ లేదు. కొద్దిగా మా శ్రీమతి వంటపనిలో సాయం చేసి ఉండవచ్చు. నేను మాత్రం నా "కంపు" గొడవతప్ప అంగుళం బయటికి వచ్చి చేసిందిలేదు. కనీసం మొక్కలకు నీళ్లు కూడా పట్టేవాడిని కాదు. మా అమ్మాయి చేయమని చెప్పదు. కానీ కుర్చీలోంచి లేస్తే కొంప మునిగిపోతుందేమోనని దానికే అంటుకుపోయేవాడిని. రెండే రెండు సినిమాలు 1- "బాహుబలి", బాహుబలి-2, దువ్వాడ జగన్నాధం చూసాం. ఉదయం సాయంత్రం కాసేపు నడక నడిచేవాడిని ఎంత సేపు అనుకొన్నారు? బాత్ రూమ్‌కు వెళ్లోచ్చినంత సేపే.

## టెయిల్ పీస్ -నల్లులతో కాపురం

షార్లెట్ సాయి సెంటర్ వారు రాలీవారు అందరూ కలిసి రాలీలో నిర్వహించిన రిట్రీట్ కార్యక్రమానికి వెళ్లిన మేము రెండు రాత్రులు హోటల్ గదిలో ఉండాల్సి వచ్చింది. అప్పటికి మేము ఇక్కడికి వచ్చి నెలన్నర అయి ఉంటుంది. ఒళ్ళుమరచి నిద్రపోయాం. రిట్రీట్ నుంచి వచ్చాక ఏదో కుడుతోందే అనిపించటం ఏం లేదులే అనుకోని కొన్నినాళ్లు గడిపాం. నాకంటే మా ఆవిడ చాలా సెన్సిటివ్ ఆవిడకు నిద్రపట్టక నల్లులు కుడుతున్నాయని తెలుసుకొని హాల్‌లో సోఫాలో పడుకునేది. కోడి ఒక కోనలో - పుంజు ఒక కోనలో"లాగా. "నేను నల్లులతో కాపురం చేసి బాధ భరించలేక అర్ధరాత్రి లేచి దుప్పటిలో దిండులో చూస్తే నల్లులు హాయిగా కాపురం చేస్తూ నా రక్తం మరిగి తెగ బలిసి కనిపించాయి. మా అమ్మాయికి చెపితే ఫిట్ లాంటిది తెచ్చి కొట్టింది, పరుపులు దుప్పట్లు ఎండలో వేసి, వాషింగ్ మెషీన్‌లో ఉతికాము. కొంత నయం అనిపించింది. ఒక వారం తర్వాత మళ్ళీ సీను మామూలే. మళ్ళీ ఉతుకుడు చంపుడు కొట్టుడు కార్యక్రమం చేసి నల్లుల రూపు మాపా. చివరి మూడువారాలు నల్లుల బాధ లేదు. "ఈ నల్లులన్నీ రాలీ రిట్రీట్ హోటల్ నల్లులు అని తేల్చాము. అందుకే వాటికి "రిట్రీట్ నల్లులు" అని ముద్దు పేరు పెట్టా. "ఊసుల్లో ఉయ్యూరు"లో మా ఇంట్లో పెరిగిన నల్లి, పిల్లి, బల్లి గురించి అదే శీర్షికతో ఆర్టికల్ రాశా. చదివే ఉంటారు.

**షార్లెట్ సాహితీ మైత్రీ బంధం**

## ఐదునెలల మామిడి సీజన్

ఈసారి షార్లెట్ అనుభవంలో చిరస్మరణీయమైన మరో విషయం ఉంది. మార్చి 30న ఉయ్యూరులో రసం మామిడి పండు తినటం మొదలుపెట్టి, ఏప్రిల్ 1 హైదరాబాద్ వచ్చేటప్పుడు 100 మామిడిపళ్ళు కొని తీసుకు వెళ్లి 6వ తేదీ వరకు పూటుగా తింటూ తర్వాత అమెరికా చేరాం. అక్కడ మా అమ్మాయి పటేల్ బ్రదర్స్‌లో రోజూ మామిడిపళ్ళు బట్టలకు బుట్టలు కొని తెచ్చిపడేస్తూ మాతో తెగ తినిపించింది. గున్నమామిడి ఏమిటో తెలీదుకానీ షార్లెట్‌లో "దున్నమామిడి" పళ్ళు బాగా వచ్చేవి. మహా రుచిగానూ ఉండేవి. ఈ మామిడి మేత మార్చి నుంచి సెప్టెంబర్ 15 వరకు సాగింది మా జీవితంలో ఇదే "లాంగెస్ట్ మామిడి సీజన్". దీనికి కారకురాలు మా అమ్మాయే. దొరికిన మామిడిపళ్లే. ఇదొక రికార్డ్.

మా మనవడు సంకల్ప్ షార్లెట్ యూనివర్సిటీలో ఎంఎస్ చేయటం వాడి గ్రాడ్యుయేషను మేము ఉండటం వాడికి వెంటనే చికాగోలో ఉద్యోగం రావటం వాడి అదృష్టం మా అల్లుడు అమ్మాయి ప్రోత్సాహం మాత్రమే. సరసభారతి సభలు నాలుగు షార్లెట్‌లో జరపటం అందులో చివరిదైన 108వది అక్టోబర్ 1 ఆదివారం మధ్యాహ్నం 2.30 నుంచి రాత్రి 7.30 వరకు 5 గంటలు సరసభారతి నిర్వహించిన "దసరా సరదా సాహితీ కదంబం" ఆద్యంతం ఆనందాన్ని సంతృప్తినిచ్చి చిరస్మరణీయంగా నిలిచింది. షార్లెట్‌లో సరసభారతి అనుబంధ శాఖ ఏర్పడింది. ఇంతకుమించి ఆనందం ఇంకా ఏమి ఉంటుంది? ఇక్కడి సాహితీ మిత్రులకు మా సువర్చలాన్జనేయస్వామి యెడల ఉన్న అచంచల భక్తి విశ్వాసాలకు, సరసభారతిపై గల ఆసక్తి ఆదరణకు అభినందనలతో ధన్యవాదాలు తెలియజేస్తూ వీక్లీ అమెరికాకు ముగింపు పలుకుతున్నాను. "వీక్లీ"లో నేనేదో ఉబుసుపోకకు రాస్తుంటే ఆసక్తిగా చదువుతూ "అంకుల్ ఏం రాశారంకుల్! సూపర్బ్. మేం తెగ చదువుతున్నాం" అని నన్ను "ఉబ్బేసి" నిజమేననుకొని నేను నమ్మేసి మరింత రెచ్చిపోయి రాసినా చదివిన అమాయకులందరికి అభినందనలు. మేము 11 బుధవారం రాత్రికి బస్‌లో హైదరాబాద్ మల్లాపూర్ నుంచి బయల్దేరి 12 గురువారం ఉయ్యూరు చేరుకొంటాము. అందరికి మరొక్కసారి శుభాభినందనలు తెలియజేస్తూ మీ

**– గబ్బిట దుర్గాప్రసాద్**

9-10-17-కాంప్-బాచుపల్లి-హైదరాబాద్

ψ దీనిని 8 రాత్రి 9.30కు రాయటం ప్రారంభించి అర్ధరాత్రి 1.45కు దాదాపు 4 గంటలు రాసి పూర్తి చేశా. షార్లెట్ సాహితీ మైత్రీ బంధం సమాప్తం.

**– గబ్బిట దుర్గాప్రసాద్**

